# మరవరాని మాటలు

(Dictionary of Quotations from Telugu Literature)

సంకలన కర్త, సంపాదకుడు

**బూదరాజు రాధాకృష్ణ**



Publications

2004

# మరవరాని మాటలు

(Dictionary of Quotations from Telugu Literature)

సంకలన కర్త, సంపాదకుడు

**బూదరాజు రాధాకృష్ణ**




Publications

2004

**maravaraani maaTalu**
(Un forgettable Words)

Compiled and Edited by
**Budaraju Radha Krishna**

© *Author*

First Published: April, 2004

*Printed & Published by:*
Budaraju Radha Krishna
104, Divya Classic
Plot No. 38 & 39, Kalyan Nagar (Phase III)
Hyderabad - 500 018; Ph: 23836697

*Printed at :*
Akruthi Offset Printers
H.No. 1-1-191/A, Chikkadpally
Hyderabad - 500 020; ✆: 040-2766 4525

*For Copies:*

- **Media House Publications**
  1-9-289/4, Behind Post Office
  Vidyanagar, Hyderabad - 500 044
  ✆: 040-2760 7307

- **Visaalaandhra Book House**

- **Navodaya Book House**
  Street Opp. to Arya Samaj Mandir
  Kachiguda, Hyderabad - 500 027

Price: Rs. **150**
**Us $ 20**

# పరిచయం

నన్నయనాటి నుంచి నేటిదాకా వచ్చిన సాహిత్యంలోనుంచి మరపురాని; మరవరాని మాట లను ఏర్చి కూర్చి భిన్న శీర్షికలకింద అమర్చి ప్రచురిస్తున్న సంకలన గ్రంథ మిది. తెలుగు వాఙ్మయంలో ఈ తీరు గ్రంథాల్లో ఇదే మొట్టమొదటిదీ - విస్తృతమయిందీని. అయితే ఇది సర్వసమగ్ర మని చెప్పుకోవటంలేదు. జీవద్భాషాసాహిత్యాల విషయంలో సమగ్రత అనే మాట అర్థరహితం. విస్తృతికికూడా పరిమితి లేదు. మొత్తం సాహిత్యాన్ని గాలించే అవకాశం గాని, అవసరంగాని లేదు. ఒకవేళ అలా చేద్దామన్నా మన సాహిత్యమంతా ఏ గ్రంథాలయం లోనూ లభించటంలేదు. లభించదు. ఉన్నంతలో సాధ్యమయినంతలో ఇదే విస్తృత గ్రంథం.

మొదట సుప్రసిద్ధ రచయితల గ్రంథాలన్నీ సేకరించాలని సంకల్పించా. అది సాధ్యపడ లేదు. అవన్నీ దొరికేదాకా వేచివుంటే అస లీసంకలనం తయారయ్యేదే కాదు. గ్రంథా లయాల్లో, మిత్రుల దగ్గర, సొంత సేకరణలో అప్పటప్పటికి అందుబాటులో ఉన్న సాహిత్యాన్ని నవల, కథ, కథానిక, కవిత వగైరా ప్రక్రియాభేదాలతో నిమిత్తం లేకుండా రచయితల ప్రసిద్ధిని, ప్రచార శక్తిని, బిరుదాలను, పదవులను, అధికారాలను పాటించకుండా సేకరించి, చదివిన అయిదారు వేల చిన్నా పెద్దా గ్రంథాలనుంచి, 475 మందికిపైగా రాసిన రచనల నుంచి ఎంపిక చేసిన మరవరానిమాట లిందులో ఉన్నాయి. జానపదగేయాలకు, అనేక చాటువులకు, సామెతలకు గ్రంథకర్త లెవరో తెలియదు. సామెతలను పేర్కొని, తక్కినవాటిని అజ్ఞాతకవి రచనలుగా పరిగణించా. సంవత్సరం క్రితం (1990 నాటికి) సేకరించిన మాటలు రెండు వందల మంది రచయితలవైతే గ్రంథపరిమితి ఇప్పటికి రెండింతలకు పైగా పెరిగింది.

సాహిత్యంలో అర్థాంతరన్యాసాలుగా, కేవలం నీతిబోధకాలుగా ఉన్న వాక్యాలన్నీ ప్రచు రించా లనుకోలేదు. మానవజీవితంలో ఎదురుపడే ప్రతిసమస్యనూ ప్రస్తావించే ప్రసంగా లుంటే బాగుంటుం దనుకున్నా. అయితే తెలుగు రచయితల దృక్పథం, అభిరుచి, రచనా ధర్మం, పాత్ర చిత్రణ వగైరాలు ఆపేక్షించిన వైవిధ్యం నాకు ప్రసాదించలేదు. కవి, కవిత, స్త్రీ, ప్రేమ, జీవితం వంటి సర్వసాధారణ విషయాలను ప్రస్తావించిన వాళ్ళ సంఖ్య అపారం. నిత్య జీవితంలో ఎదురయ్యే సమస్యలనూ ఆధునిక సమాజం సంభావించే విషయాలనూ విమర్శించిన, వివరించిన వాళ్ళ సంఖ్య తక్కువ. గతానుగతికప్రసంగా లనేకం. ఎన్నిమాటలు అన్యభాషాసాహిత్యాలనుంచి అనుకరణలుగా, అనుసరణలుగా, అనువాదాలుగా మన సాహిత్యంలో ప్రవేశించాయో లెక్కగట్టడం అసాధ్యం. ఒకవిధంగా అనవసరం. రచయిత ప్రసిద్ధికి కారణాలు అనేకం. అప్రసిద్ధికీ అంతే. ప్రచారపరాయణమైన ఆధునికయుగంలో ఎందరో సమర్థులు అనామకులుగా మిగిలిపోతున్నారు. ఒకనాటి సాహిత్యం కాలాంతరంలో ఒకేవిధమైన ప్రశస్తి సంతరించుకుంటుందని చెప్పలేం. పింగళి సూరన తొలుత రాణించ లేదు. ఇరవయ్యో శతాబ్ది ప్రథమార్థంలో ఒక్క వెలుగు వెలిగాడు. చిమ్మపూడి అమరేశ్వరుడి

వంటివాళ్ళ పేర్లే వినబడ్తున్నాయి; రచనలు దొరకటం లేదు. నన్నయ, తిక్కన, పోతన, శ్రీనాథుడు, వేమనవంటి వాళ్ళు దేశకాలపాత్రాతీతంగా జీవిస్తున్నారు. నేటి అప్రఖ్యాతరచయితలు భావికాలంలో ఆరాధ్యులు కారని చెప్పలేం. అందువల్ల రచయితలను వర్గీకరించదలచుకోలేదు. చిన్నచూపు చూడదలచలేదు.

సారస్వత మహాకాయంలో రచయితలందరూ అంగాలయినట్లే. సారస్వత ప్రక్రియల్లో కొన్నిటికి కొన్ని కాలాల్లో అధికాదరణ లభించవచ్చు. అందుకు సామాజికార్థిక రాజకీయ కారణాలు కూడా ఉండవచ్చు. సాధ్యమయినంత సమదృష్టితో అన్ని ప్రక్రియలనూ సమాదరించాను. నవల, నాటకం, కథ, కథానిక వంటి ప్రక్రియల్లో పాత్ర వైవిధ్యం తప్పదు. భిన్న సందర్భాల్లో భిన్నపాత్రలచేత భిన్నవిధప్రసంగాలు చేయించటం రచయితకు తప్పదు. అవన్నీ రచయిత సొంత అభిప్రాయాలు కావు. అయినా ఆయాప్రసంగాలను ఆయాసందర్భాల్లో, సంభాషణల్లో, ఉపన్యాసాల్లో, రచనల్లో ఎత్తిరాసిగాని, వాడిగాని రక్తికట్టించే అవకాశముంటుంది. కాబట్టి వాటిని సేకరించాను. సందర్భోచితంగా ఆయావాక్యాలు వాడి మనంగా ఆమాటలంటే వచ్చే యిబ్బందులను తప్పించుకోవచ్చు; మన సాహితీపరిచయాన్ని, ప్రసంగ నైపుణ్యాన్ని, సంభాషణచమత్కారాన్ని, లోకానుభవాన్ని ప్రదర్శించవచ్చు.

ఈసమయంలో ఒకటి రెండు లోపాలను ప్రస్తావించటం అవసరమేమో. తెలుగు సాహిత్యంలో మన జీవితంలోలాగే హాస్యంపాలు తక్కువ. ప్రాచీనసాహిత్యంలో హాస్యచమత్కార ప్రసంగాలను వెతుక్కోవలసి వుంది. ఇరవయ్యో శతాబ్ది మొదటి సగంలో మొరటు హాస్యమెక్కువ. తిట్టుకవిత, బూతులు చమత్కారం కింద చెలామణీ అయినాయి. శాస్త్ర గ్రంథాల నుంచి ఆయావిషయాలను గురించి విజ్ఞులు చెప్పిన సూక్తులను సేకరించటం సాధ్యపడలేదు. మనకు శాస్త్ర విజ్ఞానముందని చెప్పాలన్నా నమ్మాలన్నా జంకవలసి వస్తున్నది. అందువల్ల ఆప్రయత్నం నెరవేరలేదు. కేవలానువాదాలనుకొన్న గ్రంథాలనుంచి ఎక్కడో తప్ప వాక్యాలను సేకరించలేదు. ఎందరో ప్రసిద్ధ రచయితల గ్రంథాలు దొరకలేదు. కొన్ని సందర్భాల్లో – ఉదాహరణకు ఎర్రాప్రగడ హరివంశంలో – నా దృష్టిలో ఎంపిక చేయదగ్గ వాక్యాలు దొరకలేదు. అందుకు సంకలనకర్త అభిరుచి కారణం కావచ్చు. గ్రంథసేకరణ కిందే కాలం వెచ్చించి అన్నీ దొరికేదాకా ఆగే నిష్క్రియత్వంకన్నా దొరికినవాటినుంచి నచ్చినమాటలు గుదిగూర్చి కోశంనిర్మించటమే మంచిదనీ, కాలం కర్మం కలిసివస్తే ఇందులో లేని రచయితల గ్రంథాలనుంచి సేకరించిన మాటలతో మరో సంపుటిని ప్రచురించవచ్చనీ ఆశిస్తున్నా.

వాక్యాల ఎంపిక విషయంలో కూడా కొంత వివరణ అవసరం. సంకలనకర్త అభిరుచి ప్రధానంగా ఈ కోశం వెలువడింది. ఆయాగ్రంథాల్లో మరెన్నో మెచ్చదగ్గ మాటలుండవచ్చు. ఉంటాయి కూడా. ఆయాప్రసంగాలను ఏదో ఒక శీర్షికకింద అమర్చటం ఆ అభిరుచిమీదే ఆధారపడ్డది. ఇతరులకు ఆ ప్రసంగ శీర్షిక మరోవిధంగా ఉండా లనిపించవచ్చు. ఒకే ప్రసంగం నాలుగయిదు శీర్షికల కింద పునరుక్తమయితే బాగుంటుం దనిపించవచ్చు. వాస్తవానికి చాలా కొద్ది సంఖ్యలో ఒకే ప్రసంగం భిన్న శీర్షికల కింద కనిపిస్తుం దీకోశంలో.

విషయ వైవిధ్యంకోసం పడ్డ ఆరాటంలో ఒక గ్రంథంలోనుంచి ఎత్తిరాయదగ్గ మరవరాని మాటలన్నిటినీ ఇందులో చేర్చలేదు. ఇచ్చినంతలో ఉన్నమాటలవల్ల ఆయారచనల మీదగాని, రచయితల మీదగాని పాఠకులకు ఆదరాభిమానాలు కలిగితే అదే పదివేలు. తెలుగు వాఙ్మయంలో తొలిసారిగా వెలువడ్డ ఈ కోశాన్ని ఎన్నోవిధాల ఎవరయినా ప్రస్తరించవచ్చు. మరింత ప్రయోజనవంతం చేయవచ్చు. దొరికిన సామెతలన్నిటినీ వర్గీకరించి ప్రదర్శించ లేదు. దొరికిన చాటువులన్నిటినీ చేర్చలేదు. కన్యాశుల్కం వంటి మహోత్తమ రచనలనుంచి అన్ని మంచి మాటలనూ చేర్చలేదు. రెండో సంపుటం ప్రచురించినప్పుడు అది పేలవంగా ఉండరాదని ఇలా చేశాను.

చదివిన పుస్తకాలన్నింటినుంచీ వాక్యసేకరణ చేయలేదు. అందువల్ల ఈ గ్రంథాంతంలో రచనల పట్టిక ఇవ్వటంలేదు. రచయితల పేర్లనుమాత్రం సూచించాను. అప్పుడూ కొన్ని చిక్కులు వచ్చాయి. కొందరు కలం పేర్లతో ప్రసిద్ధులు (కరుణశ్రీలాగా); మరికొందరు కత్తిరింపు పేర్లతో ప్రసిద్ధులు (శ్రీశ్రీలాగా); కొందరు ఇంటిపేర్లతో ప్రసిద్ధులు (గురజాడలాగా); మరికొందరు సొంతపేర్లతో ప్రసిద్ధులు (వేమనలాగా). ఇంకా కొందరి పేర్లు పునరుక్తమై పాఠకులను తికమకలో పెట్టకుండా జాగ్రతపడ్డాను. కొందరి కలం పేర్లే గాని అసలుపేర్లు తెలియవు. వాటికోసం పరిశోధిస్తూ కాలహరణం చేయదలచలేదు. గ్రంథాంతంలో తెలిసిన రచయితలనేగాక అజ్ఞాత రచయితలనుగూడా అనుబంధంలో స్మరించాను.

ఈనిఘంటువును ఇంగ్లీషులోని dictionaries of quotationsతో గాని, సంస్కృత వాఙ్మయ సంకలనాలతో గాని పోల్చి నిరాశపడకండి. సంస్కృత సంకలనాల్లోలాగా ఇందులో వర్ణనలనూ దేవతాస్తవాలనూ చేర్చలేదు. ఇంగ్లీషు కోశాల్లో ఉన్న విషయవైవిధ్యం ఇందులో లేదు. (అయినా దొరికిన సమాచారాన్ని 2,500 కన్న ఎక్కువ శీర్షికల కింద అమర్చాను). ఈ స్థితికి కారణం మన సాహిత్యమే. ఏ భాషగాని, ఏ సాహిత్యం గాని ఆ భాషాభాషల కన్నా ఉన్నతమూ కాదు, అధమమూ కాదు. మనకున్న సాహిత్యం, దానికున్న ప్రమాణం ఈ కోశంలో ప్రతిఫలిస్తుంది. ఇందుకు నిరాశపడనక్కరలేదు.

ఒక్క విషయం మహోత్సాహ మిస్తుంది. సుప్రసిద్ధ లనుకొంటున్న అనేకరచయితలకన్నా అంత ప్రసిద్ధులు కాని యువతరం రచయితలు వైవిధ్యం ప్రదర్శిస్తున్నారు. జీవం జవంగల భాషనూ భావాలనూ ప్రకటిస్తున్నారు. మన భాషాసాహిత్యాలు ఉన్నతప్రమాణాలు సాధిం చటంకన్నా, మన యువతీ యువకులు మనకన్నా ముందుముందుకు ఉన్నతోన్నత స్థితికి ప్రయాణించటంకన్నా కావలసిం దేముంటుంది?

ఈ గ్రంథపఠనంవల్ల నన్నయనాటినుంచి నేటిదాకా వర్ధమానమవుతున్న తెలుగు సాహిత్యం మీద అభిరుచి, అభిమానం, ఆదరణ పెరుగుతుందని ఆశిస్తాను. పెరగాలని అభిలషిస్తాను. ఇతరగ్రంథాలు లభించినప్పుడు మరో సంపుటం వెలువరించాలని ఆశపడు తున్నా. మరొక్కమాట. ఈ కోశంలో చేరిన రచయితలే తెలుగు భాషా సాహిత్యాలకు ఆధార స్తంభాలని నేననుకోవటంలేదు. చేరనివాళ్ళు సామాన్య రచయితలనికూడా నేను భావించటం

లేదు. రచయితలనూ రచనలనూ బహుజనపల్లివారిలాగా ఉత్తమాధమమధ్యమ వర్గాలుగా విభజించటం నా ఉద్దేశం కాదు. సామాన్య రచయితలు లేకుండా మహాకవులు మాత్రమే ఉద్భవించరు ఏ సాహిత్యం లోనూ. భిన్నరచయితల, రచనల స్థాయీభేదాలను నిర్ణయించేది దేశం, కాలం, సమాజం మాత్రమే. ఏ ఒక్క విమర్శకుడో చేసే పని కాదిది. ఏ ప్రచారమూ పదవీ బిరుదూ శాశ్వతత్వం ప్రసాదించలేదు. భిన్నకాలాల్లో విలువలు మారనూవచ్చు.

ఈనాఅభిప్రాయాలను మన్నించి, నా ప్రయత్నాన్ని హర్షించి సంభాషణచతురులూ సాహితీపరులూ ఈ నిఘంటువును సమాదరిస్తారని విశ్వసిస్తున్నా. గ్రంథసహాయం చేసిన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం ప్రధాన కార్యకర్త శ్రీ ఎం.ఎల్.నరసింహారావు, ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి వగైరాలకు నా కృతజ్ఞతలు. గ్రంథనిర్మాణంలో సాయపడ్డ కుమారి సి.శారదామాయికీ, తదితరులకూ రుణబద్ధాను.

★ ★ ★

పై మాటలు రాసింది 1991లో. అరణ్యవాసం, అజ్ఞాతవాసం పూర్తిచేసుకొని ఈ సంకలనం తిరిగి నాచేతికి వచ్చేసరికి నావయస్సు పెరిగిపోయింది; ఆరోగ్యం చాలా క్షీణించింది. ఏనాడో పోగొట్టుకొన్న వస్తువు బహుకాలం తరవాత దొరికినప్పుడు అది యథాపూర్వస్థితిలో, ఉందో లేదో ఎంత జీర్ణావస్థలో ఉందో, కనీసం కొన్నిచోట్ల నయినా ఖిలమయిందో లేదో పరీక్షిద్దామన్న ఉబలాటమున్నా మళ్ళీ శ్రమించే శక్తి సామర్థ్యాలు లోపించాయి. ప్రత్యక్షరం పునఃపరీక్షించటానికి ఆధారగ్రంథాలుగాని తదితర సాధనసంపత్తిగాని ప్రస్తుతం అందుబాటులో లేవు. అందువల్ల నేనుగా చేయని తప్పులూ, నా అశ్రద్ధవల్ల సమకూడని లోపాలూ నావిగానే భావించి నన్ను మన్నించమని పాఠకలోకాన్ని అర్థిస్తున్నాను.

"ఆశాపాశము తాకదు స్నిరు"పన్న పోతన్న దానికి అంతంలేదనే అన్నాడు. అశక్తతవల్ల దీన్ని పునర్లభించిన రూపంలోనే ప్రచురించటం మంచిదనిపించింది. ఆ పనికూడా స్వయంగా చేయలేక నాతరఫున శ్రమించమని కోరగా అందుకు అంగీకరించిన మీడియా హౌస్ పబ్లికేషన్స్ వారికి - ముఖ్యంగా డాక్టర్ గోవిందరాజు చక్రధర్ గారికి - ఎంతో రుణపడ్డాను. అనుకున్న సమయంలో ప్రచురించలేని నా అసమర్థతను నేనేనిందించుకుంటూ నాతరవాతి తరంలోని సాహితీప్రియులు ఇంతకన్నా సమర్థంగా, సమగ్రంగా మరికొన్ని సంపుటాలను వెలువరించాలని ఆశపడుతున్నాను. ఈసంకలనాన్ని తెలుగుసాహితీలోకం సమాదరిస్తుందని ఆశిస్తున్నాను.

సెలవు.

హైదరాబాద్
4-4-2004

బూదరాజు రాధాకృష్ణ
సంకలనకర్త, సంపాదకుడు

# బూదరాజీయం

ప్రకాశం జిల్లా వేటపాలెంలో 1932 మే మూడో తేదీన జన్మించారు. 1965లో హిస్టారికల్ గ్రామర్ ఆఫ్ ఎర్లీ తెలుగు ఇన్‌స్క్రిప్షన్స్ అనే అంశంపై పరిశోధనచేసి ఆంధ్ర విశ్వవిద్యాలయంనుంచి డాక్టరేట్ పొందారు. చీరాల వి.ఆర్.ఎస్. అండ్ వై.ఆర్.ఎస్. కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా పని చేశారు. 1988లో తెలుగు అకాడమీ డిప్యూటీ డైరెక్టర్‌గా పదవీ విరమణ చేశారు. సెంట్రల్ యూనివర్సిటీ విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఉండి 1990 నుంచి దశాబ్దకాలంపాటు ఈనాడు జర్నలిజం స్కూల్ ప్రిన్సిపల్‌గా పనిచేశారు. 'ఈనాడు'లో 600 పైచిలుకు పుస్తకాలను సమీక్షించారు. 'ఈనాడు'లో వారంవారం పుణ్యభూమి శీర్షికను 17 సంవత్సరాలు నిర్వహించారు.

వాస్తు పదకోశం, ప్రాచీనాంధ్ర శాసనాలు, వ్యావహారిక భాషావికాసం, ఈనాడు భాషా స్వరూపం, ఆధునిక వ్యవహారకోశం, సాహితీ వ్యాసాలు, భాషాశాస్త్ర వ్యాసాలు, పురాతన నామకోశం, మాటల మూటలు వంటి పుస్తకాలు వెలయించారు. చిన్నయసూరి, శ్రీశ్రీ, కొమర్రాజు లక్ష్మణరావుల గురించిన మోనోగ్రాఫులను కేంద్ర సాహిత్య అకాడమీ ప్రచురించింది.

బూదరాజు రాధాకృష్ణ ఆత్మకథ విన్నంత-కన్నంత, మంచి జర్నలిస్టు కావాలంటే, అనువాద పాఠాలు, తెలుగు సంగతులు అనే పుస్తకాలను మీడియా హౌస్ పబ్లికేషన్స్ ప్రచురించింది.

# శీర్షికా సూచిక

34. ఆకారం, ఆకాశ కుసుమం, ఆకాశవాణి, ఆకు, ఆక్షేపణ, ఆగనివి, ఆగస్టు పదిహేను, ఆగామి, ఆగ్రహం, ఆచరణ;
35. ఆచారం, ఆటంబాంబు, ఆడపెత్తనం, ఆడబిడ్డ, ఆడంబరం;
36. ఆతిథ్యం, ఆతురత, ఆత్మ, ఆత్మగౌరవం, ఆత్మజ్ఞానం, ఆత్మద్రోహం, ఆత్మనాశ(న)ం, ఆత్మన్యూనత;
37. ఆత్మబలం, ఆత్మవిమర్శ, ఆత్మస్తుతి, ఆత్మహత్య;
38. ఆత్మానుభవం, ఆత్మావలోకనం, ఆత్మీయత, ఆత్మోద్ధరణ, ఆత్రం, ఆదరణ, ఆదరం, ఆదర్శజీవి, ఆదర్శప్రేమ, ఆదర్శ భర్త;
39. ఆదర్శం, ఆది, ఆదుర్దా, ఆధారం, ఆధునికవైద్యం, ఆధునిక సంస్కారం, ఆనందం;
40. ఆనవాలు, ఆనుకూల్యం, ఆనుపూర్వి, ఆంధ్రత్వం, ఆంధ్రపత్రిక, ఆంధ్రుడు;
41. ఆపద, ఆపద్ధర్మం, ఆపరేషన్, ఆపలేనిది, ఆపేక్ష, ఆప్తుడు, ఆప్యాయత, ఆఫీసర్, ఆలు, ఆభరణం, ఆయాసం, ఆయుధం;
42. ఆయుస్సు, ఆరంభం, ఆరాటం, ఆరాధన, ఆరు, ఆరోగ్యం, ఆర్టిస్టు, ఆర్టు, ఆర్ద్రత, ఆర్భుడు, ఆర్భాటం, ఆలయం;
43. ఆలస్యం, ఆలు, ఆలోచన;
44. ఆవకాయ, ఆవిర్భావం, ఆవులింత, ఆవేదన, ఆవేశం, ఆశ;
45. ఆశయం, ఆశ్చర్యం;
46. ఆశ్రయం, ఆశ్రితుడు, ఆసక్తి, ఆసు, ఆసుపత్రి, ఆస్తి, ఆస్తికుడు, ఆస్థానకవి, ఇంగ్లీష్;
47. ఇజం, ఇంటర్వ్యూ, ఇంటిదీపం, ఇతరులు, ఇందిర, ఇన్సూరెన్స్, ఇప్పుడు;
48. ఇబ్బంది, ఇంపు, ఇరుకు, ఇల్లరికం, ఇల్లు, ఇష్టం, ఇష్టానిష్టాలు;
49. ఇహపరాలు, ఇహం, ఈక, ఈ కాలం, ఈగ, ఈర్ష్య, ఉక్కుతునక, ఉంగా, ఉండకూడనిది, ఉండవలసినవి;
50. ఉండేలు, ఉండేవి, ఉత్తమం, ఉత్తమాట, ఉత్తమురాలు, ఉత్తర దక్షిణాలు, ఉత్తరం, ఉత్తరాయణం, ఉత్తీర్ణత, ఉత్సాహం, ఉదరపోషణ, ఉదారుడు, ఉదాసీనత, ఉద్దీపనం, ఉద్దేశం, ఉద్బోధ;
51. ఉద్యమం, ఉద్యోగం;
52. ఉద్రేకం, ఉద్వేగి, ఉద్ధరణ, ఉద్ధారకుడు, ఉనికి, ఉన్నతి, ఉన్నమాట, ఉన్నవి, ఉన్మాది, ఉపకారం;
53. ఉపదేశం, ఉపనిషత్తు, ఉపన్యాసం, ఉపయోగం, ఉపశమనం, ఉపాయం;
54. ఉప్పు, ఉప్పెన, ఉపోద్ఘాతం, ఉభయతారకం, ఉమ్మడి ఆస్తి, ఉల్లాసం, ఉషస్సు, ఊడ్చుకపోవడం, ఊదుకు తినటం, ఊరడింపు, ఊరబంది, ఊరు, ఊరుకోనివి;
55. ఊరేగింపు, ఊహ, ఎక్కాలు, ఎక్కువ, ఎక్కువ తక్కువలు, ఎగతాళి, ఎగబాటు, ఎగవేత;
56. ఎగ్గు, ఎంకి, ఎచ్చు, ఎడం, ఎడారి, ఎడిటర్, ఎండా వానా, ఎండుపూరి, ఎంద్రకాయ, ఎత్తిపొడుపు, ఎత్తు, ఎదురీత, ఎదురు;
57. ఎద్దు, ఎన్.జి.వో, ఎన్నికలు, ఎబ్బెట్టు, ఎంపిక, ఎమ్మెల్యే, ఎరుక;
58. ఎరుగనివి, ఎరుపు, ఎరువు, ఎలుక, ఎల్లమ్మ, ఏకత్వం, ఏకపత్నీవ్రతం, ఏకవచనం, ఏకాకి, ఏకాగ్రత, ఏకాంతం, ఏకాభిప్రాయం, ఏకు;
59. ఏడుపు, ఏడుపు ముఖం, ఏది నిజం?;
60. ఏదో ఒకటి, ఏనుగు, ఏర్పాటు, ఏలని మొగుడు, ఏళ్లు, ఐకమత్యం, ఐశ్వర్యం;
61. ఒకడు, ఒకేదారి, ఒకేసారి, ఒక్కపొద్దు, ఒట్టు, ఒడ్డు, ఒంటరి(తనం), ఒప్పు, ఒప్పుకోలు, ఒళ్ళు;
62. ఓటమి, ఓటరు, ఓటు, ఓడు, ఓదార్పు, ఓపలేనివారు, ఓపిక, ఓపెనర్;
63. ఓర్పు, ఓర్వలేనివాడు, ఔదార్యం, ఔన్నత్యం, కక్కు, కక్కుర్తి, కంగాళి, కచేరి, కటికతనం, కట్టుబాటు, కట్నం;
64. కఠినుడు, కడుపు, కడుపుతీపి, కంటిజబ్బు, కంట్రాక్టరు;
65. కత్తి, కత్తి-కలం, కత్తిరింపు, కథ, కదలిక, కనపడేది, కనబడటం, కనికరం, కనిపించనిది, కనీస ధర్మం, కన్నీరు;
66. కన్ను, కన్నెపిల్ల, కన్ఫ్యూషన్, కంపెని, కమ్యూనిజం, కమ్యూనిస్టు, కరణం;

67. కరుణ, కరువు, కర్ణపిశాచం, కర్ణాటం, కర్ణుడు, కర్త, కర్తవ్యం;

68. కర్తృత్వం, కర్మ, కర్మమార్గం, కర్మవీరుడు, కఱ్ఱ, కల;

69. కలం, కలవరింత, కలికాలం, కలిమి;

70. కలిమిలేములు, కలివిడి, కలిసి రావటం, కల్తీ, కల్పన, కల్పవృక్షం, కల్పితం, కల్ల, కల్లు, కవచం, కవలలు, కవి;

73. కవి కోరిక, కవిత;

76. కవిపూజ, కష్టకాలం, కష్టం;

77. కష్టసాధ్యం, కష్టసుఖాలు, కసి, కళ;

78. కళాకారుడు, కళేబరం, కళ్లు, కళ్లూ చెవులూ, కాకతాళీయం, కాకవి, కాకి, కాగితం;

79. కాంగ్రెసు, కాటు, కానివి, కానుక, కాపలా, కాపీ, కాపు;

80. కాపురం, కాఫీ, కామధేనువు, కామన్‌సెన్స్, కామం, కాంపౌండు, కారణం;

81. కారుచౌక, కార్ఖానా, కార్తీకం, కార్యకారణ సంబంధం, కార్యజ్ఞుడు, కార్యవాది;

82. కార్యసాధన, కార్యసిద్ధి, కాలక్షేపం, కాలజ్ఞానం, కాలం;

84. కావలసింది, కావ్యం, కాష్టవాదం, కిరస్తానం, కిరీటి, కీడు;

85. కీర్తి;

86. కుకవి, కుక్క, కుక్కమూతిపిందె, కుదరనిది, కుపుత్రుడు, కుమ్మరావం, కుమ్ములాట, కురూపి;

87. కుఱ్ఱతనం, కులతత్వం, కులం;

88. కులవిద్య, కూడనిది, కూనిరాగం, కూరల మార్కెట్, కూరిమి, కూలీ, కృతఘ్నత, కృతఘ్నుడు, కృతజ్ఞత;

89. కృతబుద్ధి, కృతార్థత, కృషి, కెరటం, కేలండర్, కేసు, కొక్కిరాయి, కొంజా, కొట్టడం, కొడుకు;

90. కొండ, కొండగుర్తు, కొత్త, కొంపతీయటం, కొరత, కొఱ్ఱు, కొలత;

91. కొలువు, కొవ్వొత్తి, కొసరు, కోఆపరేషన్, కోకిల, కోటు, కోడలు, కోడిపందెం, కోత, కోపం;

92. కోమట్లు, కోరిక;

93. కోర్టు;

94. కౌగిలింత, క్రమం, క్రమశిక్షణ, క్రికెట్, క్రిమినల్‌లా, క్రియ, క్రూరుడు, క్రోధం, క్షయంటు, క్లాసు, క్వాలిఫికేషన్;

95. క్షణం, క్షమ, క్షమార్హత, క్షేమం, క్షోభ, ఖద్దరు, ఖర్చు, ఖాళీ ఇల్లు, ఖూనీ, ఖైదీ;

96. ఖ్యాతి, గంగ, గంగానమ్మ, గజం, గంజి, గట్టిదనం, గట్టు, గడియారం, గడ్డం, గడ్డి, గడ్డు రోజులు, గణాచారి, గణాలు - ప్రాసలు, గణితం;

97. గండం, గతం, గతి, గతుకులు, గత్యంతరం, గది, గద్య కవిత, గందరగోళం;

98. గబ్బిలం, గమ్మత్తు, గమ్యం, గర్భవిచ్ఛేదం, గర్వం, గవర్నమెంటు, గవర్నరు, గాజుకళ్లు, గాటు, గాడిద;

99. గానం, గాంధీ, గాయకుడు, గాయని, గాయం, గాలి;

100. గాలిపడగ, గాలిమేడ, గిట్టుబాటు, గిన్నె, గిరజాలు, గిరాకి, గీటురాయి, గీత, గుట్టు, గుడిమింగేవాడు, గుడిసె, గుడ్డితనం, గుడ్లగూబ, గుణజ్ఞత.

101. గుణం, గుణవంతుడు, గుండు, గుండె, గుండె దిటవు, గుండెపోటు, గుమాస్తా, గుంపు, గురక, గురుకుల విద్య, గురుత్వం;

102. గురువు, గురుశిష్యులు, గుర్తింపు, గుర్తు, గుఱ్ఱం, గులాం;

103. గూండా, గృహస్థు, గెలుపు, గేరు, గొంగడి, గొడవ, గొడ్డు, గొఱ్ఱెలు, గొప్ప;

105. గోడ, గోడదూకుడు, గోరు, గోరుముద్ద, గోవు, గౌరవం;

106. గ్యారంటీ, గ్రంథకర్తృత్వం, గ్రంథ పరిచయం, గ్రంథ పరిశీలన, గ్రహచారం, గ్రహం, గ్రహబలం, గ్రహింపు, గ్రామ (జీవిత)ం, గ్రామీణుడు;

107. గ్రాహ్యం, గ్లామరు, ఘనకార్యం, ఘనత, ఘనుడు;

108. ఘరానా, ఘోష. చక్కదనం, చక్రం, చంచలం, చట్టం, చదువు;

111. చనిపోయినవాడు, చనువు, చంద్రుడు, చప్పట్లు, చమత్కారం;

112. చతురత, చరిత్ర;

దండ్యుడు, దండోపాయం, దత్తత, దబాయింపు, దంపతులు, దయ, దయాభిక్ష, దయ్యం;
156. దరిద్రం, దర్జా;
157. దర్పం, దాణా, దానధర్మాలు, దాపరికం, దాంపత్యం, దాయాది, దారి;
158. దారితప్పటం, దాసి, దాస్యం, దాహం, దిక్కు దిగంబరత్వం, దిగులు, దినదినగండం, దివాన్‌గిరి, దివాలా, దిష్టి (మంత్రం);
159. దీనత్వం, దీపం, దీపావళి, దీర్ఘవైరం, దీవెన, దుఃఖం;
160. దుఃఖితుడు, దున్నకం, దున్నపోతు, దుబారా, దురద, దురదృష్టం, దురాగతం, దురాశ, దుర్గతి, దుర్జనుడు;
161. దుర్దశ, దుర్దినం, దుర్బలం, దుర్భరం, దుర్లభం, దుర్వార్త, దుర్వాసన, దుశ్చేష్టలు, దుష్టచింత, దుష్టులు;
162. దుస్తరం, దూత, దూతిక, దూరదృష్టి, దూరం, దూరాలోచన, దూషణ, దృష్టి, దెప్పు, దెబ్బ;
163. దేనికదే, దేవత, దేవుడు;
165. దేశభక్తి;
166. దేశం, దేశాటనం, దేశాభిమానం;
167. దేశాభివృద్ధి, దేహం, దైవత్వం, దైవబలం;
169. దైవభీతి, దొంగ, దొంగతనం, దొర, దొరకనిది, దొరతనం, దొరసాని, దొరికేవి, దోపిడీ;
169. దోషం, దౌర్జన్యం, దౌర్బల్యం, దౌర్భాగ్యం, ద్రష్ట, ద్రోహం, ద్రోహి, ద్వంద్వ ప్రవృత్తి, ద్వంద్వాలు, ద్వయం, ద్వైతం;
170. ధనదాస్యం, ధనం, ధనవంతుడు, ధన్యత, ధన్యుడు, ధర, ధర్మకన్నం;
171. ధర్మపన్నాలు, ధర్మపరుడు, ధర్మం;
171. ధర్మరాజు, ధర్మశాస్త్రం, ధర్మసంస్థాపన, ధర్మసూక్ష్మం, ధర్మాసనం, ధార్మికత్వం, ధిక్కారం, ధీరుడు;
173. ధూపం, ధైర్యం, ధ్యేయం, ధ్వంసకుడు, నక్క నక్షత్రాలు, నఖశిఖ పర్యంతం, నగదు బేరం, నగరం;
174. నగలు, నగిషీ, నగ్నసత్యం, నటన, నటుడు, నడక, నడమంత్రపు సిరి, నడవడి, నది;
175. నన్నయ, నప్పనిది, నమ్మకం;
176. నమ్మకూడనివి, నమ్మించి మోసం;
177. నమ్రత, నయం, నరకం, నరకాసురుడు, నరసింహుడు, నరుకుడు, నర్తకుడు, నర్సు, నలుపు, నల్లపూస, నల్లి, నవకవిత, నవల, నవీన స్త్రీ, నవ్వు;
178. నశింపు, నశ్యం;
179. నష్టం, నాకు, నాగరకత;
180. నాటకం, నాటు కాగడాలు, నాది, నాంది, నా బతుకు, నామం, నాయకుడు;
181. నారదుడు, నారికేళపాకం, నాలుక, నావి, నాస్తికుడు, నికృష్టం;
182. నిక్కం, నిక్‌నేమ్, నిగూఢం, నిగ్గు, నిగ్రహం, నిఘంటువు, నిఘా, నిజం;
183. నిజానిజాలు, నిజాయితీ;
184. నిట్టూర్పు, నిత్య దరిద్రం, నిదర్శన, నిదానం, నిద్ర;
185. నినాదం, నింద, నింద్యత, నిపుణుడు;
186. నిప్పురవ్వ, నిబ్బరం, నియంత, నియమం, నిరర్థకం, నిరసన, నిరాకరణ, నిరాఘాటం, నిరాడంబరత, నిరాదరణ, నిరాశ;
187. నిరుత్సాహం, నిరుద్యోగం, నిరుపయోగం, నిర్దయం;
188. నిర్దయులు, నిర్దోషి, నిర్బంధం, నిర్భయం, నిర్భయుడు, నిర్లక్ష్యం, నిర్వాకం, నిలిచేవి, నివారణ, నిశ్చలత్వం, నిశ్చింత, నిశ్శంక, నిశ్శబ్దం, నిషా;
189. నిషిద్ధం, నిషేధం, నిష్కారణం;
190. నిష్క్రమణ, నిష్క్రియుడు, నిష్ఠ, నిష్ఠురం, నిష్ఫలం, నిష్ప్రయోజకుడు, నిస్పృహ;
191. నిస్పందేహం, నిస్వార్థం, నీచత్వం, నీచాశ్రయం, నీచుడు, నీడ, నీతి;
192. నీతి – అవినీతి;
193. నీతిపరుడు, నీరసం, నీరు, నీవు, నీవు – నేను, నెత్తం, నెమలి, నేటివి, నేను;
194. నేరం, నేర్పు;
195. నైజం, నైతిక జీవనం, నైవేద్యం, నొప్పి, నోటీసు, నోరు, నౌకరు, న్యాయం;
196. న్యాయమూర్తి, న్యాయశాస్త్రం, పక్కదుప్పటి,

పక్షపాతం, పక్షి, పగ;

197. పంగనామం, పచ్చిక, పంచాంగం, పంజరం, పటుత్వం, పట్టింపు, పట్టు, పట్టుదల;

198. పట్నం, పడక, పడిసెం, పంట, పండగ, పండితుడు;

199. పతకం, పతనం, పతిత, పతివ్రత, పత్రం, పత్రి, పత్రిక;

200. పత్రికాధిపతి, పదం, పదవి, పదిలం, పదును, పద్యకావ్యం, పద్యం;

201. పనసకాయ, పని, పనికిరానివి;

202. పనితనం, పనిదొంగ, పనిమనిషి, పనిమానటం, పన్ను, పంతం, పంది, పందికొక్కు, పబ్లిసిటీ, పంపకం, పరకాయ ప్రవేశం;

203. పరదూషణ, పరదేశి, పరధనం, పరధ్యానం, పరపతి, పరబ్రహ్మ, పరభూమి, పరం, పరలోకం, పరస్పరం;

204. పరాకు, పరాజయం, పరాయి వాళ్లు, పరిచయం, పరిణామం, పరిపాకం, పరిపాటి, పరిపాలన, పరిమళం;

205. పరిమితి, పరివర్తన, పరిశీలన, పరిశుద్ధం, పరిశోధన, పరిశ్రాంతి, పరిష్కర్త, పరిస్థితి;

206. పరిహారం, పరీక్ష, పరుగు, పరువు, పరోపకారం, పర్యవసానం, పర్సు, పలకరింపు, పలాయనం, పలుకు, పలుకుబడి;

207. పల్లకీ, పల్లం, పల్లె, పల్లెపడుచు, పల్లె జీవితం, పల్లెటూరి వాళ్లు, పవిత్రత, పశుత్వం, పశువు, పశ్చాత్తాపం, పస, పసితనం;

208. పాకులాట, పాట, పాటవం, పాటు, పాతకుడు, పాడుపని, పాండిత్యం, పాత్ర;

209. పాతకం, పాత కొత్తలు, పాత చదువు, పాతివ్రత్యం, పాత్ర, పాత్రికేయులు, పానం, పాపఫలం, పాపం;

210. పాపం - పుణ్యం, పాపి, పాముకాటు, పారతంత్ర్యం, పారాయణం, పార్టీ, పాలన, పాషాణం;

211. ప్రాస, పిచ్చాసుపత్రి, పిచ్చి, పిడికెడు, పిన్నలు - పెద్దలు, పిరికి;

212. పిలుపు, పిల్లలు;

213. పిల్లి, పిశాచం, పిసినారి, పిహెచ్.డి, పీకులాట, పీట, పీటముళ్లు, పీడ, పుకార్లు, పుట్టినరోజు;

214. పుట్టిల్లు, పుట్టుక, పుణ్యం, పునరావృత్తి, పునర్జన్మ, పునశ్చరణ, పునాది, పురస్కారం, పురాణ కథలు;

215. పురుడు, పురుష లక్షణం, పురుషుడు, పురోగతి, పులి, పువ్వులు, పుష్టి, పుష్పకం, పుష్పశరుడు, పుస్తకజ్ఞానం, పుస్తకం;

216. పూజ, పూజారి, పూజ్యుడు, పూటకూటిల్లు, పూనకం, పూనిక, పెట్టు, పెట్టుబడిదారీ, పెట్టుబడిదారు, పెట్రోలు, పెడదారి, పెడర్థం, పెండ్లి;

219. పెండ్లి కొడుకు, పెండ్లి కొలువు, పెత్తనం, పెద్ద, పెద్దరికం, పెద్ద ప్లీడరు, పెద్ద మనిషి;

220. పెద్దల మాట, పెద్దలు, పెద్దలోపం, పెద్దాసుపత్రి, పెద్దిల్లు, పెనుకోరిక, పెన్నిధి, పెన్నను;

221. పెంపకం, పెరుగుదల, పేకమేడ, పేకాట, పేచీ, పేద;

222. పేదరికం, పేరడి, పేరు;

223. పేలు, పైకి పటారం, పైచెయ్యి, పైరవి, పైవర్గాలు, పొగడ్త, పొగమబ్బు, పొగరు, పొగాకు;

224. పొత్తు, పొదుపు, పొందు, పొర, పొరబాటు, పొసగుదల, పోక, పోజు, పోటీ;

225. పోనిది, పోరాటం, పోరానివి, పోలిక;

227. పోలీసు, పోలీసు స్టేషన్, పోషణ, పోస్టుమాస్టరు, పౌరుషం, పౌరోహిత్యం, ప్రకృతి.

228. ప్రగతి, ప్రచారం, ప్రజలు, ప్రజాదరణ, ప్రజాధనం, ప్రజా ప్రతినిధి, ప్రజాభిమానం, ప్రజాస్వామ్యం;

229. ప్రజ్ఞ, ప్రణయం, ప్రతిక్రియ, ప్రతిఘటన, ప్రతిజ్ఞ, ప్రతిపక్ష నాయకుడు, ప్రతిపక్షం, ప్రతిఫలం;

230. ప్రతిఫలాపేక్ష, ప్రతిబంధకం, ప్రతిబింబం, ప్రతిభ, ప్రతిమాయ, ప్రతిష్ఠ, ప్రతీక,

279. మంత్రాంగం, మంత్రి, మందలింపు, మంది, మందు;

280. మందుగుండు, మమత, మరణయోగ్యత, మరపు, మరబియ్యం, మరుగు, మరునాడు;

281. మర్యాద, మల్లెపూవు, మసీదు, మహాకవి, మహాత్ముడు;

282. మహాయోగం, మహారాజు, మహావాక్యం, మహిమ, మహిళా సంఘం, మహోత్తమం, మాజీ, మాట;

283. మాతృత్వం, మాతృప్రేమ, మాదేశం, మాధుర్యం;

284. మానధనుడు, మానం, మానవత్వం, మానవుడు, మామ, మామూలు, మాయ;

285. మారుపేరు, మారుమనువు, మార్గం, మార్గాంతరం, మార్పు;

286. మాల, మిగలనిది;

287. మిగిలేది, మిగులు, మింగటం, మిడిసిపాటు, మితం, మితవాది, మిథ్య, మినహాయింపు, మిన్న, మిరియాలు, మీసం, ముక్కుసూటి;

288. ముఖం, ముఖస్తుతి, ముఖ్యం, ముఖ్యమంత్రి, ముగ్ధ, ముచ్చట, ముదరటం, ముదిమి;

289. ముద్దు, ముని, ముందుచూపు, ముందు వెనుకలు, ముభావం;

290. ముల్కీ, ముష్టి, ముసలి, ముస్తాబు, మూగనోము, మూఢనమ్మకం, మూఢమి, మూఢుడు, మూర్ఖత్వం;

291. మూర్ఖుడు, మూలం, మూలసిద్ధాంతం, మృగం, మృతుడు, మృత్యుంజయుడు, మృత్యువు, మృదుత్వం, మృష్టటం;

292. మృష్టాన్నం, మెజారిటీ, మెట్టవేదాంతం, మెట్టు, మెండు, మెతకదనం, మెత్తన, మెదడు, మెప్పు;

293. మెరిట్, మెరుగు, మెలకువ, మేటి, మేధ, మేధావి, మేనబావ, మేనమామ, మేయటం, మేలం, మేలు;

294. మేష్టారు, మేళం, మైకు, మైత్రి, మైల;

295. మొక్క, మొగమాటం, మొండితనం, మొండివాడు, మొదటిది, మొద్దు, మొనగాడు, మొరాయింపు, మోక్షం, మోజు;

296. మోడల్, మోతాదు, మోసం, మోహం;

297. మౌనం, యజమాని, యత్నం, యథార్థం, యంత్రం, యాచన, యాతన, యాత్ర, యుక్తం, యుగపురుషుడు, యుద్ధనీతి;

298. యుద్ధం, యువ వృద్ధులు, యోగం, యోగి, యోగ్యత;

299. యౌవనం, రక్తం, రక్తసంబంధం, రక్తి, రక్షక భటుడు;

300. రక్షణ;

301. రంకు, రంకు మొగుడు, రంగు, రచన;

302. రచనా కాలం, రచయిత;

303. రతీమన్మథులు, రంధ్రాన్వేషణ, రసభంగం, రసం, రసికత, రసికుడు, రసీదు, రహదారి, రహస్యం;

304. రాక, రాక్షసత్వం, రాక్షసుడు, రాగం, రాచరికం, రాజకీయం;

305. రాజద్రోహి, రాజకీయవాది;

306. రాజనీతి, రాజానుగ్రహం, రాజీ, రాజు;

308. రాజ్యం, రాజ్యాధికారం, రాట, రాణివాసం, రాత, రాతకోతలు, రాత్రి, రాత్రింబవళ్ళు, రానివి, పోనివి, రాపిడి;

309. రాబడిపన్ను, రాబోయే రోజు, రామరాజ్యం, రామశబ్దం, రామాయణం, రాయబారం, రాయబారి, రాయలసీమ, రాయితీ, రాళ్ళు, రిపుపక్షం, రిఫారం, రివాజు, రుగ్మత, రుచి;

310. రుజువు, రుణం, రుమాలు, రుషి, రూపం, రూలు;

311. రెండు, రేటు, రేడియో, రేడియోవాళ్ళు, రేపు, రేవు, రేషను, రైతు, రైలు, రొట్టె (ముక్క), రొష్టు, రోగం;

312. రోగి, రోజులు, రోడ్లు, రోత, రోలు, రోషం, రౌడీ, రౌతు, లక్ష, లక్షణం;

313. లక్ష్మణ రేఖ, లక్ష్యం, లంగరు, లంచం;

314. లండన్, లబ్ది, లభించనివి, లంపటం, లయ, లాటరీ, లాభదాయకం, లాభం, లాహిరీ, లింగం, లిటిగేషన్;

315. లెక్క, లెక్చరు, లేఖ, లేఖకుడు, లేచిపోవటం, లేనిది;

317. లేమి, లైసెన్సు, లొంగటం, లొచ్చు, లొసుగు, లోకం;

320. లోకాతీతులు, లోకులు, లోకువ, లోకోపకారం;

321. లోటు, లోతు, లోపం, లోపల, లోబడనివి, లోభి;

322. లోభిత్వం, లౌకిక సుఖం, లౌక్యం, వక్త, వకాలతు, వకీలు;

323. వక్రభాష్యం, వంక, వంకర, వచనం, వజ్రం, వజ్రాయుధం, వంచకం, వంచన, వట్టి చేతులు, వడగళ్ళు, వడ్డన, వంట;

324. వంట బట్టడం, వదంతి, వదరుబోతు, వదలనివి, వంతు, వన్నె, వంశాచారం, వయసు;

325. వరం, వరప్రసాది, వరిపంట, వర్తకం, వర్తకుడు, వర్తమానం, వర్షం, వలపు, వశీకరణం, వసంతం;

326. వాకిలి, వాక్పారుష్యం, వాక్‌స్థానం, వాగు, వాగుడు, వాంఛ, వాటం, వాడి, వాతావరణం, వాదన;

327. వాద్యం, వాయిదా, వారం, వారసత్వం, వార్త, వార్తాస్థలం, వార్ధక్యం, వావివరసలు;

328. వాస్తవం, వికాసం, విగ్రహం, విఘ్నం, విచక్షణ, విచారణ;

329. విచారం, విచిత్రం, విజయం, విజ్ఞత, విజ్ఞానం, విడదగినవి, విడాకులు, వితంతువు;

330. విత్తనం, విదేశీ నిపుణుడు;

331. విద్య, విద్యార్థి, విద్యాలయం, విద్యావతి, విద్వాంసుడు, విధి, విధికృతం, విధ్యుక్తధర్మం, విధ్వంసం, వినరానిది, వినాయకుడు;

332. వినేవారు, వినోదం, విన్నపం, విన్నపీ, కన్నపీ, విపర్యయం, విప్లవకారులు, విప్లవం, విభిన్నత్వం, విభూతి, విమర్శ;

333. విముక్తి, విరసం, విరహం, విరుగుడు, విలయం, విలాపం, విలువ;

335. విలేఖరి, వివాహం, వివేక భ్రష్టులు, వివేకం, విశేషం, విశ్రాంతి, విశ్వం, విశ్వసనీయుడు, విశ్వాసం;

336. విషప్పురుగు, విషం, విషయ గ్రహణశక్తి, విషయ సేకరణ, విషాద గీతం, విషాదం, విసుగు, విస్కీ విస్పష్టం, విహితం, వీణ, వీధి దీపాలు, వీరత్వం, వీరలక్షణం;

337. వీరుడు, వీలు, వృత్తి, వృథా, వృద్ధి, వెక్కిరింత;

338. వెగటు, వెధవ, వెనకచూపు, వెనక్కురానివి, వెన్నెల, వెరపు, వెర్రి;

339. వెల, వెలమగలు, వెలమలు, వెలుగు, వేకువ, వేగం, వేట, వేటకాడు, వేడి, వేడుక, వేదకాలం;

340. వేదన, వేదం, వేదాంతం, వేదాంతి, వేశ్య;

342. వేశ్యమాత, వేషధారణ, వేషం, వేసవికాలం, వేళ, వైకుంఠం, వైద్యం;

343. వైద్యుడు;

344. వైపరీత్యం, వైఫల్యం, వైభవం, వైరం, వైరాగ్యం, వైరుధ్యం, వైష్ణవమాయ, వైష్ణవాలయం, వైష్ణవుడు, వ్యక్తి;

345. వ్యక్తిత్వం, వ్యతిక్రమం, వ్యత్యాసం, వ్యభిచారం, వ్యర్థత, వ్యర్థం;

346. వ్యవస్థ, వ్యవహారం, వ్యసనం, వ్యాకరణం, వ్యాజ్యం;

347. వ్యాపకం, వ్యాపారం;

348. వ్యాపారి, వ్యాప్తి, వ్యామోహం, వ్రణం, శకునం, శక్తి, శత్రుత్వం;

349. శత్రువు, శని;

350. శపథం, శబ్దం; శరణ్యం, శరీరం, శల్యపరీక్ష, శవం, శాడిస్టు, శాంతం, శాంతి;

351. శాపం, శాశ్వతం, శాసనసభ, శాస్త్రం, శాస్త్రీయ సంగీతం;

352. శిక్ష, శిక్షా పరిమితి, శిక్షాస్మృతి, శిక్షార్హం, శిఖరాగ్ర జాతి;

353. శివపూజ, శివాజ్ఞ, శిష్టుడు, శిష్యుడు, శిస్తు, శీలం, శుభ్రత, శుశ్రూష, శూన్యం, శూరుడు, శృంగారం;

354. శేషం, శైవాచారం, శోభ, శౌర్యం, శ్మశానం, శ్రద్ధ, శ్రమ;

355. శ్రాద్ధం, శ్రీ, శ్రీరంగనీతులు, శ్రీరాముడు, శ్రేష్ఠం, శ్రోత, షికారు, సకారణం, సఖ్యత, సగటు మనిషి, సగటు రచయిత, సంకటం, సంకరం;

356. సంకల్పం, సంకెళ్ళు, సంక్షోభం, సంగమం, సంగీతం, సంగీతం మేష్టారు, సంఘ చైతన్యం, సంఘటన, సంఘం;

357. సంఘ మరణం, సంఘర్షణ, సంఘ సంస్కారి;

358. సంఘీభావం, సజీవ చరిత్ర, సత్పురుషుడు, సజ్జనుడు;

359. సంచారం, సడి, సత్కారం, సత్తువ, సత్ప్రవర్తన, సత్యం;

360. సత్యమార్గం, సత్యసంధుడు, సత్రకాయ, సద్బ్రాహ్మణుడు, సంతానం, సంతృప్తి, సంతోషం, సంతోషకరం, సందడి, సందర్భానుసారం, సందిగ్ధం;

361. సందేహం, సంధి, సంధికాలం, సన్నాహం, సన్నిహితుడు, సన్మానం, సన్యాసం;

362. సన్యాసి, సబబు, సభాపతి, సమ ఉజ్జీ, సమత, సమంజసం, సమదృష్టి;

363. సమయం, సమర్థత, సమర్థన, సమర్థుడు, సమస్య;

364. సమాజం, సమాధానం;

365. సమానత్వం, సమానం;

366. సమానుడు, సమిధ, సముద్రం, సంపద;

367. సంపన్నుడు, సంపాదకుడు;

368. సంపాదన, సంప్రదాయం, సంబంధం;

369. సంభాషణ, సమ్మె, సమ్మోహనాస్త్రం, సంయోజనం, సంవేదన, సంశయం, సంసారం;

370. సంస్కరణ, సంస్కారం;

371. సంస్కృతం, సంస్కృతాంధ్రాలు, సంస్కృతి, సంస్థ, సరదా, సరసం, సరి;

372. సర్టిఫికెట్టు, సర్దుబాటు, సర్వజనామోదం, సర్వాంతర్యామి, సర్వెంటు, సలాం, సవతి, సవతి తల్లి, సవర, సవాలు, సస్పెండు;

373. సస్పెన్సు, సహగమనం, సహజత్వం, సహజీవనం, సహనం, సహభోజనం, సహవాసం, సహాయం, సహృదయత;

374. సాకు, సాక్షి, సాక్ష్యం, సాగతీత, సాగనివి, సాంక్రమికం, సాంఘిక సంస్కరణ, సాదాతనం, సాధన;

375. సాధన భేదం, సాధింపు, సాధువు, సాధ్యం, సాధ్యాసాధ్యాలు, సానుభూతి, సాన్నిధ్యం, సాపాటు, సాఫల్యం, సామర్థ్యం;

376. సామాజికం, సాము, సామెత, సాంబారు, సామ్యవాదం, సామ్యవాది, సారం, సారా, సార్థకత, సాహసం, సాహిత్యం;

377. సాహెబు, సి.ఆర్, సిగరెట్టు, సిగ్గు;

378. సిగ్గుచేటు, సిజర్సు, సిద్ధాంత భేదం, సిద్ధుడు, సినిక్, సినిమా;

379. సినీకథ, సినీ రచయిత, సినీమాయ, సిన్సియారిటీ, సిరి, సిలిండరు, సివిలిజేషన్, సీత, సీతాఫలం, సుకవి, సుకుమారత;

380. సుఖజీవి, సుఖం, సుగుణం, సుడిగాలి, సుతుడు, సుద్ది;

381. సున్న, సులభం, సూక్తి, సూచన, సూత్రం, సూర్యుడు, సృష్టి, సెక్సు, సెంటిమెంట్;

382. సెలవు, సేద్యం, సేవ, సేవకుడు, సేవా పద్ధతి, సైకిక్ ఎఫెక్ట్, సైకిల్;

383. సైన్సు, సొంతం, సొమ్ము, సోడాబుడ్డి, సోదర మానవులు, సోది, సోమరితనం, సోమరిపోతు, సోషలిస్టు, సోషలిజం, సౌకర్యం, సౌందర్యం;

384. స్తిమితం, స్త్రీ;

389. స్త్రీ పురుషులు;

390. స్త్రీ వాంఛ, స్త్రీ విద్య, స్థానం;

391. స్థాయి, స్థావరం, స్థితి, స్థిరత్వం, స్థూలకాయం, స్నానం, స్నేహం;

392. స్నేహితుడు, స్పర్శ, స్పష్టం, స్మరణ, స్వతంత్రం;

393. స్వభావం, స్వర్గం;

394. స్వలాభం, స్వశక్తి, స్వస్థలం, స్వాతివాన;

395. స్వానుభవం, స్వారీ, స్వార్థత్యాగం, స్వార్థభక్తి, స్వార్థం;

396. స్వేచ్ఛ, హక్కు;

397. హడావిడి, హత్య, హద్దు, హనుమంతుడు, హంతకుడు, హరిజనులు, హరిశ్చంద్రుడు, హస్తం, హాని, హాయి;

398. హాస్యం, హాస్యాస్పదం, హితం;

399. హిజం, హిందువు, హింస, హింసాహింసలు, హిస్టరీ మాస్టారు, హీనత, హీనుడు, హృదయం;

400. హెచ్చరిక, హేయం, హేళన, హోటలు, హోదా, హోంమంత్రి, హోరు;



**అకారణం**

నిర్నిమిత్తంబ నిందింప నీకుఁదగునె?

- కంకంటి, ఉత్తర రామాయణము

చెట్టుకి ఆకు తొడగటానికీ, పువ్వులు
పుయ్యడానికీ ఏ కారణమూ కనబడదు.

- చలం, మ్యూజింగ్స్

**అక్షరం**

అక్షరంబు తల్లి యఖిలవిద్యల కెన్న
నక్షరంబు లోకరక్షకంబు
అక్షరంబులేని యబలున కెందును
భిక్ష పుట్టఁబోదు పృథ్విలోన.

- చాటువు

అక్షరంబు తన్ను రక్షించుగావున
నక్షరంబు లోక రక్షితంబు!

- వేటూరి, చాటుపద్య మణిమంజరి

దేవకాంతే అయినప్పుడు ఆవిడకి అక్షరజ్ఞానం ఉంటేనేఁవిఁటి, లేకపోతే నేఁవిఁటి. ఆ మాట కొస్తే మానవకాంతలైన సీతాసావిత్రులు ఏమ్మేలూబియ్యేలూ పాసెయారంటారా?

- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

జిహ్వ నాల్గచ్చరాలు నేర్చిన కతానఁ
బడుపుఁ గూటికి మనసు గొల్పక నిల్లైతి.

- తమ్మయ్య, వైజయంతీ విలాసము

నా అక్షరాలు కన్నీటి జడులలో
తడిసే దయాపారావతాలు.
నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే
విజయ ఐరావతాలు.
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే
అందమైన ఆడపిల్లలు.

- తిలక్, నా కవిత్వం

నా వ్రాలు సుధారసాలు, కవిరాజుల కెల్ల మనో
హరాలు వజ్రాలు
సరస్వతీ విమలచారుకుచాగ్ర సరాలు.

- చాటువు

**అగడు**

అగడు ఘగడి పాలు, ఆనందం (అనుభవం) ఊరిపాలు.

- సామెత

**అగౌరవం**

అవసరం అయినప్పుడు నడిబజార్లో కలబడక పోవటం గౌరవంకాదు, అగౌరవం.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

కట్టెలమ్మిన ఊళ్లలో పువ్వులమ్మినట్లు.

- సామెత

**అగ్నిపరీక్ష**

రెండు మూడు యేళ్ళు, జైలు అనుభవం వుండడం జీవితాన్ని కొత్తకొత్త అనుభవాల్తో మరింత సంపన్నవంతం చేసి తీరుతుంది. అదొహ అగ్నిపరీక్ష.

- లక్ష్మణరావు, అతడు - ఆమె

**అగ్నిహోత్రం**

అమాయకుల్లోనే అగ్నిహోత్రం ఉంటుంది.

- రామదాసు, అతిథి

**అఘాయిత్యం**

మగనిఁగొట్టి మోసాలకుఁ బోయి మొరపెట్టి నట్లు.

- సామెత

**అచ్చిరాకపోవటం**

అచ్చిరాని కాలానికి అడుక్కుతినబోతే, ఉన్న బొచ్చికాస్త ఊడ్చుకొనిపోయిందిట.

- సామెత

**అజాగళస్తనం**

అనదను నార్తు దీను శరణాగతుఁ గావనివాఁ
డజాగళస్తన మని యంద్రు

- గోపరాజు, సింహాసన ద్వాత్రింశిక

**అజాగ్రత**

ఏమటి రక్షసాలని మృగేంద్రుని నక్కయుఁ
గోలుపుచ్చు

- తిక్కన, భీష్మపర్వము

**అజ్ఞానం**

అజ్ఞానాన్ని మించిన శిక్షలేదు.

- బుచ్చిబాబు, అంతిమ అజ్ఞానం

అరుల గుణములైన నగ్గింతు రెప్పుడుఁ
గలయబెరసినపుడు కలితనంబు
మెఱయుదురు మహాత్ము, లెఱుఁగరు తుది మొద
లెట్టివారి నితఁడు బెట్టుపలుకు.

- తిక్కన, విరాటపర్వము

అంతమందికీ అన్నీ తెలుసు
అదే మన అజ్ఞానం.

- శ్రీశ్రీ, శరచ్చంద్రిక

మనిషి ఎంతో లోపలి గొప్పతనం సంపాయిస్తే, అంతవిలవా బరువూ అతని పనులూ, మాటలూ. ఈ సంగతి చాలామంది ప్రజా నాయకులు గమనించని సంగతి.

- చలం, మ్యూజింగ్స్

భారతయుగానఁ జాణక్య వీరుఁ డెట్లు
చంపెనో సీతను, జటాయు వంపగముల
ద్రుపద పుత్రిక నేరీతిఁ ద్రుంచినాఁడొ
నేఁడు గడతేర్తు నట్లనే నిన్ను నేను.

- తి.వేం., మృచ్ఛకటికము

అజ్ఞా తాజ్ఞేయాలకు
అజ్ఞానంతో నేస్తం.

- అబ్బూరి, ఊహాగానం - కవిత

ఎవరి తెలివితక్కువ వారికి తెలియదు.

- చిలకమర్తి, ప్రహసనము

గొడ్రాలు ప్రసవవేదన నెరుగనట్లు బ్రహ్మచారి విరహతాపము నెరుగఁజాలఁడు.

- చిలకమర్తి, కర్పూరమంజరి

పచ్చి అజ్ఞానం వున్నన్నేళ్ళు మోసం బతుకుతూ వుంటుంది.

- బోయజంగయ్య, జాతర

అతనికి జీవితం సరిగా తెలియదు; అతను తెలుగు సినిమాలమీద పెరిగేడు.

- రావిశాస్త్రి, వియత్నాం విమల వృత్తాంతం

విజ్ఞానమేకాదు - అజ్ఞానం కూడా డబ్బు ఖర్చు చేస్తేగాని రాదు.

- సరస్వతీదేవి, స్వర్ణకమలాలు

గృహస్థుడి బాధలు ఎవరికి తెలుస్తాయి? ఇందులో తమాషా ఏమిటంటే అనుభవించే వాళ్ళు బాధలని తెలుసుకోలేరు. అవ్యక్తములో పడి కొట్టుకలాడుతూ ఉంటారు.

- సరస్వతీదేవి, స్వర్ణకమలాలు

తెలియదగిన వస్తువును గ్రహించుట కక్కఱకు రాని తెలివి తెలివియెట్లగును? అజ్ఞానములో- పరిశుద్ధమైన యజ్ఞానములో - స్వయంభవ మైన యజ్ఞానములో - వాఁ డత్యధికుఁ డని, వీఁ డధికుఁ డని, వాఁడు మధ్యముఁ డని, వీఁ డధముఁ డని, వాఁ డత్యధముఁ డని "డిగ్రీ" ల చొప్పున భేదముతీయుట యెందులకు? అన్నియుఁ గంబళిలోని వెంట్రుకలయినప్పుడు తూర్పుకోణముననున్న వెంట్రుక పశ్చిమకోణ మున నున్న వెంట్రుకకంటె నెక్కువ నైల్యము కలదనియు ఉత్తరపు మూలనున్న రోమము పశ్చిమోత్తరమూల స్థల రోమము కంటె నెక్కువ వంకలు గలిగియుండుటచే మిగులసుందరమైన దనియు చెప్పినందువలన విశేషమేమి?

- పానుగంటి, సాక్షి

కత్తితీసి కంపలోవేసి, ఏకుతీసి పొడుచుకుంటా నన్నాడట!

- సామెత

వాళ్లసంగతి వాళ్లే చూచుకునేవాళ్లు ఇతరులని ఎన్నడూ అర్థంచేసుకోలేరు.

- చలం, శశిరేఖ

కుడుమువలె దాచింది అంటే, అమ్మా! కుడు ములు వండమన్నట్లు.

- సామెత

కూసుముండ నోరుకుట్టి పెట్టితే, అయ్యావారా, ఏం టెంకాయకు పసుపు పూయలేదు అన్నదట.

- సామెత

కోతల్లో కునికిపాట్లుపడి కొత్త అమావాస్యకు కొంపగోడి సంగతి అనుకున్నట్లు.

- సామెత

గంధం సమర్పయామి అంటే, గొడ్డలి నూరరా అన్నాడట.

- సామెత

కుప్ప తగులబెట్టి పేలాలు వేయించుకున్నట్లు.

- సామెత

జ్ఞానంలేని కోడిపిల్ల పరుగులెడుతుంది.
గ్రద్దలు వెంటబడితే తెలిసొస్తుంది.

- శ్యామలారాణి, పవిత్ర

అజ్ఞానం అనంతమైనది గనుక, అజ్ఞానం కూడా పరబ్రహ్మ స్వరూపమే అని అంగీకరించాలి.

- దాసు వామనరావు, గురుశంక

తనకుఁ దెలిసికొన శక్యముగాని దంతయు లేద నుట విపరీత జ్ఞానరూపమున నున్న యజ్ఞా నము.

- వరదాచార్యులు, వైశాలిని

కాసింది వెన్నెలంటే - కోసి గోడౌన్‌లో పడెయ్య మన్నాట్ట.

- శ్రీరమణ, న్యూనుడి

రామాయణమంతా విని, రామునకు సీతయేమి కావలెనని అడిగినట్లు.

- సామెత

**అజ్ఞాని**

అజ్ఞానితో హెచ్చుతగ్గు వచ్చినా జ్ఞానిదేతప్పు. కాబట్టి, అజ్ఞాని ఏమిచేసినా, జ్ఞాని అందుకు ఓర్చుకోవాలి, తన్నికానట్టు.

- భమిడిపాటి, అవును మేష్టరీ కూడా ఒక ఉద్యోగమేనా!

అజ్ఞానిని ఆలోచనలు వేధించవు. తనకు అందని ఆదర్శాలతో హైరానపడడు. అతని కున్న సుఖం మరెవ్వరికీ ఉండదు.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

ఈ ప్రపంచం అజ్ఞానులకోసం చెయ్యబడ్డదే ఆవటంవల్ల వాళ్ళు సుఖపడుతున్నారు. హాయిగా జీవితం గడుపుతున్నారు.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

వివేకహీనునికి శాస్త్రజ్ఞానము గ్రుడ్డివానికి స్వహస్త దీపమువలె నిష్ఫలము.

- చిన్నయసూరి, మిత్రలాభము

స్వచ్ఛమైన తియ్యని నీటితో నిండిన కాసారాన్ని పక్కనే పెట్టుకుని మరీచికల వెంట పరుగెత్తే వాడు అజ్ఞాని.

- శ్యామలారాణి, పవిత్ర

వాష్‌బేసిన్‌లో చేపలు పట్టే రకం.

- శ్రీరమణ, న్యూసుడి

**అజ్ఞేయం**

వేదవిహితవిధులకుఁ దల్లిదండ్రుల యజ్ఞాలకుఁ గారణములు తెలిసికొననక్కఱలేదు.

- పానుగంటి, వీరమతి

ఎంత సహ్యమొకద యీ యనంతపథము
ఎంత యజ్ఞేయమో యెట్టు లెఱుగవచ్చు?

- అబ్బూరి, ద్రాక్షావీధి

శ్రీరాముడికీ, ధర్మరాజుకీ, ఎవరు బోధించినా, చచ్చేదాకా జ్ఞానం వొచ్చినట్లు లేదు. చివరిదాకా బోధిస్తూనే వున్నారు. అన్ని పాపాలు చేసిన అల్లరి కృష్ణుడికి చెప్పడానికి ఎవరికీ గుండెలు లేవు. పైగా ప్రపంచానికి అతనే భగవద్గీత బోధించాడు.

- చలం, మ్యూజింగ్స్

**అడకత్తెర**

సవతుల మధ్యమున మాటలాడఁబోవు కాంతునియొక్క గతి అడుకొత్తులోని వక్కగతి.

- పానుగంటి, రాధాకృష్ణ

**అడగటం**

అడక్కపోతే అమ్మయినా పెట్టదు. పొదుగున పాలున్నప్పటికి దూడ కుమ్మంది· తల్లి చేపదు.

- ఉన్నవ, మాలపల్లి

**అడవి**

ఆడది లేనిది అడివి. మగవాడు లేనిది మఠం.

- సామెత

అడవి నిగూఢమైనది. ఏ అనుభవానికీ, ఏ మేధస్సుకీ అంతుచిక్కని రహస్యాలు ఇక్కడ చాలా ఉన్నాయి.

- కేశవరెడ్డి, అతడు అడవిని జయించాడు

**అడవిపంది**

అడవిపంది చేను మేసిపోతే,
ఊరపంది చెవులు కోసినట్లు.

- సామెత

**అడవిపులి**

అడవిలోన నున్నయంతనె పులి యింత
యెఱుకలేని దయ్యెనే తలంప?

- అనంతుడు, భోజరాజీయము

**అడుగుజాడ**

దంతియడుగులోనఁ దక్కిన జంతుచ
యంబు నడుగులెల్ల నడఁగియుండు.

- తిక్కన, ఆనుశాసనికపర్వము

**అడ్డంకి**

మనసు మహామేరువు దాటును, కాలు కందకం దాటదు.

- సామెత

**అడ్డదారి**

హైసొసైటీలో ప్రవేశించడానికి డబ్బుదారి
లేనప్పుడు ఆర్టికె అడ్డుదారిగా పనిచేస్తుంది.

- రావిశాస్త్రి, రొట్టెముక్క

**అడ్డం**

తడిక కుక్కకు అడ్డంగాని మనిషికి అడ్డమా?

- సామెత

పిడుగుకు గొడుగు అడ్డమా?

- సామెత

**అడ్డు**

ఆడవాళ్ల నోటికీ గోదారి వరదకీ అడ్డూ ఒడ్డూ

లేదనుకుంటాను.
- రాధాకృష్ణ, మనస్తత్వాలు

ప్రేమకు, వయస్సు అడ్డుకాదు. అనురాగానికి, అనుభవం అడ్డుకాదు.
- భారతీదేవి, వాంటెడ్ లవ్

**అడ్డుకట్ట**

వరదలకి గట్లు వెయ్యొచ్చునేమో కాని ఒక్కొక్క పుడు దుఃఖానికి అడ్లు వెయ్యలేం.
- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

**అంటూసొంటూ**

అంటూసొంటూ ఆసాది వానిది, రట్టూ రవ్వా గంగానమ్మది.
- సామెత

**అతిథి**

అతిథి పాత్ర నిర్వహించటం ఒక లలితకళ. ఒక మనోవైజ్ఞానిక అభిజ్ఞానం, ఒక గాఢమైన జీవనసాధన. ఉత్తమ అతిథిగా మనగలిగిన వ్యక్తి జీవితంలోని మిగతా అన్ని రంగాల్లోనూ ఉన్నతంగా రాణించగలడు.
- సంజీవదేవ్, అతిథిపాత్ర

**అతివాదం**

నిరాశ నిస్పృహ అతివాదానికి కళ్ళు
స్వీయ మానసిక ధోరణి అతివాదానికి వళ్ళు.
- ఛాయారాజ్, శ్రీకాకుళం

**అతివినయం**

కారు పంపితే కదలేదుగాని
కాకిచేత కబురంపితే రాకపోయానా అన్నాట్ట.
- శ్రీరమణ, న్యూసుడి

**అతిశయం**

బతకని బిడ్డ బారెడు.
- సామెత

చెయ్యి తిరిగిన రచయిత్రి ఇల్లెక్కి నవల రాసిందట.
- శ్రీరమణ, న్యూసుడి

అసలే ముక్కిడి, పైగా పడిశము అన్నట్లు.
- సామెత

అబ్బురాన బిడ్డపుడితే గడ్డపారతో ముక్కు, చెవులు కుట్టించారట.
- సామెత

గడిచేవాళ్ళు బురకాలు కప్పుకొని గోసాలు సేస్తారు.
- పినిశెట్టి, పల్లెపడుచు

**అతిసంతోషం**

అతి సంతోషం పొందేక కొంచెం మందకొడిగా వుంటుంది మరి.
- లక్ష్మణరావు, అతడు - ఆమె

**అతుకు**

మనస్సు విరిగాక అతకదు. బలవంతాన అతికినా అతుకు అతుకే.
- సుంకర, పిచ్చివాడు

బంగారానికి టంకంపొడి వేసినట్టుగా యెంత నిజమయినా మధ్య నాలుగు అబద్ధాలు వేస్తేనే కాని అతకదు.
- కందుకూరి, హాస్యసంజీవని

**అత్త**

అత్తయ్యకి అల్లుడి గొడవలేదు.
- బుచ్చిబాబు, ఆత్మవంచన

యీ కాలంలో అభ్యుదయ భావాలున్న అత్తలు ఎక్కడ ఉన్నారండీ?
- సూర్యారావు, శ్రీమతులు - శ్రీయుతులు

అత్తగారెక్కడా మంచిదే వుంటుంది. మంచిగా వుండకపోతే కూతురి కాపురం ఏమవుతుందో అని భయం.
- కాళ్లకూరి

కోడలి గృహప్రవేశం, అత్త గంగాప్రవేశం.
- సామెత

అత్త ఆరోనెలలో పట్టిన దయ్యం. (బిడ్డకు మొదట వచ్చేమాట అత్త)
- సామెత

అత్తను అమ్ముకొమ్మంటారు, కోడలిని కాల్చుకొమ్మంటారు.
- సామెత

**అత్తవారిల్లు**

అత్తవారింటి సుఖం మోచేతి దెబ్బవంటిది.
- సామెత

పుట్టినింట భోగము కంటే భర్త యింటి బానిస తనము మేలు.
- చిలకమర్తి, పలుగు రాముడు

**అత్యల్పం**

ఏనుగులను తినేవానికి పీనుగులు పిండి వంటలా?
- సామెత

**అత్యాశ**

భార్య జారిపోయినా, భర్త అధికారాన్ని చేతు లోనే పట్టుకుని డాబుగా కూచుంటాడు, పారి పోయిన దొంగవాడి పైబట్టను పట్టుకుని

ప్రతాపాలు కొట్టే పెద్దమనిషిలాగు, పారి పోయిన గుర్రం కళ్లెం చేత్తో పట్టుకుని కళ్లెం కోసం గుర్రం తిరిగి వస్తుందని ఆశపడే వెర్రి రౌతులాగు!

- చలం, అరుణ ఆర్గ్యుమెంటు

**అదను**

వ్యవహారములకెల్ల అదనే ప్రధానము.

- పానుగంటి, సాక్షి

**అదిరిపాటు**

పిండిబొమ్మను చేసి పీటమీద కూర్చుండబెడితే ఆడబిడ్డతనాన అదిరదిరిపడ్డదట.

- సామెత

**అదుపు**

కట్ట కొదిగిన నీర మేకముఖముగానే పోవును. తెగిన నీరు బహుముఖములుగా బోవును.

- విశ్వనాథ, చెలియలికట్ట

**అదృశ్యం**

బుద్ధి ఉపయోగిస్తే అంతరాత్మ
అదృశ్యమైపోతుంది.

- రాజమన్నారు, బంధాలు

విగ్రహం కనిపిస్తుంది, మనసు మాత్రం
కనిపించదు.

- రావిశాస్త్రి, వియత్నాం విమల వృత్తాంతం

భూమిలో నిధి, ఫలములో రుచి, నువ్వులలో నూనె కంటి కగపడవు.

- రామకృష్ణశాస్త్రి, ఖుదానంద్

ఇట్టె చంపున ట్లేఁచి బాధించునట్టి
జనులు హానిచేయరు పంటిసలుపువోలె
నున్న జాడయే కనఁబడకుండువారు
ప్రాణములు పీల్చు రిట్టె హృద్వ్యాధిఁ బోలె.

- పానుగంటి, పాదుకాపట్టాభిషేకము

**అదృష్టం**

కొంతమంది స్త్రీలకి మొగుడు పోవడమే అదృష్టం.

- లక్ష్మణరావు, అతడు - ఆమె

ప్రతిభవల్ల నువ్వు సంపాయించుకున్నావనుకుని, గడచిన అదృష్టాన్ని సాగదియ్యాలని చూచావా, స్త్రీలే కాదు దేవతలు కూడా కళ్లెర్ర చేస్తారు.

- చలం, హంపీకన్యలు

అదృష్టం మీద అంత పెద్ద భారాన్ని వెయ్య కూడదు. అదృష్ట మనేది మన కోరిక ప్రకారం ప్రార్థించినా, కోపగించినా, ఏడ్చినా రాదు. అందుకని కాస్త తెలివితేటల్ని ఉపయో గించి ఆ అదృష్టాన్ని జుట్టుపట్టుకొని మనదార్లోకి లాక్కురావాలి.

- ధనికొండ, ఎర్రబుట్టలు

నిశితమైన ప్రకృతి కలవారు, ప్రతి స్వల్ప విష యమును మనసునకుఁ బట్టించుకొని బాధపడు వారు జీవితాంతమున మహామేధాశాలు లగు దురు. కాని వారి జీవితములో నదృష్టముం డదు.

- విశ్వనాథ, తెఱచిరాజు

భరతఖండము అనగా అది గ్రామసీమల పుట్ట. అందు మన గ్రామసీమలన్నియు గ్రామసింహ ముల ఏలుబడిలోనుండుట అది మన ఆర్యావ ర్తపు అదృష్టము.

- రావిశాస్త్రి, రత్తాలు- రాంబాబు

ఎరువిచ్చిన బుక్కు
మళ్ళీ చూడ్డం కూడా గొప్ప లక్కు.

- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

అన్ని అదృష్టాలలోకీ మనకు కావలసిన స్త్రీ లభించటం గొప్ప అదృష్టం.

- కొడవటిగంటి, గాలిపాటు

జీవితం ఒకలాటరీ. ప్రేమ పెద్దపజిల్.
అన్నింటికన్న ముఖ్యం నసీబ్.

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

తనకోసమే, తానే కావాలని కోరే ఆడది
దొరకడం మగవాడి అదృష్టం. ఆ అదృష్టాన్ని
కాపాడుకోగలగడం ఓ సుకృతం.

- మహీధర, స్వయంవరణం

అదృష్టం అందలమెక్కిస్తానంటే, బుద్ధి
బురదలోకి లాక్కెళ్ళిందిట.

- సామెత

దురదృష్టాన్ని అనుభవించలేనివాడు అదృష్టాన్నీ అనుభవించలేడు.

- సామెత

ధైర్యంగల భార్యవున్న భర్త అదృష్టవంతుడు.

- వెంకటకృష్ణమూర్తి, ఎయిర్‌హోస్టెస్

తాగబోయిన తీర్థమెదురైనట్టు.

- శ్రీరమణ, న్యూనుడి

తంతే పోయి బారులో పడ్డట్టు.

- శ్రీరమణ, న్యూనుడి

వెదకబోయిన ఫైలు చేతికి తగిలినట్టు.

- శ్రీరమణ, న్యూనుడి

రొట్టె విరిగి నేతిలోపడ్డట్లు.
- సామెత

మన అవసరానికి పక్కవాడి జేబులో డబ్బు ఉండడాన్నే అదృష్టం అంటారు కాబోలు.
- బీనాదేవి, హరిశ్చంద్రమతి

జీవన్మృతులై, ముచ్చిరు మూర్ఖులకంటెన్
జచ్చినవారే యదృష్టజాతకు లెందున్
- ఏటుకూరి, మగువ మాంచాల

**అదృష్టవంతుడు**

జీవితంలో కొన్ని కొన్ని స్థానాలున్నై. మనిషి అక్కడ కాలు పెట్టకుండా వాటిని తప్పించుకు తిరుగుతున్నంతసేపే అదృష్టవంతుడు.
- కొడవటిగంటి, పెంపుడు తల్లి

**అద్దం**

రూపాయనోట్లో తలదూర్చి తన్నుకుంటున్న లోకంలా సీసాలో బంధించుకున్న ఆధునిక మానవుడిరూపంలా ఎప్పటికీ నాకర్థంకానిది అద్దం.
- నగ్నముని, జైల్లో సముద్రం

అద్దం అబద్ధం చెప్పదు.
- ఎమ్వీయల్, యులిసిస్

లంజవారికి శ్రీమహాలక్ష్మి గాదె
దర్పణము విప్రముఖ్య!
- వల్లభరాయడు, క్రీడాభిరామము

అద్దానికెదురుగా వంటరిగా గదిలో కూర్చుంటే ఆలోచనలు పుడతాయి. పెరుగుతాయి. అల్లుకుంటాయి.
- రావిశాస్త్రి , రత్తాలు - రాంబాబు

**అద్దె**

అద్దె విషయంలో, యజమాని ప్రతిఫలం లాగుతుంటాడు. అద్దెకున్నవాడు తాత్కాలికంగా ఉంటూంటాడు. హక్కు వారిదీ, భుక్తం వీరిదీ!
- భమిడిపాటి, అద్దె కొంపలు

**అద్దెకొంప**

జీవుడికి శరీరాలు అద్దె కొంపలు.
- భమిడిపాటి, అద్దె కొంపలు

**అద్భుతం**

చరిత్ర ఎన్నిసార్లయినా పునరావృత్తం కానియ్యి స్త్రీ పురుషుడికి ఎప్పుడూ అద్భుతమే.
- వేణుగోపాలరావు, కదిలేమేఘం

**అద్వైతం**

తెలుసుకునే మనసు
తెలిసే లోకం
తెలిపే ఈశ్వరుడు
అన్నీ వొకటే
- చలం, సుధ

ఒక్కొక్కప్పుడు అమాయకుడు, తెలివైనవాడు, మూర్ఖుడు, పిచ్చివాడూ ఇంకా చాలామంది ఒక్కలాగే కనిపిస్తారు.
- శివప్రసాద్, నైట్‌డ్యూటీ నర్స్

తలుపులు రెండుకాని, ద్వారం ఒక్కటే.. రాత్రి పగళ్లు రెండుకాని రోజు ఒక్కటే. తల్లిబాధ, పిల్ల ఏడుపు రెండుకాని ప్రేమ ఒక్కటే. చావుపుట్టుకలు రెండు - జీవిత మొక్కటే.
- బుచ్చిబాబు, ఒమర్ ఖయామ్

వేరేగతి లేనప్పుడు బలవంతమూ స్వతంత్రమూ ఒక్కటే అవుతుందేమో!
- రాజమన్నారు, మనోరమ

అన్నీ తెలినోళ్ళే అద్దోయితంలో పడేది.
- సుంకర, దిద్దుబాటు

డబ్బు బంగారవేఁ నిత్తెం సత్తెం! అది ఆత్మతీరి! దీన్నే అద్దువైతం అంటారు పెద్దలు.
- రావిశాస్త్రి, బంగారిగాడి కత

కల దననోపక లేదని
పలుకఁగ నేరకయు మూకబధిరులక్రియ ని
మ్ముల నద్వైతులు దమలో
పల వగతురు భువనభిన్నభావమున శివా!
-మల్లికార్జునపండితారాధ్యులు, శివతత్త్వసారము

స్వేచ్ఛాచారులు మిథ్యా
విచ్ఛేదన వేదశాస్త్ర విప్లవవాదుల్
ప్రచ్ఛన్నదోష లజ్జా
నాచ్ఛాదితదుష్టచిత్తు లద్వైతు లజా!
-మల్లికార్జునపండితారాధ్యులు, శివతత్త్వసారము

**అద్వైతి**

వాడు చెడ్డాడు తాగుబోతు, నాకు ముంతెడు కల్లు పొయ్యి అన్నాడట.
- సామెత

**అధమదాత**

వాంఛ నెఱిఁగియు నర్థార్థి వచనదైన్య
మాత్మ సహియింపఁ జాలువాఁ డధమదాత
- శ్రీనాథుడు, శృంగార నైషధము

**అధముడు**

ఒక్క మాటలోనే జవాబు చెప్పగలిగిన వుద్యోగి అధముడు.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

**అధర్మం**

అధర్మము కూడా తాను ధర్మమునే వాంఛించును.

- విశ్వనాథ, బద్దన్న సేనాని

లోకమే చీకటియై విపత్తులకు చిక్కిననాడు తపంబు మోక్షమున్, చేకొని ముక్కుమూసు కొని చెట్టులగుట్టలఁ బట్ట ధర్మమే?

- కొడాలి, హంపీక్షేత్రము

**అధిక ప్రసంగం**

అధిక ప్రసంగం ఆలస్యానికి హేతువు.

- గురజాడ, కొండుభట్టీయము

**అధికం**

మూసి పెట్టినది పైకిఁదీయుటకు, మాటు పఱచినది చూచుటకుఁ, జెప్పనిది తెలిసికొను టకు వాంఛ జనులకు మహాధికమైయుండును.

- పానుగంటి, వీరమతి

**అధికారం**

విధి సంకల్పముచే నొకానొకఁడు తావిశ్వంబుఁ బాలించుచో
బధిరం బెక్కువ, చూపు తక్కువ, సదాభాషల్ దురుక్తుల్, మనో
వ్యధతో మత్తతతోడ దుర్వ్యసనదుర్వ్యాపార తల్ చెందు;న
య్యధికారాంతమునందు చూడవలెరా! ఆయయ్య సౌభాగ్యముల్

- చాటువు

ఇతరులకు అప్పగించినప్పుడే అధికారమునకు ప్రశస్తి.

- వరద, నాట్యగోష్ఠి

నూరుమంది నేరస్తులు చేయలేని ఘోరం చట్టాన్ని రక్షించాల్సిన పదవిలో వున్న అధికారి సునాయాసంగా చేయగలడు.

- లల్లాదేవి, యశోధర

మార్పును ప్రతిఘటించటానికి అధికారం అడ్డమైన వాదనల గడ్డి మేస్తున్నది.

- కుందుర్తి, తెలంగాణ

(మీ నాన్న) తన హోదా తప్ప యితరుల హోదాల విషయం మాట్లాడరు.

- రామదాసు, ఆకాశరామన్న

ఆలాగున నామీఁద మీరధికారము చెలాయించ వలెనంటే నన్ను పెండ్లి చేసుకోవడము మాని వేసి పెంచుకోలేక పోయినారా యేమిటి?

- కొచ్చెర్లకోట, అపవాదతరంగిణి

న్యాయంకానీ, అన్యాయంకానీ అధికారానికి అల వాటుపడ్డ మగవాడు ఆడది నోరెత్తి జవాబు చెప్తే సహించలేడు.

- రంగనాయకమ్మ, పేకమేడలు

సేతిలో పవరుంటే నెత్తికి పొగరెక్కుతుంది.

- రావిశాస్త్రి, అధికారి

నీకూ నాకూ అన్నేయంకాని పోలీసోడిక్కాదు. ఆడి చేతిలో పవరుంది.

- రావిశాస్త్రి, ఆరుచిత్రాలు

అధికారం రాగానే మంచి చెడుగులు మరపున పడతాయి.

- జి.వి.కృష్ణరావు, పాపికొండలు

ఏదైనా చేద్దాం అన్నవాళ్ళకి చేసే అధికారం వుండదు.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

అధికారము, హోదా, రాజు సభకి ధరించే కిరీటమూ, బట్టలూ వంటివి. వాటిని ధరించిన మనిషి కొండముచ్చయినా కామధేనువులా కనిపిస్తాడు. వాటిని తీసీగానే కామధేనువయినా కొండముచ్చులా కనిపిస్తాడు.

- వెంకటరమణారావు, కొలువు

పవరు ఉన్నంతకాలం అందరూ ఏదో ఒక స్వలాభం కోసమే చుట్టూ చేరతారు.

- వెంకటరమణారావు, కొలువు

కొందరధికారులకు కన్నులు తిన్నగఁ గనఁబడవు. కన్నులు పొరలుగప్పి పోవును. అధికారమదము దృష్టి కడ్డము వచ్చును.

- చిలకమర్తి, తుంబురునారదసంవాదము

అధికారముగల వారిలో పెక్కుమందికి కన్నులు మునుపున్నచోట నుండవు. కన్నులు నెత్తికి వచ్చును.

- చిలకమర్తి, తుంబురునారదసంవాదము

సంపద ముదిరితే అది పవర్‌గా పరిణమించి పరిమళిస్తుం దనుకుంటాను.

- రావిశాస్త్రి, ఋక్కులు

అధికారం కాగితం కండ్లలో యథార్థాల గుండు

సూదులు గుచ్చినా అది గుడ్డిదవుతుంది కాని లోకాన్ని చూడలేదు.
- కుందుర్తి, తెలంగాణ

అధికార్ల లీలలు చిత్రమైనవి.
- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

దేవుడు అందరిలోనూ వున్నట్టు అధికారం యొక్క శక్తి ప్రభుత్వంలోని అతి చిన్న జీవిలో కూడా అతిచిన్న పాలులోనన్నా వుండి రేడి యమ్‌లా ప్రకాశిస్తుంది.
- వెంకటరమణారావు, కొలువు

**అధికారి**

ఆక్రమించుకొన్నవాడే అధికారి.
- ఉన్నవ, నాయకురాలు

ఈ పెద్ద వుద్యోగస్థులకి దయలూ, దాక్షిణ్యాలూ యేవీంటీ గురూ!
- గురజాడ, కన్యాశుల్కం

తనకన్న తెలివైన సబార్డినేటును ఏ అధికారీ భరించలేడు.
- నిరుద్యోగి, కార్యాలయభేతాళవిక్రమార్కీయం

యీ అధికార్ల నైజం యేమిటంటే, యెవళ్ళ మీద దయవుంటే, యెవళ్ల పక్షం కేస్ చెయ్యా లంటే వాళ్ళని కరవ్వొచ్చినట్టు కనబడతారు.
- గురజాడ, కన్యాశుల్కం

అధికారి కానివానికి
నధికపదవిఁ దెలుపఁ బ్రాప్తమయ్యెడు పాపం
బధికారియైన వానికి
నధిక పదవిఁ దెలుపకున్న నగు నిక్కముగన్.
- పింగళి, కళాపూర్ణోదయము

...నిక్కమ్ముగ నొక్కనిం గొలుచుకంటెను దొంగ టికంబు తక్కువే?
- తి.వేం., మృచ్ఛకటికము

కంచెయే చేనుమేసినఁ గలదె దిక్కు?
- చిలకమర్తి, గయోపాఖ్యానము

ఎగ్గుల్
నొడివెడు వివేకశూన్యుల
కడ నుండెడునంతకంటెఁ గష్టము గలదే.
- నన్నయ, ఆదిపర్వము

ఎప్పుడుఁ దప్పులు వెదకెడు
నప్పురుషునిఁ గొల్వఁగూడ దది యెట్లన్నన్
సప్పంబు పడగ నీడను
గప్ప వసించిన విధంబుగదరా సుమతీ.
- బద్దెన, సుమతి శతకము

అధరము కదిలియుఁ గదలక
మధురములగు భాషలుడిగి మౌనవ్రతుఁడౌ
నధికార రోగపూరిత
బధిరాంధకశవముఁ జూడఁ బాపము సుమతీ.
- బద్దెన, సుమతి శతకము

నూరు గుర్రాలకు అధికారి, ఇంట భార్యకు ఎండుపూరి.
- సామెత

అధికారికి చెవులుంటాయిగాని కళ్ళుండవు. (చెప్పుడు మాటలు వింటాడేగానీ చూడడు)
- సామెత

**అధికుడు**

పదినీతులు పదిబూతులు
పదిశృంగారములు గల్గు పద్యములు సభన్
జదివినవాఁడే యధికుఁడు
- కవిచౌడప్ప, శతకము

**అధైర్యం**

ధైర్యం సగం జయం, అధైర్యం పూరా అపజయం.
- రావిశాస్త్రి, ఋక్కులు

**అధోగతి**

ఆలోచించిన యాడుదాని కధోగతియే.
- పానుగంటి, విప్రనారాయణ

చేసేవి మాఘస్నానాలు, దూరేవి దొమ్మర గుడిసెలు.
- సామెత

**అధ్యక్షుడు**

అధ్యక్షుని వ్యాపారము తుద కన్నియుపన్యాస ములను ఖండించుటయేయని నేను వినియు న్నాను.
- పానుగంటి, సాక్షి

అవకాశవాదుల సభకు అందరూ అధ్యక్షులే!
- శ్రీరమణ, న్యూసుడి

**అధ్వాన్నం**

పెళ్లిదగ్గరనుంచి చావువరకూ స్త్రీ బ్రతుకు అధ్వాన్నం.
- సూర్యారావు, శ్రీమతులు - శ్రీయుతులు

**అనంతయ్య**

అంతు లేదేమయ్య అంటే నీపేరు అనంతయ్య గదా! అన్నాడట.
- సామెత

**అనరానివి**

దొరను పేద అనరాదు, ఎద్దును సాధువు అన రాదు.
- సామెత

**అనర్థం**

కనిష్ఠీపు కడుపున కన్నపుదొంగ పుట్టినట్టు
- శ్రీరమణ, న్యూనుడి

పైఁబడ వచ్చిన వానికిఁ బడకటిల్లేల?
- ధర్మవరం, విషాదసారంగధరము

**అనర్హుడు**

ప్రేమ కోరిన త్యాగానికి జంకేవాడు ప్రేమ కనర్హుడు.
- చలం, శశాంక

**అనవసరం**

గోదావరి స్నానానికి కొండుభట్ల అనుజ్ఞ
- సామెత

తుంగభద్రలో మునుగను తాతంభట్టాజ్ఞా?
- సామెత

దానం చేసిన ఆవుకు దవడపళ్ళు ఎంచబోకు.
- సామెత

దిగంబర సన్యాసికి చాకలితో అవసరమేమి?
- సామెత

ఇచ్చేవానికి పత్రం వద్దు, చచ్చేవానికి మందు వద్దు.
- సామెత

ఇంటి మొగుడు కుంటివాడైతే, రంకుకు రామేశ్వరం పోవాలనా?
- సామెత

పెళ్లనేది ఆడదానికిగాని, తద్వారా సంఘానికి గాని ఉద్ధరింపుకాదు. వయసుకీ, మనసుకీ ఆన కట్ట కట్టుకోగలిగితే పెళ్ళి అవసరం ఉండదేమో!
- బీనాదేవి, హరిశ్చంద్రమతి

బిడ్డను గిల్లి వూయల వూపినట్లు.
- సామెత

చెడ్డ కాపరానికి ముప్పేమిటి? మొండికాలికి చెప్పేమిటి?
- సామెత

సానిసంతలోన జవ్వన మ్ముడివోవు
పూరుషులకు రసవిచార మేల?
- ఏటుకూరి, మగువ మాంచాల

కడుపుఁ గక్కుఁటితికి నిచ్చకమ్ములాడి
చేదుమేసెడు వారింటఁ జీమ్గ్రైనఁ
గుడువ దనుమాట రవ్వంత గుర్తెఱుంగు
కార్మికున కెందు కా స్వర్గఖండమైన?
- ఏటుకూరి, క్షేత్రలక్ష్మి

**అనాథ**

ఊరి పిడుగు వచ్చి పోలిశెట్టిని కొట్టింది.
- సామెత

**అనాలోచితం**

దస్తూరి బావుందని దస్తాడుకథ అచ్చువేసినట్టు
- శ్రీరమణ, న్యూనుడి

అదిగో పులి అంటే ఇదిగో తోక అన్నాడట
- సామెత

తెలివికి తల లేకపోయినా, భోజనానికి పొట్టఉంది.
- సామెత

**అనుకరణ**

చందమామని చూసి కుక్క ఏడ్చినట్లు,
నక్షత్రాల్నిచూసి నీతో నాహృదయబాధని చెప్పుకున్నాను.
- చలం, మ్యూజింగ్స్

పెద్దవాళ్ళ అలవాట్లే మిగిలినవాళ్ళూ అనుకరిస్తారు.
- మహీధర, ఓనమాలు

ప్రతివిద్యలోనూ కూడా అనుకరించే జనం చాలా వుంటుంది. తత్వం తెలిసినవాళ్లు మిక్కిలి తక్కువగానే వుంటారు.
- వెళ్ళపిళ్ళ, కథలు-గాథలు

నాటి సూఫీ చరితామృతమ్ము
గురిపెంచెడు మా గురుదేవు డేలొకో
తోచు షరాయితో ఫగిడితో నెవరో యొక
పాదుశాహిగా!
- దేవులపల్లి, బ్రహ్మర్షి

**అనుకూలత**

అశుభములు వచ్చునప్పు డయత్నముగనె
బుద్ధులును వాని కనుకూలముగనె తోఁచు
దొంగ యిలు సేరునప్పుడే దొరను వలచి
నిదుర పెద్దమ్మ శయ్యను వదలనట్టు.
- బలిజేపల్లి, సత్యహరిశ్చంద్రీయము

ఏం చేస్తాడు? వాడి కాళ్ళు నాచేతిలో ఉన్నాయి!
- పతంజలి, అప్పన్న సర్దార్

**అనుకూలం**

దున్నబోతే దూడలలోను, మేయబోతే పోతులలోను.
- సామెత

కల్లందగ్గర కరిణీకం, కంచం దగ్గర రెడ్డిరికం.
- సామెత

ఏ కులమైతే నేమిటీ అనుకూలమైతే!
- వేంకటరమణారావు, ఓన్లీ డాటర్

కాలానికి లొంగినవాళ్ళకి కావలసినన్ని
అనుకూలాలు.

- సౌభాగ్య, సింహావలోకనం

ఎత్తినప్పుడు విడియుచో, నిఱకటంపుఁ
దెరువునందు, నడుపు సెడి తిరుగఁబడిన
యట్టియెడ, నిద్రవోయెడు నవసరమున,
శాత్రవుల బెట్టు పైబఁడి చంపవలయు.

- తిక్కన, సౌప్తికపర్వము

కెరటాలతోపాటు పడిలేస్తూ ఈదితే సముద్రం
ఈత సులభమే బాబూ! లేకపోతే మాత్రం....

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

**అనుకోనివి**

కాలు వెనుకాడు వానినే కఱచుఁ గుక్క,
అధిక భయశీలునకె యుపాధ్యాయు తిట్టు
వలదు వలదను వనితకే వచ్చుఁ జూలు,
పరుగిడిన వానినె విఱచి పట్టి చంపు.

- పానుగంటి, వీరమతి

**అనుగ్రహం**

లక్ష్మి అనుగ్రహిస్తే లక్ష నొప్పుల్ని భరించ వొచ్చు తుదకు భగవంతుడు కూడ ఏ పుణ్యాలే శమో చేసుకొన్నవాణ్ణి అనుగ్రహిస్తున్నాడే కాని నిర్నిమిత్తంగా అనుగ్రహించటం లేదు.

- కృష్ణరావు, పాపికొండలు

ఒక దుష్టుడు వేయి ఘోర కార్యములు చేయును. వానిలో నొక్కటియే నెపమై వానిని భగవంతుడు శిక్షించును. భగవంతుడు తన శిక్షయుఁ, దనయనుగ్రహమును లోకమునం దలి వ్యక్తులద్వారా చూపించును.

- విశ్వనాథ, కడిమిచెట్టు

**అనుభవం**

మనిషి జీవితం
అనుభవాంకితం.

- సినారె, విశ్వంభర

అనుభవమొక సాలెగూడు
అనుభూతియె నేతగాడు!

- రమణారెడ్డి, కలలో వెన్నెల

ఎవరి అభిప్రాయమయినా వాళ్ల అనుభవం నుంచే ఏర్పడుతుంది.

- వివినమూర్తి, ఉద్యమం

మినుమంతయు నొక్కటేకదా- కాని వానెన కుడుము వేరు. రొట్టివేరు. గారెలు వేరు. దోసెలు వేరు. వట్టి వడియములు వేరు. ఇట్లే వాంఛ యొక్కటే యైనను దత్త్వభేదములఁబట్టి యనుభవభేదము లుండును.

- పానుగంటి, మాలతీమాల

ఆశించనిది ఎక్కువైతే అనుభవం తక్కువవు తుంది. ఏమీ ఆశించకపోతే ఉన్నదే అద్భు తంగా అనిపిస్తుంది.

- కవనశర్మ, తూర్పు-పడమర

ఒక మనిషి వంకర ఆలోచనను ఏ చదువూ, ఏ సిలబస్, ఏ గురువూ, ఏ విద్యాసంస్థా, ఏ తల్లీ తండ్రీ, ఏ పరిస్థితులూ మార్చినా, మార్చలేక పోయినా ఓ చేదు అనుభవం మాత్రం మార్చి తీరుతుంది.

- రామమోహనరావు, త్రినేత్రుడు

బొత్తిగా ననుభవ జ్ఞానములేని కేవల శాస్త్రవైద్య మంతగా శ్రేష్ఠమైన కాదుగాని, శాస్త్రజ్ఞాన శూన్య మైన వట్టి యనుభవముమాత్ర మెందుకును గొఱగాదు; ఈ రెండును నొక్కయందుండెనా బంగారమునకు వెలిగారము తోడగునట్లుం డును.

- కందుకూరి, వైద్యులు

ఇట్టియేలినవారల నెందఱినో గనిగదా యతఁడు 'కనకపు సింహాసనమున' అని పద్యము చెప్పి నాఁడు?

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

స్వర్గసౌఖ్యం నరకంలో కెళ్తేగాని తెలుసుకోలేం.

- కొంతారావు, బూచీ

తెల్లజుట్టునాడు ఆర్డరు పెడితే బట్టతలనాటికి . అందిందట.

- శ్రీరమణ, న్యూసుడి

తడిసిగాని గుడిసె కట్టడు, తాకిగాని మొగ్గడు.

- సామెత

**అనుమతి**

కోడలు నవలరాస్తానంటే వద్దనే అత్త వుండునా?

- శ్రీరమణ, న్యూసుడి

**అనుమానం**

నీ అనుమానం ముల్లు అపజయం వేపు మొగ్గు తుంది.

- మధుబాబు, అంతఃప్రవాహం

అనుమానం వెంటనే తీర్చుకోకపోతే ఆయు క్షీణం, ప్రమాదం.

- భమిడిపాటి, ఇప్పుడు - బాగుబాగు

వసిష్ఠునట్టి పురుషునైన నరుంధతియట్టి భార్య

యైనను నిర్నిమిత్తంబున స్త్రీ విషయంబునందు సంశయింపకుండ దిది స్త్రీలకు నైజంబు.
- నన్నయ, ఆదిపర్వము

అంతా బావలే! అయితే, కోడిపెట్ట ఏమైనట్లు?
- సామెత

చుట్టురా శ్రీవైష్ణవులే, చూస్తే కల్లుకుండ లేదు
- సామెత

అనుమాన మెక్కడలేని సౌఖ్యభంగమును గలిగించును.
- కొచ్చెర్లకోట, అపవాద తరంగిణి

అనుమానం అనేది మనుషులకు కలగకుండానే వుండాలిగానీ, అది కలిగిందా యిహ వాళ్ళకు నిజవిషయాలు అనవసరం.
- నంది, నైమిశారణ్యం

అనుమానమనేది పడకుండానే ఉండాలిగాని పడ్డ తరువాత అది ధృఢపడేటందుకు ఎంత ఆధారమైనా చిక్కుతుంది.
- కొడవటిగంటి, పతివ్రతామహిమ

**అనురాగం**

దురంత పద్మవ్యూహాలవల్ల కానిది
రవంత అనురాగంవల్ల ఔతుంది.
- సినారె, మంటలూ మానవుడూ

కట్టుకొన్న దానిపై ననురాగముకంటె నుంచుకొన్న దానిపై ననురాగము కాముకున కధికము కదా!
- పానుగంటి, ప్రచండ చాణక్యము

యథార్థమైన యనురాగము లేదు. సంసారాను రాగమే యిటు చట్టుబండలై పోవగ నింక జనా నురాగమా? అబ్బ! ఎంతమాట! వ్రాతలలో - కూతలలో అంతే. మఱెక్కడ ననురాగము లేదు. ఉన్నదొక్క యాత్మానురాగము. ప్రపంచ చర్యలన్నియు దయాధర్మ ప్రేరితములని మీరు భ్రమించుచున్న కర్మములన్నియు - దాని వల ననే జరుగుచున్నవి.
- పానుగంటి, సాక్షి

**అనువాదం**

ఒక్కొక్క భాషకు ఒక్కొక్క రకమైన మర్యాద లుంటాయి. తూచాలు తప్పక తెనిగించడం పెట్టుకొంటే ఈ భాషా మర్యాదలు మంటగలిసి పోతాయి.
- చెళ్లపిళ్ల, కథలు - గాథలు

**అనుసరణ**

గురువు నిలుచుండి తాగితే శిష్యుడు పరుగె త్తుతూ తాగుతాడా?
- సామెత

తల్లి చేలో మేస్తుంటే దూడ గట్టున మేస్తుందా?
- సామెత

**అనూహ్యం**

నిర్మాతకు నీళ్ళులేవు - ఎక్స్ట్రాకి నీటు తెమ్మన్నార్ట.
- శ్రీరమణ, న్యూసుడి

**అనేకం**

ఒకటే ఒకటి ఏదీ లేదు
సకలం ఆమ్రేడితం
దేవుడుకూడా ఒంటరి కాదు
దేవీసమేతుడు
- బాపురెడ్డి, ఒక పుట

**అనైక్యం**

జ్ఞాతులు దమలోఁ బొందినఁ
జేతోమోదమున వెలిఁగి చెలు లొందుదు ర
న్నీతిం బాసిన విగతవి
భూతిం గడకొఱవులట్లు పొగయుదు రధిపా.
- తిక్కన, ఉద్యోగపర్వము

**అంతరంగం**

ఆర్ద్రహృదయంతో ఎవరైనా వచ్చి తనను తల్లి మాదిరిగా తండ్రిలా సమాశ్వాసించాలన్న అంత రంగంలోని ఘోషే మనచేత అమ్మా, అబ్బ అని పిస్తుంది.
- సరస్వతీదేవి, జీవితానికొక జోడు

**అంతరాత్మ**

చంపేవాడికి అంతరాత్మ ఎప్పుడూ అడ్డురాదు.
- రావిశాస్త్రి, నిజం

అంతరాత్మ ఎక్కడైనా ఉంటుందనుకున్నాను కాని ఖాకీ డ్రెస్సులో ఉంటుందనుకోలేదు.
- రావిశాస్త్రి, నిజం

అంతరాత్మెప్పుడు పనయిన తర్వాత ఏడ్చి తిడు తుందేకాని పనికి ముందు మాత్రం ఎప్పుడు మనకడ్డురాదు. రాకూడదు.
- రావిశాస్త్రి, నిజం

అంతరాత్మ తప్ప మనం ఇంకెవరికీ భయపడన క్కరలేదు!
- ఆనందారామం, అద్దంలో శత్రువు

అంతరాత్మలకు ఒక్కొక్కప్పుడు కించిత్తయినా ప్రపంచజ్ఞానం ఉండదు. అవి మనచేత ఎన్నో బుద్ధిమాలిన పనులు చేయిస్తాయి.
- కొడవటిగంటి, చదువు

నా అంతరాత్మ ఏనాడో చచ్చిపోయింది.
- నంది, మనిషి చావకూడదు

అంతరాత్మ నంగడిలో
అమ్మి సొమ్ముజేసుకో
సానితనమె సకల కళల
సారమ్మని తెలుసుకో
- మల్లారెడ్డి, తారకమంత్రం

వెధవపని చేసిన అంతరాత్మలు కుడతాయి.
- కొడవటిగంటి, జీవితేచ్ఛ

అంతరాత్మను లక్ష్యంచేసి ఏ ఆడది
నెగ్గుకురాగలదు?
- కొడవటిగంటి, నిజం దాగదు

ఆడదానికి ఆత్మైక్యముంది.... ఆఖరికి
పురాణాల్లో కూడా లేదు ..
- బుచ్చిబాబు, స్వతంత్రజీవులు

అంతరాత్మ అనేది ఉన్న ఆడదానికి సుఖం లేదు.
- కొడవటిగంటి, రాయబారి

**అంతర్జాతీయత**

అంతర్జాతీయ వ్యవహారాలపట్ల ఎక్కువ కుతూహలం కనబరిస్తే, వంటింట్లో అవతరించిన పేచీవల్లనే అంటూండేవాడు మా ప్రొఫెసర్.
- బుచ్చిబాబు, గొలుసు

**అంతర్ధానం**

పూర్వసింహాసనంబులు, ప్రోజ్జ్వలంపు
మణిమయ కిరీటములు, భోగమందిరములు
చక్రసంఘర్షణంబునఁ జదిసిపోయి
అవియివి యనంగరాక, రూపటెడి నేఁడు.
- దువ్వూరి, స్వాతంత్ర్యరథము

**అంతర్మథనం**

అంతర్‌మథనం ఎప్పుడు ప్రారంభం అవుతుందో అప్పుడు అది ఎదుగుదలవైపు దారి తీస్తుంది. దానికి పెద్దసంఘటనలు, కారణాలు అవసరం లేదు.
- వీరేంద్రనాథ్, ఆఖరిపోరాటం

**అంతుపట్టనివి**

మేధస్సు ఒక సాలెగూడు, హృదయం ఒక అరకు లోయ.
- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

**అందం**

ఆడదానికి పేదరికం ఒక శాపం అయితే పేదరికంలో అందం ప్రాణగండం వంటిది.
- ఇల్లాదేవి, రోహిణి

అందం నిజానికి నప్పదు.
- ఎమ్వీయల్, యులిసిస్

సమఉజ్జీలైతేనే పోటీ అందం.
- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

అందం అందరికీ ఆరోగ్యకరం కాదు. కొందరికి ఇబ్బంది. కొందరికి ప్రాణసంకటం కూడాను.
- వెంకటనరసింహారావు, సిన్

స్త్రీలు కామమోహితులైన పురుషులకంటి కంద
గత్తెలవలెఁ గన్పింతురుకాని, నిజముగాఁ
బురుషులే యందగాండ్రు.
- విశ్వనాథ, వేమరాజు

అందమైన బాలికలు ఉండటమే లోకానికి ఆపత్తు.
- బాపిరాజు, కోనంగి

సముద్రానికి మనుషులవల్ల అందం తెచ్చుకోవాల్సిన ఖర్మలేదు. మనుషులకే ఆ అవస్థ.
- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

మందలించడంలో కూడా అందం ఉంది.
- రంగనాయకమ్మ, పేకమేడలు

కోపం వచ్చినప్పుడే ఆఁడది చాలా అందంగా ఉంటుంది.
- శివరామశాస్త్రి, చెంబు

అర్థం కానివే అందంగా వుంటాయి సార్.
- ముద్దంశెట్టి, జ్వలితజ్వాల

చక్కదనము చెప్పుకునేందుకు, వర్ణించేందుకు, వీలైతే పాడుచేసేందుకుకాని, పెళ్ళికి కాదండి.
- బుచ్చిబాబు, తీసినతెర

అందాన్ని కొద్దిగా చెరిపితేచాలు, అనాకారితనమవుతుంది.
- కొడవటిగంటి, అనామిక

వెనుదిక్కులేకుంట వెలది కందమ్ము
మస్తుగా తింటేనె మగువ కందమ్ము
అత్తమామలు చస్తె అతివ కందమ్ము
దొంగదూడకు గుదికర్ర అందమ్ము
దొంగమగనికి పెంకిపెండ్ల మందమ్ము
- దంపుళ్లపాట (జానపదగేయం)

కొంతమంది ఒకవైపుగాకపోతే, రెండోవైపు నుంచి అయినా అందంగా కనబడతారు.
- మునిమాణిక్యం, ఘోషా

ప్రజలందరూ సమానులే- అందం, బలం వున్నవాళ్లు తప్ప తక్కినవాళ్లు. బలాన్నింపైనా ప్రభుత్వాలు రక్షించగలరుగాని, అందంనించి మను

షల్ని ఏ బాంబులూ రక్షించలేవు. విప్లవోద్రేకంలో మనుషులు ఎంత పశువులుగా మారినా సరే.

- చలం, వాళ్ళు నలుగురూ

శరీర సౌందర్యము సర్వజంతు సామాన్యమైనది. అది కాకికున్నది- గాడిదకున్నది- చిరుత పులికున్నది- సింహమునకున్నది- కోతికున్నది- గొంగళి పురుగుకున్నది ప్రపంచమున సౌందర్యవంతముకాని శరీరమేది? అన్నియూనట్టివే.

- పానుగంటి, సాక్షి

ఆడది మెచ్చిందే అందం! మొగాడి కన్ను మసక.

- గురజాడ, కన్యాశుల్కం

అందమైన ఆడది బలవంతుని ఆస్తి.

- సూరి, చంఘీజ్ ఖాన్

అందరిలాగా వుండకపోవడమే అందం కాదేటి?

- కాంతారావు, వంశధార

నడవడికంటే సుందరమైనది ప్రపంచమున వేఱొకటి లేదు.

- పానుగంటి, సాక్షి

సౌందర్య లక్షణములో జేరని వెఱ్ఱి వికారము లేవియు లేవు. ఎవరి మతిమాలితనము వానికి సౌందర్యము.

- పానుగంటి, సాక్షి

వజ్రముచే బంగారమునకు శోభ- పుష్పముచే వృక్షమునకు శోభ- సత్యముచే వాణికి శోభ- దైవభక్తిచే హృదయమునకు శోభ- పడతిచే భవనమునకు శోభ.

- పానుగంటి, సాక్షి

**అందటం**

అందితే సిగ, అందకుంటే కాళ్ళు.

- సామెత

**అందలమెక్కటం**

అక్కన్న మాదన్నగార్లు అందలమెక్కితే, సాటికి నరసప్ప చెరువు కట్ట ఎక్కినాడట.

- సామెత

**అన్న**

పెడితే పెద్దన్నా పెట్టకపోతే ఎద్దన్నా.

- సామెత

**అన్నం**

సారవంతమైన గంజిని కాలువ పాలు చేసి పిప్పిని "అన్నం" అనుకొని నాగరికులం తింటాం.

- చాసో, బొండుమల్లెలు

అన్నం పరబ్రహ్మ స్వరూపం- అందుకు అన్వేషణ తప్పదు. పరబ్రహ్మాన్ని అన్వేషించడమే జీవిత లక్ష్యమని అన్ని మతాలూ అంగీకరిస్తాయి.

- చాసో, పరబ్రహ్మ

యేఁవందోయి నీ ఉపనిషత్తు? "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్".

- గురజాడ, కన్యాశుల్కం

అలగావాండ్లకు అన్నం దొరికే మార్గం జూపందే సాంఘిక హక్కులిచ్చినా ప్రయోజనకారులు గావు. అవి నిలుపుకునే శక్తి గూడా వారికుండదు.

- ఉన్నవ, మాలపల్లి

పేద కడుపు నింపను అన్నం వెదకును, మహారాజు అన్నం నింపను కడుపు వెదకును.

- సామెత

గొంగట్లో అన్నం తింటూ వెంట్రుకలు ఏరినట్లు.

- సామెత

నీ పెండ్లాం ముండమోస్తే నీకు ఎవరు అన్నం పెడతారు అని అడిగినాడట.

- సామెత

**అన్యాయం**

చాలఁగాలంబు పోవక చతురులైన
వృద్ధజనముల బుద్ధులు వింద్రుగాక
ముదియ మతిదప్పి నోరికి నొదవినట్లు
పలుకు వెడఁగుల మాటలు పాటియగునె?

- తిక్కన, ఉద్యోగపర్వము

పలువు రొక్కనితోఁ బోరఁ బాడి యగునె?

- తిక్కన, శల్యపర్వము

'అన్యాయం పాపం నాశనం' అన్నారు. ఒక్క అన్యాయంతో పాపాలన్నీ పోతాయి.

- గురజాడ, కన్యాశుల్కం

రెండు న్యాయాలకు పరస్పర వైరం ఉండటం అన్యాయమే.

- కొడవటిగంటి, నిరాకరణ

ఈ ప్రపంచంలో సాధారణంగా అన్యాయమే అక్కరకు వస్తుంది.

- కందుకూరి, హాస్యసంజీవని

బ్రహ్మదేవుడు సోమయాజులుగారికి రంభను సృష్టించి సోమిదేవికి మాత్రం అన్యాయం చేస్తాడా యేమిషి?

- కందుకూరి, హాస్యసంజీవని

అన్యాయాన్ని ఎక్కడున్నా ఎదుర్కోవాలి.

- కె.ఎల్, కొడిగట్టిన దీపాలు

రాజులు చేయు నన్యాయములు తదధికారుల ద్వారా జరుగును. ఆ యధికారు లందులోఁ దమ దుర్బుద్ధిఁ జొనిపి రాజుద్దేశించిన యన్యాయమునకుఁ బదిరెట్లు జరుపుదురు.

- విశ్వనాథ, కడిమిచెట్టు

అడిగింది రొట్టె, ఇచ్చింది రాయి.

- సామెత

అన్యాయం ఎవ్వడ్ని బాగుజేస్తాది? ఎండు దురదల మీద వేన్నీళ్ళు పోసుకొని గోక్కున్నట్టుగ ఆ గడియకే సుకంగా ఉంటాది. తరువాత మండిపోతాది.

-- భూషణం, కొండగాలి

దిగంబర కవికి దుశ్శాలువలు కప్పుట ధర్మమా?

- శ్రీరమణ, న్యూసుడి

చెమ్మటోడ్చి ప్రపంచమునకు
భోజనముఁబెట్టువానికి భుక్తిలేదు.

- జాషువా, గబ్బిలం

మలినదేహుల మాల లనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెల వొసంగిన వర్ణధర్మ మధర్మధర్మంబే

- గురజాడ, లవణరాజుకల

## అన్యోన్యం

నిర్ధనత కసత్యము వలె, నిపుణగాన
మునకుఁ గచ్చవదలుతనమువలె, సంప
దకు దురాశలాగున,బంకుతనమునకును
దబుచుగా దొంగతనమును వబలుఁగాదె?

- పానుగంటి, ప్రచండ చాణక్యము

వేసిన ప్రశ్న -ఒప్పైనా ప్రత్యుత్తరం తప్పేనని ప్రత్యుత్తరం తప్పైతే వేసిన ప్రశ్న తప్పేనని.

- బైరాగి, హామ్లెట్ స్వగతం

అత్తలేనీ కోడ ఉత్తమురాలు, కోడలూ లేనత్త గుణవంతురాలు.

- సామెత

బ్రహ్మం వంటి గురువుంటే సిద్ధయ్య వంటి శిష్యుడు ఉండనే ఉంటాడు.

- సామెత

చెడిన కాపురానికి ముప్పేమిటి? చంద్రకాంతలు వండే పెండ్లామా? అంటే, అయిన అప్పుడు అంతే మిటి? అవే వండుతాను మగడా! అన్నదట.

- సామెత

గాఢమైన ప్రేమ వుందా, దాని పక్కన ద్వేషం వుండనే వుంటుంది.

- చలం, మ్యూజింగ్స్

పైవాడు పుచ్చుకునే వాడు వుంటేనే కింద వాళ్లకూ దొరుకుతూ వుంటుంది

- కందుకూరి, హాస్యసంజీవని

పురుషుని ఉత్తమ శక్తిని పైకి విజృంభింప చేయడానికి స్త్రీయున్నూ, స్త్రీయొక్క పవిత్రశక్తిని తేజరిల్లజేయడానికి పురుషుడున్నూ వుద్భవించారు

- బాపిరాజు, భోగీర్‌లోయ

నిత్యావసర వస్తువుల ధరలను అదుపులో పెట్టదు ప్రభుత్వం. పెట్టలేదు. ఎందువల్ల? ఎందువల్ల నంటే మరీ బావుంది. పెట్టుబడిదారులను అదుపులో పెడితే భూరివిరాళా లిచ్చే దెవరు? విరాళాలు లేకుండా ఓట్లు కొనుగోలు చేసేదెలాగు?

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

## అన్వేషణ

సత్యాన్ని అన్వేషించిన కొద్దీ అసత్యం అనేది లేదని తెలుస్తుంది.

- చలం, మ్యూజింగ్స్

ఇది ముగియబోని ఏ యర్థ మెరుగరాని
వేసటే లేని వెర్రి యన్వేషణమ్ము!

- దేవులపల్లి, కృష్ణపక్షము

## అపకారం

మనిషి నుంచి మనిషికి సాధ్యమైనంత హెచ్చుఉపకారమూ, సాధ్యమైనంత తక్కువ అపకారమూ జరిగేటట్టు చూసుకోవటమే సరి అయిన ప్రవర్తన.

- కొడవటిగంటి, చెడిపోయిన మనిషి

## అపకీర్తి

శరీరములు వోవుఁ గాని చన వపకీర్తుల్

- తి. వేం., పాండవాశ్వమేధము

అపకీర్తియు, సత్కీర్తియు,
నుపమింపఁగ నొక్కరూప...

- జగ్గకవి, చంద్రరేఖావిలాపము

## అపచారం

తెలుగులో రాస్తే ఆంధ్రత్వానికి తీరని అపచారం కాదా మరి?

- లక్ష్మణరావు, అతడు-ఆమె

## అపనమ్మకం

యెవళ్లను నమ్మినా వైద్యం చేసే గాడిద కొడుకులను మాత్రం యెంత మాత్రమూ నమ్మరాదు.

- కందుకూరి, హాస్యసంజీవని

మంత్రుల మాటలు అసలు నమ్మకూడదు.

- పతంజలి, అప్పన్న సర్దార్

మొగుణ్ణి మోసగించిన ఆడదాన్ని ప్రియుడు

ఒక్కనాటికీ నమ్మడేమో!

- ఆనందారామం, ఉరిమే మబ్బులు

ఏనాడూ నిర్హేతుక సానుభూతిని నమ్మరాదు

- కృష్ణరావు, పాపికొండలు

ఉద్యోగి నిజం చెప్పినప్పటికి మరొక ఉద్యోగి దానిని నమ్మకూడదనేది కార్యాలయాలలోని వర్కింగ్ ఫార్ములా.

- నిరుద్యోగి, కాళ్లబేరం

**అపరబుద్ధి**

పురాణం విన్నప్పుడు పుట్టెడు బుద్ధులు, అవతల పోతే అదవ (అపర) బుద్ధులు.

- సామెత

**అపరాధం**

ఆంధ్రలోకోపకారమ్ము నాచరింప
భారతమ్మును నన్నయభట్టు తెలుఁగుఁ
జేయుచున్నాడు; సరియె, బడాయిగాక,
తొలుత సంస్కృత పద్యమెందులకుఁ జెపుఁడీ?

- రామకృష్ణకవులు, ఆంధ్రకవుల అపరాధములు

**అపరిశుభ్రం**

పొడుమెక్కించే ముక్కు, పొగపీల్చే నోరు శుభ్రంగా ఉండవు.

- సామెత

**అపరిహార్యం**

అయాచితోపపన్నంబయిన హితంబు పరిహరిం పఁ బనిలేదు.

- శ్రీనాధుడు, శృంగారనైషధము

**అపవాదం**

అపవాదుకున్న ఆకర్షణ ఈ ప్రపంచంలో ఆడదానికి లేదు. అపవాదు ఇచ్చే ఆహ్లాదం మరొకటి ఇవ్వలేదు.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

**అపవిత్రత**

చెట్టుకి పేడవేశామని పుష్పాలకేమైనా అపవిత్రత వచ్చిందా?

- గురజాడ, కొండుభట్టీయము

**అపశకునం**

లక్షణం పల్కరా పెళ్లికొడుకా అంటే ఐరేని కుండ పదహారు వక్కలు అన్నట్లు.

- సామెత

లొట్టిపిటకూల రోకళ్ళంగాని పోదుగదా!

- కాళ్లకూరి, పద్మవ్యూహము

**అపాయకరం**

అమితమైన దెప్పు టపాయకరమేకదా?

- పానుగంటి, రాధాకృష్ణ

అహితులను చేరనిస్తే ఎంత అపాయమో
విహితులను పారగొట్టినా అంత అపాయమే.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, వడ్లగింజలు

ఆడదానికీ, మొగవాడికీ వుత్త స్నేహముండి, అన్ని వీళ్ళూ వుండి, పడకలు లేకపోతే అది చాలా అసహజం. అందువల్ల అపాయకరం.

- చలం, ఆ రాత్రి

**అపాయం**

ఆలోచనలు తక్కువైతే అపాయాలెక్కువౌతాయి.

- పినిశెట్టి, పల్లెపడుచు

**అపార్థం**

హీరోయిన్ హీరోని అపార్థం చేసుకుంటే కథ మరీ రక్తికడుతుంది.

- ఆనందారామం, మళ్ళీ వచ్చిన వసంతం

ఇతర్లను అర్థం చేసుకోవటంకంటే అపార్థం చేసుకోటం ఎక్కువ సులభం. అర్థం చేసుకోటానికి అనుశీలన అవసరం, ఆలోచన అవసరం, అంతర్దృష్టి అవసరం. అపార్థం చేసుకోటానికి ఇవేమీ అవసరం లేదు.

- సంజీవదేవ్, రూపారూపాలు

మనుష్యులను అపార్థం చేసుకోవడం సులభం. అర్థం చేసుకోవడం కష్టం.

- గోపాలచక్రవర్తి, సోషలిస్టు రామి

**అపూపం**

మూలవిగ్రహమునకు సమర్పింపఁబడిన యపూపము లర్చకుని యుదరపూరణమునకే గదా?

- పానుగంటి, రాధాకృష్ణ

**అపౌరుషేయం**

పుకార్లు కూడా అపౌరుషేయాలు

- కాళోజీ, పుకార్లు

**అప్పగింత**

దాని మొగుడూ దండూబోయె
దానికేమీ చెప్పేపోయె?
వట్టిచేపలు వర్రికూడా
పక్కలోకీ పొశెగాడూ!

- జానపదగేయం

మాటలు వప్పజెప్పితే నటనమవుతుంది.
మనసులు వప్పజెప్పితే జీవితమవుతుంది.

- ఆత్రేయ, అశ్వఘోషుడు

**అప్పు**

అప్పు లేనివాఁడె యధికసంపన్నుండు.
- వేమన

లోకమం దప్పులు తప్పులు న్నెరుగనేరని
వారెవ్వరైన నుందురే?
- ముళ్లపూడి, ఋణానందలహరి

ఆస్తి ఎప్పుడైతే ఉంటుందో దానివెంట విధిగా అప్పుకూడా ఉండి తీరుతుంది.
- కొడవటిగంటి, బెదిరిన మనుషులు

ఆస్తి ఐపొయ్యాక, అప్పు ఇచ్చేవాడే కరువైనందు వల్ల, అప్పులేదు.
- ధనికొండ, ఎర్రబుట్టలు

అప్పు ఆడదైనా చెయ్యగలదు. కాని అది తీర్చ టంకంటే తనువుతో కైలాసం వెళ్ళటం సుళువు.
- బీనాదేవి, అసలు లేని వడ్డీ

తీరిస్తేమట్టుకు మన అప్పులు తీరుతాయా బ్రదర్?
- రామదాసు, మాస్టర్జీ

ఎంత లేకున్నఁ బరపతి యింతెయున్న
దడిగినను లేదనక యిత్తు రప్పు; గెల్పు
నాఁడు తీర్చెద గెల్వనినాఁడు లేదు
చావకుండఁగఁ గాలంబు జరుగుచుండె.
- తి.వేం, వ్యసన విజయము

అప్పుల వాళ్ళు అగుపడితే, వాయువేగంగా యెగేస్తాడు.
- గురజాడ, కన్యాశుల్కం

డబ్బుచ్చుకున్న తరువాత చచ్చిన శవానికైనా కట్టక తప్పదు.
- గురజాడ, కన్యాశుల్కం

పరపతికి నిదర్శనం అప్పు పుట్టడంకాదు.
అణా పైసలతో అది తీర్చెయ్యగలగడం.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, మార్గదర్శి

అప్పంటూ యిచ్చాక ఇహ కజ్జాలు రావటం ఎంతసేపు?
- ముళ్లపూడి, గుర్నాథంకథ

ఎంత అప్పు తేగలిగితే అంత స్థితిపరుడన్న మాట ఈ రోజుల్లో.
- బుచ్చిబాబు, గొలుసు

రాకరాక పెద్దమొత్తం చేతికొస్తే అదికాస్తా అప్పులాడి యెదానగొట్టడానికి ప్రాణం ఒప్పదు కద.
- ముళ్లపూడి, ప్రమాదము తప్పిన ప్రకారము

వందతో తెమిలిన అప్పు కాస్తా, వెయ్యిదాకా వెళ్ళ లేదని సంతోషపడి దేవుడికో దణ్ణాం బెట్టుకో.
- ముళ్లపూడి, తాతబ్బాయికథ

అడగటం పరువు తక్కువని భయపడకు. అప్పులు మహామహావాళ్ళు చేశారు. జీవితమే ఓ పెద్ద అప్పు.
- ముళ్లపూడి, ఋణోపదేశం

ఈతరం సజ్జు ఉట్టి కుర్రనాగమ్మలు, అప్పు అడగటం కూడా చేతగాదు.
- ముళ్లపూడి, తాతబ్బాయికథ

అప్పు పుట్టించే తాహతూ, పలుకుబడీ ఇవే ఒహడి గొప్పతనానికి గీటురాళ్ళు.
- ముళ్ళపూడి, ఋణోపదేశం

సూర్యుడు సముద్రుడి దగ్గిర అప్పు తీసుకుంటు న్నాడు. ఆయన దగ్గర నుండి భూమి అప్పు తీసుకుంటోంది. దాన్ని సముద్రుడు వాడేసుకుం టున్నాడు. మళ్లీ పైవాడికి అప్పులిస్తున్నాడు.
- ముళ్లపూడి, అప్పారావు కథ

అప్పుల్జెయ్యటంకూడా ఏమంత గొప్పపని కాదు, అయితేనేం? అందులో తలకాయలు మార్చటం, మాటసుళువూ, మనిషిసుళువూ తెలీడం ఉన్నాయి.
- ముళ్లపూడి, తాతబ్బాయి కథ

నువ్వు యే చెడ్డపని చేసినా చెడ్డపేరు పెట్టడా నికి ·గడువుదొరుకుతుందిగాని అప్పిస్తేమటుకు అరక్షణంలో చెడ్డవాడివి అయిపోతావు. దరిమిలా డబ్బు చెడ్డవాడివి, చివరికి స్నేహం, బంధుత్వం చెడ్డవాడివి కూడా అయిపోతావు.
- ముళ్లపూడి, శేషయ్య కథ

అప్పులు చెయ్యటంలో గౌరవమబ్బుతుంది.
- నిరుద్యోగి, ఋణానందలహరిలో ట్విస్టు

**అప్రయోజనం**

తాఁ జేసిందేఁటిది చేంతలేటివి వృథా
శ్రీకాళహస్తీశ్వరా!
- ధూర్జటి, శ్రీకాళహస్తీశ్వర శతకము

అప్రయోజన మభివృద్ధి నతిశయిల్లు
నప్రయోజన మడఁగుఁ గాలాంతరమున
నకట! యీర్ష్యాగ్రహగ్రస్తుఁడైనయట్టి
ఖలుని సంపద విధవ చన్నులను బోలె
- శ్రీనాథుడు, కాశీఖండము

కడుపులోకి వెళ్ళవలసిన నెయ్యి కాల్చేయటం నాకేవీఁ యిష్టంలేదు.
- గురజాడ, కన్యాశుల్కం

అచ్చుపడ నీతిశాస్త్రంబు వచ్చెనేని

బొరి నిరుద్యోగి ఫలసిద్ధిఁ బొందలేఁడు
తెల్ల మంధుండు కరమున దీపముండె
నేని యచటి పదార్థంబుఁ గానలేఁడు
- దూబగుంట, మిత్రలాభము

మర్యాదలేని రాజ్యము
నార్యజనులు లేని సభయు, నదనైన తఱిన్
గార్యముఁ గొనని సచివు చా
తుర్యమ్మును వ్యర్థమండ్రు తొల్లిటి పెద్దల్
- అనంతుడు, భోజరాజీయము

ఎలుకతోలు తెచ్చి యెందాక నుదికిన
నలుపు నలుపె కాని తెలుపు కాదు
కొయ్యబొమ్మఁ దెచ్చి కొట్టిన గుణియౌనె?
- వేమన

తీర్ప నార్ప లేని తీర్పరితనమును
కూర్ప విప్పలేని నేర్పు పనులు
పెట్టిపోయ లేని బీరముల్ వ్యర్థముల్
- వేమన

పెట్టిపోయలేని వట్టిదేబెలు భూమిఁ
బుట్టరేమి వారు గిట్టరేమి
పుట్టలోనఁ జెదలు పుట్టవా గిట్టవా?
- వేమన

సారాసారము లెఱుగని
బేరజులకు బుద్ధిఁజెప్పఁ బెద్దల వశమా?
నీరెంత పోసి పెంచిన
గూరగునా నేలవేము? గువ్వలచెన్నా!
- గువ్వల చెన్న శతకము

కనకపు సింహాసనమున
శునకముఁ గూర్చుండఁబెట్టి శుభలగ్నమునం
దొనరఁగఁ బట్టముఁ గట్టిన
వెనుకటి గుణమేల మాను? వినురా సుమతీ?
- బద్దెన, సుమతి శతకము

అంగహీనుని, నిల్లటంపుటల్లుని, బ్రల్లదంబు పలుకు వానిని, గామినీలోలుని, మరుగుజ్జువానిఁ, జెవుడు గలిగిన వానిం, బంద యగువాని, మామ గారిని వెళ్లిపట్టించువానిని, స్త్రీ వశంవదుని, నిర్ధయునిఁ, బ్రచండకోపనుఁ, బ్రమత్తుని మంత్రిఁజేసిన కార్యభాగంబులు సిద్ధినొందనేఁటివు.
- సముఖం, జైమిని భారతము

ధరఁ దగువారలకుఁ దిర
స్కరణంబును, సతుల కొండు శయ్యయు,నుర్వీ
వరులకు నాజ్ఞాభంగము
సరి నివి యాయుధము లేని చావులు గావే.
- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

గరితలేని యిల్లు దొరలేని తగవును
జింతపండు లేని వింత చవియుఁ
జనవులేని కొలువు శశిలేని రాత్రియు
ముక్కులేని మొగము నొక్కరూపు
- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

తన కుపకారము చేసిన
మనుజునకు న్మేలు గోర మరగక దుఃఖం
బున కట్టుపడక యుండిన
జనుని బ్రదుకు మేఁకయటితి చన్నుంబోలున్
- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

మంత్రము లేని సంధ్యయును, మౌనము లేని తపంబు, వేదవిత్తంత్రము లేని యాగము, బద జ్ఞతలేని కవిత్వమున్, సదా తంత్రులు లేని వీణయును, దానక రాగము లేని గీతమున్, మంత్రులు లేని రాజ్యము, సమానము లిన్నియు వ్యర్థకార్యముల్.
- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

ధాత్రి దరిద్రుఁడు సభల న
పాత్రుడు, కడుమ్రుచ్చు మిత్రబాంధవులయెడం
బుత్రకళత్రంబుల యెడ
శత్రుండఁట వాని బ్రదుకు చౌకయొఁగాదే.
- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

**అప్రశస్తం**

కల్పవృక్షం చుట్టూ గచ్చపొద వున్నట్లు
- సామెత

**అప్రస్తుతం**

భార్యప్రక్కలో భగవద్గీత లెందులకు బాబూ!
ఏవో నాల్గు కళాశాస్త్రపుమాట లాడరాదా?
- పానుగంటి, మాలతీమాల

**అబద్ధం**

మానవత్వం బతికివుందనడం అబద్ధం
- నగ్నముని, కొయ్యగుర్రం

అబద్ధంలోని మజా నిబద్ధిలో రాదు
అద్దంలో బిగించిన అందం యథార్థంకాదు.
- గిరీశం, ప్లస్ మైనస్

గట్టుమీద ఉండి తెలిసినట్టు బ్రతుకు వట్టిమాట.
- గణపతిశాస్త్రి, గట్టు!

అబద్ధంమీద నిలిచే మంచి పునాదిలేని గోడలా ఏ క్షణంలోనైనా కూలిపోతుంది.
- సులోచనారాణి, మీనా

ఒక అబద్ధపు వార్త ప్రాచుర్యం పొందినట్లుగా నిజమైన వార్త పొందదు. మనిషికి అబద్ధం

ఇచ్చినంత కిక్కు నిజం ఇవ్వదు.

- సావిత్రి, ఒడిలో చెలిమోహనరాగం

అబద్ధం ఆడటం ఎంత తేలికో అది బయటపడి నప్పుడు దానిని సమర్థించుకోవటం అంత కష్టం.

- ఆనందారామం, ఉరిమే మబ్బులు

అబ్బాయి అబద్ధమాడితే తండ్రి చెంప పగలె య్యమన్నారు.

- బుచ్చిబాబు, గొలుసు

అబద్ధం చెప్పినా అతికినట్లుండాలి.

- ముద్దంశెట్టి, కరిగిన శిల

దేవుడు వున్నాడు అనుకునే మనసు మాయ గనక దేవుడు మాయ. అంటే దేవుడు లేడు. అబద్ధం.

- చలం, మ్యూజింగ్స్

కనుక్కునే వాళ్ళు నిజం కనుక్కునేలోపున మనం ముందే అబద్ధం ఆడేయ్యాలి.

- రావిశాస్త్రి, నిజం

నిజం చెప్పి చావటం కంటె, అబద్ధం చెప్పి బ్రతకటం మంచిది.

- కృష్ణరావు, పాపికొండలు

నిజమేమిటో తెలిసేదాకా ఎంతటి అబద్ధమైనా నిప్పులాగే బతుకుతుంది.

- రామచంద్రమూర్తి, అందరికీ బతుకూ అందులోనే!

సూసినట్టు సెప్పితే అబద్ధం, ఉన్నట్టు సెప్పితే నిజం...

- కాంతారావు, వంశధార

ఓ యనృతమా! నీవు చేసెడి సహాయము తల్లియుఁ జేయలేదుగా?

- చిలకమర్తి చతుర చంద్రహాసము

చను బొంకగఁ బ్రాణాత్యయ
మున, సర్వధనాపహరణమున, వధగా వ
చ్చిన విప్రార్థమున, వధూ
జనసంగమమున, వివాహసమయములందున్

- నన్నయ, ఆదిపర్వము

అబద్ధాల అమ్మకాన్ని ప్రభుత్వాలు జాతిపరం చేస్తాయి.

- ఆరుద్ర, త్వమేవాऽహమ్

అబద్ధాల సాక్ష్యాలవల్ల తప్పించుకోవడం కన్నా జెయిల్లో కూచోడవేఁ ఉత్తమం. ధన ప్రాణాలు రెండూ పోయినా మనిషి అన్నవాడు అసత్యం ఆడకూడదు, ఆడిపించకూడదు.

- గురజాడ, కన్యాశుల్కం

అబద్ధం లేకుండా సాక్ష్యం కావాలంటే యీ భూప్రపంచకమందు యెక్కడైనా సాక్ష్యం అన్నది వుంటుందా?

- గురజాడ, కన్యాశుల్కం

వారిజాక్షులందు వైవాహికములందుఁ
బ్రాణ విత్తమాన భంగమందుఁ
జకితగోకులాగ్రజన్మ రక్షణమందు
బొంకవచ్చు నఘము పొంద దధిప!

- పోతన, భాగవతము

ఆలీసెంగా నిజం చెప్పినా అబద్ధమే అన్నమాట.

- ముళ్లపూడి, బుడుగు

మొగవాళ్ళు అబద్ధం ఆడితే చిల్లర అబద్ధాలు ఆడరు. పెద్దవే ఆడుతారు.

- లక్ష్మణరావు, అతడు ఆమె

హరిశ్చంద్రుడి నోట అబద్ధం రాదు, నానోట నిజం రాదు.

-సామెత

**అబ్బా**

అడవిలో అబ్బా అంటే ఎవడికి పుట్టేవురా కొడకా అన్నట్లు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

**అభయం**

ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన
ప్రాణుల రక్షింపవలయుఁ బ్రభువులకెల్లన్

- పోతన, భాగవతము

**అభాగ్యుడు**

ఈ ప్రపంచంలో ఓ రకం మనుషులున్నారు. బాగు చెయ్యాలనుకొన్నా బాగుపడని వాళ్ళు.

- మారుతీరావు, అనంతం

**అభినయం**

ప్లీడరీ నిజంగా అబద్ధం, అభినయం అబద్ధంగా నిజం.

- భమిడిపాటి, కాలక్షేపం

**అభిప్రాయం**

జాగ్రత్తగా ఆలోచించితే మనిషి అభిప్రాయాలూ, మరో ఏ రెండోవాడి అభిప్రాయాలతోను ఎప్పుడూ సరిపోవు.

- సూరి, చంఘీజ్ ఖాన్

భారతముపై నెవరి యభిప్రాయముండె?
మనుచరిత మొద లేరి సమ్మతులు నిలిపెఁ?
దీపిలేని ఫలమ్ముపైఁ దేనె చిలుక

నేమియగుఁ? దీపిగలదాని కేమివలయు?
- తి.వేం., పాణిగృహీత

**అభిమానం**

అభిమానముఁ గాచుటకై పెనంగెదన్.
- తిక్కన, ద్రోణపర్వము

చచ్చినవాడి మీద ఎంత అభిమానం ఉన్నా వచ్చిన నష్టం ఏముంది?
- సూర్యారావు, చిత్రవధ

అభిమానాలు కూడా మనుషులు వూహించు కునే చిత్రమైన క్రియేనేమో!
- నంది, నైమిశారణ్యం

మేనికిం గగ్గురపాటు పుట్టెఁ గొడుకా! నిను
యుద్ధము చేయఁ బంపఁగన్
- తి.వేం, పాండవ విజయము

మనం ఎవర్నైతే ఎక్కువగా అభిమానిస్తామో వార్నే తీవ్రంగా మందలిస్తాము కూడా.
- పురాణం, అనవసరపు దాంపత్యం

సామాన్యమానవులకు వుండే దేహాభిమానం, ఆత్మాభిమానం, మానాభిమానాలు యివన్నీ యింకా పట్టుకు వదలని వాళ్ళు కళోపాసకులుగా ఎలా పెంపొందగలుగుతారు? కళా తపస్వులు కాలేరు - వేదాంతులు కాలేరు. చివరికి రాజకీయ వేత్తలు కూడా కాలేకపోవచ్చు.
- సూరి, చంఘిజ్‌ఖాన్

**అభిమానవంతుడు**

అభిమానవంతుఁ డెండైన శత్రు
కృత తిరస్కార మెట్లు సహింపనేర్చు?
- లక్ష్మణకవి, సుభాషితరత్నావళి

**అభిరుచి**

అభిరుచి అనేది మనషినిబట్టి భిన్నిస్తుంది.
- సరస్వతీదేవి, సాహిత్యోద్యానము

**అభివృద్ధి**

పోసాకారం ఆదరవూ అవుకాసెం ఉంటే
పెతీవోడూ పైకి రాగల్డు
- రావిశాస్త్రి, బంగారిగాడి కత

భావప్రపంచంలోనుంచి భౌతిక ప్రపంచంలోకి మారేటప్పటి సంధికాలమే మనుష్య జీవితంలో మిక్కిలి రసవత్తరమైన భాగం. సర్వజంతు సామాన్యమయిన యీ మార్పు మానవుని తన మానవత్వం నుండి దేవత్వం వంక ఒక మెట్టెక్కిస్తుంది.
- ఉన్నవ, మాలపల్లి

అసంపూర్ణంగా ఉన్న జ్ఞానాన్ని ఎప్పటికప్పుడు నింపుకోవటమే అభివృద్ధి.
- గోపీచంద్, ఎందుకు

మూడు పార్టీలు - ఆరు చీలికలు
- శ్రీరమణ, న్యూసుడి

**అభేదం**

ఉత్సాహం మోక్షపు మార్గం
నిర్వాణం సామ్యప్రపంచం
నిర్ధాణత క్షయనే చూపుట
నిర్ధాణులు మరణకణమ్ములు
- రమణారెడ్డి, ధమ్మఘోష

డబ్బుకోసం శరీరాన్ని అర్పించే వేశ్యకీ కీర్తికోసం ఆత్మాభిమానాన్ని చంపుకునే రచయితకీ భేదం లేదు.
- పరిమళా సోమేశ్వర్, దర్పణం

సారా దగ్గరా, సాని దగ్గరా - రాజుకూ,
ఫకీరుకూ భేదం లేదు.
- ధనికొండ, పవిత్రులు

గొప్పగా పాడే సమయాన గాయకుడికి, పాడే తనకూ, వినే ప్రజకూ భేదం కనిపించదు.
- చలం, మ్యూజింగ్స్

**అభ్యర్థి**

అడుగని వరమిచ్చు వేల్పులంటూ ఉన్నారురా?
ఎలక్షన్లో నిలిచిన అభ్యర్థులె గురువరా!
- మల్లారెడ్డి, యక్షప్రశ్నలు

అంధకార వృద్ధజగతి
కధినేతలు అభ్యర్థులు
ధనస్వామ్య స్వార్థానికి
వెన్నెముకలు, నిట్రాటలు
- సోమసుందర్, రెండు ప్రపంచాలు

**అభ్యాసం**

పొగడ్తను వినయంతో స్వీకరించటానికి కూడా కొంత అభ్యాసం ఉండాలి.
- కొడవటిగంటి, హరిశ్చంద్రుడి ఆత్మ

**అమలిన శృంగారం**

దైవికంబగు సుకృతినిఁదక్క నవని
జతల ప్రేమోదయంబు సంగతముకాదు,
అందు సస్ఖలిత ప్రణయానురక్తి
చిరతపశ్శుద్ధిచేఁగాని దొరకఁబోదు.
- రాయప్రోలు, తృణకంకణము

**అమలు**

తీర్మానం చెయ్యమంటే అర్ధరాత్రిదాకా కూర్చుని బీర్మానం చేశారట.

- శ్రీరమణ, న్యూసుడి

**అమాయకత**

ప్రభుత్వం పడిపోయింది నాగన్నా అంటే, ముక్కలు ఎక్కడ పడ్డాయి మారాజా అన్నాట్ట.

- శ్రీరమణ, న్యూసుడి

నూలు వండి నూబిండి యెరుగ
వడ్లు బండి వరికూడు ఎరుగా
ముగ్గురు బిడ్డల తల్లినైతీ
మొగుణి గుర్తూ మొదలే ఎరుగా!

- జానపదగేయం

ఘోరమైన నేరాల వెనకకూడా చాలా అమాయకత వుంటుందని తెలుసుకోగల ఔదార్యమూ, తెలివీ, వ్యవధి వుండదు మనుషులకీ, మేజిస్ట్రేట్లకీ.

- చలం, ఆరాత్రి - పాపఫలాలు

కంచి మేక పాపం ఎప్పుడూ
కసాయి వాణ్ణే నమ్ముకుంటుంది

- శ్రీశ్రీ, ఖడ్గసృష్టి

**అమావాస్య**

మనని మనం పోగొట్టుకొన్న దినం మహాలయ అమావాస్య.

- తిలక్, పోయినవజ్రం

**అమృతం**

దేవతలకు అమృతం, వీరులకు విస్కీ.

- రావిశాస్త్రి, నిజం

**అమెరికా**

అమెరికాలో మనుష్యులు బుర్రకిందికీ, కాళ్ళుపైకీ పెట్టి నడుస్తారు.

- గురజాడ, కన్యాశుల్కం

**అంపకాలు**

పెళ్ళి అంపకాలపుడు అందరికీ దుఃఖం పొంగి వస్తుంది. పిల్లను ఎట్లా వదిలించుకుందామా అని తపస్సు చేసిన తల్లిదండ్రులకూ, దాన్ని తమ పిల్లవాడికి చేసుకోనిరాకరించిన బంధువులకు కూడా ఆ క్షణంలో కళ్ళు చెమ్మగిల్లుతాయి.

- కొడవటిగంటి, దిబ్బకథలు

**అమ్మ**

సంతోషం వచ్చినా, దిగులేసినా, దుఃఖం ముంచుకొచ్చినా, దెబ్బతగిలినా అప్రయత్నంగా గుర్తొచ్చే పదం! అమ్మా!

- భాస్కర్, అర్ధరాత్రి ఆడపడుచులు

అమ్మ పెట్టా పెట్టదు, అడుక్కు తినానివ్వదు.

- సామెత

అమ్మకడుపు చూస్తుంది, ఆలు వీపు చూస్తుంది. (ఇంటికి రాగానే వీపున ఏదైనా ముల్లెఉందేమో నని)

- సామెత

అయ్యకు వణుకు ప్రాయం, అమ్మకు కులుకు ప్రాయం.

- సామెత

అయ్య దేశసంచారం, అమ్మ గ్రామసంచారం.

- సామెత

**అమ్మకం**

సెక్స్‌ని బజార్లో అమ్ముతుంటే దానికి విలువేముంది?

- బుచ్చిరెడ్డి, ముత్యాలు-రత్నాలు

కొందరు దేహం మాత్రమే అమ్ముకొంటారు. కొందరు బుద్ధి అమ్ముకొంటారు. కొందరు హృదయమే అమ్ముకొంటారు. యేదీ అమ్ముకోకుండా బ్రతికే పద్ధతి మన దేశంలో యింకా యెవరూ కనిపెట్టలేదు.

- రారా, ఆత్మహత్య-అలసిన గుండెలు

డబ్బుకోసరం నోకం నోకవంతా వడుచుకొంటోంది. డబ్బుకి నాను సారా అమ్ముతున్నాను, డబ్బుకి, సదివిన సదువంతా నువ్వమ్ముతున్నావు. డబ్బుకి పోలీసువాళ్ళు నాయ్యేన్నమ్ముతున్నారు. మందు కోసం పెద్దాసుపత్రికెళ్తే అక్కడ మందు లమ్ముతున్నారు. మంచా లమ్ముతున్నారు. లంజెలు రోడ్లంట, రిచ్చాలంట, కార్లంట తిరిగి ఒళ్ళమ్ముకుంటున్నారు. గుళ్ళోకెళ్ళి కొబ్బరికాయ సెక్కా కాన్వబ్బూ, ఇస్తే ఆ దేవుడి దయే అమ్ముతున్నారు.

- రావిశాస్త్రి, మాయ

**అమ్మలక్కలు**

మహామహా సిటీల్లోనే అమ్మలక్కలకి కొదువ లేదు. చదువుకున్న వాళ్ళల్లోనే వున్నారు కావలసినంత మంది అమ్మలక్కలు. అలాంటప్పుడు టౌన్స్‌లో అలాంటివాళ్ళకి తక్కువేమిటి?

- ఆనందారామం, మరో ముందడుగు

**అమ్మేవాడు**

కొనేవాడికి కోటి కళ్ళయితే అమ్మేవాడికి అవిటిదొకటే.

- సామెత

**అంశం**

దేశం బాగుపడటానికి ఇరవై అంశాలు కావాలా? ఒక్క అంశం చాలు.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

**అయిదుగురు**

బ్రదికి యుండిన నేవురు బ్రదుక వలయుఁ
జచ్చిరేనియు నేవురుఁ జావవలయు

- తి.వేం., పాండవోద్యోగము

నేను మడిసిన నున్న వారేగు రుందు
రతఁడు మడిసిన నాతోడ నైదుగురము

- తి.వేం., పాండవోద్యోగము

**అయినవాడు**

అయినోణ్ని అడిగేదానికంటే, కానోణ్ని కాళ్ళు పట్టుకునేది మేలు.

- సామెత

**అయోమయం**

...దుర్ఘటమైన మృత్యు వంతరవిషయం బయో మయ మనన్వయ కావ్యము మానవాళికిన్.

- జాషువా, ముంటాజమహలు

**అయ్య**

అయ్య దేశ సంచారం, అమ్మ గ్రామసంచారం.

- సామెత

అయ్యకు వణుకుప్రాయం, అమ్మకు కులుకు ప్రాయం.

- సామెత

**అయ్యవారు**

అయ్యవారేం చేస్తున్నారంటే అబద్ధాలాడి సర్దు కుంటున్నారు.

- సామెత

**అరకాసు**

కుంభకర్ణుని నోటికి అరకాసు మజ్జిగా?

- సామెత

**అరవ(లు)**

పాము కరచును, అరవ చెరుచును.

- సామెత

అరవలపొట్ట తమలపాకులకట్ట ఎప్పుడూ తడుపుతూనే ఉండాలి.

- సామెత

సహజాంధ్రద్వేషకుల్ ద్రావిడుల్

- జాషువా, నా కథ

పూటకూళ్ళమ్మ యింట్లో దప్పిక్కి చేరి అరవ చాకిరీ చెయ్యడం.

- గురజాడ, కన్యాశుల్కం

కుట్రలో చాకచక్యంలో మెల్లమెల్లగా సందుచేసు కొని బొమ్మ జెముడులా లోకం అంతటా వ్యాపి స్తారు తమిళులు.

- బుచ్చిబాబు, ఒకే నిద్ర

ఎలాగైనా అరవ్వాడు అరవ్వాడే.

- బుచ్చిబాబు, ఒకే నిద్ర

పార్ట్నర్ అరవ సోదరుడాయె. చీకాకు పడడు?

- బుచ్చిబాబు, ఒకే నిద్ర

చస్తే అరవ్వాణ్ణి నమ్మకూడదు.

- బుచ్చిబాబు, ఒకేనిద్ర - ఎన్నో కలలు

అరవలేని దేశం కాకిలేని ఊరు లేవు.

- సామెత

ప్రతిదానికీ అరవ్వాళ్లమీద ఆధారపడకండి.

- కొడవటిగంటి సాహిత్యం

మేఁతఁ గరిపిల్ల పోరున మేకపిల్ల
పాఱుఁబోతుతనంబునఁ బందిపిల్ల
ఎల్లపనులను జెఱుపంగఁ బిల్లిపిల్ల
అందమున గోఁతిపిల్ల యా యఱవపిల్ల

- శ్రీనాథుడు, చాటువు

**అరవటం**

ఆవు, దూడ వుండగా మధ్యన గుంజ అరిచిందట.

- పినిశెట్టి, పల్లెపడుచు

**అరాచకం**

అరాజకమనేది చరిత్రకు తరచుగా వచ్చే జ్వరం. అది చరిత్ర అంత ప్రాచీనమైనది.

- కొడవటిగంటి, ప్రశాంతి

**అరిష్టం**

దేశంలో ఉంటున్న అరిష్టానికంతకీ కారణం కోర్టు లేనందూ - కోర్టులూ, వాటిని పట్టుకుని వేల్లాడే ప్లీడర్లూ.

- బుచ్చిబాబు, ఆద్యంతాలు, మధ్య 'రాధ'

**అరుదు**

ఈ ప్రపంచంలో అతి ప్రియమైనవన్నీ అరుదు గానే లభిస్తాయి.

- కౌసల్యాదేవి, కల్పన

**అర్జంటు**

వెరీవెరీ అర్జంటు ఆర్నెల్లు. వెరీ అర్జంటు ఒక సంవత్సరం. అర్జంటు 2 సంవత్సరాలు.

- కొడవటిగంటి, పెండింగుఫైలు

**అర్జీ**

సంగర శక్తిలేదు, వ్యవసాయము సేయుటసున్న సంతలో, సంగడి వేసి యమ్ముటది యంతకు

మున్నెహుళక్కి, ముష్టికిన్ బొంగుబుజాన వైచి కొనిపోయెద మెక్కడికేని, ముష్టిచెంబుం గొని పెట్టుమొక్కటి, యమోఘమిదే కద! దంతిరా ణ్నృపా!

- తి.వేం., చాటువు

**అర్థం**

తెలివి, అందం, మంచితనం అన్నవాటికి ఎవరి అర్థాలు వారివి.

- మహీధర, స్వయంవరణం

పరిస్థితులకి అర్థంలేనప్పుడు మాటలకి అర్థం వుండదేమో.

- వద్దెర చండీదాస్, హిమజ్వాల

"ఇంజినీర్ అండ్ కంట్రాక్టర్" అంటే ఇంజినీర్ కాడుకాని చాలా పెద్ద కంట్రాక్టరని అర్థం.

- రావిశాస్త్రి, అల్పజీవి

ఇతర్లను అర్థం చేసుకోవటం కంటే అపార్థం చేసుకోవటం ఎక్కువ సులభం. అర్థం చేసుకోవటానికి అనుశీలన అవసరం. ఆలోచన అవసరం. అంతర్ దృష్టి అవసరం. అపార్థం చేసుకోవటానికి ఇవేమీ అవసరంలేదు.

సంజీవదేవ్, రూపారూపాలు

అర్థమెప్పుడు ద్వితీయపక్షము. సృష్టికాలనుందు బయలుదేరినది శబ్ద బ్రహ్మముగాని యర్థ బ్రహ్మముకాదు. శబ్దమున్నప్పుడు వేదము. వేదమునకర్థము లేనేలేదు. అందుచేతనే సర్వజాతులందు దానికి ఘనత.

- పానుగంటి, కంఠాభరణము

'కట్నం' అంటే - వెంటనే ఖర్చుపెట్టవలసింది అని అర్థం

- నరసరాజు, ఈ ఇల్లు అమ్మబడును

**అర్థరహితం**

కంబళిలో తింటూ వెంట్రుకలు లెక్కించినట్లు

- సామెత

షండుని బ్రహ్మచర్యవ్రతంవలెనే బలహీనుని ధర్మప్రచారం అర్థరహితం.

- బోయి భీమన్న, విశ్వశాంతి

అధివాస్తవిక కవిత్వం మోస్తరు
మిశ్రమ ఆర్థిక విధానం మోస్తరు
అర్థక్రమం అన్వయం అంచనా ఆలోచనా లేని
ఈ అడవి ఏమిటి? ఈ చీకటేమిటి?

- రమణారెడ్డి, శవరాత్రి

**అర్థవంతం**

ఆకలైనవాడు కాయను కోసి ఆకలి తీర్చుకోవటం కన్న - పండు కోసం పరుగెత్తటంలో అర్థం వుంది.

- ధనికొండ, పవిత్రులు

**అర్థసిద్ధి**

పోరితంబులే కయ్యెడు నర్థసిద్ధి వెడఁగైనను నొల్లక యొందు సేయునే?

- తిక్కన, ఉద్యోగ పర్వము

**అర్థపండితుడు**

అపండితునికంటె అర్థపండితుడే అపాయకరం.

- సామెత

**అర్థలౌకికం**

అర్థలౌకికము నూతన వైద్యమువలెనే ప్రాణసంకటము కొఱకే.

- పానుగంటి, ప్రచండ చాణక్యము

**అర్థోక్తి**

సగం సగం మాట్లాడే వాళ్ళు ఒక పట్టాన అర్థమవరు. వాళ్ళ సమస్యలేవో తెలియవు సరికదా మనకు కొత్త సమస్యలు తెచ్చిపెడతారు.

- విమలారామం, కిరణ్మయి

**అర్పణ**

తనని తాను అర్పించుకోవటంద్వారా స్త్రీ పొందే ఆనందానికి వయసుతో నిమిత్తం లేదు.

- వీరేంద్రనాథ్, ఆఖరిపోరాటం

**అర్పితం**

నేటికి నిన్నుఁజేరి యీగదయును నాగురుత్వము ను గంగకు నర్పితమయ్యెనేమిరా?

- తి.వేం.కవులు, పాండవ ప్రవాసము

**అర్హత**

అయిదు రూపాయలు పడేసి లెటర్‌హెడ్స్‌మీద ముద్రింపించుకొన్న అర్హతలు ఉద్యోగ సంపాదనకు పనికిరాకపోవచ్చు కాని, మనుష్యుల్ని బోల్తా కొట్టించడానికి చాలు.

- మహీధర, స్వయంవరణం

శాంతినెఱుఁగని బ్రాహ్మణు జన్నిదంబు దాసిగాగరా బొందుకుఁ దీసిపోదు. వికలుఁడగు రాజు తలమీదిమకుటమునకు దాసి సవరపు ముడికున్న వాసిలేదు. కాతరుండగు సేనాని ఖడ్గమునకు కులటచుట్టపీకెకుఁగల విలువ లేదు.

అర్హతను బట్టి వస్తువుల కధికఘనత కాని వస్తుజన్మముఁబట్టి కాదు నిజము.
- పానుగంటి, చూడామణి

కళ అందరి సొమ్మూ నిజం. కాని కళని అను భవించగల అర్హత కొద్దిమందికే వుంది. అంద రికీ ఉండాలి ఆ అర్హత.
- చలం, మ్యూజింగ్స్

ప్రేమ పూర్తిగా నశించిన తర్వాతగాని వివాహా నికి మనుషులు అర్హులు కారు.
- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

ఏ ఉద్యోగాలకన్నా అర్హతలు ఉండాలి. గాని పత్రికాధిపతులు కావడానికీ, నాయకులు కావడా నికీ విజ్ఞానవిషయమైన అర్హతలు అక్కర్లేనట్లు న్నాయి. ఒకరికి రాతా, ఇంకోరికి మాటా చాత కావాలి. ఇద్దరికీ కోతలు కావాలి.
- చలం, మ్యూజింగ్స్

అర్హత సంపాదించుకొని గదా సన్నిధినుండవల యును?
- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

ప్రేమ అనేది అర్హత ఉన్నవాడికిస్తేనే రాణిస్తుంది
- బీనాదేవి, హరిశ్చంద్రమతి

## అలఘుమతి

అలఘుమతుల కియ్యరాని పదార్థంబు లెవ్విగలవు?
- పోతన, భాగవతము

## అలంకారం

కడుపిటఁ గాలంగఁ, గంటఁ గాటుకయేలా?
- గోపరాజు, సింహాసన ద్వాత్రింశిక

జిడ్డుతేరిన తన ముఖాన్ని కన్నీళ్ళతో టాయి లెట్ చేసుకుంటున్నాడు
- తిలక్, కఠినోపనిషత్

## అలభ్యం

కూడు వండని ఆడదీ, మంచం అల్లని మగవాడూ ఉండరు.
- సామెత

వైద్యం నేర్వనివాడు, వానకి తడియని వాడు లేడు.
- సామెత

## అలవాటు

సుమతీ శతకం దగ్గర నుంచీ టీకాతాత్పర్య సహితం అలవాటయి అదిలేందే ఇప్పుడేం అర్థం కాదు తెలుగువాడికి.
- నరసరాజు, ఈ ఇల్లు అమ్మబడును

మనిషి మనస్సుమీద తర్కం ప్రభావం కన్న అలవాటు ప్రభావం అధికంగా వుంటుంది
- మహీధర, ఓనమాలు

లోకం ఎంత తల్లకిందులైనా మనుషులు మామూలు అలవాట్లు మానరు.
- చలం, అరుణ ఆర్గ్యుమెంటు

కూలాణ్ణి దగా చేసి కుబేరుడైనవాడు కోటీశ్వరు ణ్ణిదగా చేస్తాడు. వాడు వీణ్ణి చేస్తాడు. ఇట్ ఈజ్ ఆల్ ఎ మేటర్ ఆఫ్ హేబిట్.
- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

ముక్కు నేలపట్టి రాచినఁగాని గోడికిఁ బౌరుష మెక్కునా? గడ్డిగంపఁ జూపి యాకర్షించిన గుఱ్ఱము పందెము గెలుచునా? జోలపాడిన కొలఁది బాలునకు నిద్ర, నాగస్వరము వాయిం చినకొలఁది పామునకు మత్తు, స్తోత్రపారము లొనర్చిన కొలఁది రాజునకు మందమతి.
- పానుగంటి, వీరమతి

కాలప్రభావాన్నిబట్టి మంచిగాని చెడ్డగాని అను భవించటమే అలవాటు చేసుకోవాలి
- రంగనాయకమ్మ, పేకమేడలు

గంప దింపుడు ఘనమాయె, పూర్వపు బుద్ధులు పోవాయె.
- సామెత

నాట్యం తొక్కిన కాలు కోసి రోటికింద పెట్టినా ఊరుకోదట.
- సామెత

బేడీలు వేసిన పోలీసే బీడీలు అడిగినట్లు.
- శ్రీరమణ, న్యూసుడి

అన్యలోకముల కేగినఁ బోవవు పూర్వవాసనల్.
- త్రిపురనేని, భగవద్గీత

## అలుకుగుడ్డ

అలుగ్గుడ్డ లేకపోతే ఇల్లాలికి విరగకొట్టుకున్నట్లు వుంటుంది. విమర్శలు దూషణభూషణ తిర స్కారాదులు ఇవి అలుగ్గుడ్డలాంటివి. దాన్ని కూడా వుతికి ఆరవేయాలి కదా!
- పురాణం, విషయసూచిక

## అల్పత్వం

ఏ మనిషినన్నా లోకం హర్షించిన కొద్దీ, అతని అల్పత్వం అధికమౌతోందన్నమాట. లేక లోకా నికీ అతనికీ ఆధిక్యతలో వుండే వ్యత్యాసం తగ్గు తోందన్నమాట.
- చలం, మ్యూజింగ్స్

**అల్పసంతోషి**

అలంతి జలముచే మొరపనేల వెల్లివొడిచినట్లు కొలందిలాభముచే క్షుద్రునందు హర్షము వొడ మును.

- చిన్నయసూరి, మిత్రభేదము

**అల్పుడు**

సత్కులంబునం బుట్టుట సకల వేద
ములుం బురాణంబులును శాస్త్రములను జదువు
టయును సద్గతిం జేయం బ్రౌఢములు గావు.
శీల సామగ్రి లేని దుశ్చేష్టితునకు.

- తిక్కన, ఆనుశాసనికపర్వము

మందుండు మృత్పిండము వలెం
గ్రిందంబడియడంగియుండుం గృపణత్వమునన్.

- లక్ష్మణకవి, సుభాషితరత్నావళి

విద్వాంసుండు లేనిచోట స్వల్ప బుద్ధియు సమ్మానింపంబడుచున్నాడు.

- చిన్నయసూరి, మిత్రలాభము

విపత్కాలమందు విస్మయము కాపురుష
లక్షణము.

- చిన్నయసూరి, మిత్రలాభము

మృదు భాషణముల దుర్జన
హృదయములు ప్రసన్నతామహిమం బొందునె యె
ల్లిదముగం గొని యంతంతకు
మదమెక్కుంగాక దురభిమానము పేర్మిన్.

- తిక్కన, ఉద్యోగపర్వము

కోపము నుబ్బును గర్వము
నాపోవక యునికియును దురభిమానము ని
ర్వ్యాపారత్వము నను నివి
కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా.

- తిక్కన, ఉద్యోగపర్వము

పలుమఱు శపథంబులు నం
జలియును నభివాదనమును సామప్రియభా
షలు మిథ్యావినయంబులుం
గలయవి దుష్టస్వభావ కాపురుషులకున్.

- నన్నయ, ఆదిపర్వము

కడు నధికుతోడం దొడరినం
బొడిచిన నొడిచినను బురుష పురుషగుణం బే
ర్పడుంగాక హీను నొడుచుట కడిందియె?

- నన్నయ, సభాపర్వము

ఎయ్యెడల దుర్జనుల నేమఱి నమ్మంగంబోలునే.

- నన్నయ, ఆదిపర్వము

తన కపకారము మును జే
సిన జనుం డల్పుండని నమ్మి చేకొని యుండం
జన, దొక యించుక ముల్లయి
నను బాదతలమున నున్న నడవంగ నగునే?

- నన్నయ, ఆదిపర్వము

అల్పుండైనవాని కధికారమబ్బెనా
దొడ్డ కొంచె మనక తూలం బలుకు
చెప్పుకొఱకు కుక్క చెఱకు నేమెఱుంగురా?

- వేమన

అల్పు డెపుడుం బల్కు నాడంబరముగాను
సజ్జనుండు పలుకు చల్లగాను
కంచు మ్రోగునట్లు కనకంబు మ్రోంగునా?

- వేమన

వింత చదువుం జదువ వివరింపంగా లేండు
హీనుం డవగుణంబు మానలేండు
బొగ్గు పాలం గడుగం బోవునా మలినంబు?

- వేమన

అల్పబుద్ధివాని కధికారమిచ్చిన
దొడ్డవారినెల్లం దొలంగంగొట్టు
చెప్పుందినెడు కుక్క చెఱకు తీపెఱుంగునా?

- వేమన

**అల్లం**

అల్లం వుంటే - అన్ని అందాలూ వస్తయ్.

- సుంకర, కోతలరాయుడు

**అల్లరి**

కోపం గొప్పకు ముప్పు. అల్లరికి హంగు ముప్పు.

- సామెత

**అల్లుడు**

ఈరోజుల్లో అల్లుళ్ళు మామగార్లకే మొగుళ్ళు.

- మహీధర, కత్తుల వంతెన

ఇంటి అల్లుళ్ళ అభిప్రాయాలంత శాస్త్ర వచనాలు, అనుల్లంఘనీయమైన ఆదేశాలు వుండనే వుండవు.

- చలం, నవయవ్వనం

అల్లుడు మామల తగవు తలలో పేనిసందం.

- కాంతారావు, వంశధార

మన అమ్మాయి మగడు మరే పేరుకీ తగడు

- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

అప్పిడినవాని నధికారి నతిశయించి
యల్లు రొందించు బాధలనెల్లం గాంచి

అడలి నిజముగ హరిహరులంత వారు
కూతులం గంటయే మానుకొన్నవారు.

- కాళ్లకూరి, వరవిక్రయము

అత్తవారి పేరు వినబడిన, నెంత యై.పి. యల్లు
న్నికైన తగని యభిమానము తగని టెక్కు తల
కెక్కును.

- కాళ్ళకూరి, లేడీడాక్టరు

పేదలయ్యును గడుబిఙ్బిగిసియుండ్రు
వట్టియభిమానములును గర్వములుఁబట్టి
యల్లువారికి నెల్ల నీయవగుణంబు
వెన్నతోఁ బెట్టినది ఋంత వినుపనేల?

- శ్రీనాథుడు, కాశీఖండము

**అవకతవక**

బెల్లం పారేసి ఆకునాకినట్లు.

- సామెత

**అవకాశం**

కోరికలు మనిషన్న ప్రతివాడికీ ఉంటాయి. కాని అవకాశాలు ఏకొందరికోకాని రావు. అసలు కొందరికి రానేరావు.

- బీనాదేవి, ఇది కథకాదు

ఎన్నికల్లో చెప్పినదీ, చేయనదీ వెరసి నాయకుల మొగం మీద అవకాశం పూసిన మసి.

- కుందుర్తి, గాలాలు.

ముద్దొచ్చినప్పుడే చంకెక్కమన్నారు.

- కొడవటిగంటి, బెదిరిన మనుషులు

**అవకాశవాది**

మంచికీ, చెడుకూ లడాయి పెట్టి మధ్యలో నుంచుంటాడు అవకాశాల నారదుడు.

- కుందుర్తి, తెలంగాణ

**అవతారం**

అవతారం పుట్టకముందే అధర్మం పుట్టి పెరగాలి.

- కుందుర్తి, తెలంగాణ

**అవధానం**

వ్యవధిలేని అవధానం వెళిపోయిందెళిపోయింది.

- జరుక్‌శాస్త్రి, ఆశ్వాసాంతం

**అవమానం**

తలయును మూఁతియుఁ గొఱుగుట
తల దఱుగుట కంటెఁ దుచ్ఛతరము మహాత్మా!

- పోతన, భాగవతము

అవమానం ఎప్పుడూ ప్రతీకారాన్ని కోరుతుంది.

- సోమసుందర్, ఎగురుతున్న ఎర్రమన్ను

అనవబోధనిద్ర యవమానముద్రకుఁ
బ్రధమకారణంబు.

- శ్రీనాథుడు, శృంగార నైషధము

అవమానం మహా చెడ్డది. కొంచెం నామ రూపాలు కలవాళ్ళు దాన్ని బొత్తిగా భరింప లేరు.

- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

చేతినిండా పని ఉంచుకుని విసుగును, అలస టను దరిజేరనియ్యడం చాలా అవమానకరం.

- కేశవరెడ్డి, అతడు అడవిని జయించాడు

**అవసరం**

నోకంలో యెవరు ఈ రోజుల్లో బాగుపడాలన్నా డబ్బుండాలి, మాయుండాల, దబాయింపు సెక్స నుండాలి.

- రావిశాస్త్రి, న్యాయం

ఇప్పుడిష్టం వచ్చినట్లే వుంటాం, కష్టం వచ్చినప్పు డుగాని కాళ్ళూగడ్డాలు పట్టుకోము.

- వేదాంతకవి, కష్టకాలం

నోరార్చుకొనిపోయినప్పు డక్కలకట్టి, ముక్కు లార్చుకొనిపోయినపుడు పొడుము. ఇంత కంటెఁ బరమహంసక్రియలు మఱెక్కడివి?

- పానుగంటి, సాక్షి

కుటుంబంలో ఐక్యత చూపడానికి కావల్సింది నీతి, న్యాయం, మంచి కావు; కావల్సింది నటన.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

ప్రపంచంలో బ్రతకాలంటే కొంత కుట్ర, నటన అవసరం.

- బుచ్చిబాబు, ఆత్మవంచన

ఇంతవరకూ మనిషి ద్వారానేగాని ఈశ్వరుడు చూసుకోలేదు ఏదీ లోకంలో. పని జరగాలంటే ఈశ్వరుడే మనిషి అవతారమెత్తుతాడు.

- చలం, మ్యూజింగ్స్

నిర్ధారణగా అగత్యం యేర్పడితే అన్నీ వుపా యాలే. అన్నీ సాధనాలే. అగత్యం ఏర్పడ్డప్పుడు పెద్దపులిని చంపడానికి తుపాకీ అక్కర్లేదు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, మార్గదర్శి

ఆకలీ, అవసరమూ ఎలాంటి పనినైనా చేయిస్తా యేమో.

- రామచంద్రమూర్తి, బ్రతుకుకన్నా గొప్పది!

ఈదిలో మొగుడు వుంటేసాలు పెరట్లో పాపాలు పైకిరావు.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

మగాడి అవసరం ఆడదానికెంతో ఆడదాని అవసరం మగాడికీ అంతే.

- మహీధర, ఓనమాలు

జేబులు కొట్టడం, బ్రదుకులు కొట్టడం, తలలు కొట్టడం - కొందరి అవసరానికీ, మరికొందరి ఆనందానికీ.

- పులికంటి, శివపూజ

అవసరమైనప్పుడు కాళ్ళు పట్టుకోవడం, లేకుంటే జుట్టుపట్టుకోవడం.

- కె.యల్., కొత్తగుడి

మనవాళ్ళకు ఆదర్శాలు ఆచరించకుండా అట్లాగే ఉండాలి, నినాదాలు చేయటానికి.

- సరస్వతీదేవి, ఆదర్శాలు - అనుభవాలూ

మనిషికి యెంత నేర్పినా ఇంకా నేర్చుకోలేనిది వుండనే వుంటుంది. అందుకే నేర్పేవాళ్ళ అవసరం మనిషికి అన్ని తరాల్లోనూ వుంది.

- కాంతారావు, వంశధార

పేరుకి భర్త అనేవాడు ఉండాలిలెండి....

- అప్పారావు పట్నాయక్, రేవతి.

ప్రతి ఉద్యమానికీ సమస్యలను వెతుక్కోవలసిన అవసరం ఎప్పుడూ వుంటూనే వుంటుంది.

- సూర్యారావు, మాలోమేం

నారు, నీరు, నోరు ఉంటే ఏ రాజ్యంలో ఉన్నా ఒకటే.

- సామెత

సంపదలున్ననాడే బంధువులరాక, చెరువు నిండి ననాడే కప్పల చేరిక.

- సామెత

మందుకు పథ్యం, మాటకు సత్యం.

- సామెత

బోసినోటివానికి పేలపిండి ప్రీతి.

- సామెత

చదువుకు ముదురు, సాముకు లేత.

- సామెత

ఋత్విజుఁడులేని యజ్ఞమా? పురోహితుఁడు లేని పెండ్లియా? సంధానకర్తలేని సరసమా? మంత్రములేని తద్దినమా? పాసగుడుకాఁడు లేని సంతయా? దూతలేని రాజకార్యమా? గురుఁడులేని పల్లె కూటమియా? వైద్యుఁడులేని మరణమా? అయ్యో! అధ్యక్షుఁడులేని సభయా?

- పానుగంటి, సాక్షి

మొండివానికేల ముంజేతి కడియాలు
తొఱ్ఱివానికేలఁ గజ్జపండ్లు
గాడిదలకు నేల గడ్డముల్ మీసముల్?

- వేమన

దప్పి గొన్నప్పుడు బావి తవ్వినట్లు.

- సామెత

ఉండటానికి బంగళా, తిరగటానికి కారు ఎంత అవసరమో, ఆడదానికి భర్తా అంతే.

- భారతీదేవి, సుడిగుండాలు

అవసరం మనిషి భయం మాపి, సంకోచాన్ని వెనక్కి నెట్టేసి ముందుకు తోస్తుంది.

- నాగచంద్రావతి, కాలం కరిచాక

ఈ లోకంలో, మనిషికీ మనిషికీ మధ్యవున్న సంబంధం కేవలం ఒక 'అవసరం' మాత్రమే. దీనికి రకరకాల పదాల ప్రయోగాలు చేసి, రంగులు పులిమి, మాయచేసి, ఒకరిని ఒకరు మభ్యపెట్టుకుంటారు.

- సులోచనారాణి, నిశాంత

ఏ ఉద్యమానికయినా ప్రజలూ కావాలి - డబ్బూ కావాలి.

- విపినమూర్తి, ఉద్యమం

వస్తువు విలువ నావశ్యకతయే యభివృద్ధి జేయునుగదా!

- పానుగంటి, పాదుకాపట్టాభిషేకము

గీత బాగుంటేగాని బాపు అంత కాలేడు.

- శ్రీరమణ, న్యూనుడి

వొక మంచికోసం యింకో చెడ్డని అంగీకరించవలసి వస్తూ వుంటుందని వేటే వ్రాయనక్కఱలేదు.

- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

## అవాంతరం

అన్నపు గిన్నెకీ, ఆకలి నోటికి మధ్య అరవైలక్షల అవాంతరాలు ఉండవచ్చు

- రావిశాస్త్రి, పక్కింటి అబ్బాయి

## అవినాభావ సంబంధం

మానవుడి ఆర్థిక పరిస్థితికీ, మనస్థితికి అవినాభావ సంబంధమున్నది.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

## అవినీతి

నిలవవున్న నీటిలో పాచిరీతి
నేటి జీవితంలో పేరుకున్న అవినీతి

- మాలకొండారెడ్డి, బ్రతుకు నిజాలు

ఆకలికోసం కొంతమంది అవినీతికి పాల్పడితే, హోదాకోసం మరికొంతమంది అవినీతిని

లక్ష్యపెట్టరు. ఇంకొంతమంది సుఖంకోసం అవినీతిని ఆరాధిస్తారు.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

ఒక మంచి మనిషి చుట్టూ అవినీతి యెప్పుడూ వల పన్నుకొని కూర్చొని ఉంటుంది.

- వేణుగోపాలరావు, జోగబాల

సమస్యల చీకటి గదిలో
అవినీతి ముసుగుతన్ని
నిదురోతోంది!

- రాధేయ, జాగృతి

మనకి అపకారం చేసినవాడు దుష్టుడు, మన శత్రువులకి అపకారం చేసినవాడు సత్పురుషుడు. మనకి ఇష్టంలేని పనిని ఏదో ఒక పద్ధు కింద అవినీతిలోకి లాగుతాము.

- చలం, మ్యూజింగ్స్

ప్రేమలేని కామం అవినీతి, సంఘం దాన్ని నిరసిస్తుంది.

- మహీధర, కత్తులవంతెన

అందరూ కాదన్నదానిని ఒకడు చేస్తే అవినీతి. అందరూ ఒప్పుకొన్నది నీతే!

- మహీధర, కత్తులవంతెన

బాపూజీ బ్రతికి వున్నప్పుడు స్థాపించినవే కరప్టయిపోతుంటే, చచ్చిన తరువాత స్థాపించిన దాంట్లో తప్పులేదు లెండి.

- ఆత్రేయ, ఎవరుదొంగ?

అవినీతి చట్టబద్ధమై, బల్లలకింది చేతులు బల్లల మీదికెక్కి కదం తొక్కుతున్నాయి.

- చిరంజీవి, బోలో స్వతంత్ర భారత్‌కీ జై

**అవివేకం**

సానుభూతిచూపే వాడున్నాడని కష్టాన్ని తెచ్చుకోవటం యీ వూరి ఫైర్ ఇంజన్‌ను నమ్మి తమా షాకు ఇంటికి నిప్పుపెట్టుకోవటం లాంటిది!

- ధనికొండ, పవిత్రులు

తెలియక జరిగింది, తెలిశాక చక్కదిద్దుకోవాలి. తెలిసి కూడా తెలియనట్లుగా వుండటం అవివేకం.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

అవివేకానికి మందులేదు, అనుభవించటం తప్ప.

- కుందుర్తి, నాలోని నాదాలు

**అవిశ్రాంతి**

తిరగమరిగిన కాలూ, తిట్లు మరిగిన నోరూ ఊరకుండవు.

- సామెత

**అవిశ్వాసం**

దొంగతనం మాని దొరలా బ్రతుకుతున్నా అతన్ని యెవరూ నమ్మడానికి సాహసించరు. అది సహజం.

- ముద్దంశెట్టి, కరిగిన శిల

**అశక్తి**

ఎడతెగని యాత్రనిట్లు సాగింపలేక
యేడ్వగాలేక కృశియింతు నేనొకండ

- దేవులపల్లి, నేనొకండ

సుఖపడటం నేర్చుకోని వాళ్లకి బాధపడటం చేతకాదు.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

పెళ్లి చేసుకొనే ధైర్యం లేనివాడు పిల్లవాడికి పితృత్వం అంగీకరిస్తాడా?

- మహీధర, ఓనమాలు

ఏదో గర్వపడటంగాని చాలా శాంతి స్వభావులమని - అది వుత్త అశక్తత. భయం, పాపభీతి, పడేబాధ, కసి, క్రోధం, అన్నీ లోపల అనుభవిస్తాము. తీర్చుకునే శక్తి, బైట శక్తేకాదు, ఆత్మశక్తీ పోయి నిర్జీవమైనాము. ఈ నీరసానికి, భీరుత్వానికి సహనమనీ, క్షమార్పణ అనీ, ఆధ్యాత్మిక విశాలత్వమనీ గొప్పపేర్లు పెట్టుకు బతుకుతాము.

- చలం, నవయవ్వనం

జీవితం మీద ఆశలు పెట్టుకొని స్వశక్తితో సఫలం చేసుకోలేనివాడు నాస్తికమతం అవలంబించి లాభం లేదు.

- కొడవటిగంటి, స్వర్గంలో బందీలు

కంచే చేను మేస్తే కాపేమి చేయగలడు?

- సామెత

సుకవి కవిత్వము తార్కిక
నికరంబులలోన నెట్లు నిల్వంగ నేర్చున్?
మకరాంకకేళి కోర్చిన
ముకురానన మల్లయుద్ధమున కెట్లోర్చున్?

- చాటువు

ఆగ్రహించలేనివాడు అనుగ్రహించనూ లేడు.

- భీమన్న, విశ్వశాంతి

**అశాంతి**

స్వేచ్ఛలోనే ఏదో శాంతి, బాధలున్నాసరే. బానిసత్వంలోనే ఏదో అశాంతి, బాధ లేకపోయినా సరే.

- చలం, మ్యూజింగ్స్

శాంతిలో నిద్రపోయ్యే ప్రజల్ని - విద్యపేర, స్వేచ్ఛపేర, మతంపేర, జ్ఞానంపేర, అభివృద్ధిలోకి అశాంతిలోకి లాగడం ఘోరకార్య మనిపిస్తుంది.

- చలం, మ్యూజింగ్స్

శాంతి ప్రకృతి సిద్ధం కాదు,
అశాంతే జీవితధర్మం.

- భీమన్న, విశ్వశాంతి

**అశాశ్వతం**

యాదృచ్ఛిక సురతంబును
జూదంబున గెల్వఁబడిన సొమ్మును నుత్కో
శాదులు నప్పటి కప్పుడు
గా దేమరి దుస్సిపోవుఁగాక నిలుచునే?

- అనంతుడు, భోజరాజీయము

పడుచుఁదనమున నాఁడుదాని యందము, బాల్యమున మగవారి మంచితనము శాశ్వతము లఁటయ్యా?

- పానుగంటి, వీరమతి

తనువులు, ధనములు, రాజుల
చనవులు నెన్నాళ్లు?

- కటికి కామన్న మంత్రి, చాటువు

**అశ్రువు**

చచ్చిన వాళ్ళకి అశ్రువులు, బతికున్నవాళ్ళకోసం నిట్టూర్పులు.

- కొడవటిగంటి, బెదిరిన మనుషులు

**అశ్లీలం**

సభ ఎదట జరిగే అశ్లీలం సభవారికంటె మోటుగా ఎన్నడూ ఉండదు.

- భమిడిపాటి, మేజువాణి

**అష్టావధానం**

ఊరక పామరుల వేడుకకొరకుఁదక్క దీనివలన లోకమునకుఁగాని నాకుఁగాని నిజమైన ప్రయోజనము లేదని భావించి, తరువాత నెందరెన్ని విధములఁ బ్రార్థించినను మేధస్సునకు వేదనాకరమైన యష్టావధానమును జేయమానితిని.

- కందుకూరి, స్వీయచరిత్రము

**అసత్యం**

ఓ! పెట్టిన కోర్టులు పెట్టుచునేయున్నారు. చేసిన శాసనములు చేయుచునేయున్నారు. వచ్చిన వ్యాజ్యెములు వచ్చుచునే యున్నవి. కాలాంబర కవచధారులగు న్యాయవాదులు కోర్టులలోఁ జేరినవారు చేరుచునేయున్నారు. సాక్షి బోనులలోఁ జేయించిన ప్రమాణములు మొదటిసారి రెండవసారి మూడవసారికూడఁ జేయుచునేయున్నారు. అప్రతిహతముగా ననర్గళముగా సపరిమిత స్ఫూర్తితో - నాభీల వేగముతో - ననంత ముఖములతో ననృత మాకాశమునంతయు నావరించుచున్నది.

- పానుగంటి, సాక్షి

అసత్యము కొలకెకానియెడల నిన్నికోర్టు లెందులకు? ఇందరు న్యాయమూర్తు లెందులకు? ఇందరు న్యాయవాదులెందులకు? ఇందరు కక్షిదారు లెందులకు? ఇంత బిళ్ల కర్చెందులకు? ఇందరు సాక్షులెందులకు?

- పానుగంటి, సాక్షి

ఇచ్చిన సర్టిఫికెట్లన్నీ యథార్థమేననే సర్టిఫికేట్ ఇవ్వలేదు. కాబట్టి అసత్య దోషం అతనికి అంటదు.

-నిరుద్యోగి, కార్యాలయబేతాళవిక్రమార్కీయము

డబ్బులు పల్కువారి కడ్డంబుగలదె?

- శ్రీనాథుడు, కాశీఖండము

దొంగతనము సిగ్గు వెంగలితనమును
వగలు సెగలు పొగలు వలపు సొలపుఁ
గొలుపు కన్నుఁగవయుఁ గొంటెనవ్వుల మాట
కల్లబోతు ముఖము వెల్లడించు.

- అజ్జాడ, సారంగధర నాటకము

**అసంతృప్తి**

సమవయస్కుఁడు గాని భర్తను గట్టు తలిదండ్రుల నెంత దూషించినను దీరదు.

- కోలాచలం, శిలాదిత్యం

**అసందర్భం**

రాయిష్టకి రుద్రాక్షలు బహూకరించినట్టు.

- శ్రీరమణ, న్యూనుడి

దొంగలను కొట్టి పోలీసులకు వేసినట్టు.

- శ్రీరమణ, న్యూనుడి

తిరుపతి వెళ్లి దువ్వెన కొనుక్కు వచ్చినట్టు.

- శ్రీరమణ, న్యూనుడి

నీటు తాగినవాడు నిక్షేపంగా వున్నాడు,
నీళ్లు తాగినవాడు తూలితూలి పోయాట్ట.

- శ్రీరమణ, న్యూనుడి

ప్రజాకవిని పల్లకీలో వూరేగించినట్టు.

- శ్రీరమణ, న్యూనుడి

కిసాన్ సమ్మేళన్‌లో కవి సమ్మేళనం కలిపినట్టు
- శ్రీరమణ, న్యూనుడి

కార్మికనిస్టుల సభలో కంట తడిపెట్టినట్టు.
- శ్రీరమణ, న్యూనుడి

కొబ్బరిచెట్టు ఎందుకెక్కావంటే దూడగడ్డి కన్నట్టు
- సామెత

ఏనుగుల పోట్లాటకు ఏట్రింతరాయబారమన్నట్టు
- సామెత

ఊరు ఉస్తికాయంత, సిద్ధాంతం తాటి కాయంత.
- సామెత

పక్కింటి గోడయెక్కి పౌరధర్మాల మీద ప్రసంగించినట్టు.
- శ్రీరమణ, న్యూనుడి

చదివేది రామాయణం, పడగొట్టేది దేవాలయం.
- సామెత

అత్తకు లేక అటికలు నాకుతూ వుంటే, అల్లుడు వచ్చి దీపావళి పండుగ అన్నాడట.
- సామెత

మంత్రం చెప్పను మల్లుభట్టు, తినేదానికి తిప్పంభట్లు.
- సామెత

పసుపూ బొట్టూ పెట్టి పెళ్ళికి పిలిస్తే వెళ్లక, పెంకపట్టుకొని పులుసుకు వెళ్ళిందట.
- సామెత

నివాళి పళ్ళాలు పట్టేవాళ్లంతా నిషేక ముహూర్తపు పెండ్లికూతుళ్లవుతారా?
- సామెత

గుళ్ళో దేవుడికి నైవేద్యం లేకుంటే పూజారి పులిహోర కేడ్చాడట.
- సామెత

కొండంత మొగుడే పోగా, పిడికెడు బొచ్చెకు ఏడ్పెందుకు?
- సామెత

అంభంలో కుంభం, ఆదివారంలో సోమవారం
- సామెత

చేతుల్లో వెన్న పెట్టుకొని నేతికి ముస్టికెళ్ళాడు.
- సామెత

ముష్టికి పోయి తుష్టిలేదని ఏడ్చినట్లు.
- సామెత

కూటికి గతిలేదుకాని కుంటెనలకు ముత్యాలు.
- సామెత

దూడా బఱ్ఱా ఉండగా గుంజ అరచినట్లు.
- సామెత

**అసమయం**

ప్రసవవేదన పడుతుంటే ఫ్యామిలీ ప్లానింగు బోధించినట్టు.
- శ్రీరమణ, న్యూనుడి

ఏదీ కాని వేళ గేదె యీనినట్లు.
- సామెత

**అసమర్థత**

తప్పుల్లేకుండా తెలుగు రాయలేడు. తప్పులు తప్ప ఇంగ్లీషు రాయలేడు. కనీసం బూతులైనా రెండు భాషల్లోనూ సరిగ్గా మాట్లాడలేడు.
- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

అసమర్థుల కెందును బరోక్షమునందె ప్రగల్భోక్తులు మెండు.
- తి.వేం., పాండవోద్యోగము

ఆచరించడం చేతకానివాళ్లకే ఆర్భాటెక్కువ.
- పినిశెట్టి, కులంలేని పిల్ల

ఆవిడకు బతకటం ఎట్లా చాతకాలేదో చావటం కూడా అట్లాగే చాతకాలేదు.
- కొడవటిగంటి, రెళ్లూ మూళ్లూ

**అసమానత**

కినుకమెయిఁ దన్నులాడఁగ
మొనకట్టిన సరియె? గుఱ్ఱమును గాడిదయున్
ఘనుఁ డల్పుఁడు సరియగుదురె?
- అడిదము, చాటువు

**అసలు సంగతి**

ఆంధ్రు బిడ్డలు దెచ్చు ప్రఖ్యాతిగాని
మొదటి నుండియు నీవు దామోదరుఁడవె.
- పురుషోత్తమకవి, *ఆంధ్రనాయక శతకము*

**అసహ్యం**

పేదవాని స్నేహం, మహారాజు విరోధం సహింపరానివి.
-సామెత

**అసాధ్యం**

శీతలవారి స్నానము
భూతల శయనంబు నొంటిపూటశనంబున్
నాతిగల బ్రహ్మచర్యము
నా తరమా? పూట గడప నారయభూపా!
- చాటువు

నువ్వు ఎక్కదలుచుకొన్న రైలు ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు.
- ఆరుద్ర, త్వమేవాऽహం

నువ్వు వెళ్లదలుచుకొన్న ఊరు
నువ్వు ఐతికుండగా చేరదా రైలు
- ఆరుద్ర, నీటి గడియారం

కాళ్లు తడవకుండా
మహాసముద్రాన్ని దాటిన మేధావి కూడా
కళ్లు తడవకుండా
జీవితాన్ని దాటలేడు
- వక్కలంక, ఎవ్వరైనా

తిమిరంలోని తీపి
భ్రమకలిగించే రిమ్మ
అజ్ఞానంలోని ఆహ్లాదం.
మౌఢ్యంలోని గాఢనిషా
వెలుగులో బుద్ధిలో చైతన్యంలో రాదు.
- గిరీశం, ప్లస్ మైనస్

ససవలూ బానిసలూ సంఘటితం కాలేరు.
అసలు అజ్ఞానులెన్నడూ తిరుగబడలేరు.
- ఆరుద్ర, ఓక్కా ఓ చెలియా!

అంటుమామిడి గున్నపై నధివసించి
నంతనే కాకి కోకిల యగుట గలదె?
- తి.వేం., గీరతము

మనస్సు విరిగినా, అద్దం పగిలినా తిరిగి మామూలు స్థితిని పొందలేవు.
- భారతీదేవి, సుడిగుండాలు

కావ్యము లెవఁడైన నేర్పఁగలఁడు కాని, కవిత్వ మెవఁడు నేర్పఁగలడు?
- పానుగంటి, ముద్రిక

కాలంలో వెనక్కి వెళ్లి చరిత్రను మార్చలేము.
- కవనశర్మ, తూర్పు-పడమర

రాయిష్టులకు ఆత్మకథలుండవు.
- శ్రీరమణ, న్యూసుడి

తల్లి నవల రాస్తే పిల్ల గేయం రాస్తుందా?
- శ్రీరమణ, న్యూసుడి

కరెంటు పోయినంత మాత్రాన కవి సమ్మేళనం ఆగుతుందా?
- శ్రీరమణ, న్యూసుడి

కొండంత రచయిత్రికి కొండంత పత్రిక తేగలమా?
- శ్రీరమణ, న్యూసుడి

కథగా వంగనిది నవలై వంగునా?
-శ్రీరమణ, న్యూసుడి

రోకటికి చిగురు పట్టినట్టు.
- సామెత

కాలితో నడచి కాశికి పోవచ్చును గాని, తలతో నడచి వాకిలి దాటలేము.
- సామెత

మురిగిన ఓటు మొరిగినా రాదు.
- శ్రీరమణ, న్యూసుడి

ఉట్టికెక్క లేనమ్మ స్వర్గానికెక్కునా?
- సామెత

దుర్మతికి ధర్మబుద్ధియు
నిర్మలునకు దుర్గతియు గణికలకు దృఢమౌ
కూర్మియుఁ గలిమికి నిలుపును
గర్మములకుఁ దప్పుటయును గలుగవు జగతిన్.
- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

దేశ ద్రిమ్మరియైన యాడుదానిని, గాలిని, పట్టుకొని యెవడు బంధించగలడు?
- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

ఒకచేతితో నమస్కారమగునా? ఒక్క యక్కఱముతోఁ బ్రాణాయామ మగునా? నాలుక యంగిటికిఁ దగులకుండ రుచి పుట్టునా? చేయి చేయి కలియని మల్లయుద్ధ మెటనైనఁ జూచితివా? చందమామా రావే యనఁగఁజంద్రకళ క్రిందికి దిగునా?
- పానుగంటి, వీరమతి

తివిరి యిసుమునఁ దైలంబుఁ దీయవచ్చుఁ
దవిలి మృగతృష్ణలో నీరు ద్రావవచ్చుఁ
దిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చుఁ
జేరి మూర్ఖుల మనసు రంజింపరాదు
- లక్ష్మణకవి, సుభాషిత రత్నావళి

కుండ చిల్లిపడిన గుడ్డదోఁపగవచ్చు
పనికి వీలుపడును బాగుగాను
కూలఁబడిన నరుడు కుదురుట యరుదయా
- వేమన

ఎడ్డెఁ దెల్పవచ్చు నేడాది కైనను
మొనిఁ దెల్పవచ్చు మాసముననె
మొప్పెఁ దెల్పరాదు ముప్పదేండ్లకునైన
- వేమన

పొట్లకాయ రాయి పొడుగుత్రాటనుగట్ట
లీలతోడ వంకలేక పెరుగుఁ
గుక్కతోఁకఁ గట్టఁ గుదురునా చక్కఁగా?
- వేమన

శాస్త్రజ్ఞానానికి అందని విషయాలు జీవితంలో చాలా ఉన్నాయి.
- కొడవటిగంటి, జ్ఞానంగల కుక్క

ఒక మెట్టుమీది నుంచి కాలు తీయకుండా,

ఇంకో మెట్లు ఎట్లా ఎక్కటం?
- కొడవటిగంటి. నవమన్మంత్రపు సిరి

ఆడవాళ్ళ ముచ్చట్లను మగవాళ్ళెన్నటికీ. పూర్తిగా అర్థం చేసుకోలేరు.
- కొడవటిగంటి. చదువు

మనిషినీ నమ్మడానికి వీల్లేదు: దేవుడిమీదా ఆధారపడడానికి వీల్లేదు
- యజ్ఞన్నశాస్త్రి. ఓమనిషి నూతిలోపడితే

రాలిన పూలు మళ్లీ రెమ్మకు అతుక్కోవు
- దివ్యప్రభాకర్. శిరోమణి

ఎవరినీ అందరూ సమంగా అర్థంచేసుకోలేరు.
- రాధాకృష్ణశాస్త్రి. జన్మభూమి

వ్యక్తియొక్క ఔన్నత్యాన్ని విలువ కట్టడము అందరికీ సాధ్యం కాదు.
- సరస్వతీ దేవి. శాంతించిన సముద్రం

కూర్చుండి కూడు వండలేను
వంగుండి తీర్థం వస్తాను అన్నట్లు.
- సామెత

కానకుండా కట్టె యిచ్చెను గాని,
వినకుండా వీరంగాలు వాయించగలవా?
- సామెత

కాశీకి పోగానే కర్రికుక్క గంగిగోవు అవుతుందా?
- సామెత

చెలిమిని చేదు తినిపించవచ్చుగాని బలిమిని పాలు తాగించలేము.
- సామెత

చిచ్చు అంటుకుంటుంటే చేతులతో ఆర్ప గలమా?
- సామెత

గోల గోవిందుడిది, అనుభవం వెంకటేశ్వరులిది
- సామెత

కాలతంతే పెరిగేది పుచ్చకాయ; కుళ్లేది గుమ్మడి కాయ.
- సామెత

గుర్రం గుగ్గిళ్ళు తింటూంటే గాడిదకు కడుపు నెప్పి వచ్చిందట.
- సామెత

తుట్టె పురుగుకు రెక్కలు వచ్చినా ముసలి వాడికి ప్రాయం వచ్చినా పట్టపగ్గాలుండవు.
- సామెత

చచ్చే కాలానికి సత్యభామ వేషం వేసినట్టు
- సామెత

సూది బెజ్జంలో ఒంటె దూరవచ్చు కాని భాగ్యవంతుడు స్వర్గం చేరలేడు
- సామెత

## అసూయ

అసూయ ముందు పుట్టింది తరవాత మనిషి పుట్టేడు
- వెంకటరమణారావు. కొలువు

ఎంతకాలం గడిచినా, ఒకసారి గొప్పగా ప్రేమిం చిన స్త్రీని ఇంకోరి మోహాధీనంలో చూడగానే జెలసీ తలెత్తక మానదు.
- చలం. అరుణ అధ్యమెంటు

ఆడది అసూయనీ, మొగాడు మొండితనాన్నీ పట్టుకొని పుడతారు అమ్మకడుపులోంచి.
- వీనాదేవి. ది వెట్ కథ

ఆపేక్ష లేకపోతేనే అసూయ.
- కొడవటిగంటి. ప్రేమించినమనిషి

అసూయ యనఁగానేమి? పరుఁడు సుఖపడు చున్నాఁడను చింతయే కదా! నేను కష్టపడుచుం డఁగాఁ బరుఁడు సుఖపడుట యేలయని నీవు విచారించుచుండఁగా నీకుఁ గష్టమేకాని సుఖము లేదన్నమాట నీకు స్పష్టమే కద.
- పానుగంటి. సాక్షి

బుద్ధిమంతునివలన దుర్బుద్ధు లధికు
వలన హీనులు, రూపసివలనఁ గొనట
వారసూయలు సేయుదు రీరసమున
- తిక్కన. శాంతిపర్వము

వ్యక్తిలోనేమి, జాతిలోనేమి, యసూయ యధికా పాయకరము.
- పానుగంటి. సాక్షి

## అస్తమయం

సూర్యుడు అస్తమించడం ఉదయించుటకే
న్యాయం అంతరించడం ప్రభవించుటకే.
- ఏల్చూరి. పోస్టు చేయని ఉత్తరం

## అస్తిత్వం

మనిషి అస్తిత్వంకంటే ఆకలి అస్తిత్వం సత్యం.
- ఇనాక్. ఆనందబాష్పాలు

ఆశతోకూడిన నిరాశలు, బంధనతో కూడిన స్వేచ్ఛలు, బాధతో కూడిన సుఖాలు, ఋణా లతో కూడిన సంపదలు, అజ్ఞానమిళితమైన జ్ఞానం, మరణంతో కూడిన జీవనం. ఈ విధంగా ఎన్నో ఈ ద్వంద్వాలు లేకపోతే అస్తి త్వమే లేదు.
- సంజీవదేవ్. రూపారూపాలు

నిన్ను తలఁచెడివాఁడె లేకున్నఁగాని
నీకు తెలియదు దేవుఁడా! నీదు బ్రదుకు

- వేదాంతకవి, ఆకలిమంట

### అస్థిరం

మగవారి మాటలు, మర్యాదలు సమయోచిత ములే కాని స్థిరములు గావు

- పానుగంటి, రాధాకృష్ణ

### అహంకారం

అహంకారానికి కండ్లుండవు.

- కుందుర్తి, అజ్ఞాత

చల్లడము క్రింద దూఱని,
మల్లులు లెరెందు ధరణి మండల మందున్

- పోతన, భాగవతము

ఎఱుగక పోవుట చేతనో ఓర్వలేమి చేతనో కొందఱు దౌర్భాగ్యులు తాము నీతిమంతుల మని విఱ్ఱవీగుదురు.

- చిలకమర్తి, ఆనంద సమాజము

పాండిత్యానికి తనకంతా తెలుసునన్న అహంకారమున్నది. వివేకానికి తనకేమి తెలియదన్న వినమ్రత ఉన్నది.

- సామెత

గుడ్డు వచ్చి, పిల్లను వెక్కిరించినట్లు.

- సామెత

అహంకారం క్రూరమృగం. మానవత్వాన్ని మింగటమే దాని లక్షణం. వివేకమనే ఖడ్గంతో ఆ మృగాన్ని వధించాలి.

- శ్యామలారాణి, పవిత్ర

### అహం(భావం)

మానవుడు పైకి రావటానికి తాను సమర్థుడ ననే యీ అహం చాలా అవసరం. అయితే యిది మితిమీరిన స్థాయికి చెడబెరిగిందంటే తిరిగి సర్వనాశనానికి హేతువౌతుంది.

- సూరి, చంఘీజ్ ఖాన్

మిడిమేళంగా వచ్చిన డబ్బు ఇంత అహం తెచ్చి పెడుతుంది.

- అనిశెట్టి, గాలిమేడలు

అహంకారం ఏపాటి పరీక్షకూ నిలవదు. నిలిచే టట్టయితే అది చెడ్డదని నలుగురూ అనుకోవలసిన అవసరమే లేదు.

- కొడవటిగంటి, గడ్డురోజులు

మనిషి అహంభావం చాలా బలమైనది. నిజం తెలుసుకోనీకుండా అది అడుగడుగునా అడ్డుపడుతుంది.

- కాళీపట్నం, శాంతి

అహంభావము ఆత్మపరిధిని
అధిగమించిన ముప్పువచ్చును
కడలి తరగలు పెరిగి చెలియలి
కట్ట దాటిన ప్రళయమేకద?

- సినారె, సమదర్శనం

అహంతో మనిషి మొహం మెరుస్తుంది
నకిలీ సరుకు తళతళ మంటుంది
అసలు విలువ వెలవెలబోతుంది.

- పరిగి, సూర్యుడెన్నిమారులొస్తేనేం!

దుర్యోధనుడునుంచి క్లియోపాత్రవరకు ఎంత గొప్ప రాజనీతిజ్ఞులైనా, తమ అహాన్ని దెబ్బతీసే విషయాల్లో సహనాన్ని ప్రదర్శించని చోటే దెబ్బ తిన్నారు.

- వీరేంద్రనాధ్, ఆఖరిపోరాటం

### అహింస

మహాత్ముడు చెప్పిన అహింసా మార్గం 'అవుటాఫ్ డేటు' అయిపోయింది

- పుల్లాభొట్ల, ఆదిత్యశ్రీ

అహింస ఒక ఆశయమే కాని ఆయుధం ఎప్పుడూ కాదు.

- శ్రీశ్రీ, ఖడ్గసృష్టి

అహింస వొక రాజకీయపుటెత్తు.

- పిచ్చేశ్వరరావు, డొంకల వంకలమనసులు

లొంగిన వాళ్లను కుంగదీయటం అహింసా విధానం కాదు.

- కొడవటిగంటి, కార్మిక విజయం

తన్నులు దిని ప్రహ్లాదుడు
తన్నించె నృసింహుచేత, తండ్రిని చంపెన్
దీన్నే అహింస అందురు.

- అబ్బూరి, చాటువు

### అధముడు

ఒక్క మాటలోనే జవాబు చెప్పగలిగిన వుద్యోగి అధముడు.

-నిరుద్యోగి, కార్యాలయబేతాళవిక్రమార్కీయము



### ఆకర్షణ

శారీరకంగా వచ్చే అందం యీరోజున వుంటే రేపు పోవచ్చు వ్యక్తిత్వం ద్వారా మనచుట్టూ ఏర్పరచుకున్న ఆకర్షణ జీవితాంతం వుంటుంది.

- సులోచనారాణి, మీనా

నాకు తెలిసినంతమట్టుకు ఏ ఆడదైనా ఒక్కడి దృష్టిని ఆకర్షించడం మంచిదిగాని, పదిమంది దృష్టినీ కాదని.

- భరాగో, నాకీ ఉద్యోగం వద్దు

కొందరు వ్యక్తులు ఎదురుగా లేనప్పుడు ఆకర్ష వంతమనిపిస్తారు. ఎదురుగా ఉండి అంత ఎక్కువగా ఆకర్షించలేరు. మరికొందరు ఎడంగా ఉన్నప్పటికన్న ఎదురుగా ఉండి ఎక్కువ ఆకర్షిస్తారు.

- కొడవటిగంటి, పంచకళ్యాణి

బహుశా దుఃఖం, బాధ మనుష్యుణ్ణి ఆకర్షిస్తాయో ఏమో?

- మహీధర, ఓనమాలు

వృత్త అందంలో ఆకర్షణ స్వల్పం. తాకాలి చూడాలి అనిపిస్తుంది. అంతటితో తృప్తి కలుగుతుంది.

- చలం, మ్యూజింగ్స్

ప్రేమ అన్నదే లేదు. ఈ లోకంలో వున్నది ఆకర్షణ.

- యజ్ఞన్నశాస్త్రి, విశ్వం పెళ్లి

శరీరాన్ని దుస్తులు వేసి ఎలా ఆకర్షణీయంగా చేయాలని చూస్తామో అలాగే మనస్సుని కూడా చుట్టూ పరదాలువేసి ఆకర్షణీయం చేసుకోవాలి. అప్పుడే దానికి సంఘంలో గౌరవం. లేదా జీవితమే దుర్భరమౌతుంది.

- మూర్తి, మర్యాదస్థులు

**ఆకలి**

ఆకలికి శరీరం లేదు. అయినా ఆరోగ్యవంతుడి నాలుకలా దానికి రుచి తెలుసు.

- కుందుర్తి, తెలంగాణ

నాగలి ఉన్న ఊళ్లో ఆకలి చేరదు.

- సామెత

ప్రతిమల పెండ్లి సేయుటకు
వందలు వేలు వ్యయించుఁగాని
దుఃఖితమతులైన పేదల
పకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్పదీ భరత మేదిని
ముప్పది మూడుకోట్ల
దేవత లెగవడ్డ దేశమున
భాగ్యవిహీనుల క్షుత్తులారునే?

- జాషువా, గబ్బిలం

ఆకలిగొన్న కడుపు ఆకలిగొన్న యౌవనం ఒకటే!

- కాంతారావు, మంచి మహూర్తం

సకల కష్టములకంటె ఆకలి కష్టము ఎక్కిలి ఎక్కువది.

- చిలకమర్తి, నవ్వులగని

కడుపునిండా తినకపోతే కోటీశ్వరుడైనా మాడుతాడు.

- కొడవటిగంటి, అహింసా ప్రయోగం

ఆకలిబాధముందు అన్ని విలువలూ, అన్ని ఆలోచనలూ, అన్ని అభ్యంతరాలూ ఏ గాలి లోకో కొట్టుకు పోతాయి.

- ఆనందారామం, మళ్లీ వచ్చిన వసంతం

ఆకలీ, అవసరమూ ఎలాంటి పనినైనా చేయిస్తాయేమో.

- రామచంద్రమూర్తి, బ్రతుకుకన్నా గొప్పది

ఆకలి అగ్గిలాంటిది. అగ్గికి యేదో ఆహారం వెయ్యకపోతే, మనిషినే కాల్చేస్తాది.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

ఉపవాస దీక్ష పూనినవాడు ఆకలి పైకి చెప్పుకో లేడుగా.

- బుచ్చిబాబు, తీవ్రరక్షిత

ప్రతి మనుష్యునకు గర్భమందే జీర్ణకోశముం డును; గాని పాపయ్యకు జీర్ణకోశము శరీరముం తటఁ గలదు.

- చిలకమర్తి, గణపతి

పావక పరీక్ష, జీవిత బుభుక్ష
తీరని బుభుక్ష మానవుని శిక్ష?

- బైరాగి, జీవిత బుభుక్ష

ఎవరూ స్వీకరించని బలి
తనను తాను తినివేసే ఆకలి.

- బైరాగి, పగిలిన అద్దం

అజంతాలోను హలంతభాషలోను
శిలాసుందరికి లేని
క్షుద్బాధాసంచలనం
పల్లెపడుచుకున్నాదని గమనించుకో భాయీ!

- దాశరథి, మస్తిష్కంలో లేబొరేటరీ

ఆకలికి జాలిలేదు
పెద్దా చిన్నా తారతమ్యం లేదు
సమయాసమయాలు లేవు.

- వనశ్రీ, నిష్క్రమణ

చద్దికూడు తిన్నమ్మకు, మగని ఆకలి తెలియదు.

- సామెత

ఎంత కడుపునిండితే అంతే ఆడాకలి మగాడికి

- బీనాదేవి, అమ్మా! ఇది అనంతం!

సృష్టిలో ముందు ఆకలిపుట్టి, తరువాత ప్రాణి పుట్టింది. ఈ దోపిడీలు, హత్యలు, కుట్రలు, పోరాటాలు, దొంగతనాలు అన్నీ ఆకలి సృష్టించినవే.

- బీనాదేవి, అమ్మా! ఇది అనంతం!

ఏదుంతిన్నా ఏకాశే; పందుం తిన్నా
పరగడుపే.

- దేవులపల్లి, ఏడాది పొడుగునా

కాలిన ప్రేవులలోనికి
కమ్మని మాటలు దూరవు.

- పురిపండా, నాన్యఃపంథా

అసలు మనిషిని చైతన్యవంతంగా చేసేదేమిటో తెలుసా? ఆకలి. ఒక్కమనిషినే కాదు, సృష్టిలో ప్రతిజీవికీ కూడా. ఆకలి తీరినమీదటే అన్నీ.

- శ్యామలారాణి, పవిత్ర

### ఆకారం

మనం కదలని నీడల్లోనే మన ఆకృతి.

- రంగారావు, పొలిమేరలు

### ఆకాశ కుసుమం

ఒంటెకును సుందరత, గేదె కొడలి శుభ్రత, ముసిఁడికిఁ దీపి, కపికిఁ జిత్తస్థిరత, వెలుతురు నకుఁ బర్వు, కవికిఁ గలుములు, గులటకును కృతజ్ఞత యాకాశకుసుమ మటులె.

- పానుగంటి, ప్రచండ చాణక్యము

### ఆకాశవాణి

బుద్ధునంతటి యేమహాత్మునకొ కాని
పలుక దానాటి యాకాశవాణి; మీకు
ఇరువదియు నాల్గు గంటలు మొరయుచుండు
వాడవాడలఁ జెవియొగ్గువాఁడు లేఁడు.

- జాషువా, కాందిశీకుఁడు

### ఆకు

ఆకులు చెట్టుల కుండును
ఆకులు చక్రాల కుండు నాహార్యముగా
ఏకులు వడకిన నూలగు
మేకలలో వన్నెలెన్నొ మేదిని సఖుడా!

- శ్రీశ్రీ, హితోపదేశం

### ఆక్షేపణ

సాలుకొకసారి జరుగు 'జల్సా'లలోన
వివిధవేషాలతోడ దీపించువారు
ఈ ప్రజాపతు లందరు ఇంకనైన
త్యాగదీక్షను వహియించి తరలరాదె?

- రామకృష్ణశర్మ, ప్రబోధము

ఎంతమంచి పని చేస్తున్నా, ఊరన్న తర్వాత ఎవరో నలుగురు ఆక్షేపించేవాళ్ళు ఆక్షేపిస్తూనే ఉంటారు.

- సుంకర, కోతలరాయుడు

కోరి పిల్లనిస్తే కులం తక్కువన్నారట.

- సామెత

### ఆగనివి

కల్యాణం వచ్చినా, కక్కు వచ్చినా ఆగవు.

- సామెత

కళ్యాణం వచ్చినా, కవిత్వం వచ్చినా ఆగవు.

- శ్రీరమణ, న్యూనుడి

నిత్యావసర నివేదనకు రాజు లుంపుడుకత్తెలను జేరఁదీసినఁ గాని కోటలలో నీ విశ్వామిత్ర సృష్టి యాగదు.

- పానుగంటి, వీరమతి

### ఆగస్టు పదిహేను

బానిస బ్రతుకు నుండి విముక్తి పొంది తోటి స్వతంత్రుడ్ని బానిసగా చేసుకుంటూన్న ప్రస్తుత హింసామయ చరిత్రకి ఈ ఆగస్టు పదిహేను గొప్పపేరడీ!

- ఆదివిష్ణు, చూడుచూడు నీడలు

### ఆగామి

హత్తుఁ గొందఱకు భవిష్యదర్థంబు
లాత్మలయందు చిత్తమ్ము శాంతమై
మఱి సుశీలమ్ము చెందు వారలకు

- విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము

### ఆగ్రహం

ఆగ్రహం దౌర్బల్య సూచకం.

- చలం, శశాంక

### ఆచరణ

ప్రపంచం యొక్క అభ్యుదయం గురించి ఈ విధంగా ఎన్ని లక్షలమంది ఆలోచిస్తున్నారో! వాళ్లలో కొన్ని వేలమంది ఆలోచనలు అమలు జరిగినా ప్రపంచం బాగుపడిపోను.

- కొడవటిగంటి, జీవితం

పైసలున్నోడిదే రాజ్జం పైసలున్నోడిదే రాజ్జం అని పెతినాకొడుకూ సెప్పే నాకొడుకే, గాని ఆళ్ళని దింపే నాకొడుకూ అవుపిచ్చడు, ఆళ్ళని దింపడ వెలాగ్గో సెప్పేనాకొడుకూ అవుపిచ్చడు

- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

లోకోపకారపరాయణులగువారు తామందఱు కొఱకును కనిపెట్టుకొని యుండక తాము సత్యమని లోకోపకారమని రూఢిగా నమ్మిన దానిని మొట్టమొదట తామాచరించుచు తరువాత లోకుల నాచరింపచేయుటకు ప్రయత్నింపవలయును సూదంటురాయి యినుము నాకర్షించినట్లే సత్కార్యమందఱిని కాలక్రమమున తన ప్రక్క కాకర్షించును.

- కందుకూరి, దేశాభివృద్ధి సాధనము

అనుష్ఠానము లేకపోయిన పక్షమున మన యువదేశములన్నియు నున్మత్తప్రలాపములవంటివయి నిష్ఫలమగును. స్వప్రయోజన పరత్వమువలనను, మాంద్యమువలనను, ఉపేక్షవలనను, భయమువలనను, మనకు ధర్మమయిన పనిని చేయుటకు మనము వెనుక తీసిన పక్షమున మనమొక్కరమే చెడుటకాక కపట వర్తనులను జేసి మన సంతతివారికి సహితము చెఱుపు చేసినవార మగుదుము.

- కందుకూరి, విద్యాధికుల ధర్మములు

కోడలికి బుద్ధిచెప్పి అత్త రంకు పోయినదన్నట్లు.

- సామెత

మనిషిని కొలిచేవి అతని మాటలు కావు, చేతలు! అతను ఏంచెబుతున్నాడని కాదు, ఏం చేస్తున్నాడో చూడు.

- చిరంజీవి, వంశాంకురం

ఈ సంసారకూపంలో పడిపోయినవారికి ఆఖరుకు అగ్నిసంస్కారమేగాని, ఆత్మసంస్కారం అనేదిలేదని వాదించిన ప్రహ్లాదునివంటి పరమ భాగవతోత్తముడు కూడా పెండ్లాడి లోకమునకది పాడియని బోధించాడు.

- దాసు, మోక్షమార్గం

**ఆచారం**

అర్థం విడిచి, భావం విడిచి ఆచారాలు పాటిస్తే ముక్తి నిస్తయ్యా?

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

లోకం చాలా మట్టుకు ఆచారాన్ని పట్టి నడుస్తూ వుంటుందిగాని, శాస్త్రాన్నిపట్టి నడవటం వుండదు.

- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

ఆచారము ఒక్కొక్కప్పుడు ధర్మాన్ని నాశనం చేస్తుంది. ధర్మము తెలిసి వుండిన్నీ ఆచారానికి దాసులమవుతున్నాము మనము.

- దీక్షితులు, తిరుప్పాణాళ్వారు

జారూ, బురదా, గట్లూ, గతుకులూ వున్న తోవ యాలా ఉంటుందో యిప్పుడు మన ఆచారాలు అలా వున్నాయి.

- గురజాడ, కన్యాశుల్కం

క్షీరం కలిసినందువల్ల కాఫ్యాదులు చెండాల హస్తంలోనుంచి ఆరగించవచ్చును.

- గురజాడ, కొండుభట్టీయము

సీనియారిటీనిబట్టి, కులాన్నిబట్టి ప్రమోషనిచ్చే ఆచారం ఈ దేశంలోనే తగలబడింది.

- నంది, నైమిశారణ్యం

సమాజంలో ప్రచలితంగా వున్న ఆలోచనల క్రియారూపమే ఆచారం.

- మహీధర, దేశంకోసం

రాజునకుఁ గిరీటమెట్టిదో భటునకు దవాలి యెట్టిదో మతమున కాచార మంతకంటె నెక్కువది కాదు.

- పానుగంటి, సాక్షి

ఆచారం ఆచారం అన్నంభొట్లూ అంటే పెద్ద చెరువు కుక్క ముట్టుకొన్నది అన్నట్లు.

- సామెత

ఆచారాలు ఆకాశంలోంచి రాలలేదు. భూమిలోంచి మొలవనూ లేదు. కేవలం స్వయంకృతాపరాధాలు.

- బీనాదేవి, టెన్ కెమాండ్‌మెంట్స్

**ఆటంబాంబు**

ఏమన్నా జ్ఞానం దయా వుంటే, యుద్ధమే తప్పకపోతే, ఆటంబాంబు తప్ప ఏ ఆయుధమూ ఉపయోగించకూడదని నియమం చేసుకోవాలి.

- చలం, మ్యూజింగ్స్

**ఆడపెత్తనం**

ఏయింట్లో ఆడుదాని పెత్తనం తలెత్తుతుందో ఆయింట సుఖం సంతోషం అనేవి మరిఉండవు.

- కాశీపట్నం, రాగమయి

**ఆడబిడ్డ**

ఆఁడుబిడ్డలు పుట్టిండ్లయందుఁ దఱుచు
కోడలికి మాఱుమగలని గుఱుతులేదె?

- ఏటుకూరి, క్షేత్రలక్ష్మి

**ఆడంబరం**

బారు బంగళా, కొంప దివాళా.

- సామెత

**ఆతిథ్యం**

అన్నమైనఁ దోయమైన ద్రవ్యంబైన
శాకమైనఁ దనకు జరుగుకొలఁది
నతిథిజనుల కడ్డమాడక యిడరేని
లేమ! వారు కలిగి లేనివారు.
- పోతన, భాగవతము

**ఆతురత**

అవకాశం ఒదులుకొన్నాక ఆడవాళ్ళకి ఆతృత పెరుగుతుంది.
- మారుతీరావు, నిజం నిద్రపోయింది

**ఆత్మ**

మనమాత్మతో సంభోగించినను కడుపు దేహమునకే వచ్చుచున్నది.
- పానుగంటి, సాక్షి

ఆత్మ మేలు కొన్నచో నది చిత్రచిత్రముగా మాటాడించును.
- విశ్వనాథ, తెఱచిరాజు

ఆత్మ ఎప్పుడూ మూలవున్న ముసలమ్మలకు మల్లే గొణుగుతూ వుంటుంది. కాని, దాని గొణుగుడు వినేదెవరు?
- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

ఆత్మ యాశ్మశానాన ధూమాంకితంబు
బ్రతుకు నాకు దుర్వేదనాభారభూతము.
- దువ్వూరి, కడపటి వీడుకోలు

దేహాలు ఒక్కచోటనే నివసిస్తాయి. కాని ఆత్మలు వేరే లోకాలు సంచరిస్తాయి.
- చలం, శశాంక

ఇచట నీవు జీవిస్తున్న ప్రపంచంలో ఆత్మలు ఎన్నటికీ వాడిపోవు కాగితాల పూలు లాగ.
- బైరాగి, నూతిలో గొంతుకలు

**ఆత్మగౌరవం**

బ్రతికి చెడినట్టి ఘనుని గొల్వంగవచ్చు
పెట్టినను పెట్టకున్నను బ్రీతి తోడ
చెడి బ్రతికినట్టి మనుజునిఁ జేరరాదు
ఆత్మగౌరవ మాశించు వ్యక్తియెపుడు.
- హనుమంతరావు, లేడీ డాక్టరు

ఆత్మగౌరవములేనివాని కిహమునందుఁ బర
యునందుఁగూడ దుర్గతియే.
- పానుగంటి, విప్రనారాయణ

**ఆత్మజ్ఞానం**

తన కలిమి ఇంద్రభోగం, తనలేమి స్వర్గ లోక దారిద్ర్యం; తన చావు జలప్రళయం.
- సామెత

**ఆత్మద్రోహం**

ఎంత నీచుడు కూడా ఆత్మద్రోహం చేసుకోడు.
- కొడవటిగంటి, వారసత్వం

అసలు సాహిత్యంతో ఈ దేశంలో నైతిక మానసిక విప్లవం తీసుకురాగల మనుకోవటమే ఓ పెద్ద ఆత్మవంచన.
- నంది, నైమిశారణ్యం

ఈ విద్యావంతులూ, సంస్కారప్రియులూ, వీళ్ళంత ఆత్మవంచకులు యెక్కడా లేరు.
- చలం, మ్యూజింగ్స్

ఆ వేదాంతం, విరక్తీన్నీ తమకి తెలియకుండానే మేధావులు అవలంబించే ఆత్మవంచన.
- లక్ష్మణరావు, అతడు-ఆమె

పనిలో లీనమవటమే ఏకాగ్రత. పనిని వదలి అదేపనిగా కాలయాపన చేయటం వృథా - అది ఆత్మవంచన.
- పులికంటి, శివపూజ

అన్నిటికన్నా ఆత్మవంచన చాలాకష్టం. అబద్ధం ఆడిపొందే గౌరవంకన్నా నిజమాడి పొందే అగౌరవం అనేక రెట్లు మెఱుఁగని నేననుకొంటాను.
- వెళ్ళపిళ్ల, కధలు - గాథలు

ప్రాచీన కాలంలో ఆత్మవంచకులవల్ల పెద్దనష్టం కలగలేదు కానీ, ఈ యుగంలో ముఖ్యంగా వ్యక్తి ప్రధానుడవుతున్న ప్రజాస్వామికయుగంలో వారి వల్లనే మహానర్థం సంభవిస్తున్నది.
- కృష్ణరావు, పాపికొండలు

**ఆత్మనాశ(న)ం**

తెలివి తేటలున్న వాళ్లు ఆత్మనాశనం పరిహరించుకొంటారుగాని చేతులారా కొని తెచ్చుకోరు.
- కృష్ణరావు, పాపికొండలు

సంపదన్వితు నొరుని సహింపలేక
చెఱుపఁ దలచుట తనుదానె చెఱుపుకొనుట
పాలతోఁ గూడ నీరమున్నాపనెంచి
పొంగుఁ దెప్పించు నగ్నియె పొలియదొక్కొ?
- వరదాచార్యులు, వైశాలిని

ఏ ప్రాణికూడా కోరికోరి ఆత్మవినాశాన్ని వరించదు. అది మనిషి కొక్కనికే అలవడిన దుర్వ్యసనం.
- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

**ఆత్మన్యూనత**

ఆత్మన్యూనత శంకచే (inferiority complex)

బాధపడేవాళ్లు ప్రతి స్వల్పవిషయానికీ విచక్షణా
శూన్యంగా తమ్ముతాము హింసించుకుంటారు...
అంతేకాదు, ఎదుటివాళ్ళను కూడా హింసిస్తారు.
- కాళీపట్నం, రాగమయి

**ఆత్మబలం**

ఒంటరిగా ప్రవాహానికి ఎదురీదడానికి ఎంతో
ఆత్మబలం కావాలి.
- పాప, రామరాజ్యానికి రహదారి

ఎందాఁక బుద్ధి నెగడెడి
నందాఁకఁ జరింపవలయు నాత్మబలమునన్
- పోతన, భాగవతము

బైటికి సుఖంగా వున్నట్లు కనపడతారు మను
షులు. పెద్ద పెద్ద అఘాతాలుంటాయి.
- బుచ్చిబాబు, ఆత్మవంచన

ఆత్మవిశ్వాసం అన్నది చలికి చాలని దుప్పటి;
చినిగిపోయిన గొడుగు.
- పాండురంగారావు, మనిషి చేసిన దేముడు

మనసు పెట్టి పనిచేస్తే ఏవృత్తిలో, ఏపనిలోనైనా
ఈ తృప్తే మనిషికి ఆత్మవిశ్వాసాన్ని కలిగిస్తుంది.
అప్పుడు ఆకలి నిద్ర ఆఫ్టాల్ అవుతాయి.
- బుచ్చిరెడ్డి, సహకారం

నైపుణ్యమూ ఆత్మవిశ్వాసమూ కొంతవరకూ
పరస్పరాధారాలు. వ్యక్తి ఆత్మవిశ్వాసానికి దెబ్బ
తగిలితే అతను విలవిలలాడి పోతాడు.
- వివినమూర్తి, ఉద్యమం

**ఆత్మవిమర్శ**

పరిస్థితులతో సంఘర్షణ పెట్టుకోదలచిన
వాళ్ళు సాధారణంగా ఆత్మ విమర్శనకు పూను
కోరు. పరిస్థితులతో రాజీపడేవారే తరచు
దానికి సిద్ధపడతారు.
- కొడవటిగంటి, సవతితల్లి

బతుకులో బాగుపడేవాడెవడూ నేను మంచి
వాణ్ణా లేక చెడ్డవాణ్ణా అని ప్రశ్నించుకోడు.
- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

అభివృద్ధి చెందే ప్రతిశక్తికి ఆత్మవిమర్శ అవ
సరం; అది లేనినాడు పతనం నిజం.
- వాసు, నిజంలో 'ఇజం'

**ఆత్మస్తుతి**

తన ప్రజ్ఞ తాను చాటుకొన్న వాణ్ణే లోకం
విలువ చేస్తుంది.
- చలం, మ్యూజింగ్స్

ఎనుబోతు బిరుదులు మనుబోతు పొగడంగ
మేలు మేలని గొట్టె మెచ్చినట్లు
ఓగుదగిడీలు తమలోన నొకరికొకరు
మెచ్చుకొనుచుందు రెటువంటి పిచ్చితనమొ!
- పుల్లకవి, చాటువు

తన్నుఁ దా మెచ్చుకొన్న సార్థక్యమేమి
గలుగు నరునకు? తమివోని కొంత బలిమి
స్వకుచమర్దన మొనరింప సౌఖ్యమగునె?
- శేషగిరిరాయకవి, నమశ్శివాయ శతకము

మన సంగతి డప్పు కొట్టేవాడు లేనప్పుడు
మనమే కొట్టుగోడం మరేమీ ఓఘాయిత్యం
కాదు, పాపంకాదు.
- భమిడిపాటి, కచటతపలు

మనం మెచ్చుకునేవాళ్ళు ఎప్పుడూ మనకు
యిష్టులుగానే వుండిపోతారన్న నమ్మకంలేదు.
కాని మనల్ని మెచ్చుకునే వాళ్ళను మాత్రం
మనమెప్పటికీ యిష్టపడుతూనే ఉంటాము.
- చిరంజీవి, బోలో స్వతంత్ర భారత్‌కీ జై

ఆత్మస్తుతి యాత్మహత్యతో సమానమయినదేకదా!
- తి.వేం., పాండవవిజయము

తన్నుదా పొగడుకుంటే తన్నుకొని చచ్చినట్లుం
టది.
- సామెత

**ఆత్మహత్య**

ఆత్మహత్య చేసుకునేవాళ్ళు సాధారణంగా ఆత్మ
హరాయణులూ, పిరికి పందలూ అయి వుంటారు.
- కొడవటిగంటి, జీవితేచ్ఛ

ఎటువంటి పరిస్థితులైనా రానీ, ఒకవ్యక్తి
తనను తానే ఖూనీ చేసుకోవటమా?
- రంగనాయకమ్మ, పేకమేడలు

జీవించటం సుఖం కోసం అనే పథం నుంచి
తప్పి, జీవించటం అర్పణకోసం అనే భావం
ఆత్మహత్యా హేతువు.
- చలం, మ్యూజింగ్స్

మనవాళ్ళు ఆత్మహత్య చేసుకునేటందుకు రక
రకాల విద్యలు నేరుస్తున్నారు.
- కొడవటిగంటి, పట్నవాసం

నాకు తెలియక అడుగుతాను. మీ ఊళ్ళోనే
గోదావరి ఉండగా ఇంతదూరం ఎందుకు
వచ్చావు ఆత్మహత్య చేసుకోవటానికి?
- వెంకటేశ్వర్లు, వక్రించిన పరిస్థితులు

రాక మాననిదీ, మానక వచ్చేదీ ఒకటే, అదే

నాశనం, అదే మృత్యువు!

- పిచ్చేశ్వర్రావు, వెర్రికాదు, వేదాంతం!

హత్యలు, ఆత్మహత్యలు, పోలీసులు సొమ్ము చేసుకోడానికి అవకాశాలు!

- యజ్ఞన్నశాస్త్రి, ఓ మనిషి నూతిలో పడితే

ఈ సమ్మంధం చేస్తే నేన్నుయ్యో గొయ్యో చూసుకుంటాను.

- గురజాడ, కన్యాశుల్కం

ఆత్మహత్య చేసుకోవాలంటే ఎంతో మనోధైర్యం, పట్టుదల, తెగింపు ఉండాలి. వాటినే జీవిత పథాన సద్వినియోగం చేస్తే జీవితాన్ని పూల బాటగా మార్చుకోగలరు.

- బుచ్చిరెడ్డి, అసమర్థుని ఆత్మహత్య

అరచేతికి రక్తం అంటకుండా చేసిన హత్యే ఆత్మహత్య.

- శ్రీనివాస్, ఆత్మహత్యలన్నీ హత్యలే

కాశీకి వెళ్ళి కవిగారు కలం వదిలినట్టు.

- శ్రీరమణ, న్యూసుడి

**ఆత్మానుభవం**

ఆత్మానుభవం అయితేనేగాని తత్వం బోధపడదు.

- గురజాడ, కన్యాశుల్కం

మనిషికి ఆత్మాభిమానం ఉండాలంటారు. అది లేకపోతే కుక్కలకీ మనకీ తేడా ఏమిటి?

- కొడవటిగంటి, ఒకదురంతం

**ఆత్మావలోకనం**

ఆడవాళ్ల కష్టసుఖాలు ఆడవాళ్లకే బాగా అర్థమవుతాయి.

- సరస్వతీదేవి, ఆమాటకు ఈ జవాబు

**ఆత్మీయత**

మనం ఎవర్నైతే ఎక్కువగా అభిమానిస్తామో వార్నే తీవ్రంగా మందలిస్తాము కూడా.

- పురాణం, అనవసరపు దాంపత్యం

ఒకజీవి ఈ లోకాన్ని వదిలి వెళ్ళిపోతున్నప్పుడు ఆత్మీయులు చూపించేది ఒక్క ఆదర్శమైన చూపు మాత్రమే!

- శ్యామలారాణి, జీవవాహిని

సంబంధమే అక్కర్లేదు. ఆత్మీయతకు అనుబంధం చాలు.

- కౌసల్యాదేవి, శాంతినికేతన్

**ఆత్మోద్ధరణ**

తన్ను మాని చేంత తగవుగాదు.

- పోతన, భాగవతము

ఇతరుల్ని ఉద్ధరించడం అనే బురఖా వదిలేసి, ఎవర్ని వారు ఉద్ధరించుకుని ఊరుకుంటే దేశంలో సగం అనర్థాలు సమసిపోతాయి.

- కౌసల్యాదేవి, శాంతినికేతన్

**ఆత్రం**

కొత్త బిచ్చగాడు పొద్దెరగడు.

- సామెత

ఆరాటపు పెళ్ళికొడుకు పేరంటాలి మెడలోనే పుస్తె కట్టేశాడట.

- బాపిరాజు, పాతమాట

**ఆదరణ**

లోకంలో ఎన్నిరకాలైన కష్టాలున్నాయో అన్ని రకాలుగా ఆదుకోవడానికి ఒక్కొక్కప్పుడు మంచివాళ్ళు కూడా వుండకపోరు.

- తాళ్లూరి, శ్రావణసంధ్య

అన్నములేదు కొన్ని మధురాంబువులున్నవి త్రావుమన్న రావన్న శరీరధారులకు నాపదవచ్చిన వారి యాపదల్ గ్రన్నన మాన్పి వారికి సుఖంబులు సేయుటకన్న నొండుమేలున్నదే?

- పోతన, భాగవతము

అప్పుడప్పుడు మనము రోగములచేత బాధపడక మానము. అట్టి సమయములయందు నాత్మబంధువుల యాదరణము మన శరీర రోగములను మనోరోగములను మాన్పును.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

**ఆదరం**

సామాన్యంగా గొప్పవాళ్లకు చూపే ఆదరమే పెద్ద జబ్బులో వున్నవాళ్లకూ, గొప్ప విపత్తు సంభవించిన వాళ్ళకూ చూపటం స్వాభావికం.

- కొడవటిగంటి, చదువు

**ఆదర్శజీవి**

రచయితల విజ్ఞాన సాహసాన్ని బట్టే జనించారు ఆదర్శజీవులు.

- చలం, మ్యూజింగ్స్

**ఆదర్శప్రేమ**

ఆదర్శమైన ప్రేమ ఎడబాటుతోనో ఆత్మహత్యతోనో పరిసమాప్తమవుతుందట.

- ఆచార్య, ఎవరీ మనిషి

**ఆదర్శ భర్త**

దేవుడమ్మా దాని మొగుడూ<br>
దీవినేలే గొల్లవాడూ<br>
నందిదేవీ వంటివాడూ

యెందుబోయిన ఏమి అనడూ
- జానపద గేయం

ఆదర్శం

నన్నడిగితే అమల్లో పెట్టడానికి వీలున్నదేదో అదే ఆదర్శమంటాను.
- రాజారాం, వగపేటికి చల్లచిందినన్

ఆదర్శములు కొన్ని
అద్భుతంబులె కాని
పాదాలు మోపేటి
పాటి చోటేముంది?
- ఉమర్‌అలీషా, ఉండిపోయేదేమి?

మన ఆదర్శాల శివతాండవమే సరికొత్త శబ్దాల హేతువు.
- కుందుర్తి, యుగేయుగే

ఆశయాలు ఆదర్శాలూ అంగవస్త్రాలలాంటివి. హరాత్పవన వీచికకి అట్టే తొలిగిపోతవి.
- తిలక్, మైనస్ ఇంటూ ప్లస్

నీ ఆదర్శాల లగేజీ
ఎక్సె సంటాడు టి.ఐ.సీ.
- ఆరుద్ర, నీటి గడియారం

సేవకుని లాగా చేయాలి, రాజులాగా అనుభవించాలి.
- సామెత

ఆదర్శాలన్నీ కలలు.
- రమణారెడ్డి, ధమ్మఘోష

ఆది

అగ్ని రాజుచుండ నట్టె యార్పంగ వచ్చు
నాశలంటు మంట లార్పందరమె?
పురిటిబిడ్డ వాలు శిరమట్టె సరిచేయ
వచ్చు ముదురుతలకు వంక చెడునె.
- పానుగంటి, చూడామణి

ఆదుర్దా

కంచిలో దండవేస్తారని కాళహస్తినుంచి ఒంగి పోయినట్టు.
- శ్రీరమణ, న్యూనుడి

ఆధారం

రోగయుతునికె యారోగ్యరుచి యధికము
వడందగులువానికే శీతవారి యనువు
బద్ధునకె స్వైరతావాంఛ ప్రబలము మఱి
యొడలు వంగినవానికే యూంతకోల.
- పానుగంటి, పాదుకా పట్టాభిషేకము

చెట్టును నరికే గొడ్డలికి ఆధారం
ఆ చెట్టుకొమ్మే అవుతున్నది.
- చిరంజీవి, బోలో స్వతంత్ర భారత్‌కీ జై

ఫిలిం నిర్మాతలు నవలలు ఆధారంగా సినిమాలు తీస్తుంటే, రచయితలు సినిమాలు ఆధారంగా నవలలు రాస్తున్నారు.
- పార్థసారధి, చలనచిత్ర జగత్‌కిలాడి

మనిషి తన అంతరాత్మను సంతృప్తి పరచుకోవటానికి నిరాశావాదం అవలంబించదలచిన దానికి ఆధారాలు దొరక్కపోవు.
- కొడవటిగంటి, చదువు

చారకొద్దీ గట్టూ, కోరకొద్దీ పులి.
- ఉన్నవ, నాయకురాలు

ఆలోచనలేని వాగ్దానానికి, అగమ్యమే ఆధారమౌతుంది.
- పినిశెట్టి, కులంలేనిపిల్ల

పదం పద్యం పట్టి నిలిచెను
కీర్తు లపకీర్తుల్.
- గురజాడ, కన్యక

మంచి కార్యశూరుడు దేనికీ ఇతరుల మీద ఆధారపడడు. మంచి యజమాని అన్నిటికీ ప్రభుత్వాల కేసిచూడడు.
- కాశీపట్నం, శాంతి

ఆధునిక వైద్యం

మాడరన్ మెడిసిన్ చాలా ఎడ్వాన్స్ అంటే బాగాపైకి వెళ్లింది లెండి. దాంతోపాటు రోగులూ పైకెడుతున్నారు.
- బుచ్చిబాబు, మధురతరంగం

ఆధునిక సంస్కారం

చదువుకున్న వాళ్ళు హోటల్లో పడిమెయ్యక పోతే ఆధునిక సంస్కారం అబ్బదు.
- నంది, నైమిశారణ్యం

ఆనందం

బాధలో ఆనందం వుందన్నారు, వుందుచుట్టూ గోకడంలాగు.
- చలం, మ్యూజింగ్స్

జేబులు కొట్టడం, బ్రతుకులు కొట్టడం, తలలు కొట్టడం కొందరి అవసరానికీ, మరికొందరి ఆనందానికి.
- పులికంటి, శివపూజ

వినోదమునందు స్వార్థరహితమైన సుఖమున్నది. ఆనందమున్నది.
- విశ్వనాథ, నందో రాజా భవిష్యతి

మనల్ని మనం మోసగించుకునే శక్తిమీద మన ఆనందం ఆధారపడుతుంది.
- బుచ్చిబాబు, స్వతంత్ర జీవులు

సోమరితనం ఉండడంలోలాగే మందమతిగా వుండటంలోనూ కొందరికి ఆనందం వుంటుంది కాబోలు.

- కొడవటిగంటి, జీవతేచ్ఛ

ఆనందం ఒక ఆధునిక కవి సమయం.

- గోపాల చక్రవర్తి, రేపటి మనిషి

బ్రహ్మానందమంటే యేటి? కడుపునిండా సారా, ముక్కునిండా పొడి, పక్కని పడుచు పిల్లా కదా!

- గురజాడ, కన్యాశుల్కం

అజ్ఞానులు అతిసులభంగా ఆనందపరవశులై పోతారు.

- రావిశాస్త్రి, కలకంఠి

కేవలం ఆనందం సమిష్టి సృజనాత్మక క్రియకి నాందికాదు.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

ఆనందమనేది మన మనస్సుల్లో తప్ప మననావరించి ఉన్న పరిసరాల్లో లేదు.

- కళ్యాణచక్రవర్తి, మొగలిపువ్వు

చిన్నపిల్లలు స్వతస్సిద్ధంగా వేదాంతులు. ఎట్టి సిద్ధాంతాలూ ఎరగని నిర్లిప్తమైన మనస్సులతో, వాళ్ళు జీవితంలోని మంచి చెడ్డలనూ, కష్ట సుఖాలనూ తమ అనుభవంగా చేసుకుంటారు. కనకనే వాళ్లకు జీవితం నుంచి పెద్ద వాళ్ళు పొందలేని ఆనందం లభిస్తుంది.

- కొడవటిగంటి, చదువు

మన ఆనందం మనలను మోసగించుకునే శక్తి మీద ఆధారపడుంది.

- బుచ్చిబాబు, ఒమర్ ఖయామ్

అగడు మగడి పాలు, ఆనందం (అనుభవం) ఊరి పాలు.

- సామెత

జీవిత మైదానంలో ఆనందం జీవనది.

- గోపాలచక్రవర్తి, ఆనందజీవనది

ఊబిలో పడ్డ ప్రతివాడు ఆనందాబ్ధి అంటాడు.

- కాళోజీ, చాదస్తం

ఆనందం అమ్ముడుపోయిన కళాఖండం.

-జ్వాలాముఖి, పూల కబేళాలో డిశంబర్‌రోజాలు

ఎవరి వెర్రి వారికానందం.

- సామెత

**ఆనవాలు**

కరెన్సీ నోటుకు ఆనవాలేముంది?

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

**ఆనుకూల్యం**

ఈరోజుల్లో రైలు పెట్టెలనుంచీ, సినిమాకు వెళ్ళే రోడ్డు మీద వరకూ ప్రేమ ఘట్టాలకు అనుకూలమైన వాతావరణమే.

- ధనికొండ, పవిత్రులు

కాలానికనుగుణంగా ప్రవర్తించలేకుంటే, మంచి పని చేసినా శిక్షలే అనుభవించవలసి వస్తుంది!

- శ్యామలారాణి, జీవవాహిని

**ఆనుపూర్వి**

ముందు కాలకూటము, పిమ్మట నమృతము.

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

**ఆంధ్రత్వం**

అంతుచూసేవరకు
ఆకట! ఆంధ్రుల చురుకు
నిలువవుండని సరుకు
ఓ కూనలమ్మా.

- ఆరుద్ర, ఇంటింటి పద్యాలు

**ఆంధ్రపత్రిక**

అమృతాంజనమునుబట్టి యాంధ్రపత్రిక జ్ఞప్తికి వచ్చినది. ఆంధ్రపత్రికనుబట్టి దానిలోని సార స్వతానుబంధము జ్ఞప్తికి వచ్చినది.

- పానుగంటి, సాక్షి

**ఆంధ్రుడు**

ఆంధ్రులకు స్వజాతీయుడు మేరు పర్వతమంతటి ఘనకార్యము చేసినను అది మెంతిగింజ వలె గనవచ్చును.

- బంగారయ్య, రాజ్యలక్ష్మి

మీ అందానికి మేం తెలుగువాళ్ళం చాలమో?

- గురజాడ, కాన్యాశుల్కం

నాదు జాతి- నాదేశము- నాదుభాష అనున హంకారదర్శన మందు మాంధ్ర.

- రాయప్రోలు, ఆంధ్రావళి

తెలివికి సంస్కృతమో మఱి
కలిమికి నాంగ్లేయమో యింకం దురకంబో
విలువయిడి నేర్చి నీయీ
తెలుఁగెవ్వరి పాలుచేసి తిరిగెద వాంధ్రా?

- శివరామశాస్త్రి, చాటువు

ఆంధ్ర మాతాపితలకు బుట్టినవాడే - ఆంధ్ర దేశీయ వాయు నీరాహార పారణ మొనర్చిన వాడే - అధమాధమ మూఱు సంవత్సరముల యీడువచ్చుకైన నాంధ్రమున మాటలాడిన వాడే- అట్టివాడాంగ్లేయ భాష నభ్యసించినంత

మాత్రమున నిప్పుడాంధ్రమున, మాటలాడ లేకుండునా? ఆశ్చర్యము, అవిశ్వసనీయము. అసత్యము.

- పానుగంటి, సాక్షి

అప్పారావు నానేస్తం
ఆంధ్రత్వం నా శాపం

- శ్రీశ్రీ, ఖడ్గసృష్టి

బుద్ధి కుశలత గల ఏ పనిగాని, ఏ ఆంధ్రుడూ చేయలేదని, ఆంధ్రుడికి ఒక గట్టి నమ్మకం.

- మొక్కపాటి, బారిష్టర్ పార్వతీశం

మీ ఆంధ్రులు ఈ ఆవకాయ, కారం చెమట్లకి తట్టుకోలేక కాబోలు, అతిశయోక్తి వస్త్రం విప్పేసి, కేవలం గద్యలా- చెట్టు మోడులా, నీళ్ళల్లో పడేసిన నిప్పుకణంలా...

- బుచ్చిబాబు, ఒకేనిద్ర- ఎన్నోకలలు

మీ తెలుగువాళ్ళకి ఇతరులతో పొత్తు కుదరదు. మరొకరి పంచ గిట్టదు. ఉన్నచోటే ఉండిపోతారు. స్తబ్ధులు.

- బుచ్చిబాబు, ఒకేనిద్ర - ఎన్నోకలలు

ఆంధ్రుడు చిత్రమైన వ్యక్తి - ఇతర ప్రాంతాలలో ఏ రంగంలో విపరీతం బయలుదేరినా వెంటనే అనుకరిస్తాడు- కాని వారితో కలిసి ఉండలేడు. దేశాన్ని ప్రేమిస్తాడు, దేశంలో ప్రజలంటే గిట్టదు.

- బుచ్చిబాబు, ఒకేనిద్ర - ఎన్నోకలలు

తను తానుగా కాక, మరొకరిలా ఉండగలగడంలో ఆంధ్రుడు అందె వేసిన చెయ్యి.

- బుచ్చిబాబు, ఒకేనిద్ర- ఎన్నోకలలు

ఆంధ్రుణ్ణి కదిపితే అగ్ని కక్కుతాడు.

- బుచ్చిబాబు, మధురతరంగం

## ఆపద

నిజముగా మనజున కాపదయే మహాబలము. సంపత్తు వట్టి పిటికిది.

- పానుగంటి, వీరమతి

## ఆపద్ధర్మం

వడిదుడుకు లేర్పడ్డప్పుడు జీవితానికి భంగపాటు తటస్థపడకుండా చూసుకోడానికే ఆపద్ధర్మాలు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి అనుభవాలూ, జ్ఞాపకాలూనూ

## ఆపరేషన్

అసలు ఆపరేషన్ పనిచేసినట్లు
కో ఆపరేషన్ పనిచేయదు.

- వేదాంతకవి, ఆకలిమంట

## ఆపలేనిది

ఈప్సితార్థంబునకుఁ బాఱు హృదయరుచియు. నిమ్నమున కోడిగిలు నీరు నిలుపరాదు.

- శ్రీనాధుడు, హరవిలాసము

ఆడదానిని, అశ్వమును నెవ రాపగలరు?

- కాళ్ళకూరి, చింతామణి

## ఆపేక్ష

ఆపేక్షా బుద్ధిలేనిచో నెట్టి మేధావికిని దృష్ట వస్తుస్మరణము కలుగదు.

-తి.వేం., ప్రభావతీ ప్రద్యుమ్నము

## అప్పుడు

అప్పు లొనరించినది నేర మగునె చెపుమ?

- చిలకమర్తి, గయోపాఖ్యానము

అవసరానికి ఆదుకున్నవారే అప్పులు.

- బుచ్చిబాబు, ఆద్యంతాలు, మధ్య 'రాధ'

## ఆప్యాయత

ఆప్యాయతకున్న విలువ, అధికారానికి లేదు.

- ముద్దంశెట్టి, తప్పించుకోలేవు

## ఆఫీసర్

పార్టీలనందరిని సగౌరంగా ఆహ్వానించే ఆఫీసరంటే మామూలు బంట్రోతుకే నచ్చదు.

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

## ఆబ

అభ్యర్థికి ఆటో లేదంటే కార్యకర్త కారుతెమ్మన్నాట్ట.

- శ్రీరమణ, న్యూనుడి

## ఆభరణం

ఆభరణములు హిందూదేశ స్త్రీలకు జీవనాధారములైన యాస్తి.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

## ఆయాసం

నడిస్తే మార్గాయాసం, తింటే భుక్తాయాసం తిమ్మావధానికి.

- సామెత

## ఆయుధం

ఈ జడతో కొడతాను, శాస్త్రంలో కాముకులకు జెప్పిన ఆయుధవిఁది.

- గురజాడ, కన్యాశుల్కం

పురుషాధిక్య సమాజంలో స్త్రీని తన చెప్పు చేతల్లో వుంచుకోవటానికి, కాళ్ల దగ్గరకు రప్పించుకోవటానికి పురుషునికి రెండు ఆయుధాలు

న్నాయి ఒకటి విడాకులు, రెండు పిల్లలు.
- ప్రసాద్, ప్రమదావని

సమరంలో నాకు పాట కూడా ఆయుధమే.
- హెచ్చార్కె, పదునుదేరిన పాట

**ఆయుస్సు**

ఆయుస్షు తీరినవాడు ఆరునెలలకి చస్తే
అనుమానపడినవాడు అప్పుడే చస్తాడు.
- సామెత

**ఆరంభం**

ఆరంభరహితుఁ బొందునె
యారయ సంపదలు హీనుఁడయ్యును బురుషం
డారంభశీలుఁ డయి యక్కు
తారంభుల నోర్చు నెంత యధికుల నయినన్.
- నన్నయ, సభాపర్వము

**ఆరాటం**

నిన్నటి యాట నేఁడారాటమై పరిణమిం
చును. నేఁ డుపాధ్యాయులయింట వానితల్లి
తద్దినమైనచో బాగుగనుండును.
- కోలాచలం, శిలాదిత్య

**ఆరాధన**

ఒంటపట్టిన దేహప్రీతికి
అంతుపట్టని ప్రాణభీతికి
ఆశ్రయమిచ్చిన దివ్యకల్పన
అతిశయోక్తుల ఆరాధన
- సినారె, విశ్వంభర

రెండోవారి సాన్నిహిత్యంవలన స్త్రీ పురుషులలో
అనుభూతం అయ్యే మానసికోన్నతిని గుర్తించ
గలగడం ఆరాధనకు మూలం.
- మహీధర, ఓనమాలు

అర్థంకారని తెలిసినా ఆడ-మగ ఒకరినొకరు
ఆరాధ్యదేవతల్నిగానే భావిస్తున్నారు. అర్థంకాక
పోవటం ఆరాధనకి అవసరమేమో...
- మహీధర, ఓనమాలు

**ఆరు**

రిఫార్మిస్టు, రివిజనిస్టు, రియాక్షనరీ, ఈ మూడూ
'మూడార్'లు. ఆరు సంఖ్యావాచకం కాదు.
- మహీధర, స్వయంవరణం

**ఆరోగ్యం**

దేహం వొకటి వుందని గుర్తుకురానీయకపోవ
డమే ఆరోగ్యం.
- చలం, మ్యూజింగ్స్

అన్నులు బాగా తిని తాగడమే ఆరోగ్గె సూత్రం.
- రావిశాస్త్రి, బంగారిగాడికత

**ఆర్టిస్టు**

అతను కమర్షియల్ ఆర్టిస్టు. అందుచేత మను
షులను మనుషులల్లే వేశాడు.
- కొడవటిగంటి, జీవితం

కళ, తాగడంతో పని చేస్తుంది. తాగినవాణ్ణి
లోకం అర్థం చేసుకోగలదుకాని, ఆర్టిస్టుని
అర్థం చేసుకోలేదు.
- చలం, మ్యూజింగ్స్

వ్యక్తిత్వాన్ని రద్దు చేస్తూ రావడమే గొప్ప
ఆర్టిస్టు లక్షణం. వ్యక్తిత్వం రద్దయింతర్వాత
ఆర్టిస్టు ప్రపంచానికి చెందుతాడు.
- బుచ్చిబాబు, ఒకేవిధ్ర - ఎన్నోకలలు

ఆర్టిస్టుకూ కూలీ చేసుకునే వాడికి తేడావుంది.
ఆర్టిస్టుచేత వాడి అనుమతి లేకుండా పని
చేయించలేం!
- కొడవటిగంటి, బెదిరిన మనుషులు

**ఆర్టు**

నిజమైన ఆర్టు ప్రజల్ని మైమరిపించేదిగా
వుండాలే కాని వార్ని రెచ్చగొట్టేదిగా మాత్రం
వుండకూడదు.
- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

**ఆర్ద్రత**

ఒక విచిత్రమైన యాత్మసంబంధమైన మనఃప
ర్యాప్తమైన యొక యార్ద్రప్రవృత్తి యిద్దరి
వ్యక్తుల నడుమ నున్నచో నది యొకానొక
క్రియావ్యవసాయమునందుఁ బ్రత్యక్షఫలముగా
భాసించును.
- విశ్వనాథ, తెఱచిరాజు

**ఆర్పుడు**

కండ్లు ఆర్పినమ్మ యిండ్లు ఆర్పినదట.
- సామెత

**ఆర్భాటం**

కాచుకొన్న గంజి తాగనిస్తే, నేను
కమ్మనాయుడను (కాపు) కాదన్నాడట.
- సామెత

కల్ల పైడికి కరుకులు మెండు.
- సామెత

మంత్రంలేని సంధ్యకు మరి చెంబెడు నీళ్ళు.
- సామెత

అభిమానుల ఆర్భాటమేగాని హాల్లో పురుగు
లేదు.
- శ్రీరమణ, న్యూనుడి

**ఆలయం**

దేవాలయాలు భక్తులకేకాక, ప్రేమికులకి

సంకేతస్థలాలు.
- ఆశాలత, ప్రేమపిపాసి

ఆలస్యం

ఇది తప్పు అనేది తెల్సుకునేసరికి కొన్ని అన ర్థాలు జరిగిపోతూనే ఉంటాయి.
- గోవిందరాజు, పూలనావ

అత్త చచ్చిన ఆరు నెలలకు కోడలికంట నీరు వచ్చింది.
- సామెత

కచ్చేరిలో కాగితం పడ్డా కోళ్ళగంపలో పిల్లిపడ్డా త్వరలో తెమలవట.
- సామెత

గో, రంతాలస్యంబునఁ గొండంత ప్రయోజ నము దప్పు.
- పింగళి, కళాపూర్ణోదయము

కొన్నివేళల ఆలస్యం తొందరగానే అవుతుంది సుమీ.
- రామకృష్ణశాస్త్రి, లాలి

ఆలస్యం నీ ఓటమి రహస్యం.
- ఆరుద్ర, స్టాప్ వాచీ

మందుకు పంపితే మాసికానికి వచ్చినట్లు.
- మహీధర, దేశంకోసం

నాంచారమ్మ వంట నక్షత్రదర్శనం ఒక్కమారే.
- సామెత

ఆలు

అమ్మకడుపు చూస్తుంది. ఆలు వీపు చూస్తుంది. (ఇంటికి రాగానే వీపున ఏమైనా ముల్లె వున్నదో లేదో అని)
- సామెత

ఆలి పంచాయితీ రామాయణం, పాలి పంచా యితీ భారతం.
- సామెత

ఆలోచన

మనుష్య మాత్రులమే కనుక ఆలోచించకుండా ఎంతమంది జీవితాలు నిరర్థకం చేస్తామో మనకే తెలియదు:
- వెంకట సుబ్రహ్మణ్యం, పారిస్ కథ

రాజవరుల కెపుడు రణరంగమున చింత
పరమ మునుల కెల్లఁ బరము చింత
అల్పనరులకెల్ల నతివలపై చింత
- వేమన

మన దేశంలో ఎవరూ సొంతంగా ఆలోచిం చరు. ఏ 'దేవుడో' ఉపదేశం ఇస్తే, లెంపలేసు కుంటారు. కళ్ళు మూసుకుని బ్రతికేస్తారు.
- ఆనందారామం, ఇదా భారతం?

ఏ ఆలోచన ఉన్నా పరవాలేదుకాని రేపెలా గడుస్తుందనే ఆలోచనమాత్రం మనిషికుండకూ డదు ఆ ఆలోచన మనిషికొచ్చిందంటే మనిషి మనిషిలాగ బతకటంలేదన్నమాట.
- విశ్వం, ఎన్.జి.వో. భార్య

ఆలోచిస్తే అన్నంకూడా ముట్టలేం. గొప్ప వాళ్ళంతా గొప్ప గొప్ప పనులన్నీ ఆవేశంలో చేసేశారు.
- దివ్యప్రభాకర్, శిరోమణి

కులాన్ని పట్టి ఆలోచనా ధోరణులు ఏర్పడవు.
- మహీధర, ఓనమాలు

చదువు గురించి ఆలోచించేటప్పుడు ఖర్చూ ఉద్యోగమూ ఆలోచించకపోవటం చాలా పొరపాటు.
- కొడవటిగంటి, చదువు

బాధ్యత పట్టించుకొనేవాళ్ళ ఆలోచనలు ఒడిదు డుకుల్లో పడవు.
-మహీధర, ఓనమాలు

ఆలోచనలు పాదరసంలా దొర్లిపోతాయి. జ్ఞాప కాలు అనంతంగా తీగలు సాగిపోతాయి.
- సోమసుందర్, రేపటి పాటలకోసం

ఆలోచన అనేది మౌనభాష. మానసాగ్నికి సక్రియరూపమే ఆలోచన. ఒంటరిగా వున్న మనిషికి ఆలోచన అనేది ఒక అదృశ్య సహచరి.
- సంజీవదేవ్, నాజైరే నుంచి

చక్కఁగా విచారించి చేసిన పనికి హాని యెప్పు టికి రాదు.
- చిన్నయసూరి, మిత్రలాభము

మతి చెడకుండా ఆలోచించితేనే ఫలితం ఉంది.
- కొడవటిగంటి, నిజమైన పతివ్రత

ఆలోచన అనేది ఏ జాతిసొత్తూ కాదు. ఏ వ్యక్తి కాణాచీకాదు.
- కృష్ణరావు, పాపికొండలు

ఇంత దలపోయవు నీ చదువేల, చెప్పుమా?
-పెద్దన, మనుచరిత్ర

కోరి తెచ్చికొన్న యూహలనుగూర్చి యాలోచిం చుట సుఖము. సుఖమో కాదో అది బాధయ నిపించదు. కోరక వచ్చిన వానిని గూర్చి యాలోచించుట దుఃఖము.
-విశ్వనాథ, తెఱచిరాజు

ఒంటరితనంలో ఆలోచన రెక్కలు విప్పుకొం టుంది.
- పులికంటి, భా(భీ)మాకలాపం

ఆలోచనలన్నీ ఎప్పుడైనా పనీపాటా లేకుండా తీరిగ్గా కూచున్నప్పుడొస్తుంటాయి.

- పాప, రామరాజ్యానికి రహదారి

ఆలోచించి పనిచెయ్యటం మంచిదే కాని ఆలోచన ఒకప్పుడు పనికి అంతరాయం కలిగిస్తుంది.

- రావిశాస్త్రి, పిపీలికం

ఆలోచన్లు గాలిలో తేలుతూవుంటాయి....
ఏదైనా బుర్ర ఖాళీగా కనిపించిందనుకో
అందులో ప్రవేశిస్తాయి... దూరేస్తాయన్న
మాట... దూరేసి ఇంక అక్కడే వుండిపోతా
యన్నమాట.

- పతంజలి, అప్పన్నసర్దార్

లౌకికములైన యే విషయము లాలోచించ కుండ జాగ్రదవస్థలో మానవుఁ డొక్క నిముస మైన నుండలేఁడు.

- విశ్వనాథ, తెఱచిరాజు

సంతోషానికి సాకులేదు. ఆలోచనకి అంతులేదు.

-సామెత

ఇరుకు మెదడు మురికిగా ఆలోచిస్తుంది.

- నాగచంద్రావతి, కాలం కరిచాక

చెరలో మండే తలపులు
చేపని రొమ్ముల వలపులు

- అనిశెట్టి, పచ్చగ ఈ నేలంతా

ఆలోచనలనేవి న్యాయాన్యాయాలూ, అర్హతానర్హతలూ అన్నీ చూసుకుని రావు.

- ఆనందారామం, ఉరిమే మబ్బులు

**ఆవకాయ**

సైన్యానికి మందుగుండు సామాగ్రి యెలాగో ఆంధ్ర సంసారానికి ఆవకాయ అలాంటిది.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

**ఆవిర్భావం**

కోటి స్వగతాలు పోరాడందే ఉన్నత సమాజం ఆవిర్భవించదు...

- జ్వాలాముఖి, నక్షత్రాల వంతెన

**ఆవలింత**

వింతలేందే ఆవలింతైనా పుట్టదు.

- రాజమన్నారు, దెయ్యాలలంక

ఆవులింతకు అన్నలున్నారుగాని తుమ్ముకు తమ్ముడులేడు.

- సామెత

**ఆవేదన**

కడుపు నింపుకుంటే కాల్లమీద బడ్డది.

- కె.యల్, కొత్తవడి

ఆవేశం నించి ఆవిర్భవించేదే ఆవేదన.

- ఆత్రేయ, అశ్వఘోషుడు

**ఆవేశం**

మనస్సు నిష్కల్మషంగా వున్నవాడికి యిట్టే ఆవేశం కలుగుతుంది.

- సూర్యారావు, మాలోమేం-ఆంధ్రులం

ఆవేశం ఆశయాన్ని ధిక్కరించి అనూహ్య పరిణామాలకు దారితీస్తుంది.

- ఛాయారాజ్, శ్రీకాకుళం

తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యుని
చుట్టూ పరిభ్రమించే భూమిలాగ ఆశయం
చుట్టూ తిరుగుతోంది ఆవేశం.

- శ్రీశ్రీ, బొమ్మలాంతరు

ఆవేశం అవివేకానికి తావిస్తుంది.

- కౌసల్యాదేవి, శాంతినికేతన్

ఆశయ సంపూర్తి కోసం అవతరిస్తుంది ఆవేశం

- మల్లికార్జున్, కరటకదమనకులు

అభిమానం వున్నచోట ఆవేశం వుంటుంది.

- భరాగో, నాకీ ఉద్యోగంవద్దు

**ఆశ**

ఆశ మనిషిని బతికిస్తుంది.

- రామచంద్రమూర్తి, ఊబి

బంగరున కాశించి యంగనలను వృద్ధజంబుక ములకిచ్చి వారి జన్మమే భంగపఱచెదరు.

- కోలాచలం, శిలాదిత్య

ఆశకి అద్దుండాలి, పాపానికి శిచ్చుండాలి.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

ఆశ మనుష్యునకు మైకము గల్గించి వివశుని జేయుటలో మద్యమును మించియుండును.

- చిలకమర్తి, కర్పూరమంజరి

ఆశ విషముకన్న దహనముకన్న దారుణమైనది.

- చిలకమర్తి, కర్పూరమంజరి

మనకు అనుభవంలోకి వచ్చే అవకాశంలేని దాని మీద ఆశ ఎక్కువ.

- మహీధర, కత్తులవంతెన

ప్రతి మానవుడికి జీవితంలో 'ఆశ' అనేది ఉండాలి. అది లేనిదే మానవుడు బ్రతుకలేడు, అదే మనుగడకు ప్రాణం.

- బుచ్చిరెడ్డి, అసమర్థుని ఆత్మహత్య

ఆశలులేని జీవితం పునాదుల్లేని భవనం లాంటిది.

- మాడపాటి, అంతామోసం!

మనిషి సస్తే ఆసె మాత్తరం ఉండిపోద్దా
యేటి? అదీ సస్టి!

- రావిశాస్త్రి, మంచి చెడ్డల్లో ఏ కథ?

మేష్టారూ! హోపేగదా మనకి ప్రాణం!

- రావిశాస్త్రి, కుక్కపిల్ల

కన్నెమీఁది యాస కనకంబుపై నాస
లేనివాఁడు పుడమి లేనివాఁడు
కలిగెనే నతండు కానంగ రాఁడయా

- వేమన

ప్రాణంపోతుందని తెలిసినా గరళం పోసికాని మరీ ఆశవదులుకోం!

- మునిమాణిక్యం, భరణి

విడిచిపోయిన యింటికిఁ, బుడమితేఁడు
లేని ధరణికి, మగదిక్కు లేని సతికిఁ
గడకు నెవ్వనికిని నాస గాకమానదు.

- దూబగుంట, పంచతంత్రము

పరస్త్రీకోసం, పరుల డబ్బుకోసం ఆశపడిన వాడికి జీవితంలో శాంతి ఉండదు.

- సూర్యారావు, ఎవరోపిలిచారు

ఆశమీఁదనే మనుష్యుడు బ్రదుకుచుండును గాని బానిసవలె నిరర్థకముగా పని చేయఁడు.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

ఆశ ఉన్నచోట అజ్ఞానమూ ఉంటుంది మరి.

- జయరాం, గూటిలోచిలక

ఆశ నిరాశలమధ్యే ఆశ ఉంటుంది.

- ముద్దంశెట్టి, నిమిత్తమాత్రులు

ఆశ మనిషిని క్షణక్షణానికీ మార్చేస్తుంది.

- ముద్దంశెట్టి, నిమిత్తమాత్రులు

అందరాని పండుకు ఆశించడమెందుకని?

- గురజాడ, కన్యాశుల్కం

మననం చేసేకొద్దీ ఆశ నిరాశలు మరింత బలిష్ఠమౌతాయి.

- పినిశెట్టి, పంజరంలో పక్షులు

గుడిశల్లో మనుష్యులకు ఖరీదైన ఆశల్లేవు.

- వివేకానంద, పద విహీన

చీకాకుల పెనుకాకుల
మూకలు ఎదురైనప్పుడు
చాలునొక్క ఆశ లెక్క
సమస్యలను దాటిపోగ.

- సినారె, భూమిక

ప్రతి ఉగాదికీ యుగయుగానికీ మెరుస్తూ పిలుస్తుంది ఆశావేశ్య.

- తిలక్, పోయిన వజ్రం

చచ్చే నరు నెందులకో చావనివ్వ దాశ
మూగపడిన గొంతుకలో మ్రోగునెదో బాస

- శశాంక, జీవనగానం

జీవితానికి పునాదే ఆశ. జీవించడం అంటేనే ఆశపడటం.

గోపీచంద్, ఆశాజ్యోతి

మనిషి చచ్చినా మనిషిలో ఆశ మాత్రం చచ్చినా చావదు.

-అర్నాద్, విషాదం

రిబ్బన్ ముక్కలేదు మెట్రో అంటే వెండి కత్తెర కోసం వేళ్ళు చూపించాట్ట!

- శ్రీరమణ, న్యూనుడి

**ఆశయం**

దరిద్రం మీద దండయాత్ర ప్రకటించిన
ప్రఖ్యాత సేనా నాయకులకు
ఆశయాలు పుష్కలంగా వున్నాయిగాని
ఆయుధాలు దొరకడం లేదు.

- కుందుర్తి, నన్నెందుకు పిలిచారు?

ఆశయం గుర్రాలమీద యెక్కిన వారికి బ్రతుకు మీద ఆశలుండవు.

- కుందుర్తి, తెలంగాణ

**ఆశానిరాశలు**

ఆశ ఆయువుపట్టు నిరాశ నీ జీవికకే వెన్నుపోటు.

- సుమతి, జాగృతి

**ఆశావాదం**

ఆశావాదం మనిషికి ఆరోప్రాణం
అది లేనిది బ్రతుకేమిటి
నరకప్రాయం.

- సినారె, భూమిక

**ఆశీస్సు**

పోయిరమ్ము శుభంబులు బొందు నిన్ను.

- కంకంటి, ఉత్తర రామాయణము

**ఆశ్చర్యం**

ప్రత్యక్షం పరోక్షానికంటే ఆశ్చర్యం. పరోక్షం ప్రత్యక్షానికంటే ఆశ్చర్యం.

- వేంకటరాయశాస్త్రి, వ్యామోహము

గాడిద సంగీతానికి ఒంటె ఆశ్చర్యపడితే, ఒంటె అందానికి గాడిద మూర్ఛపోయిందిట.

- సామెత

హాశ్చర్యం. మార్వాడీల్లో కూడా మంచి

వాళ్ళంటారు.
- కొడవటిగంటి, పారిపోయిన శవం

**ఆశ్రయం**

ఆర్టిస్టులూ, కవులూ, రెండు రకాలు: రేడియో ఆశ్రయులూ, రేడియో ఆశ్రితులూ.
- చలం, మ్యూజింగ్స్

ఆశ్రయులూ ఆదర్శాలూ అంగవస్త్రాల లాంటివి. హఠాత్పవన వీచికకి అట్టే తొలగిపోతవి.
- తిలక్, మైనస్ ఇంటూప్లస్

**ఆశ్రితుడు**

పరిమిత పరాక్రములు మఱి
ధరణీపతి యాశ్రయమున దర్పోద్ధతులై
చరియింతురు తముఁ దామై
యెఱుఁగక, యెఱుఁగని నృపాలు రిచ్చిన చనవై.
- విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము

**ఆసక్తి**

ముండ కాసక్తి యెప్పుడు మగని మీఁదనే కదా!
- పానుగంటి, ప్రచండ చాణక్యము

ఒరుల నేరములను వినుటయందు జనులకుఁ గల యాసక్తియు నుత్సాహమును వారి ఖ్యాతి వినుట యందుఁ గానరాదు.
- కొచ్చెర్లకోట, అపవాద తరంగిణి

**ఆసు**

పేక ముక్కల్లో ఆసు ఎంత గొప్పదో, కవిత్వంలో కూడా ఆసు కవిత్వం అంత గొప్పది.
- ధనికొండ, ఉల్టా-సీదా

**ఆసుపత్రి**

(మన) ఆస్పత్రిలో రోగులకంటే భోగులెక్కువైనట్టు విన్నాను.
- రామదాసు, ఆకాశరామన్న

అదో ప్రపంచం ఆస్పత్రి. సృష్టి, స్థితి, లయం ఒకేచోట చూడగలం. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ఆస్పత్రిలో కనిపించని జీతము తీసుకోని ఉద్యోగులు.
- బుచ్చిరెడ్డి, ముత్యాలు-రత్నాలు

ధర్మాసుపత్రులలో ధర్మం నాలుగుపాదాల నడవకపోయినా కనీసం మూడు పాదాలమీద కుంటుతూ నడిచినా గుడ్డిలో మెల్ల అన్నట్టుగా ప్రజలు బ్రతికిపోతారు.
- చిరంజీవి, చీమమనుషులు

**ఆస్తి**

మానంబే నగ, మాటలే కవచముల్, మర్యాదలే భాగ్యముల్
- శ్రీరాములు, తెలుగునాడు

మన పూర్వులు వదలివెళ్ళిన ఆస్తి
చరిత్రలో కోడిపందేల ప్రశస్తి.
- కుందుర్తి, తెలంగాణ

ఆయనకి స్థిరాస్తి భార్య, చరాస్తి తనే.
- భమిడిపాటి, అవును

తల్లీ తండ్రీ మనకి పుట్టుకిస్తారు. అది పెద్ద ఆస్తి కదా! ఆ ఆస్తే లేకపోతే ఇంక ఏ ఆస్తీ కూడా అనవసరం.
- రావిశాస్త్రి, రత్తాలు -రాంబాబు

మానవుడు తనదిగా రుజువు చేసుకోగలిగే ఆఖరి ఆస్తి స్మశానంలోని ఎర్రమంటలు.
- సోమసుందర్, చచ్చిపుట్టినవాళ్ళు

ఆస్తి ఉంటే ఆడది మగవాడవుతుంది.
- కృష్ణరావు, పాపికొండలు

ఆస్తి యొక్కటియే యిపు డన్నిటికిని.
- కాళ్ళకూరి, వరవిక్రయము

నిధులూ - నిక్షేపాలు ప్రాణంలేని రాతిదేవుళ్ళకి!
మనిషికి కావలసింది పిడికిలంత హృదయం...
- రామచంద్రమూర్తి, మనుగడలో మలుపులు

**ఆస్తికుడు**

ఈ ప్రపంచంలో నాస్తికుని జీవితానికి వున్నంత హాయి ఆస్తికుని జీవితానికి లేదు.
- వెళ్ళపిళ్ళ, కథలు-గాథలు

**ఆస్థానకవి**

రద్దుకాని రాజభరణం
ఆస్థానకవిపీఠం.
- సూర్యప్రకాశ్, దండోరా!



**ఇంగ్లీష్**

మనకీ యింగ్లీషు చదువు అబ్బిరాదని చెబితే విన్నావుకావు.
- గురజాడ, కన్యాశుల్కం

ఈ వెధవ ఇంగ్లీషు చదువునించి బ్రాహ్మణ్యం చెడిపోతుంది.
- గురజాడ, కన్యాశుల్కం

మైలా గియిలా యీ ఇంగ్లీషువారికి లక్ష్యంలేదు.
- గురజాడ, కన్యాశుల్కం

బొట్లేరు ముక్కలు రెండు నేర్చుకోగానే ఉద్యోగాలే!

- గురజాడ, కన్యాశుల్కం

యింగ్లీషు వాడు 'థింక్' అన్నాడోయి. ఆలోచిస్తే గాని నిజం బోధపడదు.

- గురజాడ, కన్యాశుల్కం

దొర్ల చదువు చదువుకుంటే దొర్ల తరిఫీదు యివ్వక తప్పదు.

- గురజాడ, కన్యాశుల్కం

మొత్తంమీద మీ ఇంగ్లీషు చదువు మంచిదిలాగే కనబడుచున్నది. భాష భేదంగాని, మన ముక్కలే వాళ్ళవన్నీ.

- గురజాడ, కన్యాశుల్కం

మన పుస్తకాల్లో మర్మం కనుక్కొని దొర్లు బాగు పడుతున్నారు. మన పుస్తకాలు బూజెక్కించి మనం చెడుతున్నాం.

- గురజాడ, కన్యాశుల్కం

ఇంగిలీషువాడు నేచర్‌స్టడీ చేయమన్నాడు.

- గురజాడ, కన్యాశుల్కం

మీకే యింగ్లీషు వొస్తే భాష్యం అయ్యంగార్లా అయిపోరా?

- గురజాడ, కన్యాశుల్కం

ఇంగ్లీషు చదువుకునేవాళ్ళందరూ రౌరవాది నర కాలలో పడిపోతారు.

- కందుకూరి, హాస్యసంజీవని

తెలుగులో కోపం ఎట్లా వస్తుందోయ్? ఇంగ్లీషులో అన్నా.

- గంగాధరరావు, బంగారుసంకెళ్లు

మనకి ఇంగ్లీషు రాజభాషే కాకుండా మన్మథ భాషకూడా అయిపోయింది.

- లక్ష్మణరావు, అతడు - ఆమె

ఇంగ్లీషులో మాట్లాడుతుంటే కులం ఏదయిందీ అసలు తెలుసుకోలేం.

- కొడవటిగంటి, అనుభవం

చచ్చు ఇంగ్లీషా? ఎవడు పడితేవాడు ఏడాదిలోనో, రెండేళ్లలోనో నేర్చుకోవడానికి.

- మొక్కపాటి, బారిష్టరు పార్వతీశం

ఇంగిలీషోడి అమల్లో యేపనిచేసినా బంగారం పలుకుతుంది.

- గురజాడ, కొండుభట్టీయము

ఈ ఇంగ్లీషువాళ్ళు చదువులు పెట్టి మనవేళ్ళతో మనకళ్ళే పొడుస్తున్నారు.

-గురజాడ, కొండుభట్టీయము

మన శాస్త్రాల్లో మాటలు మనం మరిచిపోయి నావుం. ఆమాటలే తెల్లవాళ్ళు దొంగతనంగా పట్టుకుపోయి, శాస్త్రం చెప్పినట్టల్లా ఆచరించి మన రాజ్యం లాగుకున్నారు.

- గురజాడ, కన్యాశుల్కం

వాడు వొట్టి బొట్లేరు ముక్కలు పేల్తాడు.

- గురజాడ, కన్యాశుల్కం

యింగిలీషువాడు సోమరితనం వొప్పడండి.

- గురజాడ, కన్యాశుల్కం

యీ యింగిలీషువాళ్ళ సంగతంతా అదోమొర్రి మొర్రి.

- గురజాడ, కన్యాశుల్కం

**ఇజం**

ఇజమేది నిజంకాదు.
నిజానికే ఇజంలేదు.

- పురిపండా, పద్యసమాధి

ఏ'ఇజ'మైతేనేం?
మన బుజం బరువు తగ్గితేసరి,
ఇది నిజం.

- ఊటుకూరి, బతుకుకిటుకు

**ఇంటర్వ్యూ**

ఈ జరిగే ఇంటర్వ్యూహం
మీ పాలిటి పద్మవ్యూహం.

- మల్లారెడ్డి, ఇంటర్వ్యూహం

**ఇంటిదీపం**

మనం కట్టుకున్న ఇల్లని నెత్తిన కూల్చుకుంటామా?

- ఆత్రేయ, అశ్వఘోషుడు

**ఇతరులు**

అసలు వివాహం చేసుకొనే వాళ్ళకోసరం కన్నా ఇతరులకోసరమే ఏర్పడిందన్నా కూడా తప్పుగాదు.

- రాజమన్నారు, మనోరమ

**ఇందిర**

ఇందిర అంటే కాలేజీ అమ్మాయి అని అర్థం.

- ముళ్లపూడి, ఇందిర

**ఇన్సూరెన్సు**

మగపిల్లవాడంటే తండ్రికి ఇన్సూరెన్సు చేసినట్లే

- సరస్వతీదేవి, ఊహాకందని నిజాలు

**ఇప్పుడు**

నిన్నకూ రేపుకూ మధ్య
చిన్నగది ఒకటివుంది (ఇప్పుడు).

- కుందుర్తి, నాలోని నాదాలు

**ఇబ్బంది**

కొన్ని ఇబ్బందులు ప్రత్యక్షంగా అనుభవించవలసివస్తే ఉండేదానికన్న ఊహిస్తే ఎక్కువ భయంకరంగా కనిపిస్తాయి.

- కొడవటిగంటి, బెదిరిన మనుషులు

కూలినాలిచేసి కుదురుగా ఉండక, మొగుణ్ణి కట్టుకొని సగమైపోతినే అందట'

- సామెత

**ఇంపు**

జనం వాక్యంకంటె భజనవాక్యం యింపు.

- శ్రీరమణ, న్యూనుడి

**ఇరుకు**

ఇల్లు ఇరుకైనకొద్దీ
ఇబ్బందులు చివుళ్లు వేస్తాయి

- రాధాకృష్ణశర్మ, శాంతిసూక్తం

తను దూరసందు లేదు మెడకొక కెమేరా.

- శ్రీరమణ, న్యూనుడి

**ఇల్లరికం**

ఈశుడంతటివాడు
ఇల్లరిక మున్నాడు
పెండ్లయిన మరునాడు
ఓ కూనలమ్మా

- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

**ఇల్లు**

మామిడి తోరణము కట్టుకొనుట కెవ్వరైన నిల్లి చ్చెదరుగాని దర్భశయ్య కెవరైన నిచ్చెదరా? ఇల్లు కట్టుకొనుట కర్మమునకుఁగాని కాపురము నకుఁగాదని నిశ్చయముగా నమ్మవలెను.

- పానుగంటి, కంఠాభరణము

ఇయ్యాల ఇంట్ల రేపు మంట్ల.

- ఉన్నవ, *విరగబడ్డ భూమి*

సేల్సుటాక్సు ఆఫీసరుగారిల్లు తెలియని వాళ్ళుంటారా?

- సుంకర, పిచ్చివాడు

పడుచుకున్న యిల్లు తుడుచుకుపోతాది.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

నా అనుకొనే మనిషిలేకుంటే ఇల్లేమిటి, బ్రతుకే ఓ శత్రువు

- మహీధర, ఓనమాలు- కత్తులవంతెన

ఇల్లిల్లా? ఒక చిన్నసైజు కమ్యూనిస్టు ఎస్టేటు.

- ఆరుద్ర, ఇంటింటిపజ్యాలు

అంతా పిడికెడు బూడిద కావలసినవారే!

చావుకో యిల్లు పుట్టుకకో ఇల్లూ అని రెండిళ్లు ఎవరికీ లేవుగదా?

- పురాణం, నాన్నగారి శవం

నీరు ఉంటే పల్లె, నారి ఉంటే ఇల్లు.

- సామెత

పగతో పొరుగిల్లు కాల్చవచ్చును గాని తన ఇల్లు కాపాడతరం గాదు.

- సామెత

**ఇష్టం**

ఈ ఆడ - మొగ విషయంలో ఆడవాళ్ళు ఎంత మాట్లాడకుండా ఉంటే అంత ఇష్టం మొగాళ్ళకి.

- లక్ష్మణరావు, అతడు - ఆమె

తమనించి తీసుకునే వాళ్ళ మీద ఉన్న ఇష్టం, తమకి ఇచ్చేసుకునే వాళ్ళమీద ఉండదు.

- చలం, మ్యూజింగ్స్

నాలుగైదేళ్ళు ఉంటే, యమలోకం మీద కూడా ఇష్టం కలుగుతుంది.

- చలం, వివాహం

నీకత్యంతాప్తమైన వస్తువునకు నీవనుక్షణమును సందేహించు కీడు, నాపాదించు నపాయము, నీ మహాశత్రుఁడైన సందేహింపఁడు, ఆపాదింపఁడు.

- పానుగంటి, సాక్షి

ఇష్టం లేకపోతే ములిగిపోయింది కాబోలు?

- గురజాడ, కన్యాశుల్కం

చాలా మందికి ఇవతలవారి ఆపదల్ని సినిమా చూసినట్టు చూడ్డం ఇష్టం.

- రావిశాస్త్రి, బంగారిగాడి కత

తలతిక్కగా ఆలోచించే అబ్బాయిలంటే అమ్మాయిలకెంతో ఇష్టం. ఈ విషయం చాలామంది అబ్బాయిలకి తెలీదు.

- వీరేంద్రనాథ్, వెన్నెల్లో ఆడపిల్ల

**ఇష్టానిష్టాలు**

బతికున్న వాళ్ళ ఇష్టవేఁ ఇలా ఏడుస్తూంటే చచ్చినవాడి ఇష్టాయిష్టాల్తో ఏం పని?

- గురజాడ, కన్యాశుల్కం

ప్రతి చిన్న విషయంలో కూడా ప్రతివారికీ ఇష్టాయిష్టాలుంటాయి.

- రావిశాస్త్రి, మంచి చెడ్డల్లో ఏ కథ

మనుష్యులమీద ఇష్టం, అయిష్టం అనేవి మంత్రాలమీద ఆధారపడి కలగవు.

- మహీధర, ఓనమాలు

**ఇహపరాలు**

పాపపుణ్యాలూ పరలోకం గురించి అందరూ మాటాడుతారు కాని అందరూ ఇహం కోసమే బతుకుతారు.

- కాళీపట్నం, ఇల్లు

ఇహం ఇంత బాగా వెలిగింది, పరంమాట బతికి ఉంటే ముందు చూసుకుందాం.

- గురజాడ, కన్యాశుల్కం

**ఇహం**

అడుగడుగునా విఘ్నాలు, ఆశలకు అవాంతరాలు ఆశయాలకు ఆనకట్టలు, ఆవేశాలకు చన్నీళ్ళు, అభిప్రాయాలకు సంకెళ్ళు, ఆలోచనకు బేడీలు ఆదర్శాలకు ఉరితాడు, ఉత్సాహానికి కంట్రోలు, ఉద్రేకాలకి రేషను, ఇహంలో నోవేకెన్సీ.

- ఆరుద్ర, మాతృకాంక్ష

## ఈ

**ఈక**

కోడిగుడ్డుకు ఈకలు తీసినట్లు.

- సామెత

**ఈ కాలం**

ఈ కాలంలో పిల్లలకి స్కూల్లోని పాఠాల్లోని ప్రశ్నలకే కాదు - మామూలు ప్రశ్నలకి సమాధానాలివ్వటం కూడా చేతకాదు.

- పెద్దిభట్ల, కప్పగంతుల -నయనతార

**ఈగ**

పిల్లనిచ్చిన వాడు ఈగ, పుచ్చుకున్నవాడు పులి.

- సామెత

**ఈర్ష్య**

అసలు మొగుడూ పెళ్ళాం మధ్య ఈర్ష్య అంటూ లేకపోతే ప్రేమ లేదంటారు.

- లక్ష్మణరావు, ఆతడు-ఆమె

ఒక అందగత్తె తక్కిన ఆడవాళ్ళ హృదయాల్లో ఈర్ష్య రేకెత్తిస్తుంది.

- కృష్ణంరాజు, దివాణం సేరీవేట

ఆశా, అధికారమూ ఉంటే తప్ప జలసీ ఉండదు.

- మహీధర, ఓనమాలు

మనుషులకు ఈర్ష్య అనేది ఎంత విచిత్రంగా వచ్చేస్తుంది!- ఒకే కులానికీ, వర్ణానికీ చెందిన వాళ్ళు నిష్కల్మషంగా ప్రేమించుకుంటారని అనుకోవటం పొరపాటే!

- నంది, నైమిశారణ్యం

ద్వేషమేనా బ్రతుకు మార్గం
ద్వేషమేనా సత్యరూపం
మోసమేనా నిత్యకర్మం
మూర్తిమంతులకున్?

- బాపిరాజు, పాతమాట

పరుల ధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడు న
న్నరుఁడు తెవులు లేని వేదనం బడు నధిపా!

- తిక్కన, ఉద్యోగ పర్వము

మానవుల ఆనందాన్ని చూసి గ్రీకు దేవతల కంటె కూడా అధికంగా యీలోకం కళ్ళు కుట్టుకుంటున్నది. ఎంత చూడలేనితనం!

- గురజాడ, సంస్కర్త హృదయం

అప్రయోజన మభివృద్ధి నతిశయిల్లు
నప్రయోజన మడఁగుఁ గాలాంతరమున
నకట! యీర్ష్యాగ్రహగ్రస్తుఁ డైనయట్టి
ఖలుని సంపద విధవచన్నులను బోలె

- శ్రీనాథుడు, కాశీ ఖండము

## ఉ

**ఉక్కుతునక**

హరిని సంగరమున గెల్చినట్టిఁ డొక్క యాతఁ
డొక్కఁడో హరునోర్చిన యుక్కుతునక.

- తి.వేం., పాండవ ప్రవాసము

**ఉంగా**

ఉంగా అంటే కాదు అని అర్థం.

- ముళ్ళపూడి, బుడుగు

**ఉండకూడనిది**

మచ్చిక లేనిచోట, ననుమానము వచ్చినచోట, మెండుగా గుచ్చితులున్నచోట, గుణకోవిదు లుండనిచోట, విద్యకున్ మెచ్చనిచోట, రాజు కరుణించనిచోట వివేకులుండిరే నచ్చట మోసమంద్రు సుగుణాకర! పెమ్మయ సింగధీమణీ!

- పెమ్మయ సింగధీమణి శతకము

**ఉండవలసినవి**

చేనికిగట్టు, ఊరికి కట్టు ఉండాలి.

- సామెత

**ఉండేలు**

పిల్లకాక్కేం తెలుసు ఉండేలు దెబ్బ?

- సామెత

**ఉండేవి**

అడగరానిది, సెప్పరానిది యేదో వుంటాది ప్రతి వోడి బ్రతుక్కి.

- కాంతారావు, వంశధార

**ఉత్తమం**

బుద్ధిహీనుడికి పిల్లనియ్యడం కంటె ఖర్చులు వదులుకోవడమే ఉత్తమం.

- కందుకూరి, మహాబధిర ప్రహసనము

నవనిధానములును దవిలి యిచ్చినసైన
మెడలమీఁదఁ గత్తి యిడినసైనఁ
జాల రసఘచరితు లేలినవారి ర
హస్య భంగమునకు ననుమతింప.

- పింగళి, ప్రభావతీ ప్రద్యుమ్నము

**ఉత్తమాట**

ప్రస్తుతపు ప్రజాసేవా, దేశక్షేమం, ముందు యుగాల వారికై యత్నాలు అన్నీ ఉత్తమాటలు, అరుపులు, ఊరేగింపు లవుతున్నాయి.

- చలం, మ్యూజింగ్స్

**ఉత్తమురాలు**

అత్తలేని కోడలుత్తమురాలు, కోడలు లేనత్త గుణవంతురాలు.

- సామెత

**ఉత్తరదక్షిణాలు**

ఆయన 'ఉత్తరా'నికే మనిషిగానీ., 'దక్షిణా'నికి కాదు.

- బుచ్చిరెడ్డి, మచ్చ

**ఉత్తరం**

చిత్రమైన మగడు ఉత్తరమేస్తే చింత చిగుళ్ళో చిక్కడిందట.

- సామెత

రెండు హృదయాలు కారణాంతరాలవల్ల వేర్వేరుగా దూరపుదేశాలలో ప్రవాసం చేస్తున్నప్పుడు, ఉత్తరాలు మహత్తర కార్యభారాన్ని నెరవేరుస్తాయి. మాట్లాడతాయి, ఏడిపిస్తాయి, నూతనోత్సాహం ప్రసాదిస్తాయి!

- గంగినేని, గుడిగంటలు

మనిషి తరువాత ఆప్యాయముగా చూసుకోవలసినవి ఆ మనిషి వస్తువులూ ఉత్తరాలూను.

- సరస్వతీదేవి, పై మనిషి

**ఉత్తరాయణం**

ఉత్తరాది అంటే సిఫారసు ఉత్తరాలు వగైరా, దక్షిణాది అంటే దానోపాయం వగైరా.

-భమిడిపాటి, మేష్టరీ కూడా ఒక ఉద్యోగమేనా?

**ఉత్తీర్ణత**

శమంతకమణి గురించి నీకేమి తెలుసునని అడిగితే, శకుంతలను గురించి ధాటిగా అయిదు నిమిషాలు లెక్చర్ కొట్టాడు. యస్. రైట్. అని వాడిని ప్యాసు చేశారు.

- తాపీ, వెండి మువ్వలు

**ఉత్సాహం**

ఈ ప్రపంచంలో మానవుణ్ణి పురోగమింపజేసేది ఉత్సాహం ఒక్కటే.

- సూర్యారావు, దేశదిమ్మరులు

**ఉదర పోషణ**

ఉదరపోషణార్థమై న్యాయముగఁ జేసికొను వృత్తులలో గరిటెఁ బట్టుట లోపము కాదు. కలము పట్టుట ఘనత కాదు. కావడి మోయుట లోటు కాదు. కంఖాణ మెక్కుట ఘనతయు కాదు.

- పానుగంటి, సాక్షి

**ఉదారుడు**

నేటి ఉదారులు శ్రామికులు... వారికి చరిత్ర లేదు.

- సభా, పిచ్చిదంపతులు

**ఉదాసీనత**

ఒక చెడ్డవాడు, పదుగురి మంచివారి ఉదాసీనత వల్ల సృష్టింపబడతాడు. ఆ చెడ్డవాడు వంద మంది మంచివాళ్ళు చేసిన మంచిని హతమారుస్తాడు.

- భమిడిపాటి, వంశధార

**ఉద్దీపనం**

మైకు చూస్తే వాగబుద్ధి - ఫోను చూస్తే చెయ్యి బుద్ధి

- శ్రీరమణ, న్యూసుడి

**ఉద్దేశం**

మనం చేసిన పనులవల్ల ఏ ఫలితం అయితే కలుగుతుందో ఆ ఫలితం కలగడమే మన ఉద్దేశ్యం అనుకోవాలి.

- రావిశాస్త్రి, నిజం

**ఉద్బోధ**

పొగడరా నీ తల్లి భూమి భారతిని

నిలుపరా నీ జాతి నిండు గర్వమ్ము
- రాయప్రోలు, జన్మభూమి

**ఉద్యమం**

బాధామయ జీవితాల నెత్తుటి చమురులో
మరిగిన ఉద్యమాలు
చల్లచల్లని మాటలను
వాగ్దానాల లంచం మాలను స్వీకరించవు.
- కుందుర్తి, తెలంగాణ

మందగించిన ఉద్యమానికి విజయం రాదు.
- జ్వాలాముఖి, నక్షత్రాల వంతెన

ఏదన్నా వుద్యమం సాగించాలంటే దృష్టిని సంకుచితం చేసుకోవాలి. సందేశాలు, విశాల దృష్టీ మనిషిని నిష్కర్మకుణ్ణి చేస్తాయి.
- చలం, మ్యూజింగ్స్

ఉద్యమాలకు దైవిక రాజకీయాల కంటే సోమరితనం యెక్కువ ప్రతిబంధకం.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, మార్గదర్శి

**ఉద్యోగం**

లోకులు ఎంత నీచులంటే, ఒక ఆడకూతురు శ్రమించి నాలుగు రాళ్ళు తెచ్చుకుంటున్నా, ఒళ్ళమ్ముకు బతుకుతున్నదానికిందనే జమకడతారు.
- కొడవటిగంటి, చెడిపోయిన మనిషి

ఉద్యోగ మొదవినప్పుడు
సద్యోమద మొదవి పూర్వసరసత లుడుగున్
విద్యావంతున కైనను
విద్యాహీనునకు వేఱె వివరం బేలా?
- చాటువు

ఆత్మాభిమానాన్ని చంపుకోకపోతే యీ రోజుల్లో ఉద్యోగాలు చెయ్యలేం.
- సూర్యారావు, కళోద్ధారకులు

కొన్ని యుద్యోగములకు బాల్య వివాహములు మంచివి.
- శివరామశాస్త్రి, వివాహబలి

ఉద్యోగం అంటే అమ్ముడు పోవడం.
- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

ఉద్యోగి విషం తాగి చావాలన్నా మొదటి తారీకున కాని కుదరదు.
- బుచ్చిబాబు, షష్టిపూర్తి

ఈ గవర్నమెంట్ ఉద్యోగాల్లో చిన్నా పెద్దా తారతమ్యాలూ, చిన్నవాళ్ళూ, పెద్దవాళ్ళూ కూడా మరిచిపోలేరు.
- పాప, చేతికి చిక్కిన పిట్ట

పించను పుచ్చుకొన్నా కోర్కెలన్నీ మళ్ళీ ఉద్యోగాలకు అర్జీలు పెడతాయి.
- ఆరుద్ర, ఉపనదులు

ఆఫీసుల కనిపెట్టుక
సాఫీగా బ్రతుకుతాము
అంతరాత్మలను పెంపుడు
జంతువులుగా పెంచుతాము.
- మల్లారెడ్డి, త్రిశంకు స్వర్గం

పాపంలా అసమర్థుని
కోపంలా పెరుగుతున్న
ఫైళ్ళలోన ఉష్ట్రపక్షి
భంగిమలో తలలు దూర్చి
ఏం జేస్తాం? చూస్తామా?
ఏడ్వలేక నవ్వేస్తాం!
- మల్లారెడ్డి, త్రిశంకుస్వర్గం

ఓర్పులోన గాడిదలకు
ఓనమాలు నేర్పుతాము
అతివినయంలో నక్కల
అధిక్యత నొప్పుకోము.
- మల్లారెడ్డి, త్రిశంకుస్వర్గం

మనం యేలాగో వోలాగు మంచితనంగా వుద్యోగస్థులను సమాధానపరుచుకోకపోతే వాళ్లు పెట్టే తంటాలు మనం పడలేము.
- కందుకూరి, మున్సిపల్ నాటకము

ఉద్యోగాలలో మర్యాదలేకుండా పోవటానికి కారణం, మర్యాదమీద నిలబడకుండా ఉద్యోగాలు చెయ్యటానికి తయారయ్యేవాళ్ళే.
- కొడవటిగంటి, అరుణోదయం

చదువుకున్న వారుద్యోగములే కావలెనను పిచ్చును వదిలివేసి యితర వ్యాపారముల యందుఁ బ్రవేశింపవలసిన యావశ్యకము తెలిసికోవలసిన సమయమిప్పుడు వచ్చింది.
- కందుకూరి, హిందూదేశాభివృద్ధిమార్గము

ఉద్యోగమూ, ఆత్మాభిమానమూ కలసిన చోట, ఉద్యోగానికీ, ఆత్మాభిమానానికీ కూడా దెబ్బతగులుతున్నది.
- కొడవటిగంటి, వారసత్వం

కడం ఉద్యోగాల్లో చేరడం నిచ్చెన ఎక్కడం, మేష్టరీలో చేరడం డాబాయెక్కడం. మరిపైకి ఎగరడానికి వీల్లేదు.
- భమిడిపాటి, మేష్టరీ కూడా ఒక ఉద్యోగమేనా?

నెత్తిమీద వాళ్ళు ఎంత తక్కువ మంది ఉంటే అంతగొప్ప ఉద్యోగం.

- భమిడిపాటి, మేష్టరీ కూడా ఒక ఉద్యోగమేనా?

ఉద్యోగం అంటే గొప్పయోగం పట్టడం.

- భమిడిపాటి, మేష్టరీ కూడా ఒక ఉద్యోగమేనా?

ఉద్యోగాలు చేసే వాళ్ళెవరూ తమ శ్రమశక్తిని పరువుగా అమ్మేవాళ్ళల్లే ప్రవర్తించటం లేదు.

- కొడవటిగంటి, వారసత్వం

అవును మరి పి.ఏ. అంటే టైమింగ్స్ ఖచ్చితంగా ఉండవు. ఒక్కోసారి రాత్రి పది అయినా వుండి పోవాల్సిందే! తప్పదు. ఆ ఉద్యోగలక్షణమే అంతే!

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

ఉద్యోగం ఒకడిస్తే వచ్చేది కాదు. చేస్తే ఉండేది.

- ఇనాక్, ఉద్యోగం

యీ ఉద్యోగాలు, కాగితాలు, ఫైళ్ళు, పాడ్‌లు, టేపులు, గుండుసూదులు, జే క్లిప్పులు, ఇకానమీ ఫ్లాప్‌లు, 'యస్సార్లు' - యివన్నీ మనుష్యుల్ని మరలు చేస్తాయి, ఆ మోటుపనికి మగాడే తగును!

- కామేశ్వరి, వానచినుకులు

**ఉద్రేకం**

ఉద్రేకంతో వ్యవహరిస్తే ఒక్కొక్కప్పుడు సమస్యలు పరిష్కారమవుతాయి. కాని, రాబోయే పరిణామాలు అతిఘోరంగా ఉంటాయి.

- ముద్దంశెట్టి, కరిగిన శిల

ఉద్రేకాలని అణచుకోలేని మనిషి వీధిలో కుక్కతో సమానం.

- కాంతారావు, నీతి - అవినీతి

**ఉద్వేగి**

ఎక్కువ యుద్వేగి తక్కువకాలము బ్రదుకును.

- విశ్వనాథ, దిండుకిందపోకచెక్క

**ఉద్ధరణ**

మన దేశంలో మన కర్తవ్యం నిర్వర్తించుకోగలిగితే చాలు. దేశం, సమాజం తమంతట తాము వుద్ధరింపబడతాయి.

- నంది, నైమిశారణ్యం

**ఉద్ధారకుడు**

వ్యక్తి జీవితంలో వికాసం పొందనివారు లోకాన్ని ఉద్ధరించలేరు.

- బుచ్చిబాబు, తిష్యరక్షిత

**ఉనికి**

మనిషి బ్రతికి ఉన్నాడని గుర్తు చేసుకోడానికి ఏదో ఒకటి చేస్తూ ఉండాలి.

- మారుతీరావు, మళ్లీ మధుమాసం

కాంగ్రెసయితే భూముల మంజూరు లిస్టుల్లో వుంటాడు. కమ్యూనిస్టయితే పోలీసు లిస్టుల్లో వుంటాడు సోషలిస్టయితే హోటల్బు లిస్టుల్లో వుంటాడు.

- సీతారామారావు, తారాబలం

ఎక్కడున్నావు కంబళీ అంటే, వేసిన చోటనే వున్నాను గొంగళీ అన్నదట.

- సామెత

**ఉన్నతి**

ఒక మనిషి పైకి పోయేకొద్దీ అతడికి ఎంత మంది అభిమానులు ఏర్పడతారో, అంతమంది శత్రువులూ ఏర్పడతారు.

- చిన్నబాబు, డబ్బు

**ఉన్నమాట**

ఉన్నమాటంటే యెదుటివారికి నోటి దురుసులాగానే అనిపిస్తుంది.

- ముద్దంశెట్టి, నిమిత్తమాత్రులు

**ఉన్నవి**

ఇహం పరంలేని మొగుడు ఇంట్లో ఉన్నాడు. చవీసారం లేని కూర చట్టినిండా వుంది.

- సదానంద, రామదాసు చెర

లోకంలో పాపపుణ్యాలు లేవు. లాభనష్టాలే ఉన్నాయి.

- రావిశాస్త్రి, పుణ్యం

చెట్టులేని చేను, చుట్టము లేని ఊరు.

- సామెత

**ఉన్మాది**

ఉన్మాదులు సంఘటింపఁగ సమర్థులెయెందును రాయబారముల్?

- శ్రీనాథుడు, శృంగారనైషధము

**ఉపకారం**

మనిషినుంచి మనిషికి సాధ్యమైనంత హెచ్చు ఉపకారమూ, సాధ్యమైనంత తక్కువ అపకారమూ జరిగేటట్టు చూసుకోవటమే సరి అయిన ప్రవర్తన.

- కొడవటిగంటి, చెడిపోయిన మనిషి

బుద్ధిమంతుల వల్ల బుద్ధి హీనులకు వుపకారం కలుగుతుంది గనుక అల్ప సంఖ్యగల వంచకు లవల్ల అధిక సంఖ్యగల వంచితులకు వుపకారం కలుగుతుంది.

- కందుకూరి, మహావంచకప్రహసనము

మిత్రామిత్రుల కుపకారాపకారములు చేయ
వేఁడి బుద్ధిమంతులు రాజాశ్రయము గోరు
దురు.

- చిన్నయసూరి, మిత్రభేదము

ఉపకారియగువాఁ డుత్తముఁడఁ జెఱసాలలో
నెన్నఁడు పెట్టఁడు.

- కూచి, రూపవతి

అశాశ్వతమైన పోస్టులో ఉన్నప్పుడే అశాశ్వత మైన తనువును శాశ్వతంగా చాలించి కీర్తిశేష డగు వుద్యోగి, భార్యకు శాశ్వతమైన పెన్షను ముట్టచెప్పగలడు.

-నిరుద్యోగి, కార్యాలయబేతాళవిక్రమార్కీయము

ఉపకారికి నుపకారము
విపరీతము గాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాఁడు నేర్పరి సుమతీ!

- బద్దెన, సుమతి శతకము

ఉపకారం అయస్కాంతం లాంటిది.

- కాంతారావు, వంశధార

జపతపంబులకన్న
చదువుసాములకన్న
ఉపకారమే మిన్న
ఓ కూనలమ్మా!

- ఆరుద్ర, ఇంటింటిపజ్యాలు

ఊరికి ఉపకారంగా ఆలికొక కోక కొనిపెడ తాను. ఇంటికో రూపాయి ఇవ్వండి అన్నాడట.

- సామెత

**ఉపదేశం**

దురుపదేశమెక్కినట్లు మనమునకు సదుపదే శము లెక్కవు.

- తి.వేం., దంభవామనము

అనుభవంలోని సత్యాలను చెప్పడంలోనే ఉప దేశం సార్థకత చెందుతుంది. మంచిచెడ్డల తార తమ్యాలు తెలుస్తాయి.

- సభా, పాతాళగంగ

**ఉపనిషత్తు**

మన ప్రశ్నోత్తరాలు యవడైనా తాటాకు మీద రాసిపారేశాడంటే, ఒక రెండు వొందలేళ్ళు అయిన తరవాత 'టోబేకోపనిషత్తు' అవుతుంది.

- గురజాడ, కన్యాశుల్కం

మనం మాట్లాడుకునేది ఓ తాటాకు గ్రంధం మీద రాసి పారేశామంటే ఓ రెండు వందల యేళ్ళయేసరికి ఓ టోబాకోపనిషత్ అవుతుంది.

- భమిడిపాటి, అన్నీ తగాదాలే

**ఉపన్యాసం**

యెందుకీ కూటికీ గుడ్డకూ రాని ఉపన్యాసాలు? పనిలేని వోలాయలు కాలక్షేపం చేసుకోవడానికి పుట్టినవి.

- ఉన్నవ, మాలపల్లి

యేది చేసినా చేయకపోయినా చక్కగా ఉపన్య సించగలగాలి ఈనాటి రాజకీయ వేత్త.

- అప్పల్నాయుడు, బెల్లం

ఉపన్యాసాలని బుర్రలో సృష్టించడం సులభమే కాని బైటికి కక్కడం చాలా కష్టం.

- బుచ్చిబాబు, రహస్యజీవులు

**ఉపయోగం**

ప్రపంచంలో దేవుడు ప్రతి వస్తువునూ ఏదోవొక వుపయోగముకొరకు చేసియున్నాడు.

- గురజాడ, కన్యాశుల్కం

నిజంగా స్కూలు మేష్టర్లు, డాక్టర్లు మరణించిన తర్వాతే సంఘానికి వుపయోగపడతారు. మేష్టర్లు చచ్చిపోయారంటే స్కూలు శెలవు. డాక్టర్ పోయాడంటే డబ్బివ్వలేని రోగులకు విశ్రాంతి.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

గుజ్జానికి తోకుంటే గుజ్జఁవే విసురుకుంటుంది గాని ఊరందరికీ విసురుతుందా ఏమిటీ?

- కాళ్లకూరి, సంసార నటన

కరాటే మూణ్ణెల్లు నేర్చుకుని కట్టుకున్న మొగుణ్ణి కొట్టిందట.

- శ్రీరమణ, న్యూసుడి

**ఉపశమనం**

ఆత్మీయులతో ఆత్మవేదన చెప్పుకొంటే కొంత ఉపశమనం కలగడం తథ్యం.

- ఇనాక్, మీకో నమస్కారం

**ఉపాయం**

శతకోటి దరిద్రాలకు అనంతకోటి ఉపాయాలు.

- చిలకమర్తి, వరదక్షిణ ప్రహసనము

ఉపాయంబుచే నేయది శక్యంబగు నాయది
పరాక్రమశతంబుచేతనయిన శక్యంబుగాదు
- చిన్నయసూరి, మిత్రభేదము

బలవంతుం బగతు నుపాయంబుచేతన సాధిం పవలయును.
- చిన్నయసూరి, మిత్రభేదము

**ఉప్పు**

ఉప్పు లేకనే ముప్పందుం.
- *గురజాడ, కన్యాశుల్కం*

**ఉప్పెన**

ఉప్పెన వచ్చినప్పుడు, కెరటం తాటి ప్రమా ణంగా ఊరిమీదికి విరుచుకుపడ్డప్పుడు, అంత ప్రమాదం కనిపించదు. విసురు తెగిపోయి మళ్ళీ పోతున్నప్పుడే, ఊరు మొత్తాన్నంతా తుడిచి పెట్టుకుపోతుంది.
- రామకృష్ణశాస్త్రి, ఆసావేరి

**ఉపోద్ఘాతం**

ఉపోద్ఘాతం కావ్యాన్ని మించిపోయింది.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, రాజరాజు

**ఉభయతారకం**

జరిగే మట్టుకు జయభేరి, జరక్కపోతే రణభేరి.
- సామెత

పగలు చత్వారం, రాత్రి రేచీకటి.
- సామెత

అట్టైతే వైద్య కట్నం, ఇట్టైతే వైతరణీ గోదానం.
- సామెత

**ఉమ్మడి ఆస్తి**

మీ అబ్బాయి అంటావ్ - మన అబ్బాయి అను. ఇది మన జాయింట్ ప్రాపర్టీ- అమూల్యమైన ప్రాపర్టీ.
- వెంకటేశ్వర్లు, క్రాస్డ్ చెక్కు

**ఉల్లాసం**

మనసు ఉల్లాస పరిచే పరిస్థితులు లేకపోతే మృత్యువు మీదిమీదికి వచ్చినట్లుంటుంది.
- *సరస్వతీదేవి, రజతోత్సవం*

కదలాడే ఉల్లాసం
కవితకు నవ్యోచ్ఛ్వాసం
- *సినారె, భూమిక*

**ఉషస్సు**

నేటి నా స్వప్నం ఉషస్సు!
-సంజీవరావు, విజయగీతం

# ఊ

**ఊడ్చుకపోవడం**

అచ్చిరాని కాలానికి అడుక్కు తినబోతే, ఉన్న బొచ్చి కాస్త ఊడ్చుకొని పోయిందిట.
- సామెత

**ఊదుకుతినటం**

నీపప్పూ, నాపొట్టూ కలిపి ఊదుకు తిందాం అన్నట్లు.
- సామెత

**ఊరడింపు**

ఏడుస్తుంటే ఊరడించేవారి మాటలు ఇంకా ఏడ వటానికి ఉపకరించినట్టు (ఉపకరిస్తయ్).
- విశ్వం, పడవ

ప్రకృతి సామీప్య జీవన భాగ్య మొకటి
యున్న కడగండ్ల మఱపించు నూఱడింపు.
- దువ్వూరి, వానకాలపు పల్లెజీవితము

జయాపజయాల సమన్వయ భావమే జీవితం. కన్నీళ్ళు దుఃఖభారాన్ని తగ్గించినట్టుగా ఈ సమ న్వయభావం ఓటమిలో ఊరటనిస్తుంది.
- కేశవరెడ్డి, అతడు అడవిని జయించాడు

**ఊరబంది**

అడవిపంది చేను మేసిపోతే, ఊరపంది చెవులు కోసినట్లు.
- సామెత

**ఊరు**

ఊరు అంటే సగం ఇళ్ళు, సగం అంగళ్ళు.
- *సదానంద, గందరగోళం*

చరిత్ర కంట్లో నల్లటి నలుసు మా ఊరు!!
- ఏల్చూరి, మాఊరు

మానిందే మందు బతికిందే వూరు.
- కాంతారావు, *దగాపడిన తమ్ముడు*

**ఊరుకోనివి**

తిన్నదాకఁ గడుపూరకుండదు. తిరిగినదాకఁ గాలూరకుండదు. వాగినదాక నోరూరకుండదు.
- పానుగంటి, సాక్షి

తిరిగే కాలూ; రాసే చెయ్యీ వూరుకోవు.
- *బీనాదేవి, వాహనయోగం*

ఊరేగింపు

అందరం ఊరేగింపులో నిలబడితే యింక చూసేదెవరండి?

- బుచ్చిబాబు, స్వతంత్ర జీవులు

ఊహ

నిజంకన్న ఊహ రమ్యం. నిజానికి ఒకటే రంగు. ఊహకు రకరకాల రంగులు. అందుకే నిజంకన్న ఊహలు బాగా ప్రచారమవుతాయి.

- కొడవటిగంటి, అనుభవం

అసలు మనిషికి పిచ్చి ఊహలు అలముకోకనే పోవాలి. అలముకుంటే ఒక పట్టాన వదలవు. ఆ వూహల తాకిడికి బుర్ర వేడెక్కి, భూతకాలం తీయగానూ, వర్తమానం వగరుగానూ, భవిష్యత్తు చేదుగానూ అనిపిస్తుంది.

- విశ్వం, ఎన్.జి.వో. భార్య

తననితాను ఎంతో గొప్పగా ఊహించుకోలేక పోతే యే మనిషీ బ్రతకలేడు ఈ భూమ్మీద.

- ఆనందారామం, అద్దంలో శత్రువు

అవకాశమనేది కనపడ్తే ఊహలు తప్పుదారినే పోతాయి.

- జమ్మలమడక, పాలేరు పెళ్లాం

అహాన్ని తాకని ఊహ గండిపడ్డ బెలూను.

- సుప్రసన్న, కోవెల

నా వేదనలో జన్మించిన ఊహింపులు తొడగడానికి వ్యాకరణ సూత్రపు రెడీమేడ్ దుస్తులు లేక దిసమొలల్తో ఉరుకుతున్నాయి కానపడి.

- దాశరథి, మస్తిష్కంలో లేబొరేటరీ

ఎ

ఎక్కాలు

గణితశాస్త్రాన శక్తి నా కగణితమ్ము
నాల్గువందల పరుష భిన్నాలనైన
చేతపని లేక నోట హెచ్చించగలను;
కాని యొందుకో యొకటొ యెక్కమ్మురాదు.

- మాచిరాజు, అంకితం మనందరికీ

ఎక్కువ

డబ్బుగలవాడి భుజానికి బలం ఎక్కువ, వాడి మాటకి విలువ కూడా ఎక్కువ.

- బీనాదేవి, పాత కథే

సౌందర్యమునకు వివేకమునకు నాత్మజ్ఞానమెక్కువ, ఆత్మాభిమాన మెక్కువ.

- విశ్వనాథ, చామరగ్రాహిణి

తక్కువ వాడికి నిక్కెక్కువ, తవ్వెడు బియ్యానికి పొంగెక్కువ.

- సామెత

చెడి బ్రతికిన వానికి శౌర్యమెక్కువ, బతికి చెడిన వానికి బడవ(వు)లు ఎక్కువ.

- సామెత

తక్కువ జాతికి నిక్కెక్కువ, తవ్వెడు బియ్యానికి పొంగెక్కువ.

- సామెత

మగాడికి ఆవేశం ఎక్కువ. ఆడవాళ్ళకు ఆలోచనలు ఎక్కువ.

- భారతీదేవి, మల్లిక్

వట్టిగొడ్డు కార్పు లెక్కువ, వానలేని మబ్బుకు ఉరుము లెక్కువ.

- సామెత

లోభికి ఖర్చెక్కువ, ఏబ్రాసికి పనెక్కువ.

- సామెత

ఎక్కువ తక్కువలు

స్త్రీలలో నర్సు.... పురుషులలో పోలీసు, ఎంతో ఉన్నతంగా చూడబడవలసిన వ్యక్తులు. ఎంతో తక్కువగా, నీచంగా సంఘంలో చూడబడటం దురదృష్టం.

- బుచ్చిరెడ్డి, పన్నీటికల-కన్నీటికథ

మనిషికి అవసరాలు ఎక్కువ చేసుకున్నకొద్దీ ధనం ఎక్కువవుతుంది. తగ్గించుకున్న కొద్దీ బీదతనం వొస్తుంది.

- చలం, చలం కథలు

పార్టు తక్కువ, ఆర్టు ఎక్కువ.

- పూర్ణానందం, ఆవకాయ అమరత్వం

సరుకు తక్కువ, సంగతులు ఎక్కువ.

- పూర్ణానందం, ఆవకాయ అమరత్వం

ఎగతాళి

ఎగతాళియు ఎంత సొగసు
ఎంకి చిలుక మనుసె మనసు?

- నండూరి, చిలుకపలుకు

ఎగబాటు

నిలబడలేని వాడు ఎగబడకూడదు.

- మహీధర్, దేశం కోసం

ఎగవేత

మీరు యెగేస్తే భూవేం జేస్తుంది.

- గురజాడ, కన్యాశుల్కం

### ఎగ్గు

తమకమ కనియెడు తఱి జీ
తముగానక నవయు భటుల దౌర్గత్య విషా
దము లేలినవాని కవ
శ్యము నెగ్గొనరించు నతఁడు శత్రుండైనన్
- నన్నయ, సభాపర్వము

### ఎంకి

నీ ముంగలకూకుంటె, అగ్గిముందు కూకొని సలి కాసుకున్నట్టుంటుందెంకి?
- బుచ్చిబాబు, ఉత్తమాయిల్లాలు

### ఎచ్చు

దరిద్రానికి మాటలెచ్చు, తద్దినానికి కూర లెచ్చు
- సామెత

### ఎడం

మొగాడన్న వాడు వంటింట్లోకి, బాత్‌రూంలోకి అస్తమానమూ పెళ్ళాం ఏం చేస్తుందో అంటూ సి.ఐ.డి.లా అఘోరించకూడదు. స్నేహితుల మధ్య, భార్యాభర్తల మధ్య, ప్రేయసీప్రియుల మధ్య కాస్త ఎడమంటూ వుంటుంది.
- పురాణం, ధర్మదర్శనం

### ఎడారి

బిడ్డలు లేని దాంపత్యం ఎడారి లాంటిది.
- పాప, పంచవటీ దహనం

### ఎడిటర్

నేను నాల్గుపద్యాలు రాశాను మునుపు
వాటి బాగోగుకేంగాని, వాట్ని చదివి
నవ్వి పొట్ట పేల్చేసుకొన్న యెడిటర్ని
చూస్తెబొత్తిగా యేడుపోస్తుంది నాకు.
- మాచిరాజు, అన్యాయం

### ఎండా వానా

ఎర్రని యెండ వేడికి
గుండె పగిలిన నేలతల్లి
నల్లని మబ్బు నీడకు
కాలుసేతులు కూడదీసుకుంటుంది.
- రాధాకృష్ణశర్మ, అందమైన అంతరంగం

### ఎండుపూరి

నూరు గుర్రాలకు అధికారి, ఇంట భార్యకు ఎండుపూరి.
- సామెత

### ఎండ్రకాయ

పక్కవాటుగా నడిచే ఎండ్రకాయను చక్కగా నడిచేటట్లు ఎవరు చేయగలరు?
- సామెత

### ఎత్తిపొడుపు

ఎత్తిపొడుపులు కత్తిమొనవలె
చిత్తమందున గ్రుచ్చుకొనగా
తప్పుచేసిన వారలందరు
తమదు భుజములు తడుముకొందురు.
- శ్రీరామమూర్తి, మేధానిధి-కట్టమంచి

### ఎత్తు

సేత సిక్కించుకోటం ఒక యెత్తు అయితే సిక్కించుకున్నది ఏరివేసుకోటం రెండెత్తులే.
- కాంతారావు, వంశధార

చతురంగఖేలమున నాటగానికంటెఁ బైవానికి మంచి యెత్తు స్ఫురించును.
- పానుగంటి, వీరమతి

### ఎదురీత

ప్రకృతికి ఎదురీతగా బ్రతికే తత్వం మనసుకూ, దేహానికి ఒకదాని కొకటి తీసిపోని స్వాతంత్ర్యాన్ని అలవరుస్తుంది.
- రామకృష్ణశాస్త్రి, ద్రాక్షావల్లి

### ఎదురు

కాలచక్రానికి ఎదురు నడవడం మానవుడు ఇంకా నేర్చుకోలేదు.
- సరస్వతీదేవి, బంధవిముక్తి

నంబీ! నంబీ! నాపెండ్లి కేమి సహాయం చేస్తావంటే, నీ పెండ్లికి ఎదురు రానుపో అన్నాడట!
- సామెత

ఎప్పుడు దనకును సత్త్వము
చొప్పడు నందాఁక రిపులఁజూచియుఁ దనమైఁ
గప్పికొని యుండవలయు,
న్నొప్పుగ నహి మూషకమున కొదిఁగినభంగిన్.
- పోతన, భాగవతము

గాడిద కొడుకా అంటే- తమరు తండ్రులు, మేము బిడ్డలం అన్నాడట!
- సామెత

కాకరకాయకు కంతలు (గంట్లు) ఎన్ని? అంటే ములగకాయకు ముండ్లెన్ని? అన్నాడట!
- సామెత

వీరన్న ముందు బసవన్న, గౌరి ముందు గణేశుడు.
- సామెత

కొండీ! కొండీ! కొడవలిటు తేవే అంటే, చస్తి నీకాళ్ళకు మొక్కుత, దీపమిటుతే అందిట!

- సామెత

## ఎద్దు

ఎద్దుకి లేకపోతే బుద్ధి మనిషికేనా ఉండొద్దా?

- శ్రీశ్రీ, నగరంలో వృషభం

పెద్దలు లేని ఇల్లు ఎద్దుల కొటిక.

- సామెత

## ఎన్.జి.వో.

నిజంగా నాన్‌గెజిటెడ్ ఉద్యోగికున్న ఓపిక శాంతము మరొకరికి ఉండదు. నరాలు అరిగి పోయే చాకిరి చేయాలిగాని విసుగుకుంటే లాభములేదు. శాణ పరీక్షకు ఆగిన రత్నాలవలె అనుభవమెక్కువయిన కొద్దీ శాంతమూర్తుల వుతారు.

- సరస్వతీదేవి, పండుగచీరె

## ఎన్నికలు

కులమతంబు లెన్నికల కాలములలోనె
నడపదడప మాకు నవసరములు.

- జాషువా, ఆత్మస్తుతి

ఎలెక్షను రోజున మనకు వోటువేసే వాడిని వెయ్యని వాడిని కూడ కౌగలించుకొని లోపలికి తీసుకువెళ్ళవలెను.

- చిలకమర్తి, వోట్లకైతిరుగుట

చమత్కారాలన్నీ జరిగితేనే కాని ఎలక్షను కాదు రండి.

- చిలకమర్తి, వోట్లకై తిరుగుట.

ఎన్నిఓట్లు ఒచ్చేయన్నదే లెక్కకాని ఎంత సారా ఖర్చయిందన్నది లెక్కకాదే.

- రావిశాస్త్రి, కుక్కపిల్ల

ఇప్పటి పరిపాలనతో సంబంధించిన ఎన్నికల పోటీల్లో నెగ్గడానికి ఎవరికేనా, సంగోరుధనం, సంగోరు నక్కజిత్తులూ ఉండాలి.

- భమిడిపాటి, పాలకసంఘాల్లో ఎన్నికలమజా

ఎన్నికల్లో విజయం పొందిన వాళ్ళకి సాధారణంగా స్థితి పాడైపోతుంది. అపజయం పొందిన వాళ్ళకి స్థితితోపాటు మతికూడా పాడై పోతుంది.

- భమిడిపాటి, పాలకసంఘాల్లో ఎన్నికలమజా

కేవలము, పరోపకార హృదయములకే elections లో నిలుచుటకు నీడలేదు.

- కాళ్ళకూరి, లేడీ డాక్టరు

ఒక పార్టీ పురుషుణ్ణి రెండోపార్టీవారు లేవదీసుకు పోవడం ఎలెక్షన్ నాటకంలో రాక్షస శృంగారం.

- భమిడిపాటి, పాలకసంఘాల్లో ఎన్నికలమజా

ప్రజాస్వామ్య యజ్ఞానికి
ఫలితం కనపడుతున్నది
గాజు బుగ్గ పగిలినట్టు
రాజరికం విడుతున్నది.

- దాశరథి, మధ్యప్రాచ్య మహాయజ్ఞం

ఎన్నికలలో, ఎన్ని కలలో?
ఒక్క చేపకై ఎన్ని వలలో

- బాపురెడ్డి, ఎన్నికలలో ఎన్నివలలో

ఎన్ని కలలో కరగిపోవు ఎన్నికలలో.

- ముకురాల, నవ్వేకత్తులు

ఎలక్షను చిత్రములు మిక్కిలి యద్భుతము.

- చిలకమర్తి, వోట్లకై తిరుగుట

## ఎబ్బెట్టు

మానవుడు సంఘజీవి. సంఘంలో తానూ ఒక్కడుగా మెలగుతూ తనకొక ప్రత్యేకతను, లేదా విశిష్టతను సంతరించుకోడానికి మానవునికి చాలా మార్గాలున్నాయి. ఎబ్బెట్టుగా ప్రవర్తించడం ఆ మార్గాల్లో ఒకటిగాకపోయినా, ప్రత్యేకతను నిలుపుకోడానికొక అడ్డుదారైతే కావచ్చు.

- రాజారాం, కారణభూతుడు

## ఎంపిక

ఈయన సెలక్టు చేసేవి నిజంగా బెస్టు
ఎప్పుడూ వస్తాయి లాస్టునుంచి ఫస్టు

- ఆరుద్ర, కళ్ళెములాగిన గుర్రము లాగును

## ఎమ్మెల్యే

ఈకాలపు యిలవేలపు ఎమ్మెల్యే...

- మల్లారెడ్డి, జ్ఞానమార్గం

అవసరాని కతివినయం
ఆమీద అహంకారం
అందినపుడు జుట్టుపట్టి
అందనిచో కాళ్ళబట్టు
చూడు చూడు యమ్మెల్యే
వాడే మన యమ్మెల్యే.

- మల్లారెడ్డి, ఎం.ఎల్.ఎ

## ఎరుక

తెలిసినా తెలియనట్టుండు. అవతలోడి గురించి

మరికాసింత తెలుస్తొంది. వినినా విననట్టుండు. ఎదుటోడి గుట్లు మరికొన్ని బయట పడ్డాయి.

- కాంతారావు, వంశధార

మనం ఎరిగివున్న బతికివున్న వారికోసం కన్న, ఎన్నడూ చూడని, తెలీని, ఇంకాపుట్టని, పెరగని మనుషుల మీద మీకంత ప్రేమ ఏమిటి?

- చలం, హంతకుడు

వంకాయ రుచి తోటవాడెరుగును, అరటికాయ రుచి రాజెరుగును.

- సామెత

గొప్పవారి గోత్రాలు డ్రైవర్ల కెరుక.

- శ్రీరమణ, న్యూనుడి

తల్లిపుట్టిల్లు మేనమామ కెరుక.

- సామెత

## ఎరుగనివి

చిక్కినవాడు సిగ్గెరుగడు, బలిసినవాడు వర సెరుగడు.

- సామెత

## ఎరుపు

ఎరుపంటే కొందరికి
భయం భయం
పసిపిల్లలు వారికన్న
నయం, నయం

- సుబ్బారావు పాణిగ్రాహి, ఎరుపు

## ఎరువు

ఎరువుంటే వెర్రివాడూ సేద్యగాడే.

- సామెత

సన్యాసి పెండ్లికి, జుట్టు దగ్గరనుంచి యెరువే.

- సామెత

## ఎలుక

ఎలుక సంసారం చూచి పిల్లి మూర్ఛబోయిందట.

- సామెత

## ఎల్లమ్మ

ఏనుగులు మింగిన ఎల్లమ్మకు పీనుగలు పిప్పళ్ళు.

- సామెత



## ఏకత్వం

అగ్నియొక్కటి బహురూపు లందుచున్న
అంబరమున ప్రకాశించు నర్కు డెవడు?

- శ్రీహరి, ఉషాదేవి

## ఏకపత్నీవ్రతం

ఎలుగెత్తు మన మతము
ఏకపత్నీవ్రతము
వేల్పు భార్యలొ? శతము!
ఓ కూనలమ్మా.

- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

ఏకపత్నీత్వమన్నది నిజంగా ఫలప్రదమయ్యేది ఒక్క కమ్యూనిస్టు సమాజంలోనే.

- చిరంజీవి, బోలో స్వతంత్ర భారత్‌కీ జై

## ఏకవచనం

నేను ప్రకృతిగ ప్రకృతి నేనుగ
నిలిచిపోతే ఏకవచనం.

- సినారె, భూమిక

కవులు పొగడువేళఁ గాంతలు రతివేళ
సుతులు ముద్దువేళ శూరవరులు
రణముచేయువేళ 'రా'కొట్టి పిలుతురు
పాడి యదియ మిగుల భజనకెక్కు.

- చాటువు

## ఏకాకి

స్నేహం ఇవ్వని దేశం
స్నేహంలేని ప్రతివాడూ ఒక్కొక్క ద్వీపం.

- నిఖిలేశ్వర్, నాదేశంలో నేనుఏకాకిని

## ఏకాగ్రత

ఏకాగ్రత గలవాడు, స్వార్థపరుడిలాగా కనిపిస్తాడు. చుట్టుపక్కల వాళ్ళ విమర్శలకు గురి అవుతాడు.

- కొడవటిగంటి, పంచరత్నాలు

## ఏకాంతం

ఒక్కొక్క జీవి కొక్కక యేకాంత విషయ
ముండును.

- విశ్వనాథ, తెలుగిరాజు

ఏకాంతసేవ బాబూ. అది లేనిదే ఉద్యోగానికి మోక్షంలేదు.

- నిరుద్యోగి, యమలోకంలో

## ఏకాభిప్రాయం

రోగీ, వైద్యుడూ పాలే కోరుతారు ఒక్కొక్కప్పుడు.

- బాపిరాజు, అన్నాంబిక

కష్టసమయంలో స్థిరపడ్డ ఏకీభావం సుఖాలతో స్వార్థంతో కరిగిపోవచ్చు.

- ఆనందారామం, ఇదా భారతం?

## ఏకు

ఆకులు చెట్టుల కుండును.

ఆకులు చక్రాల కుండు నాహార్యముగా
ఏకులు వడకిన నూలగు
మేకలలో వన్నెలెన్నొ మేదిని సఖుడా!

- శ్రీశ్రీ, హితోపదేశం

ఎన్ని ఏకులు వడికితే బూబమ్మకు పోగులో స్తాయి అని సామెత.

- కాళీపట్నం, నో రూమ్

ఏనుగంత తండ్రి ఉండేకంటే, ఏకంత తల్లి ఉండేది మేలు.

- సామెత

## ఏడుపు

యాడవటం ఈ రోజుల్లో భలేకష్టం. నవ్వడం భలేసులువు.

- బుచ్చిబాబు, ఉత్తమా యిల్లాలు

ఇతరులు తనని శంకిస్తే, దూషిస్తే, తప్పు అర్థంచేసుకుంటే, బలహీనుడు కుళ్ళిఏడుస్తాడు; బలవంతుడు తంతానంటాడు.

- చలం, మ్యూజింగ్స్

ఇద్దరికీ ఏడుపే అయినప్పుడు కలిసి ఏడిస్తేనే నయం.

- భమిడిపాటి, కాలక్షేపం

ఏడ్పు గుండెల్లో బాధపోయేందుకు దేవు డిచ్చిన సేఫ్టీవాల్వ్!

- నంది, నైమిశారణ్యం

ఏడిస్తే ఒకప్పుడు సంతృప్తిగా ఉంటుంది.

- రావిశాస్త్రి, జరీఅంచు తెల్లచీర

సాధారణముగా మూర్ఖురాండ్రకు తమ కార్యమును సాధించుకొనుటకు యేడుపే ముఖ్యసాధనమయి యేనిముషమున కావలసిన ఆ నిముషమున సిద్ధముగా నుండును.

- కందుకూరి, సత్యవతీ చరిత్రము

మనిషి ఏడుస్తూనే పుట్టి ఆ ఏడుపు అలా కంటిన్యూ చేసుకుంటూ వెళ్ళి ఏడుస్తూనే చస్తాడు. ఏడుపు తప్ప మనిషికేముంది?

- వెంకటరమణారావు, కొలువు

ఏడుపుల్ని వినిపించనివ్వరు అధికార్లు. అందుకే కోర్టుల్లో ఏడవనివ్వరు. అందుకే ఆస్పత్రుల్లో ఏడుస్తే విసుక్కుంటారు. అందుకే జెయిళ్ళనీ పోలీసుకాంపుల్నీ ఊరికి దూరాల్లో ఉంచుతారు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

కోర్టుకొచ్చినవాళ్ళు యింటికెళ్ళి ఎలానూ ఏడుస్తారు.

- రావిశాస్త్రి, నిజం

కాగితం మీది ఏడుపుకి కన్నీళ్ళుండవు. గొంతు ఉండదు.

- వెంకటరమణారావు, కొలువు

ఎంత యేడిస్తే అంత ఇష్టం ఈ లోకానికి.

- చలం, మ్యూజింగ్స్

కారణం తెలీకుండా ఏడ్చేది స్త్రీలు - తెలిసి కూడా ఏడవరు పురుషులు.

- బుచ్చిబాబు, గొలుసు

కోర్టుకెక్కి, గెలిచినవాడు ఇంట్లో ఏడిస్తే, ఓడిన వాడు వీధుల్లో ఏడుస్తాడు.

- సామెత

పుట్టుకతో ప్రారంభమయిన మనిషి ఏడుపు గొట్టుతనం చావుతో కానీ పరిసమాప్తం కాదు.

- లల్లాదేవి, నాగభైరవి

ఓదార్చువాఁడు దగ్గఱ లేనప్పు డేడ్చుట కష్టము గదా!

- పానుగంటి, ప్రచండ చాణక్యము

పుట్టిన పిల్లలు బువ్వకేడిస్తే, అవ్వ మొగుడుకేడ్చిందట.

- సామెత

పిల్లగలవాడు పిల్లకేడిస్తే కాటికాపరివాడు కాసుకేడ్చినాడట.

- సామెత

గుళ్ళో దేవునికి నైవేద్యం లేకుంటే పూజారి పులిహోరకు ఏడ్చాడట.

- సామెత

గారాబం గజ్జెలకేడిస్తే, వీపు దెబ్బలకేడ్చిందట.

- సామెత

కడుపు కూటికేడిస్తే కొప్పు పూలకేడుస్తుంది.

- సామెత

కంటికి మంటికి నేకధారగా నేడువఁజాల
నందులకె యేడ్చెదఁ దోడ్పడరారె యశ్రువుల్.

- తాపీ, నిరశ్రురోదనము

## ఏడుపుముఖం

బావురుమని ఏడుస్తున్న ముఖంకంటె ఏడుపు నిగ్రహించుకొంటూన్న ముఖమే దయనీయంగా ఉంటుంది.

- ఆనందారామం, కనువిప్పు

## ఏది నిజం?

రాజుల దర్జాలా - ప్రజల దరిద్రమా - ఏది నిజం?

- లక్ష్మణరావు, అతడు-ఆమె

## ఏదో ఒకటి

తనది అనేది ఏమాత్రమున్నా ఆ మేరకు మనిషి అధికారో బానిసో కాక తప్పదు.

- పాప, రామరాజ్యానికి రహదారి

## ఏనుగు

ఏనుగంత తండ్రి ఉండేకంటే, ఏకంత తల్లి ఉండేది మేలు.

- సామెత

వెయ్యి రూపాయలు పెట్టి ఏనుగునుకొని, అర వీసం అంకుశానికి పాలుమాలినట్టు.

- సామెత

సొంతానికి ఏనుగు ఉమ్మడికి పీనుగు.

- సామెత

పల్లాన పోయినా ఏనుగే, మిట్టన పోయినా ఏనుగే.

- సామెత

## ఏర్పాటు

రచన పెళ్లాం పేర, పారితోషికం తన పేర.

- శ్రీరమణ, న్యాయుడి

మాటలు తేటలు మా యింట్లో, మాపటి భోజనం మీ యింట్లో.

- సామెత

మొగవాళ్ళల్లో కూడా భోగంజాతి యేర్పరిస్తే యెవరికీ అక్రమం లేకుండా కుదురుతుంది.

- కందుకూరి, హాస్య సంజీవని

## ఏలని మొగుడు

కుట్టని రవిక చేతిలో ఉన్నాసరే, ఏలని మొగుడు ఊరిలో ఉన్నా సరే.

- సామెత

## ఏళ్లు

ఏళ్ళన్నీ ఏట్లోకి వెళ్ళేయి. మనమంతా కాట్లోకి పోతాం.

- రావిశాస్త్రి, నీడలు

# ఐ

## ఐకమత్యం

శైవులలో వున్న ఐకమత్యం వైష్ణవుల్లో లేదు.

- గురజాడ, మీ పేరేమిటి?

ప్రజలెల్లఁ గలిసిరేని
ప్రబలరాట్టుకైనఁ దిరస్కరింత్రు

- చిలకమర్తి, చతుర చంద్రహాసము

ఆదిలో ఏ యూనియన్‌లోనయినా గొప్ప యూనిటీ.

-నిరుద్యోగి, కార్యాలయబేతాళవిక్రమార్కీయము

సంఘీభవించి యెంతటి కార్యమయిన సాధింప వచ్చును. గడ్డిపరకలు సహితము పెంటిగా నేర్పడి మదపుటేనుఁగును బంధించుచున్నవి.

- చిన్నయసూరి, మిత్రలాభము

కలిసియుండినప్పు డైకమత్యమును బరస్పరాను రాగమును లేని వారనేకులు విభక్తములయిన తరువాత బహుకుటుంబములలో మరల నన్యో న్యమైత్రిని బడసిన వారయి పరస్పర సహాయు లయి సుఖించుచున్నారు.

- కందుకూరి, స్వీయచరిత్రము

అవిభక్త కుటుంబములలో నంతఃకలహములు ద్భవిల్లి యైకమత్యము చెడి సుఖభంగము కలి గినపుడు కుటుంబ స్నేహమును మరల నెలకొ ల్పుటకు వేఱుపడుటయే యుత్తమసాధనము.

- కందుకూరి, స్వీయచరిత్రము

మీరు బోధించుచున్న జాత్యైక్యము మాట ముందు చూచుకొనవచ్చునుగాని మీలో మీకే మాత్ర మైక్యమున్నదో సెలవిండు.

- పానుగంటి, సాక్షి

జాతిలో నైక్య మభిమానముచేత, నాదరముచేత, నన్యోన్యసానుభూతిచేత, ననురాగ పూర్వకము లైన యాచరణముల చేతఁ గలుగునుగాని గొంతు చింపుకొనినందువలన, బల్ల గ్రుద్దినందువలన, గంతులు వైచినందునఁ గలుగునా?

- పానుగంటి, సాక్షి

ద్రవత్వమువలన సర్వలోహములును, నిమి త్తము వలన మృగ పక్షులును, భయలోభ ముల వలన మూర్ఖులును, దర్శనమువలన సజ్జ నులును గలిసికొందురు.

- చిన్నయసూరి, మిత్రలాభము

మనదేశంలో ప్రత్యేకముగా నొక్కరొక్కరు చేయుటయేకాని సంఘీభవించి లోకోపకారము లయిన పుణ్యకార్యములను చేసెడి యుత్తమ మార్గము నింకను మనవారు గ్రహింపలేదు.

- కందుకూరి, దానములు

## ఐశ్వర్యం

ఐశ్వర్యం వుంటే, మంచిపెళ్ళాం వస్తుంది. పెళ్ళాం వచ్చాక ఐశ్వర్యం వినియోగపడుతుంది.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, ఆత్మబలి

ఐశ్వర్యం అందలమెక్కించినా బుద్ధి గాడిదెలు కాస్తూనే ఉంటుంది.
- కొడవటిగంటి, అనామిక

ఐశ్వర్యం మనిషిని మార్చకపోతే ఆశ్చర్యంగాని, మార్చితే ఏమీ ఆశ్చర్యం లేదు
- కొడవటిగంటి, ఐశ్వర్యం

ఐశ్వర్యానికి అంతం లేదు. దారిద్ర్యానికి మొదలూ లేదు.
- సామెత

రాజమకుటం శిరోవేదనను పోగొట్టలేదు ఐశ్వర్యం ఆనందాన్ని కొనిపెట్టలేదు.
- సామెత

# ఒ

### ఒకడు

కాచినను మానినను నీలకంఠుఁ డొకఁడె.
- చిలకమర్తి, గయోపాఖ్యానము

### ఒకేదారి

సుఖంగా, సంతోషంగా ఉన్న జీవితాల మార్గాలు వేరువేరుగా వున్నా కష్టాల్లో, లేమిలో ఉన్న బతుకుల గతుకులదారి ఒకటే.
- బుచ్చిరెడ్డి, హెచ్చరిక

### ఒకేసారి

గురువుల రాక, దాసి మృతి, గుబ్బపు దాడియు, నల్లు నల్కయున్
పొరుగున నప్పుబాధ, చెవిపోటును, వీధిని దొమ్మరాటయున్,
వరసతి గర్భవేదన, వివాహము, విత్తులు చల్లు కార్తెయున్
గలవు, దరిద్ర, మాల్భికముఁ గల్గెనొకప్పుడు కృష్ణభూవరా!
- రామకృష్ణుడు, చాటువు

### ఒక్కపొద్దు

నేనూ ఒక్కపొద్దే, నా మగడూ ఒక్కపొద్దే, పిండీ బియ్యంలేక పిల్లలూ ఒక్కపొద్దే.
- సామెత

### ఒట్టు

మనస్సులో విరుద్ధ భావాలు మెదులుతున్నప్పుడు మనిషి నమ్మించడానికి ప్రమాణాలు చేస్తాడు.
- నంది, నైమిశారణ్యం

కోడిగుడ్డు ప్రమాణకంగా
కృష్ణశాస్త్రిని చదవలేదట.
- శ్రీశ్రీ, మంచి ముత్యాలసరాలు

### ఒడ్డు

ఆడవాళ్ళ నోటికీ గోదావరి వరదకీ అడ్డూ ఒడ్డూ లేదనుకుంటాను.
- రాధాకృష్ణ, మనస్తత్వాలు

### ఒంటరి(తనం)

ఒంటిగాని పాటు యింటికి రాదు.
- సామెత

ఒంటరితనంలో ఆలోచనలు రెక్కలు విప్పుకొంటాయి.
- పులికంటి, బా(భీ)మాకలాపం

ఒంటరితనం అనుభవాలను జీర్ణించుకోటానికి, వ్యక్తిగతాభివృద్ధికి ఉపయోగపడుతుంది
- గోపీచంద్, పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా

అందరూవున్నా కొందరు ఒంటరివాళ్ళయిపోతారు.
- సరస్వతీదేవి, ఈ చీకటి విడదేమి?

ఆడది వంటరిగా కనపడంగానే ఈ మగవారు పెట్రేగిపోతారు. ఉచితానుచితాలను మరచిపోయి మాట్లాడుతూ ఉంటారు.
- పుల్లాభొట్ల, బఢ్ధీకొట్టు భద్రమ్మ

### ఒప్పు

వాగ్వాదనలో అంతారైటే, క్రియాసాధన మాత్రం వేరు.
- భమిడిపాటి, సంగతులు

### ఒప్పుకోలు

తన తెలివితక్కువ తనాన్ని, ఓటమిని ఒప్పుకోవటంలోనే గొప్పతనముంది.
- కృష్ణరావు, పాపికొండలు

తప్పు వొప్పుకోవడం వేరు. అందులో ఎరగనితనం, అమాయకత్వం వుంటుంది కాని, తప్పిదాలు చెప్పుకోవడం వేరు.
- మహీధర, కత్తుల వంతెన

తప్పుచేసి ఒప్పుకోవడమూ ఒక గొప్పే.
- బుచ్చిరెడ్డి, కృతజ్ఞతకథ

### ఒళ్లు

పనంటే ఒళ్లు బద్ధకిస్తుంది; పాయసమంటే పరుగెత్తుతుంది.
- దేవులపల్లి, ఏడాది పొడుగునా



ఓటమి

ఒక్కొక్కని ఓటమిలో
ప్రతిఒక్కని పాలున్నది
మానవహస్తం మలచిన
శిల్పంలోనే ఓటమి చాలున్నది.

- *బైరాగి, పరాజితులకొకపాట*

మనదేశం ఎప్పుడు ఓడిపోయినా కొత్త పద్ధతులు తెలియకా, కొత్త మారణాయుధాలు లేకా వోడిపోయింది.

- *గంగాధరరావు, ఇదా మన చరిత్ర?*

ఓటరు

ఓటర్లలో చాలమంది మంచి ఆలోచన గల వాళ్ళుకారు. మాయమాటలు దొంగవాడుకలు నమ్మి బందలో పడిపోదురు.

- *చిలకమర్తి, వోట్లకై తిరుగుట*

ఓటు

ఓటొక్కటి యిచ్చి యేరు
దాటించుడు! అంతే బస్!
తిరిగీ ఐదేండ్ల వరకు
తిరిగిచూచు పని ఉండదు!

- *మల్లారెడ్డి, అవతారపురుషుడు*

ఓటువిలువ యిచ్చేవాడికంటే పుచ్చుకునేవాడికి బాగా తెలుసు.

- *పులికంటి, గుండెల్లో రైళ్లు*

ఓట్ల సంగతి ఇప్పుడే ఎలా చెబుతామండీ? పడ్డాకగాని పెట్టె బరువు తెలియదు.

- *పరాశర, ప్రజారథం*

ఎన్నికల్లోవేసే ఓటులాగే, ఎవడు మేపితే వాడే నా అభ్యర్థి.

- *కొడవటిగంటి, అనామిక*

ఓటిచ్చినప్పుడే ఉండాలె బుద్ధి
ఎన్నుకొని తలబాదుకొన్న ఏమగును?
తర్వాత ఏడ్చినను తప్ప దనుభవము

- *కాళోజీ, ఓటిచ్చునపుడే*

పూటొక్కప్రొద్దుగా పొద్దుల్లుపుచ్చుతూ
కాటకాలు దాటి యేటివరదలు దాటి
చేటుతప్పి ఒక్కఓటు గడించాడు.

- *అజ్ఞాతకవి (కృష్ణాపత్రిక)*

వంచకుల, పీడకుల
దొంగల, హంతకుల
బ్యాలెట్ పెట్టెల నిండా ఓటు

- *కవిరాజమూర్తి, ప్రశ్న*

ఓటు గబ్బుకొట్టే వ్యవస్థలు, తినమరిగి తిరగమరిగిన బందిపోటు దొంగలపాలిట బల్లెపు పోటు ఓటు ప్రభుత్వం గేటుల్లో చోటు చేసుకొన్న నీరోలకి వ్యతిరేకమైన చట్టబద్ధ తిరుగుబాటు.

- *విజయలక్ష్మి, మహాప్రస్థాన పర్వం*

ఓడు

ఓడు ఓడంటే కంచమంతా ఓడన్నట్లు.

- *సామెత*

ఓదార్పు

ఒకర్ని ఓదారుస్తున్నప్పుడు మన కళ్ళల్లో నీళ్ళింకిపోతాయి.

- *విమలారామం, కిరణ్మయి*

వెన్నెలకోసం ఏడ్చే రాత్రిని
చుక్కలు ఓదార్చినట్లు
కర్తవ్యం బోధపడని మనిషిని
కవి ఓదారుస్తాడు.

- *సత్యనారాయణమూర్తి, మేల్కొన్నమనిషి*

తల్లి బిడ్డను ఓదారుస్తుంది. ప్రేయసి ప్రియుణ్ణి ఓదారుస్తుంది. పాపభీతి కలవాళ్ళను వేదాంతులు ఊరడిస్తారు. ఓటుచేతపట్టుకొన్న గొర్రెదాటు ప్రజలను ఎన్నికల్లో వేదికలెక్కి మహానాయకులు ఓదారుస్తారు. విరహతాడితుని కంటతడిని స్నేహితుడు తుడుస్తాడు.

- *పులికంటి, భా(భీ)మా కలాపం*

ఓపలేనివారు

చదువనేర్చిన ఆడువారితోను, వంటనేర్చిన మగవారితోను ఓపలేము.

- *సామెత*

ఓపిక

పూర్రిచర్డు చెప్పినట్లు పేషన్స్ వుంటేగాని లోకంలో నెగ్గలేం.

- *గురజాడ, కన్యాశుల్కం*

ఓపెనర్

ఓపెనరు మామూలు సోడాబుడ్డికే అవసరం అయినప్పుడు, సమావేశానికి అవసరం కాకపోవడమేమిటి?

- *భమిడిపాటి, అన్నీ తగాదాలే*

ఓర్పు

క్షమియించువారిఁ గని చా
లమి పెట్టుదు రైననుం దలంప సమాన
క్షమయ కడుమెఱయు తొడ వు
త్తమ రూపముఁ గోరువారు తాల్తురు దానిన్.
- తిక్కన, ఉద్యోగపర్వము

క్షమ గలిగిన సిరి గలుగును
క్షమ గలిగిన వాణి గలుగు సౌఖ్యములెల్లన్
క్షమ గలుగఁ దోన కలుగును
- పోతన, భాగవతము

తడవోర్చిన నొడ లోర్చినఁ
జెడిపోయిన కార్యమెల్లఁ జేకుఱు సుమతీ
- బద్దెన, సుమతి శతకము

ఓరిస్తే కోడిగుడ్డు, వీళే మాంసంపడ్డ పుంజ వదా? ఓరిస్తేనే మనిషి.
- కాంతారావు, దగాపడిన తమ్ముడు

ఓర్వలేనివాడు

తప్పులు వెదికేవాడు తండ్రి, ఒప్పులు వెదికే వాడు ఓర్వలేనివాడు.
- సామెత

ఔ

ఔదార్యం

హృదయమందున నౌదార్య మెసఁగకున్నఁ
గల్లమెఱుఁగుల నాగరికంబు రాదు.
- భానుమూర్తి, మాతృవిలాపము

ఎంతో ఔదార్యం ఉంటేగాని తప్పు చేశానని ఒప్పుకోరండి.
- రాజమన్నారు, మనోరమ

ఔన్నత్యం

మనలోని ఔన్నత్యాలు మన జీవిత పథంలో గొప్ప సంకెళ్లయి బాధిస్తాయి. అందువల్లనే రసికులూ, ఆర్టిస్టులూ, తాము ప్రపంచానికి అర్థం కామో అని ఏడుస్తారు.
- చలం, వాళ్ళు నలుగురూ

క

కక్కు

మనం ఎంత తిన్నా - ఎలా తిన్నా - కాస్త మితంగా తినాలండి. లేకపోతే కక్కాల్సి వస్తుంది- తిన్నది గడ్డయినాసరే కక్కక తప్పదు.
- గంగాధరరావు, యధాప్రజా - తథారాజా

కక్కుర్తి

కవులు కక్కుర్తి నిసుమంత కడుపుకొఱకుఁ
బొగడుచుండుదు రవివేక బుద్ధు లగుచు.
- తిమ్మకవి, కుక్కుటేశ్వర శతకం

కక్కుర్తి పడితేను కడుపునిండగవలెను
కడుపునిండని యట్టి కక్కుర్తి యేల?
- సన్యాసి, గంగావివాహం

కంగాళి

కలవాళ్ల కంగాళీ కడుపు నింపుకోడానిక్కాదు. కూడబెట్టడానికి.
- భూషణం, ఊరిమీద కథ

కచేరి

పగలెల్లఁ గచేరీలో గూరుచుండి చేయుపని యేమున్నది? అక్కడ నిద్ర పోఁగూడదేమి?
- పానుగంటి, సాక్షి

కటికతనం

ఆకు లూడ్చునప్పటి మోడు మ్రాకు లరసి
కంట తడిపెట్టలేనిదీ కటికజనము.
- కొడాలి, జైలులో చెట్లు

కట్టుబాటు

నాన్నుంటేనే జెయిలు. లేకపోతే బెయిలే.
- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

కట్నం

గాంధర్వమైనా కట్నం యివ్వక తప్పదు.
- రామకృష్ణశాస్త్రి, కణ్వాశ్రమం

తెలుగుదేశంలోని కమ్మకుటుంబాల కంట్రాక్టరు మనస్తత్వం పెద్దపులిలా నోరుతెరిచింది. ఈవేల వాళ్ళనే కాదు దేశంలోని ఆడపిల్లల తండ్రులందర్నీ మింగేసేటట్లు పళ్ళు కొరుకుతూంది.
- మహీధర, ఓనమాలు

చదువుకున్న గిత్త ధర ఎక్కువ పలుకుతుంది మరి.
- చిరంజీవి, బోలోస్వతంత్ర భారత్‌కీ జై

కట్నమెంత యిచ్చినను పుచ్చుకొందురుగాని వేయి రూపాయలకు తక్కువ యీయగూడదు.
- చిలకమర్తి, ప్రహసనములు

రాట్నమెడకనివాడు, కట్నం కామించనివాడు

పట్నంలో పందికొక్కైన పుట్టును కాటంరాజూ.

- బుచ్చిబాబు, గొలుసు

ప్రార్థనమీద ఎవడెక్కడికి వెళ్ళినా వాడిమాట వేదమే. పిలవకుండా వెళ్ళినప్పుడు గెంటకుండా పొమ్మనడమే కట్నం.

- భమిడిపాటి, మేష్టరీ కూడా ఒక ఉద్యోగమేనా?

బ్రాహ్మణులయింటఁ దొలుదొల్తఁ బ్రభవమంది
కోమటింటను ముద్దులు గొనుచుఁ బెరిగి
కమ్మవారింట పెళ్లునఁ గాపురంబు
సేయుచున్నది కట్నంపుఁజేడె నేఁడు.

- కాళ్ళకూరి, వరవిక్రయము

ద్వితీయ వివాహమైనను గట్నమీకున్నఁ గడపఁ ద్రొక్కనీరు ధనవంతులు.

- హనుమంతరావు, లేడీడాక్టరు

పిండి బొమ్మయైనఁ బిల్లనిచ్చెద మనఁ
గానె చేయిచాచుఁ గట్నమునకు.

- కాళ్ళకూరి, వరవిక్రయము

అటైతే వైద్య కట్నం, ఇటైతే వైతరణీ గోదానం.

- సామెత

పిలవకుండా పోయినప్పుడు గెంటకుండా పొమ్మనడమే కట్నం.

- సామెత

భార్యగా వచ్చే మనిషి జీవితం పొడుగునా తిన టానికి తెచ్చుకొనే గింజలు కట్నం డబ్బులు. మరి ఒకనాటి కన్యాశుల్కం జీవితాంతం ఇంటి పనీ, వంటపనీ చేయటానికి పనిమనిషిని కొనుక్కోవటం.

- ఇనాక్, ఇదీ కథ

**కఠినుడు**

పరగ రాతిగుండు పగులఁగొట్టఁగ వచ్చు
కొండలన్ని పిండి గొట్టవచ్చు
కఠినచిత్తు మనసు కరగింపఁగా రాదు.

- వేమన

**కడుపు**

చెప్పుటకుఁ గొంకిన గర్భము దాగ నేర్చునే?

- దుగ్గన, నాసికేతోపాఖ్యానము

ఎవడి పొట్టో కొట్టందే మన పొట్టకు మించిన తిండి మన యింట్లో మిగలదు. పదిమంది ఆస్తి చెదిరితేగాని ఒకడి ఆస్తి పెరగదు.

- కాళీపట్నం, అప్రజ్ఞాతం

కడుపెప్పుడు నిండదో కానిబుద్ధు లప్పుడు తప్పవు.

- కాళీపట్నం, ఆర్తి

కడుపుచించుకుంటే కాళ్ళమీద పడుతుంది.

- కాళీపట్నం, యజ్ఞం

కాలేకడుపుకి కాస్తబరువైనా కొండంత.

- రామదాసు, ఆకాశరామన్న

పురాణాలలో మగవాళ్ళకు కూడా పిల్లలు పుడు తారు. వేనుడికి పృధు చక్రవర్తి పుట్టినాడు. ప్రద్యుమ్నుడు కడుపుతో ఉండి పురూరవశ్చక్రవ ర్తిని కన్నాడు. యౌవనాశ్వుడు గర్భము ధరించి మాంధాతను గన్నాడు.

- కందుకూరి, హాస్యసంజీవని

కడుపుకి లేని పేదవారు యీ లోకంలో
ఉన్నంత కాలం అంతకు మించి చేసిన ఆర్జ
నంతా అన్యాయార్జితమే.

- కాళీపట్నం, అప్రజ్ఞాతం

సామానులేని ఖాళీ పడవ సాధారణ కెరటాల్లో కూడా వూగిలాడిపోతుంది. పూటు వేసిన పడవ తుపానులో కూడా హంస గమనం సాగిస్తుంది. మనుష్యుడు కూడా అంతే. నిండుకడుపుమీద ఆవేశాలు అల్లరిచేయవు.

- మహీధర, ఓనమాలు

దయయు సత్యంబులోనుగాఁ దలఁపఁడేనిఁ
గలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు?

- పోతన, భాగవతము

**కడుపుతీపి**

గొడ్రాలికేం తెలుస్తుంది కడుపుతీపి?

- సామెత

**కంటి జబ్బు**

ఏమేమొ నేర్వదలచి
ఎటుకెటకో పోయెదము
కళ్లముందు ఎపుడు తిరుగు
ఘనుల కానలేముగదా.

- పొట్లపల్లి, చీమలబారు

**కంట్రాక్టరు**

కంట్రాక్టరు కామధేనువు. మేత వెయ్యి, పాలు పిండు.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

కంట్రాక్టరు నాటకాలకి పట్టిన చెదపురుగు.

- యజ్ఞన్నశాస్త్రి, ఆంధ్రనాటకరంగానికి జై

కత్తి

సామాన్యపు కత్తితో పొడుచుకోవటం పౌరుషం కాదు. పొడుచుకుంటే వజ్రాలు చెక్కిన మన కత్తితోనే పొడుచుకోవలెను.

- కందుకూరి, బహుభార్యాత్వము

కత్తి అన్ని హక్కులు కలుగజేస్తుంది.

- ఉన్నవ, నాయకురాలు

కత్తి యుపయోగపడనప్పు డింకc బనికి వచ్చునది కలమేకదా?

- పానుగంటి, చూడామణి నాటకం

కత్తి నిజం పలికి తీరుతుంది. పిరికి పందల చేతకూడా నిజాన్నే పలికిస్తుంది.

- గంగాధరరావు, యథాప్రజా-తథారాజా

కత్తి-కలం

కత్తిపోటుకన్నా కలంపోటు మిన్నగా పనిచేస్తుం దన్నమాట వూరికే పుట్టలేదు.

- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

కత్తిc బట్టినవాcడే వీరుcడుకాcడు. కలము పట్టిన వాcడుకూడ. వీరుcడే. కనcబడిన స్థూల శత్రువులను ఖండించునది కత్తి. కనcబడని సూక్ష్మశత్రువులను ఖండించునది కలము. దేశోద్ధరణార్థమై పాటుపడిన వాcడెవcడైన వీరుcడే!

- పానుగంటి, సాక్షి

కత్తిరింపు

అప్పుడప్పుడు బతుకుల్ని కూడా కత్తిరించి మళ్లీ అమర్చుకోవలసి వస్తుంది. వికారంగా ఉన్న బతుకుని కత్తిరించి అందంగా చేసుకోవాలి.

- తులసి, యాష్-ట్రే

సీరియల్ ఎడిట్ చెయ్యగా చెయ్యగా శీర్షిక మిగిలిందట!

- శ్రీరమణ, న్యూసుడి

కథ

ఒకనాటి వాస్తవాలు ఈనాటి కథలు.

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

కథ జీవితంలాగ వుండదు, జీవితం కథ మాదిరిగా కనిపించదు. కథలో పాత్రలకున్న స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు, జీవితంలో వ్యక్తులకు వుండవు.

- లక్ష్మీనరసింహశాస్త్రి, మాలతికథ

అతివాస్తవికతకు చిహ్నం జీవితమనుకుంటే, వాస్తవికతకు దగ్గరగా రావటానికి ప్రయత్నిస్తుంది కథ. ఇట్లా వుంటుంది అని జీవితం చూపిస్తుంటే, యిట్లా యెందుకు వుండకూడదు అని కథ నిరూపిస్తుంది.

- లక్ష్మీనరసింహశాస్త్రి, మాలతికథ

జీవితం మధ్యమధ్య చదవటం కుదరని సీరియల్ కథ.

- పద్మనాభరెడ్డి, అంతర్వేదన

కథలా జీవితం యెప్పుడూ సహజంగా నడవదు.

- పద్మనాభరెడ్డి, అంతర్వేదన

కదలిక

స్త్రీ హృదయం కదలనే కదలదు. కదిలిందా అది జగన్నాథుని రథమే.

- అప్పారావు పట్నాయక్, రేవతి

కనపడేది

నిద్రలేచి చూసిన ప్రతిసారీ కనపడేది ఒక మిథ్యా వాతావరణం అల్లిన వల.

- కుందుర్తి, నగరంలో వాన

కనబడటం

నలుపు గానcగcబడుcగదా తెలుపులోన.

- శ్రీనాథుడు, శృంగార నైషధము

కనికరం

గొర్రె ఏడిస్తే తోడేలుకు కనికరమా?

- సామెత

కనిపించనిది

ఆల జాలంబు నీరిలో నాడు జాడ,
గాలి పడగ యాకసమునc గ్రాలు త్రోవ,
నిదుర లోపలc గల దోcచు నీడ విధముc
గానవచ్చునె యప్పుడ గన్నగాని?

- నాచనసోమన, ఉ.హరివంశము

కనీసధర్మం

...నీతి నిజాయితీలను నమ్ముకోవటం ఏమనిషికైనా కనీసధర్మం!

- రామచంద్రమూర్తి, శ్రీరాగం

కన్నీరు

సకల మానవకోటిని ఏకంచేసేది కన్నీరు. దీన్నుంచే ప్రేమ జనించింది.

- బుచ్చిబాబు, ఒమర్ ఖయామ్

కన్నీటితోనైనా కడుపు నింపుకోలేకపోం.

- గంగాధరరావు, నిజస్వరూపాలు

కళ్లంట నీలాలు కారితే, నోటంట సత్యం కూడా

రాలుతుంది.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

కన్నీళ్ళకు లింగభేదం లేదు!

- సావిత్రి, ఒడిలో వెలిమోహనరాగం

కన్నీళ్లు కడుపుతో వుండి
కత్తుల్ని ప్రసవిస్తున్నాయి
ఇవాళ కత్తులన్నీ కడుపులో దించుకొని
కన్నీళ్లు ప్రసరిస్తున్నాయి.

- శ్రీశ్రీ, కలగాపులగం

**కన్ను**

పోయిన కంటికి మందు వేయబోతే ఉన్న కన్ను ఊడ్చుకపోయిందట.

- సామెత

**కన్నెపిల్ల**

కన్నెపిల్ల మనసులో పెళ్లయ్యాక జీవితమంటే ఎన్నెన్ని రంగుల డేరాలు వెలుస్తాయో?

- పురాణం, ఇల్లాలి ముచ్చట్లు

**కన్‌ఫ్యూషన్**

కోరికని ప్రేమతో కన్‌ఫ్యూజ్ (confuse) చేసుకుంటారు ఆడవాళ్ళు.

- మారుతీరావు, నిజం నిద్రపోయింది

**కంపెని**

ముసలితనంలో మంచి కంపెనీ దొరకడంకంటే అదృష్టం లేదు.

- ఆనందారామం, అద్దంలోశత్రువు

**కమ్యూనిజం**

చేసిన పనినిబట్టి, ఎవరికి ఎక్కువ అర్హత వుంటే వారికి అదనంగా ఉండటం కమ్యూనిజమ్.

- బుచ్చిబాబు, ఆద్యంతాలు, మధ్య 'రాధ'

కమ్యూనిస్టు ప్రమాదం రష్యాకేం తెలుసు?

- కొడవటిగంటి, దిబ్బరాజుగారి ప్రతిష్ఠ

కమ్యూనిజంలో వుండే గొప్పశక్తి ఏమిటంటే, ఏ విషయాన్నైనా సరే- ఆరోగ్యం, విద్య, ఆర్థిక విధానం, దేవుడు, నీతి దేనికైనా సరే - పాత బూజుల్ని దులిపి, ఈనాటి ప్రజాక్షేమపు దృష్టితో చూడగలగడం. పెద్ద బలహీనతేమంటే కమ్యూనిజం సిద్ధాంతంలోంచి తప్పు దేనినీ చూడలేకపోవడం.

- చలం, మ్యూజింగ్స్

ఎట్లా జరుగుతుందో ఎందుకు జరుగుతుందో కమ్యూనిజం కళని చంపేస్తుంది

- చలం, మ్యూజింగ్స్

ఒక "మార్క్సిజం" మాత్రమే మనిషిని మనిషిగా గుర్తిస్తుంది. మనిషిగా బ్రతకటం ఎలాగో చెబుతోంది. అలాగ బ్రతికేదాన్నే కమ్యూనిజం అంటాన్నేను.

- శ్రీశ్రీ, అనంతం

పదవులకోసం పార్టీలు మార్చే దేశంలో ఎలా వస్తుందయ్యా కమ్యూనిజం?

- గంగాధరరావు, యథారాజా తథాప్రజా

**కమ్యూనిస్టు**

కమ్యూనిస్టులు పగలనే సరికల్లా అది రాత్రి అయికూర్చుంటుందా?

- కొడవటిగంటి, అనామిక

కష్టపడి డబ్బు సంపాదించటంలో ఉండే ఆనందం తెలిసినప్పుడందరూ కమ్యూనిస్టులే అవుతారు.

- కొడవటిగంటి, బెదిరిన మనుషులు

కమ్యూనిస్టు వ్యతిరేకులెంత గుడ్డిగా వున్నారంటే, వారు తమ ప్రయత్నాలు బెడిసికొట్టడం కూడా గమనించలేని స్థితిలో ఉన్నారు.

- కొడవటిగంటి, అనామిక

కమ్యూనిస్టులు కూలాడికి రాజ్యం కావాలంటారు.

- మహీధర, ఓనమాలు

కమ్యూనిస్టు నాయకులు సామాన్యంగా నవ్వరు. ఆనందించదగిన అంశమే కనిపించదు వాళ్లకీ ప్రపంచంలో.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

**కరణం**

కర్ణాలకు ఉద్యోగాలు పోయాయి గానీ, కలాలు పోలేదు. ఆ కలాలకు బలాలు పోలేదు.

- అప్పలనాయుడు, ఆకాశకుసుమాలు

మోక్షమునకుం గరణంబు హరణ్యమే సుమీ!

- శ్రీరాములు, తెలుగునాడు

ఊరిమీద నొక నూరయినంబడుగాక యెన్నడుం గరణముమీద నొక్క యరకాసయినం బడ దండ్రు...

- శ్రీరాములు, తెలుగునాడు

కరణము ముల్లోకవశీకరణము.

- కవిచౌడప్ప శతకము

కరణంగారి పేరుమీద పాలేరు
గదమాయించినట్లు.
- బుచ్చిబాబు, ఉత్తమాయిల్లాలు

కరణము తన యేలిక కుప
కరణము నిర్గుణగుణాధికరణము ప్రజకున్
మరణము పగవారలకును
మరణము నాఁ జెల్లు నీతిమంతుండైనన్.
- గోపరాజు, సింహాసన ద్వాత్రింశిక

### కరుణ

నరునికి గుహ్యతంత్రం కరుణ.
- బైరాగి, శాంతిపథం

ప్రాపంచిక రూపమైన దివ్యత్వమే కరుణ.
- బాపిరాజు, భోగీర్‌లోయ

### కరువు

ఈ త్రిలింగదేశంలో అన్నింటికీ కరువేగాని అనాథ స్త్రీలకి కరువు లేదు.
- ఆనందారామం, అద్దంలో శత్రువు

డొక్కల కఱవు వస్తే మగాళ్ళు ముందర తల్లులనీ, తరవాత పెళ్లాలనీ విఱచుకు తినేస్తారు.
- శివరామశాస్త్రి, డిప్రెషన్-చెంబు

ఈ రాజ్యంలో గడ్డికి గొడ్ల కరవూ, గొడ్లకి గడ్డి కరవూ...
- బొల్లిముంత, మృత్యుంజయులు

### కర్ణపిశాచం

కర్ణపిశాచం వున్నవాళ్ల దగ్గర కానికలు దాగవు.
- గురజాడ, కొండుభట్టీయము

### కర్ణాటం

ప్రౌఢి పరికింప సంస్కృతభాష యండ్రు
పలుకు నుడికారమున నాంధ్రభాష యండ్రు
ఎవ్వరేమన్న నండ్రుగా కేమి కొఱంత?
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష
- శ్రీనాథుడు, కాశీఖండము

### కర్ణుడు

కర్ణుఁ డొకండె దుర్జనుడు గాఁడు సుమీ
వసుదేవనందనా!
- తి.వేం., పాండవాశ్వమేధము

### కర్త

వ్రాఁత కంటె హెచ్చు వరమీదు దైవంబు
చేఁత కంటె హెచ్చు వ్రాఁతకాదు
వ్రాఁత కజుడు కర్త చేఁతకుఁ దాఁ గర్త
- వేమన

### కర్తవ్యం

కొండంత ప్రొద్యూసరు కొంగుపట్టుకుంటే కాదనేదెట్లా? అందిట.
- శ్రీరమణ, న్యాయుడి

ఈ ఇరవయ్యో శతాబ్దంలో, మనిషి మార్క్సిస్టుగా మారిపోతున్న మాయదారిరోజుల్లో, దేవుణ్ణి నిలబెడుతున్నవారికి, నిలబెట్టడానికి ప్రయత్నిస్తున్నవారికి దేవుడెలా అన్యాయం చేయగలడు? వారిని తను నిలబెడతాడు. అది తన ధర్మం.
- అర్నాద్, గొర్రెలు

ధైర్యంతో ధర్మాన్ని ఋజువు చేయాలి. నిజాలకు భయపడి తలవంచగూడదు.
- శ్యామలారాణి, జీవవాహిని

దూకిన గోడలు దూకుచునే యుండవలయును. చేసిన రామస్మరణలు చేయుచునే యుండవలయును. కోసిన గొంతులు కోయుచునే యుండవలయును.
- పానుగంటి, రాతిస్తంభము

మృగాల్ని వేటాడాలి. మహాత్ముల్ని వేడుకోవాలి.
- వేదాంతకవి, కష్టకాలం

ముందు మన మనస్సుల్లో కాలుష్యాన్ని కడుక్కుని ఎదుటవాళ్లని చూస్తే మనకి పచ్చకామెర్ల దృష్టి తప్పుతుంది.
- నంది, నైమిశారణ్యం

శిశిరం పోకమానదు, వసంతం రాక మానదు. ప్రకృతి పదేపదే చాటే ఈ నిత్య సత్యాన్ని గుర్తుపెట్టుకుంటే ఎంతటి కష్టకాలంలోనైనా మన కర్తవ్యాన్ని మనం శాంతంగా నిర్ణయించుకోగలం.
- నార్ల, జాబాలి

అనాదినుండీ మానవునిలో అనుశ్రుతంగా వస్తున్న సాంప్రదాయమే యిది. తానేం చేస్తున్నాడో లోకానికి చెప్పడు. ఇతరులేం చెయ్యాలో అది మాత్రం చెబుతుంటాడు.
- సభా, అంతరంగం

బుద్ధిగల వాళ్ళెవరూ ఖర్మని నిందించుకొంటూ కూచోరు; కర్తవ్యం నిర్ణయించుకుంటారు.
- ఆనందారామం, మళ్ళీ వచ్చినవసంతం

బలహీనులయినవారలు
బలవంతుల నొడుచునపుడు బహుమాయల నచ్ఛలమునఁ జేయుట యెందును

గలయదియ జయంబ కాదె కర్తవ్య మిలన్.

- నన్నయ, సభాపర్వము

కొంపలంటుకున్నా డ్యూటీ తప్పదు, కొంపలు మునిగిపోయినా డ్యూటీ తప్పదు!

- భరాగో, కఠినశిక్ష

అత్తను అమ్ముకొమ్మంటారు; కోడలిని కొలుచుకొమ్మంటారు.

- సామెత

కర్తృత్వం

మనతో సంబంధించిన యన్నిఁటికిఁ గూడ మనమే కర్తలము కాని సుఖమనుభవించునప్పుడు మన ప్రయోజకత్వమని యహంకరించి కష్టములు వచ్చినప్పుడు మాత్రము పైవారి నుత్తరవాదులుగాఁ జేయుచున్నాము.

- పానుగంటి, సాక్షి

కర్మ

చేసిన పాపం గోచీలో పెట్టుకొని కాశికి పోయినా కర్మం తప్పదు.

- సామెత

వచ్చిన కర్మం వద్దంటే పోతుందా?

- సామెత

పూనిన కర్మ పొరుగూరు వెళ్ళినా మానదు.

- సామెత

కర్మ చిత్తశుద్ధికి సాధనమని ఆస్తికులంతా అంగీకరించరు. కర్మ కంచె వంటిది. పైరు పెరగటానికి యెరువూ, యెండా, నీళ్ళు సాధనమయినా, చెడుగొడ్లను లోపలికి రానియ్యదు. మనకు కావలసింది లోపలి తౌనలూ, గుజ్జే. అవి వుంటే చాలు కాని అవి తొళకలేనిది లభించవు. కర్మ యెప్పటికైనా విసర్జించవలసిందే గాని భోగ్య సమయం వచ్చేవరకూ తొళకరూపకంగా అంటుకునే వుంటుంది.

- ఉన్నవ, మాలపల్లి

బుద్ధులు భూములేలుతుంటే కర్మం గాడిదల్ని కాస్తోందంటారు.

- విశ్వనాథ, ముగ్గురు బిచ్చగాళ్ళు

మానవుడు కుప్పిగంతులు వేసి, చేసాను అంటుంటాడు. కాని అనుకున్నంత సేపేనా పట్టకుండా కర్మవచ్చి మనిషిని నేల్నెట్టి కొడుతుంది.

- భమిడిపాటి, కచటతపలు

మర్మ మెరిగేవరకు కర్మ చెయ్యాలంటారు.

- శ్యామలారాణి, పవిత్ర

కర్మమార్గం

అది యట్లు జరిగిన దనఁగ నది యెప్పుడట్లులే జరుగు,
మదికి నూహింపఁగా వేయి మార్గముల్ మనలునేగాని
యది కర్మ నిర్ణీతమైనదా నొక్కక యధ్వమే పోవు;
నది మంచిదా, చెడ్డదా యటంచనునది యొండె ప్రశ్న.

- విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము

కర్మవీరుడు

కర్మవీరులు చరిత్ర పుటల్లోనే ఉంటారనుకోవడం తప్పు. వాళ్లు వాస్తవ ప్రపంచంలో నిజ జీవితంలో కూడా వుంటారు.

- రాజారాం, ధర్మయ్య కల

కర్ర

కర్ర యెవనిదో బఱ్ఱె వానిది.

- సురవరం, గ్యారాకద్దూ బారాకొత్వాల్

నిప్పు వున్న కర్ర తప్పకుండా కాలుతుంది.

- సూర్యారావు, రెక్కతెగిన పక్షి

కల

అది సత్యమై యున్న నాశ్చర్యకరము
అది కలయేయైన నానందమయము.

- దువ్వూరి, భవిష్యద్దర్శనము

వేకువతో కరగిపోయే చీకటికల ఏదీ తిరిగి రాదు. కానీ ఏదీ చెరగిపోదు.

- బైరాగి, నేను మీ కవిని కాను

చెడ్డకలలు మూడదలచిన కీడుల చాయ లని స్వప్నవేదులు వచింతురు.

- చిలకమర్తి, కర్పూరమంజరి

ఫలించని ఆశలకు ప్రాణం పోసే మనస్సు ఆడించే అంతర్నాటకమే కలగా కనిపిస్తుంది.

- పినిశెట్టి, పంజరంలో పక్షులు

చచ్చినంత కలగంటే పెందరాళే మేలుకో.

- చెళ్లపిళ్ల, కథలు - గాథలు

నీకోసరం ఎతుక్కుంటూ కలంతా గాలించాను

- బుచ్చిబాబు, ఉత్తమా యిల్లాలు

కలలు కనలేనివారు కార్యానికి పూనుకుంటారు.

- బుచ్చిబాబు, ఒకేనిద్ర-ఎన్నోకలలు

స్వప్నాలు కనడం సోమరికే సాధ్యం.

- బుచ్చిబాబు, ఒకేనిద్ర - ఎన్నోరాత్రులు

భవిష్యత్తులో విశ్వాసమే. మబ్బులకి రంగులు వేసే నా కలలే నాకు మిగిలాయి

- చలం. హంపీ కన్యలు

తెలివి రానీయకే కల కరిగిపోతాది.

- చలం. హంపీకన్యలు

చచ్చునంతటి కలగన్న నోలి మేలుకొనియే యుండవలయు

- అనంతుడు. భోజరాజీయము

కలలో జరిగింది ఇలలో జరగదు

- సామెత

రెండు వందల మిలియన్ల జనాన్ని కన్న భారత మాతకి కలలుకనే ఓపిక ఉంటుందా మరి?

- బుచ్చిబాబు. ఒకేనేత్ర-ఎన్నోరాత్రులు

నీవధిరోహించిన యీ అల
నిత్యం శాశ్వతము సుమా
నీకల్పించిన ఈ కల
నిజం నిజం వాస్తవికం.

- అబ్బూరి. కవిత

ప్రతివాడి వంట్లోది రక్తం. ప్రతివాడికీ ఆశలూ, ఆశయాలుంటాయి. జీవితంలో ఏదో సాధిద్దామనే కలలు కంటూ కళ్ళు మూస్తాడు.

- మారుతీరావు, అనంతం

కల ఎప్పుడూ మనిషికి బలం.

- తిలక్, స్వేచ్ఛావిహారం

చినిగిన స్వప్నపు సంచీలో
చితికిన బాష్పం నిలవదు.

- తిలక్, కాయ్‌రాజా కాయ్

కల కలకోసమే.

- శ్రీరమణ, న్యూనుడి

స్వప్నములనుండి సేకరించిన మధుర భావములు కూడ లోకసంస్కారమున కుపకరించును

- వరద, నాట్యగోష్ఠి

## కలం

రాయ సమకట్టినై వేళ్ళు
దాహం! అని కలం నాలుక చాచింది
పాలీ అడుక్కు కుంగిపోయింది.

- మాచిరాజు, రాట్నం

కర్నాలకు ఉద్యోగాలు పోయాయిగానీ, కలాలు పోలేదు. ఆ కలాలకు బలాలు పోలేదు.

- అప్పల్నాయ్డు, ఆకాశకుసుమాలు

కత్తి యుపయోగపడనప్పు డింకఁబనికి వచ్చు నది కలమే కదా?

- పానుగంటి. చూడామణి

మన కలానికి కన్నొకటి
కలవు నాలుకలు రెండు.

- కాళోజీ, జాగ్రత్త

కలం నర్సు కవిత పాప బొడ్డుని తెగ్గోస్తూనే ఉంది.

- సీతారాం. తెగిన అక్షరాలు

కత్తుల ఒత్తిడిలో
సంఘద్రోహుల తొక్కిడిలో
కలం కలవరిస్తున్నది
గెలుపై జీవించాలని.

- సినారె. మధనం

## కలవరింత

కలవరింతలు నిజాన్ని బయట పడేస్తూ వుంటాయి.

- సరస్వతీదేవి. విచ్చిన మబ్బులు

పడుకోవటం పాతగోడలలో, కలవరింతలు మిద్దెటిండ్లలో.

- సామెత

## కలికాలం

హతవిధీ! ఇది కలికాలం. కలికి కాలం.

- తిలక్, అభినవ ఋగ్వేదం

## కలిమి

లప్పెడుంటే చాలు. అంతా మాసిపోతుంది.

- కృష్ణరావు. పాపికొండలు

వెలయాలు సుతుఁడు నల్లుఁడు
నిలపతియును యాచకుండు నేవురు ధరలోఁ
గలిమియు లేమియు నెఱుఁగరు
కులపావనమూర్తివన్న

- గువ్వలచెన్న శతకము

విలసితములైన కలిమి లేములకుఁగూడ
కడలు పరికించు నెడల సౌఖ్యంబు గలదు.

- జాషువా, స్వప్న కథ

అన్నీవుంటే అలివేలి మంగ, ఏమీ లేకపోతే దాసరిదుంగ.

- పూర్ణానందం, ఈడూ - జోడూ

తనకుఁగాని తన కుమారునకుఁగాని తన తమ్మునకుఁగాని పెండ్లి సంబంధము వచ్చినప్పుడు ప్రతి మనుష్యుఁడు వడ్డి వ్యాపారము చేయువాఁడగును. ఈనాముదారుఁ డగును.

- చిలకమర్తి, నవ్వులగని

కలవాళ్ళంటే కర్మసాక్షిగూడా కాళ్లు పడతాడు.
- వేదాంతకవి, తెనుఁగుతల్లి

తనకి ఏమీ అఖ్ఖర్లేని వాడికి, అన్నీ వుంటాయి. అట్లానే అన్నీ కావాలని దేవుళ్లాడే వాడికి, అన్నీ వుండికూడా లేనట్టే.
- చలం, మ్యూజింగ్స్

అష్టయిశ్వర్యాలలో పుట్టినవాళ్లకు కోరకుండానే అన్నీ సమకూరుతుంటాయి. అందుచేత అక్కడే అసంతృప్తి మొదలయిపోతుంది. ఇలాంటి పరిస్థితులలోనే కలవారి బిడ్డలు దుర్వ్యసనాలకు బానిసలౌతుంటారు.
- శ్యామలారాణి, పవిత్ర

### కలిమిలేములు

అవతలివాడి లేమి ఎప్పుడూ మన కలిమికాదు.
- బీనాదేవి, స్వేచ్ఛాయజ్ఞం

### కలివిడి

నలుగురితో పాటు నారాయణ, కులంతోపాటు గోవిందా.
- సామెత

### కలిసి రావటం

లక్ష్మి యేలినట్టి లంకాధిపతి పురి
పిల్ల కోఁతి ఫౌజు కొల్లఁబెట్టె
కలసివచ్చువేళ ఘను లౌదు రల్పులు
- వేమన

### కల్తీ

మేలిమి బంగారమైనా రవ్వంతైనా రాగి కలిస్తేనే ఒక అందం.
- జంగయ్య, జాతర

'కల్తీ-కంత్రీ' మనకేం కొత్తకాదు. కల్తీ లేకపోతే కలవరపడాలి, అనుమానపడాలి కాని.
- బుచ్చిరెడ్డి, ఎప్పుడొస్తుంది దీపావళి

'కల్తీ-కొరత' ఈ రెండూ అక్క చెల్లెండ్లులా జోడు గుర్రాలు లాంటివి- అన్యోన్యంగా వుండగలవు, జోరుగా సాగిపోగలవు!
- బుచ్చిరెడ్డి, ఎప్పుడొస్తుంది దీపావళి

ఈ రోజుల్లో మిగిలిన అన్నీ కల్తీ అయిపోయినట్లుగానే పోలీసులు కూడా కల్తీ అయిపోయారు.
- ఆనందారామం, మరోముందడుగు

ఆ యింగిలీషే మన కొంపతీసింది. కళ్లు తెరవని పిల్లలు మొదలు పెద్దవాళ్ల వరకూ అందరూ ఆ కల్తీ కబుర్లాడడమే.
- సూర్యారావు, శ్రీమతులు-శ్రీయుతులు

### కల్పన

ఈ డాక్టర్లొకళ్ళూ, జోతిష్కులొకళ్ళూ, వీళ్ల దగ్గరుంటే లేని రోగాలు వచ్చేటట్లు చేస్తారు.
- మహీధర, కత్తుల వంతెన

### కల్పవృక్షం

డిపార్టుమెంటు పబ్లిక్ వర్క్సు బాబూ! అంటే కల్పవృక్షం.
- రావిశాస్త్రి, కుక్కపిల్ల

### కల్పితం

తాళ్ళపాకవారి కవిత్వం కొంత, తన పైత్యం కొంత.
- సామెత

### కల్ల

కామికి నిలువెల్ల కల్ల.
- చలం, శిలాదిత్య

ఢిల్లీశుఁడో, జగదీశుఁడో
యుల్లమ్మునఁ బొడము కోర్కు లొడఁగూర్చెడి నీ
చిల్లర రాజు లొసంగుట
కల్ల యొసంగినను గూరకో యుప్పునకో?
- తి.వేం., పండితరాజము

### కల్లు

కల్లో గంజో మాతోపాటు...
- శ్రీరమణ, న్యాయుడి

కల్లుపయిన నురుగు కాఫీలో వేడిని
నూదుకొనుచుఁ ద్రాగుచుండవలయు
కాని కాఫికున్న గౌరవ మల కల్లు
కాచనందువలనఁ గలుగలేదు.
- ఉమర్‌అలీషా, కాఫీ

### కవచం

కవచం అని తొడిగితే అది నిర్బంధమయింది.
- కొడవటిగంటి, ఒంటిస్తంభం మేడ

### కవలలు

క్రౌర్యం మోసం కవల పిల్లలు కదామరి.
- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

అర్ధప్రాణములు కవలపిల్లలు. అడుగడుగునఁ బ్రాణమున కెన్ని గండము లున్నవో యర్థమున కన్ని గండములె యున్నవి.
- చిలకమర్తి, గణపతి

### కవి

గాడిద నీవునుం గవివి కాదుకదా యనుమాన మయ్యెడున్?
- శ్రీనాథుడు, చాటువు

చాలామంది కవులమనేవారు, యెంగిలి శ్లోకాల వల్లనే ప్రతిష్ఠ సంపాదిస్తారు.

- *గురజాడ, బిల్హణీయము*

కవుల్లో కొందరు చాలా డేంజరస్ ఫెలోస్.

- *రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!*

కవుల కతలకు రాజుల కతలు లొచ్చు

- *చెళ్ళపిళ్ల, కథలు-గాథలు*

వ్యాకరణ మొక్క త్రోవ మ
హాకవు లొక త్రోవ కోశ మఖిల మ్మొక త్రో
వై కనుపట్టెడి

- *చెళ్ళపిళ్ల, కథలు-గాథలు*

లోకంలో పుట్టిపెరిగిన కవి లోకాన్ని విడిచి కవిత్వం చెప్పలేఁడు, ఎక్కడేనా కొన్ని లోకాను భూతులు దొర్లుతూ వుంటాయి.

- *చెళ్ళపిళ్ల, కథలు-గాథలు*

సాధారణముగా మనుష్యుల యిష్టానిష్టములకు కారణము లగపడవు. అందులోఁ గవుల యిష్టా నిష్టములకుఁ గారణములఁగూర్చి యెవఁడు చెప్పఁగలఁడు.

- *పానుగంటి, సాక్షి*

స్వకవితాభిమానము కూర్చిన వెఱ్ఱి యన్ని వెఱ్ఱు లలోను వెఱ్ఱి యగునది. శుద్ధకృపణుడు సంతా నాదినష్టము వలనఁ గార్పణ్యము వదల వచ్చును. పరమపాపాత్మునకైనఁ బ్రాణోత్క్ర మణ సమయమునఁ దనువుపై నభిమానము -ధనముపై వాంఛ - తరుణిపై మక్కువ- పాప కార్యమునందాసక్తి - వదిలిపోవచ్చును. కాని చచ్చిన తరువాతనైనఁ గవికి బరకవితా నిందా సహితమగు స్వకవితాభిమానము పోదు.

- *పానుగంటి, సాక్షి*

కవి ముదిరి కాని వంటవాడు కానేరడు.

- *పానుగంటి, సాక్షి*

భీముఁడు వంటవాఁడై స్వరాజ్యమును సంపా దించుకొనెను. అటులే కవులెల్లరు పాచకులగునె డల స్వరాజ్యము మన కవలీల రాగలదు.

- *పానుగంటి, సాక్షి*

కవులకు విమర్శకుని యందెంత యసహ్యమో చెప్పవలయునా?

- *పానుగంటి, సాక్షి*

జగత్సృష్టి కర్తయగు బ్రహ్మమాట యెవరి యొద్దనైన సాగును గాని, గ్రంథ సృష్టికర్తయగు కవిబ్రహ్మయొద్ద సాగునా? తన యిష్టమే యిష్టము. తన మాటయే మాట! తన వ్రాఁతయే వ్రాఁత! నిరాఘాట వచఃపాటవ సంపన్నుడు, నిరంకుశ క్రియాచరణదీక్షాదక్షుడు. పుట్టనివారిని పుట్టించును. గిట్టని వారిని గిట్టిం చును. గిట్టిన వారిని బ్రతికించును. సృష్టి చ క్రము నిట్లు సవ్యాపసవ్యములతో జోక్యము లేకుండ నిష్టానుసారముగఁ ద్రిప్పుచుండును.

- *పానుగంటి, సాక్షి*

పురుషులు-స్త్రీలు నొక పాకలోఁ జేరి రాత్రివేళఁ జూచువారి యెదుట గ్రంథమెప్పుడు వినిపించి తయితక్కలాడుదురో యది నాటకముకంటె నెన్నడు భిన్నము కాదు. నాటకములో గాయకు లుందురు, నటకులుందురు. నాటకమెవ్వడో యొక కవి చేయవలసినది కదా! కవులు, నట కులు, గాయకులు పంక్తి బాహ్యులు. వారి ముఖము చూచుసరికి సచేలస్నానమాచరింపవ లయును. కవి ఎప్పుడు భ్రష్టుఁడైనాఁడో యతని గ్రంథమప్పుడే బహిష్కారయోగ్యమన్న మాట. ఇప్పుడింకను దె(లివి)లుఁగు మీరుటచే నంత పట్టుదల లేదుగాని మా నాయనగారి చిన్నతనములోఁ గవి యెవ్వఁడైన గ్రామములో నికి వచ్చుసరికి వెఱ్ఱికుక్కను గొట్టినట్లు గొట్టువా రలు.

- *పానుగంటి, కంఠాభరణము*

కవిత్వమల్లినవానికొక్క ముసలిదియో, పడుచు దియో, యటునిటు కానిదియో, సువాసినియో, వితంతువో, యటునిటు కానిదియో, యొక్కతె పక్కదాపుగా నుండక తప్పదని జనుల నమ్మ కము. దేవుఁడున్నాఁడను నమ్మకముకంటె జను లకిది దృఢతరమై యున్నది.

- *పానుగంటి, సాక్షి*

కవులకున్న పౌరుషము యుద్ధవీరులకు లేదు. వారికున్న యసూయ జారులకు లేదు. వారి కున్న స్వస్తోత్ర పరనిందలు పడుచుసానులకు లేవు. తిట్లు తిట్టుటయందుఁ దినుట యందుఁ గూడ మహాఘనులు.

- *పానుగంటి, సాక్షి*

ఎవని బొమ్మలు మాటలో యతడుఁ చిత్రకారు డగునట్లే యెవని మాటలు బొమ్మలో యతఁడే కవి.

- *పానుగంటి, సాక్షి*

జగత్పుస్తకమును జదివి, దాని యర్థమును గ్రహించి, దాని భావమును గుర్తెఱిఁగి, దాని రచియించిన మహాశక్తి యొక్క తత్త్వము నను మానింపఁ గలిగిన యతఁడే కవి!

- పానుగంటి, సాక్షి

కొమ్మయని ముద్దుల గుమ్మయని పైరంగులకు లొంగిపోయి వనితల వర్ణించు కవులు వట్టి శుంఠలు

- పానుగంటి, చూడామణి

స్వార్థంలేని నిర్భాగ్యుడు కవి ఒక్కడే.

- బుచ్చిబాబు, ఒమర్ ఖయామ్

చికెన్ తందూరీ నములుతున్న కవి, తాజా మృత్యుకవితకి బీజాలు నాటుతాడు. పోరాటాల కవి మటన్‌సూప్‌లో పరోటాముంచి మాటలకు కండపట్టిస్తాడు.

- సౌభాగ్య, సింహావలోకనం

కవిగా జీవించాలంటే ఛందస్సులమీద అధికారం సంపాదించవలసిందే.

- శ్రీశ్రీ, కవిత్వంలో నాప్రయోగాలు

మెరుగు కళ్ళజోళ్ళు గిరజాలు సరదాలు
భావకవికి లేని వేవి లేవు.
కవితయందు తప్పు గట్టివా డన్నింట

- మాచిరాజు, పేరడి అంటే

కవి తన మూడులో తానే వుంటాడు. వికటకవి పరకాయ ప్రవేశం చేస్తాడు. ఇతను సాహిత్య సర్కస్‌లో బఫూన్ లాంటివాడు. ఇతను వారి వారి పనులు చేస్తున్న సమర్థులైన వేరు వేరు వస్తాదులను ఒక్కడే ఒకడు రెండుమూడుసార్లు అంతే సమర్థతతో అనుకరిస్తూ, మూడోసారి హాస్యం నిమిత్తం పిల్లి గంతులేస్తాడు. కాని అందరి పనులు చేయగల సమర్థుడు. వికటకవి కూడా అంతే.

- మాచిరాజు, పేరడి అంటే

భాష ఆడడం వాడడం అసలైన భాషాసేవ. అది జనం అంతా చేస్తున్నారు. వాళ్ళు కష్టపడి ఆర్జించింది నొల్లుకుని కవి తందే అంటున్నాడు.

- భమిడిపాటి, అన్నీ తగాదాలే

గొప్పకవులందరికీ గానం కూడా రావాలి.

- భమిడిపాటి, పద్యం-రాగం

అందరికీ ఆప్తులైకూడా, ఆప్తులే లేనివారు కవులే అనుకుంటా...

- ఆత్రేయ, అశ్వఘోషుడు

కవి నిర్జీవ ప్రదేశానికి పోవాలి! ఏకాంతవాసం చెయ్యాలి

- నార్ల, నవకవి

గతంలోంచి కొంత నేర్చుకోబోయి
గతానికి తాకట్టు పడుతున్నారు కవులు

- దాశరథి, మస్తిష్కంలో లేబొరేటరీ

మహా కవులు ప్రజాకవులు
సారస్వత అస్పృశ్యుల
జాతిలోన చేర్చబడిరి!

- మల్లారెడ్డి, పేరిగాడి దర్బారు

కట్టుడుపలువరుసలాంటి
పెట్టుకున్న బిరుదులతో
అట్టహాస భాసురులే
అహంభావ కవిబ్రువులు

- మల్లారెడ్డి, బలేచౌకబేరం

కీర్తి దిగ్దిగంతాల క్రిక్కిరిసి పోవ
వారు పూర్తిగా మరణించినారు కాని
తాళి కూస్తన్న నాదుగీతాలు నాల్గు
స్వామి! ప్రెస్సు కిచ్చైన చచ్చాడు గాడు!

- మాచిరాజు, అన్యాయం

అతను కవిగాడు అయితె అయ్యాడుగాని ప్రణయకవిగాడు ఔటయే బాధయిపుడు.

- మాచిరాజు, పాతిక పాదాల ఓబాధ

ఇద్దరు కవులు మాట్లాడుకుంటున్నప్పుడు కవిగా కపోతే మూడోవాడికి వళ్లుమండిపోతుందం టారు.

- ఆదివిష్ణు, ఎంతెంతదూరం

కవికున్న పిచ్చివంటి పిచ్చి మరియొవ్వనికి లేదు. అబ్బ! వానికున్న తెగనీలుగు- తలతిక్క- పొగరుబోతుదనము- కొసవెఱ్ఱి- కొంకనక్కత నము మఱి యొకని కున్నదా?

- పానుగంటి, సాక్షి

పరులబాధ తన బాధగ
పంచుకున్నవాడే కవి,
పరుల సుఖంలో శిరస్సు
పైకెత్తినవాడే కవి

- సినారె, నారాయణరెడ్డి గేయాలు

కవులు వ్రాసిన పద్యాలను చదువుకొని ఆనం దించవలసిందేగాని, వాటిని శిలాక్షరములుగా తీసుకొని ఆచరణలో పెట్టకూడదు. వారి తలలు ఆకాశంలో ఉంటాయి. పాదాలు

మాత్రం భూమిమీద ఉండవు.
- గోపీచంద్, దేవునిజీవితం

అక్షరాన్ని నిత్యం శంకించి ఉపయోగించేవాడే నిజమైన కవి.
- నగ్నముని, కొయ్యగుర్రం

కవితలు వినిపిస్తామని కవ్వించేవాడే కవి.
- శ్రీరమణ, న్యూనుడి

కభాషలో చెప్పినా కవి కవే!
- శ్రీరమణ, న్యూనుడి

దేవునాన మున్ను దేశాని కొక కవి
యిప్పు డూరనూర నింటనింట
నేగు రార్గు రేడ్గు రెనమండ్రు తొమ్మండ్రు
పదుగురేసి కవులు పద్మనాభ!
- అడిదము, చాటువు

కవి యల్లసాని పెద్దన
కవి తిక్కన సోమయాజి గణుతింపంగాఁ
గవి నేను రామకృష్ణుఁడఁ
గవియను నామంబు నీరుకాకికి లేదే?
- రామకృష్ణుడు, చాటువు

కవియనఁగా వంట బ్రాహ్మణుని వంటివాఁడు. వాని పాకమునందుఁ బలె వీని పాకమునందును భిన్నాభిప్రాయము లుండెడివి.
- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

ప్రణయ కవియొకండు, పాషాణ కవి యొక్కఁ
డేడ్చుకవి యొకండు, నేకమగుచు
నొండొరులను జూచి యోదార్చుకొనుచున్న
బాగుపడునె భావి భరతజాతి.
- జాషువా, తొలి నిట్టూర్పు

మంత్రిత్వంలో లోపాయికారిగా అనుభవించే ఐశ్వర్యం యెక్కువగా వుంటే వుంటుంది. పైకి కవికున్న గౌరవం, మంత్రులకు వుండదు. మంత్రి నవుకర్ల తరగతివాఁడు. కవి ఏ తరగతి వాఁడూ కాఁడు.
- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

శాస్త్రం చదువుకున్న వాళ్లంటే కవిత్వం చెప్పుకొనే వాళ్లకు యెంతో గౌరవం వుండటమున్నూ, కవిత్వం చెప్పే వాళ్లంటే శాస్త్రజ్ఞులకు యీసడింపున్నూ సర్వసామాన్య విషయాలే.
- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

**కవికోరిక**

పాతమంత్రులు పోతుంటారు.
కొత్త సచివులు వస్తుంటారు.
పాత రోతని వదిలేస్తాను.
కొత్తవారినే పొగిడేస్తాను.
- శ్రీశ్రీ, ఉగాది స్వగతాలు

**కవిత**

కవిత్వం ఒక నిలకడలేని పక్షి.
- సుమనశ్రీ, నేత్రం నా సంకేతం

కొత్త కవిత్వం అస్థిపంజరాలకు రంగువేస్తోంది.
- సుమనశ్రీ, నేత్రం నా సంకేతం

కాబోలు కవిత్వం అందుకే
నిత్యనూతన వర్ణమాల
అడవిలో మనసు నిర్మించి
నివసిస్తున్న పర్ణశాల
- కుందుర్తి, ఎవర్‌గ్రీన్

ఇన్నేళ్ళు రాసిన కాగితాలన్నీ
హిమాలయపర్వతా లైనాయి
వాటిమీద వాడిన సిరా
వక మధ్యధరాసముద్ర మయింది.
- శేషేంద్రశర్మ, మరోదేవుడు

కుబుసం వదలిన సర్పం
నాగీతం పులిపంజా
- పురిపండా, పులిపంజా

కవి చస్తేగాని కవిత్వం బయటపడదు.
- శ్రీరమణ, న్యూనుడి

జనం ప్రభుత్వంమీద వేసే నిషాయే కవిత్వం.
- శివారెడ్డి, నిషా

సంపాదకుల ఇళ్ళముందు
కాపలా కాస్తున్న గజ్జికుక్క
బంధుప్రీతి పందిళ్ళపై
పెంచుకున్న క్రోటన్‌మొక్క
- ప్రసేన్, చెదలుపట్టిన భావుకత

పొగడ్తల కలవడిన వాక్కే కవిత్వము.
- వేంకటలక్ష్మీనరసింహారావు, అనార్కలి

కవిత్వాన్ని మాత్రం కొనకు-వినకు
అది ఉత్తమన్ను
వేలుపెడితే చాలు తగుల్తుంది
ఎవడిదో కన్ను
- సోమరాజు, కవిత్వాన్నిమాత్రం కొనకు

ఎవ్వరికీ అర్థంకాకపోయేదే మేటి కవిత!
- వేణుగోపాల్, రచయిత సమస్య

కల్లుకంటెను కఠినమై క్రాలుచుండి

కల్లు కంటెను వాసనాగరిమ నెసగి
ఎల్లవారికి నుల్లాలు పల్లవింప
సల్లలితమైన మీకైత చెల్లుచుండు.
- గునుపూడి, బిడాలశాస్త్రి

కవిత జీవితానికి కుంటిసాకు
కుంచియ చిత్రించిన అడవి ఆకు.
- బైరాగి, అపూర్ణకవిత

చల్లని మలాముకాదు, కాదు కవిత. నాగు
బాము! నాగుబాము! కాటేస్తుంది జాగ్రత్త! దీని
కాటుకు విరుగుడు లేదు జాగ్రత్త!
- బైరాగి, వినతి

ఎవడైనా 'కవిత ఇదమిత్థ' మని అంటే గోష్పా
దమంత నీటిలో మునిగి చావమనవలదా?
- బైరాగి, సూత్రాశ్రమం

కవితాసత్రం వెనుక ఎంగిలి విస్తళ్లకొరకు వెదు
కను నేను.
- బైరాగి, పిరమిథ్లు

పుట్టని ఒక భవిష్యత్తులోకి
పుట్టెడు వూహల చేతులు చాచి
అక్కడి అందాలు చందాలు
ఆవిష్కరించటం కవిత
- కుందుర్తి, నాటినినాదాలు

వ్యక్తిత్వానికి పీఠం నీవు
వ్యవస్థ మార్పుకు సంకేతానివి!
కవిత పేర పొలికేకలు కాదు
నిజ జీవితాన్ని నీలో చూడు!
- హర్షవర్ధన్, వ్యక్తిత్వం

లోకుల రసనలె
యాకులుగా నుండునట్టియవివో కవితల్
- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

బ్రదుకు ఛాయ, చదువు మాయ
కవిత కరక్కాయ సుమీ!
- శ్రీశ్రీ, చేదుపాట

జనత గాఢనిద్రాలగ్నము
కవిత దీర్ఘస్వప్న నిమగ్నము
- ఆరుద్ర, త్వమేవాஉహమ్

ఆకులందున అణిగిమణిగి
కవిత కోకిల పలక వలెనోయి
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయి
- గురజాడ, దేశభక్తి

మా తండ్రిగారు కవిత్వం చెప్పబోయేవు సుమా
చెడతావని శలవిచ్చేవారు.
- గురజాడ, బిల్హణీయము

...కవిత కర్దము
స్నాన మొనర్చుచుం గడపినాడ
ననంతనిశాపరంపరల్
- జాషువా, నాకథ

కవిత్వముల్ నిలుచునే సత్యంబు వర్ణించుచో
ఛీ! లజ్జింపరుగాక మాదృశకవుల్
- ధూర్జటి, శ్రీకాళహస్తీశ్వర శతకము

కవిత్వంబులు నాకుఁ జెందవని యేమోయంటివా
నాదుజిహ్వకు నైసర్గికకృత్య మింతయ సుమీ
- ధూర్జటి, శ్రీకాళహస్తీస్వర శతకము

కదిలేదీ కదిలించేదీ
మారేదీ మార్పించేదీ
పాడేదీ పాడించేదీ
పెనునిద్దుర వదిలించేదీ
మునుముందుకు సాగించేదీ
పరిపూర్ణపు బ్రదుకిచ్చేదీ
కావాలోయ్ నవకవనానికి
- శ్రీశ్రీ, నవకవిత

ప్రపంచ మొక పద్మవ్యూహం
కవిత్వ మొక తీరని దాహం
- శ్రీశ్రీ, ఋక్కులు

సంగీతంగాని కవిత్వంగాని జీవితానికి స్వాతం
త్ర్యాన్ని కలిగించటంలో అందెవేసినవేగాని, వీట్ల
వెంట దారిద్ర్యం దీపానికి నీడలాగు ఆశ్రయిం
చడం అనుభూతం.
- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

కవిత్వమనేది తన హృదయాన్ని యితరులకు
విప్పి చెప్పేవుద్దేశంతో పుడుతుంది.
- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

ఎదియొ అపూర్వ మధుర
రక్తి స్ఫురియించుకాని అర్థమ్ముకాని
భావగీతమ్ములవి...
- దేవులపల్లి, ఆమెకన్నులు

కవిత్వమూ ధార్మికత్వమూ వొకదాని కొకటి
చుక్కెదురు.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, రాజరాజు

గానమునకుఁ బాములు చేరుటకలదు. మకరం
దమున కీఁగలు మూఁగుట కలదు. దీప
కాంతికి రోకటిబండలు చేరుట గలదు. అదృష్ట
శాలికి స్తుతిపాఠకులగు నాశ్రితులు చేరుట

కలదు. కాని కవిత్వమునకు గబ్బిలములు జేరుట కనలేదు, వినలేదు.

- పానుగంటి, సాక్షి

గంౘ్రతనము కవిత్వమగునా? వడవడ వద రుట వాచానైపుణ్య మగునా?

- పానుగంటి, సాక్షి

ముద్దులొలుకు భావములు వెల్లడింపఁగల జావళికి రాగ తాళములు కాని, చాఁకిరేవు పద్యనకుఁ జంపకమాల యెందులకు?

- పానుగంటి, సాక్షి

ప్రకృతి గొంతుక నులిమి గ్రంథమును వ్రాసి ప్రజను బాధపెట్టనేల? నాయనలారా? కవిత్వమే చెప్పినఁగాని కాలము గడవదా? బ్రతుకుట కెన్ని సాధనములు లేవు? చేసికొనుట కెన్ని పనులు లేవు?

- పానుగంటి, సాక్షి

త్రాడులేని బొంగర మెట్లు తిరగదో మతములేని కవిత్వ మట్లు వర్ధిల్లదు.

- పానుగంటి, కంఠాభరణము

మాకవిత్వము కవులూరివారి కవిత్వము నొక్కటాకి- వారికి యతిలేదు. మాకు మతిలేదు. వారికి ప్రాసము లేదు. మాకు ధ్యాసము లేదు. వారికి గణములేదు. మాకు గుణములేదు. వారి కర్థము లేదు. మాకు నర్థము లేదు.

- పానుగంటి, కంఠాభరణము

ఆశుకవిత యొకటి యావుపేఁడ యొకటి
స్వయముగాఁగ శుద్ధచయము భువిని
వాని కిలను వేఱు పరిశోధనముకూడ
దవనిఁ జెలగ వెలయ నమర భువిని.

- పానుగంటి, కంఠాభరణము

కవిత్వం అనువదించటమే నిరుపయోగం. నాటకానువాదాలు ఇంకా నిరుపయోగం.

- కొడవటిగంటి, ట్యూటర్

కయిత్తమంటే యిలాగా, పెలిమనిషికీ తెలియాలి.

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

లోతు లేనిదే కవిత్వం. దాని ఔన్నత్యం వేగం పైన, సహజత్వం పైన ఆధారపడివుంటుంది. లోతుకలది వేదాంతం కావచ్చు

- బుచ్చిబాబు, ఒమర్ఖయామ్

జీవితంలో పొందలేని అనుభవాలని, వ్రాతపూర్వకంగా జీవిస్తాం గమక నేను రాసేది కవిత్వం అనొచ్చు

- బుచ్చిబాబు, ఆత్మవంచన

"సూక్ష్మంగా చెప్పాలంటే, జ్ఞాపకం ఉండేది కవిత్వమూ, మరిచిపోయేది చెత్తా" అన్నారు.

- శ్రీశ్రీ, జీవితంలో నా గురువులు

కవిత్వానికి సంవిధానం అనవసరం అని కొట్టి పారేయ్యడం కాదు. అలాగయితే కవిత్వం రాయడమే అనవసరం. ఎలా చెప్పడం అనే దానికన్నా ఏది చెప్పడం అనేదానికే ప్రాధాన్యం ఉండాలి. అపుడు కావ్యంలో నాజూకులూ, నగిషీలు కాక వస్తువు ప్రాముఖ్యానికి వస్తుంది.

- శ్రీశ్రీ, కవిత్వంలో నా ప్రయోగాలు

మనిషి ఆలోచించే జంతువుకాబట్టి అతని కవిత కూడా ఆలోచనలను రేకెత్తించాలంటాన్నేను.

- శ్రీశ్రీ, కవిత్వంలో నా ప్రయోగాలు

"కవిత్వం ఒక హ్రస్వలిపి" అన్నాడు ఒక విమర్శకుడు. అల్పాక్షరముల అనల్పార్థరచన అని అంతకుముందే అన్నాడు మన తెలుగు కవి.

- శ్రీశ్రీ, ఏమిటి? ఎందుకు? రెండు

అవసరం ఆలోచింపచేస్తుంది. ఆలోచనలో భావం పుడుతుంది. భావానికి అందమైన భాష పేరే కవిత్వం.

- పులికంటి, అరికకూడు

కాలమే కవిత్వాన్ని నిర్ణయిస్తుంది.

- భమిడిపాటి, వేషం తగాదా

ఉన్నయది ఉన్నయట్టులఁ గన్నయదియుఁ
గన్నయట్టుల విన్నది విన్నయటుల
నన్నయది యన్నయట్టుల వన్నెలెట్టి
కవితఁ జెప్పిన సంతోషమవు జగాన॥

- శ్రీరాములు, తెలుగునాడు

ఎక్కాల పుస్తకమయినా ఛందస్సులో పెట్టేసరికి కవిత్వమేమో ననిపిస్తుంది.

- పా.ప., వసంతం వస్తేనా...

తనకోస మేడిస్తే దుఃఖం, లోకం కోసం ఏడిస్తే కవిత్వం.

- కృష్ణరావు, పాపికొండలు

కవిత్వం వైన్ కన్నా నిషా.

- సూర్యారావు, పంజరం

కవిత్వం అనుభవించడానికేగాని అర్థంచెప్పడానికి కాదు.

- జయరాం, మరుగుజ్జులు

కవిత్వం ఒక అల్కెమీ,
దాని రహస్యం కవికే తెలుసు,

కాళిదాసుకు తెలుసు, పెద్దన్నకి తెలుసు,
కృష్ణశాస్త్రికి తెలుసు, శ్రీశ్రీకి తెలుసు.

- తిలక్, నవత-కవిత

మతం పేరిట యే వికృతమైనా చెలామణి ఐనట్టే కవిత్వం పేరిట ఏ అసందర్భమైనా మెప్పు పొందుతుంది.

- చలం, మ్యూజింగ్స్

అవధాన కవిత్వంలోని
ఆధిక్య మ్మేమిరా?
సర్కసులో జంతువుపై
సానుభూతియే గురూ?

- మల్లారెడ్డి, యక్షప్రశ్నలు

ఆశుకవిత్వమ్ములోని
గ్యాసును వర్ణించరా!
కవితాజీవమ్ము పాలి
గ్యాసు ఛేంబ రందు గురూ!

- మల్లారెడ్డి, యక్షప్రశ్నలు

**కవిపూజ**

తమతో Compeition కి రారుకదా అనీ, కీర్తిని పంచమని అడగరు కదా అనీ, తమ ప్రాముఖ్యతని నొప్పించరు కదా అనే ధైర్యంతో చచ్చిన Artist ని పూజించటం అందరికీ అంగీకారం.

- చలం, మ్యూజింగ్స్

**కష్టకాలం**

కష్టకాలంలో ప్రాణస్నేహితుడికోసం ప్రాణాలేడిపిస్తై.

- వేదాంతకవి, తెనుఁగుతల్లి

**కష్టం**

కష్టాలు పడటమే కష్టం. వాటిని పదేపదే మననం చేసుకోవటం మరీకష్టం.

- కొడవటిగంటి, రెళ్ళుమూళ్ళా

ఎంతకష్టమైనా ప్రత్యక్షంగా భరించటంకన్నా పరోక్షంగా సహించటం చాలా కష్టం.

- కొడవటిగంటి, తిండిదొంగ

ఏదైనా సహించొచ్చేమోగాని తృణీకారం, నిర్లక్ష్యం యిముడ్చుకోవడం చెడ్డకష్టం.

- లక్ష్మీనరసింహశాస్త్రి, మాలతికథ

ఆనందం పంచుకోవటానికి ఎవరైనా ఫరవాలేదు. కాని కష్టాలు పంచుకోవటానికి సమర్థులు తప్పక కావాలి.

- కొడవటిగంటి, గడ్డురోజులు

అన్నీ వుంటే అందరూ మంచివాళ్ళే. కష్టాలొచ్చినప్పుడే పెద్దపులుల్లాగా పీక్కుతింటారు.

- అనిశెట్టి, గాలిమేడలు

ఎన్నికష్టాలొచ్చినా రైతు కుంగిపోడు. ఎందువల్లనంటే - అతని బతుకంతా పుట్టుకనుంచి కష్టాలే గనుక.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

యేస్థితులెట్లా మారినా రాశికి కలిమిలేములు కావడికుండలే! సుఖదుఃఖాలు యెప్పుడూ పులగంపెట్టే. కాని కలగలపులు లేకుండా సుఖం ఉండనేరదు. అవిగాక కష్టాలులేని సుఖాలకు రుచి తక్కువ.

- ఉన్నవ, మాలపల్లి

యంతట్లో వెన్నెల చీకటైందీ!

- గురజాడ, కన్యాశుల్కం

విపత్తులే హృదయాన్ని బంధించేవి.

- చలం, సావిత్రి

మంచివాళ్లని గురించి వ్రాయొచ్చు చెడ్డవాళ్లని గురించి వ్రాయొచ్చు కాని సాధారణమైన వాళ్లని గురించి వ్రాయడం ఎంతో కష్టం.

- బుచ్చిబాబు, నన్నుగురించి కథవ్రాయవూ?

పడుచువానికి భార్యా వియోగము కష్టముకాదు. ముసలివానికేక పుత్ర మరణము కష్టముకాదు. చనిపోవువాని కుత్త్రాకంఠశ్లేష్మ బాధ కష్టము కాదు. గ్రామ్యసుఖ పంక నిర్మగ్నతయే కష్టము లన్నిటిలోఁ గష్టము.

- పానుగంటి, వీరమతి

ధనవంతులకి చదువు అబ్బడం కూడా కష్టం.

- ముద్దుకృష్ణ, ఆడవాళ్ల తెలివి

రోగం సంగతి యెక్కువగా తెలిసిన వాళ్లకి వైద్యం చెయ్యటం చాలా కష్టం.

- ముద్దుకృష్ణ, ఆడవాళ్ల తెలివి

Civilised independent views గల భార్యను భరించుట కష్టము, కష్టతరము, కష్టతమము.

- హనుమంతరావు, లేడీడాక్టరు

చిన్నప్పుడు యెంత కష్టమైనా కాసేపు యేడిస్తే అది పోతుంది.

- రారా, అలసిన గుండెలు

సుఖంగా బ్రతకటంలాగానే సుఖంగా చావడం కూడా కష్టమే!

- సోమసుందర్, అంగారతల్పం

ఇదివరలో ఆడవాళ్లను అర్థంచేసుకోవడం కష్టమనేవారు. బహుశా ఇప్పుడు మగాళ్లని

అర్థంచేసుకోటం కష్టం అవుతోంది.
- మహీధర, కత్తులవంతెన

ఎంత స్నేహమైనను బరాయి యింటిలో
నెక్కువ రోజులుండుట కష్టము.
- విశ్వనాధ, తెలిచిరాజు

ఎవడి కష్టం వాడి కెక్కువ.
- ఆత్రేయ, భయం

ఆకు నలిపినప్పుడే సువాసన బయలుదేరు తుంది. కష్టంవల్లనే పురుషునికి సద్గుణాలలవడ తవి, కీర్తి ప్రకాశిస్తుంది. కష్టములే భగవంతుడు మెచ్చినవారి కిచ్చు వరాలు. కాని వానిని త్రోసి పుచ్చక వుపయోగపర్చుకొనటమే మన కర్తవ్యం.
- ఉన్నవ, మాలపల్లి

సుఖమునే యెల్లప్పుడు కోరుకొను నరుఁడు కష్ట మును గోరుకొనునా? అది ప్రకృతి సిద్ధము గాదే?
- పానుగంటి, సాక్షి

జగత్తింత కష్టసంకులమై యుండు నేల యను ప్రశ్నమునకుఁ దగిన ప్రత్యుత్తరము చెప్పలేక, జగత్తు లేదు కష్టము లేదని శంకరాచార్యులు సమస్తము దుడిచివైచినారు. ముక్కులేదని భావించినను బడిసెము తప్పునా?
- పానుగంటి, సాక్షి

త్రాఁచు తలమీఁదనున్నది, దానిఁబాపు
నోషధులు మంచుఁగొండపై నున్న వకట.
- తి. వేం., ముద్రారాక్షసము

నరున కాపద వచ్చిన తరుణమంద
వందలకొలంది లోపముల్ వచ్చుచుండు.
- తి.వేం., మృచ్ఛకటికము

చెప్పటం తేలిక, చేయటం కష్టం.
- సామెత

కష్టపడుట వలన గౌరవ మ్మెడివోదు
మానవత్వమునకు మచ్చ రాదు.
- ఏటుకూరి, క్షేత్రలక్ష్మి

మనిషిని అర్థం చేసుకోవటం మాటలా?
- కొడవటిగంటి, చదువు

కొంగను మాటలాడించుట దుష్కరముగాని
చిలుకను బలికించుట దుష్కరముగాదు.
- చిన్నయసూరి, మిత్రలాభము

కష్టసాధ్యం

మగవాడు మనకంటికి కనిపించినట్లు వుండడు. అతని లోపల నిజమైన మనిషి దాగివుంటాడు. అతనిని గుర్తు పట్టటం కష్టసాధ్యం.
- సూర్యారావు, స్త్రీలకు ప్రత్యేకం

కష్టసుఖాలు

కొన్ని కొన్ని పనులు మొదట కష్టంగా ఉండి అలవాటుమీద సుకరమౌతై.
- కొడవటిగంటి, నిలవనీరు

సుఖంబుల్ కష్టముల్
వెన్నెల చీకటుల్ బలెనె వీడక
ఒక్కటి వెన్క నొక్కటై
క్రన్నన వచ్చుచుండును నిరాశ వహింతురె ఇంత మాత్రకున్?
- రాయప్రోలు, లలిత

జన్మమెత్తిన ప్రతిజీవి జగతిలోన
గష్టసుఖముల కెపు డొడగట్టవలయు
- ఏటుకూరి, ప్రేమాలోకము

సుఖమనేది భ్రాంతి. కష్టమే సహజమైనది. సుఖంలో కల్తీ ఉంటుంది. కష్టంలో కల్మషం ఉండదు.
- వేణుగోపాలరావు, జోగబాల

కసి

ఆత్మహత్య చేసుకోలేని వాళ్లలో చాలామంది బ్రతుకుమీద కసిని భార్యాబిడ్డలమీద తీర్చుకుం టారు. కొంతమంది వేదాంతం పూసుకుంటారు.
- రారా, అలసిన గుండెలు

కళ

కమ్యూనిజం ప్రవేశించగానే కళ చస్తుంది.
- చలం, మ్యూజింగ్స్

కళ, కళాతపస్వి జీవితాన్ని బలిగొంటుంది.
- పాప, ఫలశ్రుతి

ఒక క్షణంలో ఒక సార్థక నటుడు కనపరిచింది మరొకక్షణంలో కనపరచలేడు. కనపరచగలి గాడా అతణ్ణి మంచి యంత్రం అనవచ్చు అతడి అభినయాన్ని మంచి కసరత్తు అనవచ్చు గాని, కళ అనకూడదు.
- భమిడిపాటి, వన్సుమోర్

జీవితాన్ని కాసేపు మరిపింపజేయటానికే కళలు.
- కొడవటిగంటి, గడ్డురోజులు

విరాళం పోగుచెయ్యటం ఒక కళే అనుకోండి.
- లక్ష్మణరావు, అతడు-ఆమె

మానవుని సృజనాత్మక ప్రతిభ సుందర రూపంలో వ్యక్తమయేది కళల్లోనే.
- సంజీవదేవ్, గ్రామవికాసం

నువ్వు నమ్మిఉన్న కళ ఎన్నటికీ నీ సేవచెయ్యదు

- చలం, మ్యూజింగ్స్

మానవుల్లోని దివ్యత్వమే కళాస్వరూపమై వెలువడుతుంటుంది.

- బాపిరాజు, భోగీర్‌లోయ

కళ అనేది- కంటికి కట్టాలి- తక్షణం- వంటికి పట్టాలి; అంగలార్చితే వచ్చేది కాదు(రా) ఆనందం- అంకెకుదార్చి అనుభవంలో అందుబాటు చేసుకోవాలి!

- రామకృష్ణశాస్త్రి, వెలదిన్నెల

అసలు ఒక వ్యక్తి మాట్లాడకుండా అతని కదలిక ల్నిబట్టి - అతని మెంటల్ పొజిషన్ తెల్సుకోవడం నిజమైన కళ.

- జయ, భ్రాంతి

ఆడవాళ్ళని ప్రేమించటం చాలా సులభం. కాని పలకరించటం గొప్ప ఆర్ట్. మొదటిది అందరూ చెయ్యగలరు, చేస్తారు. రెండోది కొందరే చెయ్యగలరు

- బీనాదేవి, ఇదికథకాదు

అన్నిట్లోనూ గొప్ప దాహం కళాదాహం. ఏ ఉద్దేశమూ లేని గొప్పకళ ఇచ్చే విశాలత్వం, జ్ఞానం ఏ సందేశమూ, ఏ ప్రచారమూ చెయ్యలేవు.

- చలం, మ్యూజింగ్స్

జీవనశక్తి అదే. సృష్టిశక్తి యెక్కువగా ఉన్నవాడు గాని యితరుడు గొప్పకళాసక్తిగలవాడు కాలేడు. అందువల్లనేనేమో స్త్రీ శక్తి ఎప్పుడూ ప్రోత్సహించే శక్తిగానే ఉంటుంది.

- చలం, మ్యూజింగ్స్

**కళాకారుడు**

కళ గొప్పది. అందుకే కళాకారుడికి ఎప్పుడూ సంతోషంలేదు. వెళ్లేకొద్దీ సాధించవలసింది కనబడ్తూనే వుంటుంది. ఆ తపనతోనే విషాదమూ, ఆనందమూనూ.

- వీరేంద్రనాథ్, వెన్నెల్లో ఆడపిల్ల

**కళేబరం**

ఈ కళేబరమరుస్థలిలో
కండరాలే యిసుకమిట్టలు.

- బైరాగి, రాస్కల్నికావ్

**కళ్ళు**

గుండెల సముద్రాల్లోని బాధల బడబాగ్నుల్ని తోడి, బొట్లుబొట్లుగా కార్చే అనుభూతుల ఏతాలు కళ్ళు.

- నిజం, కళ్ళు

ఆ కళ్ళవెనుక దీపం వెలగదు
అక్కడ సంగీతం వినపడదు.

- అజంతా, రోజూ చూస్తూనేఉన్నాను

కళ్లు లేకపోతే కలియుగమే లేదు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, ఆత్మబలి

ఈ మగాళ్ల కళ్ళు ఆకాశంలో ఉంటాయి.

- మహీధర, దేశంకోసం

**కళ్ళూ చెవులూ**

గోడగోడకూ చెవులుంటాయి
మూలమూలకూ కళ్ళుంటాయి.

- పురిపండా, పులిపంజా

**కాకతాళీయం**

పిల్ల వళ్లో పడ్డది. తల్లి పరలోకంలో పడ్డది.

- శివరామశాస్త్రి, తల్లిలేని పిల్ల

**కాకవి**

విజ్ఞులగు కాకవులు
అయిరి కాకా కవులు
మూసుకో నీ చెవులు
ఓ కూనలమ్మా.

- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

**కాకి**

కోకిల పాడు పాటలకు కోమలతన్
ఘటియించినట్టి దో కాకమ!
నీదు 'క్లాసికలు' గానముకాదొకొ!

- గునుపూడి, బిడాలశాస్త్రి

మడిగట్టుకొని ఎన్నాళ్లు కాకిలా బ్రతికితే ఏమిటి ప్రయోజనం!

- బుచ్చిరెడ్డి, తప్పు

**కాగితం**

లేవులే యింక కాగితాల్లేవు, లేవు
బిల్లుకైన, అంటించు లేబిల్సుకైన
నోట్సుకైనను, ప్రాంశరీ నోట్సుకైన
లార్డులాంటి మా నోటీసుబోర్డుకైన.

- మాచిరాజు, రాజకీయ బాధితుడు

అయ్యయ్యో లేదు చిన్నముక్కైన మంత్రి
శలవు వ్రాయ ప్రధాని రిజైను చేయ.

- మాచిరాజు, రాజకీయ బాధితుడు

ప్రణయ కావ్యమ్ము వ్రాయ పత్రాలులేవు
ప్రణయ లేఖైన వ్రాయ పత్రమ్ములేదు.

- మాచిరాజు, రాజకీయ బాధితుడు

కాగితపు గొప్ప మరెవరియొద్దనైనఁ జెప్పుము గాని నాయొద్దమాత్రము చెప్పకేమి? ఈ దిక్కు మాలిన కాగితాలతో గ్రంధాలు చేయుటచేతనే సదాచారమునకుఁ జదువునకు దూరమని యక్షర శ్రీకారమునే పరిత్యజించినాను.

- పానుగంటి, కంఠాభరణము

కాంగ్రెసు

ఖండ ఖండాంతరాలలో ప్రఖ్యాతికెక్కే దేశద్రో హుల్ని ఒక్క కాంగ్రెసు తప్ప, మరే సంస్థ తయారుచేసిందండీ!

- రామకృష్ణశాస్త్రి, కైంకర్యం

నాచ్చికొశ్చన్, అనగా సానివాళ్లనందర్నీ దేశం లోంచి వెళ్లగొట్టడం ఒహటి. నేషనల్ కాంగ్రెస్- అనగా దివాన్గిరీ చలాయించటం ఒహటి.

- గురజాడ, కన్యాశుల్కం

నాకు మీలాగె ప్రీతి కాంగ్రెస్సు అన్న
కట్టుచారులోగల మునక్కాడయన్న

- మాచిరాజు, అహో

కాటు

మనిషి కాటుకు మందులేదు.

- సామెత

కానివి

కులంవున్న ఏగొడ్డూ ఏదీకానివేళ చేపదు.

- రామకృష్ణశాస్త్రి, శుద్ధఅబద్ధం

ఆడపిల్లలకు పుట్టింటివాళ్లు పెట్టిన బంగారం అమ్ముకుతినటం పరువైన పనికాదు.

- సూర్యారావు, ఒకగంట సంసారం

శ్రుతి సంగీతం కాదు. ఛందస్సు కవిత్వంకాదు. రంగులు చిత్రలేఖనం కాదు.

- కృష్ణరావు, పాపికొండలు

కంతి తలగడ గాదు; కల నిజం గాదు.

- సామెత

మెరుపు దీపం కాదు, మబ్బు గొడుగు కాదు.

- సామెత

కానికాలమొస్తే పక్షులే పైపంచెను ఎత్తుకుపోతా యట.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

పెట్టబోయే బచ్చలిపాదును కొనఁబోయే గేదె తినిపోయింది.

- సామెత

నా చచ్చిన చారమేక పోయిన బోసిముంతెడు పాలిచ్చేది.

- సామెత

కటకటాల వెనక వున్నవారంతా దోషులు కారు. కటకటాల బయట వున్నవారంతా నిర్దోషులూ కారు.

- ఆనందారామం, మరో ముందడుగు

అన్నలు మనవారు, వదినలు మనవారు కాదు గదా.

- పుల్లాభొట్ల, క్రాస్‌చెక్కు

అయినోణ్ణి అడిగేదానికంటే, కానోణ్ణి కాళ్లు పట్టు కునేది మేలు.

- సామెత

బోడి తలకు బొడ్డు మల్లెలు ముడిచినట్లు.

- సామెత

సరిగపద అని కాగితంమీదరాస్తే మోహన రాగం రాదు.

- భరాగో, నాకీ ఉద్యోగంవద్దు

కననిది బిడ్డకాదు, కట్టనిది గుడ్డకాదు.

- సామెత

రాళ్ళసేనూ సేనుగాదూ
రాణివాసం పొందుగాదూ
దున్నపోతుల దుక్కిగాదూ
దూడపిల్లల పొందుగాదూ.

- జానపదగేయం

కానుక

పెద్దవాళ్లచేత పెద్ద పెద్ద కార్యాలు చేయించు కునే నిమిత్తం ఇచ్చే ప్రతిఫలాన్ని కానుక లంటాం. చిన్నవాళ్లకిచ్చే ప్రతిఫలాన్ని కూలి అంటాం.

- సూరి, చంఘిజ్‌ఖాన్

కాపలా

సూర్యచంద్రులు ప్రకృతికి కాపలా కాస్తున్నట్లే ప్రాణమూ, మృత్యువూ మనిషికి కాపు కాస్తుం టాయి కాబోలు...

- రామచంద్రమూర్తి, కళ్లు

రాజుగారు చావుబతుకుల మీదున్నప్పుడు అల్లుళ్లు ఖజానాకు కాపలా కాస్తారు. ముఖ్య మంత్రి ఆసుపత్రిలో ఉంటే మంత్రులంతా ఎమ్మెల్యేలకు కాపలా కాస్తారు.

- పతంజలి, అప్పన్నసర్దార్

కాపీ

రావమ్మ రాసిపెడితే కావమ్మ కాపీ కొట్టిందట.

- శ్రీరమణ, న్యూనుడి

కాపు

నోరుంటే తలగాస్తుంది.

- చిలకమర్తి, కనకశునక ప్రహసనము

**కాపురం**

కాపురాని కెళ్లటంతో ఆడపిల్లకు నిండుతనం, గౌరవం వచ్చేస్తాయి.

- పురాణం, నా హార్మోని పెట్టెలో...

దొంగతోనయినా కాపురం చెయ్యొచ్చుగానీ అనుక్షణం అనుమానించే భర్తతో ఏ ఆడదీ కాపురం చెయ్యలేదు.

- భారతీదేవి, సుడిగుండాలు

**కాఫీ**

కాఫీ సమారాధనలో వున్న మజాకా కాశీ సమారాధనలో గూడా లేదు.

- వేదాంతకవి, ఆకలిమంట

కుడితికీ, కాఫీకి భేదం యేమిటంట?

- సుబ్రహ్మణ్యశాస్త్రి, ఇల్లుపట్టిన వెధవాడబడుచు

కాంతలేకున్న మానె నే కాలమందు
కాఫియుండినఁ జాలు దుఃఖంబు లేదు.

- ఉమర్‌అలీషా, కాఫీ

కల్లు పయిని నురుగు కాఫిలో వేడిని
నూదుకొనుచుఁ ద్రావుచుండవలయుఁ
గాని, కాఫికున్న గౌరవ మ్మల కల్లు
కాచనందువలనఁ గలుగలేదు.

- ఉమర్‌అలీషా, కాఫీ

**కామధేనువు**

కామధేనువు నట్టింటఁ గట్టిపెట్టి
"కోర్కెలొనఁ గూర్పు"మని యొరుఁ గోరనేల?

- తి.వేం., పాండవాశ్వమేధము

**కామన్‌సెన్స్**

కామన్‌సెన్స్ లేకపోయింతర్వాత ఏ ధర్మశాస్త్రం నిలుస్తుందండీ?

- వేంకటరాయశాస్త్రి, వ్యామోహము

**కామం**

కాముకు ల్బూతన ప్రియులు గారె?

- పింగళి, కళాపూర్ణోదయము

అపక్వంగా భుజిస్తే కామక్రోధా లుండవని..

- రామదాసు, ఆకాశరామన్న

ఉప్పూ, కారం తింటున్న ప్రతివ్యక్తిలోనూ 'కామం' వుంటుంది. ఆ కామం మనిషిని పశువుగా మార్చేస్తుంది.

- ముద్దంశెట్టి, తప్పించుకోలేవు

పూవునకు వాసన ఎటువంటిదో ప్రేమకు కామమటువంటిది.

- విశ్వనాథ, బద్దన్న సేనాని

పరమయోగ్యికైన బలిమిన నింద్రియ
గ్రామమధికపీడఁ గలుగఁజేయు.

- పోతన, భాగవతము

కామోపభోగసుఖములు
వేమాఱును బురుషుఁ డనుభవింపుచునున్నం
గామంబు శాంతిఁ బొందదు
ధూమధ్వజుఁ డాజ్యవృష్టిఁ ద్రుంగుడుపడునే?

- పోతన, భాగవతము

కాముకులకు లోలుపులకుఁ గలవె నిజమ్ముల్?

- పోతన, భాగవతము

ద్వేషం కామసంతృప్తికి అడ్డంరాదు. ఎన్నో లక్షల దాంపత్యాలు ఈసత్యాన్ని రుజువు చేస్తున్నై.

- కొడవటిగంటి, గడ్డురోజులు

కాముశక్తి యుడిపింపఁగ శక్యమె యెట్టివారికిన్?

- నన్నయ, ఆదిపర్వము

మరుఁగుచోటేగదా కాముఁ డరుగుచోటు?

- తి.వేం , మృచ్ఛకటికము

కాషాయపు గంతలలో
కామం ప్రసవిస్తోంది
ద్వాదశి పారణ వాసన
ఏకాదశిని సహిస్తోంది.

- దుర్గయ్య, జీవన చిత్రణ

కామం లేకపోతే ప్రేమేలేదు. ప్రేమకు ఆటపట్టు వయస్సు, వయస్సులో కోరికలుంటాయి. ఆ కోరికలు నెరవేరటానికి ప్రేమ, ప్రేమకు మూల సూత్రం కామం.

- లక్ష్మీనరసింహశాస్త్రి, ఇందుమతి

సంధ్యాసమయంలో ఉషస్సుకూ, తమస్సుకూ మధ్య సరళరేఖ గీయడం ఎంతకష్టమో ప్రేమనూ కామాన్నీ ప్రాథమికదశలో విభజించి చూపడం కూడా అంతేకష్టం.

- రామమూర్తి, అగ్నిగర్భ

**కాంపౌండు**

కట్టలేని చెరువు, చెట్టులేని చేను యెంతో కాంపౌండు లేని కట్టడం కూడా అంతే.

- సభా, పిచ్చిదంపతులు

**కారణం**

వారాలు చేసుకొన్న వాజెమ్మకుగాని చదువబ్బదు.

పరువొల్లని పీనాసికికాని భాగ్యం పట్టదు.
- కాళ్ళకూరి, వరవిక్రయము

ప్రస్తుతము చాలమంది బాలురను పాఠశాలల కంపుట విరివిగా కట్నములు లాగుటకుఁగాని విద్యకొఱకుఁ గాదు.
- కాళ్ళకూరి, వరవిక్రయము

రెడ్డొచ్చాడు మొదలా డన్నాడట.
- సామెత

కొన్నిటికి కారణం- నివారణ రెండూ ఒకేచోట ఉంటాయి. కాకపోతే మనం కనుక్కోవటం కష్టం.
- బుచ్చిరెడ్డి, తప్పు

అన్నిటికీ దేవుడు కారణమైతే, దేవుడికి ఏది కారణం?
- చలం, మ్యూజింగ్స్

లోకము చెడిపోవుటకు మానవప్రవృత్తి హేతువుగాని సిద్ధాంతములు హేతువులు కావు.
- విశ్వనాథ, నందో రాజాభవిష్యతి

మనం భూమ్మీద నుంచుని ఉన్నాం
అదే అశేషప్రజానీకానికి సొంతం
అదే గతం ప్రస్తుతంమీద పట్టిన పంతం
విప్లవాల మూలకారణ ఉదంతం.
- కుందుర్తి, తెలంగాణ

భార్య అనుకూలవతి అయితే సుఖి అగును, లేకుంటే వేదాంతి అగును
- సామెత

మావాడు దెబ్బలకోరుస్తాడు అంటే విడిపించే దిక్కులేక.
- సామెత

శోకానికి హేతువు మైకం
మైకానికి ఆనట మైకం
- రమణారెడ్డి, ధమ్మఘోష

ఆస్తి, అధికారం ఈ రెండూ హత్యలకు కారణాలు.
- రంగాచార్య, జనపదం

ప్రత్యక్షంగా జరిగే ఏ మార్పునైనా సహించి మనసు సరిపెట్టుకోవచ్చు కాని పరోక్షంగా జరిగే మార్పులు గురించి మనసు సమాధానపరచుకోవటం చాలా కష్టం. అందుచేతనే మరో దేశంలో జరిగే విప్లవాలూ, మరో వర్గంవాళ్ళు చేసే విప్లవాలూ మనని ఆందోళనపెడతై.
- కొడవటిగంటి, అట్టడుగు

భార్యాభర్తలు అనే పొజెసివ్ రిలేషన్‌షిప్ అనేదే లేకపోతే వ్యభిచారమే ఉండదు. తప్పి చరించడం ఉండదు.
- కవనశర్మ, తూర్పు-పడమర

## కారుచౌక

ఈ లోకంలో అన్నింటికంటే కారుచౌకగా ఉన్నది రచనలూ, రచయిత.
- సరస్వతీదేవి, మనసులోని నిజం

## కార్ఖానా

అవి ఆఫీసులు కావు, సన్మార్గులను దుర్మార్గులుగా మార్చే కార్ఖానాలు.
- సూర్యారావు, శ్రీమతులు-శ్రీయుతులు

## కార్తీకం

కార్తీకం రానీ, కమ్మలూ, కడియాలూ చేయిస్తానన్నాడట వైద్యుడు.
- సామెత

## కార్యకారణ సంబంధం

నిర్మలంగా వున్న నీటిలో రాయివేస్తే నీరంతా కదులుతుంది. ఊరిలో ఒక్క ఇల్లంటుకుంటే చాలు, ఆ ఊరు ఊరంతా అంటుకుంటుంది, ఏదో ఒకరూపంగా.
- విశ్వం, ఊరంటుకుంది

కాంపౌండరు ఇంజక్షనిస్తాడు. డబ్బు డాక్టరు తీసుకుంటాడు.
-నిరుద్యోగి, కార్యాలయబేతాళవిక్రమార్కీయము

కవ్వమాడిన కడుపునిండును
కదురు తిరిగిన కనకవర్షము
కర్రు నడచిన, కరువు తీరును.
- రైతుభజనావళి

నృపుడు రాష్ట్ర రూపమునకు నెపుడు కన్ను
అంగమేది నొచ్చినను, నయనమె యేడ్చు
నృపుఁడు రాష్ట్రరూపమునకు నెపుడు నోరు
అంగ మెది సుఖించినను నాస్యమ్మె నవ్వు.
- వరదాచార్యులు, వైశాలిని

## కార్యజ్ఞుడు

మొదలఁ గార్యజ్ఞుఁ డగువాఁడు మూఢునందుఁ జెలఁగి సామప్రయోగంబు సేయవలయు.
- దూబగుంట, పంచతంత్రము

## కార్యవాది

కార్యంబున నార్యులు నిజప్రయోజనంబు నెఱింగింతురుగాని మాటలం బ్రకటింపరు.
- శ్రీనాథుడు, శృంగారనైషధము

## కార్యసాధన

ఎన్నఁడును మొట్టమొదట నొక ఘనకార్యమును నిర్వహింపఁ దలపెట్టినవా రధిక కష్టపడక తీరదు. కష్టపడక లోకములో నేకార్యమునందును ఫలమే లేదు. కార్యమునకు దిగక దూరము నుండి చూచువారి కన్నియు కష్టములుగానే తోఁచును. నిజముగా కార్యమునకుఁ బూనుకొన్న వారి కనుకొన్నన్ని కష్టము లగపడవు.

- కందుకూరి, దేశాభివృద్ధి సాధనము

నోటితో నూఱు నీతులను చెప్పుటకన్న చేతితో నొక్క కార్యము చేసి చూపినయెడల, అది యెంతో ప్రయోజనకరముగా నుండి పలువు రను మంచి మార్గమున నడిపించును.

- కందుకూరి, సత్యవతీచరిత్రము

నేర్పు పాటించి కార్యంబుఁ దీర్పవలయు.

- తిక్కన, ఉద్యోగపర్వము

## కార్యసిద్ధి

తనియఁ బండకుండ మును గోసికొనఁ జవి
చేటెకాదు విత్తుచేటుఁ గలుగుఁ
బక్వమైనఁ గొనిన ఫల మించుఁ జెడదు బీ
జంబు కార్యసిద్ధి చందమిట్లు

- తిక్కన, ఉద్యోగపర్వము

క్రిందు మీఁదెఱింగి కృతకార్యుఁడగువాఁడు
సేయు కార్యమెల్ల సిద్ధిఁబొందు.

- సింగన, కామందకము

మాలకరి పుష్పములు గోయు మాడ్కిఁదేంటి
పువ్వుఁ దేనియఁ గొనియెడు పోల్కి నెదురు
గందకుండంగఁ గొనునది కార్యఫలము
బొగ్గులకుఁబోలె మొదలంటఁ బొడువఁజనదు.

- తిక్కన, ఉద్యోగపర్వము

ఒక కార్యం నిర్వహించవలసి వస్తే సామదాన భేదదండోపాయాలు సమయానుకూలంగా ప్రయోగించవచ్చు. సామోపాయం అన్నిటికంటే మంచిదీ, సాధారణంగా మందలించవలసిం దీని. అయినా కార్యాలు కొన్ని దానివల్ల చక్క బడవు. అందువల్ల కార్యభంగమూ కావచ్చును. తక్కిన ఉపాయాలు దోషాలనడానికి వీలులేదు. ఉపేక్ష అనే పంచమోపాయం ఒకప్పుడు వాట న్నిటికంటె యెక్కువ పనిచేస్తుంది.

- ఉన్నవ, మాలపల్లి

## కాలక్షేపం

మనిషికి కాలక్షేపం లేకపోతే లేని జబ్బులు వస్తాయి. ఉన్నవి ఎక్కువవుతాయి

- సరస్వతీదేవి, ఈ చీకటివీడదేమి?

సాధారణంగా ఒకరిని గురించి చెడుగా మాట్లా డుకోవటమే నిజమైన కాలక్షేపం. ఇతరులను మెచ్చుకుంటూ మాట్లాడుకోవటం భజనలాగా ఉండి బోరు కొడుతుంది.

- కొడవటిగంటి, అనుభవం

భార్యా భర్తలమధ్య అడపా దడపా కలహం రాకపోతే యిక కాలక్షేపం జరగదు

- సూర్యారావు, ఒకగంట సంసారం

## కాలజ్ఞానం

నిజంగా ఎక్కడికయినా సరియైన సమయానికి వెళ్లటమనేది సంస్కృతికీ సభ్యత్వానికీ సంబం ధించిన ఒక కళ.

- సరస్వతీదేవి, మహోన్నతుడు

## కాలం

ఏపని చేయడానికైనా సమయాలున్నాయి. ఆ సమయాలు పాటిస్తే జీవితం ఎంతో అద్భు తంగా ఉన్నట్లనిపిస్తుంది.

- పురాణం, ఐ లైకిట్

హాస్యానికి వేళా పాళా ఉండాలి.

- గురజాడ, కన్యాశుల్కం

ఏ పనైనా టైముకి ముందే చేసుంచుకోవాలి, లేకపోతే టైముకైనా చేసుకోవాలి. మనిషిని బతి కించాలంటే వాడు చావకముందే వాణ్ణి బతికిం చాలి. వాణ్ణి చంపాలంటే వాడు చావకముందే వాణ్ణి మనం చంపాలి.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

అసలు మందులసాపంటే ముండల కంపెనీ లాగే ఇరవైనాలుగ్గంటలూ తెరిసుండాల. ఎంచే తంటే సాపుకీ, సరసానికీ టైమంటూ నేదు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

ఒక సరవిని
దమి యుండ దెల్లసమయములందున్

- సూరన, ప్రభావతీ ప్రద్యుమ్నము

కాలం ధనవంతులకు తొత్తు
ఆపదల్లోనే అస్తమానం దానికి పొత్తు

- కుందుర్తి, ఆశ

కాలంతోపాటు మారని మనిషి మసైపోతాడు.

- కాంతారావు, వంశధార

రాయఁగ రాయఁగఁ బుట్టిన వేడి, తోమఁ
గోమఁగఁ బుట్టిన శుద్ధి యెంతకాల ముండును?
- పానుగంటి, చూడామణి

కాలం మనకోసం అడుగువెనక్కు జరగదుకదా.
- పురాణం, అమ్మకడుపు చల్లగా...

కాలము నిర్మోగమాటి.
- సరస్వతీదేవి, వేమూరివారి కోడలు

కాలానికొక్కటే పని. అది రావడం, వచ్చి వెళ్లి పోవడమున్ను
- సుబ్రహ్మణ్యశాస్త్రి, కన్యాకాలేయత్నాద్వరితా

చావాలన్నా చంపాలన్నా అరక్షణంలో సగం చాలు.
- రావిశాస్త్రి, నిజం

కాలం మన ఆశల ప్రశ్నలకి జవాబు
కాలం మన ఆశయాలకి పెద్ద సవాలు.
- ఆరుద్ర, ఆవాహన

ఏండ్లు గడిస్తే దయ్యం దేవుడౌతాడీ లోకంలో
- జంగయ్య, జాతర

కాలం చాలా చిత్రమయింది. కొలతకు లోబడింది. కోర్కెలకు పైబడింది. ముహూర్తాలకు కట్టుబడింది. అయితే ఆగమంటేమాత్రం ఆగదు
- పులికంటి, చిరునవ్వు వేల

తరలిన ప్రతిఒక్క పొద్దు
మరణానికి మైలురాయి
క్రుంగుతున్న ప్రతి పొద్దూ
క్రూర విధికి సరిహద్దు
- ఆరుద్ర, సాగరసంగమం - వీరతెలంగాణ

కాలం అద్దంలాంటిది
అంధయుగమైనా స్వర్ణయుగమైనా
అది మన ప్రతిబింబం.
- తిలక్, శిఖరారోహణ

కాలము సందేహాలు తీర్చుతుంది.
- దీక్షితులు, దసరాదిబ్బ

జాలిగల కాలమిల- తరిగినది విటిగినది.
చీడపడి మాడినది, చిగురు లెటు పట్ట విక
- వేదాంతకవి, తెనుఁగుతల్లి

రాత్రింబవళ్ల రాళ్లమీద
కాలం జీవితాన్ని వుతికి
రక్తం పిండుతుంది.
- సౌభాగ్య, సింహావలోకనం

గతమంతా తడిసె రక్తమున
కాకుంటే కన్నీళులతో.
- శ్రీశ్రీ, దేశచరిత్రలు

కాలము విచిత్రము దుస్తర మెట్టివారికిన్.
- పోతన, భాగవతము

కాలం మారనిదే మనం మారము. మనము మారనిదే కాలం మారదు. ఈ రెండింటికీ భేదం లేదు. కాలం మారిపోయి మనం మారకుండా ఉండటం ఎంత అబద్ధమో, మనం మారిపోయి కాలం మారకుండా ఉండటం అంత అసంభవం.
- తాపీ, కొత్తపాళీ

మనం కాలాన్ని కొలవగలిగింది మార్పుతోనూ, నూతనానుభవాలతోనూ మాత్రమే.
- కొడవటిగంటి, ఐశ్వర్యం

గతం గడిచిపోయిందని ఏలా ఈ అనుతాపం?
కాలం నర్తకి, బహుశా మారుస్తున్నది రూపం.
- అబ్బూరి, సన్నుతులు

కళత్రనష్టమైనప్పుడు ముసలివాడు తప్పక పడుచువాడగును. మరియు సర్కారులో ఉద్యోగము కావలసి వచ్చినప్పుడు పెద్దవాడు చిన్నవాడగును.
- చిలకమర్తి, నవ్వులగని

అయితే అనాకారము, అనంతమూ, నిర్జీవమూ అయిన ఈ కాలానికి ఒక గుణం ఉంది. తన అధికారంలో ఉన్నవాణ్ణి ఎంత అథఃపాతాళానికి ణిచేస్తుందో అంతగానూ తన్ను శాసిస్తున్నవాడికి బానిస అయిపోతుంది.
- శ్రీశ్రీ, అనంతం

శబ్దరూపమున కాలాన్ని అక్షరాలలోకి అనువదించి, స్థలంలో బంధిస్తున్నాము. అయితే కాలానికి వెలుపల స్థలంగాని, స్థలానికి వెలుపల కాలంగాని లేవు.
- శ్రీశ్రీ, అనంతం

గతం నిన్నటి ప్రస్తుతం కావచ్చు
అయినా మనకు అప్రస్తుతం
కాలం మారేవిలువలను
సరికొత్తగా సృష్టించే యంత్రం
- కుందుర్తి, తెలంగాణ

ఇది కలిగినోడి కాలం: ఆడిక్కాలం ఎల్తా ఎల్తా ఉంది. ఎల్లినంతకాలం ఎల్తది. ఆయెనక బోర్లపడి సస్తడ.
- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

కాలప్రభావాన్నిబట్టి మంచిగాని చెడ్డగానీ అను భవించటమే అలవాటు చేసుకోవాలి

- రంగనాయకమ్మ, పేకమేడలు

దిక్కుమాలినకాలం, ఆడదెవరో మగాడెవరో తెలుసుకోడానికి వీల్లేకుండా ఉంది

- సూర్యారావు, స్త్రీలకు ప్రత్యేకం

వర్తమానం తప్ప, భావికాలం భవిష్యత్తు ఉండ కూడదు మనిషికి. ఆ రెండూ వర్తమానాన్ని నిరంతరం హత్య చేస్తుంటాయి భావికాలం తీర్పు చెబుతుంది. భవిష్యత్తు శిక్షిస్తుంది. ఆ రెంటిని గురించి చింతించి, కృశించి, శల్యమై, మనిషి వర్త మానంలో ఆత్మహత్య చేసుకుంటాడు

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

కాలం పరిణామకారి
కాలం పరివర్తనశీలి
సృజనశక్తి కాలం
నాశనగతి కాలం

- రంగారావు, ముక్తకాలు

ఒక అమర్త్య విహంగంవలె
కాలం పల్లటీలు కొడుతూ సాగుతుంది.

- సుప్రసన్న, మూడుగీతాలు

గతం నేర్పింది మిధ్య
భవిష్యత్తు కనపడటం సున్న.

- మహేష్, బ్రతుకుబాట

కాలం చెరసాలలో ప్రతివాడూ
బందీలయిన అస్వతంత్రుడు.

- పేర్వారం, మహమ్మారి

కాలాన్ని మనం చేసే పనులు ఆపలేవు. మనం చేసే పనులు, చెయ్యగల పనులు కాలం నిర్ణ యించగలదు.

- లక్ష్మీనరసింహశాస్త్రి, మిధ్యబ్రతుకులు

మరిపించగల శక్తి మురిపించగల శక్తీ ఒక్క కాలానికే ఉంది.

- వసుబాబు, ఆద్యంతాలూ-ఆంతర్యాలు

**కావలసింది**

మనిషికి కావల్సింది అభిమానించే మనసే కాని ఆకర్షించే అందంకాదు.

- రామచంద్రమూర్తి, ప్రియబాంధవి

**కావ్యం**

చెవికి తీయము చిలుకు శబ్దము
కంటి కింపగు కాంత కల్పన
కలిసి హృత్కోశమును తడిపే
తొలకరింపులె కావ్యముల్

- రాయప్రోలు, శ్రీరవ్యాత్

పచ్చి పాడియావువంటిది కావ్యంబు
లేఁగఁ గుడిపి చేపు రాఁగ దువ్వి
పిదుక సమ్మతమిచ్చు, పొదుగు గ్రుద్దితివేని
కాలు విసరు జున్నుపాలు రావు.

- రాయప్రోలు, తెలుగుబంతి

తనరన్ వ్యాకరణజ్ఞుఁ దంద్రియనుచున్
దర్కజ్ఞునిన్ భ్రాతయం
చును మీమాంసకునిన్ నపుంసకుఁడటంచున్
వీడి, దూరంబునం
గని యస్పృశ్యునిఁబోలె ఛాందసుని, వేద్యం
గావ్యలీలారస
జ్ఞు నిజేచ్ఛం గవితావధూమణి వరించున్
భావగర్భంబునన్

- పెద్దన సోమయాజి, ముకుంద విలాసము

**కాష్ఠవాదం**

కాష్ఠవాదంవల్ల కార్యం లేదు.

- గురజాడ, కొండుభట్టీయము

**కిరస్తానం**

యే సమాజమైనా యెవణ్నో మన దేవుణ్ణే పట్టు కుని కిరస్తానంలో కలియకుండా ఉంటేచాలు.

- గురజాడ, కొండుభట్టీయము

మీరు కిరస్తానమని ఒహరు చెప్పగా విన్నానే!

- గురజాడ, కన్యాశుల్కం

**కిరీటి**

నా పేరు కిరీటియే? నినదభీషణ శంఖము దేవదత్తమే?

- తిక్కన, విరాటపర్వము

**కీడు**

ఇంటికి ముసలి కీడు, ఏటికి మొసలి కీడు.

- సామెత

కాలముగాని యప్పుఁ డుపకారముఁ జేసినఁ గీడె కల్గెడిన్.

- బలిజేపల్లి, బుద్ధిమతీ విలాసము

అంతిపురము చుట్టరికం
బెంతయుఁ గీ డంతకంటె నెగ్గు తదీయో
పాంతచర కుబ్జవామన
కాంతాదులతోడి పొందుకలిమి.

- తిక్కన, విరాటపర్వము

మనమెంత జాగ్రత్త పడినను, ఎంత దూర దృష్టితోc బనిచేసినను, మూఁడcదలcచుకొన్న కీడులు రాకుండ ఆపలేము.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

తాను ప్రబలుండయినను
బెనcకువ కీడుకాక మేలగునే?

- తిక్కన, ఉద్యోగపర్వము

కీడులో మేలు మా కొనcగూడె నిందు.

- చిలకమర్తి, గయోపాఖ్యానము

అగు దేశకాల బలయుత
ముగc జేసిన పో రనర్థములు మోఱకులై
తెగc బాఱి తమ్ము నెదిరిని
వగవక తొడరుటరాలc గీడు వర్తిల్లుc దుదిన్

- తిక్కన, విరాటపర్వము

## కీర్తి

కఱcగినను గాని పసిcడికిc గాంతిరాదు
దఱచినను గాని పాలc జేకురదు వెన్న
యొఱచినను గాని మణికైన నొఱపు రాదు
ఇడుమలనుగాని నరున కేర్పడదు కీర్తి.

- బలిజేపల్లి, సత్యహరిశ్చంద్రీయము

ఎల్లకడలను జూపించు నెత్తుగలుగు
దివ్యకీర్తియ యగుc జుమ్ము దేవళమ్ము.

- పిచ్చయ్యశాస్త్రి, కీర్తిదేవాలయము

మనిషికి ఉన్న కీర్తికాంక్ష దేముడికికూడా ఉండ దేమో!

- గంగాధరరావు, లంబాడోళ్లరాందాసు

పరకాంత లెదురైన తలవంచుకుపోవునతడు కీర్తికాంతను గ్రుచ్చి కౌగిలించుకొనును.

- సూర్యారావు, నీలితెరలు

అందరం కలిసికట్టుగా వుండి ఒకళ్లకొకళ్లు సన్మానాలు చేసుకుంటూ ఉండాలి. అప్పుడే అందరికీ కీర్తి వస్తుంది. ఐకమత్యం లేకుండా విడిపోతే ఎవరికీ కీర్తి రాదు.

- పార్థసారథి, సాహిత్య హింసావలోకనం

కీర్తికాములు అమరజీవులు. అమరజీవులకు మానవావసరాలైన ఆహారం, వస్త్రం, ఆస్తి వంటి వాటిపట్ల గురిగాని, లక్ష్యంగాని ఉండదు.

- కాశీపట్నం, కీర్తికాములు

మహానుభావులని పేరు పడయుటకయి కొంద ఱాత్మహత్యకయిన సాహసింతురు గదా!

- కందుకూరి, స్వీయచరిత్రము

కీర్తికేమి? దానిని కొనుటకై ముందుగా ధనము సంపాదించిన యెడల తరువాత నిముష ములో కావలసినంత కీర్తిని కొనవచ్చును.

- కందుకూరి, రాజశేఖరచరిత్రము

అపకీర్తియు సత్కీర్తియు
నుపమింపcగ నొక్కరూప

- జగ్గకవి, చంద్రరేఖావిలాపము

జవ్వనంబులు చంచలంబులు. బలంబులస్థిరం బులు. ఇంతయుం గలిగినప్పుడె త్రైలోక్యవర్తిని యైన కీర్తి నార్జింపవలయుcగాని వ్యర్థంబుగా బ్రదుకం జనదు.

- సముఖం, జైమినిభారతము

అనయము వినయము నయమును
దనసొమ్ముగ మెలcగు కీర్తిధనుc డెచ్చటి కే
గిన నిష్టార్థముc జేకొను

- కంకంటి, ఉత్తరరామాయణము

కీర్తికి బ్రతుకంటే రోత.

- కుందుర్తి, స్వేచ్ఛాగీతి నామార్గం

చుక్కలవలె కర్పూరపు
ముక్కలవలె నీదుకీర్తి ముల్లోకములన్
క్రిక్కిరిసి పిక్కటిల్లెను

- గురజాడ, కన్యాశుల్కం

మానవంతునకుc బ్రాణముకన్న సత్కీర్తి ప్రియము

- చిలకమర్తి, కర్పూరమంజరి

కీర్తి అనేది అన్ని వస్తువులకంటే లాభంలేని వస్తువు. కాని దానికోసమే మానవులు తమ సర్వాన్నీ కోల్పోవటానికి సిద్ధపడతారు.

- సంజీవదేవ్, రూపారూపాలు

ప్రతి వ్యక్తీ కీర్తికి బానిసే.

- సంజీవదేవ్, రూపారూపాలు

కీర్తి సంపాయించటం రెండు రకాలు. మొదటి రకం స్వతహాగా ప్రతిభ ఉండటంవల్ల వొస్తుంది. ఇక రెండోరకం చుట్టుపక్కల వాళ్ళను అణగద్రొక్కి వాళ్ళను అల్పుల్ని చేసి తాము ఘనులవటం.

- ధనికొండ, పవిత్రులు

ప్రపంచంలో ప్రతి రచయితకీ, డబ్బా అవసరం. అది ఎప్పుడూ మోగుతూ వుండాలి. కొట్టేవాడు లేకపోతే కొట్టుకోవాలి. ఆ మోతనే 'కీర్తి' అంటారు. సంస్కృతంలో డబ్బా ఎంత గట్టిగా మోగితే అంత కీర్తి వున్నట్టు లెక్క.

- పార్థసారథి, విశ్వరూప సందర్శనం

### కుకవి

లజ్జ గల్గిన పూర్వకాలమ్మునందు
కోటికొక్కఁడు గల్గెఁబో! కుకవి; నేఁటి
కాలమం దేమి కర్మమో కవులు నూటఁ
దొంబదులు కుపదమ్మునఁ దూఁగుచుంద్రు.

- తి.వేం, పాణిగృహీత

### కుక్క

కుక్క జీవితానికి మంచిరోజులు వచ్చినా అవి శాశ్వతంకావు. చెడ్డ రోజులు వస్తేమటుకు అవి మారటం బహుకష్టం.

- కొడవటిగంటి, కుక్క

కొలఁది యెఱుంగ నేర కలకుక్కలు చుక్కలఁ జూచి కూయవే.

- చాటువు

కుక్కలు మొఱిగిన జంగము పరపతి పోవునా?

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

కుక్కకు పనీలేదు తీరుబడీలేదు.

- సామెత

గడ్డికుప్పదగ్గర కుక్కేంచేస్తాది? గడ్డితినదు, తిన నియ్యదు.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

ఒక యజమాని తన కుక్కను అర్థంచేసుకునే దానికన్న ఆ కుక్కే తన యజమానిని బాగా అర్థంచేసుకుంటుంది.

- కొడవటిగంటి, అమోఘవచనం

ప్రపంచంలో బెల్లం తినని కుక్కలేదు.

- చిరంజీవి, బోలోస్వతంత్ర భారత్‌కీ జై

కుడితెడితే చేతుల్నాకే సొమ్ములూ ఉంటాయి. కూడెడితే కరిసే కుక్కలూ వుంటాయి.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

జంగులు జల్లులుఁ గల్గిన
సింగారపు టూరకుక్క సింగం బగునా?

- రామకృష్ణుడు, చాటువు

ముద్దుచేసినఁ గుక్క మూతి నాకు.

- వేంకటరాయకవి, వేణుగోపాలశతకము

కూర్చుంటే కుక్కయినా కరవదు.

- సామెత

కుక్కను తెచ్చి అందలంలో కూర్చోబెడితే కుచ్చు లన్నీ తెగగొరికిందట.

- సామెత

కరిచేకుక్క మొరగదు, మొరిగేకుక్క కరవదు.

- సామెత

ఏరు ఎంత పారినా కుక్కకు కతుకు నీళ్లే.

- సామెత

బానిసత్వమే స్వాతంత్ర్యమనుకునే ఈ కుక్కలు యజమానికన్నా ఎక్కువ ప్రమాదకరమైనవి.

- సూర్యప్రకాశ్, కుక్కలున్నాయి జాగ్రత్త!

### కుక్కమూతి పిందె

చెట్టు చెడేకాలానికి కుక్కమూతి పిందెలు వుడతై.

- వేదాంతకవి, తెనుఁగుతల్లి

మంచికులమునఁ బాపి జనించెనేని
వాఁడె చెడుఁగాని చెడుటెట్లు వంశమెల్ల?
చెట్టునకు నొక్కః చెడుకాయ పుట్టెనేని
నదియ చెడుఁగాని చెట్టు పాడగుటయెట్లు?

- కాళ్ళకూరి, చిత్రాభ్యుదయము

చెట్టు చెడుకాలానికి కుక్కమూతి పిందెలు.

- చిరంజీవి, బోలో స్వతంత్ర భారత్ కీ జై

### కుదరనిది

ఏదైనా అంతే. గోదాలోకి దిగి మెడ కాడికిందికి దించనంటే కుదరదు.

- చిరంజీవి, బోలో స్వతంత్ర భారత్ కీ జై

ఆడదాన్తోనూ కమ్యూనిజంతోనూ కితకితలా టలు కుదరవు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

### కుపుత్రుడు

కులవిభ్రంశకు, లెందు ముండలముటాకోరుల్
స్వకర్మస్థితుల్
దెలియంజాలని మాఱుబాసమొరకుల్
దీపించుచున్నారు పు
త్రులు కాలస్థితిఁబట్టి యిట్టి వెడఁగుం
దోకమ్ముతోనేమి? వీ
రలు సేవల్ పొనరింతురో? మఱి
గయాశ్రాద్ధమ్ములన్ జేతురో?

- తి.వేం., పాణిగృహీత

### కుమ్మరావం

...కుమ్మరావమున రాగిముంత లెఱుంగఁగలవె?

- నాచన సోమన, ఉత్తరహరివంశము

### కుమ్ములాట

ఆవులు ఆవులు కుమ్ములాడితే మధ్య లేగలకాళ్లు విరిగినట్లు.

- సామెత

### కురూపి

కురూపి ఏమి చేస్తున్నాడంటే, సరూపాలన్నీ లెక్కపెడుతున్నాడు.

- సామెత

అందవికారి అయిన పెళ్లానికి ఆరోగ్యం. అణకువ. మొగుడంటే వెర్రివ్యామోహం.
- చాసో. ఊహాఊర్వశి

క్రురతనం

క్రురవాళ్ళ బుద్ధి కొన్ని హృదయానికి సంబంధించిన విషయాల్లో మహాచురుగ్గా పనిచేస్తుంది.
- పాప. పంచవటీ దహనం

కులతత్వం

బానిసవర్గం తన ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకోవటానికి చేసే ప్రయత్నం కులతత్వం.
- గోపీచంద్. కులతత్వం-జాతీయవాదం

కులం

మా కులానికి అంతా బావలే.
- గురజాడ. కన్యాశుల్కం

జ్ఞానం. నీతి ప్రధానంగాని. జాతిలో యేంవుంది?
- గురజాడ. కన్యాశుల్కం

మంచిచెడ్డలు మనుజులందున
యెంచి చూడగ. రెండె కులములు.
మంచియన్నది మాలయైతే
మాలనే అగుదున్.
- గురజాడ. లవణరాజుకల

కులములేదట, ఒక్కవేటున
పసరముల హింసించు వారికి;
కులము కలదట నరుల వ్రేచెడి
క్రూరకర్ములకున్.
- గురజాడ. లవణరాజు కల

మాల మాలగాఁడు మహిమీఁద నే ప్రొద్దు
మాట తిరుగువాఁడె మాలగాక
వాని మాలయన్న వాఁడెపో పెనుమాల
- వేమన

బాపలన్న దొడ్డ పరువునఁ జాతురు
కాని పనులు సేయ హీనులంద్రు
కులము లెక్కయేమి గుణము ప్రధానంబు
- వేమన

కన్నె వరుఁడు చేరి కదియంగ నొక్కప్పు
డుచ్చయందు పిండ ముద్భవించు
హెచ్చుకులజుఁడెవడు హీనుఁ డెవండురా?
- వేమన

శాఖాభిమానాలనేవి నిన్న నేడు పుట్టినట్టు తోఁచదు. అనాదిగా వున్నట్టే తేలుతుంది. కాని వైద్యవిషయంలోనున్నూ కోర్టు. విషయంలోనున్నూ దీన్ని పాటిస్తూన్నట్టు కనపడదు.
- చెళ్ళపిళ్ల. కథలు-గాథలు

కళలు మోహించు టొక కులీనులన కాదు.
కులము లేదన్న వానినిఁగూడ వలచు.
- జాషువా. ముంటాజమహలు

మాలనూలని ఈసడించినా అది లేకపోతే జరగదుగా?
- చలం. మ్యూజింగ్స్

కులం వొదిలేశానన్న వాణ్ణిచూస్తే. కులహీనత్వంతో బాధపడేవాళ్లకే చాలా కోపం- కులంలో అధికుల మనుకునే వాళ్లమీది కోపంవల్ల. వాళ్ళ కులాలు వొదులుకుంటే సంతోషంరాదు. కులంలో వుండి ఆ కులానికి చెందడంవల్ల వాళ్ళు బాధలు పడితేగాని కసితీరదు.
- చలం. మ్యూజింగ్స్

ఏ కులమైతే నేమిటి అనుకూలమైతే!
- కొచ్చెర్లకోట. ఓల్డ్‌వాటర్

గతం నీకు చూపించేదారి
బ్రతుకుమీద కులం గుర్రాల సవారీ!
- కుందుర్తి. న్యాయదాన

తక్కువ కులాల వాళ్ళకుండే సహజమైన ప్రేమలు కూడా పైకులాల వాళ్ళకుండవేమో!
- కొడవటిగంటి. నీకేంకావాలి

కులము చేతఁబట్టి గుంపించనేటికి
పాదు ఉన్నచోట ప్రబలు విత్తు
ఏటి కుల మదింక ఎక్కడి ద్విజుడయా
- వేమన

మాలవాని నేల మఱిమఱి నిందింప
నొడలనున్న మాంస మొకటిగాదె?
- వేమన

నడిచే ప్రతిమనిషీ కులం వాసనకొడతాడు.
- సౌభాగ్య. సింహావలోకనం

కుల భేదములను రక్షించే కంచె గోడలు భోజన ప్రతిభోజన నిషేధములే.
- ఉన్నవ. నాయకురాలు

మాటవరుస కొక్కమత మందుమే కాని
కుల సమస్యవద్ద కుమ్ము దుమ్ము.
- జాషువా. ఇంటిగుట్టు

కుల విద్వేషము కుష్ఠదోషమయి
ప్రాకున్ సంఘ కాయంబు
- రాయప్రోలు. పాపమ్

కుల విభేదము - మత విరోధము

పొటమరించెను స్ఫోటకము వలె

- రాయప్రోలు, ఫాల్గుణి

రాష్ట్రరాష్ట్ర దురాక్రమణలన్
మతమతాంతరమత్సరములన్
ప్రేమ మయమగు విశ్వమానవ
గర్వమే గాయాలు పడెనే.

- రాయప్రోలు, భద్రయాత్ర

జాతి విద్వేషాలు జ్వలియించి చెలగ
కచ్చెకు తొత్తులై కలిసేరు జనులు

- రాయప్రోలు, ఏమేమొ పాడేవు

వర్ణ విద్వేషాలు వన్యమృగ తత్వాలు

- మల్లారెడ్డి, ఎన్నాళ్ళు

కులవ్యవస్థకు ఆర్థికమయిన పట్టు ఎన్నడో పోయింది. సామాజికమయిన పట్టుకూడా అంత రించినట్లే. ఇంక రాజకీయపు పట్టుకాస్త ఉంది.

- మహీధర, స్వయంవరణం

**కులవిద్య**

బలు విద్యలెన్ని నేర్చిన
కులవిద్యకు సాటిరావు

- గువ్వలచెన్నశతకము

**కూడనిది**

నవ్వేకవిని, ఏడ్చే కార్టూనిస్టుని నమ్మకూడదు.

- శ్రీరమణ, న్యూనుడి

అనువుగాని చోట నధికుల మనరాదు
కొంచె ముండు టెల్లఁ గొదవకాదు
కొండ యద్దమందుఁ గొంచెమై యుండదా?

- వేమన

**కూనిరాగం**

కూనిరాగం తీయలేని మొగాడూ, కుడుములొం డలేని ఆడదీ వుండరు.

- బెళ్ళపిళ్ల, కథలు-గాథలు

**కూరలమార్కెట్**

కూరల మార్కెట్లో కూనమ్మ వంకాయల వెల పెంచితే లోకం కొంప కూలుతుందనటంలో అతిశయోక్తి లేదేమో.

- బుచ్చిబాబు, మధురతరంగం

**కూరిమి**

రోళ్లారోఁకండ్లం బాడిన
కూరుము లిపు డెంత దాఁచుకొన్న నడఁగునే?

- పింగళి, ప్రభావతీ ప్రద్యుమ్నము

**కూలీ**

పనివాడికి కడుపునిండే కూలి యివ్వంది పని చేయలేరని యజమానులు యెపుడు గ్రహి స్తారో. స్వలాభాన్నిబట్టి చూచినా కూలి తగ్గిం చడం చివరకు యజమానులకు కూడా నష్టమే.

- ఉన్నవ, మాలపల్లి

నీవు శ్రీరంగనీతులు యిన్ని చెబుతావుగానీ కూలి వాడికి కడుపునిండా అన్నముంటే పనిచేస్తాడ టోయ్? వొకపక్క కాస్త కాలుతుంటే పనికోసం దేవులాడుతాడుగాని కడుపునిండితే పని హట్టే.

- ఉన్నవ, మాలపల్లి

వ్యవసాయానికి కూలీ ముఖ్యముగాని మీరు చెప్పే భూస్వామిగాడు.

- ఉన్నవ, మాలపల్లి

దంచినమ్మకు బొక్కిందే కూలి.

- సామెత

కూలోడు కూడబెడితే మేడగడతాడన్నది ఎన్నడూ జరగని పని.

- కాళీపట్నం, నో రూమ్

బస్తీ సమ్మెలు నిల్చేదాకా నమ్మకం లేదు. కూలీ లకు నీతి తక్కువ. పొట్టాత్రాన లోబడుతారు.

- ఉన్నవ, మాలపల్లి

ఇప్పటివాళ్ళకు నవుకర్లను తిన్నగా వుంచుకుని వాళ్ళచేత పనిపుచ్చుకోవటం తెలియదు. నేను పక్క నౌకరును వుంచుకుంటే ముందుగానే రెండు పనులకు అక్కరకు వచ్చేటట్టు ఆలోచిస్తాను.

- కందుకూరి, దురాచార దూషణము

**కృతఘ్నత**

ఏరుదాటి తెప్ప తగులబెట్టినట్లు.

- సామెత

**కృతఘ్నుడు**

కృతఘ్నుని పీనుఁగు నైన రోఁతపు
ట్టక కబళింపఁ గుక్కలు నొడంబడునే?

- తిక్కన, ఉద్యోగపర్వము

**కృతజ్ఞత**

అసలూ, వడ్డీ, సవ్యంగా ఇచ్చేస్తే, అదే కృతజ్ఞత!

- ముద్దంశెట్టి, కరిగిన శిల

సాధారణముగా బీదవాండ్రు మిక్కిలి చిన్నయు పకారములకు సైతము కృతజ్ఞులైయుందురు.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

కృతమెఱుఁగుట పుణ్యము స
న్మతి దానికి సమమునేంత మధ్యము మఱి త
త్కృతమున కగ్గలముగ స
త్కృతిసేయుట యుత్తమంబు కృతబుద్ధులకున్.

- నన్నయ, సభాపర్వము

కృతజ్ఞత అనే భావం ఏ చిన్నచోటైనా, ఏ చిన్న మేలుతోనైనా ఆరంభం కావచ్చు
- రామమోహనరావు, త్రినేత్రుడు

కృతబుద్ధి

సత్వరంబునఁ బరుల కిచ్చావిఘాత
మాచరింపరు కృతబుద్ధు లయినవారు.
- శ్రీనాధుడు, శృంగారనైషధము

కృతార్థత

తెలిసికోవలసిన విషయాలెక్కువ పోగుచేస్తానన డంకన్న ఒక్క విషయం అనుభవపూర్వకంగా తెలుసుకొంటే కృతార్థత యెక్కువవుతుంది.
- విశ్వనాధ, హాహా హూహూ

కృషి

రాజకీయాలు చదరంగాలే కావచ్చు ఆ ఫలితాలను అతితేలికగానూ భావించవచ్చు ఒక పరిశోధనగానూ తీసుకోవచ్చు కాని దృష్టి విఫలమైపుడు కడుపు తరుక్కుని పోతుంది.
- సభా, బూరగపండు

నిన్నా నేడుల కృషియే రేపై జన్మించుతుంది.
- సోమసుందర్, సమధర్మం

కెరటం

కెరటం నా ఆదర్శం
లేచిపడినందుకు కాదు
పడినా లేచినందుకు
- భావన్, కెరటం నా ఆదర్శం

కేలండర్

ప్రళయాలూ పరిహాసాలూ తప్ప కేలండర్‌లో కన్నీటి గుర్తులుండవు.
- నగ్నముని, కొయ్యగుర్రం

కేసు

ఆస్పత్రిలో ఆయా దగ్గర్నించి పెద్దమ్మగారి వరకూ అందరికీ స్వంతకేసులుంటాయి. ఎవ్వరికీ సంబంధించని కేసు బతికితే దేవుడిదీ. లేకుంటే యముడిదీ.
- వెంకటకృష్ణారావు, కదిలేబొమ్మలు

తీర్పులు సెప్పేవోరుంటున్నకొద్దీ తగవులుంటాయండి.
- బుచ్చిబాబు, ఉత్తమాయిల్లాలు

రాకరాక బ్రహ్మాండంమీద కేసొచ్చి డాక్టరు వెడుతూంటే, 'అవతలవాడు విల్లు రాశాడోలేదో, నీతో నేనూ వస్తున్నా" అని ఓ లాయరు కూడా డాక్టరు వెంటపడ్డాట్ట.
- భమిడిపాటి, ఆంధ్రాయూనివర్సిటీ పట్టుదలలు

దిక్కు మొక్కూలేని వాళ్ళమీద చాలా కేసులు విరుచుకుపడతై. పాపం అనే వాళ్ళు లేకపోతే విరుచుకుపడవూ? పడతై.
- వేదాంతకవి, తెనుఁగుతల్లి

కేసుల్లోనే న్యాయంవుంటే ఈ పోలీసులం మేమెందుకు? ఇంతమంది ఈ ప్లీడర్లు అంతా ఎందుకు? ఈ కోర్టులన్నీ ఎందుకు?
- రావిశాస్త్రి, న్యాయం

కొట్టేసే కేసుకి సమన్సేమిటీ?
- యజ్ఞన్నశాస్త్రి, హద్దులు-సరిహద్దులు

కొక్కిరాయి

కొక్కిరాయి! కొక్కిరాయి! ఎందుకుపుట్టావే అంటే చక్కని వాళ్ళని వెక్కిరించడానికి అన్నదట.
- సామెత

కొంజా

చూడండీ, దానిమీద ఎలా కొంజా యెత్తాడో!
- గురజాడ, కన్యాశుల్కం

కొట్టడం

"రుస్సా"వోడి వోడ నీట్లో మునిగి నడుస్తాది గదా, నువ్వు తుపాకీతో యవణ్ణి కొడతావు?
- గురజాడ, కన్యాశుల్కం

యే దేవుడు నెత్తి కొట్టమంటే ఆ దేవుడు నెత్తి కొడతాను బాబూ!
- గురజాడ, కన్యాశుల్కం

కొడుకు

కలిసొచ్చే రోజుల్లో నడిచొచ్చే కొడుకు పుడతాడు.
- సామెత

కులము చెరుపంగ నూర్వురు కొడుకులేల?
యొకఁడు చాలఁడే నీవంటి యుక్కలుండు?
ఊరకుక్కలు పదివేలు చేరనేల?
చాలదే వేఁటకై యొక్క జాగిలంబు?
- తి.వేం., పాండవవిజయము

కుమారుఁడు నాకెల్లగతుల మారకుఁడయ్యెన్
- తి.వేం., పాండవప్రవాసము

కులము వెలయింపఁ బుట్టిన కొడుకు కొడుకు
గాక కులనాశనుఁడు కొడుకా తలంప?
- అనంతుడు, భోజరాజీయము

సూడుఁ దీర్పలేని సుతుఁడు సుతుఁడె.
- పోతన, భాగవతము

పనుపక చేయుదు రధికులు
పనిచిన మధ్యములు పొందుపఱుతురు తండ్రుల్
పనిచెప్పి కోరి పనిచిన
ననిశము మాఱాడు పుత్రు లధములు
- పోతన, భాగవతము

తనయుండు దల్లిదండ్రులు
పనిచిన పనిసేయఁడేని పలు కెడలోఁ జే
కొనఁడేని వాఁడు తనయుం
డనఁబడునే? పితృధనమున కర్హుండగునే?
- నన్నయ, ఆదిపర్వము

దైవ మనఁగ గురుండు నా ధర్మమనఁగ
నర్థమనఁ దలిదండ్రులె యాత్మజునకు.
- శ్రీనాధుడు, కాశీఖండము

ఢిల్లీకి రాజైనా తల్లికి కొడుకే.
- సామెత

ఎన్ని తీర్థయాత్రలో ఎన్ని పూజలో చేసి యుప్పు
కల్లువలె నొక పుత్రునిఁ బడసితినే!
- ధర్మవరం, విషాద సారంగధరము

## కొండ

కరి కళేబరములా
కదలదు కొండ!
- శ్రీశ్రీ, ఒకరాత్రి

## కొండగుర్తు

గొడ్డలి ఎక్కడ పెట్టినావురా? అంటే కొట్టే చెట్టు దగ్గర, కొట్టే చెట్టెక్కడుందిరా? అంటే గొడ్డలి దగ్గర అన్నాడట.
- సామెత

## కొత్త

కొత్తొక వింత పాతొక రోత.
- సామెత

క్రొత్తయనిపించు కొనునదంతయు మాఱిన పరిస్థితులే తప్ప మానవుని మనస్సు కానేకాదు.
- విశ్వనాథ, నందో రాజాభవిష్యతి

క్రొత్త బియ్యమువలనఁ గడుపునకు బాధ. క్రొత్త మంగలివలన గడ్డమునకు బాధ. క్రొత్త భార్యవలన నిద్రకు బాధ. క్రొత్త ప్లీడరువలన నాస్తికి బాధ. క్రొత్త వైద్యునివలనఁ బ్రాణమునకు బాధ.
- పానుగంటి, సాక్షి

వ్యాపార కళకు ప్రధానంగా కావలసింది "కొత్త రుచి". ఎప్పటికప్పుడు కొత్త
- చిరంజీవి, బోలోస్వతంత్రభారత్‌కీ జై

ఉద్యోగం సంగతి, పెళ్లి ముహూర్తం సంగతి కొత్త పంచాంగం వస్తేనే కాని తెలీదు
- లక్ష్మణరావు, అతడు-ఆమె

స్ఫోటక దేవత వచ్చి వెనుకటి రోగాలనన్నిఁటిని సాగనంపినట్లు క్రొత్త పెండ్లాము వచ్చి ప్రాంత సంస్కారముల నన్నిఁటిని బాఱఁద్రోలినదా?
- పానుగంటి, సరోజిని

అత్తగారింటికి కొత్తల్లుడు వెళితే... నెత్తినపెట్టుకుంటారు.
- రామకృష్ణశాస్త్రి, హంసధ్వని

ఒకసారి కూర్చుని లేస్తే కొత్త సమావేశం ప్రారంభమయినట్లే.
-నిరుద్యోగి, కార్యాలయబేతాళవిక్రమార్కీయము

## కొంపతీయటం

ఆ యింగిలీషే మన కొంపతీసింది. కళ్ళు తెరవని పిల్లలు మొదలు పెద్దాళ్ళ వరకూ అందరూ ఆ కల్తీ కబుర్లాడటమే!
- సూర్యారావు, శ్రీమతులు శ్రీయుతులు

## కొరత

మనదేశంలో తిండి కొరత ఎక్కువ. ఆకలి చావులూ ఎక్కువే. కాని గమ్మత్తేమిటంటే తిండి కొరతకంటే ఎక్కువ శవాల కొరత.
- బీనాదేవి, హరిశ్చంద్రమతి

బడాయి బారెడు, పొగచుట్ట మూరెడు
- సామెత

"కల్తీ - కొరత" ఈ రెండు అక్కచెల్లెండ్లలా, జోడు గుర్రాలులాంటివి- అన్యోన్యంగా ఉండగలవు. జోరుగా సాగిపోగలవు.
- బుచ్చిరెడ్డి, ఎప్పుడొస్తుంది దీపావళి?

## కొర్రు

కనికని కొఱ్ఱివ్వఁ డింటికంబము సేసెన్?
- నాచనసోమన, ఉత్తరహరివంశము

## కొలత

కుంచం నిలువుగా కొలవడానికి వీల్లేనప్పుడు తిరగేసైనా కొలిస్తే నాలుగ్గింజలు నిలుస్తాయి.
- గురజాడ, కన్యాశుల్కం

సర్కారు వారు వేతనాలివ్వటానికి కొలత పెట్టారుగాని- పనికి పెట్టలేకపొయ్యారు.
- కె. యల్., తోడునీడ

### కొలువు

రాజ్యం తప్పినా కొలువు తప్పలేదు.

- కొడవటిగంటి, అశోకవనం

### కొవ్వొత్తి

రెండుపక్కలా వెలిగించాను కొవ్వొత్తి
శ్రీశ్రీలా వెలుగుతోంది

- పురిపండా, ఇన్‌క్విలాబ్

### కొసరు

కొంటే తీరనిది, కొసరితే తీరుతుందా?

- సామెత

### కో ఆపరేషన్

అసలు ఆపరేషన్ పని చేసినట్లు కో ఆపరేషన్ పని చేయదు.

- వేదాంతకవి, ఆకలిమంట

### కోకిల

కోకిల కూయునది పంచమ స్వరము, పంచములన చండాలురు. అందుచే కోకిలది 'ఛండాల స్వరము'

- మాచిరాజు, తెలుగు పేరడీలు

### కోటు

కొంప లేకపోయినను భయము లేదు. భూములు లేకపోయినను విచారము లేదు. ఉద్యోగము లేకపోయినను కొఱంతలేదు. కాని కోటు లేకపోతే యావత్తు వెలితియే! కోటు లేనివాఁడు చిల్లిగవ్వచేయఁడు.

- చిలకమర్తి, గణపతి

కోటు కోపాన్ని కప్పేస్తుంది.

- బుచ్చిబాబు, మధుర తరంగం

### కోడలు

వెధవ కోడళ్ళున్న వాళ్ళు పనిమనుషులనూ, వంటలక్కలనూ పెట్టుకోరుట.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, తల్లిప్రాణం

కొఱ్ఱగింజంత కోడలిని చూస్తే, కొండంత జ్వరం వచ్చిందట.

- సామెత

కోడలు గృహ ప్రవేశం, అత్త అగ్నిప్రవేశం.

- సామెత

కోరుకున్న కోడలు వస్తే, కొప్పులో చెప్పు పెడుతుంది.

- సామెత

దంచక్క కలగవే ధాన్యరాశుల్లు
వంచక్క వంగరే వనిత కోడళ్ల

- దేవులపల్లి, ఏడాదిపొడుగునా

ఒక్కొక్క కోడలు వచ్చాక ఇల్లు నాలుగిళ్లుగా చీలిపోతుంది- ఒక్కొక్క కోడలు వచ్చాక పట్టిందల్లా బంగారమై ఇల్లు ఏకసూత్రం మీద నడుస్తుంది.

- కాళీపట్నం, రాగమయి

గుట్టుమట్టు లేని కోడలు కోడలా?
ప్రక్కలోని త్రాఁచుఁబాముగాక

- ఏటుకూరి, ప్రేమాలోకము

### కోడిపందెం

కోడిపందేలే వీరులను తయారుచేసే గురుకులాలు.

- ఉన్నవ, నాయకురాలు

హా! ఖగేంద్రంబులార! కయ్యమున నీల్గి
పోవుచున్నారె దేవతాభువనమునకు
మీరు రంభాతిలోత్తమామేనకాది
భోగకార్యార్థమై కోడిపుంజులార!

- వల్లభరాయడు, క్రీడాభిరామము

ఆరువిల్లి నాయురాలి దుర్మంత్రంబు
కోడిపోరు చాపకూటి కడుపు
ప్రథమకారణములు పలనాటి యేకాంగ
వీరపురుష సంప్రహారమునకు

- వల్లభరాయడు, క్రీడాభిరామము

### కోత

కూర్చుని లేవలేడుగాని, లేస్తే మనిషి కాదన్నాడట.

- సామెత

బొంకరా, బొంకరా! పోలిగా! అంటే, టంగుటూరి మిరియాలు తాటికాయలంతేసి అన్నాడట.

- సామెత

ఢిల్లీకి టిక్కెట్టు తేలేనివాడు పార్టీ టిక్కెట్టు తెస్తానన్నాట్ట.

- శ్రీరమణ, న్యూనుడి

పతిభక్తి చూపిస్తాను మగడా! చెప్పులు తే నిప్పులు తొక్కుతాను.

- సామెత

పూజ పునస్కారాలు లేక బూజెక్కి ఉన్నానుగాని, నైవేద్యం పెట్టు నా మహిమ చూపిస్తాను.

- సామెత

ఏమండీ కరణంగారూ! గోతిలో పడ్డారే అంటే, కాదు, మషాకత్తు చేస్తున్నాను అన్నట్లు.

- సామెత

### కోపం

ఇంగ్లీషు కోపం కాబోలు

- బుచ్చిబాబు, దారినపోయే దానయ్య

సేతకానోడికి కోపం నావు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

మనుషులు మారాలంటే, వేడి పుట్టించి, చలనం కలిగించే కోపం కావాలి.

- యజ్ఞన్నశాస్త్రి, ఓ మనిషి నూతిలోపడితే

మా చదువుకున్నవాళ్లకు అనుకున్న పనికాక పోతే కోపం వస్తూ ఉంటుంది.

- బాపిరాజు, కోనంగి

చేతనైన వాడి కోపం చేతల్లో ఉంటుంది. మరి కొందరి కోపం రాతల్లో ఉంటుంది.

- రావిశాస్త్రి, ఓ మంచివాడికథ

కోపంలో ఒక సుగుణం- కోపం ఉన్న ఆ కాస్సేపూ మనకున్న విచారం మరచిపోతాం!

- పిచ్చేశ్వరరావు, గడవని నిన్న

వెనుకటికి, మహర్షులకు కరవొచ్చేంత కోపం ఉండేదంటే, ఇదే కారణం అయివుంటుంది. ఇదే అంటే, ఆ ఇనుపకచ్చడాలే!

- రామకృష్ణశాస్త్రి, మెయిలు

కోపం గొప్పకు ముప్పు, అల్లరికి హంగు ముప్పు

- సామెత

కరవమంటే కప్పకు కోపం, విడవమంటే పాముకి కోపం.

- సామెత

ఎవరికైతే ముక్కుమీద కోపం వుంటుందో వారు నైతికమైన విలువలకు సాధారణంగా ఎక్కువ ప్రాముఖ్యమిస్తారు, ముఖ్యంగా స్త్రీల విష యంలో.

- కౌసల్యాదేవి, పసుపుతాడు

కోపం తెచ్చుకున్నవాడు కోతికంటే అధ్వాన్నం.

- కాంతారావు, బూచీ

**కోమట్లు**

యిప్పటి రోజుల్లో దేవ బ్రాహ్మణభక్తి కోమట్ల లోనే ఉన్నది.

- గురజాడ, కన్యాశుల్కం

బంగారువంటి కోమటి
సంగీతముచేత బేరసారములు డిగెన్

- చాటువు

**కోరిక**

అంతగా కోరికే ఉంటే పోయిన మొగుడే రావా లని కోరుకొందును.

- దేవులపల్లి, ఏడాది పొడుగునా

మనసులో ఉన్న మన కోరికనుబట్టి మాటలు కూడా వచ్చేస్తాయి.

- దేవులపల్లి, ఏడాది పొడుగునా

రోజాపువ్వుల వంటివి కామితాలు.

- రమణారెడ్డి, ధమ్మఘోష

పూర్వుల తీరని కోర్కెలు
పుట్టని పాపల ఆశలు

- అనిసెట్టి, పచ్చగ ఈనేలంతా

పెరుగుతూన్న పిల్లలకు కోరికలే పరమౌషధాలు

- సదానంద, గందరగోళం

దిగిరాను దిగిరాను దివినుంచి భువికి
నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు?

- దేవులపల్లి, స్వేచ్ఛాగానము

దేన్నయినా అనుభవించాలనే కోరిక దాన్ని అనుభవిస్తుండగా కాని దాన్ని అనుభవించిన తరువాతగాని చచ్చిపోతుంది. నెరవేరకుండా ఉన్నంతవరకే కోరిక ఉనికి.

- సంజీవదేవ్, రూపారూపాలు

నీతి కట్టెలాంటిది
కోర్కె మంటలాంటిది

- తిలక్, రాజమండ్రి పాటలు

అన్ని కోరికలు తీరినా వొక్క తీరని కోరిక చాలు మనిషిని పిచ్చివాడినిగా చెయ్యటానికి.

- పెద్దిభట్ల - కప్పగంతుల, నయనతార

మనసులోనున్న కోరిక ఫలము దూరమైన కొలంది బాధ యధికమగుచుండును గదా!

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

కోరి అడిగితే కొమ్మెక్కుతారు.

- గురజాడ, కన్యాశుల్కం

కామధేనువు నట్టింటc గట్టిపెట్టి
"కోర్కె లొనcగూర్పు"మని యొరుc గోరనేల?

- తి.వేం., పాండవాశ్వమేధము

మనిషియెంత చదువు చదువుకున్నా మనసు లోని కోర్కెలు పశువుల స్థాయిలోనే వుంటాయి.

- రారా, నీతిగానుక

కోమటి యత్యంత క్షామముc గోరును
ధారుణి క్షితిపతి ధనముcగోరు
ధరc గరణము గ్రామదండుగc గోరును
జంబుకం బేవేళ శవముc గోరు
కుజనుcడౌ వైద్యుండు ప్రజకు రోగముcగోరు
సామాన్య విప్రుండు చావుcగోరు

అతిజారు లగువార లమనసఁ. గోరుదు
రాఁబోతు పేదల యశముఁ గోరు
- వేంకటరాయకవి, వేణుగోపాలశతకము

తాతా! పెండ్లాడుతావా? అంటే నాకెవరిస్తారురా అబ్బాయి అన్నాడట
- సామెత

అడుక్కొని తినేవాడు పెరుగన్నం కోరినట్లు
- సామెత

కోర్టు

ఇన్ని కోర్టులుండి, యిందరు న్యాయమూర్తులుండి, ఇందరు న్యాయవాదులుండి, యింతకాలము విచారణము లుండినను దొంగయెవఁడో దొర యెవఁడో తిన్నఁగఁ దేలకుండ నున్నప్పుడాపెద్ద సందడిలో దొంగను గనిపెట్టువాఁడెవఁడు?
- పానుగంటి, సాక్షి

మహా మహా కోర్టులలో లంచాలు పుచ్చుకుని వుపకారం చేస్తారు.
- కందుకూరి, హాస్యసంజీవని

ఎట్టి తగవులయినను సంధిమార్గమునఁ దీరుమానించుకోవలయునేగాని కోర్టుకెక్కఁగూడదు. ఇట్టివాఁడు పార్శ్వపు నొప్పి- పక్షవాతము- పరిణామశూల- మొదలగు వ్యాధులు లేక యారోగ్యవంతుఁడై యెనుఁబది సంవత్సరములవఱకు జీవించును.
- పానుగంటి, సాక్షి

కోర్టంటే ఏమిటో తెలుసా? పెద్ద అడివి.
- రావిశాస్త్రి, మాలతి

తమర్లాటి వోళ్ళుంటేనే ఈ కోర్‌ట్లు నిలబడాలగాని, లేపోతే కోర్‌ట్లెందుకు బాబూ.
- రావిశాస్త్రి, నిజం

ఏ దేశంలో ఏ కోర్టులో అయినా సరే తడిగుడ్డలు చల్లగా గొంతులు పిసుకుతాయి. ప్రాణాలు తీస్తాయి తప్ప బాహాటంగా కత్తులు రాపాడవు. గదలు ఢీకోవు.
- రావిశాస్త్రి, బుక్కులు

కోర్టువోరి నిజెం యేరే నిజం బాబూ!
- రావిశాస్త్రి, ఆశ

హక్కు ఎవరికున్నా, దాన్ని నిలబెట్టేందుకు కోర్టులు నిలబడ్డాయి.
- బుచ్చిబాబు, తీసినతెర

కోర్టు ఆధారాలనేకాని నిజాన్ని నమ్మదు.
- విశ్వం, కోర్టు కథలు

ప్రపంచంలో న్యాయాన్ని ధర్మాన్ని చంపటానికేనా ఈ కోర్టులు?
- విశ్వం, కోర్టుకథలు

ఈ రోజుల్లో న్యాయంకోసం ఏ మనిషీ కోర్టుకెళ్లకూడదు. వెళితే లాభం కోసమే వెళ్లాలి.
- విశ్వం, కోర్టుకథలు

లోకంలో న్యాయాన్ని ధర్మాన్ని చంపేయటానికి ఎన్ని కోర్టులు, ఎన్ని నల్లకోటులు?
- విశ్వం, ముసుగు

కోర్టుకి అరమైలు దూరంలో నిలిచిపోతుంది నిజం. అబద్ధమే కోర్టుని భల్లూకంలా పట్టుకొంటుంది.
- బీనాదేవి, ఎ మేటరాఫ్ నో ఇంపార్టెన్స్

కోర్టుకెక్కినవాడూ, గాడిదెక్కినవాడూ ఒకటే.
- బీనాదేవి, ఎ మేటరాఫ్ నో ఇంపార్టెన్స్

కొబ్బరికాయ లేకుండా గుళ్లోకి వెళ్లగలంకాని, డబ్బు లేకుండా కోర్టుకు వెళ్లలేం.
- బీనాదేవి, ఎ మేటరాఫ్ నో ఇంపార్టెన్స్

కోర్టుకి కళ్ళు లేవంటారు కానీ, దానికి చెవులూ, కళ్ళూ కూడా వున్నాయి. అయితే, అది కళ్లతో వింటుంది, చెవులతో చూస్తుంది.
- వఝ్ఝల చండీదాస్, హిమజ్వాల

నిజంగా కోర్టు లీనాడు మొక్కుబళ్లకు గుళ్ళే
అయినవి. ఈ గుళ్లల్లో దేవుళ్ళు యిళ్ళూ
వళ్ళూ గుల్లజేసిగాని మోక్షం ఇవ్వరు.
- వేదాంతకవి, తెనుఁగుతల్లి

నలభైమైళ్ళ దూరాన్ని
ఎనభైసార్లు నడిపించింది కోర్టు.
- ఛాయారాజ్, శ్రీకాకుళం

కోర్టులకి కావలసింది నిజాలుకాదు, సాక్ష్యాలు.
- ఆనందారామం, ఉరిమే మబ్బులు

ఎంత అన్యాయం పెరిగితే కోర్టుల్లో అంత పీకలు మునిగే పనుంటుంది. పాపం పెరిగిపోతుంది. కోర్టులు నిండిపోతున్నాయి.
- బీనాదేవి, రిబ్బనుముక్క

బస్తీల కెగబడే జనం చాలాభాగం కోర్టుల పని మీదే...
- బుచ్చిబాబు, ఆద్యంతాలు, మధ్యరాధ

పంచాయతీలు మానిపించి
కోర్టు లెట్టినాడు బాబు!
కోర్టులెట్టి రైతువాడి

కూడు తన్నినాడు బాబు!

- గరిమెళ్ల, సైతానుప్రభుత

**కౌగిలింత**

గాఢాలింగన సౌఖ్యము
ప్రౌఢాంగన యెఱుఁగుఁగాక బాలేమెఱుఁగున్?

- చాటువు

చేతులు వెనక కట్టేసుకొని కౌగలింపా?

- బుచ్చిబాబు, గాజుమేడ

**క్రమం**

డొక్కల కఱవు వస్తే మగాళ్ళు ముందర తల్లులనీ, తరువాత పెళ్ళాలనీ విఱుచుకు తినేస్తారు.

- శివరామశాస్త్రి, డిప్రెషన్-చెంబు

**క్రమశిక్షణ**

క్రమశిక్షణకు బద్ధులై ఫౌజులుదీరి నిల్చుని తుపాకులు పేలుస్తున్నారు. అలా బారులుదీరి నుంచుంటే చావకుండా ఉంటారని కాదు. చస్తారు. అయితే క్రమశిక్షణకు భంగం రాకుండా చక్కగా ఒక నిర్ణీత పద్ధతిలో చస్తారు. బ్రతికి ఉన్నంతసేపూ వరుసల్లో నిల్చుని తుపాకులు పేలుస్తారు. చావవలసివచ్చినప్పుడు, నిల్చున్నవాళ్లు నిల్చున్నపాళంగా చట్టున వెనక్కి భూమిమీద విరుచుకుపడి అదివరకు చచ్చిపడి ఉన్న శవాల వరుసలలో తాము చేరిపోతారు. క్రమశిక్షణ అంటే అలా ఉంటుంది. యుద్ధరంగంలో బ్రతికి ఉన్న సైనికుల కాళ్లకు చచ్చిన శవాల గుట్టలు అడ్డుపడకుండా ఉండాలంటే ఇలాంటి క్రమశిక్షణ ఉండటం చాలా అవసరం.

- సూరి, చంఘిజ్ ఖాన్

"క్రమశిక్షణ"వల్ల (యింకా) చాలా ఉపయోగాలున్నయ్. యుద్ధం చేస్తున్నప్పుడు, బ్రతికున్న సైనికులకు చచ్చినవాళ్ల సంఖ్య తెలియకుండా ఉండటం చాలా అవసరం. లేకపోతే సేనలో అధైర్యం వ్యాపించటానికి అవకాశముంటుంది. అందుచేతయినా ఫౌజులుదీరి మరణించటంవల్ల వెనుక వరుసల్లో చస్తున్నవారిసంఖ్య ముందు వరుసల్లో వాళ్లకూ, ముందు వరసల్లో చస్తున్న వాళ్ల సంఖ్య వెనక ఉన్నవాళ్లకూ అర్థంకావటానికి వీలుండదు. పైగా ఫౌజులో నిల్చున్న ప్రతి సైనికునికీ ఊర్ధ్వదృష్టిమినహా అధోదృష్టి ఉండని కారణంగా నిలుచుని తుపాకులు కాలుస్తున్న వాళ్లు తప్ప చచ్చిపడిఉన్నవాళ్లు కంటబడరు

- సూరి, చంఘిజ్ ఖాన్

"క్రమశిక్షణ" చాలా గొప్ప విషయం చచ్చినా, బ్రతికినా క్రమశిక్షణలో బ్రతికి చావటం నాగరికతా లక్షణం.

- సూరి, ఛంఘిజ్ ఖాన్

**క్రికెట్**

అయిదు రోజులువేస్టు
అగుట కెయ్యది బెస్టు?
చూడుము క్రికెట్ టెస్టు
ఓ కూనలమ్మా!

- ఆరుద్ర, ఇంటింటిపజ్యాలు

**క్రిమినల్ లా**

కాంతా కనకాలు లేన్దే 'క్రిమినల్ లా' యే లేదు.

- రావిశాస్త్రి, నిజం

**క్రియ**

కర్త పొరపాటుపడెను. కర్మ యనుభవించెను.

- విశ్వనాథ, దిండుకింది పోకచెక్క

**క్రూరుడు**

చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు
డడ్డపడి వారితోడఁ గొట్లాడియైనఁ
దాని నుడుపంగఁ జొరకున్న వానిఁ గ్రూర
కర్ముఁ డని చెప్పుదురు కర్మకాండ విదులు.

- తిక్కన, ఉద్యోగపర్వము

**క్రోధం**

క్రోధాదులను సంహరింపవలసినదని మన పెద్దలు శాసించిరి. వారి మాట కాదనఁగలవారెవరు? అయినను ప్రపంచము వానిచేతనే సుఖవంతమగుచున్నదని చెప్పవలసివచ్చుచున్నది.

- పానుగంటి, సాక్షి

**క్షయంటు**

ష్లీడర్నే కోర్టుకీడ్చిన క్షయంటుని ఇంతకాలానికి ఆంధ్రదేశంలో దర్శించాను.

- బుచ్చిబాబు, గొలుసు

**క్లాసు**

క్లాసు క్లాసని అందరూ ఆ అమ్మాయి దగ్గరికే వెళుతున్నప్పుడు ఆ అమ్మాయి క్లాసెలా అవుతుంది?

- విశ్వం, ఆకలి కథ

**క్వాలిఫికేషన్**

ఇప్పుడున్న పోస్టులన్నిటికీ క్వాలిఫికేషన్లు

కావాలి. రాజకీయ నాయకులకుతప్ప.
-నిరుద్యోగి, కార్యాలయబేతాళవిక్రమార్కీయము

**క్షణం**

ప్రతి క్షణం ప్రసవవేదన
అనుక్షణం మరణయాతన
- బైరాగి, నూతిలో గొంతుకలు

**క్షమ**

ఓ రాక్షసుడిని దార్లోకి తీసుకురావాలంటే కొట్టీ, తిట్టీ, హింసించ నవసరంలేదు. క్షమించి వది లేస్తే చాలు. బ్రతికి వున్నన్నాళ్ళు చచ్చి బ్రతుకు తాడు.
- వెంకటరమణ, మృదంగతాళం

**క్షమార్హత**

మనిషిలో ఏ దుర్గుణమైనా క్షమార్హమే కావచ్చు కాని నైతిక పతనానికి మాత్రం ఆ అర్హతలేదు.
- నంది, నైమిశారణ్యం

పొరబాట్లు క్షమించరానివి కావు. కాని వాటిని కప్పిపుచ్చేందుకు మనం చేసే యత్నాలు క్షమిం చరానివి.
- బుచ్చిబాబు ఒకరాత్రి-ఎన్నోకలలు

**క్షేమం**

మహాపట్నం కన్న మహారణ్యం క్షేమం.
- మహీధర, కత్తులవంతెన

**క్షోభ**

ఒక్కొక్కప్పుడు మనసుకుఁ దెలియకుండ జీవుఁడు క్షోభపడుచుండును.
- విశ్వనాథ, తెఱచిరాజు

**ఖ**

**ఖద్దరు**

గంతలు కట్టినంత మాత్రాన
గాడిద గుర్రంకాదు
ఖద్దరు ధరించిన ప్రతివాడూ
గాంధేయుడు కాడు.
- తిలక్, నవత-కవిత

శుద్ధ ఖద్దరుతో గొంతులు కోయవచ్చు
తెల్లని టోపీ చాటున ఏమైనా చేయవచ్చు
- బైరాగి, పాంచజన్యం

ఆ ఖద్దరు ఇదివరకు కడుపు ముడతలు పడ్డ వాడు వేసేవాడు. ఇప్పుడు మెడ దగ్గర గడ్డనా, మూడు ముడుతలు పడేవాడు వేస్తున్నాడు.
- కాంతారావు, వంశధార

పూర్వమొనర్చిన జాతి ద్రోహములు, మిత్రద్రోహ ములు, దేశద్రోహము, మత ద్రోహములు, దైవ ద్రోహములు ఖద్దరు టోపీతో సమూలముగఁ బోయినవా?
- పానుగంటి, సాక్షి

**ఖర్చు**

నీ మనస్సునూ శరీరాన్ని ఆరోగ్యంగా అట్టే పెట్టని ఖర్చు ఒక్కదమ్మిడీ చెయ్యకు.
- కొడవటిగంటి, నిలవనీరు

విజ్ఞానమే కాదు- అజ్ఞానం కూడా డబ్బు ఖర్చు చేస్తేగాని రాదు.
- సరస్వతీదేవి, స్వర్ణకమలాలు

ఈ పట్నంలో, ఇంట్లో కూచుంటే డబ్బురాదు, బైటికడుగు పెడితే ఖర్చు!
- అనిశెట్టి, గాలిమేడలు

పిండి కొద్దీ నిప్పట.. అన్నట్లు డబ్బుకొద్దీ ఉంటుంది ఖర్చు
- సభా, మిధునలగ్నం

ఖర్చుపెట్టేవాడికి డబ్బివ్వడం పూచీ భగవంతు డిది.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, గుర్రప్పందాలు

**ఖాళీ ఇల్లు**

ఏ ఇల్లయినా సరే అద్దెవాళ్ళు కాళీచేసిన తరు వాత, రావణుడు చెరచిన రంభల్లే కనిపిస్తుంది, ఇల్లుగల వారి కళ్ళకు.
- కొడవటిగంటి, చదువు

**ఖూనీ**

డబ్బున్నవాడు ఖూనీ చేస్తే డిఫెన్సుకి పోలీసు వాడే పునాది వేస్తాడు. శవం మీద దెబ్బలే లేవంటాడు శవం డాక్టరు.
- బీనాదేవి, పాతకథే

**ఖైదీ**

ఇల్లాలు సంగతి ఇంటి గోడలే చెప్పుతున్నట్లు జైలులోని ఖైదీల గాథలే మన మేవిధంగా ఉన్నామో తెలిసికోడానికి సజీవ ప్రమాణాలు.
- ఆళ్వారుస్వామి, ప్రజలమనిషి

భూమి నుంచి త్రవ్వితీసిన బంగారాన్ని కాపాడ టానికి దాని గర్భమునుంచే త్రవ్వితీసిన ఇను

ముతో కటకటాలు నిర్మించి దానిలో ఖైదీ అయ్యాడు మనిషి

- పొట్లపల్లి, మెరుపులు

ఖ్యాతి

సర్జను ఖ్యాతి అంతా మేట్రను అరచేతిలో వుంటుంది.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

జాతికి ఖ్యాతి ఎప్పుడూ ఆ జాతిలోని ఉన్నతులవల్లనే కనపడుతుంది.

- చలం, మ్యూజింగ్స్

## గ

గంగ

పవిత్రత, మురికి, శుభ్రం, అశుభ్రం అంతా గంగ ఆస్తి! హక్కు! వారసత్వం.

- ఇనాక్, గంగాస్నానం

గంగానమ్మ

పాటిమీఁది గంగానమ్మకి కూటిమీఁదేలోకం

- సామెత

గజం

బట్టల దుకాణంలో మాత్రం గజం.
బయటకొచ్చి కొలిస్తే అరగజం

- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

గంజి

సారవంతమైన గంజిని కాలువపాలుచేసి పిప్పిని 'అన్నం' అనుకొని నాగరికులం తింటాం.

- చాసో, బొండుమల్లెలు

గట్టిదనం

ఒక్కొక్కసారి నిజంకంటే అబద్ధమే గట్టిగా వుంటుంది.

- రామచంద్రమూర్తి, స్వీట్‌నాన్సెన్స్

ముసలి ముండాకొడుక్కి పెండ్లాము దొరికినా పిల్లవాడికి గుడ్డపీలిక దొరికినా వదిలిపెట్టడు.

- సామెత

గట్టు

...ఈ ఇవతలిగట్టు
నేను ప్రేమించే కన్నీటిబొట్టు

- చెరబండరాజు, ఇవతలిగట్టు

గడియారం

గడియేని ఆగని సూర్యుణ్ణి గడియారపు బాహువులు బంధిస్తాయి.

- ఇస్మాయిల్, స్వేచ్ఛాగానం

గడియారం సంకేతం
కాలానికి

- సినారె, రెక్కలు

గడ్డం

గడ్డానికీ, మతానికీ ఈ రోజుల్లో సంబంధం లేదు. ఇది ఈనాటి ఫాషన్.

- సరస్వతీదేవి, దగాపడ్డ డాక్టరమ్మ

గడ్డి

గడ్డి నోట్లో పెట్టాలి, కాని తల్లో కాదు.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

గడ్డి గాడిదలు తింటాయి. మనుష్యులు తినరు.

- గురజాడ, కన్యాశుల్కం

పౌరుషము మాటపట్టింపు వచ్చినప్పుడు
గడ్డి పోఁచయె మేరువై గణుతిఁగాంచు.

- దుర్భాక, రాణాప్రతాపసింహచరిత్ర

గడ్డురోజులు

మండితే మంచి గంధపు చెక్కయినా నిప్పే అయినట్టు గడ్డుదినాల్లో మంచి కూడా చెడ్డగానే మారిపోతుంది.

- రావిశాస్త్రి, ద్వైతాద్వైతం

ఒకటో తారీకు ముందు రోజుందే ఆ రోజే ఎంతత్రోసినా గడవని నడవని గడ్డు దినం.

- పురాణం, వంటచేయని రాత్రి

గణాచారి

గణాచారికి మొగు డుండడు. తనవాళ్లపైన మమకారా లుండవు. తనేమిటో తన నావహించిన అలౌకిక వాతావరణ మేమిటో, ఆవిడదొక ప్రత్యేక ప్రపంచం.

- రాజారాం, మరీచిక

గణాలు – ప్రాసలు

గణాలు అంటూ లేవనేకాని గద్యమే పద్యం అన్నారు. అసలు గణాలు లేకపోవడం సహం హాయి. అందులో ప్రాసలు, అనుప్రాసలు లేకపోవడం వంటికి కూడా మంచిదట.

- మాచిరాజు, కవిదినోత్సవం

గణితం

కల్లోలాన్ని కసితో గుణిస్తే
లబ్ధంలో రక్తపాతం పుడుతుంది.

- ఛాయారాజ్, శ్రీకాకుళం

మంటలను కోపాలతో హెచ్చించితే
ఫలితం తెగింపుగా వస్తుంది
దుఃఖంలోనికి ఆవేశాన్ని గుచ్చితే
సాహసం చిచ్చులా చిమ్ముకొస్తుంది.
- ఛాయారాజ్, శ్రీకాకుళం

*గండం*

వండెడు వాని, సత్కవిని
వైద్యుని, మంత్రిని, దంత్రవాదినిన్,
గొండెము చెప్పువాని, రిపుఁ
గూడినవాని, ధనేశునిన్, మహీ
మండల మేలువానిఁ, దన
మర్మమెఱింగిన వాని, నిష్ఠు, నే
ఖండిత మాడరా, దదియె
గండయమా! శరభాంక లింగమా!
- చాటువు

*గతం*

గతం నిన్నటి ప్రస్తుతం కావచ్చు
అయినా మనకు అప్రస్తుతం
- కుందుర్తి, తెలంగాణ

గతం నీకు చూపించే దారి
బ్రతుకుమీద కులం గుర్రాల సవారీ!
- కుందుర్తి, తెలంగాణ

గతం పునరాగతం కాదు.
- కుందుర్తి, తెలంగాణ

గతం ఎన్నడో గడచిపోయింది. దానికి పునర్జన్మ లేదు.
- కుందుర్తి, రజాకారు

గతం గతం నిరుల్లంఘ్యం, నిర్ద్వంద్వం
- బైరాగి, చెప్పనిది

భవిష్యత్తు గురించి ఆలోచిస్తే భయంవేసినప్పుడెవరన్నా గతాన్ని తలచుకొని ధైర్యం తెచ్చుకోక తప్పదేమో, వ్యక్తులయేది, జాతి అయేది, జీవితంలో అయేది, సాహిత్యంలో అయేది.
- కొడవటిగంటి, ఐశ్వర్యం

గడచిన చిక్కులగురించి ఇంకా ఊహలెందుకు?
- రావిశాస్త్రి, నీడలు

గతం అంటే గడిచిపోయింది. యెదుర్కొనే పని లేదు. మర్చిపోతే చాలు.
- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

గతమంతా తోలుబొమ్మలాడిన తెర
వర్తమానం నీ కన్నుల కప్పిన ఒక పొర.
- తిలక్, పాడుపోయిన ఊరు

గతం జరిగిన కల
తీరం చేరిన అల
- వెంకట రంగారెడ్డి, వర్తమానగీతం

గతం నాస్తి కాదు నేస్తం!
అది అనుభవాల ఆస్తి
- నరసింహారెడ్డి, కాలాన్ని కత్తిరించిచూడకు

*గతి*

అడుక్కొని తినేదానికి తిరిసికొని తిరిగేవాడే గతి.
- సామెత

*గతుకులు*

రోడ్డుమీద బండి నడుస్తూంటే అప్పుడప్పుడు గతుకుల్లో పడక తప్పదు. రోడ్డు ధర్మమే అంత. జీవితంలో కూడా అలాంటి గతుకులు తప్పవు.
- రామచంద్రమూర్తి, మనుగడలో మలుపులు

*గత్యంతరం*

ప్రాక్టీసులేని డాక్టరు నర్సు గోళ్లు తీసినట్టు.
- శ్రీరమణ, న్యూసుడి

కుక్కను గుర్రంవలే సాకి దొంగవస్తే రెడ్డే మొరిగినాడట.
- సామెత

*గది*

గదిని బట్టి అందులో నివసించే మనిషిని అంచనా వేయొచ్చు
- వీరేంద్రనాథ్, ఆఖరిపోరాటం

గద్దెలు-మిద్దెలు
త్యాగధనుల కళేబరాల గద్దెలు
నేటి పాలకులకు మిద్దెలు
- దాశరథి, జ్యోతిశ్చక్రం

*గద్యకవిత*

పద్యములు చెప్పగా లేని ప్రాజ్ఞులెల్ల
గద్యములు గట్టుదురుగాక! "గతియ లేని
యమ్మలకు గంజి పానక" మగునుగాక!
- తి.వేం., కలగూరగంప

గద్యము పద్య గౌరవము గాంచదు;
బ్రహ్మరథమ్ము పట్ట రీ
గద్యకవిత్వ చాతురికి
- తి.వేం., కలగూరగంప

*గందరగోళం*

అయితే ఆరిక, కాకుంటే కంది, దున్ని చల్లితే శనగ.
- సామెత

గబ్బిలం

గబ్బిలం ఆకాశాన్ని పడకుండా పట్టుకొని ఉన్నా నన్నట్టు.

- సామెత

గమ్మత్తు

ఆశయాల్లో బతికే మనిషి కుదేలైపోతూ, వేషంతో తిరిగే రాస్కెల్స్ వెలిగిపోడం కూడా గమ్మత్తే!

- ఆదివిష్ణు, చూడుచూడు నీడలు

గమ్యం

ఆడదాని గమ్యం మగాడు. కాని దురదృష్టం, మగాడి గమ్యం మగాడే.

- మారుతీరావు, మళ్లీ మధుమాసం

ప్రశాంత చిత్తం దరహాస వదనం
ప్రేమాలోకం ఎద నిలుపుకొను!
నరుడే నారాయణు డనుకో!
నీ పయనాని కొక గమ్యం తథ్యం.

- హర్షవర్ధన్, గమ్యం

జీవయాత్రకు గమ్యం ముఖ్యం.

- హర్షవర్ధన్, ఒకటి-రెండు-మూడు

గర్భవిచ్ఛేదం

గర్భవిచ్ఛేదమే పాపకారణంబు

- రాయప్రోలు, స్వప్నకుమారి

గర్వం

గర్వానికి గుండె లేదు.

- కుందుర్తి, అజ్ఞాత

గవర్నమెంటు

సెన్సు ఆఫ్ హ్యూమర్ చస్తేనేగాని గవర్నమెంటులో ఉద్యోగం నిలవదు.

- చలం, మ్యూజింగ్స్

ఏ గవర్నమెంటు పోయి- ఏ గవర్నమెంటొచ్చినా ప్రతీ గవర్నమెంట్‌కి ఓట్లు సంపాదించుకునే ప్రయత్నంలోనే కాలము-డబ్బు, ఆలోచన అన్నీ చెల్లిపోతున్నాయి.

- ఆనందారామం, అద్దంలో శత్రువు

ఒక్కొక్కరికి ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క విధంగా అర్థమయ్యే దానిని గవర్నమెంట్ రూలని చెప్పుకోవచ్చు

-నిరుద్యోగి, కార్యాలయబేతాళవిక్రమార్కీయము

గవర్నమెంటు సర్వెంటంటే గవర్నమెంటు సర్వెంటు అని వ్రాసి ఉంటుంది, నిర్వచన ప్రబంధాలలో.

-నిరుద్యోగి కార్యాలయబేతాళవిక్రమార్కీయము

గవర్నరు

ముఖ్యమంత్రిగా ఉన్నవాడి రోజులు బాగోలేక పోతే చచ్చయినా చచ్చిపోతాడు. లేదా ఏదో దిక్కుమాలిన రాష్ట్రానికి గవర్నరయినా అవుతాడు.

- పతంజలి, అప్పన్నసర్దార్

తానొకటి తలచిన గవర్నరొకటి తలచును.

- పతంజలి, అప్పన్న సర్దార్

ప్రజోద్యమం పెరుగుతున్న రాష్ట్రాలకు
మతాన్ని గవర్నరుగా నియమిస్తారు.

- కుందుర్తి, తెలంగాణ

గాజుకళ్లు

కొయ్యబొమ్మలె మెచ్చుకళ్లకు
కోమలుల సౌరెక్కునా?

- గురజాడ, లోకముక్కు

గాటు

లంకపొగాకులో శబరిలంకదే గాటు - పాటిపొగాకులో చేబ్రోలు పొగాకుదే గాటు. ఆడుజాతిలో యోగిని తత్వమే గాటు. మనజాతిలో ప్లీడరుతత్వమే గాటురా బాబూ!

- పానుగంటి, సాక్షి

గాడిద

ఎంత చదువుకున్నా గాడిదెకు బుద్ధి ఉండదు.

- కందుకూరి, తిర్యగ్విద్వన్మహాసభ

కఱవంగ వచ్చునే బలిమి గాడిదకుం
బులితోలు గప్పినన్?

- నాచనసోమన, ఉత్తర హరివంశము

గాడిద అందిట- పాటకి నేను- అందానికి మా అప్పా అని.

- గురజాడ, కన్యాశుల్కం

తమ వంశగౌరవాన్ని గుర్తుంచుకొననివి గాడిదలు మాత్రమే.

- సామెత

ఆడిన మాటలు దప్పిన
గాడిదకొడు కంచుఁ దిట్టఁగా విని యయ్యో
వీడా నాకొక కొడుకని
గాడిద యేడ్చెం గదన్న ఘనసంపన్నా!

- చాటువు

కూసే గాడిద వచ్చి, మేసే గాడిదని చెరిపిందట.

- సామెత

గాడిద కేమితెలుస్తుంది గంధప్పొడి వాసన?
- సామెత

చులకనగా చూడకండి
నాకిచ్చిన గాడిద గుర్తును
అమెరికా వంటి డబ్బున్న దేశంలో
ఒక పెద్దపార్టీ గుర్తు అది.
ఇక్కడ మనం మోస్తున్న దారిద్ర్య
భావానికి అదే నిజమైన గుర్తు.
మన ప్రజలు చూపిస్తున్న
సహనానికి సరైన గుర్తు అదే.
- కుందుర్తి, మీ ఓటు నాకే

బూడిద బ్రుంగవై యొడలు పోఁడిమిఁ దప్పి
మొగంబు వెల్లనై
వాడలవాడలన్ దిరుగ వారును వీరును
జొచ్చొచో యనన్
గోడల గొందులన్ దిరిగి కూయుచునుండెదు
కొండవీటిలో
గాడిద! నీవునుం గవివి కావుగదా? యనుమా
నమయ్యెడున్.
- శ్రీనాథుడు, చాటువు

## గానం

విషయంలేకుండా అందాల్ని కల్పించ గలదు. కనకనే గానం కళల్లో కన్నిటికీ వుత్కృష్టమైనద యింది.
- చలం, మ్యూజింగ్స్

జనానికి గానమేనా ఉండాలి. హాస్యమేనా ఉండాలి. సార్వత్రికమైనవి మరి అట్టేలేవు.
- భమిడిపాటి, తుక్కుముక్కల హక్కు చిక్కు

వినడానికి జనం లేనప్పుడు బయల్దేరే ప్రతీనా దమూ గానమే.
- భమిడిపాటి, గానప్రశంస

నా అమూల్య గానమ్ము వినాలి అంటే
మూగ సినిమాలో వినుడు గుండాగిపోవ!
- మాచిరాజు, అహం

## గాంధీ

ఏ యెండకు నా గొడుగును
ధీయుక్తి నెఱుంగు నాసుధీమణి గాంధీ!
- చెళ్లపిళ్ల, గాంధీఋషి

కత్తులు లేవు, శూలమును గాండివమున్
మొదలే హుళక్కి, నోరెత్తి
ప్రచండ వాక్పటిమనేనియుఁ జూటఁడు,
వైరిమీద దండెత్తఁగ
సేన లేదు, బలహీనము కాయము,
కోపతాపముల్
బొత్తిగ నున్న, యట్టివరమూర్తి మహాబలశాలి
గాంధి...
- పుండరీకాక్షుడు, బలశాలిగాంధీ

గాంధి యల బుద్ధునిం బోలుగాని, శంక
రాదులకు దీటుగాఁ డీతఁ డవతరించు
కతమునఁ బురాణ పురుషులవాక్యమ్ము లవి య
థార్థములుగావు టబ్బె, శ్లాఘ్యగుణుఁ డీతండు.
- చెళ్ళపిళ్ల, గాంధీ ఋషి

## గాయకుడు

తనకెదుట నున్నవారల
ననయముఁ దలలూఁపఁజేయునాతఁడు దా గా
యనుఁ డౌను గాక మాటికిఁ
దనఁ తలఁ దాఁ ద్రిప్పికొనునతఁడు గాయకుఁడే?
- తి.వేం., కలగూరగంప

ప్రతి మనసులోని తీరని కోరికల గీతాలకు
లయ కల్పించినవాడు గాయకుడు
- కుందుర్తి, తెలంగాణ

## గాయని

పాటపాడుతూ ఆమె
కండ్లుమూసుకొన్న దెందుకని?
పాట వినేవారి బాధ
చూడటు మెందుకని!
- మాలకొండారెడ్డి, ఒడిసెలరాళ్ళు

## గాయం

ఆయముంటే గాయమంత సుఖంలేదు.
- చిరంజీవి, బోలోస్వతంత్ర భారత్‌కీ జై

మనస్సుకు పడ్డ గాయానికి మందులూ లేవు, మాకులూ లేవు.
- వేదాంతకవి, ఆకలిమంట

## గాలి

గాలి విమానాన్ని మోస్తుంది. కాని చటుక్కుని అప్పుడప్పుడు వొదిలేస్తుంటుంది, చంటిపిల్లాణ్ణి ఎగరేసి వొదిలేసినట్టు. అప్పుడు గాలిమీద నమ్మకం ఉన్నవాళ్ళకి భయం వెయ్యదు.
- పాప, హెడ్‌మాస్టారు

ఒకగాలి కాలాన్ని పిడికిట్లో బంధిస్తే
మరో గాలి మనుగడనే మళ్లించింది
- జ్వాలాముఖి, కథ అడ్డంతిరిగింది

**గాలిపడగ**

గాలిపడగకు దారం వదిలినకొద్దీ - గాలి పోసుకుంటుంది.

- రామకృష్ణశాస్త్రి, అవునునిజం

**గాలిమేడ**

మనం కొట్టుకొన్న గాలి మేడల్ని
ఏ భూకంపం పడగొట్టలేదు.

- తిలక్, స్వేచ్ఛావిహారం

**గిట్టుబాటు**

దొంగలకీ, లంజలకీ, పోలీసోళ్ళకీ వారసం రాత్రే గిట్టుబాటు జాస్తి.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

సోదరత గిట్టుబాటుగా లేదు మాకు!

- జాషువా, ఇంటిగుట్టు

దివాలా తీసిన వానికి అంతా గిట్టుబాటే
పెట్టుబడిలేని వ్యాపారానికి తట్టుండదు.

- కాళోజీ, దిగులు

**గిన్నె**

చూడబోతే వెండిగిన్నె, తాగబోతే వెలితిగిన్నె.

- సామెత

**గిరజాలు**

పూర్వకాలములో జడలు ఉంచుకొన్న మునీశ్వరులకే గౌరవము- ఈ కాలములో గిరజాలు పెంచుకున్న పడుచువాండ్రకే గౌరవము.

- చిలకమర్తి, గణపతి

**గిరాకీ**

పుట్టుకతోనే మగనలుసు కెంత గిరాకీ!

- జయప్రద, సృష్టిలో తీయనిది

**గీటురాయి**

శీలానికి గీటురాయి మనస్సాక్షేగానీ, శరీరమూ సంఘమూ కావు.

- కళ్యాణ చక్రవర్తి, మొగలిపువ్వు

మనిషి నిజస్వరూపాన్ని కనిపెట్టేందుకు డబ్బు గీటురాయిలాంటిది.

- ధనికొండ, పవిత్రులు

**గీత**

జాతి ఒకటైతేనేం, గీత ఒకటికాదు కదా!

- రామకృష్ణశాస్త్రి, కులాసా

**గుట్టు**

మరీ మాంసం తింటున్నామని బొమికలు మెళ్లో వేసుకుంటే ఎలా ఏదైనా గుట్టు రట్టు కాగూడదు.

- పుల్లాభొట్ల, లంచం

తెలిసినా తెలియనట్టుండు - అవతలోడి గురించి మరికాసింత తెలుస్తాది. వినినా విననట్టుండు ఎదుటోడి గుట్లు మరికొన్ని బయటపడ్తాయి.

- కాంతారావు, వంశధార

అన్ని వృత్తులకంటె ఈ అధ్యాపక వృత్తి చాలా కష్టమైనది. మిగిలిన వృత్తులలో ఎవరైనా తమ అవినీతిని కొంత వరకైనా దాచుకోగలరేమో గాని, అధ్యాపకుల గుట్టుమట్లనీ స్టూడెంట్స్ నడి బజారులో ఉంచుతారు.

- ఆనందారామం, మళ్ళీ వచ్చిన వసంతం

**గుడిమింగేవాడు**

...గుడి మ్రింగువానికి లింగ మూర్బిండి వడెము.

- కూర్మనాధకవి, సింహాద్రి నారసింహశతకము

**గుడిసె**

నిజానికి నీడలు పుష్కలంగా వుండే
మనదేశంలో చెట్లన్నీ గుడిసెలే!

- కుందుర్తి, ప్రగతి

**గుడ్డితనం**

కాననివాని నూంతగొని కాననివాఁడు
విశిష్ట వస్తువుల్
గానని భంగిఁ గర్మములు గైకొని కొందఱు
కర్మబద్ధులై కానరు (విష్ణు)

- పోతన, భాగవతము

అకస్మాత్తుగా డబ్బు వచ్చిపడితే కళ్ళు కనబడవ్

- నరసరాజు, ఈ ఇల్లు అమ్మబడును

గుడ్డివాడి చేతినూలు కదుట్లో పడుతుందో? దిండులో పడుతుందో?

- సామెత

**గుడ్లగూబ**

తల్లిని, తమ్ములనీ పోషించలేని వాళ్లను
మగాళ్ళుగా చూచేవాళ్ళు ఇంకో జన్మలో కాదు
ఈజన్మలోనే గుడ్లగూబలు.

- శివరామశాస్త్రి, డిప్రెషన్-చెంబు

**గుణజ్ఞత**

గుణనిధి! తుమ్మెద కమలము
గుణ మెఱుఁగునుగాక కప్ప గుణ మేమెఱుఁగున్?

- చాటువు

కవితా కన్యక గుణములు
కవికన్న రసజ్ఞుఁ డెఱుఁగుఁ గవి యేమెఱుఁగున్?
భువిలోఁ గన్యకగుణములు
ధవుఁ డెఱుఁగునుగాక కన్నతండ్రేమెఱుఁగున్?

- చాటువు

*గుణం*

అనేకము గుణములుండును. కొన్ని మంచివి కావచ్చును. కొన్ని చెడ్డవి కావచ్చును. లోకమ న్నింటిని కలగలుపుగాఁ జూచునుగాని వేనికి వానిని విడమఱచి చూడలేదు.

- విశ్వనాథ, బద్దన్న సేనాని

గుణం ప్రధానం కాని చదువు ప్రధానం కాదు.

- కందుకూరి, హాస్య సంజీవని

ఆశ్రయించుట, ఆశ్రయింపఁబడుట, యివి భక్తి మార్గస్థుని నెత్తురులోని గుణములు.

- విశ్వనాథ, బద్దన్న సేనాని

ఏ భార్యకుగాని మగడుంచుకొన్న వేశ్యలో గుణాలు ఎప్పుడూ కనబడవు.

- రాజమన్నారు, నిష్ఫలం

*గుణవంతుడు*

గుణవంతుఁడని పేరుపడుట దుర్లభము. లాఁతి విధము సులభము.

- చిన్నయసూరి, మిత్రభేదము

*గుండు*

పోయిన మగడు పోయినా పొన్న కాయలా గుండు కుదిరింది.

- సామెత

*గుండె*

రాయిమడ్సుల గుండె బహుగెట్టి, జనం నల్ల రాయి గెట్టంటారుగాని అంతా వుత్తది.

- మా గోఖలే, రాయి మడుసులు

ప్రేమకు నిలయం, ఆలయం గుండె. మేధకు నెలవు, విచక్షణ శక్తికి కొలువు మెదడు. అందుకే గుండెకు పైనే ఉంటుంది మెదడు.

- బుచ్చిరెడ్డి, తేనెకోరని తుమ్మెద

కొండంత చిటీ బస్సుందిట. గాని, డయివేరు నేకపోతే అడుక్కుదల్లు! అలాగ్గె, కొండంత మడి సున్నా ఆడికి గుండెకాయ నేకపోతే ఆడు నిల బడ్డు కలబడ్డు; కండబలవేఁకాదు కలేజా కూడా ఉండాల!

- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

తుపాకీలో గుళ్ళుంటేనే సరిపోదు. గుండెలు కూడా ఉండాలి.

- గంగాధరరావు, ఇదా మనచరిత్ర?

*గుండెదిటవు*

మనస్సులో ఉన్న భావాన్ని సూటిగా చెప్పగలిగే గుండెదిటవు చాలా కొద్దిమందికే ఉంటుంది.

- సుమనశ్రీ, నేనూ ఆవకాశవాదినే!

మంచిగా ఉండాలంటే గుండె నిబ్బరం చాలా ఉండాలి.

- రావిశాస్త్రి, అల్పజీవి

*గుండెపోటు*

ఒకసారి గుండెపోటు వచ్చిన వాళ్ళు ఎప్పుడో ఒకప్పుడు చెప్పాపెట్టకుండా పోతారుగానీ ఖ్ల కాలం వుండిపోరు.

- పతంజలి, అప్పన్నసర్దార్

*గుమాస్తా*

గుమాస్తాలు తలుచుకుంటే ముఖ్య కార్యదర్శులే ఏమీ చేయలేరు.

- బాపిరాజు, కోనంగి

గుమాస్తా ప్రాణికి ఒకటవ తేదీ అంటే మరణ శిక్ష పడేరోజు.

- సూర్యారావు, ఇల్లు కూలింది

*గుంపు*

ఈనాడు, మత బోధకుడికీ, దేశ నాయకుడికీ, కవికీ అందరికీ వెనక ఓ గుంపు కావాలి. వాళ్ల నించి ఆ గుంపుకి ఏమీ వొరగదు. వొరిగిస్తా మని ఆశలుపెట్టి చేర్చుకుంటారు.

- చలం, మ్యూజింగ్స్

*గురక*

నిశ్శబ్దంలో నిద్రించిన సైనికుల గురక
చచ్చిన జీవుల మొరలా వుంది.

- తిలక్, సైనికుడి ఉత్తరం

*గురుకుల విద్య*

బెంచీ లక్కఱలేదు, గేమ్సు మొదలౌ
ఫీజుల్ విసన్‌రావు, పౌ
మ్మంచు న్నిర్ధనుఁ ద్రోసివుచ్చరు గురుల్,
ప్యాసైననే లాభం మిందంచు న్నేమములేదు,
మీ చదువునం
దాలోక మీ లోకమున్
గాంచన్ వచ్చెడి నార్యులార! మిము ద్రొక్కన్
వచ్చు నెక్కాలమున్.

- తి.వేం., కలగూరగంప

*గురుత్వం*

మూడు పుట్ల చెవిటి వానికి, ఆరుపుట్ల చెవిటి వాడు ఆలోచన చెప్పినట్లు

- సామెత

కోరి ప్రత్యక్ష మన్మథగురువ వైతి
కోరక పరోక్ష వైరాగ్య గురువ వైతి
లంజియా! యెంతక్రిందికి గుంజినావొ
యంతపైకిని జనుమార్గ మరసినావు.

- విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము

గురువు
నెలంతలా రాజనీతులు నేర్పువారు?
- చిలకమర్తి, గయోపాఖ్యానము

అత్తవల్ల దొంగతనం, మగనివల్ల రంకుతనం నేర్చుకొన్నట్లు.
- సామెత

గురువులు తమకును లోఁబడు
తెరువులు సెప్పెదరు
- పోతన, భాగవతము

గురువుల ఉపదేశం గురువులే మరవకూడదు.
- గురజాడ, కన్యాశుల్కం

ఆకాశమంత ఎత్తులో వుండిన ఈ గురుశబ్దము భూలోకంలో పడి, అటుపై చిత్రసీమలో స్వైర విహారం చేసి, ఆ తరువాత బస్‌స్టాండ్‌లను ఆశ్రయించి, అక్కడ కూడా తలదాచుకోలేక పాతాళములో పడిపోయిన ఈ రోజుల్లో "గురు శబ్దము" వెక్కిరింతగా వినిపిస్తుంది, ఎవరైనా పలుకుతూంటే.
- పులికంటి, శివపూజ

వేయిమంది అగస్త్యభ్రాతలకు గురువనిపించుకో వడం కన్న భీష్మునివంటి వొక్కనికి గురువనిపిం చుకోవడమే గురువునకు సంతోషదాయకము.
- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

గురుని శిక్ష లేక గుఱు తెట్లు కల్గునో
అజుని కైన వాని యబ్బకైన
తాళఁపుఁజెవి లేక తలుపు పెట్టు లూడునా?
- వేమన

గురుశిష్యులు
జీతము పుచ్చుకొనుటచేత నుపాధ్యాయులు సేవకు లగుచున్నారు. వేతన మిచ్చుచుండుట చేత విద్యార్థులు ప్రభువు లగుచున్నారు.
- కందుకూరి, గురుశుశ్రూష

గురువు లెప్పుడును శిష్యులకు తమ వ్రేలితో స్వర్గమునకు త్రోవ చూపుచుందురు. కాని తాము మాత్రము స్వర్గమార్గముమాట యటుం డఁగాఁ దాము న్న యీ లోకమునే త్రోవగానక గోతిలో పడుచుందురు.
- కందుకూరి, రాజశేఖర చరిత్రము

గుర్తింపు
తన స్వాతంత్ర్యం హెచ్చటం ఏ ప్రాణి గుర్తిం చదు?
- కొడవటిగంటి, చదువు

పోలీసువాళ్ళని ఒక్కొక్కప్పుడు స్వంత పెళ్ళాలూ, పిల్లలూ కూడా గుర్తుపట్టలేరు.
- భరాగో, నాకీ ఉద్యోగంవద్దు

గుర్తు
పెండ్లినాటి సౌఖ్యం లంకణాలనాడు
తలచుకొన్నట్లు
- సామెత

ప్రకృతి విశ్వవీధిలో నేర్పే ఓనమాలు
మానవుని అజ్ఞానమునకు ఆనవాలు
- వసంతరావు, ఉదయకిరణాలు

మరిచిపోయిన సామ్రాజ్యాలకు చిరిగిపోయిన జెండా చిహ్నం.
- శ్రీశ్రీ, గాంధీజీ

ఈ రోజుల్లో ఛితికిపోయిన మనిషంటే ఎవరికీ గౌరవం ఉండదురా. చేసిన త్యాగాలన్నీ ఎవరికి గుర్తుంటాయి?
- పాప, రామరాజ్యానికి రహదారి

మనం విడిపోయే ముందు... ఇద్దరిమధ్యా మర్చిపోలేనంతగా నిల్చిపోగల గుర్తుకోసమే తాగేను...
- వివేకానంద, అమ్మ

ఉపనయనమునాఁటి మాట యున్నది సుమతీ.
- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

గుర్రం
రోజులు చాలకపోతే మనుషలు వరన్నం బదులు జొన్నకూడో, నాగజెముడు గుబ్బలో తిన్నా తింటురుగాని గుర్రం పచ్చిగెడ్డి మానేసి ఎండుగెడ్డి తినమంటే తింటుందా?
- మా గోఖలే, బండిరాముడి పెళ్లాం

గుర్రం తనతోకతో తానే విసురు కొంటొంది గాని, చావడిలో గుర్రాల కన్నిటికీ విసురు తుందా?
- సామెత

రాజుగారి గుర్రమయితే మాత్రం తొక్కితే కాలు నొవ్వదూ?
- సామెత

గులాం
మనపాడి వెనుక లేదను
పెనుగొంటెగులామునోరు పీతిరిగుంటే.
- కవి చౌడప్ప, చౌడప్పశతకము

ఇత్తడి పుత్తడి యగునా?
తొత్తది నగలెన్ని యిడిన దొరసా నగునా?
యుత్తమకులుఁ డౌనా? దొ

లత్తునఁ దిరిగినను గులాము గులామే!

- అడిదము, చాటువు

*గూండా*

ఊరికి ఒక్కడే గూండా ఉండాల, ఆడు పోతే సోడే అవాల.

- రావిశాస్త్రి, బంగారిగాడికత

*గృహస్థు*

గృహస్థుడి బాధలు ఎవరికి తెలుస్తాయి? ఇందులో తమాషా ఏమిటంటే అనుభవించే వాళ్లు బాధలని తెలుసుకోలేరు. అవ్యక్తములో పడి కొట్టుకలాడుతూ ఉంటారు.

- సరస్వతీదేవి, తనదాకావస్తేగాని

*గెలుపు*

యే కొంపలూ తిరక్కపోతే కేసులు గెలవడం ఎలాగ?

- గురజాడ, కన్యాశుల్కం

యే మాలకూడూ లేకపోతే కేసులు గెలవడం యలాగ?

- గురజాడ, కన్యాశుల్కం

ఏవైపున తక్కువమంది చచ్చిరో వారు గెలిచితి మనుకొనిరి.

- విశ్వనాథ, నందోరాజా భవిష్యతి

బంటుతనముగాదు బలముతోఁ గట్టిఁగా
వెంటనుండి మనసు వెతలఁబఱచు
నింట గెల్చి రచ్చ నిల గెల్వవలెనయా

- వేమన

వేసినట్టల్లా వెయ్యనిస్తే వెఱ్ఱివాడే గెల్చాడ న్నట్లు...

- కాళ్లకూరి, సంసారనటన

కోర్టు కెక్కి చూసిన ప్రతి ఉద్యోగీ నెగ్గాడు. ప్రభుత్వం ఓడింది.

- నిరుద్యోగి, యమలోకంలో

*గేరు*

గేర్లు ఎలాగ మార్చాలో ఎవరైనా ఒకసారి చెప్పేస్తే హెలికాప్టరుగాదు - దాని అమ్మా బాబునైనా నడిపేవొచ్చునండి.

- పతంజలి, అప్పన్నసర్దార్

*గొంగడి*

గొంగడిలో భోజనము చేయుటకుఁ గడంగిన పుడు వెంట్రుకలకు వెరువరాదు.

- సూరి, నారాణి

అంగీలు పచ్చడంబులు
చంగావి మెఱుంగుసేలు సరిగంచుల మే
ల్లుంగీలు చీరలున్ నా
గొంగడి సరిపోలవన్న! గువ్వలచెన్నా!

- గువ్వల చెన్న శతకము

*గొడవ*

గొప్పోళ్ల ఇళ్లల్లో బోల్డు గొడవ లుంటాయి.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

*గొడ్డు*

గొడ్డు గోతిలో పడితే తలోకమా టంటారులే.

- కొంతారావు, దగాపడిన తమ్ముడు

కుడితెడితే సేతుల్నాకే సొమ్ములూ ఉంటాయి. కూడెడితే కరిసే కుక్కలూ ఉంటాయి.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

*గొడ్రాలు*

గొడ్రాలికేం తెలుసు, బిడ్డనొప్పులు?

- సామెత

*గొప్ప*

నా గొప్ప నే చెప్పుకోకూడదు గదా?

- గురజాడ, కన్యాశుల్కం

లోకములో మనుష్యుడు గొప్పవాఁడయిన కొలఁదిని గొప్పతనముతోఁగూడ కష్టములు పెరుగుచుండును. భక్తులయినవారు స్వప్రయోజన పరులయి స్వలాభముకొఱ కాశ్రయించి పీడించుచుందురు; అసూయాపరులైనవారు పరోత్కర్షమును సహింపలేక యపవాదములువేసి బాధించుచుందురు.

- కందుకూరి, సత్యరాజా పూర్వదేశయాత్రలు

ఊళ్లో యెక్కడనో ముండనుంచుకొన్నవానికంటె యింటి యెదుట నుంచుకొన్నవాఁడు మిక్కిలి గొప్పవాఁడు.

- చిలకమర్తి, యమధర్మరాజు కచ్చేరి

ప్రతివాఁడు తన పని తాను చేస్తూ అది గొప్పగానే ఉందనుకొంటాడు.

- విశ్వనాథ, ముగ్గురు బిచ్చగాళ్లు

దెబ్బతిన్నా యెదటివాణ్ణి కూలగొడితే అది గొప్ప.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, ఆత్మబలి

నిక్కమైన మంచి నీల మొక్కటి చాలు
తళుకు బెళుకు రాలు తట్టెఁ డేల?
చదువఁ బద్య మరయ చాలదా యొక్కటి?

- వేమన

వండినమ్మకు ఒక కూరే, మధూకరంవానికి పది కూరలు.

- మహీధర, కత్తుల వంతెన

గొప్పకున్న ఆకలి ప్రేమకు లేదు, ప్రేమ తిన లేదు, సేవ చేస్తుంది. గొప్ప సేవని తింటుంది. చావుని చూచి భయపడనిది గొప్ప ఒక్కటే. ఎందుకనో తెలుసా? చచ్చింతర్వాత గొప్ప ఇంకా గొప్పదౌతుంది.

- పిచ్చేశ్వరరావు, వెర్రికాదు, వేదాంతం!

పరులఁ బూజించువాఁడెపో యొరులచేత
నతివిశేషంబుగాఁ బూజ లందువాఁడు.

- తి.వేం., మృచ్ఛకటికము

ఒక గొప్పవాఁ డొకనిని మంచివాఁ డన్నచో ఎవ్వని వాక్కు భిన్నముగా లేచును? ఎవ్వని నోరు స్తుతివాక్యముల కొరకు తడవుకొనును?

- కందుకూరి, రాజశేఖర చరిత్రము

పడిన తరువాత లేచుట గొప్పతనముగాని యెప్పుడును పడకుండుట గొప్పతనముకాదు.

- కందుకూరి, రాజశేఖర చరిత్రము

ఆత్మగౌరవము కావాలి కావాలని ఉపన్యాసా లిచ్చే వారే కాని సమయము వచ్చినప్పుడు నిలుపుకొనేవారు లేరు.

- చిలకమర్తి, స్వగౌరవ రక్షణము

నువ్వేం తాలూక్కచేరి బంట్రోతువా, పోలీసు జవానువా, మున్చీబువా, కరణానివా నీకు దడ్చే టందుకు?

- చిలకమర్తి, బలవంత బ్రాహ్మణార్థం

ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటి కామాటలాడి యన్యుల మనముల్
నొప్పింపక తానొవ్వక
తప్పించుక తిరుగువాఁడు ధన్యుఁడు సుమతీ!

- బద్దెన, సుమతి శతకము

గొప్పతనం అనేది యీరోజుల్లో మనం ఇచ్చుకొంటే వచ్చేది.

- కృష్ణరావు, పాపికొండలు

కష్టాల్లోనే మనిషి గొప్పతనం బయటపడుతుంది. పుత్తడో, ఇత్తడో పుటంబెట్టినప్పుడే తేలేది.

- సుంకర వాసిరెడ్డి, అపనింద

తన లోపాలను గ్రహించేకంటే ఎదుటివాని బలహీనతనలను బలంగా తలవడం గొప్పతనంగా చెలామణి అవుతూ వస్తుంది.

- ఆళ్వారుస్వామి, ప్రజల మనిషి

ఈనాడు లోకం నుంచి ఎంతదూరం పారిపో గలిగితే అంత గొప్పకవి కావచ్చు

- నార్ల, నవకవి

ఇచ్చునదె విద్య, రణమునఁ
జొచ్చునదే మగతనంబు, సుకవీశ్వరులన్
మెచ్చునదె నేర్పు, వాదుకు
వచ్చునదే కీడు సుమ్ము వసుధను సుమతీ!

- బద్దెన, సుమతి శతకము

తన కలిమి యింద్ర భోగము
తన దుఃఖమె సర్వలోక దారిద్ర్యంబౌ
తన చావు జలప్రళయము
తను వలచినయదియె రంభ తథ్యము సుమతీ!

- బద్దెన, సుమతి శతకము

ఆఁకొన్న కూడె యమృతము
తాఁకొందక నిచ్చువాఁడె దాత ధరిత్రిన్
సోఁకోర్చువాఁడె మనుజుఁడు
తేఁకువ గలవాఁడె వంశతిలకుఁడు సుమతీ!

- బద్దెన, సుమతి శతకము

చెడ్డ అలవాట్లకి దూరంగా ఉండేవాడు లోకం దృష్టిలో అసమర్థుడు! పిరికివాడు! అందుకే చాలామంది ఏదో గొప్ప కోసం జల్సాలన్నీ అలవాటు చేసుకుంటారు.

- రంగనాయకమ్మ, పేకమేడలు

గప్పాల పోతిరెడ్డికి, ముప్పైమూడు దొడ్లు, మూడు ఎడ్లు.

- సామెత

మన సొంత వంట ఇతరులకు పెట్టి సంతోష పెట్టటం మనిషి చేసే గొప్పపనుల్లో ఒకటి.

- కొడవటిగంటి, అనామిక

ఈ దిక్కుమాలిన దేశంలో గొప్పవాళ్లు చెయ్యటాన్నిబట్టి పనులకు గొప్పతనం వస్తుంది గాని, గొప్పపనులు చెయ్యడాన్నిబట్టి గొప్పతనం రాదు.

- కొడవటిగంటి, ఎండమావులు

ఆఫీసులలో పనిని ఎప్పుడూ కర్రను తూచినట్లు తూచుతారు. ఎన్ని క్వింటాళ్లు అయితే అంత గొప్ప పని.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

వస్తువులను వినియోగానికి కొనుక్కునేవాడు మామూలు మనిషి, మారు బేరానికి కొనుగోలు

శక్తిని పెంచుకునేవాడు ఆ. మామూలు మనిషి కన్నా గొప్పవాడు!

- కొడవటిగంటి, ఐశ్వర్యం

లోటులేనివాడు గొప్పవాడు. ప్రతివాడికీ ఏదో లోటు ఉంటుంది. ఉండి తీరుతుంది. అందు కని 'ఎవ్వడూ గొప్పవాడు కాడు'.

- భమిడిపాటి, కచటతపలు

గొప్పవాడయ్యే గుణాలు ఎవడి దగ్గరున్నాయో వాడల్లా పోలీసు వాళ్ల చేత వళ్లు మాలిష్ చేయించుకోవాలి.

- నంది, వాన వెలిసింది

దారులలోకెల్ల జమీందారి, చెంబులలోకెల్ల జారి, రోగాలలోకెల్ల మారి, సూత్రాలలోకెల్ల రోరి, క్షేత్రాలలోకెల్ల పూరి, భక్ష్యాలలోకెల్ల బూరి.

- పానుగంటి, కంఠాభరణము

గొప్పవాళ్లు కష్టసుకం ఒక్కనాగే అన్భూగించే స్తారు.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

వొచ్చినాడు గొప్పోడైతే ఎందుకొచ్చేది సెప్పడు, మనం అడిగేవరకూ.

- బీనాదేవి, డబ్బు!డబ్బు!!డబ్బు!!!

గొప్పోళ్ల గోత్రాలన్నీ గోప్యంగానే ఉంటాయిలే.

- చిరంజీవి, బోలోస్వతంత్ర భారత్‌కీ జై

ప్రేమించటం కంటే... ప్రేమించబడటం గొప్ప.

- సంధ్యాదేవి, ప్రేమకు హారతి

సంబంధాలకంటె అనుబంధాలు గొప్పవి.

- కౌసల్యాదేవి, హైందవి

మనిషిగా పుట్టటం గొప్పకాదు. నిజమైన మని షిగా బతకటమే చాలా గొప్ప!

- భాస్కర్, క్లైమాక్స్

మంత్రం కన్నా నమ్మకం గొప్పది. నమ్మకం కన్నా నిజాయితీ ఇంకా గొప్పది.

- వీరేంద్రనాథ్, తులసి

*గోడ*

ఊరి మధ్య దేవాలయం గోడ
దేవుడి పేర ప్రజలపై నిరంతరం జరిగే
మానభంగాల్ని వీక్షిస్తూ
పూజార్లను రక్షిస్తున్న సాంప్రదాయపు గోడ

- నగ్నముని, భవిష్యత్

*గోడ దూకుడు*

'హార్స్ ట్రేడింగ్' అనే గోడ దూకుడు వ్యవహారం మన తొట్టతొలి మంత్రివర్గ నిర్మాణం తోనే ఆరంభమైంది కదా.

- చిరంజీవి, బోలో స్వతంత్ర భారత్‌కీ జై

*గోరు*

నేను తుపాకులకయినా కత్తులకయినా వోపగ లను గాని ఆడవాళ్ళ గోళ్ళతో వోపలేను.

- కందుకూరి, అసహాయశూర ప్రహసనము

*గోరు ముద్ద*

మొదట్లో గోరుముద్దలు తినాల్సిందే ఎవరైనా. ఆ తరువాతనే జీర్ణశక్తినిబట్టి తినటం.

- చిరంజీవి, బోలో స్వతంత్ర భారత్‌కీ జై

*గోవు*

గోవుమాలచ్చిమికి కోటి దణ్ణాలు
మనిషికైనా లేని మంచి పోకిళ్లు!

- నండూరి, గోవుమాలచ్చిమి

*గౌరవం*

అవగత శబ్దశాస్త్రచయులైన మహాత్ములు
పండితోత్తముల్
భువనతలంబునం దధికపూజ్యులు; వార
లటుండఁ, గూటికై
నవనవకల్పనా విధి చణత్వము దోఁప
నబద్ధమాడు నీ
కవు లిల దానపాత్రులయి గౌరవమందుట
చూడఁ జిత్రమౌ.

- చాటువు

కార్యదీక్ష సహనశక్తి కలిగిన చాలదు చాలదు పేరు ప్రతిష్ఠలు వడసిన వారలకే గౌరవాలు.

- కాళోజీ, ఖర

బడాయి లేకపోతే సంఘంలో ఈ రోజుల్లో గౌరవం వుండదురా! మన అంతస్తు యెంత గొప్పదని చెప్పుకుంటే, అంత గౌరవం లభిస్తుం దన్నమాట.

- ముద్దంశెట్టి, అంతా మోసం

ఈ కాలమున వృత్తివలన వచ్చెడు గౌరవాగౌర వములు లేవు. ఏ వృత్తిచేసినను నింగ్లీషు విద్యలో నధికుడైనచో నతనిని గౌరవింతురు.

- విశ్వనాథ, తెఱచిరాజు

రాయటం మానిన కవికి గౌరవం హెచ్చు చచ్చింతరవాత మరీగొప్ప

- చలం, మ్యూజింగ్స్

అతిథి కడునల్పుఁడైన నత్యధికుఁడైన

నింటి కేతేరఁ బ్రియమందు నెవ్వఁడేని
వాని గౌరవ మది గౌరవంబు కాని
కాదు గౌరవ మాకారగౌరవంబు
- శ్రీనాథుడు, కాశీఖండము

కల్లు నిచ్చెడి చెట్లకుఁ గల్గు గౌర
వంబు పెలవానికిని లేదు, వజ్రి మ్రోల
గజ్జె కట్టెడి బోగంపు గరితకున్న
పలుకుబడి కానరా దెట్టివారి కిందు.
- త్రిపురనేని, సూతపురాణము

లోకము మూర్ఖబహుళ మగుటచే గడ్డములుఁ
గావిగుడ్డలు బోడితలలు బూదిపిండికట్లు
తులసి పూసలు మున్నగునవి నరునకు గౌరవ
ముం దెచ్చిపెట్టె.
- చిలకమర్తి, కర్పూరమంజరి

## గ్యారంటీ

మాట మిగలకుండా ఉద్యోగంలో మిగిలితే
బ్రతికున్నంతకాలం పింఛను
బ్రతక్కపోయినా గ్రాట్యుటీ
మీకందకపోతే మీ చంటివాళ్లకు గ్యారంటీ
- స్వర్ణరాజ, గాడిదలు కావాలి!

## గ్రంథకర్తృత్వం

స్వతంత్రజీవనోపాధులలోఁ గన్నమువేయుట తరువాత గ్రంథకర్తృత్వమే యూరివారి ధనమును హరించుట కుత్తమ మైనది.
- పానుగంటి, విప్రనారాయణ

## గ్రంథ పరిచయం

అన్ని పొత్తమ్ములకు మొద లెన్ని పుటలో
నిండు నభినందనములతో దండు గకట!
యొక్కఁ డేనియు నిజ మగు నూహ వ్రాయఁ;
డట్లు వ్రాసిన నద్దాని నడఁతు రొకట.
- తి.వేం., పాణిగృహీత

## గ్రంథ పరిశీలన

సందేహం ధృఢపడి ఆత్మప్రత్యయం కలగనప్పుడుగాదా గ్రంథ పరిశీలన?
- సుబ్రహ్మణ్యశాస్త్రి, రాజరాజు

## గ్రహచారం

రాత రాజ్యమేలుమని ఉంటే, గ్రహచారం గాడిదలు మేపమని వున్నదట.
- సామెత

## గ్రహం

నిన్న నడచినట్టి గ్రహం
నేడు బూడిదై కూలును
- ప్రయాగ, ఆత్మఘోష

చచ్చినంత మాత్రాన గ్రహాలు వదిలేస్తాయనుకున్నారు గావోలు! పొరపాటు.
- కొడవటిగంటి, బ్రతుకు భయం

## గ్రహబలం

గ్రహబలంపైన మీరు ఆధారపడటం ఏవిటండి? అవే మిమ్మల్నిబట్టి తిరగాలి.
- బుచ్చిబాబు, దొంగ దొరికాడు

ఈ గ్రహాలుకూడా తమ పేర్లు తిన్నగా చెప్పవు. వకరితో ఒకలాగునా మరి వకరితో మరివకలాగునా చెపుతవి.
- కందుకూరి, హాస్యసంజీవని

## గ్రహింపు

తమ మూర్ఖత్వం గ్రహించిన వాళ్లెవరూ మూర్ఖులు' కారు.
- మహీధర, కత్తుల వంతెన

## గ్రామ(జీవిత)ం

గ్రామ జీవితం ప్రశాంతమంటారుగానీ అందులో పోటీలకెప్పుడూ తీవ్రమైన అవకాశాలు ఉండనే ఉంటాయి. పోటీలేనిదే వృద్ధిలేదు.
- సుబ్రమణ్యశర్మ, బంకోలా

గ్రామాలు పట్టణాలకు ఏవిధంగానూ తీసిపోవు. క్రౌర్యం, దౌర్జన్యం, అత్యాచారం, దగా, ఈర్ష్యాసూయలు, నైచ్యం, అవినీతి, అసత్యం, వ్యభిచారం, భీరుత్వం - ఒక్కటేమిటి మానవ జీవితంలో ఏహ్యమైనవీ, దూష్యమైనవీ, అవాంఛనీయమైనవీ అని వేనివేనిని గర్హిస్తామో అవన్నీ అక్కడ కూడా కానవస్తాయి. కాకపోతే అజ్ఞానం, అమాయకత్వం అనే ముసుగులో మన పెద్దలు వాటిని దాచిచూపుతుంటారు.
- కాళీపట్నం, సేనాపతి వీరన్న

## గ్రామీణుడు

గ్రామీణులు స్వచ్ఛంగా తెల్లగా ఉంటారు.
వాళ్లు జీర్ణించుకున్న హింసలు
నీకూ, భవిష్యత్తుకూ ప్రేమ రాయబారాలు నడిపే
హంసలు
- కుందుర్తి, తెలంగాణ

బయట నువ్వెంత పెద్దవాడివైనా, నీకెంత పలుకుబడి వున్నా, స్థానికాధికారులతో మంచిగా

వుండకపోతే- బ్రిటీషు వాళ్ళు ఏర్పాటు చేసిన మెషినరీ - నిన్ను చాలా ఇబ్బంది పెడుతుంది.
- కాళీపట్నం, శాంతి

గ్రాహ్యం

సిద్ధమయినట్టి యన్నంబు, చేతికందినట్టి
పరిపక్వ ఫలమును, నంగనామ
ణీప్రథమయౌవనంబుఁ, బండితు లుపేక్ష
సేయఁగా రాదు. చేసినఁ జెడునుఁ మీఁద.
- తి.వేం., శ్రవణానందము

తక్కువ జాతియందు వనితామణి
యున్నను, నీచుమర్త్యునం
దెక్కువ విద్య చొప్పడిన, నెంగిలిచోట
సువర్ణ మబ్బినన్,
దక్కక పెన్విషంబున సుధారస
ముండిన గ్రాహ్యమంద్రు
- అనంతుడు, భోజరాజీయము

గ్లామరు

ప్రచారం చేసేది ప్రాచీన సంప్రదాయాలే అయినా గ్లామరుండాలికదా?
- ఆనందారామం, ఇదా భారతం?

# ఘ

ఘనకార్యం

రంభ చెక్కిలి కొట్టి రాట్నం తెచ్చినట్లు.
- సామెత

ఘనత

జానెడు కవితకు మూరెడు పేరు.
- శ్రీరమణ, న్యూసుడి

ప్రభుత్వానికి అప్పగిస్తే పరీక్షల నాటికి
పాఠ్యగ్రంథాలు అచ్చు అయినాయట!
- శ్రీరమణ, న్యూసుడి

వెయ్యిబార్ల పూజారి!
- శ్రీరమణ, న్యూసుడి

ఆమరణ నిరాహారదీక్ష దేముంది?
నేను అరవైసార్లు చేశానన్నాట్ట.
- శ్రీరమణ, న్యూసుడి

ప్రభువులు పరిగ్రహించిన ప్రజలు ఘనులు.
- కుమార ధూర్జటి, కృష్ణరాయ విజయము

లీల గుడి మ్రింగువానికి లింగమెంత?
- చిలకమర్తి, గయోపాఖ్యానము

పిట్ట కొంచెము కూఁత ఘనమన్నట్టు క్షుద్ర
జంతువునకు సయితము పెద్దనో రుండవచ్చును.
- చిన్నయసూరి, మిత్రభేదము

మన ఘనతలు మన ప్రవర్తనములఁ బట్టి యుండునుగాని మన జన్మములఁ బట్టి యుండవు.
- పానుగంటి, చూడామణి

దాసిదాని నధిక్షేపించుటలో నందఱు ఘనులే-
తలపైఁ గట్టిమోఁ వున్నవాఁడే ఘనుఁడైనప్పుడు
కిరీట మున్నవాని మాట చెప్పవలయునా?
- పానుగంటి, చూడామణి

సామాన్యపు కత్తితో పొడుచుకోవటం పౌరుషం కాదు. పొడుచుకుంటే వజ్రాలు చెక్కిన మన కత్తితోనే పొడుచుకోవలెను.
- కందుకూరి, హాస్యసంజీవని

మా వాళ్ళంతా నాకు నెపోలియన్ ఆఫ్ యాంటినాచ్ అని పేరు పెట్టారు.
- గురజాడ, కన్యాశుల్కం

ఋది నేను రిఫార్మర్లో అచ్చు వేసేటప్పటికి టెన్నిసన్ చూసి గుండె కొట్టుకున్నాడు.
- గురజాడ, కన్యాశుల్కం

చెప్పఁదగు కార్యమొకటి మానినది లేదు.
- చిలకమర్తి, ప్రసన్నయాదవము

వేయి కనులతో నేడ్చును వేల్పుఱేఁడు
- చిలకమర్తి, ప్రహ్లాదచరిత్రము

కలలోనైనా మేల్కొన్నవాణ్ణి చూడ్డం
ఘన విషయం కాదా ఈనాటి లోకంలో!
- దాశరథి, పునర్నవం

ఆయన గాలిని బేసును,
దోయముతో నఱకుఁ, బొగలతో గోడ లిడున్
- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

ఘనుడు

ఓటిచ్చిన వాడికంటే ఓట్రిచ్చిన వాడే ఘనుడు.
- శ్రీరమణ, న్యూసుడి

తెలిసినవాడు విద్వాంసుడు కాడు.
తెలిసినట్లాచరించువాడే ఘనుడు.
- పానుగంటి, సాక్షి

దుఃఖమును అణుచుకోగలిగిన వానికంటె

సంతోషాన్ని అణుచుకోగల్గినవాడే ఘనుడు.

- సామెత

మనసు స్వాధీనమైన ఘనునికి మరి మంత్రతంత్రము లేల?

- సామెత

ఘరానా

పరాయి సొమ్ములు అమ్మడం ఘరానాకి లోపం; కాని, తన భార్య నగలు అమ్మడం తగు మనుష్యుల తరహా (తెలుసునా)

- ముద్దుకృష్ణ, ఆడవాళ్ల తెలివి

ఘోష

త్యాగరాజు పాట దాక్షిణాత్యుల నోట
బాషలేని వెర్రిఘోష కాదె!

చరద, నాట్యగోష్ఠి

ఇంటికప్పు తెగఁగాలి, నెత్తిమీద పడుచుండఁగా, నిఁక నేమి ఘోషా?

- వేంకటరాయశాస్త్రి, బొబ్బిలియుద్ధము

మీ పెండ్లామునని పేరు పెట్టుకొని మూసి వాయనపు ముత్తైదువలాగున నుండమంటారా యేమిటి?

- కొచ్చెర్లకోట, అపవాదతరంగిణి

# చ

చక్కదనం

పాత గోడకు పూత చక్కన. కోతి ముండకు రాత చక్కన!

- పూర్ణానందం, కాంపాన్వేషణ

చక్కదనము చెప్పుకునేందుకు, వర్ణించేందుకు, వీలైతే పాడుచేసేందుకు కాని, పెళ్ళికి కాదండి.

- బుచ్చిబాబు, తీసినతెర

చక్రం

వ్యాపారుల రూపాయిలే రాజ్యానికి చక్రాలు

- ఛాయారాజ్, శ్రీకాకుళం

చంచలం

దొరల చిత్తం, చెట్ల నీడ నిలకడ లేనివి.

- సామెత

చట్టం

చట్టాలవల్ల పనులు సానుకూలమవుతాయా? చిత్త శుద్ధితో దీన్ని అమలుపరిచేదెవరు?

- చిరంజీవి, బోలో స్వతంత్ర భారత్‌కీ జై

ఏ చట్టం వచ్చినా తత్సంబంధీకులకు ముందెత్తుగానే ఉప్పందుతుంది.

- చిరంజీవి, బోలోస్వతంత్ర భారత్‌కీ జై

'చట్టం - నేరం' అనే విశేషపదాలు ఎటుగా మొగ్గినా మొగ్గే తత్వం గలవి!

- మా గోఖలే, దొంగవాళ్ళు

సౌకర్యం లేని చట్టానికి ప్రజలు కట్టుబడరు.

- గంగాధరరావు, పెండింగ్ ఫైలు

శాసనాలు యెక్కువైయ్యాయంటే కట్టుబాట్లు హెచ్చయ్యాయన్నమాట.

- కాంతారావు, నిజాయితీ కథలు

మనకోసమే చట్టాలుగాని వాటికోసం మనం కాదు గదా.

- చలసాని, పుణ్యభూమి

చట్టాలకున్న లొసుగులు తప్పించుకునే వారికి ముందే తెలుస్తాయి.

- వసుబాబు, ఆద్యంతాలూ - ఆంతర్యాలూ

చదువు

ఈ దేశంలోని యువతరం చచ్చుపడిపోవడాని కిక్కడి చదువే చాలావరకూ కారణం.

- వసుంధర, తపోభంగం

నాకొడుకునకుఁ జదువుకొనుటకుఁ బూర్వము తొండకు బల్లికి భేదము తెలియును. ఇప్పుడు గాడిదకు గుఱ్ఱమునకు భేదము తెలియకుండనున్నాఁడు.

- పానుగంటి, మాలతీమాల

స్వభావాలను చదువులు మార్చలేవు.

- కౌసల్యాదేవి, శాంతినికేతన్

చదువు ఉపయోగం మనస్సును పదును పెట్టే వరకే.

- గోపీచంద్, పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా

చదువు వల్లించవలసిన చట్టుబండ.

- కుక్కుటేశ్వరరావు, అహర్నుఖమ్

చదవనంతవరకూ కాకరకాయ, చదివిన తర్వాత కీకరకాయ.

- సామెత

ఎప్పుడును నీవీ మెట్టవేదాంతముల్
నా ముందాడవు, నిద్రలోఁ గలచితన్నా!,
యెన్ని శాస్త్రంబులో!

- విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము

యూనివర్శిటీలలో పెద్ద పెద్ద సంస్థల్లో ప్రొఫె సర్లయింతర్వాతనే చాలా మంది నిజంగా చదువుకోవడం మొదలుపెడతారు.

- వేంకటరాయశాస్త్రి, వ్యామోహము

ఇంగిలీసు సదువుకున్న మారాజులు. బేమ్మ డొచ్చి చెప్పాలిగాని, ఆరింట్లో తద్దినాలే ఆరికి తెలదు.

- హనుమంతరావు, లేడీ డాక్టరు

జనులు చదువుకొన్న వారగుదురేని తమకుగల స్వాతంత్ర్యములను తెలిసికొని వానిని పొందుటకయి ప్రయత్నము చేయుదురు. నీచముగా నెల్లవారికిని బెదిరి యొదిగి యుండక వారు చేసెడుపని క్రమమయినదో యక్రమయినదో యాలోచించుకొనుచుందురు.

- కందుకూరి, దేశాభిమానము

నాతో మాట్లాడవేఁ ఒక ఎడ్యుకేషన్.

- గురజాడ, కన్యాశుల్కం

చదివి చదివి చదివి చావంగ నేటికి?
చావులేని చదువు చదువవలయు
చదువులేక కోటిజనులు సచ్చిరిగదా!

- వేమన

...నేఁ జదివినవి గలవు పెక్కులు
చదువులలో మర్మమెల్లఁ జదివితిఁ దండ్రీ!

- పోతన, భాగవతము

విద్యాసార మెఱుంగఁగోరెద భవ
ద్విజ్ఞాత శాస్త్రంబులోఁ
బద్యం బొక్కటి చెప్పి సార్థముగఁ
దాత్పర్యంబు భాషింపుమా!

- పోతన, భాగవతము

చదువనివాఁ డజ్ఞుం డగుఁ
జదివిన సదసద్వివేకచతురత గలుగుం
జదువఁగ వలయును జనులకుఁ
జదివించెద నార్యులొద్దఁ జదువుము తండ్రీ!

- పోతన, భాగవతము

తఱచు చదువఁ జదువఁ దర్కవాదమె కాని
దివ్యమైన తెలివి తేటపడదు
పసిరికాయ పురుగుపడఁగానె చెడిపోదె?

- వేమన

ఈ రోజుల్లో ఎడ్యుకేషనంటే, ఎవడేమన్నాడో తెలుసుకోవడం.

- బుచ్చిబాబు, ఆత్మవంచన

డబ్బుతేని విద్య దారిద్ర్యహేతువు.

- గురజాడ, కన్యాశుల్కం

విద్యవంటి వస్తువులేదు.

- గురజాడ, కన్యాశుల్కం

కారంలేనిదే కూరలకు రుచిరాదు. కోదండం లేనిదే పిల్లలకు చదువురాదు.

- చిలకమర్తి, సవ్వులగని

పదవుల్లాగా ఈ డిగ్రీలని త్యాగం చెయ్యటానికీ, ట్రాన్స్‌ఫర్ చెయ్యటానికీ వీల్లేదు.

- దివ్య ప్రభాకర్, శిరోమణి

చదువు రెండు విధాలు. ఒకటి గుమాస్తాపని చేసేది. రెండవది రాజ్యా లేలేది.

- విశ్వనాథ, చెలియలికట్ట

మనస్సు పరిపక్వము చేసికొన్నచో, నాత్మ నభివృద్ధి పొందించుకొన్నచో నాపదలు వచ్చినప్పుడు, నవకరములు పొందినప్పుడు తమా యించుకొనవచ్చును. అందుచేత నాత్మవిద్య గొప్పది.

- విశ్వనాథ, తెఱచిరాజు

పేదవాళ్లకి పనిపాట్లు చేసుకోడం తెలియడవేఁ పెద్ద చదువమ్మా.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

బళ్ళలో ఎవరికీ పనికిరాని చదువు నేర్పుతారు. గనకనే మనదేశంలో చదువింత తక్కువ. మన జాతిని నిర్జీవం చేసి, ఎందునా కాకుండా చెయ్యటానికే ఇంగ్లీషువారీ చదువు ప్రవేశపెట్టారు.

- కొడవటిగంటి, చదువు

నీవు నేర్పిన చదువే నీ కర్థముకాదు.

- విశ్వనాథ, చెలియలికట్ట

నా దగ్గర గొట్టికాయలు గిట్టికాయలు పనికిరావండి. పుస్తకం చాతపడితే వేళ్ళకి పుస్తకం అంటుకుపోవాలి.

- గురజాడ, కన్యాశుల్కం

పదహారేళ్ళు చదువుకున్న వాడికి కాలం జరగ దంటే ఆ చదువు చదువు కాదు.

- కృష్ణరావు, పాపికొండలు

మన చదువు ఇతరులకు ఒంటపట్టింది.

- రామకృష్ణశాస్త్రి, కన్నడ

బుద్ధిపూర్వకంగా, పూర్తి ఇష్టంతో చదివేదే చదువు.

- కొడవటిగంటి, చదువు

సులభంగా వచ్చిన విద్య సులభంగానే

పోతుంది.

- కొడవటిగంటి, చదువు

విద్యార్థి విజ్ఞానమంతా విద్యార్థినుల దగ్గిరే బయటపడుతుందన్న మాటలో అతిశయోక్తి ఏమీలేదు.

- కొడవటిగంటి, పంచకళ్యాణి

విద్య ఒకరు మెచ్చుకొంటే కదా రాణించేది?

- హితశ్రీ, నూరుశరత్తులు బ్రతకాలి

ఉపాధ్యాయత్వము సాధారణముగా స్వతంత్రత కలదేయయినను, స్వదేశస్థులు పాఠశాలాకార్యని ర్వాహకులైయున్నప్పుడు డదియుఁ బరతంత్ర మైనదియే.

- కందుకూరి, స్వీయచరిత్రము

జ్యోతిశాస్త్రము ప్రకృతి శాస్త్రములలో నుత్తమమయినదని చెప్పవచ్చును. ఈ శాస్త్రమును జదివి, గ్రహణములు మొదలైనవి కలుగుటకుఁ గల నిజమైన కారణములను దెలిసికొన్న పక్షమున, ఏతద్విషయమున జనులలోఁగల మూఢ విశ్వాసములును, మూఢాచారములును నశించి, సుజ్ఞానము కలుగుననుటకు, సందేహములేదు.

- కందుకూరి, స్వీయచరిత్రము

మాబోటి చదువుకున్న వాళ్ళకి ప్రేమంటే ఏమిటో తెలుసు. కాని మీలాగ ప్రేమించుకోవటం చేతగాదు.

- బుచ్చిబాబు, ఉత్తమాయిల్లాలు

పంతులుగారిని చూడగానే గజగజ వణికి మూర్ఛపోవాలి పిల్లవాడు. వాడే పంతులు.

- చిలకమర్తి, గణపతి

విద్యావిషయాన్ని విచారిస్తే ఇప్పటి స్కూళ్ళు కూడా యీతిబాధల కిందకే వస్తాయి.

- వెళ్ళపిళ్ల, కథలు-గాథలు

వెలివిద్య లెన్నియైనను
గులవిద్యకు సాటిరావు.

- గువ్వలచెన్న శతకము

శత్రుత్వ మిత్రత్వాలు విద్యావిషయంలో అడ్డుతగిలే యెడల అట్టివాడు మనీషి కాకపోవడమే కాక మనిషికూడా కాఁడని నేననుకుంటాను.

- వెళ్ళపిళ్ల, కథలు-గాథలు

విద్యావిషయంలో అభిప్రాయభేదాలు వున్నప్పటికీ ఆడరాని మాటలు ఆడడంగాని ముఖా ముఖాలు చూచుకోకపోవడంగాని విద్వల్లక్షణం కాదు.

- వెళ్ళపిళ్ల, కథలు-గాథలు

పూర్వం విద్య ధనికులకన్న బీదలకే అందుఁబాటులో ఉండేది. ఇప్పుడు ధనికులకేకాని విద్య లభించదు.

- వెళ్ళపిళ్ల, కథలు-గాథలు

ఉద్యోగ మొదవినప్పుడు
సద్యోమద మొదవి పూర్వసరసత యుడుగున్
విద్యావంతున్నకైనను;
విద్యాహీనునకు వేఱె వివరంబేలా!

- చాటువు

చదువురాని ముసలి వాడికంటే, చదువు వచ్చిన కుర్రవాడు ఎక్కువ జ్ఞానవంతుడు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, మార్గదర్శి

చదువు, ప్రతిభను రాణింపచేసే వొక సాధనమే కానీ, దానికి కారణమూకాదు, ఫలితమున్నూకాదు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, ఆత్మబలి

విద్యకి దూరం దగ్గిరా లేదు.

- భమిడిపాటి, అవును

మన దేశంలో చదువు సంస్కారం నేర్పదు. అది డిగ్రీ సంపాదించుకోడానికి ఉద్యోగం వెతుక్కుని డబ్బు సంపాదించుకోడానికి మాత్రమే.

- ఆనందారామం, అద్దంలో శత్రువు

ఈ ప్రపంచ నాటకమునం దిప్పటి పెద్దలు వినిపించుచున్న కథ యించుమించుగా ముగియవచ్చినది. వారీవఱ కందఱును వినిపించుచు వచ్చిన పురాణ కథాశేషమునే వృద్ధ వాక్యములలోఁ గొంతకాలము వినిపించి కథాశేషులయ్యెదరు. ఈ ప్రపంచ నాటక రంగమునందు మహాసామర్థ్యముతో క్రొత్త మాటలాడి హృదయ రంజకముగా వినిపించి నూతన కథను సర్వజనులకు సంతోషమును గలిగింపవలసినవారు లేఁబ్రాయములోనున్న ఇప్పటి విద్యార్థులే.

- కందుకూరి, విద్యాధికుల ధర్మములు

తమ విద్య నెవ్వ రేమా
త్రము గనఁజాలుదురు వారి దండను దన్మా
త్రమ ప్రకటింతురు బుధు లు
త్తముల మహిమ నీరుకొలఁది తామర సుమ్మీ!

- పింగళి, కళాపూర్ణోదయము

ఎప్పుడూ పైకి ఏడవకు. అది లౌక్యం కాదు. లోలోపల కానీ నాకు మల్లే. చాలా మంది

చదువుకున్న వాళ్ల అభిప్రాయం ఆచరణా అంతే.

- భమిడిపాటి, ఎప్పుడూ ఇంతే

చదువుకి పెట్టిన డబ్బుకయ్యే వడ్డీయిస్తే కో అంటే కోటి మందొస్తారు, ఉద్యోగం చెయ్యడానికి.

- వీచ్చేశ్వరరావు, మనసులో మనిషి

ఎక్కడ చదివినా చదువు చదువే కదా.

- ఆదివిష్ణు, చూడు చూడు నీడలు

ఏం చేస్తుంది విద్య? కోర్ట్లకీ, ఓట్లకీ, నోట్లకీ, తయారు చేస్తుంది స్వేచ్ఛగా తిరిగే మనుషుల్ని! ఎవరికి స్వేచ్ఛనిచ్చింది ఈ విద్య?

- చలం, మ్యూజింగ్స్

లోకానుభవము కూడ విద్యయే.

- చిలకమర్తి, చమత్కారమంజరి

ప్రేమించడం చాలా తేలిక. ఈ కాలంలో అది గురువులేని విద్య కూడా.

- పులికంటి, ఆరికకూడు

ఈ ఇంగ్లీషు వాళ్ళు చదువులుపెట్టి మనవేళ్ళతో మనకళ్ళే పొడుస్తున్నారు.

- గురజాడ, కొండుభట్టీయము

యూనివర్సిటీల చుట్టూ బ్రహ్మజెముళ్లు, విజ్ఞానం చుట్టూ నాగజెముళ్ళు.

- తులసి, వలయం

అగ్నిc గాలదు, రాజుల కలవిగాదు,
నీళ్ల నానదు, చోరుల పాలుగాదు,
సోదరులచేత నెప్డుc బంచుకొన రాక
చెలcగు విద్యాధనమునకుc జేటులేదు

- దూబగుంట, పంచతంత్రము

పరమార్థ దృష్టిచేc జూడ నైహిక విద్యలలో నేమంత భేదమున్నది? అన్నియు ముష్టివిద్యలే. అన్నియుc బొట్టకూటి తంత్రములే. కావున నైహికవిద్యలో సౌందర్యశక్తి లేదు - లేదు.

- పానుగంటి, సాక్షి

పొట్టకూటికి నేర్చు విద్యలు
పుట్టకీట్లు కదల్చెనా?

- గురజాడ, ముత్యాల సరములు

పరభూమికిc జనుచోc ద
స్కరులకు నగపడదు వ్రేcగు గా దెచ్చుట నె
వ్వరినైన హితులcc జేయును
ధరలో మఱి విద్యcబోలు ధనములుగలవే?

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

పరులకు సోదరులకు భూ
వరులకుc గొనరాదు సర్వవశ్యము తా నె
వ్వరి కిచ్చినc గోటిగుణో
త్తరవృద్ధి భజించు విద్య తన ధన మెపుడున్.

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

...బోధావిర్భావనిదానముల్ చదువులయ్యా? కావు.

- ధూర్జటి, శ్రీకాళహస్తీశ్వర శతకము

చదువుకొని ముష్టి యెత్తుట కంటె చదువు కొనక పీనుcగుల మోయుట మంచిది.

- చిలకమర్తి, గణపతి

పఠియింపనివారు చెదపురుగులై పుట్టి మఱి యొకజన్మమునc బుస్తకముc దినివేయుదురు.

- చిలకమర్తి, గణపతి

చదువుకోనన్నాళ్ళు పసులు, పసులు అని చదువుకున్నాక పచులు పచులు అన్నాడట.

- సామెత

## చనిపోయినవాడు

చచ్చిరి సోదరు ల్సుతులు చచ్చిరి,
చచ్చిరి రాజులెల్ల రీకచ్చకు మూలకందమగు
కర్ణుcడు మామయుc జచ్చి రీగతిం
బచ్చని కొంపమాపితిని.

- తి.వేం., పాండవవిజయము

## చనువు

చనువు ఎక్కువైతే ఏవగింపు పుడుతుందట.

- బుచ్చిబాబు, గొలుసు

## చంద్రుడు

చంద్రుడు మన గెరిల్లా క్యాంపులో లాంతరు!

- గంగినేని, గెరిల్లాలతో ఒక నిముషం

## చప్పట్లు

రెండు చేతులూ చేర్చనిదే చప్పట్లు రావన్నది అబద్ధం! ఒక చెయ్యి వెళ్లి కదలకుండా ఉన్న మరొకచేతిమీద పడ్డా శబ్దం వస్తుంది.

- కౌసల్యాదేవి, శాంతినికేతన్

## చమత్కారం

శక్తినిమించి చేసెడి చమత్కారము ప్రాణముల మీదికి తెచ్చును.

- విశ్వనాథ, నందోరాజా భవిష్యతి

నిజం నాలుక ఉన్న ఏనంగనాచైనా చెప్పగలడు. అబద్ధం ఆడ్డానికి, చమత్కారం కావాలంటాడు

బెర్నార్డ్ షా.

- బుచ్చిబాబు, ఒకేనేద్ర-ఎన్నోకలలు

**చతురత**

మా తిండితో బలిసిన ఆ కుక్క
మా కళ్లముందు
అలా తోక ఊపుతూనే ఉంటే
ఫరవాలేదు
మనపట్ల విశ్వాసంచూపుతూందిలే అనుకున్నాం
కానీ!
ఆతోక ఊపులోనే
అయిదేళ్ళూ గడిపేస్తుం దనుకోలేదు.

- రాజేంద్ర, గుండె చప్పుళ్లు

**చరిత్ర**

గతించిన చరిత్రక సంగతులు యెవరు వ్రాసినా సరిగా ఉండవు.

- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

ప్రతీవారి చరిత్రానికిన్నీ యేవో నీహార లేశాలు ఉండనే ఉంటాయి.

- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

చరిత్ర లేఖనమునకుఁ దగిన సామగ్రిని సంపాదించుట కష్టము. సంపాదించినను సందర్భ శుద్ధిగ కష్టము.

- పానుగంటి, సాక్షి

నరజాతి చరిత్ర సమస్తం
దరిద్రులను కాల్చుకు తినడం.

- శ్రీశ్రీ, దేశచరిత్రలు

ఏదేశ చరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం?
నరజాతి చరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం

- శ్రీశ్రీ, దేశచరిత్రలు

చల్లారిన సంసారాలు,
మరణించిన జనసందోహం,
అసహాయుల హాహాకారం
చరిత్రలో మూలుగుతున్నవి.

- శ్రీశ్రీ, దేశ చరిత్రలు

పరస్పరం సంఘర్షించిన
శక్తులలో చరిత్ర పుట్టెను.

- శ్రీశ్రీ, దేశచరిత్రలు

తారీఖులు దస్తావేజులు
ఇవి కావోయ్ చరిత్రకర్థం.

- శ్రీశ్రీ, దేశచరిత్రలు

నరజాతి చరిత్ర సమస్తం
పరస్పరాహరణోద్యోగం;
నరజాతి చరిత్ర సమస్తం
రణరక్త ప్రవాహసిక్తం.

- శ్రీశ్రీ, దేశచరిత్రలు

చరిత్రకారుల దృష్టికి రాజులు, రాణీలు మినహా సామాన్య సైనికులూ, ప్రజలూ ఎక్కడ ఆనుతారు?

- సూరి, చంఘీజ్ ఖాన్

చరిత్ర పగ నెవడూ తప్పించుకోలేడు.

- తిలక్, హోర్లెమ్ములో శవం

ఒక వర్గాన్ని మరొక వర్గం కాల్చుకుతింటే అది చరిత్ర.

- కొడవటిగంటి, అర్ధాంగి

చరిత్ర లెప్పుడూ క్లిష్టంగానూ కష్టనష్ట భూయిష్ఠంగానూ ఉండును.

- మా గోఖలే, బుద్ధం శరణం గచ్ఛామి

అసలు మనవాళ్లకు మనచరిత్రల్ని పదిలపర్చుకునే అలవాటెక్కడున్నాయ్ చెప్పండి?

- మా గోఖలే, బుద్ధం శరణం గచ్ఛామి

నేటి ఉదారులు శ్రామికులు.. వారికి చరిత్ర లేదు.

- సభా, పిచ్చిదంపతులు

చరిత్రనిండా రక్తమే! ఈ రక్తమే చరిత్రని మార్చింది!

- అప్పల్నాయుడు, పువ్వుల కొరడా

చరిత్రను సృష్టించినవాడికి చరిత్రలో చోటు లేదు. అందుకే చరిత్ర కృతఘ్నమైనది!

- అరిపిరాల, అతన్నిగూర్చి కథలులేవు

నరచరిత్ర క్రిక్కిరిసిన
ప్రళయ సమరసంఘర్షణ
జారిన వీరుల రక్తం
ఆరని వనితల దుఃఖం

- అనిశెట్టి, పచ్చిగ ఈ నేలంతా

గుక్కపట్టి ఊపిరాడక
ఉక్కపట్టి వెలుతురానక
చీకటి చక్రబంధంలో
చిట్లిన రాచపుళ్లు
చరిత్ర కళ్లు.

- జ్వాలాముఖి, పూలకబేళాలో డిశంబర్‌రోజాలు

మట్టి చరిత్రే చరిత్ర, మట్టి మనిషి చరిత్రే

చరిత్ర.

- శివారెడ్డి, నగ్నభూమ్మీద

క్లియోపాత్రా ముక్కుగనుక కాస్త పొట్టిదైవుంటే, ప్రపంచ చరిత్ర మరోవిధంగా వుండివుండేది.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

## చర్య

కాలావధి డగ్గరించు, వృధయయ్యెను జీవిత
ముత్తచర్యలన్

- దువ్వూరి, భగ్నహృదయము

## చలనం

చీకటికి చలనం లేదు.

- బైరాగి, నూతిలో గొంతులు

## చలాయింపు

శంకరాచార్యుణ్ణి అనుకుంటున్నావా ఏం? శృంగారం, వేదాంతం కలగలిపి చలాయించుకు వచ్చేందుకు?

- రామకృష్ణశాస్త్రి, మీమాంస

హోదా అధికారం చలాయించడం అలవాటు అయితే అందరూ చులకనగానే కనిపిస్తారు.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

## చలిజ్వరం

చస్తే చచ్చాడుగాని చలిజ్వరం చప్పగా వదిలింది.

- సామెత

## చాకలి

చాకివానితోడ జగడాలు పడలేక
సిరిగలాఁడు పట్టుచీరఁ గట్టె;
శివుఁడు తోలుఁ గట్టె; సీయని మదిరోసి
భైరవుండు చీరఁ బాఅవైచె

- చాటువు

చాకి చాకని యేల సందడించెదవు?
చాకియే యతఁడు? సాక్షాల్లింగమూర్తి!

- పాల్కురికి, బసవపురాణము

## చాకిరీ

భారతదేశంలో జీతం తక్కువైనకొద్దీ చాకిరీ పెరుగుతుందేగాని ప్రాణాలు అంతే ఉంటాయి.

- బొల్లిముంత, మృత్యుంజయులు

వంటికెంత చాకిరీ ఉందో ఇంటికంత ఉంది.

- కాళ్లకూరి, గరల్‌వైఫ్

## చాదస్తం

చాదస్తం లేకపోతే సన్యాసులకు కూడా భోగం వాళ్ళు ఉండడం జరూరే.

- కందుకూరి, హాస్యసంజీవని

సంస్కృతం క్లాసులో చదువుకుంటూ ఉండటం చేత నీకు చాదస్తం అంతకంతకు బలిసిపోతూ ఉన్నది.

- కందుకూరి, హాస్యసంజీవని

చదువెక్కువైతే చాదస్తం కూడా ఎక్కువవుతుందంటారు.

- రెంటాల, ఇన్‌స్పెక్టర్ జనరల్

ఊబిలోపడిన ప్రతివాడు
ఆనందాబ్ధి అని అంటాడు.

- కాళోజీ, చాదస్తం

చాదస్తపు మొగుడు చెప్పితే వినడు, కొడితే ఏడుస్తాడు.

- సామెత

## చాపల్యం

బాల్యచాపల్యం చావడం కల్ల. అది ఛద్మవేషాలను ధరిస్తుంది.

- నార్ల, జగన్నాటకం

## చాలు

కొనేవాడికి కోటి కళ్లయితే, అమ్మేవాడికి అవిటి దొకటే చాలు.

- సామెత

దండెగొట్టు తెలివుండిన చాలు
జోకవచ్చు గింజలుగా తాలు.

- కాళోజీ, ద్వైతజగత్తు

## చావు

చావుకు భయపడటంకన్న
చావని ఆశతో బ్రతకటం మిన్న

- అరిపిరాల, కడలిగొంతులో చిక్కుకున్న కాలం

ఏమీలేని రోజుల్లో చావుభయం లేదు
అన్నీవున్న రోజు అదీ వుంది.

- ఇనాక్, ఏమౌతాడు?

మనిషి ఎంత విర్రవీగినా చివరికి ఒకదానికి లొంగిపోక తప్పదు. దానికి తరతమ భేదాలు లేవు. ఎవర్నీ కనికరించదు- అదే మృత్యుదేవత.

- రామకృష్ణరావు, రేపటి మనుషులు

వేయి నీతులకు సరి అతని మరణ కారణం.

- గోపాలచక్రవర్తి, రెండుకళ్ల పన్నెండుచేతుల నాయకుడు

వందేళ్ల బ్రతుకులో నువ్వు
మృత్యువును వేలసార్లు గెలుస్తావు

మరి దాని గొప్పేమిటి
దాని గెలుపు ఒక్కసారే!

- కుందుర్తి, మరి మృత్యువు గొప్పేమిటి?

మృత్యువు మరేమికాదు
జీవితానికి మరో పార్శ్వమేగాని

- అఫ్సర్, అంతిమస్పర్శ

ప్రతిష్ఠకు పెద్దనాయుడు చస్తే, యీడవలేక యింటివారంతా చచ్చినట్లు.

- సామెత

నేర్పుతోడఁ దిరుగనేర్చిన వాఁడైన
తనదు చావుఁ దప్పుకొనఁగ లేఁడు.

- అజ్ఞాడ, నూటుగంటి

చావు, సమస్యలకు పరిష్కారమని తెలివి హీనులు మాత్రమే అనుకుంటారు

- శ్యామలారాణి, హరిణి

మనము ఎన్ని లడాయీలలో చస్తాం సర్కార్?

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

మరణమన్నది మన నీడ;
కాదు కాదు, మనమే మరణం
భీషణ జీవన నిశీథగర్భాన
త్రోవతప్పిన వారికొరకు ఒక కిరణం
అది మరణం

- బైరాగి, వాన వెలిసింది

చిరపరిచిత మిత్రుడు మృత్యువు.

- బైరాగి, కామ్రేడ్ రాయ్ స్మృత్యర్థం

మానవ హృదయ పిపాసకు చావులేదు.

- బైరాగి, నాయకునకు సానుభూతి

చావుకు మర్యాద లేదు.

- బైరాగి, అమాత్యుని అకాలమరణం

మృత్యువు ఏదో ఒకపూట
చూచిపోయే అతిథి కాదు
వెంటబడిన అప్పులవాడు!
పుట్టుకతో పుట్టిన చావు
చావుతో చస్తోంది.

- బైరాగి, పలాయనం

లోకంలో కారణం చెప్పలేనిది ఒక్క మృత్యువే!

- ధనికొండ, పవిత్రులు

ఇచ్ఛవుండటమే బ్రతకటం, చావటమంటే స్వేచ్ఛ లేకపోవటమే.

- రారా, ఎదురుతిరిగిన కథానాయకులు

బ్రతికి ఉన్నంతకాలం, మానవజాతిలో రాజూ, పేదా, బీదా, గొప్పా యీ మిట్టపల్లాలన్నీ వుంటై మృత్యువు మాత్రం వీటిని వేటినీ పరిగ ణించదు. ఒక్క మానవుణ్ణే కాదు. జీవకోటిని యావత్తును కూడా ఒకే మాదిరిగా, రోడ్‌రోలర్ చదునుచేసి పారేసినట్లు చదునుచేసి పారే స్తుంది.

- సూరి, చంఘిజ్‌ఖాన్

చావు తప్పనప్పుడు సరియైనవాడి చేతిలో చావ మన్నాడు.

- భమిడిపాటి, తుక్కుముక్కలహక్కుచిక్కు

చావంటే స్వాతంత్ర్యం. స్వాతంత్ర్యం అన్నా చావే.

- పిచ్చేశ్వరరావు, వెర్రికాదు, వేదాంతం!

ఈఁగ తేనెరుచికి నింపుగాఁ జచ్చును
ఓగు కామరుచికి నొదిగి చచ్చు
త్యాగి గానివాని ధర్మ మడిగినఁ జచ్చు

- వేమన

మరణమన్న వెఱచి మది కలఁగఁగ నేల
నిరుఁడు ముందటేఁడు నిన్న మొన్న
తనువు విడిచినతఁడు తనకన్న తక్కువా?

- వేమన

మరణం మనకింకా మిగిలిన ప్రశ్న.

- సౌభాగ్య, సింహావలోకనం

తథ్యం ప్రాణికి మృత్యువు
తప్పదు జీవికి వేదన

- శ్రీశ్రీ, సదసత్సంశయం

మనుజునిలో మరణభీతి
మదిలో దుఃఖానుభూతి
ఆలోచన లన్నిటికీ
ఆంతర్యంలో పునాది

- శ్రీశ్రీ, సదసత్సంశయం

కొందరు మహామహులు జన్మదినమునందే మరణించిరి.

- పానుగంటి, సాక్షి

మరణ మెవరికిఁ గష్టము? బ్రతుకు సుఖమని యెంచినవారికి.

- పానుగంటి, సాక్షి

ఏ కాలమం దెవ్వఁడు పుట్టునో సర్వసాధారణ ముగా వాఁ డాకాలమందే మరణించును.

- పానుగంటి, సాక్షి

మంచివారికి మరణమే సాక్షియని పెద్దలు

చెప్పుచున్నారు..
- కందుకూరి, స్వీయచరిత్రము

మీరు యోగినైనఁ బిలిచి మీకు మరణమన్న భయమేమైన గలదాయని యడిగిన తడువుకో కుండ లేదని చెప్పునుగాని యాతనికి కొంచెము రోగము వచ్చినప్పుడుమాత్ర మతని చర్య వలన మూఢుల కుండు దానికంటె నెక్కువ భయము కలిగియుండుటను గనిపెట్టవచ్చును.
- కందుకూరి, రాజశేఖర చరిత్రము

చావుకూడా తేలికగానే వుంటుందిట!
- యజ్ఞన్నశాస్త్రి, ఓ మనిషి నూతిలోపడితే

గరికి తినే గాడిదికి సావుంది కాని.
గరికి కెప్పుడు సావు లేదు!.
- కాళ్లకూరి, భాగ్యరేఖ

సవరోడు సత్తే గోసిగుడ్డతో సత్తాడుగానీ అప్పు తోటి సవ్వడు...
- అప్పల్నాయుడు, బుగతోడు-గూడుబండి

ఎవళ్ళూ ఎవళ్లకోసం జీవించడంలేదు. చావటం లేదు. చావదలచుకొన్న వాళ్ళెవరూ చెప్పిచా వరు. గప్‌చిప్‌గా తమపని పూర్తిచేస్తారు.
- మహీధర, ఓనమాలు

సావు మనక్కాదు. పెపంచకం నిలబడడానికి.
- కాంతారావు, దగాపడిన తమ్ముడు

మంచికి చావులేదు; చెడ్డ చచ్చిపోయి మళ్ళీ పుడ్తుంది. రోజూ చావే, రోజూ పుట్టుకే దానికి!
- కాంతారావు, దగాపడిన తమ్ముడు

చచ్చేవాండ్లు బంధువులందరికి చెప్పి చస్తారా?
- ఆళ్వారుస్వామి, ప్రజలమనిషి

పోలీసోడి సేతల్ల దిక్కుమాలిన సవ్వేగాని సిన్నా యీరో సవ్వూ ఉండదు.
- రావిశాస్త్రి, బంగారిగాడికత

అడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు
రక్షితుండు మందిరమునఁ జచ్చు
- పోతన, భాగవతము

ఎన్ని తెగుళు లున్న నెన్ని దుర్దశ -లున్న
బ్రతుకఁజూచు దేహి బహువిధములఁ
జావు పేరుఁ దలఁపఁ జలియించు ధైర్యంబు
జ్ఞానికైన మేటి మౌనికైన.
- చిలకమర్తి, గయోపాఖ్యానము

ఏను మృతుండ నౌదునని యింత భయంబు మనంబులోపలన్
మానుము సంభవంబు గల మానవ కోట్లకుఁ జావు నిత్యము...
- పోతన, భాగవతము

చావు నిక్కంబు బ్రతుకుట సంశయంబు
- శ్రీనాధుడు, కాశీఖండము

చావుకు నొల్లక డాఁగవచ్చునే?
యెచ్చటఁ బుట్టె నచ్చటికి నేగుట
నైజము ప్రాణికోటికిన్
- పోతన, భాగవతము

చంపను మఱియేల మున్న చచ్చినవానిన్?
- పోతన, భాగవతము

సౌందర్యానికి అంధులు కావటంకన్నా, సౌందర్యం మామూలైపోవటంకన్నా మృత్యువు వేరే లేదు.
- చలం, మ్యూజింగ్స్

అందంగా, నొప్పించకుండా మృత్యువు అందరినీ వరించదు. ఆ అదృష్టం అందరికీ కలగదు.
- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

ఆత్మప్రశంస సేయు మది మరణం బని పెద్దలు సెప్పుదురు.
- తిక్కన, కర్ణపర్వము

మనిషి ఏవిధంగా చచ్చినా ఫరవాలేదు. కానీ మానసికంగా, ఆర్థికంగా, నైతికంగా మాత్రం చావకూడదు.
- నంది, మనిషి చావకూడదు

మానవజాతిలో యిది చాలాచిత్రమైన సంఘట నగా కనుపించుతుంది- బ్రతకాలనే ఆశతో, లక్ష లాది జనం కళ్ళు మూసుకుని మృత్యుముఖాల లోకి నడుస్తుంటారు.
- సూరి, చంఘిజ్‌ఖాన్

పుట్టిన పిమ్మటఁ జావును
గట్టి వృథామరణ మొందుకంటె బుధులకున్
దట్టమగు కీర్తి సుకృతము
నిట్టలముగఁ గల్గు చావు లింపులుగావే?
- అనంతుడు, భోజరాజీయము

**చావుబతుకులు**

చావటం చేతకాని వాళ్లకి బ్రతకటం అంటే ఏమిటో తెలియటం కష్టమేమో.
- పిచ్చేశ్వరరావు, బ్రతకడం తెలియని వాడు

ఏపనైనా టైముకి ముందే చేసుంచుకోవాలి, లేక పోతే టైముకైనా చేసుకోవాలి. మనిషిని బతికిం చాలంటే ఒాడు చావకముందే వాణ్ని బతికిం చాలి. వాణ్ని చంపాలంటే వాడు చావకముందే

వాణ్ని మనం చంపాలి.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

"చావూ" "బతుకూ" అంటూ మాటలు రొండు గాని భావం ఒకటే

- భమిడిపాటి, కాలక్షేపం

ప్రతినిత్యం మానవుడు చచ్చిపోడానికి యెక్కువ కారణాలు కనిపిస్తూ వుంటాయి. కాని ఏదో విధంగా బ్రతుకుతూ వుంటాడు.

- లక్ష్మీనరసింహశాస్త్రి, అంతరార్థం

స్వర్గంలో చూచారా చావా చావరు. బ్రతకా బ్రతకరు. వాళ్లకు బుద్ధిలేదు. బుద్ధున్న వాళ్ళు రెండూ చేస్తారు.

- గోపీచంద్, గీతా పారాయణం

బ్రతుకు ఆగితే చావు
చావు ఆగితే బ్రతుకు

- సినారె, మృత్యువు నుంచి

**చిక్కు**

సిక్కు విప్పడానికి సిక్కులు తెలిసినోడే వుండాల.

- కాంతారావు, వంశధార

**చిగురంత**

ఎంతటి కారుమబ్బులకేనా తెల్లని అంచు వుండక మానదు.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

**చిట్**

చిట్ అంటే ఇతరుల అవసరాన్ని క్రూరంగా దోపిడీచెయ్యటం - సహకార విధానాన్ని అవలం బించిన రక్తదాహం!

- కొడవటిగంటి, బ్రతకనేర్చినవాడు

**చిట్కా**

చీటికి మాటికి ఉద్యోగులు కోర్టుకెక్కకుండా ప్రభుత్వం తక్కువ జీతాలిస్తుంది.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

**చిత్తశుద్ధి**

చిత్తశుద్ధితో పనిచేసేవాడు ఎప్పుడూ మెట్లు ఎక్కుతూ వుంటాడు. ఎక్కిన మెట్టు కిందికి దిగ కుండా చూసుకోవడం కూడా ముఖ్యమే.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

**చిత్రకారుడు**

వలయాలూ, చతుర్భుజాలూ
వివిధ కోణాకారాలు
నీటుగావేసే రేఖా గణితజ్ఞుడు
మహాచిత్రకారు డనబడడు.

- కాళోజీ, సరస్వతీపుత్రులారా!

ఎదుటఁబడ్డ వస్తు విం‌పైన దైనచో
యూరకొనదు చిత్రకారి కరము.

- జాషువా, నా కథ

**చిత్రం**

శవం బతకడం ఎంత విచిత్రమో మనం మేలు కోవడం అంత విచిత్రమే.

- దాశరథి, పునర్నవం

వేఁడి యొకరుచి క్రొత్త యొక వింత.

- సామెత

**చింత**

యతికి మఱి బ్రహ్మచారికి
నతులితముగ విధవముండ కశ్వంబునకున్
సతతము మైథున చింతయె

- కవి చౌడప్ప

**చిన్నచూపు**

తల్లిదండ్రులు కరవైన బిడ్డ జీలుగుబెండు కంటె కడు తేలికైనది.

- వేదాంతకవి, తెనుగుతల్లి

**చిన్నతనం**

ప్రతీమొగవాడూ స్త్రీ దగ్గర ఏ వయసులోనైనా చిన్నవాడే. చిన్న పిల్లవాడు తరచు అద్దంలో తన మొహాన్ని చూసుకోవాలని అనుకున్నట్టు ప్రతిపురుషుడూ తనకు స్ఫూర్తినిచ్చిన స్త్రీ అభి నందన పూర్వకమైన చిరునవ్వులో తన విజ యాన్ని చూసుకోవాలనుకుంటాడు.

- వీరేంద్రనాథ్, ఆఖరిపోరాటం

**చిన్నవాళ్ళు**

పెద్దమాటలాడే పిల్లల దగ్గర పెద్దవాళ్లు కూడా చిన్నవాళ్లే.

- పినిశెట్టి, పల్లెపడుచు

**చిరంజీవి**

కాల ప్రవాహంలో స్నానంచేస్తే
చిరంజీవత్వం సిద్ధిస్తుంది.

- గోపీచంద్, బుడత కీచు

సృష్టి విలాసం అంతా చిరంజీవే.

- పిచ్చేశ్వరరావు, మనసులో మనిషి

**చిరాకు**

చేతిలో డబ్బు లేకపోతే యెక్కళ్ళేని చిరాకూ

వస్తుంది.

- సూర్యారావు, ఇల్లు కూలింది

నీ సోకే సొరాకు. నీ ముఖమే బీరాకు.
నావంక చూడబోకు. నాకసలే చిరాకు.

- సామెత

చిరునవ్వు

పెదవులమీది చిరునవ్వు హృదయం లోపలి హాలాహలాన్ని విరుస్తుందా?

- చలం, సావిత్రి

చిల్లర

చిల్లరగా పుచ్చుకున్నంత లాభము మరియెందు లోనూ లేదు. ఇచ్చేవాడికీ కష్టంగా ఉండదు. పుచ్చుకునేవాడికి కావలసినంత డబ్బు వస్తుంది.

- కందుకూరి, కౌతుకవర్ధని

చివరికి

కాటికి కాళ్ళు చాచి తిండికి చేతులు చాచినట్లు

- సామెత

లావొక్కింతయులేదు. ధైర్యము విలోలంబయ్యెఁ
బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చెఁ, దనువున్
డస్సెన్, శ్రమం బయ్యెడిన్,
నీవేతప్ప నితఃపరం బెరుగ
మన్నింపదగున్ దీనునిన్!
రావే ఈశ్వర! కావవే వరద!
సంరక్షింపు భద్రాత్మకా!

- పోతన, భాగవతము

చిహ్నం

పరాకు పడడమే ధర్మమండీ. అది మహారాజు చిహ్నము.

- కందుకూరి, హాస్యసంజీవని

మృత్యువు పరిపూర్ణతకి చిహ్నం

- మారుతీరావు, మళ్ళీ మధుమాసం

చీకటి

అధికారం మెదడు గదుల్లో బంధించినా,
చీకటికి సిగ్గు రాలేదు.

- కుందుర్తి, తెలంగాణ

చీకటికి జాలిలేదు,
చూపులేని, రూపులేని,
రేపులేని, మాపులేని
ఈ పెనుచీకటి నిముసం
బ్రతుకుల నల్లని కుబుసం

- బైరాగి, నూతిలో గొంతుకలు

చీకటిని విడిచి భయంగాని, భయాన్ని విడిచి చీకట్లుగాని ఉండలేవు. చీకటిని పారదోలితే భయం దానంతట అదే పోతుంది.

- రంగాచార్య, మోదుగుపూలు

ప్రేమలేనినాడు మనిషి బ్రతుకు చీకటి.

- శ్రీనివాసాచార్య, చీకటి

నువ్వు చీకటిలో ఉన్నా, నీలో చీకటి
ప్రవేశించకుండా చూసుకో.

- శ్యామలారాణి, హరిణి

చిలిపి చీఁకటి నాయింటఁ జిక్కఁబడియె.

- జాషువా, ఆవేదన

ఏడుపుకి చీకటే సుఖం.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

ప్లీడర్ల నల్లకోట్ల నిండా వికృతంగా క్రూరంగా చీకటి. పోలీసువారి ఎర్రటోపీల నిండా చారలు చారలుగా చీకటి. చుట్టూ పడున్న కాశీసారా కుండల నిండా చల్లారిన చీకటి. ముద్దాయిల కళ్ళనిండా దీనంగా అజ్ఞానపు చీకటి.

- రావిశాస్త్రి, మోక్షం

ఇరులు లేనినాడు నరులు కానరారు
నరులు లేనినాడు ధరణి లేదు.

- దాశరథి, తామసి

చీట్లపేక

నెత్తి గొఱిగి పంపు నెల్లూరి నెఱజాణ
కితవ జాండములకు బ్రతుకుఁదెరువు
త్రాగుడునకుఁ గొంత దగ్గఱచుట్టము
చేతిడబ్బు పోక, చీట్లపేక.

- జాషువా, చీట్లపేక

చీడ

చిలుము వదిలితే చీడ వదులుతుంది.

- కందుకూరి, హాస్య సంజీవని

చీపురు

తిరునామం బిడువేళను
పరవైష్ణవ మణులకెల్లఁ బరసాధనమౌ
నరయంగ నహహ! యీచీ
పురుపుల్ల బుధాళి కర్ణపుటరంధ్రగమౌ

- తి.వేం., శతావధాన సారము

చెప్పుకంటెఁ జీఁపురే యధమమా?

- పానుగంటి, రాతిస్తంభము

## చీర

తెచ్చి పెట్టుకొనవలసిన యందమంతయు చీర తోడనే యున్నది.

- మద్దూరి, మధు సేవ

## చీలిక

మనలో మన చీలిక
మృత్యుదేవికి నాలుక

- కవిరాజమూర్తి, ఏకత

## చుక్కలు

మాలలు మాదిగల్ గగనమంటప మెక్కిరె యిట్లు చుక్కలై?

- తుమ్మల, చుక్కలు

## చుక్కెదురు

కవిత్వమూ ధార్మికత్వమూ వొకదాని కొకటి చుక్కెదురు. వాటికెప్పుడూ పొత్తు కుదరదు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, రాజరాజు

## చుట్ట

చుట్ట పంపిణీమీదనే సీమ యంత్రం వగయిరా తెల్లవాడు కనిపెట్టాడు.

- గురజాడ, కన్యాశుల్కం

చుట్టకాల్చినవారి శరీరము వజ్రశరీర మగును. వారికెప్పుడు రోగమురాదు. లంక పొగాకు కషాయము కాచి మూఁడు పూట లిచ్చిన పక్షమున యజ్ఞములు చేసిన సోమయాజుల వారికి శాస్త్రుల వారికి ఛాందసము వదలిపోవును.

- చిలకమర్తి, గణపతి

చుట్ట వార్ధక్యానికి చిహ్నం, వార్ధక్యం వేదాంతానికి చిహ్నం.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

చుట్ట మోటు, సిగిరెట్టు నీటు. చుట్ట నల్లజాతి, సిగిరెట్టు తెల్లజాతి.

- భమిడిపాటి, చుట్టా, బీడీ, సిగరెట్

ఒంటరిగా ఉన్నవాడికి చుట్టే చుట్టం.

- భమిడిపాటి, చుట్టా, బీడీ, సిగరెట్

చుట్టఁ గాల్చుట యనఁ గొంత సొగసె కాని పాడువాసన గల్గెడు వక్త్రమందు.

- తి.వేం., శతావధానసారము

## చుట్టం

పేగు చుట్టమా? పెట్టు చుట్టమా?

- సామెత

## చుట్టరికం

సూత కృత్యంబు చేయటచేత నేఁడు కలుపుకొంటిమి చుట్టఱికంబు మనము.

- తి.వేం., పాండవవిజయము

## చురుకు

ఏదన్నా వింత అనుభవాలు పొందుతున్నప్పుడు జ్ఞానేంద్రియాలు మామూలుగా పనిచేసిన దానికన్నా చాలారెట్లు చురుకుగా పనిచేస్తాయి.

- కొడవటిగంటి, చదువు

## చులకన

చులకన జలరుహ తంతువు
చులకన తృణకణము దూది చుల్కన సుమ్మీ
యిల నెగయు ధూళి చుల్కన
చులుకన మఱి తల్లిలేని సుతుఁడు కుమారా.

- అనంతుడు, భోజరాజీయము

పనివాళ్ళు చవకగా వస్తారనే మనకు వాళ్ళంటే అగౌరవం.

- కొడవటిగంటి, ప్రేమించిన మనిషి

## చూపు

లోకుల బాధించుటకై క్రొత్తదార్లు క్రొత్త పుంతలు వేగముగఁ గనఁబడును.

- చిలకమర్తి, తుంబురునారద సంవాదము

చూపులలో నున్న గడుసుదనము మాటలోనున్నదా? మాట వట్టి తెల్లి- వట్టి బట్టబయలు- వట్టివెలితి. చూపెట్టిదా? జ్ఞానేంద్రియము కన్నా నోరా? నోరు పోయిన నైనఁ గంటితో సమస్త గ్రంథములు చక్కఁబెట్టవచ్చును.

- పానుగంటి, సాక్షి

తమ యనుగ్రహము సంపాదించుకొనుట కాశ్రితులు తెచ్చిన కట్నములు. కానుకలు హిరణ్య శ్రాద్ధములు చీకటిలోనైన కనఁబడును.

- చిలకమర్తి, తుంబురునారద సంవాదము

హంతకుల్ని, దొంగల్నీ వొక్కొక్కవాతావరణంలో చూస్తే చాలా దయ, జాలి కలుగుతుంది.

- నంది, నైమిశారణ్యం

పెళ్ళికొడుకు పెళ్ళికూతుర్ని చూసుకోడం యెలాంటిదో, కంపెనీవాళ్ళు దరఖాస్తుదార్లని చూసుకోడం అలాంటిదే.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, గుర్రప్పందాలు

మళయాళీ స్త్రీల చూపులు పురుషుల అందాన్ని తమలోకి పీల్చుకుంటాయి.

- గోపీచంద్, ఆడమళయాళం

పెనుబాము విసం బొడ లె
క్కిన మందుల డింపవచ్చు; గెరలెడు చెలి చూ
పను విస ముడుగక చెఱచున్
విను మీ చెలిచూపు విసమె, విసమె విసమ్మో.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, ఆనందోదయము

**చెట్టు**

పెంటమీది చెట్టు ప్రబలం, నీరుపోసిన చెట్టు నిర్మలం.
- సామెత

**చెడటం**

ఎవరివల్ల చెడ్డావోయి వీరన్నా అంటే, నోటివల్ల చెడ్డానోయి పేరన్నా అన్నాడట.
- సామెత

మంచివాళ్లలోనే చెడిపోవటం జరిగేది.
- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

పాకముఁ దప్పెఁ గార్యముల్.
- తిక్కన, భీష్మ పర్వము

నమ్మక చెడడంకంటే నమ్మిచెడడం మంచిది.
- ఉన్నవ, నాయకురాలు

నేను చెడిపోయ్యాను. ప్రపంచం నాకంటె ముందే చెడిపోయింది.
- గంగాధరరావు, నిర్మల

ఒక చెడ్డవాడు, పదుగురి మంచివారి ఉదాసీనతవల్ల సృష్టింపబడతాడు. ఆ చెడ్డవాడు వంద మంది మంచివాళ్ళు చేసిన మంచిని హతమారుస్తాడు.
- కాంతారావు, వంశధార

**చెడనివి**

తల్లిని నమ్మినవాడు, ధరణిని నమ్మినవాడు చెడడు.
- సామెత

మగపిల్లలున్న ఇల్లూ, మోదుగు చెట్టున్న అడవీ చెడిపోదంటారు.
- పుల్లాభొట్ల, విధివిన్యాసం

**చెడిన బతుకు**

సారా అమ్ముకున్నోళ్లో సోడాలమ్ముకున్నట్టున్నాదంటే నమ్ము నా బతుకు.
- బీనాదేవి, డబ్బు

చెప్పేవాళ్ళు లేక చెడిపోయినవారు చాలామంది.
- రాజారాం, ధర్మగ్లాని

పేదవాళ్ళం ఎవరికి కోపం వచ్చినా చెడేది మేమే.
- ముద్దంశెట్టి, తప్పించుకోలేవు

**చెడినవి**

వెలయాలు లజ్జచేఁ జెడు,
నిలఁ బాఱుఁడు చెడు దురాశ, నెద సంతుష్టిన్
విలసిల్లి భూధవుఁడు చెడుఁ,
గులసతి చెడు లజ్జలేమి.
- గువ్వలచెన్న శతకము

**చెడు**

కొంచెపు నరు సంగతిచే
సంచితముగఁ గీడు వచ్చు నదియెట్లన్నన్
గించిత్తు నల్లి కుట్టిన
మంచమునకుఁ బెట్లు వచ్చు మహిలో సుమతీ.
- బద్దెన, సుమతి శతకము

**చెప్పకూడనివి**

కాముకునకుఁ బాపకర్మున కవివేకి కవనిపతికిఁ గోపవివశమతికి మద విజృంభితునకు మద్యపాయికిఁ గ్రూరచేతనునకుఁ దగవు చెప్పఁ జనదు.
- అనంతుడు, భోజరాజీయము

అర్ధనాశము, మనస్తాపము, గృహమందలి దుశ్చరితము, వంచనము, పరాభవమును బ్రకాశింపఁ జేయఁదగదని పెద్దలు చెప్పుదురు.
- చిన్నయసూరి, మిత్రలాభము

**చెప్పు**

శిష్యా! శిష్యా! నాకాళ్ళకి చెప్పులున్నవా? అంటే నక్షత్రమండలం మధ్య ఎక్కడా కన్పడలేదన్నాడట.
- సామెత

**చెప్పుడుమాట**

చెప్పెడువారు చెప్పినన్
వినియెడువారి కించుక వివేకము పుట్టదె?
- అనంతుడు, భోజరాజీయము

**చెయ్యగలవి**

నువ్వెన్నన్నా చెప్పు మన వాళ్ళు చెయ్యగలిగిందల్లా తమ ప్రాణాలు బలిపెట్టడం, ఆడవాళ్ళని అగ్నికి ఆహుతి చెయ్యటం.
- గంగాధరరావు, ఇదా మనచరిత్ర?

**చెయ్యి**

నీ పుత్రచెయ్యి తీ, నా ఎడంచెయ్యి పెడతానందిట.
- బుచ్చిబాబు, కార్యదర్శి కల్యాణి

**చెరిగిపోనిది**

తెల్లకాగితం మీద పెన్సిలు గీత కాదుకదా,

మనసులోని ఆలోచన, చెరిపేస్తే చెరిగిపోవటా నికి?

- విశ్వం, గొలుసుకథలు

**చెరుపు**

వేఱుపురుగు చేరి వృక్షంబుఁ జెఱుచును
చీడపురుగు చేరి చెట్టుఁ జెఱుచు
కుచ్చితుండు చేరి గుణవంతుఁ జెఱుచును

- వేమన

చెడి బ్రతికినట్టి శుంఠను జేర్చుకొనిన
వాఁడుచెడు నుంచుకొన్న భూపతియుఁ జెడును.

- వేంకటరాయకవి, వేణుగోపాల శతకము

అసలు వుప్పులో పెట్టిన వూరగాయకి, అదు పులో పెట్టిన ఆడదానికి చెరుపులేదు.

- పూర్ణానందం, అనుమానం

ఇల్లు లేనమ్మ ఈనం చెడె; మగడు లేనమ్మ మానం చెడె.

- సభా, పిచ్చిదంపతులు

చెట్టు చెడే కాలానకు, కుక్కమూతి పిందెలు పుట్టుతాయన్నట్లు.

- సామెత

మొగవాడు తిరగక చెడితే, ఆడది తిరిగి చెడిం దట.

- సామెత

తిరిగి సబ్ఎడిటరు, తిరగక రిపోర్టరు చెడతారు.

- శ్రీరమణ, న్యూసుడి

తాజెడ్డ కవి జగమెల్ల చెఱిచె.

- శ్రీరమణ, న్యూసుడి

తబ్బిబ్బుయినం బని చెడు;
నబ్బురపాటైన నీతి యందదుకు లగున్.

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

**చెలామణి**

లోకంలో డబ్బులేని వాళ్ళు పుటంరూపాయితో సమానమే, ఎక్కడా చెలామణికారు.

- వేదాంత కవి, తెనుగుతల్లి

**చెలిమి**

కూరిమి గలదినములలో
నేరము లెన్నఁడును గలుగనేరవు, మఱియా
కూరిమి విరసం బైనను
నేరములే తోఁచుచుండు నిక్కము సుమతీ.

- బద్దెన, సుమతిశతకము

చెడే కలిశాం, కలిసే చెడ్డాం.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

కత్తిమీద సాము, కొత్తిమీది కూడు, నీతో చెలిమి.

- బుచ్చిబాబు, ఉత్తమాయిల్లాలు

మంటి కడవఁబోలె మఱి దుర్జన స్నేహ
మధిక శీఘ్రముననె హత్తు విరియు.

- దూబగుంట, సుహృల్లాభము

ఇద్దరు పండితులమధ్య
ఒద్దిక లెట్లుండురా?
అగ్గిమీద గుగ్గిలమ్ము
నిగ్గుదేలినట్లు గురూ!

- మల్లారెడ్డి, యక్షప్రశ్నలు

**చెల్లుబాటు**

పిల్లిపట్టిన యీరువు
సేసియున్న నేల చెల్లనేర్చు?

- తిక్కన, ఉద్యోగపర్వము

బల్లిదుల దోషములు పొరపాటు లగును
దుర్బలుల పొరపాటులు దోషము లగు
చేవగలవాని పంతమె చెల్లుగాని
బలవిహీనుని మాటలు పాటియగునె?

- చిలకమర్తి, గయోపాఖ్యానము

విద్యలక్కంటేనూ కళలక్కంటేనూ వినోదాలకే యెక్కువ చెల్లుబడి సభల్లో.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, అనుభవాలూ జ్ఞాపకాలూనూ

పైసలున్నంక ఏ తప్పుజేసినా చెల్లుద్దే.

- కె. యల్., కొత్తగుడి

**చెవిటివాడు**

చెవిటివానికి వినిపించాలంటే శంఖచక్రాలవాడు దిగిరావాలి.

- సామెత

**చెవుడు**

చెవిటి వాడి ముందు శంఖంవూదితే అది కొర కడం నీతరమా నీ అబ్బతరమా? అన్నాడుట.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, యావజ్జీవం హోష్యామి

చెవిటి పెద్దమ్మా చేంతాడు తేవే అంటే, చెవుల పోగులు జన్మలో ఎరుగనన్నదట.

- సామెత

**చేచాచటం**

ఎవ్వఁడు నిసర్గ కఠినుం
డెవ్వఁడు సన్మార్గరోధి యీర్ష్యాపరుఁడై
యెవ్వఁడు దన కధికునితోఁ

జివ్వకుఁ జేసాఁచు వాని సిరు లధ్రువముల్
- శ్రీనాధుడు, కాశీఖండము

ఎవ్వనితో నెచ్చోటం
జివ్వకుఁ జేసాఁపవలదు, చేసాఁచినచో
నివ్వల నవ్వల నెవ్వరు
నవ్వకయుండంగఁ బగ సనం దీర్ప నగున్
- శ్రీనాధుడు, కాశీఖండము

## చేటు

పగటి మాటలు పనికి చేటు
రాత్రి మాటలు నిద్రకు చేటు.
- నార్ల, శకునపక్షి

మంది చేరితే మరానికి చేటు
- లక్ష్మణరావు, అతడు-ఆమె

పోలీసుమంత్రి కోపం పదవికి చేటు.
- పతంజలి, అప్పన్నసర్దార్

ఇల్లరికపుటల్లుడు ఇంటికి చేటు
కొమ్ములబర్రె కొట్టానికి చేటు
- సామెత

కవిగారి కోపం కలానికి చేటు
- శ్రీరమణ, న్యూసుడి

## చేత

సంఘ సంస్కారులమని చెప్పుకొనువారు తాము వ్రాసిన వ్రాతలకు తాము చేసిన యుపన్యాసములకుఁ గేవలము విరుద్ధముగా నడచుకొనుట మనదేశములో నెప్పటినుండి యాగిపోవును?
- చిలకమర్తి, ధర్మసందేహములు

అప్రయత్నంగా సుళువుగా వచ్చేది ప్రయత్నించి చెయ్యడం మాటలు చెప్పినట్టే కాదు.
- భమిడిపాటి, బాగుబాగు

## చేతిమంత్రం

మీ చేతిమంత్రం మీ మొహంలానే ఉందండోయ్!
- భమిడిపాటి, బాగుబాగు

## చేదు

రోగాన్ని కుదిర్చే మందు సాధారణంగా చేదుగా ఉంటుంది. నగ్నసత్యంకూడా చేదుగా వుంటుంది.
- సూర్యారావు, శ్రీమతులు- శ్రీయుతులు

## చేప

సెర్లో సేపలల్లే ఉప్పప్పగా ఉందాం.
- బుచ్చిబాబు, ఉత్తమయిల్లాలు

## చేయదగినవి

హీనునితోఁ దగు రణము; స
మానునితోఁ జేయఁదగు సమాధానము; సం
ధాన రణంబులు దగ వస
మానునితోఁ దొలఁగి కొలిచి మనుటయె యొప్పున్.
- కంకంటి, ఉత్తరరామాయణము

పెద్దలు వద్దని చెప్పినవి, ఒక్కసారైనా చేసి చూడాలి.
- పాప, రామరాజ్యానికి రహదారి

## చేయరానివి

ఇంగలంబుతోడ నిలవేల్పుతోడను
పరునియాలితోడఁ బతితుతోడ
సరసమాడు టెల్ల చావుకు మూలము
- వేమన

పట్టి విడువరాదు పదిలక్షలకు నైనఁ
బెట్టి దెప్పరాదు పేద కైన
వెట్టి గొలువరాదు విభుఁడెట్టి ఘనుఁడైన
- వేమన

మనం త్రవ్వుకున్న బావి అని ఉరికి మరణిస్తామా?
- ఆత్రేయ, అశ్వఘోషుడు

ఆడకు మసత్యభాషలు,
కూడకు గొఱగాని వానిఁ, గొంకక యొరు లెగ్గాడిన నెదురుత్తర మీఁ
జూడకు, విని విననివాని చొప్పునఁ జనుమీ.
- అనంతుడు, భోజరాజీయము

## చేయి

ఆ చేతికి తూటాలే వ్రేళ్లు
అది గురితప్పని తుపాకీ.
- హెచ్చార్కె, గురి

## చేయూత

ఈ దేశముంది చూశావ్... ఆడదాని పాతివ్రత్యం గురించి ఏదో ప్రచారం చేసుకొంటోంది. కాని చస్తే ఆ ఆడదానికి మాత్రం చేయూతనివ్వదు.
- నంది, పుణ్యస్థలి

## చేరనిది

చేటుకాలమునకు హితము చేరదు. మరణకాలమునకు మందు చేరదు.
- కోలాచలం, సత్యహరిశ్చంద్రీయము

**చేవ**

చట్లకి చావ నలుపు, మనిషికి చావ తెలుపు

- గురజాడ, కన్యాశుల్కం

ఆ మాత్రం చేవే వుంటే, ఆ భార్యతోనే సుఖప డేవారేమో.

- యజ్ఞన్నశాస్త్రి, కట్నం

**చేసినతప్పు**

వైద్యమువల్ల రోగములు మానునుగాని బుద్ధిపూర్వకముగా చేసిన తప్పులు మానవు.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

**చైతన్యం**

ఒక స్త్రీ అత్యాచారానికి బలియైందంటే సహించలేకపోవడం ఆ జాతి సజీవంగా ఉన్నదనడానికి గుర్తు. ఆరోగ్యకరమైన చైతన్య లక్షణం.

- చిరంజీవి, చీమమనుషులు

జగతిమాత శల్యాలను కొరుక్కుతినే
సమస్త పురాణరోగాలకు
మన చైతన్యం ధన్వంత్రి

- కుందుర్తి, సముద్ర మధనం

చైతన్యం జీవిత లక్ష్యం

- కరుణశ్రీ, అరుణ

**చైతన్యవాది**

వ్యవస్థ యావత్తూ
వ్యాధిగ్రస్తమై వుంటే
చైతన్యవాది తెలియని వైద్యుడు
నరాలకోసం వెతుకుతున్నాడు.

- రాధేయ, చైతన్యవాది

**చొరవ**

ఇసింటా రమ్మంటే ఇల్లంతా చెరచినట్లు.

- సామెత

అన్నం చొరవేగాని అక్షరం చొరవలేదు.

- నార్ల, శకునిపక్షి

లోకాతీతమైన పనులకి పైసా,చొరవా ముఖ్యం.

- భమిడిపాటి, కచటతపలు

**చోటు**

ఒక దేవాలయంలో ఇద్దరు దేముళ్లకు చోటుండదు.

- భారతీదేవి, సుడిగుండాలు

**చౌక**

సకల విద్యలందు సంపన్నులైయున్న
నట్టివారు పరిచయమునఁ జౌక
పెరటి చెట్టు మందు పరికింప మెచ్చరు

- వేమన

**చౌర్యం**

భాగ్యవంతులు బీదలను దోచుకుంటే దానిపేరు వ్యవహారం బీదలు తమ హక్కును తీసుకుంటే చౌర్యం.

- ఉన్నవ, మాలపల్లి

# ఛ

**ఛండాలుడు**

రేప్పొద్దున యివ్వకపోతే మాలవాడి కొడుకు ఛండాలుడు.

- గురజాడ, కన్యాశుల్కం

**ఛందస్సు**

రచనల పూలతోటలో
ఛందస్సు మొక్కలు నాటను.

- కుందుర్తి, నాగేతం

# జ

**జగత్తు**

ఈ జగత్తు సర్వం అనాచ్ఛాదితం.

- వేగుంట, సెల్ఫ్‌పిటీ

అనుకోడంలో ఉంది జగత్తు.

- భమిడిపాటి, కచటతపలు

**జంగం**

కుక్కలు మొఱిగిన జంగము పరపతి పోవునా?

- చిలకమర్తి, ఆనంద సమాజము

**జడత్వం**

జనం తీర్పు మారినా దేశానికి పట్టిన జడతవదలలేదు.

- సూర్యప్రకాశ్, నడుస్తున్న చరిత్ర

జడంగా ఎడంగా వున్న గుండెలో
శాంతితోపాటు ధ్వాంతమూ పుడుతుంది.

- సినారె, మధ్యమపురుషం

**జడుపు**

ఎంత స్నేహితుడైనా వుద్యోగస్థుణ్ని చూస్తే

జడుస్తూ వుండవలెను

- కందుకూరి. హాస్య సంజీవని

**జడ్జీ**

కోర్టువాళ్ళు ఏదడిగినా క్రాస్ ఎగ్జామినేషన్‌లాగే ఉంటుంది.

- విశ్వం. కోర్టు

జడ్జీలకి చెవులేగాని కళ్ళుండవు.

- బీనాదేవి. ఎ మేటరాఫ్ నో ఇంపార్టెన్స్

దుర్యోధనుడే ఆయుధం తీస్తాడో ధర్మజుడికి ముందే తెలిసుండొచ్చుకానీ జడ్జీ ఎప్పుడు ఏ అడ్డు పెడతాడో ముందుగా నీకు తెలీదు. చాలా సార్లు అతగాడికే తెలీదు.

- బీనాదేవి. తీర్పు

**జత**

కంపేరింగ్ చేసేవాడికి ప్రాంప్టింగ్ చేసేవాడొకడు.

- శ్రీరమణ. న్యూనుడి

గ్లాసులు నాకేవాడికి మూతలు నాకేవాడు
తోడైనట్టు.

- శ్రీరమణ. న్యూనుడి

చందాలు వసూలు చేసేవాడికి రశీదులు చింపే వాడొకడు.

- శ్రీరమణ. న్యూనుడి

జననమరణాలు

బ్రతుకు వెన్నంటి మృతి
మృతి నీడనే బ్రతుకు
వినకేమి?
పురిటింటి కేరింత?

- నార్ల. ద్వంద్వాతీతం

పుట్టినప్పుడె నరుఁడె తాఁ బుట్టలేదు
కీర్తి పొడసూపునాఁడె యామూర్తి పుట్టె
చచ్చినప్పుడు వ్యక్తి తాఁ జావలేదు
ఆత్మ కవమానము ఘటించినపుడె చచ్చె

- వరదాచార్యులు. వైశాలిని

జనం

జనం ఎటువంటి వాళ్ళు, రాక్షసి బొగ్గుల్లాంటి వారు. వాటిని ఎంత తడిపినా అవి అంటు కున్నా యంటే అంటుకున్నాయన్నమాటే.

- రావిశాస్త్రి. గోవులొస్తున్నాయి జాగ్రత్త!

అజ్ఞానాన్ని తుడిచేస్తే
అధర్మాన్ని అతితేలికగా దులిపేస్తుంది జనం.

- ఛాయారాజ్. శ్రీకాకుళం

మనం జనం. జనం మనం
జనం లేంది మనం లేము.

- దాశరథి. దీపావళి

మనజనంలో విధి. అదృష్టం. కర్మ - ఇటువంటి వన్నీ దౌర్జన్యాన్ని దుర్మార్గాన్ని సహిస్తూ చచ్చి పోయే మానసిక దౌర్బల్య మెక్కువగా ఉంది.

- సుబ్రహ్మణ్యశర్మ. బంకోలా.

అసలు సిసలు కవితకోసం
ఆపసోపా లనవసరం
అసలు జనం నాడి తెలిస్తే ..

- హర్షవర్ధన్. వసంతగీతం

తా రెంత. పూజ్యులైన జనుల పొందు లెస్స.

- తిక్కన. విరాటపర్వము

జననసంఖ్య

జన సంఖ్య పెరగకపోతే పాపుల సంఖ్య పెరగదు.

- కొడవటిగంటి. న్యాయసూక్తాలు

**జంతువు**

యే లక్ష్యమూ లేని మనిషి జంతువుతో సమానం.

- నవీన్. ప్రమాదాల్లో ప్రమదలు

**జందెం**

జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమేల?

- సామెత

బ్రాహ్మణులకు యజ్ఞోపవీతము పరమోపకార మగు వస్తువు. అందులో నావంటివానికి మిగు లనుపయుక్తమైనది.

దీనిచేఁ దల్పుగడె లూడఁదీయవచ్చు
దీనిచే సీల నగలకుఁ ద్రిప్పవచ్చు
దీనిచేఁ గొల్వవచ్చు భిత్తికి సురంగ
దీనిచే పాము విషమును దింపవచ్చు

- తి.వేం.. మృచ్ఛకటికము

జన్మ

సాలగ్రామఖనిన్ జనించునె కదా
జాత్యల్ప పాషాణముల్?

- రామకృష్ణకవి. పాండురంగ మాహాత్మ్యము

జన్మఫలం

మనసులోఁ బుట్టిన మంచి తలంపు
లాచరణమునందు నలవికాకున్న
జన్మఫలం బేమి? చచ్చుటే మేలు!

- శ్రీనాథుడు. పలనాటి వీరచరిత్ర

జన్మహక్కు

ఎవర్నో ఒకర్ని మూతీ ముక్కూ తుడిచి పెంచి పెద్దవాళ్ళను చేసి ఆ తరువాత మొర్రో నే చెప్పిన మాట వినడంలేదని వాపోటం ఆడదాని జన్మహక్కు.

- పురాణం, హోమ్ స్వీట్ హోమ్

ప్రపంచంలో ప్రతి రచయితకూ కాపీరైట్ (కాపీ చేసుకునే హక్కు) వుంది. అది రచయిత జన్మ హక్కు.

- పార్థసారధి, సాహిత్య హింసావలోకనం

జన్మోత్సవం

జన్మోత్సవ సంరంభం చేస్తున్నారు
బంధువులూ మిత్రులు నవ్వేస్తున్నారు
జీవితము ఒక వర్షం గడచినవేళ
దుఃఖించాలన్నది మరిచేస్తున్నారు.

- దాశరధి, రూబాయీ

జన్యజనకాలు

జన్యజనక పదార్థములకు తత్త్వతః భేదములేదు.

- విశ్వనాధ, వేనరాజు

జపతపాలు

జపతపములంచు మడియంచు స్నానమనుచు
నొఱలుచున్నారు యెముకలు గొఱుకుచుండ
కంటఁబడవు మెతుకు లొంటిగంటకైన
నెందు కదియూసులెస్, వట్టి యేభ్యరాశి.

- హనుమంతరావు, లేడీడాక్టరు

జబ్బు

జబ్బు నయమయ్యాక రోగిదగ్గర వైద్యుడు కూర్చుంటే మళ్ళీ జబ్బు రావచ్చు

- కాంతారావు, అభ్యుదయం

ఊరి జబ్బు చాకలి ఎరుగును, ఉద్యోగి జబ్బు బంట్రోతు ఎరుగును.

- సామెత

జయం

తెలివితక్కువ వాళ్ళు సత్యమే జయమంటారు గాని నిజానికి అసత్యమే జయం.

- కందుకూరి, మహావంచకప్రహసనము

జయాపజయాలు

జయము లపజయములు సంపద లాపద
లనిల చలిత దీపికాంచలములు
చంద్రకళలు మేఘచయము తరంగలు
మెఱుఁగు లందురయ్యా! మిట్టిపడకు

- పోతన, భాగవతము

జర్నలిజం

జర్నలిజం పవిత్ర ఉద్యమంగా
పచ్చనోట్ల వ్యాపారంగా పరిణమించింది.

- విజయలక్ష్మి, మహాప్రస్థానపర్వం

జల్లు

ఆకాశం చివుక్కుమన్నప్పుడు
అవకాశం చూసుకు
నేలరాలుతుంది
చిరుజల్లు.

- శ్రీనివాసరావు, దుఃఖం

జలగ

మనదేశంలో
జలగలు
నీట్లో ఉండవు
ఎక్కువగా పదవుల్లోనే.

- రాజేంద్ర, గుండెచప్పుళ్లు

జాగ్రత్త

కన్నొకటి నిద్రవోఁ బెఱకంట జాగ
రంబు గావించు భూరుహాగ్రంబు మీఁది
యచ్చభల్లంబు గతి భోగ మనుభవించు
నెడను బహిరంతరరులపై దృష్టి వలయు.

- శ్రీకృష్ణదేవరాయలు, ఆముక్తమాల్యద

క్వార్టర్స్ మార్చారేమంటే బెటర్‌హాఫ్ వచ్చింద న్నాట్ట.

- శ్రీరమణ, న్యూసుడి

ఇల్లు కాలుతుంటే వాసాలు దూసుకొన్నట్లు.

- సామెత

బిచ్చం వేయకుంటే మానెగాని,
కుక్కను విడువకు అన్నట్లు.

- సామెత

పాలతో మూతికాలినవాడు మజ్జిగ ఊది ఊది తాగాడు.

- సామెత

కరెంటు ఉండగానే కొవ్వొత్తి వెదకడం మంచిది.

- శ్రీరమణ, న్యూసుడి

అనువుగాని వేళ నధికుల మనరాదు
కాల మెఱిఁగి రీతిఁ గడపవలయు.

- వేమన

తుట్టెని గట్టిగా పట్టుకో! కందిరీగలు కరవ్వు.

మెల్లిగా పట్టుకో! ముక్కలెక్క లాగేస్తాయి.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

ఒంటిమీద జాగ్రత్తలేని వాళ్ళకి పనిమీద ఏముంటుంది?

- చలం, ఆరంభింపరు...

తలఁచి చూడ రిపుఁడు తనకంటె ఘనుఁడైనఁ దనరఁ దన్ను దాఁచికొనఁగవలయు.

- దూబగుంట, పంచతంత్రము

పొయ్యిమీదున్న కూరనీ, పొరుగూర్లో వున్న పెనిమిటినీ ఒక కంట కనిపెట్టాలి.

- బీనాదేవి, ఢి బెట్

కళ్లులేని వాడెప్పుడూ జాగ్రత్తగానే వుంటాడు. కళ్లున్నవాడే -చూస్తూ చూస్తూ గోతిలో పడతాడు.

- సూర్యారావు, ఎవరో పిలిచారు

కొంప అంటుక పోతూ ఉంటే, నీళ్ళబాన నిప్పు దగ్గర పెట్టిందట.

- సామెత

### జాణతనం

సందాకవళమమ్మా అంటే, మాయింటి మనిషి ఎదురు పడలేదా! అన్నదట.

- సామెత

### జాతకం

పిక్చర్ బతుకు ప్రీవ్యూరోజే తెలుస్తుంది.

- శ్రీరమణ, న్యూసుడి

ఎసెంబ్లీకి పోటీచేసి ఓడిన వ్యక్తి గెలిచి ఉంటే మినిష్టరై పోయేవాడు.

- ముళ్లపూడి, ఏకలవ్యుడు

### జాతర

కాకర బీకర కాకు జాతరే? అంటే దూబగుంటకు దూదేకను జాతరే అన్నాడట - ఇంకొక దూదేకుల సాహేబు.

(ఉరుదు వచ్చీరాని దూదేకుల వారి సంభాషణ)

- సామెత

### జాతి

... ...పంచమజాతి వారికిన్
కూడు హుళక్కి మానవతగూడ హుళక్కి
హుళక్కి జన్మమున్.

- జాషువా, నా కథ

### జాతిగౌరవం

జాతిగౌరవానికి, సంఘ చైతన్యానికి గడ్డీ కఱవాలి, అగచాట్లూ పడాలి. వాళ్ళకోసం, ధర్మశాస్త్రాలు కదలి రావాలి.

- వేదాంతకవి, తెనుఁగుతల్లి

### జాతి పశువు

విద్యలేని వాడు వింతపశువైతే కాసులున్నవాడు జాతిపశువు.

- రావిశాస్త్రి, కుక్కపిల్ల

### జాతిభేదం

మానవేతర జీవుల్లో జాతి భేద ప్రమేయం లేదు.

- రావిశాస్త్రి, పిపీలికం

### జాతీయత

అధికారంలో ఉన్నవర్గం మిగిలిన వర్గాలమీద తన పెత్తనం సుస్థిరం చేసుకోటానికి చేసే ప్రయత్నం జాతీయవాదం.

- గోపీచంద్, కులతత్వం-జాతీయవాదం

### జారుడు

కొండమీదినుండి బండ జారితే మధ్యలో ఆగుతుందా?

- సుంకర, కోతలరాయుడు

కాలుజారినఁ గలసివచ్చునుగాని, నోరు జారినఁ గలసిరాదు.

- కొచ్చెర్లకోట, పెట్టమారి మగఁడు

### జాలి

జనసంఘమునకు జాలి స్వాభావికము. రామాయణ నాటకమంతా విని తుదకు దుర్మార్గుఁడగు రావణుఁడు పోయినాఁ డన్న కంట తడిఁ బెట్టెదరు.

- భుజంగరావు, నిరపవాద ప్రహసనము

రాయి అయిపోయిన గుండె, జాలికి కరుగదు.

- రామకృష్ణశాస్త్రి, సాని - పాప

### జాస్తి

కొండ మిరపకాయకు కారం జాస్తి, పొట్టివాడికి బుద్ధులు జాస్తి.

- సామెత

### జీతం

అడిగిన జీతం బియ్యని
మిడిమేలపు దొరను గొల్చి మిడుకుట కంటెన్
వడిగల యెద్దులఁ గట్టుక
మడి దున్నుక బ్రతుకవచ్చు మహిలో సుమతీ.

- బద్దెన, సుమతి శతకము

ఉపాధ్యాయులకి ఇచ్చే జీతాలకి, కుక్కలు కూడా పని చెయ్యవు. కాకులు కూడా బతకలేవు.

- చలం, మ్యూజింగ్స్

జీతం లక్ష్మణరేఖలా
జీవితాన్ని ఎదగనియ్యదు.

- సౌభాగ్య, సింహావలోకనం

ఇప్పుడు సినిమానటుల జీతములలో సగము లేవు హైకోర్టు జడ్జీ జీతములు.

- బంగారయ్య, రాజ్యలక్ష్మి

**జీలుగు**

...జీలుగు వెరిగిన
మాలెకుఁ గంబంబు గాదు...

- నాచన సోమన, ఉత్తరహరివంశము

**జీవగ్ర**

మాలాంటి సరదాలున్న కుర్రకుంకలకు మీవంటి ఫూల్స్ జీవకర్రలు.

- రామకృష్ణశాస్త్రి, మీమాంస

**జీవనం**

వాళ్ళకీ వీళ్ళకీ జుట్టు ముడేసి జీవనం జేస్తున్నాడు.

- గురజాడ, కన్యాశుల్కం

రాజు జీవించె రాతి విగ్రహములందు
సుకవి జీవించె ప్రజల నాలుకలయందు.

- జాషువా, వ్యత్యయము

యే కొందరో తప్పించి జనం అంతా ఇతరుల కళ్ళలోంచి జీవిస్తా రనిపిస్తుంది.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

ఎవరి జీవన రేఖలు వాళ్ళచేతుల్లోనే ఉంటాయి. ఆరేఖల గతుల్ని మార్చే శక్తి సామర్థ్యాలు వారి వారి ఆత్మలకు ఉంటాయి.

- ఠాకూరి, శ్రావణసంధ్య

**జీవనాధారం**

ఆభరణములు హిందూదేశ స్త్రీలకు జీవనాధారములైన ఆస్తి.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

**జీవి**

పైరుపండిరాలినట్లు
ముసలియై లయించు జీవి
రాలి మరల వచ్చు ననుట
రమ్యమైన యెండమావి.

- అబ్బూరి, శ్రుతి

చచ్చిపోయి జీవి ఎచ్చటికేగునో
ఏమియగునో ఎవరి కెరుకలేదు
ఎరుకలేనివార లేమేమొ చెప్పగా
విని తపించువారు వేనవేలు.

- అబ్బూరి, చాటువు

**జీవితం**

జీవితం హాయిగా జీవించడానికేగాని నిరాశతో నిట్టూర్పులతో గడపటానికి కాదు.

- రామచంద్రమూర్తి, శ్రీరాగం

జీవితం లాటరీ!... అందరికీ 'ప్రైజు' దొరకదు.

- రామచంద్రమూర్తి, శ్రీరాగం

బ్రదికిన నెల్లశుభములుఁగలుగు
నీసు మానుము చచ్చిన నేమిగలదు?

- తిక్కన, కర్ణపర్వము

చావు నిక్కంబు బ్రతుకుట సంశయంబు.

- శ్రీనాధుడు, కాశీఖండము

జీవితాన్ని పరిపూర్ణంగా పరిశీలించాలనే కోరిక న్యాయమైనది.

- గురజాడ, సంస్కర్త హృదయం

పాతగుడ్డలు పారవేతుము
క్రొత్తమడతలు కట్టుకొందుము
చావు బ్రతుకుల సత్యమింతే...

- రాయప్రోలు, భద్రయాత్ర

చేదువిషం జీవఫలం!
జీవఫలం చేదువిషం.

- శ్రీశ్రీ, చేదుపాట

వడ్డించిన విస్తరి మీ జీవితం
నిశ్చల నిశ్చితాలు మీవి.

- శ్రీశ్రీ, వ్యత్యాసం

మనమంతా బానిసలం,
గానుగలం, పీనుగలం!
వెనుక దగా, ముందు దగా
కుడి యెడమల దగా, దగా!

- శ్రీశ్రీ, చేదుపాట

గతముఁ జూతమన్నఁ గలదన్న యర్థంబు
నడచుకాలమేని నమ్మరాదు
క్షణములోని బ్రతుకు సంసార విభ్రాంతి.

- వేమన

బ్రతుకంటే కంబళీమీద పవ్వళింపుకాదు, కత్తి మీద సాము.

- బుచ్చిబాబు, రాయల కరుణకృత్యం

జీవితంలో నెగ్గాలంటే డ్రైవ్ ఉండాలన్నారు.

- బుచ్చిబాబు, ఆత్మవంచన

జనానికి జీవితంమీద మమత హెచ్చుతున్నది.

ఇక ముందు వాళ్లు ఆదర్శాల కోసం స్వసుఖాన్ని త్యాగంచేసి కోరికలను మీదుకట్టి కూచోరు.

- కొడవటిగంటి, వారసత్వం

జీవితాన్ని వెనక్కి తిరిగి చూసుకుంటేగాని అందులోని రుచులు సరిగా తలకు పట్టవు. అందుకే కథకులు కథలన్నీ గతంలో ఉంచి రాస్తారు.

- కొడవటిగంటి, ఐశ్వర్యం

బతకటం చాతకాని వాళ్ళు చాలాకాలం బతక కూడదు.

- కొడవటిగంటి, ప్రేమించిన మనిషి

ఒక జీవితం పంచుకుంటున్న వ్యక్తుల్లో ఒకరిని విడిచి మరొకరు చచ్చిపోవటం చాలా పాతకం.

- కొడవటిగంటి, రాధమ్మ కూతురు

జీవితం భయంకరమైనది. అది నాకు అర్థం కాదు.

- కొడవటిగంటి, జీవితం

వాస్తవజీవితం బుద్ధిమంతుడైన పెద్దమనిషిలా గుండదు; జూదగాళ్ళను, తాగుబోతులనూ, వెర్రి ముండా కొడుకులను జ్ఞాపకం చేస్తుంది.

- కొడవటిగంటి, జీవితం

జీవితం సబ్బునీళ్ళలాంటిది. అట్టడుగున మురికి, దానికి ఎగువగా నీరు, ఇంకా ఎగువన బుడగలు.

- కొడవటిగంటి, ట్యూటర్

మనుషుల వాక్చాతుర్యానికి జీవించవలసిన జీవితానికీ ఏమీ సంబంధంలేదు.

- కొడవటిగంటి, పెళ్ళి-వ్యవహారం

మనము జీవితము గురించి తాత్వికంగా ఆలోచించంగనక జీవితాన్ని భరించగలుగుతున్నాము. లేకపోతే నూటికి 99 పాళ్ళు బతుకంతా హంబగ్ కదా!

- కొడవటిగంటి, ప్రేమించిన మనిషి

అచ్చగా మాటల్లో ఉన్నదే అర్థం చేసుకుంటే అది నాటకం కావచ్చుగాని జీవితంమటుకు కాదు.

- కొడవటిగంటి, జీవితం

ఆకాశంలోకి ఎత్తుగా వెళ్ళినకొద్దీ ప్రాణవాయువు తగ్గినట్లుగా ఈ సమాజంలో మనుషుల స్థాయి పెరిగినకొద్దీ వాళ్ళ మధ్యగల జీవిత బంధాలు సడలిపోతాయి లాగుంది.

- కొడవటిగంటి, ఎండమావులు

విస మమృతమట్టు లమృతంబు విసమురీతిఁ జిత్రచిత్రగతుల మార్చు జీవితంబు!

- దేవులపల్లి, నా జీవితము

ఈ ప్రవాస యాత్రారతి నిటులె నేను
కదలిపోవుదు నాశావకాశములను
ఒక్క నిట్టూర్పు పోలిక, ఒక్క మౌన
బాష్పకణ మటు, ఒక గాఢవాంఛ పగిది.

- దేవులపల్లి, నేను

జీవితము వర్తకము వంటిది. ప్రతిదినము లాభనష్టములు చూచుకొనినచోఁ దెలియదు.

- విశ్వనాథ, చెలియలికట్ట

జీవితములో నొకటి యున్నచో నొకటి యుండదు.

- విశ్వనాథ, చెలియలికట్ట

జీవితమనే ఆటలో లాభనష్టాలమీది దృష్టి సన్నగిలకూడదు, సుఖపడాలంటే.

- చలం, నవయవ్వనం

జీవితమంటే కాలంలో కదలిక.

- చలం, మ్యూజింగ్స్

ఎంతవానికైన సరే బ్రతికియుండునంతవఱకుఁ బరసాహాయ్యముకై యోచింపక తప్పదు. చచ్చిన తరువాతఁ గూడఁ బరసాహాయ్య మావశ్యకమే. మేము స్వతంత్ర జీవులమని విఱ్ఱవీగు వారికంటె వెఱ్ఱివారు లేరు.

- పానుగంటి, సాక్షి

బ్రదుకులోఁ జావున్నది. చావులో బ్రదుకున్నది. ప్రపంచమున నెక్కడ జూచినను రెండు పేటల బొంగరపు జాలివలె సత్తును నసత్తును పెనవైచికొనియున్నవి.

- పానుగంటి, సాక్షి

ప్రిజంలాంటిది జీవితం
వేర్వేరు కోణాలు ప్రదర్శిస్తుంది.

- తిలక్, న్యూ సిలబస్

జీవితమే ఒక జూదం
ఖేదానికి మోదానికి లే దసలే భేదం.

- తిలక్, కాయ్ రాజా కాయ్

నువ్వు ఎక్కదలచుకొన్న రైలు
ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు.

- ఆరుద్ర, నీటి గడియారం

పొగ త్రాగని నరు బ్రతుకును
పొగడంగా నియ్యలేని భూపతి బ్రతుకున్
మగ డొల్లని సతి బ్రతుకును

నగడు సుమీ...

- కవిచౌడప్ప, శతకము

జీవితానికి ప్రతీక సముద్రం. జీవిత నాటకంలో లేస్తూ, పడుతూ, లేచే తెరల్లాంటివే సముద్రంలో తరంగాలు.

- శ్రీశ్రీ, అనంతం

ఒక్కొక్క జీవితానికి హృదయమే పునాది అయితే, మరొక్కొక్క జీవితానికి మేధస్సే ప్రధానం అయి ఉంటుంది.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, గులాబీ అత్తరు

ప్రతిఘటనలు తటస్థించితేనే జీవితానికి పరిణతి.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, గులాబీ అత్తరు

ప్రతిఘటనలు అతిక్రమించగలిగితేనే జీవితానికి విజయమున్నూ.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, గులాబీ అత్తరు

ఒడుదుడుకుల జీవితంలో ఉన్న ఆనందం, సాఫీగా జరగటంలో ఉండదు కాబోలు.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

బతకాలి అనుకోవటం మనుష్యులకు తప్పించుకోలేని వ్యసనం అయింది.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

చచ్చేవరకు బతకటం తప్ప ఈ ప్రపంచంలో చేసేది ఏమీలేదు.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

జీవితమంటే తెలుసుకోగలిగేటప్పటికే మరణం వాస్తోంది.

- ధనికొండ, పవిత్రులు

మనిషి, యేమీ అనుకోకండా ఉంటే; జీవితం దానంతట అది యెటోకటు సాగిపోతుంది.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

జీవితానికి కట్టడి, క్రమశిక్షణ, చాల అవసరమే. కాని వాటి మంచి చెడులు వాటి ధ్యేయంపై ఆధారపడి ఉంటుంది.

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

ప్రతి జీవితమూ ఒక అనుభవాల పుట్ట. కదిలిస్తే అందులోంచి మొగలి పువ్వుల పరిమళం రావచ్చు. పడగ విప్పిన పన్నగమూ రావచ్చు

- పాండురంగారావు, అనుబంధం

విధి, ఖర్మ ఇవన్నీ చేతగాని వాళ్ళమాటలు. జీవితం మన చేతుల్లో ఉంది. మనం నిర్ణయించుకోవాలి.

- ఆనందారామం, అద్దంలో శత్రువు

జీవితం ఓ చిన్న సంఘటనతో పతనానికి దారి తీయవచ్చు - లేదా ప్రగతి వైపు మరలవచ్చు

- పులికంటి, తీయలేని కలువు

పురిటి మంచం మీదనుంచి వల్లకాట్లో చేరే వరకూ కల చిరసంఘర్షణే మానవ జీవితం.

- పురాణం, నాన్నగారి శవం

చదువులో లాస్టు; తెలివి తేటల్లో ఫస్టు; రాజకీయాల్లో ఆపర్చూనిస్టు; భోజనం విషయంలో స్పెషలిస్టు; చేబదుళ్ళల్లో గోల్డ్ మెడలిస్టు; వేదాంతంలో కర్మిస్టు; తెల్లదొర ఉన్న వరకు లాయలిస్టు; వాయిద్యంలో హార్మోనిస్టు; అవసరమైతే టైపిస్టు; కులం మీ కాస్టు; మిగిలింది పాస్టు; లైఫ్ చెప్పదలచుకుంటే వాస్టు.

- పూర్ణానందం, లోకయ్యమామ

పరిస్థితులకూ, పరిసరాలకూ సర్దుకోవడమే జీవితం.

- రాజారాం, మరీచిక

జీవితం లయ తప్పకుంగా గడిస్తే చాలదు. అది అర్థవంతం కూడా కావాలి.

- హితశ్రీ, నూరుశరత్తులు బ్రతకాలి

పెళ్ళి చేసుకోనంత వరకు గాలిగుడ్డు, మోహంలో పడినంతసేపు ఝంఝూ మారుత బీభత్సం. తరువాత సంసారంలో అగమ్యగోచరం అయోమయమున్నూ.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

కథలా జీవితం యెప్పుడూ సహజంగా నడవదు.

- పద్మనాభరెడ్డి, అంతర్వేదన

జీవితం మధ్యమధ్య చదవటం కుదరని సీరియల్ కథ.

- పద్మనాభరెడ్డి, అంతర్వేదన

నాకీ జీవితం చాలింక; నోటికి తీపి తెలిసింది. మనసులో విషం విరిగింది.

- మల్లికార్జునరావు, మారనిమనిషి

లైఫ్ చూశావ్, అది మనల్ని లాగాల్సిందేకాని మనం దాన్ని లాగలేమోయ్.

- రామదాసు, మాస్టర్జీ

పాతబడిన పురాణాల
పాతర్లను త్రవ్వితోడి
చేతలతో చేదస్తం
చెరగడమే బ్రతుకుదెరువు

- మల్లారెడ్డి, భక్తిరసం

జీవితం, మనిషిలో మార్పు తెస్తుంది. అందుకు అనుభవం కారణ మవుతుంది.

- కాళీపట్నం, భయం

క్రమబద్ధత, నిబద్ధత, నియతి మొదలైనవన్నీ జీవన సౌధానికి శిలాస్తంభాలు. ఈ శిలాస్తంభాలు లేనిదే సౌధం నిలవలేదు.

- సంజీవదేవ్, కళలో నియతి రాహిత్యము

ఈ జీవిక వ్యర్థశ్రమ నిరర్థక విషాదగాథ
ఈ మనుగడ నిరాధార మని అనుకొన్నాను గాని
వెనుదిరిగి విలోకిస్తే కనిపించిం దొక సత్యం
జీవించిన ప్రతిక్షణం పూర్ణ మక్షరం నిత్యం.

- అబ్బూరి, సన్నుతులు

జీవిత మొక ఆవులింత
జీవిత మొక వొళ్లు విరుపు
జీవిత మొక గజ్జికురుపు

- బైరాగి, త్రిశంకు స్వర్గం

జీవిత జ్వరం దహిస్తున్నది దేహాన్ని.

- బైరాగి, రంగులతోట

జీవితం తింటోంది తనను తాను
కాలే కడుపు నింపుకొనేందుకుగాను
క్రొవ్వొత్తిలా తింటోంది తనను తాను!

- బైరాగి, పలాయనం

జీవితమొక తెల్లటావు!

- బైరాగి, పలాయనం

జీవిత మొక మాయనాటకం!
జీవిత మొక క్షణికోన్మాదం
జీవిత మొక వ్యర్థవినోదం

- బైరాగి, పలాయనం

మన జీవితాన్ని మనం కాకపోతే ఎవరో వచ్చి మలచరు.

- జయప్రద, ఇదా నువ్విచ్చే తీర్పు?

హెచ్చరికలు లేని సంఘటనలు ఎన్నో జరుగుతూ ఉంటాయి జీవితంలో.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

పుట్టటం - గిట్టటం రెండూ ఒకే దారపు రెండు కొనలు. ఆదారపు పొడవు ఎంతో ఎవరికీ తెలియదు. ఎక్కడైనా అంతం కావచ్చు లేక ఎప్పుడైనా పుటుక్కు మనవచ్చు

- విహారి-శాలివాహన, అభాగ్యుని అంతిమయాత్ర

పౌరుష జ్ఞానకీర్తులఁ బరగనేని
వాని జన్మం బదొక్క పూఁటైనఁ జాలు
నుదరపోషణమాత్ర కీయుర్వి మీఁదఁ
గాకి చిరకాల మున్న నేకార్య మగును?

- లక్ష్మణకవి, సుభాషితావళి

భుక్తికోసం వేట, వేట కోసం పాటు, పాటులో శ్రమ, శ్రమలో విశ్రాంతి, విశ్రాంతిలో కోరికలు, తీరుతున్న కొద్దీ ఆనందం, ఆనందం నడుమ అసంతృప్తి - ఇలా ఉంటుంది జీవితం.

- శ్యామలారాణి, పవిత్ర

జీవితమే తియ్యటి బాధ.

- కౌసల్యాదేవి, తీయనిబాధ

దిక్కులన్నీ గిలకొడుతూ
తరలిపోయే జీవితం
తిరిగిచూడని చిరపథం.

- సినారె, విశ్వంభర

సందేహంలేదు.
ఈ దేశంలో జీవితం మృత్యువుముందు శ్రోత.

- శ్రీనివాస్, సంధ్యార్ణవం

ఈ జీవితం కేవలం నల్లపూసకాదు
మహామేరువూ అవడంలేదు...
చిత్రంగా బహిరంగ సంతాప
సభలాగా సాగిపోతుంది
పత్రికలోని పతాకశీర్షికవలె
వెతక్కుండానే కనిపిస్తుంది

- ఆంజనేయశాస్త్రి, ఇది జీవితం

ఒక్కొక్కజీవితం మృత్యువుతో ముగిసే గ్రంథం.

- విష్ణుప్రియ, తారతమ్యాలు

సమస్యలనూ బాధలనూ సమానంగా తీసుకోవడమే జీవితం.

- భారతీదేవి, సుడిగుండాలు

జీవితం అనేది ఎలక్ట్రిసిటీ లాంటిది. దాంతో నువ్వు సుఖపడాలన్నా, ధ్వంసం కావాలన్నా ఒక్కొక్కప్పుడు అజ్ఞానాంధకారంలో నువ్వు చేజిక్కించుకునే స్వేచ్ఛనిబట్టి ఉంటుంది.

- భరాగో, నాకీ ఉద్యోగం వద్దు

జీవితం అసిధారావ్రతం
నూలుపోగుకింద సాము
మరణంపై తిరుగుబాటు.

- గంగినేని, అరచేతిలో మృత్యువు

ఒక్కొక్క మనిషి జీవితం
వ్యాఖ్యానించదగిన ఒక్కొక్క సూత్రము

చివరి అక్షరం చదివేవరకూ
అర్థం గ్రహించడం సులభంకాదు

- రంగారావు, ముక్తకాలు

జీవితం జీవితంకోసం కాదు
ఇతర జీవితాలకోసం!

- అద్దేపల్లి, ఎందుకీ జన్మ?

భగవంతుడు జగత్తనే తన భోగమందిరంలో
అంటించుకొన్న అగరువత్తి యీ జీవితం.

- అద్దేపల్లి, ఎందుకీ జన్మ?

ఈ జీవితం తొలినాటి స్థాణువు కాదు
ఈనాటి మారణపరమాణువు కాదు...
ఈ జీవితం సరళరేఖకాదు
వర్తులరూపంలోనూ చుట్టుకోదు.

- ఆంజనేయశాస్త్రి, ఇది జీవితం

హింసించిన మానసంలో మచ్చ జీవితం
విప్పివైచిన శూర్పణఖావస్త్రం జీవితం

- లత, నారీ! ఓనారీ!

జీవిత మొక ఆరాటము
జీవిత మొక పోరాటము.

- పొట్లపల్లి, జీవితం

అవకాశాల ప్లాటుఫారాలు
అదృష్టాల రైళ్లూ ఏమీలేని
సిటి బుకింగ్ ఆఫీసేనా
జీవితం?

- ఆరుద్ర, సినీవాలి

జీవితాహికి వేయినాల్కలు, లక్షచీల్కలు,
కోటికోరలు.

- బైరాగి, రాస్కల్నికావ్

నిప్పులాంటి జీవితం
నేటి మానవుణ్ణి
బూడిద చేయకుండా కాల్చుతుంది.

- జ్వాలాముఖి, నేటిమానవుడు

జీవితమంటే తాత్త్వికచింతనకాదు
తరతరాల ప్రాభవస్మృతులు కాదు
ఆకలిముళ్ళల పోరాటం
ఆశలమెరుపుల ఆరాటం.

- రాధేయ, చైతన్యబావుటా

జీవితం ఎడారి అయితే
జీవిక పచ్చిక
ఆశ మరీచిక.

- గౌరీశంకర్, ఎండమావి

జీవితమొక మహాప్రయాణం. ఎక్కడికి వెడుతున్నామో మనకే తెలియదు. తెలుసుకుందామన్న ప్రయత్నం కూడా వుండదు. అయినా వెళ్లక తప్పదు.

- భాస్కరభట్ల, రైలులో

వర్తమాన సంఘంలో
ప్రతివొక్కరి జీవిత మొక మహాభారతం
ప్రతివొక్కరి బతుకు వొక ఉత్తరరామం.

- విజయలక్ష్మి, శోకంలో అశోకనిలయం

జీవనమూ... మాధుర్యము
అనడం విన్నాను కానీ
కనేవన్నీ కంటకాలు
నడకంతా రాళ్లదారి!

- రామనరసయ్య, అసిధార

## జీవితయాత్ర

అంధకారంలో, దోవతెలీక తడుముకోడమేగా జీవితయాత్ర అంటే!

- చలం, అరుణ ఆర్గ్యుమెంటు

## జీవిత సత్యం

శరీరం పుట్టినప్పుడు చిన్నదిగా పుట్టి, పెరిగి పెద్దదయి అభివృద్ధి చెందుతుంది. ఆత్మ ముదుసలిగా జన్మించి, వయస్సు పెరిగిన కొద్దీ పసిపాపలా మారుతుంది. అది జీవితంలో గొప్ప విషాదకరమైన సత్యం.

- బుచ్చిబాబు, ఒమర్‌ఖయామ్

## జీవితేచ్ఛ

బేడబిళ్ళే కాని, నా డబ్బు అని చెప్పుకోగలగటం ఎంత భాగ్యం?

- కొడవటిగంటి, జీవితేచ్ఛ

చీల్చిన శిరస్సులాగుంది జీవితం
అస్తమించే సూర్యబింబం లాగుంది ఆశ.

- రెంటాల, విగతం తరణ మంత్రవైతరణి

## జీ.వో.

జీ.ఓ. అంటే నపుంసక లింగంలో గవర్నమెంటు ఆర్డరు. మిగిలిన రెండు లింగాల్లో గెజిటెడ్ ఆఫీసరు. ప్రాణమున్న జి.ఓ.లు ప్రాణంలేని జి.ఓకు జడుసుకుంటారు.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

జీ.వో. అనేది ఎప్పుడూ ఏదీ తెగేసి చెప్పదు.

- కొడవటిగంటి, పెండింగుఫైల్

**జీసస్**

ఈశ్వరుడు పూనినప్పుడు ప్రపంచ చక్రవర్తిమల్లే మాట్లాడాడుగాని తక్కినప్పుడు నామల్లే పిచ్చి ముండాకొడుకుగా తిరిగేవాడనుకుంటాను జీసస్.

- చలం, మామయ్యలు

**జూదం**

తమలోన జూదంబు వాదు నగుటఁ
గలహమూలంబ యెట్టి శాంతులకు నైన.

- నన్నయ, సభాపర్వము

కుటిలమార్గు లయిన కుత్సితజీవుల
తోడఁ గడఁగి జూద మాడఁ జనదు
దానఁజేసి యర్థధర్మ వివర్జితు
లగుదు రెట్టివారు జగములోన.

- నన్నయ, సభాపర్వము

**జూదరి**

జూదరి యాలికి గఱువతనం బెక్కడి (య)దిః

- తిక్కన, విరాటపర్వము

జూదరి యసత్యమాడఁడు
లేదనఁ డిచ్చినది యావులింపడ నోరున్
గాదా, నేఁడన్నది రే
పౌ, దీనత జూపు వ్యసనమందున్ గుందున్.

- తి.వేం., వ్యసన విజయము

మనవంటి పెద్దమనుష్యు లాడునది జూదమే గాదు.

- తి.వేం., వ్యసనవిజయము

మానరు జూదరులు దాని మరణము దనుకన్.

- తి.వేం., పాండవ ప్రవాసము

జూదమనఁగాఁ బురుషునకు సింహాసనము లేని రాజ్యముగదా!

- తి.వేం., మృచ్ఛకటికము

అర్థమబ్బిన జూదంబునంద యబ్బు;
నాలు జూదరికే వశ్యురాలు, కుదువ
నొరుల కీయఁగఁ జెల్లు జూదరికె, జూద
గానికే పోవు ధనమెల్ల గడియలోన.

- తి.వేం., మృచ్ఛకటికము

జూదంబులోన నన్నృతము గలదే?

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

జూదమును ధాతువాదము
వేదంబునుఁ దాటఁ జే టవశ్యము గలుగున్.

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

మగవాడు జూదరి అయితే అది సహించగలిగే శక్తి ఆడదానికి ఉండకూడదు.

- రంగనాయకమ్మ, పేకమేడలు

**జెండా**

ఈళ్ళు జెండాలుపడితే మేము తుపాకులు పడుతాము.

- అప్పల్నాయుడు, పోడు-పోరు

జనం నా జెండా
జాగృతి నా ఎజెండా.

- సినారె, మథనం

**జేబురుమాలు**

జేబురుమాలా లేని జేబు చిలుకలేని పంజరం వంటిది. ఇల్లాలులేని గృహం వంటిది. కిల్లీ దుకాణం లేని వీధివంటిది.

- బాపిరాజు, కోనంగి

**జైలు**

జయిలులో జరిగే ఒక నేరమూ రిపోర్టు గాదు. ఒకడు సాక్ష్యం చెప్పడు. పదహారు వందల మంది దుర్మార్గులుండే ఖయిదులో ఒక్కనేరం గూడ జరిగినట్టు నేరపు జాబితాలో ఉండదు.

- ఉన్నవ, మాలపల్లి

ఆరునెలలు పోయి రావడంతో జైలు సౌకర్యాలు తెలుస్తవి. వేళ కింతన్నం, కట్టుకోను చల్లాడం, కప్పుకోను కంబడి, గచ్చుటింద్లు, అక్కడ మా ఒక్క కిటికీ కుండే యినుప సామాను గొప్ప వాండ్ల మేడలకు సరిపుచ్చవచ్చు. నిద్ర లేవడానికి మేలు కొలుపులు, తూర్యరావాలు, రాజదండం చేతపట్టుకొని ఎప్పుడు వెంట జవాను, వందలుదినే డాక్టర్లు, అడిగేవూ మా వైభోగం! చుట్టూ కోటగోడ, రాజలాంఛనాలు పుట్టి పడుతుంటవి.

- ఉన్నవ, మాలపల్లి

జైల్లో పట్టం ఒక సర్టిఫికెట్- అయిదెకరాల పారితోషికం ముట్టేందుకు.

- నంది, వానవెలిసింది

సెంట్రల్ జయిలు తప్పకుండా రాజభవనమే.

-కందుకూరి, మహావంచక ప్రహసనము

అడవికంటే జెయిలే మెరుగు.

- రావిశాస్త్రి, మోక్షం

జైల్లో వేస్తే రేషన్ కోసం పడిగాపులు తప్పుతాయి. తిండైనా దొరుకుతుంది.

- ఆత్రేయ, అద్దెకొంప

చెఱసాల మొగము స్వర్గము; గుండే నరకము;

అందు పరాయివానికి వింతలు వినోదములు, లోపలివారికి చింతలు, చికాకులు

- శివరామశాస్త్రి, వివాహబలి

మన జైళ్లు అన్నీ కళాఖండాలతో అలంకరించబడితే కొంతకాలం తరువాత అసలు జైళ్లు ఉండవలసిన పనే లేదు.

- సంజీవదేవ్, కళల పునరుద్ధరణ

అది ప్రభుత్వానికి జైలు - దొంగలకు ఖైదు - సత్యాగ్రహులకు శ్రీకృష్ణ జన్మస్థానం.

- గోపీచంద్, దేశం ఏమయ్యేట్టు!

ఇట వసంతము లేదు, సహింపరాని
గ్రీష్మ హేమంతకాల కాళికలెగాని;
ఇట ఉషస్సులు లేవు, భరింపరాని
అంబువాహసందోహ నిశాళిగాని.

- దాశరధి, జైలు

శ్రమయను మాటలేదు, బహుశాంతము జీవిత
మిచ్చుటన్, బరి
శ్రమ యను మాటలేదు, సుకరమ్ము దినమ్ము.
రవంతఁబుచ్చ యో
గ్యమగు తపోవనమ్ము, మరియాదల నేర్పెడు
పాఠశాల, నా భ్రమ గలిగించు నేరికిది, రమ్య
సుఖంబగు బందె, సౌమ్మురా!

- రాఘవశర్మ, రాయవేలూరు సెంట్రలుజైలు

లెక్కకుఁ బొద్దుటన్ ఫయిలు, లేచిన వెన్కను గంజి ఫైలు, ప్రొద్దెక్కిన పీచు ఫైలు, మఱియించుక తాళిన ముద్దఫైలు, నీ చక్కని ఫైళ్లలోఁ గొఱంత సల్పు ఫకీర్లును రాజమండ్రి జై లక్కట కక్కసంపు నరకాలయ మౌగద...

- మల్లావధాని, జైలు

పులి
మేకనుచంపితే
జైజైలు
మేక
పులిని చంపితే
జైలు.

- రాజేంద్ర, గుండెచప్పుళ్లు

## జోకర్

జోకర్ అదృష్టానికి చిహ్నం.

- తిలక్, కాయ్ రాజా కాయ్

## జోడీ

పృథివి పుట్టాక, యింతవరకూ సరియైనవాడికి తగిన పెండ్లాం దొరికిచావలా పాపం. నిజం చెప్పాలంటే ఆడదాని విషయమూ అంతే.

- పూర్ణానందం, కొండమీద విడాకులు

## జోరు

తలకొంచెము 'ఖాలీ' యయినప్పుడే జిహ్వకు జోరెక్కువ.

- పానుగంటి, సాక్షి

## జోల

పని లేక పొరుగిండ్ల కనయమ్ము పోవ
ఘనమైన ముచ్చట గలుగురా తండ్రి!
పాలు తాగీ నీవు పడియున్న యెడల
బాలయ్యతో కాస్త మాట్లాడి వస్తా
కలకాల మొకయింట కాపురము చేయ
కలుగుట కష్టంర కన్న నా తండ్రి!
పై డాబులేగాని పసలేదు చూడ
చూడరా! నీ తండ్రి వింత హొయలెల్ల
ధనము కొరకై నేను తారాడుచుంటి
అదియున్న నీ తండ్రి నవల కంపింతు.

- జోలపాట, (జానపదగేయం)

## జోస్యం

గార్గ్య సిద్ధాంతమత ముషఃకాలకలన
శకున మూనుట యది బృహస్పతి మతంబు
వ్యాస మతము మనఃప్రసాదాతిశయము
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము.

- వల్లభరాయడు, క్రీడాభిరామము

గడిచినదీ, గడవబొయ్యేదీ ఒక్కటే straight line. అందువల్లనేమో భవిష్యత్తును కొందరు చెప్పగలుగుతారు.

- చలం, మ్యూజింగ్స్

నిత్యనూతన కారణాలు చెప్పే న్యూమరాలజీ
నిద్రలో కూడా నవ్వు తెప్పించే హ్యూమరాలజీ.

- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

## జోస్యుడు

అరుగుమీది సాముద్రికుడు
అదృష్టం నీదే నన్నాడు
అదృష్టాలు పంచేవానికి
అర్ధరూపాయి ఫీజు దేనికి?

- మాలకొండారెడ్డి, గీతలోనే ఉంది

జాతకాలూ, గ్రహాలూ, జ్యోతిష్కుల చేతులో వున్నవి.

- కందుకూరి, హాస్యసంజీవని

జ్ఞాతి

జ్ఞాతివైర ముండును బుష్పజాతి కైన.

- చిలకమర్తి, గయోపాఖ్యానము

జ్ఞాతు ద్రోహులు, వారు సేయు కపటేర్ష్యాది క్రియా దోషము
ల్మా తంద్రాన సహింపరాదు, ప్రతికర్మం
బించు కేc జేయcగాcబోతే దోషము...

- ధూర్జటి, శ్రీకాళహస్తీశ్వరశతకము

జ్ఞానం

తెలివున్నంత సేపే కాని తెలివి తప్పిపోయేక దీపం ఉన్నా ఒకటే, లేకపోయినా ఒకటే. చచ్చినవాళ్లకి సౌఖ్యా లక్కర్లేనట్టు.

- రావిశాస్త్రి, ఎండ

నాలుగు రోజులపాటు ఆడవాళ్ళను కలవకుండా చేస్తే తాము ఎటువంటి బానిసత్వంలో ఉన్నదీ కూపస్థమండూకాల్లాగా ఎట్లా జీవిస్తున్నదీ వాళ్ళకు తెలిసివస్తుంది.

- కొడవటిగంటి, చదువు

ఆడదానికి తెలుస్తుంది బిడ్డ సంగతీ గొడ్డు సంగతీనూ!

- వివినమూర్తి, ఉద్యమం

జ్ఞానంలో ఉంది బాధ, బాధలోన అనుమానం నిత్యం నిరుత్తరువు ప్రశ్న జ్ఞానం ఇచ్చిన దానం అజ్ఞాతంలోంచి మరల అజ్ఞాతంలోకి ప్రయాణమే జ్ఞానం.

- బైరాగి, హామ్లెట్ స్వగతం

జ్ఞానం ఒక రంపంలా చీల్చి కోసి మానవుణ్ణి తుత్తునియలు చేస్తుంది. అనస్తిత్వపరిచయాన్ని క్షుద్రాస్తిత్వపు టావేదనతో ముడిచేస్తుంది.

- బైరాగి, హామ్లెట్ స్వగతం

నిజానికి దారితప్పి నడిచేది ఎవరైనాకానీ, కొన్నాళ్ళకి దారి తెలుసుకుంటారు. మనిషి చేసిన తప్పులు తెలుసుకోకుండానే ఎప్పుడూ జీవితం ముగిసిపోదు.

- రంగనాయకమ్మ, పేకమేడలు

జ్ఞానం నిలకడ నీటి వంటిది. భావాలు ప్రవాహతుల్యాలు.

- ఉన్నవ, మాలపల్లి

విరామం లేదు విజ్ఞానికి
సందేహం తీరదు వేదాంతికి

- ఆరుద్ర, త్వమేవాzహమ్

విజ్ఞానం
వికసించిన మూడవకన్ను
వివేకం
నీకున్న ఒకేఒక్క దన్ను

- ఆరుద్ర, త్వమేవాzహమ్

...వ్రేళ్ళతో మొదలుచూచి
చెట్టెఱుcగు వారి కాకులు సిదుమనేల?

- నాచన సోమన, ఉత్తర హరివంశము

విశేష విషయములలో మిడిమిడి జ్ఞానమున్న వాc డెందునకు దెలియనివాcడే! కొలcది విషయములలోనైనc బూర్ణముగc దెలిసిన వాcడు దానిలోనైనను దెలిసినవాcడే యగును.

- పానుగంటి, సాక్షి

జ్ఞానికి స్వార్థమే మొదటి మెట్టు.

- బుచ్చిబాబు, ఒమర్‌ఖయామ్

వృధా ఐన జ్ఞానంవల్లనే తెలుసుకొన్న 'గొప్ప సత్యం జ్ఞానం వృధా అని.

- బుచ్చిబాబు, ఒమర్‌ఖయామ్

లోకంలో జ్ఞానం అంతా అనుభవంపైన ఆధార పడి ఉంది.

- రాజమన్నారు, మనోరమ

శ్రీకుచమంటే మాత్రం తెలియదూ శ్రీ వైష్ణవుడికి?

- యజ్ఞన్నశాస్త్రి, హద్దులు - సరిహద్దులు

నిద్రయును మదమును గోపంబును జెందిన వారి యింగితము సులభముగc దేటపడును.

- తి.వేం., బాలరామాయణము

జ్ఞానం తపస్సువల్ల వస్తుంది. కాని జంతుశరీరాలను కోసి చూస్తేరాదు.

- విశ్వనాథ, హాహా హూహూ

అజ్ఞానాన్ని వేళాకోళం చెయ్యడానికే కొందరు తమ జ్ఞానం ఉపయోగించేది. అంతేగాని అజ్ఞానుల్ని జ్ఞానులుగా చేతామని కాదు.

- భమిడిపాటి, ఇప్పుడు

జగద్వ్యాపారముకంటె మహాస్వప్నము మఱియేమన్నది? అది వట్టి స్వప్నమును నిశ్చయనిర్ధిద్ర జ్ఞానమున్నవాcడు లోకాతీతుcడు కాcడా?

- పానుగంటి, సాక్షి

చదువుకున్న వాళ్ళకు ఎలాగైనా లోకజ్ఞానం ఎక్కువ లభిస్తుంది. జ్ఞానం కలవాడెపుడూ దాని ప్రయోజనాన్ని అజ్ఞానిని మోసగించడంలోనే పొందుతుంటాడు.

- కాళీపట్నం, అభిమానాలు

ప్రేమరహితమైన జ్ఞానం చవిటినేల వంటిది.

- ఉన్నవ, మాలపల్లి

జనులలో ప్రకృతిశాస్త్రజ్ఞాన మెంతహెచ్చిన దేశ మున కంత మూఢభక్తి మూలపట్టి క్షేమము గలుగును.

- కందుకూరి, దేశభాషలు

### జ్ఞాని

హృదయం అడ్డు తగలనంత వరకూ అంద రమూ జ్ఞానులమే.

- *కొడవటిగంటి, గంధర్వలోకయాత్ర*

జ్ఞానికి ముఖ్యలక్షణము స్వప్రయోజన పరత్వ మును పూర్ణముగా విడిచిపెట్టి లోకప్రయోజ నము నిమిత్తమయి చూచుచుండుట.

- కందుకూరి, విద్యాధికుల ధర్మములు

నిజం మాట్లాడారా అర్థంకాదు మనుష్యులకి, అబద్ధం మాట్లాడ్డం ఇష్టంలేదు. అందుకని మౌనులౌతారు జ్ఞానులు.

- చలం, మ్యూజింగ్స్

పెక్కు లొకటిగ జూచువాడే
ప్రాజ్ఞుడన వినమే?

- గురజాడ, డామన్ పిథియస్

తాము చేసే పనిలో తప్ప తక్కినవాళ్ళు చేసే పనులలో అర్థం కనపడకపోవడం జ్ఞానవంతుల లక్షణం - ప్రస్తుతపు నాగరికతలో.

- చలం, వాళ్ళు నలుగురూ

ఎవ్వడు బుద్ధిమంతుండో వాడు వృద్ధుండుగాని యేండ్లు మీఱినవాడా వృద్ధుండు?

- చిన్నయసూరి, మిత్రలాభము

### జ్ఞానోదయం

కైపు తీరితేగాని నిజం తెలియదు.

- రాజమన్నారు, నిష్ఫలం

మానవునకు జ్ఞానము కలుగుటకు నియమ ములు, పిటకములు నక్కఱలేదు - క్లిష్ట పరిస్థి తులు కావలయును.

- విశ్వనాథ, నందో రాజాభవిష్యతి

### జ్ఞాపకం

ఒక్క జ్ఞాపకం చాలు
వెయ్యి వసంతాలను
అరచేతుల్లో పట్టి బంధించడానికి.

- అఫ్సర్, స్మృతి

అన్నం తిన్నవాడు, తన్నులు తిన్నవారు మరిచి పోరు.

- సామెత

స్త్రీలకు జ్ఞాపకశక్తి తక్కువ

- వరద, నాట్యగోష్ఠి

అసలు నాకు కించిత్పరధ్యానమేను
నాకు ప్యూనుపే రుండదు జ్ఞాపకమ్ము
అంతియేకాని - నాదు కాంప్లుర్కు కేమొ
ప్యూను ఉన్నట్టి జ్ఞాపక ముండబోదు.

- మాచిరాజు, సంక్రాంతి కాన్కలు

కరిన కావ్యాలనైన క్రీగంట జూచి
ఒప్పగింతును చిన్ని తప్పొదవకుండ.
కాని నాన్న పేరది జ్ఞాపకమ్ము లేదు

- మాచిరాజు, అంకితం మనందరికి

ఆలోచనలు పాదరసంలా దొర్లిపోతాయి. జ్ఞాప కాలు అనంతంగా తీగలు సాగిపోతాయి.

- సోమసుందర్, రేపటి పాటల కోసం

ఈ జ్ఞాపకాలన్నవి మానవుణ్ని మానసిక శాంతికి దూరంచేస్తాయి. అలజడీ, ఆందోళనా ప్రేరేపిస్తాయి.

- సోమసుందర్, పశ్యామ శరదశ్శతం

జీవితాంతం జ్ఞాపకాలే కనుక మనిషికి తోడుగా రాకపోతే ఆ మనిషి ఏం కావాలి?

- రామచంద్రమూర్తి, అమృతఝరి

అన్నను నేను, మీ బ్రతుకునంతయు భోగమ యంబు చేసితిన్.

- విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము

### జ్వరం

జరుగుబాటుంటే జ్వరమంత సుఖంలేదు.

- సామెత

### జ్వాల

జావకార్చే అమృతంకంటె
జ్వాల రగిల్తే గరళం బాగు.

- సినారె, మధ్యతరగతి మందహాసం

ట

### ట్రాజెడీ

లైఫ్‌లో ప్రతి చిన్న విషయాన్ని సీరియస్‌గా తీసుకుంటే ఆఖర్న ట్రాజెడీ కాకమానదు.

- బీనాదేవి, హరిశ్చంద్రమతి

ట్రేడ్‌యూనియన్

ట్రేడ్‌కు పనికిరానిది, యూనిటీ లేనిది ఒక సంఘం. అదే ట్రేడ్ యూనియన్.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

# డ

డబ్బర

డబ్బఱలు పల్కువారి కడ్డంబుం గలదె?

- శ్రీనాథుడు, కాశీఖండము

డబ్బు

నీరయితే నిమ్నానికి ప్రవహిస్తుంది. కాని ధనం మాత్రం ఉన్నత క్షేత్రాలకి తప్ప ఇంకో చోటికి పారదు.

- శ్రీశ్రీ, మరోప్రపంచం

నేటి జీవితపు ఉష్ణోగ్రతని కొలవడానికి ధర్మామీటరు ధనం. ఈ లోకంలో అన్నీ అమ్ముడుపోతూనే వున్నాయి. చదువు, సౌందర్యం, కళ, సాహిత్యం, శాస్త్రం, శ్రమ అన్నీ ప్రయాణం, పెళ్లి, యుద్ధం, ఏది చేయాలన్నా డబ్బే ప్రధానం.

- శ్రీశ్రీ, మరోప్రపంచం

ధనమే మైత్రినిం దెచ్చును
ధనమే వైరమును దెచ్చు ధనమే సభలన్
ఘనతను దెచ్చును.

- గువ్వలచెన్న శతకము

నానాగుణగణము కాంచనంబున నిలుచున్.

- లక్ష్మణకవి, సుభాషిత రత్నావళి

ఈ పాపిష్టి పనులన్నీ చేస్తుండేది ఆ పాపిష్టి డబ్బుకోసమే.

- శ్రీనివాసరావు, ఉలిపికట్టె

అలాగే తెలీని పాడు జబ్బు
అప్పు ఇవ్వబడుతున్న డబ్బు!

- దాశరథి, పునర్నవం

నేతి సంపన్నుల బంగారు డబ్బు
రేపు పనికిరాని ముళ్ళదుబ్బు.

- దాశరథి, పునర్నవం

అనుకోకుండా, అకస్మాత్తుగా డబ్బు వచ్చిపడితే కళ్లు కనపడవ్!

- నరసరాజు, ఈ యిల్లు అమ్మబడును

నాకు డబ్బు గడ్డిపరక.

- గురజాడ, కన్యాశుల్కం

డబ్బు లేకపోతే శివరావుగారూ శివయ్యగాడే. డబ్బుంటే శివయ్యగాడూ శివరావుగారే.

- విశ్వం, ఎన్నికలు

మిడిమేళంగా వచ్చిన డబ్బు ఇంత అహం తెచ్చి పెడుతుంది.

- అనిశెట్టి, గాలిమేడలు

ఈ పట్నంలో, ఇంట్లో కూచుంటే డబ్బు రాదు, బైటికడుగుపెడితే ఖర్చు!

- అనిశెట్టి, గాలిమేడలు

ఈ రోజుల్లో అర్హతలకి విలువెక్కడుందిలే వోయ్? ఈ రోజుల్లో కావాల్సింది డబ్బు. లేకపోతే పరపతి. ఈ రెంటిలో యే ఒక్కటి వున్నా, కార్యాన్ని సాధించవచ్చు.

- ముద్దంశెట్టి, నిమిత్తమాత్రులు

డబ్బుకి లోకం అన్ని యుగాల్లోనూ దాస్యం చేస్తుంది.

- ఆనందారామం, ఇదా భారతం?

కరెన్సీ నోట్లు విసిరి, పరువు మర్యాదల్ని కిలోగ్రాములకొద్దీ తూయించి తెచ్చుకోవచ్చు.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

వెధవడబ్బు దాన్ని మనం గడించాంకాని, అది మనల్ని గడించలేదుగా!

- నంది, మనిషి చావకూడదు

ఈ దేశంలో కథలూ కవిత్వం రాయడం కన్నా కాకరకాయలు అమ్ముకుంటే ఎక్కువ డబ్బు వస్తుంది.

- బీనాదేవి, మిసెస్ అండ్ మిష్టర్ సక్సేనా

ఈ లోకంలో అత్యంత ఆకర్షణీయమైనదీ, అత్యంత ప్రమాదకరమైనదీ, ఎంతో సౌఖ్యాన్నం దిస్తున్నట్లు భ్రమ కలిగిస్తూనే అంతులేని అశాంతిని కలిగించేది డబ్బు.

- ఆనందారామం, అద్దంలో శత్రువు

చచ్చింతర్వాత మిగిలేది డబ్బు అన్నారు.

- బుచ్చిబాబు, గొలుసు

నోట్లోంచి బయటికి రాబోయే డోకు ఉందనుకో, దానికి డబ్బు చూపిస్తే అది పరమాన్నంగా మారిపోయి వెనక్కి తిరిగి విలాసంగా లోపలికి చక్కాపోతుంది!

- భమిడిపాటి, రెండు రెళ్ళు

లోకవృత్తం మనం కొంచెం పరకాయించు కుంటూ వుండాలి. బిగించనూ కూడదు. విడిచి పెట్టనూ కూడదు. పది రూపాయలు చేతిలో పడ్డమే మనకి ప్రధానం.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, బ్రాహ్మణాగ్రహారం

మోడ్రన్ సొసైటీలో స్టేటస్‌కీ, సక్సెస్‌కీ ఆధారం డబ్బు, డబ్బు, డబ్బు. డబ్బే ఆధారం.

- రావిశాస్త్రి, కుక్కపిల్ల

వృత్తిలో కర్తవ్య నిర్వహణకు కాసుల్ని ఆశిం చడం నీచప్రవృత్తి.

- బుచ్చిరెడ్డి, ముత్యాలు - రత్నాలు

పైకం భాగోతులోనికి, తిట్లు మంగలోనికి.

- *నరసింహం, తిరగబడ్డ భూమి*

డబ్బులేంది మందులు రావు. డాక్టర్లు కూడా కొందరు రారు. కానీ డబ్బు లేకున్నా రోగాలు మాత్రం వస్తాయి. రోగులూ వున్నారు. మందులూ వున్నాయి. డాక్టర్లూ ఉన్నారు. కానీ వీళ్ళెవరికీ స్వాతంత్ర్యం లేదు. అందరినీ శాసించే హక్కు డబ్బుకుంది.

- *రారా, అలసిన గుండెలు*

డబ్బంటూ వున్నాక, అది చెయ్యగలిగిన ఘన కార్యం ఖర్చవటం తప్ప ఇంకేమీ లేదు.

- *ధనికొండ, పవిత్రులు*

డబ్బు చూపిస్తే కొండమీది దేవుఁడు దిగివ స్తాడు. కోర్టునుండి న్యాయం పరుగెత్తుకొ స్తుంది. కోటలో పట్టె పాగా కాదు- పరువూ లేదు- పరుపు వేసుకు పడుకోవచ్చు పక్కలో రాణిని పెట్టుకోవచ్చు

- *బీనాదేవి, ఏ మేటర్ ఆఫ్ నో ఇంపార్టెన్స్*

డబ్బుంటే పేరూ, ప్రఖ్యాతులూ వాటంతట అవే మనల్ని వెతుక్కుంటూ వస్తాయి.

- *రామచంద్రమూర్తి, దైవజ్ఞశిఖామణి*

(ఇప్పుడంతా డబ్బు గురూగారూ!) డబ్బు! ఇలు వైన సరు కెవరికీ వద్దు. ఇక మనిసి యిలవ అసలే వద్దు.

- *బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!*

పెళ్ళాం వుంటే తక్కిన మొగాళ్లతో విరోధం. డబ్బు వుంటే మనుషులందరితోటి విరోధం.

- *చలం, 13 పసందైన నాటికలు*

డబ్బు లేకపోతే గొర్రెకూడా కరుస్తుంది.

- సూర్యారావు, పంజరం

చేతిలో వున్న డబ్బు కాస్తా తగలేసేవరకూ నిద్ర పట్టదు ఆడవాళ్లకి.

- సూర్యారావు, పంజరం

డబ్బుంటేనే అన్ని ధర్మాలూను.

- సూర్యారావు, పంజరం

డబ్బు గడించే వారికి ఆకలిదప్పులుండవ్.

- బుచ్చిబాబు, ఒకేనిద్ర - ఎన్నోకలలు

డబ్బు, దగ్గరితన్నాన్ని దూరం చేస్తుందంటారు.

- బుచ్చిరెడ్డి, ముత్యాలు-రత్నాలు

ఈ రోజుల్లో డబ్బున్నవాడిదే గెలుపు.

- సభా, నీటిదీపాలు

ఎంత మిత్రుడైనా డబ్బు దగ్గర జాగ్రత్తగా ఉండటం మంచిది.

- పుల్లాభొట్ల, క్రాస్ చెక్కు

ఇనప్పెట్టిలో మూలుగుతున్నంతసేపూ డబ్బూ, మేటిలో అణిగివున్న గడ్డిపరకా సమానమే.

-సుబ్రహ్మణ్యశాస్త్రి, అనుభవాలూ జ్ఞాపకాలూనూ

ఏదో కారణంతో ఏదోవిధంగా చేతులు మారు తునే వుంటుంది డబ్బు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, అనుభవాలూ జ్ఞాపకాలూనూ

డబ్బు చేరితే యే వృత్తీ ఘనమే. చేరిన్దాకా చిన్న చూపు చూసే వాళ్లందరూ చేరాక మాత్రం పెద్ద చూపే చూస్తారు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, మార్గదర్శి

ముదల్ని మనసు బేరీజు వేస్తుంది. పైకాన్ని పర్సు నిర్ణయిస్తుంది.

- మారుతీరావు, మళ్ళీ మధుమాసం

జాతుల్ సెప్పుట సేవచేయుట మృషల్
సంధించుటల్ న్యాయవి
ఖ్యాతిం బొందుట కొండెకాఁ డవుట హి
సారంభకుం డౌట మి
థ్యాతాత్పర్యము లాడు టన్నియుఁ బర
ద్రవ్యంబు నాశించి...

- *ధూర్జటి, శ్రీకాళహస్తీశ్వర శతకము*

డబ్బు హోదా ఉంటే కులాలు అడ్డురావు.

- *రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు*

పైసాలున్నోడు పెద్దోడు అవి లేనోడు చిన్నోడు.

- *శంకరరాజు, కుక్కచచ్చింది- కోడికూసింది*

జీతంలావు రాగానే గొప్పనుకున్నావా యేవింటి?

- *గురజాడ, కన్యాశుల్కం*

డబ్బుంటే ఏటీ సెయ్యక్కరలేదు. అదే సేసుకొ చ్చేస్తాది.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

ఎవరైనా సరే డబ్బార్జించాలనుకున్న నిర్ణయం తీసుకోవాలేగాని మరిక వాళ్లకి, మంచి-చెడ్డా, గొప్పా-బీదా, నీతి-నిజాయితీ, పాపం-పుణ్యం, ఉచ్చం-నీచం అనే విచక్షణ ఉండదు.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

ఈ డబ్బు దగ్గర మనిషిని మనిసి నమ్మడు. పెళ్లాన్ని మొగుడు నమ్మడు. పిల్లని తల్లి నమ్మదు. దేశాన్ని దేశం పొట్టనెట్టేసుకుంటాది.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

నీ వంశం కావాలి. నీ గుణం అసలే వద్దు. నీ సదువేటనడుగరు. నీ డబ్బు కావాలి పెపంచానికి.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

లోకాతీతమైన పన్లకి పైసా, చొరవా ముఖ్యం.

- భమిడిపాటి, ఇప్పుడు

వాడి దగ్గర డబ్బు లేదు, వీడి దగ్గర బోల్డుంది. వాడు కవిత్వం రాయగలడు. వీడు రాయలేడు. ఒకడికున్నది మరొకడు మార్చుకున్నారు.

- ఆదివిష్ణు, చూడుచూడు నీడలు

బుద్ధికి అంతా సాధ్యమేగాని, డబ్బుకు యక్కడా అసాధ్యం లేదు.

- గురజాడ, కన్యాశుల్కం

అందరినీ అన్నిటినీ డబ్బే శాసిస్తున్నది.

- కొడవటిగంటి, పెళ్లివ్యవహారం

డబ్బు సంపాదిస్తేనే దాని విలువ తెలుస్తుంది.

- ముద్దంశెట్టి, తప్పించుకోలేవు

దేవుడు సృష్టించిన మనిషి దేవుడిని మించిపోవాలని చూస్తున్నట్టే మనిషి సృష్టించుకున్న ఈ డబ్బు మనిషినే మింగాలని చూస్తోంది.

- సులోచనారాణి, మీనా-

డబ్బు కొత్త-కొత్త ఖరీదైన జబ్బులను కొనితెస్తుంది.

- చిన్నబాబు, డబ్బు

డబ్బుంటేనే కలలు నిజమౌతాయి
డబ్బు లేకపోతే కలలన్నీ కల్లలౌతాయి.

- సదానంద, గందరగోళం

ఈ ప్రపంచంలో అన్నిటినీ చిటికెన వ్రేలిమీద నిలబెట్టి ఆడించే శక్తి డబ్బుకే వుంది.

- శ్రీరామచంద్రమూర్తి, వెన్నెలదారి

రూపాయి ఆడించినట్లుగా, మనిషిని విధి కూడా ఆడించడం సాధ్యం కాదు.

- భరద్వాజ, కాదంబరి

కాటికి పోయినా, కాసు తప్పదు.

- సామెత

## డాక్టరు

డాక్టరు నిర్లక్ష్యంతో ఒక రోగి ప్రాణం పోయిందంటే వాడు యముడైనా అయివుండాలి, పేషంటుని పశువుగా తలచి పశువుగా మారి పశువైద్యమైనా చేసి ఉండాలి.

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

## డిగ్నిటీ

డిగ్నిటీ పోయిన తర్వాత డిగ్రీలేం చేస్తాయి? ఉద్యోగాలేం చేస్తాయి?

- తాళ్ళూరి, రూమ్‌నం. 117

## డిటెక్టివ్

డిటెక్టివయినవాడు అడుగుతాడుగాని చెప్పడు.

- కొడవటిగంటి, రైల్లో డిటెక్టివ్

నీ దగ్గరున్నది సిగరెట్టు పెట్టె. దాన్నిబట్టీ నువ్వు యెలాటివాడివో నీవు వాడుకొనే యితర వస్తువులు ఎలాటివైయుంటాయో గ్రహించగలిగి వుండాలి డిటెక్టివ్.

- బీనాదేవి, డిటెక్టివ్ లెసన్

## డేగ

ఆకాశంలో డేగలు ఎగురుతుంటాయి. వాటి పొట్టలే కనిపిస్తాయి మనకి. వీపులు చూడాలంటే అంతకన్నా పైకెగరాలి...

- పాప, రామరాజ్యానికి రహదారి

## డైరెక్టరు

డైరెక్టర్లు నాటకాన్ని పట్టుకున్న దెయ్యాలూ, భూతాలూనూ.

- యజ్ఞన్నశాస్త్రి, రిహార్సల్లు

# త

## తక్కువ కులం

గుడికి ఎంత దూరంగా ఇళ్లు ఉంటే అంత తక్కువ కులం వాళ్లకింద జమ.

- లక్ష్మణరావు, కన్నీటిపడవ

## తగనిది

వ్రతము మానఁదగదు వడుగుఁగుఱ్ఱనికినిఁ,

గ్రియలు మానఁదగదు గృహగతునికిఁ,
దపసి కూర నుండఁదగదు, సన్యాసికిఁ
దరుణితోడి పొత్తు తగదు తగదు.
- పోతన, భాగవతము

చిలకముక్కుకి నేరేడుపండు.
- శ్రీరమణ, న్యూనుడి

**తగనివి**

వాక్రుచ్చి యొకరితోఁ
జెప్పరాదు ద్రోపు సేయరాదు.
- అనంతుడు, భోజరాజీయము

ఆకాశమంత ఎత్తు మనుష్యులు చేసే పనులు అంగుష్ఠమాత్రులు చూయకూడదు.
- పురాణం, వంట చేయని రాత్రి

మద్యపాయులతోడ మచ్చిక కారాదు
భడవాల గొప్పగాఁ బట్టరాదు
శాత్రవునింట భోజనమె చేయఁగరాదు
సన్యాసులను గేలి సలుపరాదు
దేవభూసురవృత్తి తెరువుపోవఁగరాదు
పరునాలిఁ గని యాసపడఁగరాదు
కంకోష్ఠునకు నధికార మియ్యఁగరాదు
చెలఁగి లోభినిఁ జేరఁ బిలువరాదు
లంచగాండ్రను దగవుల నుంచరాదు
మాతృపితరులయెడ భక్తి మఱువరాదు.
- వేంకటరాయకవి, వేణుగోపాలశతకము

కాదనిపించుకోఁదగదు,
కాని గుణంబు వహించి లోభిచే
లేదనిపించకోఁదగదు,
లేని దురాశకుఁబోయి యిందురా
రా దనిపించుకోఁదగదు...
- గువ్వలచెన్న శతకము

**తగినది**

కృతి పాడఁదగినది. కథ యూకొట్టఁదగినది. నాటక మాడఁదగినది. ఉపన్యాసము వినఁదగినది.
- పానుగంటి, సాక్షి

**తగులం**

తగిలించుకొన్న పిమ్మట
నిగిలించుటెకాని కార్య మేమున్నది?
- కదిరీపతి, శుకసప్తతి

**తటస్థం**

తటస్థం అనేది అర్థంలేని మాట. ఆలోచనాపరులైనవారు తటస్థంగా ఉండటానికి వీలులేదు.
- చిరంజీవి, బోలోస్వతంత్రభారత్‌కీ జై

**తడుపు**

బ్రాహ్మణుల పొట్ట తమలపాకుల కట్ట యెప్పుడు తడుపుచుండవలె.
- వరదాచార్యులు, వైశాలిని

కాపువాని పొట్ట, తమలపాకుల కట్ట తడవకుండా ఉండలేవు.
- సామెత

**తంటాలు**

ప్రజాసేవలో ఎన్నో తంటాలు పడితేగా ప్రజానాయకుడయ్యేది?
- సభా, ప్రజా సేవకుడు కాళాస్త్రి

**తండ్రి**

ముసలివాళ్ళని అసలు నమ్మకూడదు. కుర్రకారు రౌడీవేషాలయినా భరించొచ్చుగాని ఈ ముసలివాళ్ళ కసలు పితృప్రేమని భరించడం చాలా కంపరం.
- ఆనందారామం, అద్దంలో శత్రువు

**తత్వం**

స్వంత వ్యాపారం వచ్చినప్పుడు తత్వం హుష్ కాకీ అవుతుంది.
- భమిడిపాటి, నామీదేన్రోయ్

తత్వాలకి చింత చిగురించదు.
- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

తత్వం తలకెక్కింది
తపస్సు బెడిసికొట్టింది.
- ఆరుద్ర, ఆవాహన

**తద్దినం**

యేది తప్పినా శానిటరీ ఇన్‌స్పెక్టరుగారిది తప్పదు. అది తండ్రితద్దినం వంటిది.
- కందుకూరి, హాస్యసంజీవని

వార్షికం అన్నా తద్దినమేగా!
- భమిడిపాటి, అన్నీ తగాదాలే

దినముల లోపల నుత్తమ
దినమే తద్దినము; నాటి తిండికి సరి యే
దినములను వెదకిచూచినఁ గన మప్పా..
- కవిచౌడప్ప

లోకంకోసం తద్దినాలు పెడుతున్నాను.
- గురజాడ, కన్యాశుల్కం

పనసకాయ లభించినప్పుడు తద్దినము పెట్టవల

సినదని పెద్దల వాక్య మున్నప్పుడు, తద్దినము నాడే పనసకాయ లభించినప్పు డింకఁ జెప్పవల సిన దేమున్నది?

- పానుగంటి, సాక్షి

**తనది**

తన కలిమి ఇంద్రభోగము. తన లేమి లోక దరిద్రము.

- చిలకమర్తి, మారీచస్మృతి

తనదంటూ ఒకటి లేనపుడు అంతా తనదని అనుకోకతప్పదు...

- ఆళ్వారుస్వామి, ప్రజల మనిషి

**తనిఖీ**

గవర్నమెంటు డబ్బు ఎట్లా ఖర్చుపెడతారు? స్వంతడబ్బులాగ స్వంతానికి ఖర్చుపెట్టుకుం టారు. దానికి తనిఖీ దేనికి? అదో దండుగ.

- నగ్నముని, విలోమ కథలు

**తనివి**

తన రహస్య శృంగార చేష్టలు మిత్రులతో చెప్పితేనేగాని కొందరికి తనివి తీరదు.

- గురజాడ, మీ పేరేమిటి?

**తంత్రం**

యంత్రాలు మానేసి తంత్రాలమీదే నడిపించాలి మన దేశాన్ని.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

**తన్నటం**

యెళ్లితే మీరు తంతారు, యెళ్లకుంటే ఆరు తంతారు.

- గురజాడ, కన్యాశుల్కం

పిదుకుట కష్టముగాని తన్నులగొడ్డే పాలెక్కువ ఇచ్చును.

- పానుగంటి, రాధాకృష్ణ

**తప్పటం**

పాఠాలు బట్టీ పెట్టినవాళ్లే పరీక్షలో తప్పుతారు.

- కుందుర్తి, న్యాయదాన

యివాళో పెద్దపెళ్లి నీకు తలవెంట్రుకంత వాసిలో తప్పిపోయింది!

- గురజాడ, కన్యాశుల్కం

అడుగు తప్పితే పిడుగు తప్పుతుంది.

- సామెత

**తప్పనిది**

ఏ పాటు తప్పినా సాపాటు తప్పదు.

- సామెత

కడుపుతో ఉన్న అమ్మ కనకా మానదు, వండు కొన్నమ్మ తినకా మానదు.

- సామెత

మనము లోఁగితిమేని లోఁగునె శివాజ్ఞ? యుడుము నడికిన నడుకునే బడియపెట్టు?

- శ్రీనాథుడు, కాశీఖండము

గాడిదలతో సేద్యం చేస్తూ, కాలి తన్నులకు దడిస్తే ఎట్లా?

- సామెత

నల్లుల మంచమునకు కఱ్ఱదెబ్బలు తప్పవుగదా!

- దీక్షితులు, కాంచీకుమారి

విదియనాడు కనపడని చంద్రుడు తదియనాడు తానే కనపడతాడు.

- పుల్లాభొట్ల, విభూతి- వుండ్రాలు

నిజమైన కవితాధారగల యందఱకుఁ గడసాని సంపర్కము తండ్రి తద్దినము లాగునఁ దప్పదు.

- పానుగంటి, రాతిస్తంభము

పణ్యస్త్రీ కొక్క బానిస, పుణ్యస్త్రీ కొక్క పూర్వసు వాసిని.

- పానుగంటి, విప్రనారాయణ

మామూలు వ్యాధులకు ఎ.ఎమ్.ఎ.లు, ప్రాణా పాయ సమయంలో ప్రైవేట్ డాక్టర్లు తప్పనిసరి.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

కందిరీఁగల పట్టు కడఁగి రేపఁగ వచ్చు
మానిపింపఁగరాదు దాని పోటు
చెట్లలో బెబ్బులిఁ జెనకి రావచ్చును
దప్పించుకొనరాదు దాని కాటు
పఱచునశ్వము తోకఁబట్టి యీడ్వఁగవచ్చు
దప్పించుకోరాదు దాని తాపు
కాఁకచేఁ బొరుగిల్లు గాల్చి రావచ్చును
దనయిల్లు కాపాడఁదరముగాదు
దుర్ణయులు మీఁదెఱుంగక దుండగమునఁ
గార్యతతుఁ లెల్లఁజేసి తత్కార్యఫలము
లనుభవింపుదు రాయాయి యవసరముల.

- వేంకటరాయకవి, వేణుగోపాల శతకము

**తప్పు**

మాట్లాడుతుంటే కూడా ఆయనికి స్పెల్లింగు తప్పులే.

- భమిడిపాటి, విద్యార్థుల ఏకాంతపు రిమార్కులు

ఆయన ఇంగ్లీషు మాట్లాడుతూంటే తెలుగులా ఉంటుంది. తెలుగు మాట్లాడుతుంటే ఇంగ్లీషులా ఉంటుంది.

- భమిడిపాటి, విద్యార్థుల ఏకాంతపు రిమార్కులు

చాటుగా ఏంచేసినా తప్పులేదు. బహిరంగంగా చేస్తేనే తప్పు. ఈ చాటుమాటు వ్యవహారాల తోనే సంఘం ఇంత అధోగతికి వచ్చింది

- కొడవటిగంటి, పెళ్లి చెయ్యకుండా చూడు

దేవతలు చేయు తప్పులు దివ్యకథలు

- రామకృష్ణశాస్త్రి, మంచిముత్యాలు

కాలం - పరిస్థితులు - సహవాస ప్రభావంవల్ల మనిషి తప్పు చేస్తుంటాడు. కానీ ఒక్కొక్కప్పుడు మనం తప్పు చేయాలన్నా కాలం పరిస్థితులు సహవాసం ఇవేవీ అనుకూలించవు.

- బుచ్చిరెడ్డి, తప్పు

ఉంకో మడిసి బతుక్కోసరం- మానం వమ్ము కుంటే తప్పేటుందే?

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

తప్పు లెన్నువారు తండోపతండము
లుర్వి జనులకెల్ల నుండుఁ దప్పు
తప్పు లెన్నువారు తమతప్పు లెఱుఁగరు

- వేమన

తాబుదార్లయందు తప్పులు త్వరగా కనబడును.

- చిలకమర్తి, తుంబురునారద సంవాదము

ఒప్పులే మేము సేయుట యొక్కతప్పు
తప్పుచేయకయుంటయే గొప్పతప్పు
అన్ని తప్పులు మాయందె యున్న వబల!
తలఁచి చూడఁ బార్థునియందుఁ దప్పుగలదె?

- చిలకమర్తి, గయోపాఖ్యానము

తెలిసీ తెలియని మనుషులు చేస్తే తప్పులు సరిపెట్టుకోవాలి. తెలిసినవాళ్లు కూడా వాళ్లతో సమానంగా కచ్చపెంచుకుంటే, అది తప్పౌతుంది. అసి సిద్ధి కొరుకుతుందని మనం చెప్పు కొరక్కూడదు.

- కాళీపట్నం, ఆదివారం కథలు

తప్పులనేగాని మనుష్యుల నిందింపందగదు. తప్పులను విశదీకరించుటయందుఁ బాత్రము లావశ్యమగునెడల నట్టివి కల్పితములైయుండ వలయును.

- పానుగంటి, సాక్షి

ఎట్టి తప్పయినను దైవనామ సంబంధయుక్త మగునెడల నది యాదరణీయ మగును.

- పానుగంటి, సాక్షి

దాటగూడని హద్దును దాటిన తరువాతఁ గాకినాటవఱకు బోయిన నొక దోషము, కలకత్తా వఱకుఁ బోయిన నొక దోషమునా? వ్యభిచరింపఁగూడదను కట్టుపాటును మీఱినపుడు బ్రాహ్మణవితంతువయిన యెడల పరమార్థము-చండాలినియైన సామాన్యము, తురకసానియైన దోషము, యూరేషియను అగునెడల ఘోరనరకమునా? కందిపప్పు నియమము దాటిన బ్రాహ్మణునకుఁ బందిమాంస మైననేమి? నంది మాంస మైననేమి?

- పానుగంటి, సాక్షి

దేనికి క్షామం ఉన్నా తప్పులకు క్షామం లేదు.

- కొడవటిగంటి, అనుభవం

తప్పును సహించటం కంటె ప్రతిఘటించటం తప్పుచేసినవాడి దృష్టినుంచికూడా మంచిదే.

- కొడవటిగంటి, అనుభవం

తను చేసిన తప్పుకి పశ్చాత్తాపపడే వాళ్లకి ముక్తి వుందిగాని, దాన్ని సమర్థించుకోటానికి కారణాలు వెతికే నీచులకు ముక్తిలేదు.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

తప్పులో కూడా మంచి తప్పూ, చెడుతప్పూ అంటూ ఉంటుందో ఏమో!

- కొడవటిగంటి, నిజం దాగదు

ఏదో ఒక పనిచేసే వాళ్లల్లో తప్పులు దొరకుతాయి. ఏ పనీ చెయ్యని వాళ్లల్లో తప్పులేముంటాయి?

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

తమకుఁ గలుగు పెక్కుతప్పు లటుండఁగా
నొరుల నేర మెంచు నో గెపుడును
జక్కిలంబుఁ జూచి జంతి కేరినయట్లు.

- వేమన

తప్పు వొప్పుకోవడం వేరు. అందులో ఎరగనితనం అమాయకత్వం వుంటుంది. కాని తప్పిదాలు చెప్పుకోవటం వేరు.

- మహీధర, కత్తుల వంతెన

తప్పుచేసినవాడు అధికారిగానీ, నాయకుడుగానీ- ఎవడైనా సరే, బయటకు లాగవలసిందే. పదవులపట్ల తప్ప పరిపాలనపట్ల బాధ్యతలేని వాళ్లందర్నీ రచ్చ కీడవవలసిందే.

- కె. యల్., కొడిగట్టిన దీపాలు

ఒరుల తప్పిదంబు లోరుచుకొనలేము
సొంత తప్పు మాకు చురుకులేదు.
- జాషువా, ఇంటిగుట్టు

తప్పుగలిగిన చోటనే యొప్పుగలుగు.
సరసకవితామయోక్తుల సరణియందుఁ
గప్పు గలిగిన నీహారకరునియందు,
నమృతధారాప్రవాహంబు లడరుఁగాదె.
- రామకృష్ణుడు, పాండురంగమాహాత్మ్యము

తప్పు చేస్తున్నవాళ్ళ చరిత్రలు పవిత్రమైతే తప్పు చెల్లించేందు కేబాధా లేదు.
- సుబ్రహ్మణ్య శర్మ, బంకోలా

మరుపు ఒక తప్పు. సోమరితనం పెద్ద తప్పు. పూర్తిచేయవల్సిన పనిని నిర్లక్ష్యం చేసి దాన్ని కప్పిపుచ్చుకోటానికి సాకులు చెప్పటం అతిపెద్ద తప్పు.
- రామమోహనరావు, త్రినేత్రుడు

నావల్ల తప్పున్న పక్షమున నాపసుపు కుంకుమే పోవును. ఆయనవల్ల తప్పున్న పక్షమున ఆయన పోతారు.
- చిలకమర్తి, అపూర్వదాంపత్యము

లోకమం దప్పులు తప్పులు న్నెరుగ నేరనివారె వరైన నుందురే!
- ముళ్ళపూడి, కబుణాపయోనిధీ

దయలేని అత్తకు దండం పెట్టినా తప్పే. ఊర కున్నా తప్పే.
- సామెత

మనిషిలో తప్పు మనసుని కరిచి, తిరగబడేలా చేస్తుంది. తప్పు కప్పబడి, ఒప్పుగా కనిపించా లంటే అధికారము, అరుపులే కావాలి.
- సులోచన, మామూలుమనిషి

పసరంబు బాఁగైనఁబసులకాపరి తప్పు
ప్రజలు దుర్జయులైనఁ బ్రభువు తప్పు
భార్య గయ్యాళైనఁ బ్రాణనాథుని తప్పు
తనయుండు ధూర్తైనఁ దండ్రి తప్పు
అశ్వంబు బాఁగైన నారోహకుని తప్పు
దంతి దుష్టయిన మావంతు తప్పు
సైన్యంబుచెదరిన సైన్యనాథుని తప్పు
కూఁతురు చెడుగైన మాత తప్పు.
- అడిదము, రామలింగేశ శతకము

ఆంధ్రలోకోపకారమ్ము నాచరింప
భారతమ్మును నన్నయభట్టు తెలుఁగుఁ
జేయుచున్నాఁడు; సరియె; బడాయిగాక,
తొలుత సంస్కృతపద్య మెందులకుఁ జెప్పఁడీ?
- రామకృష్ణకవులు, ఆంధ్రకవుల అపరాధములు

తలచుట్టు వారఁ గన్నులు
గలిగినఁ బద్యంబు తప్పుగా దనవశమే?
- ధూర్జటి, శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము

లోకము నగదే? పూనుకొని
సహజగంధము వేనలికిం గలదఁటన్న
వేయుఁదెలిఁగులన్?
- ధూర్జటి, శ్రీకాళహస్తీశ్వర మాహాత్మ్యము

జీవితంలో మనకు తెల్సి యెన్నో తప్పులు చేస్తూ వుంటాం. అందులో సిగిరెట్లు తాగుతూ మానేద్దాం అనుకోవటం ఒకటి.
- తాళ్ళూరి, శ్రావణసంధ్య

అన్నీవున్న ఆడది కొవ్వెక్కి రంకుసేత్తే తప్పు. కూటికిలేనోళ్లు సేత్తె తప్పుకాదు.
- వెంకటనరసింహారావు, సిన్

**తప్పుడు ఓటు**

తప్పుడు సాక్ష్యంకంటె తప్పుడు వోటు చెడ్డది.
- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

**తప్పుడు సాక్ష్యం**

తప్పుడు సాచ్చ్యాల్తో పుచ్చుకొండేది వంటా వుండదు. ఇంటా వుండదు.
- వేదాంతకవి, తెనుఁగుతల్లి

**తప్పొప్పులు**

ఏలేందుకు లేవుకాని ఎత్తుక తినేందుకు ఊళ్ళు చాలా ఉన్నవి. తిడితే తప్పుగాని, తిరుచుకుంటే తప్పులేదు.
- ఉన్నవ, మాలపల్లి

**తరవాణి**

కుడితి పశువుల కెంత బలమొ మనుష్యులకు తరవాణి యంత బలము.
- చిలకమర్తి, గణపతి

తరవాణి కుండ నూరావుల పాడిపెట్టు. ఆవు లకు గడ్డి కావలె. గాదము కావలె. ఒకపూట దూడ కుడుచుకొనిపోవుట, మఱియొకపూట తన్నివేయుట మొదలగు చిక్కులు గలవు. తర వాణికుండ కట్టి చిక్కులు లేవు.
- చిలకమర్తి, గణపతి

**తరుగుదల**

ఏనాటి యగ్రహారమొ

మీనాఁటికి కంౘ్రి కాయె; మీపని దీరన్
మానాఁడు మాన్య మాయెను,
నానాఁటికిఁ దీసికట్లు నాగంబొట్లూ!

- చాటువు

### తర్కం

తర్కం నడిపించే దారివెంట ముక్కుకు సూటిగా నడిస్తే మాత్రం వెళ్ళి చేరవలసింది బ్రహ్మంగారి మఠాన్ని. తప్పితే, పిచ్చి ఆసుపత్రిని.

- నార్ల, పిచ్చాపాటీ

తర్కిస్తే అబద్ధం నిజమైపోదు.

- దివ్యప్రభాకర్, శిరోమణి

ప్రతిదాన్నీ ప్రశ్నించు. దేన్నీ తర్కించకుండా అంగీకరించకు.

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

స్వంతానికి ఏదేనా కావలసొచ్చినప్పుడు, తర్కం దానంతట అదే చేతవుతుంది. తమరు మాట్టా డిందంతా తర్కమే అనిపిస్తుంది.

- భమిడిపాటి, అవును

ఎటుపక్కకి అటుపక్క సబబూ, సరి అయిన కారణం దొరుకుతాయి. కాస్త తర్కం ఉండాలి కాని రెండింటిని సమర్థించవచ్చు

- తులసి, వలయం

తర్కం అన్నది జీవితాన్ని అర్థంచేసుకొనేటందు కో ఉపకరణం.

- మహీధర, కత్తులవంతెన

తర్కమనేది ఎట్టిదంటే అది ఒక అద్భుతమైన విశేషం. అది తనను దూరంనుండి చూసేవా రిని చకితులను చేస్తుంది. తన్ను దరిసిన అస మర్థులను ఎటుజూచినా తానై ఉక్కిరిబిక్కిరి చేసి ఒడ్డున విసిరి నవ్వుతుంది. సమర్థులై తన్నుత్తరించగలవారికి రత్నరాసు లందిస్తుంది. దాని అంతులు దెలియ ప్రయత్నించే వారి కది అపారమై అమేయమై మిగుల గంభీరమై బడ బాగ్ని గర్భస్థమై సకల సమర్థమై కానవస్తుంది.

- కాశీపట్నం, అభిమానులు

తర్కం అటు లక్ష్మీదేవికీ ఇటు జ్యేష్ఠాదేవికీ, అటు హాలాహలానికీ ఇటు అమృతానికీ ఉత్ప త్తిస్థానమైన మహాజలధి వంటిది. అంతేకాదు. దానిని తరచి ప్రయోజనాన్ని సాధించగలిగే సామర్థ్యం కూడా అటు దేవగణానికి చెందిన వారికో, ఇటు రాక్షసగణానికి చెందినవారికో మాత్రమే ఉంటుంది. మానవగణానికి చెందిన వారు దానిని తరచబోవటంవల్ల సాధారణంగా భంగపాటునుమాత్రమే పొందుతూ ఉంటారు.

- కాశీపట్నం, అభిమానులు

మేకల్ని చంపుకు తినటం పాపమా పుణ్యమా అని పులులూ సింహాలూ తర్కిస్తూ కూర్చొంటే అవి పుణ్యలోకాలకి పోతే పోవచ్చుకాని అవి ఆకల్తో చచ్చేకే అక్కడికి వెళ్లగలవు.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

విద్వాంసుల్ రాజమహేంద్ర పట్టణమునన్
ధర్మాసనంబుండి ప్రధ్వంసాభావము ప్రాగభావ
మనుచున్ దర్కింతు రెవ్వేళలన్.

- శ్రీనాథుడు, చాటువు

తర్కకర్కశబుద్ధులై తగినవారి
కే మసాధ్య మటంచు నూహింపరాదె
తెలుఁగు ముక్కలు నాల్గైదు తెలిసి తాముఁ
గవుల మనుకొను వెఱిపాడెకట్టె లెల్ల?

- సోమనాథకవి, చాటువు

### తర్జుమా

యిది అరటిపండు విప్పినట్టు తర్జుమా చేసి దాఖలు చెయ్యమని శలవా?

- గురజాడ, కన్యాశుల్కం

### తల

తలలు లేని టోపీల రాజ్యంలో
తల ఉంటే తలతీస్తారు.

- బైరాగి, పాంచజన్యం

### తలకిందులు

ఈ తలకిందుల ప్రపంచంలో రిజైన్ చేయటం కన్న డిస్మిస్ చేయించుకోవటం ఎక్కువైన సంగతి!

- కొడవటిగంటి, జీవితం

మునుపు మనుష్యులు పోయేవారు కార్లమీద
ఇప్పుడు కార్లుపోతున్నాయి మనుష్యులమీద.

- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

### తలతిక్క

మూడేళ్ల సాముచేసి, మూలనున్న ముసలి దానిని కొట్టినట్లు.

- సామెత

తారమీది మోహం తెరమీద చూపినట్టు

- శ్రీరమణ, న్యూనుడి

### తలనొప్పి

తలనొప్పి తనదాకా వస్తేకానీ తెలియదంటారు.

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

**తలపు**

దుఃఖంలో సుఖాల్ని తలచుకుంటే ఆ దుఃఖం ఎక్కువౌతుంది.

- దీక్షితులు, చక్రవాక మిధునము

**తల్లి**

కన్నతల్లిని పోగొట్టుకొన్నవాడు, నేలతల్లిని అమ్ముకొన్నవాడూ కడతేరింది కద్దా?

- సభా, నీటిదీపాలు

తల్లికోపం నీళ్ళల్లో నిప్పువంటిదని ఎంతమందికి తెలుస్తుంది?

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

తరుణతమ ముత్తమము దీర్ఘతమము నధిక తమము నిశ్చలతమ ముచ్చతమము మధుర తమము నసమాన గంభీరతమము మృదుల తమ మగుచు వెల్లివిరియును తల్లి ప్రేమ.

- పానుగంటి, ప్రచండ చాణక్యము

అమ్మ అనే మనిషి ఎప్పుడూ మంచిదే.

- నంది, నైమిశారణ్యం

ఏదీ ఊరికే రాదు, ప్రకృతి సిద్ధమైన ఒక్కతల్లి ప్రేమ తప్ప.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

మాతృహృదయం విశ్వమంత విశాలమయింది.

- సరస్వతీదేవి, దోస్త్ కటాఫ్

తల్లీ పిల్లల మధ్య భాష అవసరంలేదు.

- కొడవటిగంటి, తల్లిచాటు పిల్లవాడు

తల్లి సంరక్షణమువంటిది మరియొకటి కాదు.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

డబ్బులేని వానికి బోగంది తల్లివరుస.

- సామెత

తల్లి లేకుంటేను, తనువు లేదంటారు.

- వేంకటసుబ్బారావు, మాయమ్మ మాకిత్తువా?

**తల్లిదండ్రులు**

దైవ మనఁగ గురుండునా ధర్మ మనఁగ
నర్థ మనఁ దలిదండ్రులె యాత్మజునకు.

- శ్రీనాథుడు, కాశీఖండము

మానాన్న వున్నాడు చూశారూ, ఆయన దివ్య దృష్టి అమోఘం!

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

లోకమందు మాతాపితలు మిత్రుఁడును వీరు ముయ్వురే హితులు. తక్కిన వారందఱు ప్రయోజనముఁబట్టి హితు లగుచున్నారు.

- చిన్నయసూరి, మిత్రలాభము

తల్లిని, తండ్రినీ యేఁవనుకున్నా మనుసులో అనుకొని జీర్ణించుకోవాలి.

- గురజాడ, కన్యాశుల్కం

**తవ్వకం**

దారి త్రవ్వఁగా గనియు పుట్టయు నైనది.

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

**తస్కరణం**

అనర్హుడికి చేసిన సత్కరణం తస్కరణం.

- భమిడిపాటి, తుక్కుముక్కల హక్కుచిక్కు

**తస్మాత్ జాగ్రత**

వెనుక గోతులు త్రవ్వేవాళ్ళు యెప్పుడూ వుంటారు.

- ముద్దంశెట్టి, నిమిత్తమాత్రులు

**తాగుడు**

తాగేవరకూ మధువు మాత్రమే బాగుంటుంది. తాగాక ప్రతీదీ బాగుంటుంది.

- వనమాలి, జీవించడమే ఒక వ్యసనం

మందు తాగేవా డెప్పుడూ (జబ్బుక్కాదని మనవి) పక్కవాడికి ఆఫర్ చెయ్యకుండా తాగడు, తాగకూడదు.

- బీనాదేవి, సిగరెట్లు మానేద్దాం

కల్లుఁ ద్రావువాఁడు గాఢనిద్రను జెందు
నతఁడు సన్నిపాతయుతుఁడు నప్పు
డాడు మాటలన్ని యాథార్థ్యసహితంబు
లంచు విశ్వసింప నగును దఱచు.

- పానుగంటి, మాలతీమాల

తాగి ఉన్న అమాయకుణ్ణయినా భరించటం కష్టం.

- తులసి, మనువు

తాగినప్పు డెవడైనా సరే, లోపలున్న రహస్యాలన్నీ కక్కేస్తాడు. ఒకటీ, అర అబద్ధం వుంటే వుండొచ్చు.

- రెంటాల, ఇన్‌స్పెక్టర్ జనరల్

ప్రభువు త్రాగక పాలింపలేఁడు. సేవకుఁడు త్రాగక సేవింపలేఁడు. వైద్యుఁడు త్రాగక వ్యాధిని కనిపెట్టలేఁడు. అర్చకుఁడు త్రాగక హారతి పట్టలేఁడు. వంటవాఁడు త్రాగక వండ లేఁడు.

- కాళ్ళకూరి, మధుసేవ

తాక్క సోజరువాడు చెడ్డాడు. తాగి సిపాయివాడు చెడ్డాడు. జ్ఞానికి జ్ఞానపత్రి, తాగు

బోతుకు సారాయి

- గురజాడ, కన్యాశుల్కం

తాగుచుండే బుద్ధి
తరుగుచుండే కొద్ది
మెదడు మేయును గడ్డి
ఓ కూనలమ్మ.

- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

వాఁడు వదలినను - వానికొఱకు నేర్చుకొన్న త్రాగుడు వదలినదికాదు

- కాళ్లకూరి, చింతామణి

త్రాగి తనను తాను మరచిపోలేకపోతే తనకు తాను దక్కడు. ఎవడైనా ఆపదలు తలకు మీరి నవైనప్పుడు.

- రామకృష్ణశాస్త్రి, మీమాంస

మితంగా తాగితే దేహానికి బహుమంచిది. అన్నం జీర్ణమవుతుంది. వంట్లో ఖులాసాగా వుంటుంది.

- కందుకూరి, నవనాగరికులు

**తాగుబోతు**

తాగినోడికన్నా నిబద్ధిగా వున్నాడు యెవులు న్నాడు.

- కాంతారావు, నిజాయితీ కథలు

తాగుబోతు ముడుసులకు కూసేదీ సేసేదీ ఎట్ట తెల్సుద్దీ?

- మా గోఖలే, మర్నాలపండగ

తాగినోడెప్పుడూ నీతిమంతుడే బాబూ

- వెంకటేశ్వరరావు, సమాధికడుతున్నాం చందాలివ్వండి

తాగినవాడు తప్పకుండా నిజం చెబుతాడు.

- రామదాసు, ఆకాశరామన్న

తాగేసినోళ్లు సంటిపిల్లల్తో సమానం గదా!

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

**తాటిచెట్లు**

కర్ణకుండలాలు తగిలించుకున్న రసాకృతులు తాటిచెట్లు తమ సౌశీల్యాన్నీ, దాన శీలతనూ చప్పుడు చేసుకుంటున్నాయి.

- కమ్మిశెట్టి, ప్రతిరోజూ నడుస్తుంది ఆ వూళ్లో అసురసంధ్య

**తాడికల్లు**

సోమపత్త్రరసమెట్టిదో, నాముతాఁడి కల్లట్టింది.

- పానుగంటి, రాతిస్తంభము

**తాత్కాలికం**

అప్పటి మాటలకు దుప్పటి ఇచ్చినానుగాని, కల కాలం కప్పుకోను ఇచ్చినానా?

- సామెత

మన ప్రాణం, ఐశ్వర్యం అంతా తామరాకు మీఁది నీటి వంటిది.

- వేంకటరాయశాస్త్రి, తానీషా

**తాతపెళ్లి**

తలచినప్పుడేనా తాతపెళ్ళి?

- గురజాడ, కన్యాశుల్కం

**తాత్పర్యం**

ఒకరిని సన్మార్గంలో పెట్టటమంటే, నిజమేమిటో తెలియకుండా అన్నీ అబద్ధాలు చెప్పడమేనా?

- యజ్ఞన్నశాస్త్రి, విశ్వంపెళ్లి

**తాపత్రయం**

స్వర్గంలో కూడా సంసార తాపత్రయమేనా...

- రాజమన్నారు, నిష్ఫలం

పండితులకి ఉద్యోగాలు చెయ్యాలని తాప త్రయం. ఉద్యోగస్థులకు పండితు లనిపించు కోవాలని తాపత్రయమూనూ.

- గురజాడ, బిల్హణీయము

ఊరగాయలు పెట్టాలని జాడీలు తాకట్టుపెట్టి నట్టు.

- శ్రీరమణ, న్యూసుడి

**తాంబూలం**

తాంబూలం ఇచ్చేశాను - ఇహ తన్నుకుచావండి.

- గురజాడ, కన్యాశుల్కం

దక్షిణలేని తాంబూలంలాగ కట్నంలేని పెళ్ళే మిటి?

- కొడవటిగంటి, బెదిరిన మనుషులు

సిసలైన తాంబూలమే గనుక సేవించినట్టయితే, ఎలాటి సాత్వికుడికైనా అంతో ఇంతో ఉద్దీపనం కలుగకుండా మానదు. అది సాజం!

- రామకృష్ణశాస్త్రి, ఏలేలో

**తారతమ్యం**

చీట్లపేక ఆడేందుకు గొప్ప, పేద అన్న తార తమ్యం లేదోయ్. ఆ మాటకొస్తే పేదవాళ్ళే విరి విగా ఆడుతుంటారు.

- ముద్దంశెట్టి, అంతామోసం!

కూతుళ్ల కన్నమ్మకు కుర్చీపీటలు, కొడుకుల

కన్నమ్మకు గోడపంచలు.

- సామెత

కొరివి పెట్టేవాడు కొడుకు, కూడు పెట్టేది కూతురు.

- సామెత

కుంచాలమ్మ కూడువేస్తే మంచాలమ్మ మాయం చేసిందట.

- సామెత

పాండిత్యానికి తనకంతా తెలుసునన్న అహం కార మున్నది. వివేకానికి తనకేమీ తెలియ దన్న వినమ్రత ఉన్నది.

- సామెత

నిజం కురచ, బొంకు పొడవు.

- సామెత

బడాయికి బచ్చలికూర, తినబోతే తోటకూర.

- సామెత

పిల్లనిచ్చిన వాడు ఈగ, పుచ్చుకున్నవాడు పులి.

- సామెత

కాలతంతే పెరిగేది పుచ్చకాయ, కుళ్ళేది గుమ్మడి కాయ.

- సామెత

ఆలి పంచాయతీ రామాయణం, పాలి పంచా యతీ భారతం.

- సామెత

నీరు ఉంటే పల్లె, నారి ఉంటే ఇల్లు.

- సామెత

తెలిసినవా రెదురైతే మనిషి పండ్లికిలిస్తాడు, గుర్రం సకిలిస్తుంది.

- సామెత

శంఖంలో పోస్తే తీర్థం, పెంకులో పోస్తే నీళ్ళు.

- సామెత

హరిశ్చంద్రుడినోట అబద్ధం రాదు, నానోట నిజం రాదు.

- సామెత

చెప్పటం తేలిక, చేయటం కష్టం.

- సామెత

అన్నీ తెలిసినమ్మ అమావాస్యనాడు చస్తే, ఏమీ తెలియనమ్మ ఏకాదశినాడు చచ్చిందట.

- సామెత

తన కంట్లో దూలం బెట్టుకొని, పరుల కంట్లో నలుసు లెంచినట్లు.

- సామెత

చిన్నవాళ్లు తింటే చిరుతిండి, పెద్దవాళ్ళు తింటే ఫలహారం.

- సామెత

**తారలు**

కచ, కుచ ఘన జఘనాదులతో నిండిన ప్రబం ధములకు మించిన బంధనములుగా ఉన్నాయి అరచాటు, తెరచాటు కూడా లేని తెర తారల అవతారములు.

- వామనరావు, భాషా శ్లేషప్రకోపం

**తాళం**

తాళము పోవు బాధ ప్రాణముపోవు బాధకంటె ఎక్కువది కాదా? లయ బ్రహ్మమని చెప్పుటచేఁ దాళము చెడఁగొట్టిన బ్రహ్మహత్యాదోషము సిద్ధింపదా?

- పానుగంటి, సాక్షి

యీ శలవులాఖర్లోగా తాళాధ్యాయం కాకుండా తప్పించుకుంటే నువ్ కూడా ప్రయోజకుడివే.

- గురజాడ, కన్యాశుల్కం

**తాళిబొట్టు**

సానిదానికి బొట్టు కడితే సతి అవుతుందా? కుక్కకూ కడతారు బొట్టు మ్యునిసిపాలిటీవారు.

- రాజమన్నారు, ఏమి మగవాళ్ళు

**తికమక**

ఈ రోజుల్లో ఎవరు నాయకులో ఎవరు వినా యకులో తేల్చుకోవటం కష్టమవుతోంది (లెండి)

- ఆనందారామం, మరోముందడుగు

**తిక్కన**

కృష్ణ పతనానికి ప్రారంభకుడు తిక్కన. అర్జున సారథికీ, భగవత్ బోధకుడికీ సంబంధం కుదర్చలేకపోయినారు తిక్కనగారు. తిక్కన shallowness కృష్ణుణ్ణి heart-less plotter ఇతరుల పతనంతో సంతోషించే petty scoundrel ని చేసింది

- చలం, మ్యూజింగ్స్

**తిట్లు**

తిట్లు ఎప్పుడూ ఆనందాన్ని కలిగించవు. కాని ఎదుటివారి అభిమానం దెబ్బతినేంత తీవ్రంగా మాత్రం ఉండకూడదు.

- రంగనాయకమ్మ, పేకమేడలు

సైకం భాగోతులోనికి, తిట్లు మంగలోనికి.

- నరసింహం, తిరగబడ్డ భూమి

తెలుగువారి తిట్లలోని కోటి దీవెనల సొగసు తెలుసుకోవాలి.

- పురాణం, ఇల్లాలి ముచ్చట్లు

ఫోర్సుగా తిట్టాలంటే యింగ్లీషులో తిట్టాలి. బాగా ఏడ్వాలంటే తెలుగులోనే ఏడ్వాలి.

- పినిశెట్టి, ఆత్మీయులు

తిట్లు స్తోత్రము వలననే యుడుగునుకాని తిట్ల వలనఁ బోవునా?

- పానుగంటి, సాక్షి

క్షీరము లుప్పులో విరుగును. తేనె నీటిలో విరుగును. శరీర బలము నూనెలో విరుగును. మనసు తిట్టుతో విరుగును.

- పానుగంటి, సాక్షి

ప్రజల తిట్లను లక్ష్యపెట్టిన యెడల ప్రపంచమున బ్రతుకఁగలమా? తిట్టఁదలచిన వారు తిట్టుచునేయుందురు. కాలిమీఁదఁ ద్రొక్కిన మానరు. గొంతుమీఁదఁ ద్రొక్కిన మానరు. పుట్టిన పుట్టుక తిట్లు తినుటకుఁగాక మఱెందులకు? పరబ్రహ్మము మొదలు పాకివాని వఱకు ప్రజలచేఁ దిట్లు బడని వారెవ్వరును నాకుఁ గనపడలేదు. ప్రజల కుపకారము చేయు స్వభావము గలవారికి తిట్లు మఱింత యెక్కువ.

- పానుగంటి, సాక్షి

పిన్నటనాఁటి నుండియు నిట్టి తిట్లనేకములు వడతిని. అవన్నియు నిజములైనచో నేనిదివఱకే లేకుందును.

- తి. వేం., పాండవోద్యోగము

వొస్తూనే తిట్లతో ఆరంభిస్తే యెంతవాడికైనా కొంచెం కోపం వస్తుంది.

- గురజాడ, కన్యాశుల్కం

నన్నూ నావంటి వాళ్లనూ తిట్టే తిట్లు లెక్కపెట్టుకోవడానికిగాని, జపం చేసుకోడానికా యేమిటి ఆ పూసలు?

- సుబ్రహ్మణ్యశాస్త్రి, జాగ్రత్తపడవలసిన ఘట్టాలు

నీ యింట కోడి కాల్చా!

- గురజాడ, కన్యాశుల్కం

మనిషి ఎంత ఎక్కువగా ఉద్రేకంలో తిడుతూ ఉంటే అంత త్వరగా మనసు కుదుటపడుతుంది.

- నరసింహ, తిరగబడ్డ భూమి

గట్టిగ దోషము లెఱుఁగక
తిట్టిన నది దీవన యగు; దీవించినచోఁ
దిట్టగు నది; తెలుసుక నే
తిట్టిన దీవించినను బతికి నిక్క మగున్.

- చాటువు

### తిండి

ఉన్నవాళ్లు తినడానికి బ్రతుకుతారు!
లేనివాళ్లు బ్రతకడానికి తింటారు!

- ఆచంట, చావలేని సామాన్యుడు

తిన్నవాడు దొరికే తినటంలేదు. తిననివాడు దొరక్కే మానటంలేదు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, మార్గదర్శి

దొమ్మ మాయుకొఱకు నమ్మవారికి వేఁట
లిమ్మటం డ్రిదేమి రిమ్మ తెవులు?
అమ్మవారి పేర నందఱుఁ దినుటకా?

- వేమన

తినటమంటే నానార్థాలు బోల్డున్నాయి తండ్రీ!

- ఆదివిష్ణు, చూడు చూడు నీడలు

### తిండిపోతు

తిండికి ఏనుగ, పనికి పీనుగ.

- సామెత

కసువుకు పోరా కమ్మా అంటే కడుపు నొప్పే నా అమ్మా; బొచ్చె ఎత్తుకరా బామ్మా అంటే, అట్లా చెప్పవే నీయత్తా అన్నాడుట.

- సామెత

### తిరకాసు

నేను ముండామొయ్యవలె ననుకొన్నానుగాని మిమ్మలిని. చావ మనలేదు.

- కందుకూరి, హాస్యసంజీవని

యజ్ఞములో బ్రాహ్మణుడు మేకను చంపితే పుణ్యము, కసాయివాడు మేకను చంపితే పాపమా?

- చిలకమర్తి, మెట్టవేదాంతము

సీతగ వుంటానికి నేను
కోరినా రామయ్య సతిగా వుంటానికి మాత్రం
ఒప్పుకోను ఏమాత్రం నేను.

- పఠాభి, సీత

రామభక్తుడైన హనుమంతుడు
కృష్ణుని ఆనవాలు పట్టడు.

- కాళోజీ, చాదస్తం

### తిరిగి రానిది

సానికి పెట్టిన డబ్బూ గోడకి వేసిన వెల్లా తిరిగి రావురా.

- సి. యస్. రావు, కుసుమ యజ్ఞం

**తిరుగుడు**

ఆడది తిరిగి చెడిందట, మగవాడు తిరక్క చెడ్డాట్ట.

- సామెత

**తిరుగుబాటు**

తమ శ్రమలకు తగిన ఫలం
ఇమ్మంటే 'తిరుగుబాటు'.

- దాశరథి, రుద్రవీణ

పొరపాట్లమీద పోలీసు నిఘా వెయ్యందే
తిరుగుబాట్లు నెరవేరవు.

- కుందుర్తి, తెలంగాణ

పలుగు తీసక పొడిత్తే ప్రేణంలేని మట్టిగెడ్డ తిరగబడుద్ది! ఇంక మడుసులు తిరగబడరా?

- చిరంజీవి, బీళ్లు తిరగబడుతున్నాయి

నిన్నటి గతుకుల బాటలో
రేపటి బ్రతుకులు సాఫీగా సాగాలని
నేడు వేసే కాంక్రీట్ రోడ్డే తిరుగుబాటు.

- గౌరీశంకర్, విప్లవం

గతి తర్కంలో పసలేదు
తిరుగుబాటు కూటికి రాదు.

- శ్రీశ్రీ, ఉగాది స్వగతాలు

ధైర్యంగా నిలిచి ఆడది యెదురుకోగలిగితే మొగా డుక్కిరిబిక్కిరి అయిపోతాడు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, రాజరాజు

ఒక్కొక్కమారు సొంత అభిప్రాయాలు ఎదురు తిరుగుతాయ్!

- రామదాసు, ఆకాశరామన్న

చల్లని నీటిలో ఎంతో. .
జలవిద్యు త్తున్నప్పుడు
పల్లెవాని గుండెల్లో
పెల్లుగా తిరుగుబాటుండదూ?

- దాశరథి, పునర్నవం

నిజ జీవితాలలో నిప్పులు పోసే వ్యవస్థను పరిమార్చాలన్న సంకల్పంతో గుండెలలో జనించే భావావేశమే తిరుగుబాటు.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీజై

పొరపా టే తిరుగుబాటు
తిరుగుబాటు తిరిగి చాటు!

- అబ్బూరి, కవిత

ఈ విశాల జగతి నుంచి
ఏమిటి నే కోరినాను?
ఒక జానెడు సానుభూతి
ఒక దోసెడు తిరుగుబాటు

- శ్రీశ్రీ, సదసత్సంశయం

తిరుగుబాటు అంటువ్యాధి లాంటిది. పెట్రోలు మంట లాంటిది. చలి చీమల పెనుకోపం లాంటిది. నొక్కితే మరి ఆక్కుండా పేలేమందు గుండు లాంటిది.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

**తిరుగులేనిది**

బోనెక్కి పోలీసోడు జెప్పిన మాటకి తిరుగులేదంటే లేదని యెయ్యి తీర్పులున్నాయి.

- రావిశాస్త్రి, మోసం

అధోలోకాలకన్నా ఊర్ధ్వ లోకాలు గొప్పవి. దక్షిణాదికన్నా ఉత్తరాది గొప్పది. నల్లవాళ్లకన్నా తెల్లవాళ్లు గొప్పవాళ్లు. ఇవి తిరుగులేని సత్యాలు.

- కొడవటిగంటి, కింకరుడు

**తిరునాళ్లు**

బెరసి వెన్నెల గాయంగఁ బేరకమ్మ
పులినతలముల నాయాయి కొలము లెటఁగి
తాల్చు శస్త్రాస్త్రములు జార దంపతులకు
నసమబాణుండు తిరునాళ్ల నన్నినాళ్ల.

- వల్లభరాయడు, క్రీడాభిరామము

**తిరుపతి**

పరపతి పోయినాక తిరుపతి చేరుకోవలసిందే గదా.

- ఆవుల, ఉలిపికట్టె

తిరుపతిలో పుట్టగానే దున్న గోవిందా అంటుందా?

- సామెత

**తీపి**

చుట్టంమీద తీపి, బియ్యంమీద తీపి, అయితే ఎట్టాగండీ?

- సుంకర, కోతలరాయుడు

కరము వేతనంబుకన్న లంచము తీపి
వసుధ మొదలుకన్న వడ్డీ తీపి!

- కాళ్లకూరి, వరవిక్రయము

సర్వవిధములఁ బ్రాణసంచయము తీపి
దానికంటెను లోభికి ధనము తీపి.

- కాళ్లకూరి, లుబ్ధాగ్రేసరచక్రవర్తి

తీపికెల్లఁ దీపి తెలియంగఁ బ్రాణంబు
ప్రాణవితతికన్నఁ బసిండి తీపి
పసిండికంటె మిగులఁ బడఁతి మాటలు తీపి!

- వేమన

**తీరని కోరిక**

మూల విగ్రహాలు ముష్టి ఎత్తుకుంటూ వుంటే, ఉత్సవ విగ్రహాలకు దధ్యోదనం.

- సామెత

**తీరిక**

చేసే వారికి ఓ క్షణం తీరిక ఉండదు. చేయని వారికి పనీ కనపడదు.

- వసుబాబు, ఆద్యంతాలూ-ఆంతర్యాలూ

దోష నిరూపణమొకటి, స్నానమొకటి, మంత్రాలోచన మొకటి. తీరికగాఁ జేయవలసిన పనులు.

- పానుగంటి, వీరమతి

తీరుబడిగా కూర్చుంటే మనస్సులో అనేక ఆలోచనలు.

- మహీధర, ఓనమాలు

**తీరు**

మడుసుల మొగాల్లోనూ మాటల్లోనూ వాళ్ల తీరు కనిపిచ్చుద్దిలే నాయనా.

- మా గోఖలే, దొంగవాళ్లు

**తీర్థం**

శంఖంలో పోస్తే తీర్థం, పెంకులో పోస్తే నీళ్లు.

- సామెత

ఆడబోయిన తీర్థం యెదురైనట్లు

- సామెత

**తీర్పరి**

తల్లికి కూడు పెట్టనివాడు, తగుదునని తగవు తీర్చ వచ్చాడట.

- సామెత

తన ప్రాణం త్రాసుమీద ముక్కలు
సమంగా తూచినవాడే గడుసరి తీర్పరి.

- కుందుర్తి, తెలంగాణ

**తీర్పు**

ఎవడూ తనమీద తనే తీర్పు చెప్పుకోలేడు.

- కాంతారావు, వంశధార

ఏదైనా పోటీ జరిగినప్పుడు దానిలో పాల్గొనే వారిలో మాత్రమే అగ్రస్థానం నిర్ణయిస్తారు. ఆ తీర్పు వారికే పరిమితం. పోటీలో పాల్గొనని అసంఖ్యాకులకు అది వర్తించదు.

- నార్ల, రూపం, గుణం

ఎంతటి కేసైనాసరే అరవీసెడు వంకాయలకు తీర్పు మార్పు చేస్తాడు.

- రామదాసు, ఆకాశరామన్న

పిట్టా పిట్టా పోరు పిల్లి తీర్చినట్లు

- సామెత

**తీవ్రత**

గోరుచుట్టు మీద రోకటి పోటు

- సామెత

**తుదిఘడియలు**

చావటానికి సిద్ధంగా ఉన్నానని తెలిసినవాడికి జరిగిపోయిందంతా వివరంగా స్ఫురణకు వస్తుందట.

- కొడవటిగంటి, గాలిపాట

**తుపాకీ**

ఈళ్లు జెండాలు పడితే మేము తుపాకులు పడతాము.

- అప్పల్నాయుడు, పోడు-పోరు

**తుమ్ము**

వెనుక తుమ్ము ముందునకు మంచిదందురు.

- కాళ్లకూరి, చింతామణి

ఆవులింతకు అన్నలున్నారుగాని, తుమ్ముకు తమ్ముడు లేడు.

- సామెత

**తురక**

యీ తురకెవడోయ్!

- గురజాడ, కన్యాశుల్కం

తురకలకుఁ బాపపుణ్యము
లరయం బనిలేదు, వారియందును సచ్ఛీ
లురు గలరు...

- చెళ్ళపిళ్ల, గాంధీ ఋషి

**తురుపుముక్క**

స్త్రీని పురుషుడు శంకించినంత సులభంగా నిరూపించలేడు. కాని స్త్రీని ఏమాట అంటే తల వంచుకుని వెనక్కు తగ్గుతుందో పురుషుడికి తెలుసు. ఆ తురుపు ముక్కతోనే ఆమె జీవితంతో పేకాట మొదలు పెడతాడు.

- సరస్వతీదేవి, జీవితానికొక జోడు

**తుష్టి**

ముష్టికి పోయి తుష్టి లేదని ఏడ్చినట్లు.

- సామెత

**తూకం**

వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు తులాభారం తూగితే, కరెడ్ల కామమ్మ వంకాయల భారం తూగిందట.

- నార్ల, శకునపక్షి

ఆడవాళ్ళని వీకర్ సెక్సు అంటారుట. అది నీరస మో, సున్నితమో లేక ఫేషనో తెలీదు కానీ చదువుకునే అమ్మాయిలెప్పుడూ ఏడుమల్లెపువ్వు లెత్తు తూగుతూ ఉంటారు

- బీనాదేవి, హరిశ్చంద్రమతి

**తూటు**

చిల్లి పేరే తూటు.

- సుంకర, గెరిల్లా

**తూలటం**

చుక్క పడ్డాక తూలకుండా ఉండటం కల్ల!

- ధనికొండ, ఎర్రబుట్టలు

**తృప్తి**

తక్కిన బహుమానము మా
కక్కఱయే లేదు బత్తె మది చాలునయా!
నిక్క మిది "దంపి నమ్మకు
బొక్కినదే కూలిగాదె" భూపలలామా!

- తి.వేం., నానారాజ సందర్శనము

వ్యాప్తిం బొందక కుందక
ప్రాప్తంబగు లేశమైనఁ బదివే లనుచున్
దృప్తిం జెందని మనుజుఁడు
సప్తద్వీపములనైన జక్కంబడునే?

- పోతన, భాగవతము

ధన మొసంగి చాలు ననిపింపఁ జాలఁడు
అన్న మొసఁగఁ జాలు నసును నతిథి.

- ఉమర్‌అలీషా, ధనమా! అన్నమా!

ఉన్నవాళ్లను చూసి ఈర్ష్య పడటంకంటే లేని వాళ్లను చూసి తృప్తి పడటమే మేలు.

- రారా, హృదయంలో హద్దులు

కష్టపడి సంపాదించే డబ్బులో దొరికే తృప్తీ, సుఖం అన్యాయంగా ఆర్జించటంలో దొరకదు.

- రామచంద్రమూర్తి, దైవాజ్ఞశిఖామణి నగరానికి రాక

ఈ లోకంలో ధనంతో తృప్తి పొందినవారు యెవ్వరున్నారు?

- కందుకూరి, మహాబధిరప్రహసనము

చెయ్యవలసిన పని చెయ్యటంలో తృప్తి ఉంది. ఏదో మిషమీద అది ఎగగొట్టటంలో ఒక సరదా ఉంది.

- పాప, రామరాజ్యానికి రహదారి

అగ్నిఁ గాష్ఠముల మహాంబుధి యేఱుల
నంతకుండు భూతసంతతులను
వనజముఖులు పురుషులను దృష్టిబొందుట
గలుగదంద్రు కోవిదులు మునీంద్ర.

- తిక్కన, ఆనుశాసనికపర్వము

కొందరితో మనసారా మాట్లాడితే కాని తనివి తీరదు! కొందరితో పోట్లాడితేగాని మనశ్శాంతిగా వుండదు.

- శ్యామలారాణి, జై మంగళా

దేనిమీదా ఆసక్తిలేనినాడు అంతా తృప్తి కోరిక లతో సతమత మయిపోతుంటే, ఎన్ని కోరికలు తీరినా తృప్తి కలగదు.

- వెంకట కృష్ణమూర్తి, పడమటి సంధ్యారాగం

చాలు నిరీక్షణ చా లికఁ జింతన
చాలు రహస్య వియోగహతుల్!

- దువ్వూరి, నైవేద్యము

ఆడెడు కొమ్మ పదమ్ములు,
పాడెడు కలకంఠి మొగము, భావజుకేళిం
గూడెడు సకియల తావులుఁ
జూడక రహి పుట్టదంద్రు సుజనులు మదికిన్.

- చాటువు

**తృష్ణ**

మనిషి తన జీవితంలో తృష్ణ లేకుండా బ్రత కటం కంటే యింకో నేరం లేదు.

- కొంతారావు, అంతరాత్మ కథలు

తృష్ణకు నీతి ఎక్కడిది? దయాదాక్షిణ్యా లెక్క డివి?

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

**తెగింపు**

మా యిద్దఱి లోపల మఱి
యీయన గెలుచుటయె మంచి దిప్పుడు తనకుం
బోయెడిదేమీ? నాకుం
బోయిన దిప్పటికి సర్వమున్ మాయయుగా.

- విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము

వేడినీళ్ళకు ఓర్వలేనమ్మ సహగమనం చేస్తానన్న దట.

- సామెత

**తెగులు**

కులానికి కులం తెగులు, నీళ్ళకు నాచు తెగులు.

- సామెత

మాటకు మాట తెగులు, నీటికి పాచి తెగులు.

- పులికంటి, భా(భీ)మాకలాపం

మాటికి మాట తెగులు, కర్రకి కర్ర తెగులు.

- బీనాదేవి, ఏ మేటరాఫ్ నో ఇంపార్టెన్స్

**తెంపరి**

ఈ మదీయశిఖ మఱెవ్వఁడో వద్ధ్యుఁడై
యిప్పుడైన ముడువ నీనివాఁడు!

- తి.వేం., ముద్రారాక్షసము

**తెర**

మగాడికి ఉద్యోగంతో ఆడదానికి పెళ్ళి పిల్లలు కనటంతో జీవితం మీద తెరపడుతుంది.

- పురాణం, ఇల్లాలి ముచ్చట్లు

**తెలంగాణ**

తెలంగాణాను వర్ణించటానికి తెలుగులో
మాటలు చాలవు
అది ఒక హెల్ అనుకుందాం
సంప్రదాయవాదులు క్షమించండి
అందుకే దాన్ని హెలంగాణ అంటున్నాను

- కుందుర్తి, తెలంగాణ

నా తెలంగాణ కోటి రత్నాల వీణ

- దాశరధి, తెలంగాణ

**తెల్లచీర**

మొదటిరాత్రి మొగుడి దగ్గరి కెళ్ళినప్పుడూ తెల్ల చీరే. వాడు పోయినా తెల్లచీరే?

- బీనాదేవి, టెన్ కెమాండ్‌మెంట్స్

**తెలియనిది**

తింటేగాని రుచి తెలియదు. దిగితేగాని లోతు తెలియదు.

- సామెత

ఆనక చలి, చొరకయె లోతు తెలియఁబడునె?

- వేంకటరాయకవి, వేణుగోపాల శతకము

**తెలివి**

ఆవులిస్తే పేగులు లెక్కపెట్టగలడు.

- సామెత

తెలివి లేమి యనుట తెలివి లేమి.

- మారేపల్లి, ముసిడిపండు

నవల చీల్చి నాలుగు కథలు అల్లినట్లు.

- శ్రీరమణ, న్యూసుడి

నీ డబ్బు, నా కథా కలిపి సిన్మా తీద్దామన్నట్లు.

- శ్రీరమణ, న్యూసుడి

నీ పెండ్లాం ముండమోస్తే నీకు ఎవరు అన్నం వండిపెడతారు అన్నాడట.

- సామెత

ఇతరుల్ని మోసం చేయటానికి అవసరం లేక పోయినా తను మోసపోకుండా ఉండటానికి తెలివి తేటలు కావాలి.

- రామమోహనరావు, త్రినేత్రుడు

కొంటేగాని కొరత, తింటేగాని రుచి తెలియవు.

- సామెత

ఊరు గబ్బు చాకలి యెరుగునన్నట్లు.

- సామెత

మనకి తెలీనిది యింకొకర్ని అడగటం అనేది బుద్ధిమంతుల లక్షణం. ఆ అడిగి తెలుసుకో వడం పరీక్షహాలైనా, పడగ్గదైనా పరవాలేదు.

- బీనాదేవి, హరిశ్చంద్రమతి

తెలివితేటలు కలిగియుండుట యొక్క చెడ్డగుణము. ఎప్పుడును ఆ తెలివితేట లుపయోగించుటకు వీలైన పరిస్థితి కోసమే మనస్సెదురు చూచుచుండును.

- విశ్వనాధ, బద్దన్న సేనాని

అసలు మందిమీద ప్రయోగించేది తెలివితేటలు కానేకావు. అందుకనే రచ్చగెలిచేవాడు ఇంట గెలవలేడు.

- కొడవటిగంటి, పీటకధ

తెలివితేటలు గాలివంటివి.

- విశ్వనాధ, చెలియలికట్ట

ఏడిశారు! తెలివిగల వాళ్ళం అనుకుంటూనే జనం తెలివి లేకుండా పోతున్నారు. అందుచేతనే మన వ్యాపారం ఇంత సులువుగా సాగిపోతోంది.

- నాగేంద్రరావు, ఒకే కుటుంబం

తెలివి అనేది కులానికి మాత్రమే అమ్ముడు కాలేకపోయింది. ఆ తెలివితేటలకి మనుషులెందుకు గౌరవా న్నివ్వరు? మనిషిని గౌరవించడానికి కావలసింది 'ఆ' తెలివి కాదేమో!

- నంది, నైమిశారణ్యం

పెద్ద తెలివి వున్న వోళ్ళంతా యింతే తల్లీ. మాంచి తెలివికి తోడు కాసింత కొనపిచ్చి కూడా వుంటా దంటారు పెద్దలు.

- ముద్దుకృష్ణ, ఆడవాళ్ళ తెలివి

పరీక్ష ఫెయిలయిన వాళ్ళకి తెలివితేటలు జాస్తి.

- బుచ్చిబాబు, ఆత్మవంచన

తెలివి వుండగానే సరిపోదు. తెంపు కూడా వుండాలి.

- సుంకర, పీటలమీద పెళ్ళి

తెలివి మరుగుతున్న నూనెలాంటిది.

- కాంతారావు, వంశధార

యోగ్యత గ్రహించడానికి తెలివితేటలు వుండవ లెను గాని చదువెందుకు?

- కందుకూరి, బ్రాహ్మవివాహము

తెలివి ప్రమాదం ప్రళయం
శాంతిభద్రతలకు భంగం

- కాళోజీ, తెలివి ప్రమాదం ప్రళయం

జీవితంలో వున్న విచిత్రమిదే. తెలివి ముదిరిన వాళ్ళకు బుద్ధి సరిగా వుండదు.

- రెంటాల, ఇన్‌స్పెక్టర్ జనరల్

దొంగతనము చేసినను సరె పట్టుబడకుండుట తెలివి.

- చిలకమర్తి, గణపతి

తగిలిన కాలికే తెలుస్తుంది బాధ.

- పులికంటి, భా(భ్రీ)మాకలాపం

యంత్రంవద్ద పనిచేసే వాడికి దాని మోత తెలియటం అది ఆగిపోయినప్పుడే.

- మహీధర, కత్తులవంతెన

మొగాణ్ని ఏ విధంగా బాధపెట్టాలో స్త్రీలకే తెలుస్తుంది.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

తండ్రి చస్తే పెత్తనం తెలుస్తుంది. తల్లి చస్తే కాపురం తెలుస్తుంది.

- సామెత

## తెలివితక్కువ

తెగేదాకా లాగటం తెలివిగల పనికాదు.

- మహీధర, ఓనమాలు

అంబటేరు వచ్చింది అత్తగారూ! అంటే, కొల బుఱ్ఱ నాచేతిలో ఉంది కోడలా అందిట.

- సామెత

గుమ్మడికాయ దొంగ అంటే, భుజాలు తడుము కొన్నట్లు.

- సామెత

తినబోతూ రుచులడిగినట్లు.

- సామెత

రోటిలో బుఱ్ర పెట్టి, రోకటి దెబ్బకు జడిసినట్లు.

- సామెత

తన తలుపు తీసి పొరుగింటికి వెళ్ళి రాత్రంతా కుక్కలను తోలుతున్నట్లు.

- సామెత

## తెలిసినవాళ్లు

తెలియనివాళ్ళు తప్పుత్రోవ తొక్కటం కన్నా తెలిసిన వాళ్ళు తొక్కటమే తప్పుగాదా?

- వెళ్ళపిళ్ల, కథలు-గాథలు

## తెలుగు

తిట్లకి ఇంగ్లీషూ, దీవించటానికి సంస్కృత మూనూ తెలుగు కూరలు బేరం చేయడానికి దానికీ తప్ప దేనికీ పనికిరాదు.

- కొడవటిగంటి, ఐశ్వర్యం

తెలుగులో అచ్చుతప్పులేకుండా పుస్తకం వస్తుం దని గ్యారంటీలేదు.

- కొడవటిగంటి, అనామిక

తెలుగువాడికి కలవటం ఎంత తెలుసునో కల పడం కూడా అంతే తెలుసు.

- భమిడిపాటి, కాఫీ దేవాలయం

తెలుగువాళ్ళకి పేరూ, కడం వాళ్ళకి ధనమూ సంపాదించి పెట్టిన మహాభక్తుడు త్యాగరాజు.

- భమిడిపాటి, త్యాగరాజు మాటలు

మాటకీ దాని ఉచ్ఛారణకీ తెలుగులో ఖాతరీ ఇంతవరకు లేదు. అది ఒక కళ అని ఎవ్వరూ మన్నించరు.

- భమిడిపాటి, తెలుగునటుడు - మేజువాణి

తెలుగు వచన మ్యొహానికి నాటకం ఏమిటండీ. బోడికి విగ్గులాగా!

- భమిడిపాటి, తుక్కుముక్కల హక్కు చిక్కు

ఇతర హిందువుణ్ని ఎవర్నైనా వీడు అరవ, వీడు పంజాబీ, వీడు బంగాళీబాబు అని ఆన వాలుపట్టవచ్చును కాని, మన తెలుగు అసా మీని చూచి పోల్చటానికి కొంత బుద్ధి ప్రయోగి స్తేగాని లాభంలేదు.

- భమిడిపాటి, తెలుగు వ్యాకరణం

ఇంగ్లీషుకి తండ్రి ల్యాటిన్, తెలుక్కి తల్లి సంస్కృతం అవటంచేత ఇంగ్లీషూ, తెలుగూ కలవ్వేమో అని కొందరికి డౌటేహం.

- భమిడిపాటి, బాగుబాగు

తెలుగొస్తేనే అబద్ధం చెప్పొచ్చు తెలుగు రాక పోతే నిజం కూడా చెప్పలేంగా.

- ముళ్లపూడి, బుడుగు

తెలుగులో నూటికి తొంభై తొమ్మిది అనుకరణం.

- భమిడిపాటి, తెలుగు వ్యాకరణం

తెలుగులో తలకట్లు ప్రత్యేకించి పిలకలు అయి పోయినాయి. అందుకని అక్షరాలా తెలుగు వ్యక్తులు కచటతపలు!

- భమిడిపాటి, కచటతపలు

దేశభాషలందు తెలుఁగు లెస్స

- శ్రీకృష్ణదేవరాయలు, ఆముక్తమాల్యద

తెనుఁగునఁ జేసిన కబ్బము
లినుపనగ లటందు రీసున...

- హనుమయ్యచౌదరి, శుద్ధాంధ్ర నిర్వచన సత్యా వివాహము

తెలుగులో ప్రార్థనేమిటి నీ మొహం? దేవుడికి తెలుగురాదు.

- భమిడిపాటి, వేషం తగాదా

తెలుగులో సొంతాన రాసి బతకగల వాళ్ళున్నట్లు కనబడదు.

- కొడవటిగంటి, అనామిక

తెలుగులో మేల్కొలుపు పాడితే, మెళుకువ వస్తుందా నీకు?

- కుందుర్తి, నువ్వెంత? నీ సృష్టెంత?

తెలుగువాళ్ళందరినీ భర్జించేది తెలుగుతో నిమిత్తం లేనిదే.

- భమిడిపాటి, తుక్కుముక్కల హక్కుచిక్కు

**తెలుగుదనం**

తెలుగుదేశంలో కవీ, కళాకారులూ బ్రతికున్నాళ్లు చస్తారు. చచ్చాక మాదయ ఉంటే బతుకుతారు. అదీ మా తెలుగు ఆచారం.

- రాధాకృష్ణ, కీర్తిశేషులు

అన్నయ్య ఎన్నడు తెలుగు మాట్లాడినా తగనిచేదుగా ఉంటుంది నాకు.

- రామకృష్ణ, లాలి

ఈ పదేళ్ల మధ్య మన యూనివర్శిటీలు మూడు కనీసం ఏభయిమంది తెలుగు డాక్టర్లని తయారు చేశాయి. కాని మన భాషలో విమర్శ సాహిత్యం ఇంచుమించు లేనేలేదు.

- మహీధర, స్వయంవరణం

తెలుగుపిల్ల కేమిటి, అంత తెలివితేటలూ చారవానా?

- రామకృష్ణశాస్త్రి, హంసధ్వని

తెలుగు రానివాళ్ళు తెలుగు పుస్తకం ఎలాగూ చదవరు. ఇంగ్లీషు చదివిన తెలుగువాళ్ళు తెలుగు పుస్తకం కేసి చూడనైనా చూడరు. అందుకే తెలుగు రచయిత యీనాడు అరకప్పు కాఫీకి దిక్కులేక అలమటిస్తున్నాడు.

- సూర్యారావు, నీలితెరలు

**తెలుగువాడు**

చరిత్రాత్మకములైన చచ్చు ప్రశ్నలు లక్షా తొంభై తెలుగువాణ్ని కనుక పరాఖత్‌గా నాకు నేను వేసుకోగలను. ఎందుచేతనా, వాటికి జవాబు చెప్పుకునే బాధ్యత నాకూ, నా జాతికీ, వేదకాలం నుంచీ లేదు!

- రామకృష్ణ, అర్ధనారి

'శూన్యం' అనగా లేనిదానియందుండే మక్కువ ఆంధ్రుడికి 'ఒకటి' అనగా ఉన్నదానియందు లేదు. అనగా అతడు అనంతవాది.

- భమిడిపాటి, అవును

మనం తెలుగువాళ్ళం. ఏమీ చాతగానివాళ్ళం.

- కొడవటిగంటి, అనామిక

గొప్ప తెలుగువాళ్ళు తెలుగు వచ్చినా వాడరు. తెలుగు వాడకుండా ఉంటేగాని తెలుగువాళ్ల చేత గొప్పవాళ్ళనిపించుకోలేరు.

- భమిడిపాటి, తెలుగు...

గర్వించవేలరా తెలుగోడా!
గత కీర్తి తలబరువు గలవాడా!

- మల్లారెడ్డి, ఆంధ్రప్రబోధము

**తేడా**

ఉన్నది వండుకు తినటానికి లేనిది తెచ్చుకోటానికి చాలా తేడా వుంది.

- ఇనాక్, మీకో నమస్కారం

వీరుడి చేతా కత్తి ఉంది; భజంత్రీవాడి చేతా కత్తి ఉంది; కాని ఆ చేతికీ యీ చేతికీ ఎంత తేడా? అలాగా, మనిషికీ మనిషికీ, మనసుకీ మనసుకీ;

- రామకృష్ణ, కృష్ణాతీరం

స్వగ్రామంలో కన్న పరాయి గ్రామంలో ముష్టెత్తుకున్న దానికి తేడా వుందిలేరా.

- మా గోఖలే, మార్పు కథలు

మనఁ వనుకుంటాంగాని యేకాలంలోనైనా ఏ లెవెల్లోనైనా బిగ్గూ, స్మాలూ తేడాలు వుండనే వుంటాయి.

- కాళీపట్నం, వీరుడు - మహావీరుడు

సరసుడికీ సన్యాసికీ తేడా వుండదు.

- మహీధర, కత్తుల వంతెన

ఆడది చేతికి చిక్కినదల్లా విలువయిన దనుకుంటుంది. మగవాడు చేతికి చిక్కనిదల్లా విలువయినదని వాపోతాడు.

- మారుతీరావు, మళ్ళీ మధుమాసం

ఆరం కోసం పులి అడివంత తిరగాల. తిరిగితే

గాని దానికి ఆరం దొక్కదు. గానైతె, ఆరం కోసం పీటరు కాలు కదపడు. కుర్చి దిగడు. గాని ఆరం అణ్ణీ ఎతుక్కుంటూ ఆడి ఆపీసుకే ఒస్తి అద్దీ పులికీ పీటర్‌కీ తేడ. మేం పోలీ సోళ్ళం. పులుల్లా టోళ్ళం. ఆరం కోసం మేం ఎతుక్కోవాల పీటరీసుకం మాకు దొక్కదు

- రావిశాస్త్రి, బంగారిగాడికత

**తేనెటీగ**

తియ్యటి తేనె నిండిన నోటితోనే తేనెటీగ కుట్టేది.

- సామెత

**తేలనిది**

పక్షుల్లో అయితే గుడ్డు పగిలిన తరువాత కోయి లేదో కాకేదో తేలిపోతుంది. కాని మనిషి పిల్లడు ఏ మనిషికి పుట్టేడో ఎలా చెప్పడం?

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

**తేలిక**

సిగిరెట్టు మానేయటం చాలా తేలిక లేవోయ్. నేను లక్షసార్లు మానేశాను.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

పెళ్ళి కాని ఆడపిల్లలంటే లోకానికి తేలిక.

- సరస్వతీదేవి, పరకాంత

బాధ ఎవరితోనయినా చెప్పుకుంటే మనసు తేలిక పడుతుంది.

- సరస్వతీదేవి, సాంధ్యకిరణాలు

అనుకున్న పని జరిగితేగాని కొందరికి మనసు తేలికగా ఉండదు.

- సరస్వతీదేవి, సాంధ్యకిరణాలు

అన్నిటికన్నా తేలికయిన పని వాగ్దానాలు గుప్పించటం.. అంతకన్నా తేలికయిన పని, అధికారంలోకి రాగానే వాటిని గాల్లోకి తేలె య్యటం.

- సావిత్రి, ఒడిలో చెలిమోహనరాగం

కవిత తనంతదా గిలికి పంపిన చుల్కనగాదె యేరికిన్?

- శ్రీరమణ, న్యూనుడి

**తొందర**

తొందర పురోభివృద్ధికి శత్రువు.

- బీనాదేవి, తీర్పు

ఏరువాక రానేరాదు, ఎన్నికలు మాత్రం ముమ్మారు.

- శ్రీరమణ, న్యూనుడి

నిలువఁ దీఱదు, పోయిరావలయు మాకు.

- తిక్కన, ఉద్యోగపర్వము

కార్లున్న బాబులికి తొందరెక్కడుంటుంది.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

ఈ పురుషలోకానికున్న వెఱ్ఱి వర్ణించలేం. ఎంత తొందరపడతారో అంత జారిపడతారుకూడా.

- వేదాంతకవి, ఆకలిమంట

చేయఁదగినదైనఁ జేసెడి కార్యంబు
వేగపడి యొనర్ప విషమమౌను
బుడమకాయ చేదు ముదిసిన తీపయ్యు

- వేమన

తొందరపాటు మాత్రము నిశ్చయముగాఁ గార్య వైఫల్యహేతువు.

- విశ్వనాథ, చెలియలికట్ట

అతిరయంబున నొకకార్య. మాచరించు
నతని యవివేక మఖిలాపదాస్పదంబు.

- కదిరీపతి, శుకసప్తతి

తొందరపాటులో మనిషి క్షుణ్ణంగా తెలిసిన ప్రాథమిక సూత్రాలనే మర్చిపోతాడు.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

**తోకచుక్క**

టెలిగ్రాం, వుత్తరంకంటే ముందు చేరటం తోకచుక్క రాలటంలాంటిది.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

**తోచటం**

(నేను) సారస్వత ప్రియుణ్ణి - నాకు తోచందే చదవను - చదవందే తోచదు.

- రామదాసు, ఆకాశరామన్న

**తోడు**

డబ్బు, వయస్సు, అధికారం మనిషి పతనమవ డానికి మరింత తోడ్పడతాయి.

- సూర్యారావు, ఎవరో పిలిచారు

పాల నిమిత్తం రాయి మొయ్యాలి.

- చిలకమర్తి, కాండూరి జానకిరామయ్యగారి పెండ్లి

మనిషికి మనిషికి తోడు. సదాశయానికి సదా శయం తోడు.

- ఆదివిష్ణు, ఎంతెంతదూరం

ఇడ్లీకి చెట్నీలాగ బంగారానికి బట్టలు తోడు.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

మంచి గుణానికి తోడునీడగా, కాంప్లిమెంటరీగా

ఒక దుర్గుణం వుండనే వుంటుంది దయకి అపాత్రదానం, సత్యానికి క్రూరత్వం, ధర్మానికి మూర్ఖత్వం.

- చలం, మ్యూజింగ్స్

### త్యాగం

త్యాగానికి పార్టీ భేదాలూ, పద్ధతి భేదాలూ తెస్తు న్నారు కొన్ని రకాల త్యాగాలకి అయిదెకరాల విలువ కల్పించారు.

- మహీధర, కత్తులవంతెన

సర్వము విడిచిపెట్టిన గాంధీకి స్వరాజ్యము కొఱ కంత ప్రాకులాట యెందుకురా?

- కాళ్ళకూరి, వరవిక్రయము

ఎప్పుడూ త్యాగమైనా, దానమైనా అతి అయితే, ఎదుటివారిలో నిర్బాధ్యతనూ, బద్ధకాన్నీ పెంచు తాయి.

- నిర్మలప్రభావతి, పాముకాటు

మోతాదు మించిన త్యాగం వెర్రితనం కిందికి వస్తుంది

- నిర్మలప్రభావతి, పాముకాటు

తాతలనాటి క్షేత్రములెల్ల తెగనమ్మి
దోసిళ్లతోఁ దెచ్చి పోసినాను.

- కాళ్ళకూరి, చింతామణి

తెలియని త్యాగం వృథా. తెలిసిన త్యాగం మని షికి తోడివాళ్లలో పరపతిని తీసుకవస్తుంది.

- కాంతారావు, అభ్యుదయం

త్యాగానికి విలువ కట్టలేం.

- సుంకర, గెరిల్లా

పురపాలక సంఘము వారి వీధిదీప మేమి బోధించుచున్నది? తా నంతస్తాపముచే దహిం పఁబడిన సరియే. పరునకు మేలొనర్పు మను స్వార్థపరిత్యాగమహాపాఠమును బోధించుట లేదా? కన్ను లున్నవానికి, మన సున్నవానికి రాతిలో నీతి యున్నది. మట్టిలో మతమున్నది.

- పానుగంటి, సాక్షి

జన్మనిచ్చిన పెద్దవాళ్ల ఆశలు తీర్చటంలో ఉన్న త్యాగం, స్వార్థంతో వాళ్లకి అన్యాయం చేయ టంలో ఉండదు!...

- రామచంద్రమూర్తి, శ్రీరాగం

స్వంతలాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్!

- గురజాడ, దేశభక్తి

లేనివాడిచ్చిందే త్యాగం.

- బుచ్చిబాబు, మధురతరంగం

త్యాగాలు విశ్వమానవజాతి
సంరక్షిత భవిష్యత్తుకోసం
పంటపొలాలకు తెచ్చే
నెత్తురు కాల్వలు.

- ఎక్స్‌రే, చావు ఓటమికాదు

### త్యాజ్యం

అదుపుకురాని ఆలిని, అందిరాని చెప్పును విడ వమన్నారు.

- సామెత

### త్రికాలాలు

రేపన్నది బూచికాదు
అనురాగార్థమైన అతిథి
మాపన్నది పాచి కాదు
మాగిన స్మృతుల మధుర తిథి,
నేడన్నది చల్లనిపాట పిల్లల ఆట
కోటి పూవుల కోటి తావుల కులికే తోట
నేడన్నది వెలుగుబాట.

- బైరాగి, వాగ్దత్త వసుంధర

గతం గాయం, వర్తమాన మపాయం
భవిష్యత్తు హేయం...

- సుప్రసన్న, మూడు గీతాలు

## థ

### థ్రిల్

ఎడ్వంచర్ చేయందే జీవితంలో 'థ్రిల్' లేదు.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

## ద

### దక్కుదల

మొలలోతు దుఃఖంలో మోకాలిలోతు సంతోషం.

-సుబ్రహ్మణ్యశాస్త్రి, అనుభవాలూ-జ్ఞాపకాలూనూ

యిన్నాళ్ళకి మిడతంభొట్లు చేతిలో చిక్కాడు.

- గురజాడ, కన్యాశుల్కం

వ్రతంచెడ్డా ఫలము దక్కాలి.

- చిలకమర్తి, శవదహనము

ఉగాది కవికి వరుమానం- వేపపూత ప్రసాదం.
- శ్రీరమణ. న్యూనుడి

దక్షిణాయణం

ఉత్తరాది అంటే సిఫారసు ఉత్తరాలు వగైరా. దక్షిణాది అంటే దానాదికం వగైరా.
- భమిడిపాటి. మేస్టరీకూడా ఒక ఉద్యోగమేనా?

దగా

నీలాంటి ఆషాడభూతుల వల్ల నీ గురువుగారు యెంత సులభంగా దగాపడతారూ!
- గురజాడ. కన్యాశుల్కం

దండ

దండ లొద్దులెండి. అందరూ వరుసగా నాకాళ్లకి దండం పెట్టండి. దీవిస్తాను.
- పతంజలి. అప్పన్నసర్దార్

ఎవడికి బలంవుంటే వాడే ముఖ్యమంత్రి అవుతాడు... వాడికి రెండోవాడు దండవేస్తాడు... అదీ న్యాయమైన రాజకీయం అంటే.
- పతంజలి. అప్పన్నసర్దార్

ఒకడు నాకు దండేసేదేమిటి? నేనే వేసుకోగలను.
- పతంజలి. అప్పన్నసర్దార్

దండగ

నోటీసు ఎవరూ చదవరండి బాబూ. కాగితం దండగ.
- యజ్ఞన్నశాస్త్రి. రిహార్సలు

కాసు గొడ్డుకు రూక బందె.
- శివరామకృష్ణశాస్త్రి. నమశ్శివాయ

దండ్యుఁడు

అనఘచరిత! భృత్యుఁ డపరాధియైనఁ దత్ స్వామి దండ్యుఁ డనుట శాస్త్రమతము.
- అనంతుడు. భోజరాజీయము

దండోపాయం

విద్యాధికుల విషయంలో చేసే సంస్కారాల కయితే దండోపాయ సహాయంతో పని ఉండదు గాని తదితరులను సంస్కరించవలసి వస్తే కేవలం నీతివాక్యోపన్యాసాలు పనిచేయవని వ్రాయనక్కఱలేదు.
- వెల్చపిల్ల. కథలు-గాథలు

దత్తత

సాధారణంగా దత్తతంటే తగాదా దత్తమే. తగాదా లేని పెంపకమే లేదు
- ఉన్నవ. మాలపల్లి

దబాయింపు

నా పేరు తాతయ్య పేరు తెల్సా? బొమ్మ నాకు పెళ్లాం అవుతుంది.
- తులసి. బొమ్మరూపాయి

దంపతులు

ప్రేమాస్పదులైన దంపతుల సంభాషణముల కంతముండదు గదా!
- చిలకమర్తి. సుధాశరచ్చంద్రము

దయ

ఇన్ని యాచారములలోన నెక్కుడండ్రు
సకల భూతంబులందును సదయుఁ డగుట.
- తిక్కన. అనుశాసనిక పర్వము

ఎంత చేసినా కొందరికి 'సాఫ్ట్ కార్నర్' ఏర్పడదు.
- చిరంజీవి. బోలో స్వతంత్రభారత్‌కీ జై

సమాజపు బజారులో దయాధాన్యం దొరకదు.
- గోపి. కన్నీళ్లు మినహా

దయాభిక్ష

ఆజియె కాక యొక్కని దయం గను రాజ్యసుఖంబు లేటికిన్?
- తిక్కన. శల్యపర్వము

దయ్యం

సంసారసుఖం దొరకని స్త్రీలకూ, సంసారం గొడవలు జాస్తి అయిన ఆడవారికి దయ్యాలు పూనతాయి.
- సుధాకరరెడ్డి. దైవ మహాత్యాలు

మనిషిలాగే దెయ్యమూ తయారయితే ఎలా పట్టుకునేది?
- యజ్ఞన్నశాస్త్రి. కాలక్షేపానికి

ఏండ్లు గడిస్తే దయ్యం దేవుడౌతా డీలోకంలో.
- జంగయ్య. జాతర

...తనకుఁ గానని దయ్యం
బెదిరికి వరమిచ్చు ననుట
చదురే...
- నాచనసోమన. ఉత్తరహరివంశము

దయ్యములు లేవు. మన బుద్ధులే దయ్యములు. ఈ దయ్యములు విద్యచే, సత్యవాదనముచే, దైవభక్తిచే, జ్ఞానముచే వదలవలసినవే కాని మంత్రించిన మినుపగింజలచేఁగాని, చీపురు కట్టలచేఁగాని, ప్రాతచెప్పులచేఁగాని వద

లునవి కావు. పిశాచములు, బ్రహ్మరాక్షసులు లోకముననే యున్నారు.

- పానుగంటి, సాక్షి

ఎక్కడను దయ్యములను మేము చూచితిమని చెప్పువారేకాని, చూడ వేడుకగలవారి కెల్లఁ జూపెద మనువారు వెదకిన నొక్కచోటనైనఁ గానరారు.

- కందుకూరి, దయ్యములు

చచ్చినవాళ్ళు దయ్యాలై పట్టుకుంటారుగాని, పుట్ట బోయేవాళ్ళు పట్టుకోరు.

- కొడవటిగంటి, ఐశ్వర్యం

ప్రజల్ని పీక్కుతినడానికి మాకు మంత్రి పద వులు అవసరంలేదు. ఏ పదవీ, ఏ పార్టీ, ఏ వ్యాపారం లేకుండానే మేం ప్రజలను పీక్కుతిన గలం...

- పతంజలి, అప్పన్నసర్దార్

దయ్యాలు డ్యూటీచెయ్యక్కర్లేదు. మంత్రుల్నీ, వాళ్ళ తాబేదారుల్నీ తోటి డాక్టర్లనీ చూసి జడు సుకో నక్కరలేదు. హాయిగా దర్జాగా బతకొచ్చు. అదీగాక దయ్యాలు నడవక్కర్లేదు. కారుకోసం నానాయాతనా పడక్కర్లేదు. హాయిగా ఎగు రుతూ గాలిలో పల్టీలు కొట్టవచ్చు.

- పతంజలి, అప్పన్నసర్దార్

## దరిద్రం

ఏరుకొని తినేవానివెంట గీరుకొని తినేవాడు పడినట్లు.

- సామెత

నరుడి నెత్తిమీద రుద్దిన దరిద్రం
ఇది ఎపుడో కట్టతెగే సముద్రం
ప్రభువుల గద్దెలు కొంచెం భద్రం.

- కుందుర్తి, గోడమీది నీడలు

ధరణిలో దొంగతనములో దొరతనములో
భాగ్యవంతున కేదైన బాధలేదు
పెన్నిధి యదృష్టమని నిజుపేదవాని
కబ్బినను దొంగసొమ్మంట కబ్బురంబె?

- బలిజేపల్లి, సత్యహరిశ్చంద్రీయము

వేదాంతం కన్నా, ధైర్యంకన్నా, తెలివితేటలకన్నా, సివిరికి భక్తికన్నా దరిద్రం గొప్పదండి.

- రాధాకృష్ణ, దంతవేదాంతం

దరిద్రం అనుభవించడంలో బాధవుంది, ఒప్పు కుంటాను. కానీ దాన్ని దాచాలని చేసే ప్రయత్నం వుందే - అది ఇంకా బాధాకరమైనది. హేయమైనది.

- జయరాం, ఓడిపోలేదు

దారిద్ర్యం కళకు మెరుగుపెడుతుంది కళను నాశనంచేసే శక్తి దానికి లేదు.

- సూర్యారావు, నీలితెరలు

దారిద్ర్యం కూడా విద్య నేర్చుకున్నట్టు నేర్చుకో వాలి. అదొక బాధ్యత. ఒకరకంగా కనిపిం చాలి. ఒకవిధంగా మాట్లాడాలి.

- కొడవటిగంటి, ఆర్థికోపన్యాసాలు

మంచితనం మీదా, సంస్కారంమీదా అభి మానం ఉన్నవాళ్ళు దారిద్ర్యంపట్ల ఉపేక్ష వహిస్తే దారిద్ర్యం మంచితనాన్నీ సంస్కారాన్నీ నాశనం చేసితీరుతుంది.

- కొడవటిగంటి, తిండిదొంగ

భగవత్సాన్నిధ్యం పొందడానికి దారిద్ర్యమే దగ్గరి త్రోవ.

- ఉన్నవ, మాలపల్లి

దరిద్రం అంటే డబ్బు లేకపోవటం కాదు, బుద్ధి లేకపోవటం.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, మార్గదర్శి

దరిద్రం స్నేహితులను పోగొట్టుతుంది. దరిద్రం పోయినమీదట వచ్చే ఐశ్వర్యం ఆ పోయిన స్నేహితులందరినీ శత్రువులుగా మారుస్తుంది.

- కొడవటిగంటి, సద్యోగం

దారిద్ర్యం వ్యక్తికి సంబంధించినది కాదు, సంఘానికి సంబంధించినది.

- కొడవటిగంటి, స్వార్థబుద్ధి

సంపదను సృష్టించేవారి దారిద్ర్యం మీదనే సంఘ జీవితమంతా ఆధారపడి ఉండగా ఆ దారిద్ర్యాన్ని తొలగించటం కన్నా సంఘానికి విపత్కరం మరొకటి ఉండదు.

- కొడవటిగంటి, దేవుడిచ్చిన వరం

## దర్జా

అప్పు లెక్కువైనప్పుడు జోడుగుఱ్ఱాలబండి యుండవలెను.

- చిలకమర్తి, దివాలదేవి వ్రతకల్పము

వ్యాపారము క్షీణించిన కొలఁది గుమస్తాల డాబు హెచ్చుగా నుండవలెను.

- చిలకమర్తి, దివాలదేవి వ్రతకల్పము

బిచ్చానికి పోయినా బిగువు తప్పలేదు, దుప్పటి పోయినా వల్లెవాటు తప్పలేదు.

- సామెత

దర్పం

గవర్నమెంటు హాస్పిటల్‌లోని ఆయాలు మామూలు పనివాళ్ళలాగా దీనంగా వుండరు. వాళ్ళే అందరికీ యజమానులైనంత దర్పంగా వుంటారు.

- ఆనందారామం, అద్దంలో శత్రువు

దాణా

గుర్రం గుడ్డిదైనా దాణాలో తక్కువ వుండదు.

- సామెత

దానధర్మాలు

ప్రజల్లో ఏదైనా చైతన్యం మిగుల్తే దాన్ని ధ్వంసం చేయడానికి దానధర్మాలు బాగా పనికి వస్తాయి.

- రంగాచార్య, జనపదం

దాపరికం

చల్లకువచ్చి ముంత దాచనేల?

- సామెత

గురువిందగింజ తన కిందనున్న నలుపెరగదు.

- సామెత

వంచనము, పరాభవము మున్నగునవి ప్రకాశిం పఁజేయఁ దగదందురు.

- వేంకటలక్ష్మీనరసింహారావు, అనార్కలి

ఏదీ ముఖంలో దాచుకో లేనివాళ్లకి మనస్సులో ఏం దాచుకున్నా ప్రమాదమే.

- విమలారామం, కిరణ్మయి

తెలిసి దాచినా తెలియక దాచినా కొన్ని విష యాలు దాస్తేనే మంచిది. కొన్ని రహస్యాలు గుప్పెట్లో వుండటమే క్షేమకరం. ఏదన్నా లాభి స్తుంది అన్నప్పుడే బజారున పడాలి. బజారుకి ఎక్కడం ఐదు నిముషాలు కూడా పట్టదు.

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

మంత్రసానిముందు మర్మం దాచినట్లు.

- సామెత

విప్పుకోని మొగ్గల్లో ఏవేవో అందాలు దాగున్నట్టు, మూసుకున్న కళ్లల్లో ఏవేవో తీరని కోరికలు.

- జంగయ్య, జాతర

సరసుణ్ణి దాచిందోయ్ మంచం కింద!

- గురజాడ, కన్యాశుల్కం

దేశంలో తిండెందుకు లేదండీ? దొంగలు దోచే స్తున్నారు గాని.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

మచ్చలు మఱిన్ని అయినా, మంగళ వాద్యాలకు తక్కువ ఉండకూడదు.

- సుకాంచన, చీకటి రాజ్యం

అనుమానపు మొగుడు ఆలిని వీపుకు కట్టు కుంటే, పెండ్లాం మిండగాణ్ణి కొప్పులో బెట్టుకు న్నది.

- సామెత

దాంపత్యం

మనుషుల్లోలేని ఏకాగ్రనిష్ఠ దాంపత్యం పావురా లది. మగపావురం చనిపోతే ఆడపావురం దిగు లుతో క్రుంగి కృశించి చనిపోతుంది. కానీ మగ పావురం అలా కాదు. మళ్ళీ మర్చిపోవటం జరుగుతుంది. మళ్లీ జంటకోసం చూస్తుంది. అదయినా ఎప్పుడు? తనతోడు మరణించిన తరవాతనే. కాని మనిషి అలాకాదు.

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

దాయాది

దాయాది ఉంటే నిప్పెందుకు?

- సామెత

బావమరిది బ్రతుక గోరును, దాయాది చావ గోరును.

- సామెత

దారి

నాదారి ఏదని
ఏ మనిషి నడిగినా
తన దారినే వాడు చూపిస్తాడు.

- ఇరివెంటి, దారి ఏదని...!

హెచ్చుతగ్గులు లోతుపాతులు
గోతులెన్నో దారి చూపెను.

- పైడిరాజు, మచ్చ

ఊరిముందర చేరినా!
ఊరిలోనికి దోవలెట్లా!
అత్తమామల కన్నుబోతే
యెట్లబోయిన చింతలేదూ!

- జానపదగేయం

పల్లెవిడిచి పట్నమేగు
బ్రతుకు బాటసారులార!
ఆశాదీపాలు వెలుగు
అంతులేని పుంత అది.

- ప్రయాగ, బాటసారి

అయ్యా కోనేటికి తోవయిదే.

- గురజాడ, కన్యాశుల్కం

నిజానికి ఒకేదారి. కానీ, అబద్ధానికి ఎన్ని దార్లున్నా ఉన్నయ్.

- ధనికొండ, పవిత్రులు

కష్టపడాలనేముంది! సంపాదించడానికి అనేకదారులు.

- సుంకర, పిచ్చివాడు

**దారి తప్పటం**

నిజానికి దారి తప్పి నడిచేది ఎవరైనా కానీ, కొన్నాళ్లకి దారి తెలుసుకుంటారు. మనిషి చేసిన తప్పులు తెలుసుకోకుండానే ఎప్పుడూ జీవితం మునిగిపోదు.

- రంగనాయకమ్మ, పేకమేడలు

**దాసి**

భర్తను వశపఱచుకొనలేనిది దొరసానియైనను దాసియే.

- పానుగంటి, ముద్రిక

**దాస్యం**

మనుషులతో చేసే ప్రేమలో దాస్యం ఉంది. సంసారంలో బంధనాలు, ప్రేమలో బంధనాలు. అసలు పుట్టటమే సృష్టికి దాస్యం. వీటికి దూరంగా ఉంటే మంచిది.

- బుచ్చిబాబు, నన్నుగురించి కథవ్రాయవూ?

దాస్యంలో ఉన్నవాడెప్పుడూ దేనికీ సాహసించలేడు.

- ఉన్నవ, మాలపల్లి

దాస్యం ప్రతి ఆత్మలో పెరిగే కలుపు మొక్క.

- సామెత

**దాహం**

అధికార దాహం అన్ని దాహాల్లోనూ దారుణమయినది.

- ఆనందారామం, ఇదా భారతం?

**దిక్కు**

బ్రతికియున్నవారికి దిక్కుండును కాని పీనుఁగులకు దిక్కెక్కడుండును? కాబట్టి శవములన్నియు ననాథ ప్రేతలే. వారికి మోసెడువారే దిక్కు.

- చిలకమర్తి, గణపతి

ఇల్లొక సర్పమై తినిన, నిష్ఠుఁడు
వైరికి సత్తు విచ్చినన్,
దల్లి విషంబు పెట్టినను, దండ్రి
తనూజుల నమ్మినన్, మహీ
వల్లభుఁ డొల్లకున్న మఱి వారల
కెవ్వరు దిక్కు భూవరా!

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

దిక్కులు ఊహాజనితాలు
దిక్కులు లేవు.

- మోహనప్రసాద్, అనుభూతి

**దిగంబరత్వం**

మనస్సు ఎంతో పరిపక్వమైతే కాని దిగంబరత్వాన్ని సాధించలేరు.

- మునిమాణిక్యం, మా పిల్లలు

**దిగులు**

మనదిగులు కసలు అర్థంలేదు
జీవితాన్ని వ్యర్థం చేయడంతప్ప.

- కాళోజీ, దిగులు

దిగులుతో బ్రతుకు బ్రతుకేకాదు
భ్రాంతిలో ఎరుక ఎరుకే కాదు.

- కాళోజీ, దిగులు

నిజం చెప్పాలంటే ప్రభుత్వానికి ఉద్యోగి గురించి కన్న అతని కుటుంబం గురించే దిగులెక్కువ.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

**దినదిన గండం**

కల్లా కపటం లేకుండా మాట్లాడేవాళ్ళు ఆఫీసులలో పనికిరారమ్మా. అటువంటి వాళ్ల బ్రతుకు దినదిన గండంతో గడుస్తూ వుంటుంది.

- సూర్యారావు, శ్రీమతులు-శ్రీయుతులు

**దివాన్ గిరి**

పూజా నమస్కారాల్లేక బూజెక్కున్నాను గాని మన కంట్రీయే ఇండిపెండెంట్ అయితే గ్లాడ్స్టన్ లాగ దివాన్‌గిరి చలాయిస్తును.

- గురజాడ, కన్యాశుల్కం

**దివాలా**

వర్తకుడు దివాలా తీస్తే భగవద్భక్తి కలిగి అతనికి వుపకారం కలుగుతుంది.

- కందుకూరి, మహావంచక ప్రహసనం

**దిష్టి (మంత్రం)**

దిష్టిమంత్రమంటే గ్రామస్థుల దృష్టిలో "తారక మంత్రం" లాంటిది.

- లక్ష్మణరావు, కన్నీటి కలువ

దీనత్వం

కఠిన హృదయులూ, స్వార్థపరులూ ఎదుటి వ్యక్తి హృదయాన్ని - అందులోనూ అతి కోమలమైన స్త్రీ హృదయాన్ని - దీనత్వంతో ఇట్టే భేదించగలరు!

- ధనికొండ, పవిత్రులు

దీపం

దీపం ఎంతో వెలుగును విరజిమ్మినా, తన చుట్టూ మాత్రం చీకటిని తొలగించుకో లేదుగా!

- రామదాసు, వంచనాశిల్పం

చెంత దీపమిడక చీకటి పోవునా?

- సామెత

దీపం పేరు చెబితే చీకటి పోతుందా?

- సామెత

ఊరికి దీపం బడి
మనిషికి దీపం నడవడి.

- ఇరివెంటి, ఆకాంక్ష

చీకటి మనసులతో చేసిన పాపాలను గురించి ఆర్పేసిన దీపం వాఙ్మూలం ఇస్తుంది.

- చంద్రమౌళి, సమతాదీపాలు

చందమామ లేని రేల
సరసాలే ఒక దీపం.

- నారాయణాచార్యులు, నాగి

దీపావళి

దీపావళి అనగా దీపముల 'బారు'.

- శ్రీరమణ, న్యూసుడి

అందరూ గారిగా ప్రైవేట్లు చెప్పేసుకుంటే దీపావళి అంటారుట.

- ముళ్లపూడి, బుడుగు

దీర్ఘవైరం

వలవ దధిక దీర్ఘ వైర వృత్తి.

- తిక్కన, ఉద్యోగపర్వము

దీవెన

తద్దినానికి భోజనానికి పిలిస్తే రోజూ మీ ఇంట ఇట్లాగే జరగాలని దీవించాడట.

- సామెత

ఈవి యిడకయున్న దీవెనపద్యమే
ప్రభువుగారి యిల్లు పాడుసేయు
నౌషధంబు పథ్య మలవడకుండిన
మృత్యు వగుచు రోగి మ్రింగుకరణి

- చాటువు

చిన్నాపార్టీకి శ్రీరామరక్ష

- శ్రీరమణ, న్యూసుడి

దుఃఖం

ప్రేమా, అభిమానం ఎక్కువైతే దుఃఖం పొర్లుకు వస్తుందే!

- తులసి, యాత్ర

వగ బలము తఱుగు, రూపఱు.
వగచిన మతి తప్పుఁ, దెవులు వచ్చును, దూఱన్
వగచి నలంగినఁ బ్రియమగుఁ
బగతురకును, వగచు టుడుగు పార్థివముఖ్యా!

- తిక్కన, ఉద్యోగపర్వము

ఈర్ష్యాళువు, జగుప్సావంతుడు, నిస్సంతోషి, క్రోధనుఁడు, నిత్యశంకితుడు, పరభాగ్యోపజీవియు ననువా రాఱుగురు దుఃఖభాగులని నీతి కోవిదులు చెప్పుదురు.

- చిన్నయసూరి, మిత్రలాభము

చాప్లిన్ చిత్రాలను చూస్తూ ప్రపంచమంతా తెగ నవ్వింది. నాలాంటి కొందరు మాత్రం ఆ నవ్వు వెనక ఉన్న మహత్తరమానవ దుఃఖాన్ని పసిగట్టి కంటతడి పెట్టుకుంటారు.

- అనంతం, సినీమా సరదాలు

స్వయంకృతాపరాధముల చేతను, సాహసముల చేతను మన దుఃఖములను మనమే తెచ్చిపెట్టుకొందుముగాని లోకమునకు దుఃఖము తెచ్చి పెట్టజాలము.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

తనకోస మేడిస్తే దుఃఖం, లోకంకోసం ఏడిస్తే కవిత్వం.

- కృష్ణరావు, పాపికొండలు

రాతికినేనిఁ దప్పదు భరమ్మగు దుఃఖము చేతమున్నచో.

- తి.వేం., పాండవాశ్వమేధము

మహి ననాగత కార్యంబు మదిఁ దలంచి
కోరునాతఁడు దుఃఖసంకులత నొందు.

- దూబగుంట, పంచతంత్రము

చచ్చిననాటి దుఃఖం మరునాడు ఉంటుందా?

- సామెత

పుచ్చుకున్నప్పుడు పుత్రుడు పుట్టినంత సంతోషం.
ఇచ్చేటప్పుడు ఇంటాయన పోయినంత దుఃఖం.

- సామెత

**దుఃఖితుడు**

పెక్కు జనముల సంతోషపెట్ట దలఁచు
వాఁ డొకనినైన సంతోషపఱపలేక
తుదకు వ్యర్థప్రయత్నుఁడై దుఃఖభాజ
నుఁడగు...

- త్రిపురనేని, శంబుకవధ

**దున్నకం**

మడి దున్ని మహారాజయిన వాడూ చేను దున్ని చెడ్డవాడూ లేడు.

- సామెత

**దున్నపోతు**

ఇంటికిఁబోయి "బావా! దున్నపోతింటికి వచ్చిన దటోయి'యని యడిగితిని. "నీవు వచ్చితివి కదా? సంతోషమే" యని యతఁడు నన్ను పరిహసించెను.

- పానుగంటి, సాక్షి

**దుబారా**

తూమెడు వడ్లు తూర్పారపెట్టేటప్పటికి, ఏదుము వడ్లు యెలుకలు తిన్నవి.

- సామెత

**దురద**

కాగితానికి లేని దురద కలానికా?

- శ్రీరమణ, న్యూనుడి

కందకు లేని దురద, పెండలానికెందుకన్నట్లు.

- సామెత

**దురదృష్టం**

దురదృష్టం పదను వాదరగల కత్తి వంటిది. పిడిని పట్టుకొనిన ఉపయోగపడును. వాదరను పట్టుకొనిన తెగును.

- సామెత

దురదృష్టము ననుభవించ లేనివాడు అదృష్టమును అనుభవించలేడు.

- సామెత

గ్రహచారం బాగాలేకపోతే, గుర్రం గాడిదై కూసినట్లు.

- సామెత

కాని కాలానికి కర్రే పామవుతుంది.

- సామెత

కామెంట్రీ వింటుంటే కరెంటు పోయినట్టు.

- శ్రీరమణ, న్యూనుడి

వడియాలు పెట్టినరోజే వడగళ్లవాన.

- శ్రీరమణ, న్యూనుడి

మూలిగే నక్కమీద తాటికాయ పడ్డట్లు.

- సామెత

**దురాగతం**

పోనీలే అని ఫోనిస్తే డైరెక్టరీ చూసి డయల్ చెయ్యమన్నాట్ట!

- శ్రీరమణ, న్యూనుడి

**దురాశ**

మరో ఆటకు జనంలేరు మొర్రో అంటే శతదినోత్సవానికి షామియానాలు వేయించమన్నట్లు.

- శ్రీరమణ, న్యూనుడి

సోలెఁడు బియ్యానికి సోదెకెడితే కుంచెఁడు బియ్యం కుక్క ముట్టుకుపోవటం.

- వెల్లపిల్ల, కథలు-గాథలు

ఉన్నంతలో జరుపుకోవలెనుగాని విస్తరించి పదార్థ సంగ్రహము చేయవలెనని పేరాసపడరాదు.

- చిన్నయసూరి, మిత్రలాభము

కలిపోసి పెట్టినను నుట్టివంకనే దృష్టియా!

- సామెత

**దుర్గతి**

ఆనందంలో చెట్లు ఆకులు రాలుస్తాయి. మోళ్లవుతాయి. ఆకులు రాల్చిన మానవుడు ఇంక చిగిర్చడు. ఎంత దుర్గతి.

- చలం, మ్యూజింగ్స్

అచ్చాఫీసు లటంచు, హూణుల కుపా
ధ్యాయత్వ మంచున్, మతిన్
వెచ్చం బిచ్చెడి బచ్చుటిండుల కడన్
వేదాంత మంచున్, మహో
ద్యచ్చారిత్రులు పండితుల్ మెలగఁగా
నయ్యెంగదా ఇస్సిరో!
చచ్చుంగాలము వచ్చె గౌరవము నా
శంబయ్యెఁ గామేశ్వరీ!

- తి.వేం., కామేశ్వరీ శతకము

**దుర్జనుడు**

దూరమం దుండియేనియు దుర్జనుండు
చేయఁదలఁచిన యపకృతి చేయఁగలడు.
ఒక్క యూరంటుకొనఁగ వేఱొక్క యూరు
దాని తుట్టెలు తగిలి దగ్ధంబు గాదె.

- చిలకమర్తి, చతురచంద్రహాసము

శాస్త్ర మాచార్య సన్నిధిఁ జదువఁడేని
నిద్ధ బోధంబు మది సంగ్రహింపఁడేనిఁ
దెగువ మీఱి ప్రతిజ్ఞ సాధింపఁడేని
జ్ఞాతి జయ మందఁడేని తజ్జనుఁడు జనుడె?

- శ్రీనాథుడు, కాశీఖండము

చెడుగునరుఁ డొరుసంపదఁ జెఱచుఁగాని
తనకు ఫలమేమి గలుగును? తథ్య మరయ
నింద మాత్రంబు వానికి నిల్చు జగతి.
- అడిదము, రామలింగేశ్వరశతకము

సర్పంబులకు విషంబుంబోలె ఖలులకు
దోషంబు సహజంబు.
- చిన్నయసూరి, మిత్రభేదము

### దుర్దశ

కరి దశ సహస్ర బలవి
స్ఫురితుఁడగు విచిత్రవీర్యపుత్రుఁ డొక తలో
దరి నూఁత గొనియె, విధియె
వ్వరి హీనులఁ జేయఁ డకట వక్రుం డైనన్.
- తిక్కన, ఆశ్రమవాసపర్వము

### దుర్దినం

కొన్ని సాయంకాలాలు శవం వెళ్ళని ఇల్లులా ఉంటాయి.
- రావిశాస్త్రి, బంగారిగాడి కత

### దుర్బలం

ఆగ్రహపడుట యెంత దుర్బలమో ఆగ్రహానికి భయపడడం అంతకన్నా దుర్బలం.
- చలం, శశాంక

### దుర్భరం

చెప్పులోని రాయి చెవిలోని జోరీఁగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోని పోరు నింతంత కాదయా
- వేమన

నడి మంత్రపుసిరి, నరం మీద పుండు భరింప రానివి.
- సామెత

### దుర్లభం

కారణాలు వెతికే మానవునికి సంతృప్తిగాని, సంతోషంగాని దుర్లభం.
- రాజమన్నారు, మనోరమ

ప్రియవచనములతోడి దానము, గర్వసహి
తముగాని జ్ఞానము, క్షమాసహితమైన
శౌర్యము, త్యాగయుక్త మయిన విత్త మనియెడు
నాలుగు లోకమందు దుర్లభములు.
- చిన్నయసూరి, మిత్రలాభము

### దుర్వార్త

కాని మాట జవము గల చక్రముల మీఁద
వడిగఁ బఱచు నాల్గు వంకలకును
పఱచుచున్న కొలఁది ప్రతిజనుఁ డాచక్ర
ముల కొకింత చమురు పోయుచుండు.
- కాళ్ళకూరి, చింతామణి

### దుర్వాసన

దుర్వాసనను వ్యాపింప జేసేందుకు ఎక్కువ కాలమూ, శ్రమా అనవసరం.
- ధనికొండ, పవిత్రులు

### దుశ్చేష్టలు

వాని దుశ్చేష్టలకు మూల మేన కాదె?
- తిక్కన, ఆశ్రమవాసపర్వము

### దుష్టచింత

జీవితంబున నొక దుష్టచింత లేని
సత్యవంతుల ప్రాయంబు జాఱదండ్రు.
- జాషువా, ముంటాజమహలు

### దుష్టులు

పదుగురు కోఁతివెంబడి సంచరింపరే?
వాహకు లేరె శవంబులకును?
గంగిరెద్దుకు లేవె ఘనతూర్యరావముల్?
కల్మి గల్గదె వారకామినులకుఁ?
బులి గోవుఁజంపి నక్కలను బోషింపదే?
స్థూలకాయము లేదె దున్నలకును?
బుప్పి పంటికి లేదె పుట్టంబుఁ జుట్టుట?
వేణుధరుం డెద్దు వెంటరాఁడె?
న్యాయపద్ధతి నడువని యవనిపతికి
నెన్ని చిన్నెలు గలిగిన నెందుకొఱకు?
నంత్యమునఁ జూడవలయు నాయయ్య సుఖము.
- అడిదము, రామలింగేశ్వర శతకము

దుష్టులు వుంటేనేకాని, శిష్టులు
బైటపడే అవకాశం వుండదు.
- ధనికొండ, బుద్ధొచ్చింది

దృష్టముగఁ గీడు చేసిన దుష్టవలని
వినయవాక్యంబులకు మెచ్చు వెఱ్ఱివాఁడు.
- దూబగుంట, పంచతంత్రము

సమయమా యిది కాదయా సౌఖ్యమునకు
దుష్టుల వధించి ప్రోవు సాధువులనెల్ల.
- కూర్మనాథకవి, సింహాద్రినారసింహశతకము

మాన్యంబు లియ్య సమర్థుఁ డొక్కఁడు లేఁడు
మాన్యముల్ చెఱుప సామంతు లంద
ఱెండిన యూళ్ల గో డెఱిఁగింపఁ డెవ్వఁడుఁ
బండిన యూళ్ళెన్నఁ బ్రభువు లంద
ఱీతఁడు పేదయటంచు నెఱిఁగింపఁ డెవ్వఁడుఁ
గలవారి సిరి యెన్నఁగలరు దొరలు

తనయాలి చీఁకటితఁ ప్పెన్నఁ డెవ్వఁడు
పెరకాంత అంకెన్నఁ బెద్దలంద
టిట్టి, దుష్టుల కధికార మిచ్చినట్టి
రాజు నసవలెఁగాక దుర్ణయుల ననఁగ
నేమి పనియున్న దిఁక సత్యవీంద్రులకును?

- అడిదము, రామలింగేశ్వర శతకము

### దుస్తరం

గడిచిపోయిన రోజు, దూరమయిన మనస్సు పొందలేం.

- భారతీదేవి, ప్రేమవాహిని

### దూత

మనువులను స్థిరపఱుచుటలో దూతలు, మహీ నాధుల కార్యములందు దూతలు, మనుజుల వ్యాపారములందు దూతలు, మదనతంత్రము లందు దూతలు, మరణములందు దూతలు.

- పానుగంటి, విప్రనారాయణ

### దూతిక

గురునిమాట మీరు శిష్యుఁ డుండవచ్చును. వైద్యుపలు కాదరింపని రోగి యుండవచ్చును. కాని ప్రియ సమావేశమునకు సాహాయ్యపడు దాసి చెప్పినట్లు చేయనివాఁ డుండునా?

- పానుగంటి, మాలతీమాల

### దూరదృష్టి

ఏ స్టెప్పు వేసినా, దూరదృష్టితో వెయ్యాలి - తొందరపడకూడదు.

- పుల్లాభొట్ల, అంతరాత్మ ప్రబోధం

### దూరం

దూరంగా ఉంటేనే - మనిషికీ, మనిషికీ మధ్య ప్రేమాభిమానాలు హెచ్చవుతూ వుంటాయి.

- నంది, నైమిశారణ్యం

తారకు తారకు దూరం
నిరాధార సంచారం.

- అబ్బూరి, కవిత

లోభికి ధర్మచింత వెర్రివానికి వివేకం దూరం.

- సామెత

ఒకళ్ళనుకుంటున్నారని బాధపడితే మన మెన్నాళ్ళు బ్రతగ్గలం? వినేదానికి - నిజానికి చాలా దూరం.

- వివేకానంద, మనస్తత్వాలు

### దూరాలోచన

నిప్పులో వేయుటకే కట్టెల మోఁపును నెత్తిపై మోచుట.

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

### దూషణ

సిగ్గు వోనాడనేల? యెగ్గు లాడనేల?

- పోతన, భాగవతము

నీళ్ళు భేదింపని వస్తువులును దురాత్మలు దూషింపని మహాత్ములును లేరు.

- తి.వేం., బాలరామాయణము

అసమర్థులూ, శక్తిహీనులూ నిజమైన శక్తి మంతుల సామర్థ్యాన్నీ ప్రయోజకత్వాన్నీ దూషించడం మినహా ఏమీ చేయలేరు.

- తాళ్ళూరి, శ్రావణ సంధ్య

### దృష్టి

పాటిమీద గంగానమ్మకు కూటిమీదే లోకం

- సామెత

చిత్తం శివునిమీద, భక్తి చెప్పులమీద.

- సామెత

గరుత్మంతుని దృష్టి గ్రద్దలకుఁ గలుగునా?

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

గడనగల మగనిఁ జూచిన
నడుగులకును మడుఁగు లిడుదు రతివలు తమలో
గడనుడుగు మగనిఁ జూచిన
నడపీనుఁగు వచ్చెననుచు నగుదురు సుమతీ!

- బద్దెన, సుమతి శతకము

సత్పథమున సంచరించే గృధ్రములకు భూమిపై కళేబరముల మీదనే కదా దృష్టి.

- దీక్షితులు, రేణుక

### దెప్పు

ఈ ఆడవాళ్ళకు మగవాళ్ళ అవసరాలు గుర్తించడం చేతగాకపోయినా, దెప్పడం మాత్రం బాగా చేతనవును.

- రారా, నీతిగానుగ

### దెబ్బ

మొదటి దెబ్బ కొట్టిన వాడికంటె తిన్నవాడే ధన్యుడు.

- ఉన్నవ, మాలపల్లి

దేవునికైనా దెబ్బే గురువు.

- సురవరం, మొగలాయి కథలు

లాలనమున బహుదోషము
లోలిం బ్రాపించుఁ దాడనోపాయములం
జాల గుణంబులు గలుగును,
బాలురకును దాడనంబ పథ్యం బరయన్.

- పోతన, భాగవతము

దెబ్బతిన్నవా డెపుడూ ఆ దెబ్బ తన మంచికే తగిలిం దనుకుంటాడు. సహజమే. ఆలా అను కోకపోతే బ్రతకలేడు.

- విహారి & శాలివాహన, మేగ్

మంచితనానికి విలువ నివ్వలేని మనుష్యులను వాళ్ల స్వభావంతోనే తిప్పికొట్టాలి.

- శ్యామలారాణి, జీవవాహిని

**దేనికదే**

ఢిల్లీకి ఢిల్లే. పల్లెకు పల్లే!

- బెళ్ళపిళ్ల, కథలు - గాథలు

తమ్ముడు తమ్ముడే, పేకాట పేకాటే!

- గణేశ్ పాత్రో, లాభం

**దేవత**

వరాలు ఇవ్వడానికి చేతగాని దేవతలు వంచన లకు మాత్రం ముందంజ.

- రామకృష్ణశాస్త్రి, దీక్ష

స్నేహార్ద్ర చిత్తులకు
జీవులే దేవతలు.

- సినారె, స్వప్న భంగం

**దేవుడు**

తానొకటి తలిస్తే, దైవమొకటి తలచినట్లు

- సామెత

తెలియని అజ్ఞానంలో పుట్టిన భయంలోంచి
భయం సాకి పెంచిన అజ్ఞానంలోంచి
పుట్టుకొచ్చిన దేవుడనే భ్రాంతి....

- సుదర్శన్, అజ్ఞానం + భయం = మతం

మహాకవుల కావ్యాలలో రసంవలె
భగవంతు డెప్పుడూ వ్యంగ్యమైనవాడు

- సుప్రసన్న, మూడు గీతాలు

దేవుళ్ళు రాళ్ళు. వాళ్ళు కన్నీళ్లకు కరగరు.

- రంగాచార్య, జనపథం

ఆశా, అసూయా అనేవి లేకపోతే మనిషి భగ వంతుడే అవుతాడు.

- భారతీదేవి, ప్రేమవాహిని

భాగ్యము, పదవి, పలుకుబడి కలవాండే
త్రిమూర్తి రూపుండైన భగవానుండు

- వరదాచార్యులు, వైశాలిని

భగవంతుడు అనవసరంగా సృష్టింపబడ్డ తార్కి కుల ఊహామాత్రుడు.

- గోపీచంద్, దేవుని జీవితం

అసలు దేముడంటూవుంటే, మనసిద్ధాంతం ప్రకారం మనం చేసే పనులన్నీ దేముడే మన చేత చేయిస్తున్నాడు.

- వెంకటకృష్ణమూర్తి, మేఘమాల

ఎవ్వడో చేతఁగానివాఁ డెవఁడొ దైవ
మంచు ముడిపెట్టుకొని జప మాచరించు
శ్లాఘ్యవీరుఁడు ముసలమ్మసరణి జపము
పేనఁ డావ్యర్థదైవమ్ము హీనపరచు.

- విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము

దేవుడు నీవు మ్రొక్కినన్, జూచునొ? పల్కునో?
యటుల సు మ్మితఁడున్ సరసీరుహాననా!

- తమ్మయ్య, వైజయంతీ విలాసము

అందరు దేవుళ్లూ వక్కరే అయితే ఆ పీనుగుల్ని అందరినీ ఒక్కచోటే నిలిపి అందరూ కలిసి పూజ తగలెట్టరాదా?

- గురజాడ, మీ పేరేమిటి?

నిర్మలమైన హృదయాలతో ఒక మంచి జరగా లని మనం వేస్తున్న ముందడుగుకి తప్పక దైవ సహాయం తోడవుతుంది.

- శ్యామలారాణి, పవిత్ర

మనుషులు నిమిత్తమాత్రులు, మానవాతీత శక్తి ఆడించే నాటకంలో పాత్రలు.

- శ్యామలారాణి, పవిత్ర

దేవుఁ డెక్కడో లేడు, మనందరి నివేదనలకోసం మనలోనే దాక్కున్నాడు.

- వేదాంతకవి, ఆకలిమంట

కాల వశమున మారి
చాల ముదుపులు కోరి
దేవుడే వ్యాపారి
ఓ కూనలమ్మ.

- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

డబ్బు నోట్లో దేవు డున్నాడు.

- కందుకూరి, హాస్య సంజీవని

కష్టంలో వున్న ప్రతి మానవుడికీ గుర్తువచ్చేది దేవుడే. అది ఉన్నావా లేవా అన్న ప్రశ్నకాదు. వచ్చి నన్ను ఆదుకోవోయ్ దేవుడా! అని ఆక్రో శన మాత్రమే.

- భమిడిపాటి, కథన కుతూహలం

తనను తను తెలుసుకోగలిగిన ప్రతి మనిషీ దేవుడే.

- ఆనందారామం, ఇదా భారతం?

దేవుడుంటే దొంగలు ఉండనే ఉండకూడదు!

అంచేత వాళ్ళు ఉన్నారూ అంటే దేవుడు లేడన్న మాటే!

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

ప్లీడరుగారి కడుపులోఁ జొరబడ్డ దేవుఁడు జడ్జీ గార్లో గూడా జొరబడాలిగా!

- వేదాంతకవి, తెనుఁగుతల్లి.

దైవము దోసకారులకె తోడ్దైవచ్చు నెప్పట్టునన్.

- పెద్దన, మనుచరిత్ర

ఆఁకొన్నవారి రమ్మని
తేఁకువ నన్న మిడువాఁడె దేవుఁడు.

- కంకంటి, ఉత్తర రామాయణము

పరమాత్మకు జాతి భేదం లేదు.

- గురజాడ, కన్యాశుల్కం

సాటివారు నిన్ను సాధింపఁగా లేరు
దైవ మెపుడు నీకు తప్పకున్న
భారతంబులోని పరమార్థ మిదెకదా!

- వేమన

దైవమా! మంచిచెడ్డలు లేవె నీకు?

- పానుగంటి, సాక్షి

మీ దేవుడు ఆలనా పాలనాలేని పరరాజు వలె వున్నాడుగాని జనుల కష్ట నిష్ఠురాలు యోచించే స్వదేశీ ప్రభువుగా లేడు. ఎక్కడో స్వర్గంలో వున్నా డంటారు. చేతగానివాడు అక్కడ వుండి ఈ ప్రపంచపాలన యెందుకు నెత్తిన బెట్టుకోవాలి?

- ఉన్నవ, మాలపల్లి

దొరలకయినా, దొంగలకయినా దేవుడు ఒక్కడే.

- పులికంటి, మరుపురాని మా ఊరు

మన గుడిలోకి వస్తాడా దేవుడు? ఆహా! యెవరు కట్టించుకున్నా వస్తాడు. ఆయన కంటు లేదు. పెద్ద దేవుడు మనలోనే వుంటే యీ రాతిదేవు ళ్ళెందుకు? రాళ్ళు దేవుళ్ళయితే రాసులు మింగవా?

- ఉన్నవ, మాలపల్లి

నిర్దయుడైన యీ దేవుణ్ణి పదభ్రష్టుని జేసి ఆ సైతానునైనా దెచ్చి కూర్చోబెట్టి దాని దోవన అదిపడి ఉంటే మనము బ్రతకవచ్చునని నమ్మకం.

- ఉన్నవ, మాలపల్లి

ఈ నేరస్తులు శిక్షణను పొందే మార్గమేమిటి? దేవునికే వదిలిపెడదాం. భాగ్యవంతులు ఆయనను గూడా లోబరుచుకోకపోతే వచ్చే జన్మలోనైనా శిక్షిస్తాడు

- ఉన్నవ, మాలపల్లి

నిన్న మొన్నటిదాకా రష్యాలో దేవుడు లేడు. నేడు మళ్ళా వున్నాడని వినవస్తూ వుంది యెల్లుండి మళ్ళా ఉండడు. ఆవలెల్లుండి వుంటాడు. 'త మదధీనా తవస్థితిః' అని ఎవరో ఆచార్య పురుషులు దేవుణ్ణి గురించి అన్నా అంటారుగాని అది యూరపు ఖండంలో చాలా కాలంనాడే అమలు జరగడానికి ఆరంభించింది.

- చెళ్ళపిళ్ళ, కథలు-గాథలు

దేవు డేనాడో సచ్చిపోనాడు తల్లీ!

- నంది, పుణ్యస్థలి

ధనము వీధిఁ బడిన దైవవశంబున
నుండుఁ, బోవు మూల నున్ననైన.

- పోతన, భాగవతము

ఈరోజు దేవుడికి మనం గుర్తిస్తేనే శక్తి. మనం కన్పిస్తేనే శక్తి, లేకపోతే బూజు పట్టిపోయి గబ్బిలాల పంచన గాఢనిద్ర పోవలసిందే!

- మారుతీరావు, కళ్ళు

కలఁ డందురు దీనులయెడఁ,
గలఁ డందురు పరమయోగిగణముల పాలం
గలఁ డందు రన్ని దిశలను,
గలఁడు గలం డనెడువాఁడు గలఁడో లేఁడో.

- పోతన, భాగవతము

ఇందుఁగలఁ డందు లేఁడని
సందేహము వలదు, చక్రి సర్వోపగతుం,
డెందెందు వెదకి చూచిన
నందందే గలడు.

- పోతన, భాగవతము

దేవుడి మనస్తత్వం ఎలాటిదంటే మొక్కేకు! గమ్మునుండిపో! నిన్నేమీఁ అనడు. కాదని మొక్కన్నావూ? నీ వెంటబడతాడు, నిన్ను వదలడు మొక్కు చెల్లించే దాకానున్నూ.

- కొడవటిగంటి, బతుకుభయం

స్వామీ, నేను నీ భక్తుణ్ణి. నువ్వు భక్తులకు దాసుడివి. నువ్వు నన్నేమీ చేయలేవు.

- కొడవటిగంటి, భగవద్భక్తి

ప్రపంచంలో ఎంతమంది ఆస్తికులున్నారో అంతమంది భగవంతు ళ్ళున్నారు. ఒకరి భగవంతుడిలో ఒకరు తప్పు పట్టడానికి లేదు.

- కొడవటిగంటి, భగవద్భక్తి

ఈవు దేవళమున మ్రొక్క నేగుచుంటి
వదిగొ దేవుఁడె నిను మ్రొక్క నరుఁగుచుండె.
- ఉమర్‌అలీషా, నిశాసందేశము

సన్నుతుల నంది దైవంబు మిన్నకుండె.
- జాషువా, ముంటాజమహలు

దేవుడికి జననం లేదు
భక్తుడికి మరణంలేదు.
- కొడవటిగంటి, చిరంజీవి భక్తుడు

మామూలు మనుషులు మనుష్యులని నమ్ము కుంటారు. భక్తుడు దేవుణ్ణితప్ప నమ్మలేడు. ఎందుకంటే దేవుడు నీతులు చెప్పడు. దేవుడికి పెట్టే లంచం చట్ట విరుద్ధం కాదు.
- కొడవటిగంటి, చిరంజీవి భక్తుడు

వాడికి కొంతమంది దేవుళ్ళున్నారు. ప్రసాదం పుచ్చుకొని వరాలిచ్చేవారు.
- కృష్ణంరాజు, దిగులు

## దేశభక్తి

ఊహాపోహలు లేని వట్టి అధికా
రోన్మత్తులం జేరి దా
సోహ మ్మంచు భజించు టొక్కటియె దే
శారాధనం బయ్యె వ్య
ర్థాహంకార దురాగ్రహ గ్రథితని
త్యావ్యగ్ర సంభాషణల్
సాహిత్యం బయె; దీని మించిన కుసం
స్కారమ్ము వేఱున్నదే?
- కొడాలి, గాంధీమహాత్ముడు

ఆచరణముతోఁ గూడిన సంస్కరణము నిష్కా పట్యముతోఁ గూడిన మనస్సు ప్రతిఫలవాంఛా రహితమగు ప్రేమము ఇవికదా మన దేశాభివృ ద్ధికిఁ గావలసినవి?
- పానుగంటి, సాక్షి

దారాపుత్రాదులతో సాంగకముగాఁ, జిత్త బుద్ధ్యాత్మలతో నెవ్వఁడు నిష్ఫలాపేక్షతో దేశ మునకుఁ దన్నర్పణము చేసికొనునో వాఁడే దేశ భక్తుఁడు. అంతే కాని దేశభక్తి దేశభక్తియని ఉపన్యాస పీఠములపై గొంతెత్తి యఱచినంత మాత్రమున దేశభక్తి యుదయించునా? దేశ ప్రజలను సోదర ప్రేమతోఁ జూచుటకు మీకు హృదయములే లేనప్పుడు మీకెక్కడి దేశభక్తి?
- పానుగంటి, సాక్షి

ఇందఱు దేశభక్తులు మనదేశమున నున్న తరు వాత మనదేశమున కిఁకఁ గొఱంతయేమి? ఇంకను దేశమునకు దురవస్థయేమి?
- పానుగంటి, సాక్షి

దేశభక్తుఁ డనగాఁ దనకుఁ దన దేశీయులకు భేదము తలపులో, మాటలో, చర్యలో లేని వాఁడు.
- పానుగంటి, సాక్షి

జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశి సరుకులు నించవోయ్.
- గురజాడ, దేశభక్తి

మాతృభక్తికంటె దేశభక్తి యెక్కువది కాదు. పితృభక్తికంటె దేశభక్తి యెక్కువది కాదు. అవి రెండును లేనివారికి దేశభక్తి కలుగుట కల్ల.
- పానుగంటి, సాక్షి

కచ్చ గట్టలేనివాఁడు దేశభక్తుఁడు కాదు. నోరు గట్టలేనివాఁడు దేశభక్తుఁడు కాఁడు. మనసు కట్టలేనివాఁడు దేశభక్తుఁడు కాఁడు.
- పానుగంటి, సాక్షి

వొట్టి మాటలు కట్టిపెట్టోయ్.
గట్టిమేల్ తలపెట్టవోయ్.
- గురజాడ, దేశభక్తి

దేశములో నీవు లేవు. నీలో దేశ మున్నది.
- పానుగంటి, సాక్షి

లేదురా ఇటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి పౌరు లింకెందు.
- రాయప్రోలు, జన్మభూమి

గోలకొండ నీరత్నకోశ మట
కోహినూరు నీ జడలో పూవట
తాజమహలు నీ దివ్య భవనమట
- రాఘవశర్మ, జాతీయ గీతాలు

భరత ఖండంబు చక్కని పాడి యావు
హిందువులు లేఁగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియగట్టి.
- చిలకమర్తి, జాతీయ గీతాలు

కలదు కలండని పలికే దేవుఁడు
కలఁడో లేఁడో కనఁబడఁ డెవరికి
కలదు కలదు నిను కన్న దేశ మిది
నిత్యము సత్యము నిశ్చయమోయ్.
- రాయప్రోలు, భద్రయాత్ర

దేశము ఋణమును, దేవ ఋణమును
మాతృ ఋణమును, మనిషి ఋణమును

తీర్ప గలిగిన దీక్షితుడ నని
తెలిసి తెలిపే తరుణమోయ్.
- రాయప్రోలు, భద్రయాత్ర

దేశమంటే దిబ్బకాదోయ్
పంట పొలములు - పండ్ల తోటలు
గో నదీ నిక్షేపనగములు
కాంచు మంగళదేవతోయ్.
- రాయప్రోలు, భద్రయాత్ర

ఏ దేశమేగినా ఎందు కాలిడిన
ఏ పీఠమెక్కినా ఎవ్వ రేమనిన
పొగడరా నీ తల్లి భూమి భారతిని
నిలుపరా నీ జాతి నిండు గౌరవము.
- రాయప్రోలు, జన్మభూమి

దేశభక్తుఁడను బిరుదును నెత్తికిఁ గట్టుకొనఁగ లవుగాని బుద్ధున కున్న ప్రేమను హృదయ మునఁ బెట్టుకొనఁగలవా?
- పానుగంటి, సాక్షి

ఎనిమిది సంవత్సరములలోపల నీ భారతవర్ష మున బయలుదేఱిన దేశభక్తుల సంఖ్య మిగి లిన సర్వ ప్రపంచమందు ఎనిమిదివేల సంవ త్సర కాలములోఁ గలిగిన దేశభక్తుల సంఖ్య కంటె నెన్నిమడుఁగులో హెచ్చని భావింపవలసి నట్లున్నది.
- పానుగంటి, సాక్షి

దేశభక్తిని గుత్తకు కొన్నవారు
బ్లాకున తప్ప అమ్మరు.
- బైరాగి, పాంచజన్యం

దేశభక్తి! నీ పేరున గాదా
దేశద్రోహం జరిగేదంతా?
- సదాశివం, దేశభక్తి

**దేశం**

గజాని కొక గాంధారి కొడుకు
గాంధీగారి దేశంలో.
- తిలక్, న్యూ సిలబస్

దేశ సేవ అంటే సీనియారిటీతో పనిలేని
ప్రమోషన్.
- పాండురంగారావు, పాములనిచ్చెన

మస్కెట్లనుండి రైఫిళ్ళదాకా నడిచిన దేశం,
కొడవళ్ళ నుండి కోతయంత్రందాగా సాగలేదు.
- దాశరథి, పునర్నవం

ఖండఖండాంతరాల్లో ప్రఖ్యాతి కెక్కే, దేశద్రో హుల్ని ఒక్క కాంగ్రెస్‌తప్ప, మరే సంస్థ తయారుచేసిందండీ!
- రామకృష్ణశాస్త్రి, కైంకర్యం

డబ్బు దండిగా ఉండి దరిద్రం ఉన్న దేశం యీ భారత్.
- సూర్యారావు, తాంతియాతోపే

ఇంటి రట్టు బయట బెట్టు. దేశం గతి
నానాటికి తీసికట్టు.
- బైరాగి, వందేమాతరమ్

**దేశాటనం**

దేశచాలనంబు తెల్వి పుట్టఁగఁజేయుఁ
గరుణ మనమునందుఁ గలుగఁ జేయు
నతిథి పూజలందు నాసక్తి పుట్టించు
ధైర్య మిచ్చు రిక్తదశ నడంచు.
- తి. వేం., శతావధానసారము

శాస్త్రజ్ఞాన వాసనలేని మూర్ఖునకయిన దేశాట నము మిక్కిలి లోకానుభవమును గలిగించును.
- చిలకమర్తి, కర్పూరమంజరి

**దేశాభిమానం**

నిజమైన దేశాభిమానమునకు మాఱుగా ననేకు లలో మనదేశమునం దిప్పుడొక విధమైన దుర భిమానము వ్యాపించుచున్నది. ఈ దురభిమా నబలము చేత మనదేశమునందలి దురాచార ములు సహితము సదాచారములుగా పొగడఁ బడుచుండుటయు నితర దేశములవారి సదాచా రములు కూడ దురాచారములుగా తెగడఁబడు చుండుటయు సంభవించి నిజమైన దేశాభి వృద్ధికి భంగము కల్గుచున్నది. ఈ దురభిమా నము పరదూషణమునకు, ద్వేషణమునకుఁ గారణమయి మత ధర్మమునకు శత్రువయి దేశాభివృద్ధికి భంగకరమయి యనర్థదాయక మగుచున్నది.
- కందుకూరి, దేశాభిమానము

దేశాభిమానం నాకు కద్దని .
వొట్టిగొప్పలు చెప్పుకోకోయ్!
పూని యేదైనాను వొకమేల్
కూర్చి జనులకు చూపవోయ్!
- గురజాడ, దేశభక్తి

దేశాభిమాన మనఁగా దేశమునందలి దురాచా రములను తొలఁగించి సదాచారములను ప్రతి ష్ఠాపించి దేశమునకు క్షేమము కలిగించుటయే కాని యుక్తాయుక్త వివేచన లేక తొంటి యాచా

రములనెల్ల సంధిప్రాయముగా బలపఱచుచుం డుట కానేరదు
- కందుకూరి, దేశాభిమానము

ప్రాక్టీసులేని ప్లీడరు దేశాభిమాని అయినట్లు.
- సామెత

## దేశాభివృద్ధి

ఈ దేశాభివృద్ధి మొట్టమొదట తనతో నారంభము కావలెను. అటుపిమ్మట తన కుటుంబమునకును, తన గ్రామమునకును ఆ దేశమునకును క్రమముగా లోకమంతకును వ్యాపింపవలెను.
- కందుకూరి, విద్యాధికుల ధర్మములు

## దేహం

కాలు సేయాడు కాలంబె కదలవలయుఁ
దీర్ఘసేవకు దేహ మస్థిరముగాన.
- శ్రీనాధుడు, కాశీఖండము

తలయే శరీరమందలి ముఖ్య భాగము- ఎందుచేత? మనస్సునకు స్థానమగుటచేత. మనసులోనే సర్వపాపము లుదయించి బయలువెడలును. ఆ పాపములె వెంట్రుకల రూపమున తలనుండి వచ్చుచున్నవి. క్షురకర్మ మనఁగాఁ బాపవిచ్ఛేద మన్నమాట.
- పానుగంటి, సాక్షి

భౌతిక దేహం పెద్ద అడ్డంకి మనుష్యుల నిజతత్వాలను స్ఫుటంగా కనబడనియ్యదు.
- పాప, వాసనలేని పువ్వులు

సాధారణముగా నసాధారణ దేహదార్ఢ్య మెచ్చట నున్నదో యచ్చట విశేషమైన యమాయకత యుండును.
- పానుగంటి, సాక్షి

సీమ బుడ్డికి బుడ్డి, యొక్కగ్రుక్కలో వంపునట్టి జమీందారుఁడున్నాడే- అతని బ్రదుకే బ్రతుకు-బ్రహ్మజ్ఞానికి దేహాభిమాన ముండదు. అతనికి నుండదు. ఒడలు చీరిన సరే- తగులఁబెట్టిన సరే.
- పానుగంటి, రాతిస్తంభము

శరీరము క్షణభంగురము, గుణములు కల్పాంతస్థాయులు.
- చిన్నయసూరి, మిత్రలాభము

శరీరం పుట్టినప్పుడు చిన్నదిగా పుట్టి, పెరిగి పెద్దదయి అభివృద్ధి చెందుతుంది. ఆత్మ ముదుసలిగా జన్మించి వయస్సు ముదిరికొద్దీ పసిపాపలా మారుతుంది అది జీవితంలో గొప్ప విషాదకరమైన సత్యం.
- బుచ్చిబాబు, ఒమర్ ఖయామ్

కామము శరీర ధర్మము
- విశ్వనాథ, బద్దన్న సేనాని

దేహాలు ఒక్కచోటనే నివసిస్తాయి. కాని ఆశలు వేరే లోకాలు సంచరిస్తాయి
- చలం, శశాంక

మనమెరిగిన ఈ దేహం
మంటిని మొలచిన మోహం
- బైరాగి, క్నామేడ్ రాయ్ స్మృత్యర్థం

ఈ దేహంపై మోహం
ఇది పగిలిన పిల్లనగ్రోవి
పాడుబడిన పిల్లనగ్రోవి
చైతన్యపు చిరిగిన చొక్కా
ఇది అచ్చులేని హల్లు
సౌందర్యపు విందులోంచి
ఇది ఎండిన ఎంగిలియాకు!
గోడనుంచి రాలిపడిన
విరిగిన వంకర మేకు
వారసుడు లేని సొమ్ము
తిరిగివచ్చిన ప్రేమలేఖ
పిచ్చివాని గదిగోడను
బొగ్గుముక్కతో రాసిన బూతు బొమ్మ
జీవకణాల పచ్చి పులుసు,
ఈ దేహంపై మోహం!
- బైరాగి, అపూర్వ కవిత

## దైవత్వం

పైకి దైవత్వం కనబడితే అడుగున దాని ప్రమాణంలో రాక్షసత్వం వుంటుంది. పైకి రాక్షసత్వం కనబడితే కనబడకుండా అంత దేవత్వమూ వుంటుంది.
- కొడవటిగంటి, అనుభవం

## దైవబలం

నాలో ఈస్వెరు దున్నాడు. ఆ ఈస్వేరుడే అన్నీ సేయిస్తాడు. సేయించే పన్లన్నీ నాలో ఈస్వెరుడే సేస్తాడు.
- రావిశాస్త్రి, పాపి

పులి నాకి విడుచు దైవము
గలనాఁటికి, దైవబలము గలుగని వేళం
గలహించి గొఱ్ఱె కఱచును.
- కవిచౌడప్ప శతకము

తమ ప్రతిభవల్లనే అనుకున్నవన్నీ జరిగిపోతు న్నాయనుకుంటారు. ఎంతటి అమాయకులు వాళ్లు? అలాంటివాళ్లను ఎప్పటికయినా దురదృష్టమనే అగాధపు లోతుల్లోకి తోసేసి, నిస్సహాయంగా పైకి చూసేలా చేసుకుంటాడు పైను న్నవాడు - ఆ భగవంతుడు.

- రామచంద్రమూర్తి, అనుభూతీ-అనుబంధం

### దైవభీతి

ఎటొచ్చీ దైవభీతిగలవాడే అందరికీ లోకువ.

- కొడవటిగంటి, అనుభవం

### దొంగ

ఇంటిదొంగ నీశ్వరుడైనా పట్టలేడు.

- సామెత

తొండ ముదిరి ఊసరవెల్లి అయినట్టు దొంగ ముదిరి దొరవుతాడండి. దొర రంగుమార్చి రాజకీయ నాయకు డవుతాడండి. ఈళ్ళని పోలీసోడు కాపాడతాడండి. ఈళ్ళందర్ని దేవుడు దీవిస్త డండి.

- రావిశాస్త్రి, బంగారిగాడికత

బంగారం పాతిపెట్టిన వాడు దొంగ
బైటకు తీసినవాడు దొర.

- కుందుర్తి, యుగేయుగే

దొంగలకి నీతీ, నిజాయితీ ఏమిటి?

- మారుతీరావు, అనంతం

దొంగ గొడ్డునకు గుదియ్యవైచినంత మాత్రమునఁ బరుగు లడఁగవు. అంత కంటె దొంగదగు మఱియొక గొడ్డుతో లంకె వేయవలయును.

- పానుగంటి, విప్రనారాయణ

దొంగలు గూడ మంచికి మారిపోతుంటారని దొరలైపొయ్యిన దొంగలు సెప్తుంటారు. అది దొంగ మాట.

- రావిశాస్త్రి, బంగారిగాడికత

ఒక సున్నా కుడివైపున ఇరికించి సరిపెడ్తే ఎవరు చూసేవాళ్ళు?

- నంది, పుణ్యస్థలి

### దొంగతనం

వేషం అంటే అందరూ ఎరుగున్న దొంగతనం.

- భమిడిపాటి, తుక్కుముక్కలహక్కు

చిక్కు మరుపులేని బిజినేసేటంటే జోబీలు కొట్టటమేన న్నారం డంతాను.

- రావిశాస్త్రి, మోక్షం

దొంగిలించే దానికన్నా దోచితే చిక్కేది ఎక్కువ.

- కాళీపట్నం, శాంతి

దొంగపని చేసినప్పుడు రెండోవారితో చెప్ప కూడదు.

- గురజాడ, కన్యాశుల్కం

దొంగిలించిన సొమ్ముని దొంగిలిస్తే మరీ పెద్ద దొంగతనం అవుతుందండి.

- బుచ్చిబాబు, దొంగ దొరికాడు

చౌర్యము లోకనైజమొ, నొక్కఁడు చెప్పి చేకొను. మఱొక్కఁడు చెప్పక సంగ్రహించెడున్.

- రామలింగస్వామి, శుక్లపక్షము

### దొర

బంగారం పాతిపెట్టినవాడు దొంగ. బైటకు తీసినవాడు దొర.

- కుందుర్తి, యుగేయుగే

దొరలు గొప్పవాళ్ళు. వాళ్ళు ఇంటిదగ్గిర కూడా ఇంగిలీషు మాట్లాడతారు.

- కొడవటిగంటి, తాతయ్య

దొరికాక ఒక్కొక్కడు ఒక్కొక్క రకం దొంగ... దొరికే దాకా ఒక్కొక్కడూ ఒక్కొక్క దొర.

- ముళ్లపూడి, జలప్రళయం

### దొరకనిది

మనదగ్గర లేనప్పుడు పక్కవాడిని అప్పో అరువో అడగొచ్చు, ఒక్క పెళ్లాం మినహా.

- బీనాదేవి, ఆడదానికథ

### దొరతనం

దొంగిలించేటంత దొరతనం ఉండగా, అడిగేటంత అన్యాయానికి లోబడతానా?

- సామెత

### దొరసాని

దొరకని సాని దొరసాని.

- పురిపండా, పద్యసమాధి

### దొరికేవి

దండుగకు రూపాయలు, తద్దినానికి కూరలూ దొరకకుండా పోవు.

- సామెత

### దోపిడీ

చీమలు పెట్టిన పుట్టలు
పాముల కిరవైనయట్లు పామరుఁడు దగన్
హేమంబుఁ గూడఁ బెట్టిన
భూమీశుల పాలఁ జేరు భువిలో సుమతీ!

- బద్దెన, సుమతి శతకము

చిట్ అంటే ఇతరుల అవసరాన్ని క్రూరంగా దోపిడీ చెయ్యటం. సహకార విధానాన్ని అవలంబించిన రక్తదాహం!

- కొడవటిగంటి, బ్రతకనేర్చినవాడు

దోచుకోడం మాటక్కొస్తే ఉన్నోడిని లేనోడు దోచుకోవాల రైతు పాలేరుని దోచుకోడవేఁటి సబువుతక్కువ మాట!

- కాళీపట్నం, అప్రజ్ఞాతం

పేదరికం మల్లబడితే
పెద్దరికం బతుకదురా
పనిముట్లే పగబడితే
దోపిడీలు సాగవుగా.

- కె. యల్, కొత్తగుడి

## దోషం

అధికారుల కన్నులయందు దోష మున్నట్లే చెవులలోఁ గూడఁ గొంత దోషముండును.

- చిలకమర్తి, తుంబురునారద సంవాదము

దేవతలకు వ్యభిచార దోషంలేదు. దేవతలకు స్వభార్యలు వుండరు గనుక పరస్త్రీ సాంగత్యము వల్ల వారికి దోషం లేదు.

- కందుకూరి, కలిపురుషశనైశ్చర విలాసము

సమీపస్థులు దోషములే యెక్కువగాఁ బాటింతురు.

- విశ్వనాథ, బద్ధన్న సేనాని

## దౌర్జన్యం

ఎటువంటి మొగుడికీ ఎటువంటి పెళ్ళాన్నయినా కొట్టటానికి అర్హత లేదు.

- కొడవటిగంటి, మగవాడి దౌర్జన్యం

## దౌర్బల్యం

పది కాకుల్లో ఒక కోకిల ఎలా నిలువగలుగుతుంది లెండి.

- సుంకర, పిచ్చివాడు

పట్టుదలే పెట్టని అలంకారంగా గలవాడిలో కూడా ఏమూలో మానవ దౌర్బల్యం ఉంటుంది.

- కొడవటిగంటి, చెడిపోయిన మనిషి

## దౌర్భాగ్యం

హాస్యం, కవిత్వమూ వివరించవలసివస్తే దానికంటే దౌర్భాగ్యం లేదు.

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

## ద్రష్ట

ప్రజల గుండెల కొండల్లో మాటువేసి
ట్రిగర్ నొక్కగలిగిన వాడే ద్రష్ట.

- శివసాగర్, మైక్రోస్కోపిక్

## ద్రోహం

గట్టుచేరిన వెనుక పుట్టివానితో పోరాడినట్లు.

- సామెత

స్వపక్షము వీడినట్టిదిన్
జాలక మారహస్యములు
శత్రులకున్ వచియించుచుంటి, కా
కోలము క్షీరసాగరని
గూఢము సిగ్గని లేదు దానికిన్.

- విశ్వనాథ, రామాయణకల్పవృక్షము

## ద్రోహి

మూర్ఖులు విరివిగా డబ్బు ఖర్చు చేసే భాగ్యవంతుణ్ణి చూసి కన్నుకుట్టి ఈర్ష్యపడతారు. డబ్బు ఖర్చు పెట్టే ధనికుడు లోకోపకారి. డబ్బు పేరబెట్టే కుచేలుడు సంఘద్రోహి.

- కొడవటిగంటి, నిలవనీరు

## ద్వంద్వ ప్రవృత్తి

కొందరు బంట్లు పగలు యాంటీనాచి, రాత్రి ప్రోనాచి.

- గురజాడ, కన్యాశుల్కం

కొందరు వున్నవూళ్ళో యాంటీనాచి, పరాయి వూళ్ళో ప్రోనాచి.

- గురజాడ, కన్యాశుల్కం

## ద్వంద్వాలు

ఆశతో కూడిన నిరాశలు, బంధనలో కూడిన స్వేచ్ఛలు, బాధతో కూడిన సుఖాలు, ఋణాలతో కూడిన సంపదలు, అజ్ఞానమిశ్రితమైన జ్ఞానం, మరణంతో కూడిన జీవనం, ఈ విధంగా ఎన్నో. ఈ ద్వంద్వాలు లేకపోతే అస్తిత్వమే లేదు.

- సంజీవదేవ్, ఎగ్జిస్టెన్షలిజం

## ద్వయం

విధవ సధవఁ జేయ వీరేశలింగంబు
గ్రామ్య రమ్యఁ జేయ రామమూర్తి
కందుకూరు గిడుగు కలశాబ్ధులను గల్గి
రగ్రవర్ణు లిర్వు రాంధ్రభూమి

- వసురాయకవి, చాటు ప్రబంధము

## ద్వైతం

ప్రపంచంలో సంకోచ వికాసాలు రెండే వున్నవి.

అనగా సృష్టి, లయము అనే రెండు పనులే జరుగుతున్నవి.

- ఉన్నవ, నాయకురాలు

మానవ జాతి రెండే రకాలు. ఒక రకం సంసారులు, రెండవరకం బిచ్చగాళ్ళు. అధికారులనండి, సన్యాసులనండి, మత గురువులనండి, రాజకీయ వేత్తలనండి, కవులనండి, గాయకులనండి, వీరందరూ రెండవరకం.

- విశ్వనాథ, ముగ్గురు బిచ్చగాళ్లు

# ధ

### ధనదాస్యం

కోరిన ధర యిచ్చి కొనుక్కునే వాళ్ళు ఎదురుబడితే, కాదన్నవా ళ్లెవ్వరున్నారో చెప్పు చూద్దాం.

- పిచ్చేశ్వరరావు, మనసులో మనిషి

### ధనం

ఆటకత్తెలకు వయస్సెట్టిదో మగవానికి ధనమట్టిది.

- పానుగంటి, రాతిస్తంభము

తల్లిముండలకు చావు సమీపించుచున్న కొలఁది ధన వాంఛ హెచ్చగును.

- పానుగంటి, రాతిస్తంభము

డబ్బెక్కువయేకొద్దీ నౌకర్లమీద మనం ఆధారపడ్డమూ ఎక్కువవుతోంది.

- యజ్ఞన్నశాస్త్రి, విశ్వం పెళ్లి

ఎప్పుడూ ధనమే. రాజుల రూపానో, ప్లీడర్ల రూపానో, రేడియోవారి రూపానో, కళావిర్భావపు హద్దులు నిర్ణయించడం తప్పదు కాబోలు.

- చలం, మ్యూజింగ్స్

ధనరేఖ జెర్రిపోతులా వుంది.

- గురజాడ, కన్యాశుల్కం

### ధనవంతుడు

ధనికవర్గంలో సన్నిహితులు ఎక్కడోకాని లభ్యంకారు.

- చాసో, బబ్బయ్య

నేర్పు గలుగువారు నెఱతనము గలారు
విద్యచేత విఱ్ఱవీగువారు.
పసిఁడి గలుగువారి బానిసకొడుకులు

- వేమన

లక్ష్మివలన గలుగు మదము వార్ధక్యమున నైతము అంతరింపదు

- సూరి, నా రాణి

పట్టకుండి యధిక భాగ్యంబు పట్టినా
దొడ్డవారిఁ దిట్టి త్రుళ్లిపడును
అల్పజాతి కుక్క యధికుల నెఱుఁగునా?

- వేమన

### ధన్యత

జీవితంలో ఏ ఒక్కరికైనా ఆనందాన్నివ్వగలిగితే అదే ధన్యజీవనం.

- శ్యామలారాణి, పవిత్ర

### ధన్యుడు

బ్రతికి చచ్చియు ప్రజలకెవ్వడు
ప్రీతిగూర్చెనొ వాడె ధన్యుడు

- గురజాడ, డామన్ పిథియస్

ఋషుల కాలం నుంచి మనం చాలా వెనక్కు వచ్చాం. అక్కడికి తిరిగి వెళ్ళే మార్గం తెలుసుకున్నవాడే ధన్యుడు.

- కొడవటిగంటి, అనామిక

మన్ని చూసి నవ్వుకుని, ఆనందపడిపోయే జనం ఉంటున్నప్పుడు మనం ధన్యులం!

- భమిడిపాటి, బాగుబాగు

### ధర

ధరల మాట మాకెందుకు
దాని ఖర్మ కొదిలినాం!
ధర హెచ్చుట తగ్గుటకను
పరమసూక్తి నమ్మినాం.

- మల్లారెడ్డి, కాంగిరేసు కన్నెపడుచు

చాకిరీ కూలివాండ్ల సొమ్ము, భూమి రైతు సొమ్ము. దేని ధర దాని కుండాలె.

- ఉన్నవ, మాలపల్లి

### ధర్మకన్నం

ఎవడైనా తనకవసరమైన దానికంటె ఎక్కువ భాగ్యం పోగుచేసి అవసరమైన వాళ్ళ కుపయోగపడకుండా నిలువచేసినా, లేక దుర్వ్యయం చేస్తున్నా వాడింట్లో కన్నంవేసి ఆ ద్రవ్యమంతా లోకానికి ఉపయోగపరచేటట్టయితే అది ధర్మకన్నమంటారు. ఈ విధమైన లోకసేవను తిరుమంగ యాళ్వార్ల కైంకర్యమని పెద్దలంటారు.

- ఉన్నవ, మాలపల్లి

**ధర్మపన్నాలు**

దరిద్రపుఁ గుంకలకు ధర్మపన్నములు మెండు

- కాళ్లకూరి, వరవిక్రయము

**ధర్మపరుడు**

గొప్పదేవుఁడంచు గుండ్రాళ్లు జూపించి
బాగుపడెడువారు పలువు రుండఁ
బ్రాణమున్న బీదవాని కన్నులఁ జూచి
బాగుచేయు ధర్మపరుఁడు లేఁడు.

- జాషువా, తొలినిట్టూర్పు

తల్లికి కూడు పెట్టని వాడు తగుదునని తగవు తీర్చ వచ్చాడట

- సామెత

**ధర్మం**

ఇరుగు పొరుగులను ప్రేమించటం మధ్య ఇంట్లో కాపురం ఉన్నవారి విధ్యుక్త ధర్మం.

- ముళ్లపూడి, వరలక్ష్మీవ్రతం

పెద్ద దొంగతనము రాజధర్మము చిన్న దొంగ తనము చోర ధర్మము

- కూచి, రూపలత

ధర్మాలు తెలుసుకోవడం సులభమే.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, రాజరాజు

ధైర్యవంతులు క్షణమాత్రంగా ధర్మం వీడినా తప్పులేదు. పిరికి పందలు ధర్మాన్ని ఎన్నటికీ నిలబెట్టలేరు

- లక్ష్మణరావు, అతడు-ఆమె

మానవ స్వభావానికి సహజమైనదే ధర్మం.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

నువ్వు పుచ్చుకో - ఒకడికి పెట్టు.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

రాజ్యము కొరకు హత్య, మోసము మున్నగునవి ధర్మములేగదా!

- మాడపాటి, విధిప్రేరణము

Sex అనేది వాంఛకాక ధర్మమయి పోయింది ఈదేశంలో...

- చలం, మ్యూజింగ్స్

దాయలు చత్తురంచు దయఁ
దాల్చెద వెంతటి ధర్మరాజవో!

- తి.వేం., పాండవోద్యోగము

మనమేమో తోచినట్టల్లా చేసేస్తూ ఉండాలి. ఎదటివాళ్లుమాత్రం చచ్చినట్టు సర్దుకుపోతూ వుండాలి. ఇదీ ధర్మం.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, యావజ్జీవంహోష్యామి

ధనం బలం గలుగజేస్తుంది రెండిటినీ జ్ఞానం వంచుతుంది జనమును శక్తి శక్తిని చైతన్యము నడుపుతుంది యిది ప్రపంచధర్మం

- ఉన్నవ, మాలపల్లి

మంచిస్థితిలో వున్నప్పుడు మార్గచ్యుతి లేకుండా వర్తించటంకంటే దారిద్ర్యంలో ఉండి ధర్మంతో చరించటమే వాసి. ధనికులకంటె దరిద్రులకే ధర్మాచరణం సులభసాధ్యమని పెద్దలు చెప్తారు.

- ఉన్నవ, మాలపల్లి

ధర్మవిజయ మెప్పుడూ బలిగోరుతుంటుంది. ధర్మ నిర్వహణానికై సోక్రటీసు విషం గ్రహించాడు. క్రీస్తువు శిలువ నెక్కాడు. ప్రహ్లాదుడు సమస్త కష్టాలు పడ్డాడు హరిశ్చంద్రుడు సర్వంత్యాగం చేసాడు. అమరుడు శిరచ్ఛేదం బొందాడు. రామానుజశిష్యుడు అంధు డైనాడు. సారంగధరుడు కరచరణచ్ఛేదమును బొందాడు. కన్యక అగ్ని ప్రవేశమయింది. హేమలత ఆత్మ హత్య గావించు కొన్నది. తిలక్ మహాశయుడు నిరంతకారాబద్ధు డైనాడు. పశువధ లేనిదే యజ్ఞంలేదు. పశువు లన్నింటికంటే వుత్తమమ యింది స్వార్థపశువు.

- ఉన్నవ, మాలపల్లి

యెన్నో దుర్వ్యసనాలతో నిండివున్న యీ ప్రపంచాన్ని సంస్కరించడం అంటే "యెలుఁగ్గొడ్డు తంటసప్పని"- గానే కనపడుతూవుంది. అట్లని వుపేక్షించటం సంస్కర్తల ధర్మంకాదు.

- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

ధర్మాలు వేలు. ధర్మ సూక్ష్మాలు వేలు. అంతో యింతో ధర్మాలు తెలియనివారంటూ ఉండనే వుండరు. ధర్మసూక్ష్మాలు తెలిసినవారో యెక్కడో గాని వుండరు.

- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

ధర్మ మెఱిఁగి దానిఁ దానొండుగా లాభ
లోభ పక్షపాత లోలబుద్ధి
సభల నెవ్వఁడేని సభ్యుఁడై పలుకు వాఁ
డనృతదోషఫలము ననుభవించు

- నన్నయ, సభాపర్వము

సభకు వచ్చి ధర్మ సందేహ మడిగిన
నెఱిఁగి చెప్పకుండిరేని సభ్యు
లనృతదోషఫలమునం దర్ధ మొందుచు

రనిరి ధర్మవేదులైన మునులు.
- నన్నయ, సభాపర్వము

ధర్మం బధర్మవిద్ధంబయి వచ్చిన దానిం దీర్పని
సభ్యుల ధర్మవిద్ధు లగుదురు.
- నన్నయ, సభాపర్వము

ధర్మువు లట్ల యుండి బో
ధను లరయంగ వచ్చినన
ధర్మములై చెడుఁ గొన్ని; ధర్మవ
ర్తనములు గాక తోఁచి తుది
ధర్మములై చనుఁ గొన్ని కర్మముల్.
- తిక్కన, ఉద్యోగపర్వము

ఓపి ధర్మార్థకామంబు లొకటి నొకటి
నాశ మొందింపకుండంగ నడపవలయుఁ
గాక ధర్మంబు సెడ నర్థకామములను
గోరు పురుషుండు నిందకుఁ గుదురుగాఁడె?
- తిక్కన, శల్యపర్వము

ఒరుల పాలైన తమసొమ్ము మరలఁ గొనుట
యార్తిఁ జెందిన చుట్టాల నరసికొనుట
నిజకులోచితధర్మంబు నిలిపికొనుట
బలియుఁ డగుటకు ఫలమండ్రు.
- కంకంటి, ఉత్తరరామాయణము

తాగినవాని తప్పుకు తగవులేదు.
- సామెత

నీవు పెట్టకపోయినా పెట్టే యిల్లు చూపు.
- సామెత

యుగయుగాంతరముల మార్పులొందునవియు
నాత్మవచ్ఛరీరాధీన మయినయదియు
నయిన ధర్మంబు తనకు యోగ్య మగునెడలఁ
దనకు యోగ్యుల సృజియించుకొనును గాదె?
- విశ్వనాథ, గాంధీజీ

జయించినయతఁ డాచరించినది చెప్పును
ధర్మ మటంచు...
- విశ్వనాథ, రామాయణకల్పవృక్షము

ఈ నీతులు నియమాలు పుణ్యపాపాలు సస్వర
క్షణ కేర్పరచిన బెదురుబొమ్మల వంటివి.
- వరదాచార్యులు, వైశాలిని

పలువురతోఁ జేరి సుఖించుట మనుష్యధర్మము;
ఏకాకిగా నుండఁగోరుట మృగధర్మము.
- కందుకూరి, ఐకమత్యము

ధర్మరాజు

పేరు ధర్మరాజు పెనువేపవి త్తండ్రు
మాట తేనెతేట మనసు విషము.
- చిలకమర్తి, గయోపాఖ్యానము

ఈ రోజుల్లో ధర్మం కళ్ళు కప్పిన వాడు ధర్మరాజు
- కాంతారావు, వంశధార

ధర్మశాస్త్రం

మానవుడి సహాయానికి ధర్మశాస్త్రంగాని ధర్మశా
స్త్రంకోసం మానవుడు పుట్టలేదు.
- వేంకటరాయశాస్త్రి, వ్యామోహము

ధర్మసంస్థాపన

హిందూ లా మార్చి లోకం మరమ్మతు చేస్తే
గాని ధర్మసంస్థాపన కాదు.
- మునిమాణిక్యం, మృత్యురథము

ధర్మసూక్ష్మం

ప్రాణహాని వచ్చుపట్టున సర్వధ
నాపహారవేళయందు నడపు
సత్య మనృత మండ్రు; సత్యంబు సూనృత
మని పరిగ్రహింతు రార్యజనులు.
- తిక్కన, కర్ణపర్వము

బొంకనేర్చినవారే, రంకు చేయాలి.
- సామెత

ధర్మాసనం

విద్వాంసుల్ రాజమహేంద్ర పట్టణమునన్
ధర్మాసనం బుండి ప్ర
ధ్వంసాభావము ప్రాగభావ మనుచున్
దర్కింతు రెవ్వేళలన్.
- శ్రీనాథుడు, చాటువు

ధార్మికత్వం

కవిత్వమూ, ధార్మికత్వమూ వొకదాని కొకటి
చుక్కెదురు.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, రాజరాజు

ధిక్కారం

మనిషి బాధని పంచుకోవాలని మనిషి తాపత్ర
యపడినప్పుడు మధ్య అడ్డువొచ్చే మర్యాదనీ,
గౌరవాన్నీ, ధిక్కరించేస్తారు.
- నంది, నైమిశారణ్యం

ధీరుడు

చీకటి సర్కస్‌లో బాధల తాళ్ళమీద
గొడుగునడక నడిచినవాడే ధీరుడు.
- కుందుర్తి, దిగ్విజయ

తనమాట విన్నకొద్దీ అంతరాత్మ ఇంకా కఠోరమైన

ఆజ్ఞలు పెడుతుంది. కాని ఆ త్యాగులకి బైట ఎంత బాధో లోపల అంత శాంతి. అందువల్లనే ధీరులు అన్ని కష్టాలు చిరునవ్వుతో సహిస్తారు.

- చలం, మ్యూజింగ్స్

**ధూపం**

ధూపం వేస్తే పాపం పోతుంది.

- సామెత

**ధైర్యం**

ప్రేమక్కావల్సింది ధైర్యం. అదిలేని వాడు ఆడ పిల్ల నీడకూడా తొక్కకూడదు

- *బీనాదేవి, కాంట్ యు డేర్ డియర్?*

జీవితం దేనికి? దుర్ఘటనలు ఎదుర్కొనడానికే.

- *వెంకటకృష్ణమూర్తి, పడమటి సంధ్యారాగం*

మగధీరుడిలో విశిష్టత?
కొంగుపట్టుకు తిరగడం-
చిన్నప్పుడు తల్లిది
పెద్దయ్యాక భార్యది

- రాధాకృష్ణశర్మ, శాంతిసూక్తం

పెట్రోలుకి నిప్పంటించినట్టు జనానికి భయం అంటుకుంటే భగ్గున మండి అందర్నీ చుట్టబెడు తుంది. కాని ధైర్యం అలాకాదు. అది చాలా కాలం రాజుకొని రాజుకొని ప్రజ్వరిల్లుతుంది.

- రావిశాస్త్రి, వియత్నాం విమల వృత్తాంతం

మానవ సమాజంలో భయం అనేది ఎలా అంటు వ్యాధిలా వ్యాపిస్తుందో అలాగే ధైర్యం కూడా!

- ఆనందారామం, అద్దంలో శత్రువు

ధైర్యం లేంది స్వాతంత్ర్యం వుండదు. ఒకవి ధంగా చూస్తే ధైర్యమే స్వాతంత్ర్యం.

- *సంజీవదేవ్, ఆశుతోష్ ముఖర్జీ*

ధైర్యం సగం జయం. అధైర్యం పూరా అపజయం.

- *రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!*

ఆవశ్యకమే ధైర్యగుణమును వృద్ధిపరచును.

- పానుగంటి, కంఠాభరణము

ధైర్యం అంటే పోలీసుతో మాట్లాడం అనే అర్థం.

- ముళ్లపూడి, బుడుగు

ధైర్యశాలి కిట్లు తగదు తగదు.

- *తి.వేం., పాండవ విజయము*

తనయింటిలోఁ గుక్కకుఁగూడ శౌర్య మెక్కు వగా నుండును.

- *తి.వేం., మృచ్ఛకటికము*

'ధైర్యం' అనే పదార్థం మనలో ఉంటే ఏ ఇబ్బంది ఉండబోదు.

- పుల్లాభొట్ల, ఆదిత్యశ్రీ

ఈ శైలాంభోనిధిజంతుసంయుతధరా
చక్రంబు పైఁబడ్డ నా
కే లల్లాడదు బంధులార! నిలుఁడీ
క్రిందన్ బ్రమోదంబునన్

- పోతన, భాగవతము

**ధ్యేయం**

ఒక ధ్యేయంతో నడుస్తున్నప్పుడు, మార్గంలో అన్నీ పూలే ఉండవు.

- ఆనందారామం, మరోముందడుగు

**ధ్వంసకుడు**

బోగముది, యేనుఁగు, కాయస్థుఁడు, సన్యాసి, వంచకుఁడు, గాడిద యివి నిలిచిన చోటఁ బూరియైన మొలవదు.

- *తి.వేం., మృచ్ఛకటికము*

# న

**నక్క**

నక్క: ఒక సోట వూల వేసి యింకో సోట గౌరీ కళ్యాణం పాడదు.

- కాంతారావు, వంశధార

**నక్షత్రాలు**

పంచాంగాలు చింపేస్తే నక్షత్రాలు పోతాయా?

- చెళ్ళపిళ్ళ, కథలు-గాథలు

**నఖశిఖ పర్యంతం**

నఖశిఖ పర్యంత భోజనానికి కేమంచావు? వ్రత్తితే కాలిగ్గోరు క్రూడ ప్రపుప్రాద్రప్పళం క్రక్కాలి. ముక్కు నులిమితే పీశనెయ్యి బొత్తానా క్రొట్టాలి.

- వేంకటరాయశాస్త్రి, బొబ్బిలియుద్ధం

*నగదు బేరం*

కారూ, పెళ్ళాం ఈ రెండున్నూ అరువు యివ్వబ డవు. టర్మ్సు కాష్: నగదు బేరం తప్ప మరో బేరంలేదు.

- రావిశాస్త్రి, నిజం

*నగరం*

రాత్రిపూట నగరం
తెలివిగా ఆడిన అబద్ధం

పగడిపూట నగరం
బయటపడిన సత్యం

- రాధాకృష్ణశర్మ, శాంతిసూక్తం

నగరం కరెంటు తీగలతో అల్లిన అందమైన సాలెగూడు.

- నారాయణరెడ్డి, నగరం సాలెగూడు

ఒక మహత్తర పరిణామాన్ని
చూడలేని గుడ్డిది - నగరం

- వీర్రాజు, ఉషస్సు

నగలు

ఆడదాని వంటిమీద నగలంటూ వుంటే మగవాడికి యేఅవసరము వచ్చినప్పటికి అవి అక్కరకు వస్తాయి.

- చిలకమర్తి, పడకగది ముచ్చటలు

నగిషీ

యుగం మారుతోంది కాని కష్టాలు, సుఖాలు ఏం మారలేదు. కాకపోతే కష్టసుఖాలు ఈ యుగంలో రంగురంగుల దారాలతో నగిషీచేసుకుంటున్నాయంతే.

- జయప్రద, యుగసంధి

నగ్నసత్యం

దయ్యం అబద్ధం. దయ్యాన్ని కొట్టే దెబ్బలు, నిజం.

- కొడవటిగంటి, బ్రహ్మరాక్షసులు

నగ్నసత్యం కటువుగానే వుంటుంది.

- సూర్యారావు, నీలితెరలు

నటన

యే చిక్కులూ, యే యిబ్బందులూ లేకుండా యీ ప్రపంచంలో సుఖంగా బతకాలంటే కొంత నటన అవసరం.

- సూర్యారావు, ఒకగంట సంసారం

రంగస్థలం మీద నటించగలవాళ్ళు జీవితంలో నటించలేరు. జీవితంలో నటించగలవాళ్ళు రంగస్థలంపై రాణించలేరు. జీవితంలో నటించగలవాళ్ళు లౌక్యులు. రంగస్థలంపై రాణించగలవాళ్ళు నటులు.

- పులికంటి, హీరో+హీరో=జీరో

జీవితంలో ముఖ్యంగా కావల్సింది నటన. కొంత నటన ప్రదర్శిస్తేనేగాని, సక్రమంగా సాగదీ జీవితం.

- ముద్దంశెట్టి, నిమిత్తమాత్రులు

కోతికి మనుష్యుల్లా నటించటం చేతకాదు.

- కాంతారావు, వంశధార

నటన జీవనోపాధి అయితే ఫరవాలేదు. కాని, ప్రాణాలతో చెలగాటం కాకూడదు.

- శ్యామలారాణి, జీవవాహిని

కన్నం వెయ్యటమూ, వెయ్యకపోవటమూ, నిర్ణయించుకునే అధికారం దొంగకీ, యుద్ధరంగంలో చావటమూ, చావకపోవటమూ నిర్ణయించుకునే శక్తి సైనికుడికీ ఉన్నట్టు మనం నటిస్తాం. ఈ నటన మీదే మన సాంఘిక విశ్వాసాలూ, నైతిక ధార్మిక విశ్వాసాలూ ఆధారపడ్డట్టు కనిపిస్తుంది

- కొడవటిగంటి, అట్టడుగు

నటుడు

వక్తా, ఉపాధ్యాయుడూ, నటుడూ వీళ్ల ముగ్గుర్లో బహురమ్యంగా, హృదయరంజకంగా, కళ్లకి కట్టినట్లుగా బోధచెయ్యగలవాడు నటుడొక్కడే!

- భమిడిపాటి, తెలుగు నటుడు

జీవితంలో బతక నేర్చినవాడు ఉత్తమనటుడు!

- యాదగిరిరావు, నటుడు

నడక

రాకమాననిదీ, మానక వచ్చేదీ ఒకటే. అదే 'నడక'. అదే జీవితం.

- పిచ్చేశ్వరరావు, వెర్రికాదు, వేదాంతం!

నడమంత్రపు సిరి

ఎన్నఁడు దాతనాఁడుఁ దన
యింట నెఱుంగని కల్మి గల్గెనా
వెన్నున కద్ద మద్దుఁ, గొన
వ్రేళ్లకు ముచ్చెలు తొడ్గు, నింతలో
మి న్నెగఁ జూచు, ధింధి మని
మిట్టలు ద్రొక్కు, నిదేమి చిత్రమో!

- చాటువు

నడవడి

...రుధిరా
భీలాన్నంబునకంటెను
మేలగు భిక్షాన్నమైన మీనడవడికిన్.

- తిక్కన, ఉద్యోగపర్వము

వ్యవహారము చేతనే మిత్రులుగాని శత్రువులు గాని కలుగుచున్నారు.

- చిన్నయసూరి, మిత్రలాభము

నది

ఆనకట్ట తగిలి ఆగే వాహిని

పొలం మీద పారే జాతికి బలం
కదలి శత్రువును మాయచేసి
ఒదే మన కమ్మృతం పంచే మోహిని

- కుందుర్తి, సముద్రమథనం

నన్నయ

దుర్యోధను దుర్మార్గము
అనుజన్ముల అక్రమాలు
వర్ణించుట కలవిగాక
మహనీయుడు ఆ నన్నయ
తత్సంమించె తద్భవించె
అన్యదేశ్య మనుసరించె
తెలుగుభాష వెల్లివిరిసె
మహాభారత మవతరించె

- జగదీశ్వర్, రక్తభాష్యం

నప్పనిది

కాకి ముక్కున దొండపండు లాగ.

- సామెత

నమ్మకం

కలికితే అతకదు.

- సామెత

నమ్మకంలేని బొందె ఖాళీ సిగరెట్టు టిన్ను
నమ్మకంలేని హృదయం పుల్లలులేని అగ్గిపెట్టె
నమ్మకంలేని బ్రతుకు కాలిన సిగరెట్టు బూది.

- బైరాగి, నాక్కొంచెం నమ్మకమివ్వు

రోగిజిహ్వ కపథ్యంబె రుచ్య మగును;
గటికవానినె నమ్మెడుఁ గాయజంబు
వెలచెలినె నమ్ము నింద్రియవిహ్వలుండు,
ద్రోహినే నమ్ము మనుజనాథుండు మిగుల.

- పానుగంటి, ప్రచండ చాణక్యము

నమ్మకం మీద పీకతీసేడం మరీ సులభం.

- రావిశాస్త్రి, తిరస్కృతి

నమ్మికే, మనకు శక్తి. నమ్మకమే ధైర్యం. నమ్మకమే దైవం.

- శ్యామలారాణి, పవిత్ర

నమ్మకమే స్త్రీ పురుషుల మధ్య జనించే ఆకర్షణకు నాంది.

- పరిమళాసోమేశ్వర్, దర్పణం

ప్రజాభిమానం పోలేదు. పోయిందల్లా డిపాజిట్ మాత్రమే!

- శ్రీరమణ, న్యాయుడి

మగవారిని నమ్మిన యాడుదానిని ముక్కు సెవులు గోయవలెను సుమా!

- పానుగంటి, రాధాకృష్ణ

మాద్రిపట్టున నాకు నమ్మకము లేదు.

- తి.వేం., పాండవజననము

మానం ప్రాణం మీపాలు చేసి నమ్మి మీవెంట వొచ్చాను.

- గురజాడ, కన్యాశుల్కం

యెంత న్యాయంగా వెళ్ళేవారికీ వొకప్పుడు సన్నిధానవర్తులు చెప్పేమాటలు నమ్మక తప్పదు.

- కందుకూరి, జమాబందీ

వైద్యుడియందు గురివుంటే ఆయన మన్ను నలిపి చేతిలోపెడితే యెటువంటి రోగాలూ నిముషంలో కుదురుతవి.

- కందుకూరి, హాస్యసంజీవని

పలుకులు మధురసధారలు
దలఁపులు నానాప్రకార దావానలముల్
సెలుములు సాలావృకములు
చెలువల నమ్మంగ వేదసిద్ధాంతములే.

- పోతన, భాగవతము

ఎఱుక గలుగు నాతఁ డేది యొనర్చిన
వదియ చేతు రితరు లైన వార
లతఁడు సత్య మిట్టి దనెనేని లోకంబు
తత్ప్రవర్తనమునఁ దగిలి యుండు.

- పోతన, భాగవతము

మనుషులు కళ్ళు తెరవలేదు. ఈనాటికి కూడా పిశాచాలు వల్లిస్తేగాని వాళ్ళకు వేదాలలో గురిక దరదు.

- కొడవటిగంటి, న్యాయసూక్ష్మాలు

చాలామందికి - దాదాపు అందరికీని, తాము మనుషులను మహాఆర్థం చేసుకోగలమని కల్తీలేని నమ్మకం. అటువంటి వాళ్ళే తమ తల్లులనూ, తోబుట్టువులనూ కూడా అర్థంచేసుకోలేక పోవటం నేనెరుగుదును.

- కొడవటిగంటి, రాధమ్మకూతురు

నోటిమాటలు నమ్మలేని వాళ్ళు అచ్చులో చూసి నమ్ముతారు.

- కొడవటిగంటి, గ్రహాంతరయాత్ర

పాలపక్షి శకునఫల మిచ్చునందురు
పాలపక్షి కేమి ఫలము తెలియు
తనదు మేలుకీళ్లు తనతోడ నుండఁగ

- వేమన

మనవి మనం నమ్మలేకపోతే యితరులని

నమ్మలేం.

- బుచ్చిబాబు, ఆత్మవంచన

నమ్మువారిని చెఱచు దుర్ణయపరుండు
నితరులను బాగుచేయు టూహింపఁగలదె?

- వేంకటకవి, మదనగోపాల శతకము

ఒట్టేసి సెప్పినావంటే నీమాటమీన నీకూ నమ్మ కఁవుంటది!

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

లోకమంతా నమ్మకంతో వుంది. నమ్మకంలేకుంటే అడుగుతీసి అడుగుపెట్టడానికి వీలులేదు.

- గురజాడ, కొండుభట్టీయము

అరులయొద్దనుండి యరుదెంచి కొల్చిన
భటుఁడుఁ బాము నొక్కభంగి గాన
మోసపుచ్చి చెఱుచు నాసన్నుఁ డౌవాని
నమ్మినట్లు యుండి నమ్మఁదగదు.

- దూబగుంట, పంచతంత్రము

మనకు తెలియని పన్లు ఏం చేయదల్చుకున్నా ఏదో ఒక సూత్రాన్ని నమ్మి ముందుకు జరగాలి.

- మా గోఖలే, దొంగవాళ్ళు

ఆహారములో పిండి పదార్థం యెలాంటిదో మనిషి అనుభూతిలో నమ్మిక అలాంటిది.

- కాంతారావు, మంచి ముహూర్తం

వ్యాపారంలో నమ్మకం కన్నతల్లి లాంటిది.

- రాజారాం, ధర్మగ్లాని

మనుసుల్ని నమ్మే బదులు దున్నపోతుల నమ్మా లెహ...

- రాజయ్య, ఎదురు తిరిగితే

కొంచెం అబద్ధాలతో కలిపి మాట్లాడితేనేగాని నిజంలోని నమ్మకం కనబడదుగా!

- అప్పారావుపట్నాయక్, రేవతి

బొమ్మకు మొక్కినా నమ్మక ముండవలె.

- సామెత

గొర్రె కటికవాణ్ణి నమ్మినట్లు గొల్లవాణ్ణి నమ్మదు.

- సామెత

ఈ దేశంలో పాండవులు వుండని గుహలూ, సీతామ్మవారు స్నానమాడని గుంటలూ లేవు.

- గురజాడ, మీ పేరేమిటి?

రోగులకు మందు వైచినయెడల నమ్మువారికిఁ గోపము వచ్చునేమోయని మందుమాట యెవ్వరును దలపెట్టకుండ నున్నారు.

- పానుగంటి, వీరమతి

యుక్త ప్రవర్తనము గలిగి విగ్రహారాధనము చేయనొల్లని వానికంటె దినమునకు నూఱుకల్ల లాడినను, ప్రాతస్నానములు చేసి దేవతార్చనము చేయువారు పుణ్యాత్ములనియు, యోగ్యులనియు భావింతురు (నడత యెట్లున్నను, కులాచార మతాచారములను మీఱకున్న మాత్రమున మహానుభావు లని తలంతురు )

- కందుకూరి, దేశభాషలు

ప్రతిరోజూ కనబడేవాణ్ణి, వెక్కిరించినా ఉపేక్షచేసినా గాయపడ్డానికి బతికివున్న హృదయంకలవాణ్ణి, తోటివాణ్ణి, ఘనుడు, ఉత్తముడు, అంటే నమ్మడం ఎంత కష్టం?

- చలం, మ్యూజింగ్స్

మాయదారి మనుషుల్ని నమ్మేకంటే మట్టితో చేసిన దేవుణ్ని నమ్ముకున్నా మనసుకింత శాంతి నిస్తాడు.

- రామచంద్రమూర్తి, అనుభూతీ-అనుబంధం

## నమ్మకూడనివి

ముండని మరిగిన రుషిపుంగవుణ్ణి ఎలాగైతే నమ్మకూడదో ఏ బేంకులోనైనా సరే పర్సనల్ అకౌంట్లో అయిదు రూపాయలకంటె ఎక్కువ బేలన్సున్న కార్మికనాయకుణ్ణి నమ్మకూడదంటాను. అంటే మనం నమ్మచ్చనుకో. కార్మికులు నమ్మకూడదు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

ఎప్పుడూ నవ్వని మొగాడ్నీ, ఎప్పుడూ ఏడవని ఆడదాన్నీ నమ్మకూడదంటారు.

- బీనాదేవి, డబ్బు

కకారపోణ్ని కాటికెళ్ళేదాకా నమ్మకూడదు, కరణపోడు, కంసాలోడు, కోమిటోడు.

- గణేశ్‌పాత్రో, లాభం

కడుపు మాడి చస్తున్నా నైతికబలంతో రొమ్ములు విరుచుకొని బ్రతికాను.

- ఆత్రేయ, అద్దెకొంప

నారీ హృదయంబును వ్యవ
హారి నిజంబును నదీ జలాపూరంబుం
జోరుని ధర్మస్థితియును
వైరుల చెలిమియును నమ్మవల దెవ్వరికిన్.

- గోపరాజు, సింహాసన ద్వాత్రింశిక

## నమ్మించి మోసం

పట్టనేర్పు పాము పడగ నోరగఁ జేయు

జెలుపఁ జూచువాఁడు చెలిమిఁ జేయు
చంపదలఁచు రాజు చనవిచ్చుచుండురా
- వేమన

నమ్రత

వరిచేను వంగే వుంటుంది.
- సామెత

నయం

మానవులంటే భయం భయం
వారికంటే పశువులెంతో నయం నయం
- *గంగిశెట్టి, ఇజంలో నిజం*

అందని అమృతం కన్నా అందుబాటులో ఉన్న అటుకులు నయం.
- బుచ్చిరెడ్డి, తప్పు

నరకం

ఒకరి ఆకలి వేరొకరికి పరమాన్నము. నిరుపేదల నరకమే ధనవంతుల స్వర్గం.
- *చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై*

లోభివానికి తన సొమ్ము కర్చుగుచుండగా చూచుటయే నరక మనుభవించుట.
- *చిలకమర్తి, అపూర్వనరకము*

నరకాసురుడు

ఒక్క నరకాసురుని చంపడానికి సాక్షాత్తూ యిద్దరు దేవతలే కావలసి వచ్చారు. మరి నేడు ఇందరు నరకాసుల మట్టుబెట్టడానికి ఎందరు శ్రీకృష్ణ సత్యభామలు కావాలి?
- *బుచ్చిరెడ్డి, ఎప్పుడొస్తుంది దీపావళి*

నరసింహుడు

ప్రతి హింసను చేబట్టిన
ప్రతి నరుడూ నరసింహుడె
- కాళోజీ, విప్లవవహ్ని

నరుకుడు

అట్నుంచి నరుక్కు రమ్మన్నారు.
- *గురజాడ, కన్యాశుల్కం*

నర్తకుడు

నాన విడిచినఁగాని నారియే నాట్యమాడలేదు. అట్టిచో నట్టు చేయు పురుషుఁ డెంత లజ్జారహితుఁడై యుండవలయును?
- పానుగంటి, విప్రనారాయణ

నర్సు

నర్సు ముండలికి అంత ఒయ్యారం పనికి రాదు.... బోర విరుచుకొని పేషెంట్‌ల మీద పడిపోకపోతే వైద్యం కుదరదా?
- పతంజలి, అప్పన్న సర్దార్

నలుపు

కోడలు నలుపైతే కులం అంతా నలుపంటారు.
- మహీధర, కత్తుల వంతెన

నల్లపూస

ఆడదాని మెళ్ళో నల్లపూసలుంటే నూరు పాపాలు కాస్తాది.
- *బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!*

నల్లి

ఉల్లాసమెంత కల్గిన
నల్లీ! నీవున్న యెడల నరునకు నిద్రా
భ్యుల్లసనం బది సున్నయె
తల్లి గలుగు వేశ్యఁదగులు తరుణు సుఖగతిన్.
- *తి.వేం., శతావధానసారము*

నవకవిత

ఇది నవకవిత
సూటిగా వున్నను
అర్థంకాదు.
- సోమరాజు, ఇది మయసభ

నవల

నూరు కవితలైనా ఒక్క నవలకు సరిరావు.
- శ్రీరమణ, న్యూసుడి

నవీన స్త్రీ

భర్తకోసం వెతకడం, భర్త దొరికిం తరువాత తగాదాలు, ఈర్ష్యలూ, దాంపుకోడాలూ, నటనలూ, భర్త దొరక్కపోతే రహస్య ప్రియులు ఇవీ నవీన స్త్రీల చరిత్రలు.
- చలం, మ్యూజింగ్స్

నవ్వు

ఏ ఆశా లేనివాడి నవ్వులో ఏడు వుంటుంది. ఒక్కోసారి ఎంతో అందం వుంటుంది.
- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

నన్నుఁజూచి వారు నవ్విన పక్షమున వారినిఁ జూచి నేను నవ్వెదను.
- *చిలకమర్తి, గణపతి*

పిచ్చెత్తకుండా వుండటం కోసమే నవ్వు.
- బుచ్చిబాబు, ఉత్తమా యిల్లాలు

కష్టసమయంలోనే ఓర్పు హాస్యదృష్టి పనికొస్తాయి. మనల్ని చూసి మనం కాసేపు నవ్వుకో

గలిగేవాళ్ళే ఉత్తమశ్రేణి మానవులు
- బుచ్చిబాబు, ఉత్తమాయిల్లాలు

నవ్వులో, గొప్ప నవ్వులో వున్న ఔన్నత్యం దేంట్లో వుంటుంది? అందువల్లనే షేక్స్పియర్, కాళిదాసూ గొప్ప వేదాంతాన్ని court fools (కోర్టు ఫూల్స్) చేతా, విదూషకుల చేతా మాట్లాడిస్తారు. పి.జి.ఉడ్‌హౌస్ నవ్వులో, డిక్కెన్సు caricatures (కారికేచర్స్)లో, చార్లీ చాప్లిన్ చిత్రాలలో ఎన్ని కన్నీళ్ళు? ఎంత వేదాంతం?
- చలం, మ్యూజింగ్స్

నవ్వటంలో ఒక సత్య పరిశీలనా దృష్టి ఒక నీతి బోధ లేకపోలేదు.
- మునిమాణిక్యం, మనహాస్యము

నవ్వు పైవారిలోనే యంటురోగ మైనపుడు
భార్యాభర్తలలోఁ గాకుండునా?
- పానుగంటి, సరోజిని

నుదిటి బొట్టులా, ముక్కు పుడకలా, సిగలో పువ్వులా ముఖానికి నవ్వు పవిఁటకు జలతా రంచులాంటిది.
- పురాణం, నాపట్టుచీరా కన్నతల్లీ

ఎవరైనా నవ్వితే ఆ నవ్వు గోడకు వాల్‌పోస్టర్ అంటించిన ట్లుండకూడదు.
- పురాణం, నాపట్టుచీరా కన్నతల్లీ

ఆడదాని నవ్వు - అసహాయంగా వున్న మొగాడ్ని ఎంత రెచ్చగొడుతుందో!
- బీనాదేవి, అతి సర్వత్ర వర్జయేత్

నమ్మకాలు లేని మనిషి నవ్వలేడు
నవ్వలేని మనిషి బతకలేడు.
- సౌభాగ్య, సింహావలోకనం

నవ్వేసెయ్యి - మనసు తేలికపడుతుంది.
మెదడు ఆలోచించగలుగుతుంది.
- సరస్వతీదేవి, ఓ గూటిపక్షులు

నవ్వడానికి శక్తి వుంటే ఎంతటి కష్టాలనైనా ఆడుతూ పాడుతూ ఎదుర్కోగలం.
- లక్ష్మణరావు, అతడు-ఆమె

అలతి నవ్వు ప్రగల్భతాహంకరణము
కాదు కాదంట వాచావిగర్హణంబు
పలుకకుంట తిరస్కారకలనముద్ర
- శ్రీనాథుడు, శృంగారనైషధము

రుచికి లొట్ట యెట్టిదో వాచాటతకు వెఱ్ఱినవ్వట్టిది.
- పానుగంటి, ముద్రిక

పెద్దవాళ్లకు, మహాత్ములకు సామాన్యుల కష్టాలూ, దుఃఖాలూ నవ్వు తెప్పిస్తాయి కాబోలు.
- శ్యామలారాణి, పవిత్ర

చెప్పడం తేలిక, నవ్వినట్టు
చెయ్యడం కష్టం, నవ్వాపుకున్నట్టు.
చెప్పినట్టు చేస్తే దరహాసం
లేకుంటే తప్పదు పరిహాసం.
- రాధాకృష్ణశర్మ, శాంతిసూక్తం

నశింపు

కోర్టులో తెలివితక్కువ అబద్ధం, తెలివిగల అబద్ధం చేత నశిస్తుంది.
- చలం, అప్పుడూ-ఇప్పుడూ-ఆరాత్రి

నశ్యం

పడిసెమ్ము పట్టినప్పటివేళ నీటిని
హరియింప నెద్ది దివ్యౌషధంబు?
హరికథ వినువేళ నరుదెంచు నిద్రయన్
వ్యాధికై యెద్ది తుపాకి దెబ్బ?
మఱచిపోయినయట్టి మాట తెల్పుటకై
యెయ్యది దేవీనిభృత వరంబు?
రాజరాజులకైన రమణ యాచనలను
జేయఁగా నెద్ది జేజేల చెట్టు?
గట్టి లంకాకు కమ్మగాఁ గాచి నూఱి
సుధయు హైయంగవీనంబుఁ జొనిపి పొగపు
వెట్టి బొబ్బిలికాయలో వేసినట్టి
పొడుముఁ బీల్చునివార లీపుడమిఁ గలరె?
- తి.వేం., శతావధానసారము

నస్యము శీతమత్తగజ
నాశనహేతు విచారధీరపం
చాస్యము, సుస్తిరోగనిబిడాంధ
తమః పటలార్కబింబసా
దృశ్యము, వేదశాస్త్రపటు
దివ్య సుపండిత వాగ్విచిత్రసా
రస్యము, రాజవశ్య, మహి
రాణ్మణికైన నుతింప శక్యమే!
- చాటువు

పొడుం పీల్చేవాళ్ల బతుకే చెయ్యి చాపడం.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, యావజ్జీవం హోష్యామి

మట్టపొగాకులో నడుమ
మందము గల్గిన చోటఁ దీసి, తాఁ
బట్టుగఁ బక్వశుద్ధిగను
బాగుగఁ గాచి, యొకింత సున్నమున్

బట్టను వ్రేలనొత్తి తన బల్మికొలందిగ నల్పి
నశ్యమున్ బట్టపుడబ్బిలో నునిచి
ప్రాజ్ఞుల కిచ్చినఁ బుణ్య మబ్బదే
- చాటువు

నష్టం

గోడకు పెట్టిన సున్నం, లంజకు పెట్టిన సొమ్ము తిరిగి రావు.
- సామెత

బాపన సేద్యం బడుగుల నష్టం
కాపుల చదువు కాసుల నష్టం
- సామెత

సరసము విరసము కొఱకే
పరిపూర్ణ సుఖంబు లధిక బాధలకొఱకే
పెరుగుట విఱుగుట కొఱకే
ధర తగ్గుట హెచ్చు కొఱకె తథ్యము సుమతీ!
- బద్దెన, సుమతీశతకము

నాకు

మూఁగవోయిన నా గళమ్మునను గూడ
నిదురవోయిన సెలయేటి రొదలు కలవు.
- దేవులపల్లి, నేనుకూడ

నా కుగాదులు లేవు
నా కుషస్సులు లేవు.
- దేవులపల్లి, ప్రవాసము

నాకు నిశ్వాసతాళ వృంతాలు కలవు
నాకు గన్నీటి నదుల దొంతరలు కలవు
- దేవులపల్లి, కృష్ణపక్షము

నాగరకత

బట్టలేసుకుని నగ్నత్వంలోకి పారిపోతుంది నాగరికత.
- నగ్నముని, కొయ్యగుర్రం

మంత్రగాళ్ళు మనుషుల్ని చంపుతారు. చేతబడులు చేస్తారు. హింసిస్తారు. కానీ నాగరికత ముసుగులో మనిషి, సాటి మనిషిని ఎంత తేలిగ్గా చంపుతున్నాడు?
- వీరేంద్రనాథ్, తులసి

సామాన్య గృహస్థుల జీవనం చాలా దుర్భరంగా మాఱడానికి నూతననాగరికత కారణంగా కనపడుతూ వుంది. ప్రతి వృత్తికీ అడ్డంకి కల్గింది. తుదకు క్షౌరము చేసుకొని జీవించే జాతికి కూడా అడ్డంకి.
- వెళ్లపిళ్ల, కథలు-గాథలు

నాగరికత అంటే దొరలదే కాని మనకేమి ఉంది?
- మొక్కపాటి, బారిష్టర్ పార్వతీశం

నాగరికతలో వుండే విశేషమే అది. ఛస్తే పైకి తేలదు. లోలోపలే కుళ్ళి, పైకి యెంతో మర్యాదగా నటిస్తూ, చివరికి కోర్టెక్కుతాడు.
- బుచ్చిబాబు, దారినపోయేదానయ్య

మనసులో వుద్దేశమొకటి, పైకి చెప్పేదొకటి, ఇదేగా నాగరికత అంటే!
- యజ్ఞన్నశాస్త్రి, విశ్వం పెళ్లి

ఈ నాగరికత ఒకవంక మనిషికి గొప్ప శక్తి నిస్తున్నది గాని మరోవంక నిర్వీర్యపరుస్తున్నది.
- కొడవటిగంటి, ఐశ్వర్యం

నాగరికత ముదిరిన కొద్దీ ప్రతి చిన్నకార్యక్రమమూ, ఒక నానుడు వ్యవహారంగా పరిణమించింది.
- రాజారాం, కారణభూతుడు

మానవులు హత్యలు చేస్తారు. జీవాల్ని చంపుతారు, మాంసం తింటారు, రక్తం తాగుతారు. కాని తినటంలోనూ, తాగటంలోనూ మానవుడు అనుసరించే పద్ధతులలో నాజూకుతనముంటుంది. దాంట్లో మానవ నాగరికత ప్రతిబింబించుతూ వుంటుంది.
- సూరి, చంఘీజ్ ఖాన్

మానవ నాగరికత రాజ్యాలకోసం పోట్లాడుకోవడంతో ప్రారంభమై గాలికోసం, నీటికోసం పోట్లాడుకునే దాకా వచ్చింది.
- సదానంద, రామదాసు చెర

మానవుడి నాగరికత అంతా అతని స్వేచ్ఛకేదో రూపంలో బంధనాల కల్పనకేనా?
- మహీధర, కత్తుల వంతెన

మన instincts చేసే ఆడావుడి బైటికి కనబడకుండా ప్రయత్నించటమేగా నాగరికతకి ప్రథమ లక్షణం?
- చలం, అరుణ అర్ష్యమెంటు

ఏనాటి వరములో
యీ నాగరీకాలు
పాటలో తన పరువె
బతుకులో బరువటే!
- నండూరి, నాగరీకాలు

ఎవరి డబ్బా వారు కొట్టుకోవడం కంటే ఒకరి డబ్బానొకరు కొట్టుకోవడం నాగరీకంగా, నాజూ

కుగా వుంటుంది.

- పార్థసారథి, సువర్ణలాంగూల ప్రదానం

లేని యోగ్యత ప్రకటింపఁ బూను టొండె
నాగరక లక్షణాగ్రగణ్యము తలంప

- గోపాలరావు, అపూర్వ సంఘసంస్కరణము

**నాటకం**

కవిత్వం అనువదించటమే నిరుపయోగం. నాటకానువాదాలు ఇంకా నిరుపయోగం.

- కొడవటిగంటి, ట్యూటర్

నాటకం అవతారం వంటిది. టాకీ విశ్వరూపం వంటిది.

- భమిడిపాటి, టాకీ

ఆడేవాళ్ల నాటకం కంటె చూసేవాళ్ల నాటకమే గొప్పదైపోయింది.

- భమిడిపాటి, బాగుబాగు

యీ నాటకాలు వచ్చి సౌకర్యం తెచ్చాయి.

- కొడవటిగంటి, మహాకవి

జీవితమే ఒక నాటకం... మనమంతా వేషాలు వేస్తున్నాం... నాటకాల్లో వేషాలు వేసేవాళ్ళు రంగులు తుడిచేసి బయట తిరుగుతారు. మనం రంగులు వేసుకొనే ఇంటా బయటా తిరుగుతాం. అంతే తేడా!

- ఆత్రేయ, చావకూడదు

నాటకకర్తలే యాఁడువారినిఁ జిత్రింప నెంచి మగతనము చెడిన మగవారిని సృష్టించుచున్నారే. అట్టిచో నాటకకర్తల మాటల ననుసరించి మిడుకవలసిన నటకు లాయాఁడువారి ననుకరించుట అసాధ్యము.

- పానుగంటి, సాక్షి

సుఖమనునది యున్న యెడల నది మిగులఁ దక్కువగ నున్నట్లు కనఁబడుచున్నది. ఇట్టి ప్రపంచనటనకు నాటకకవిత పరమార్థ ప్రతిబింబముగ నుండవలసియున్నప్పుడు సుఖాంత నాటకములకంటెగా గష్టాంతనాటకము లెక్కువఁ నుండవలసినట్లు కనఁబడుచున్నది.

- పానుగంటి, సాక్షి

**నాటు కాగడాలు**

యీ నాటు కాగడాలు వూదితే గొంతుక పట్టేస్తుందోయ్.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

**నాది**

నన్నయ నుండి నాదాకా
తెలుగు కవిత అంతా నాది

- కుందుర్తి, స్వేచ్ఛాగీతి నా మార్గం

**నాంది**

స్నేహమునకు సంభాషణయే కదా నాంది.

- రావిశాస్త్రి, విషాదం

**నా బతుకు**

ఓ హంసి నీచేత నున్నయది నా బ్రతుకు.

- పింగళి, ప్రభావతీ ప్రద్యుమ్నము

**నామం**

నీమం కోసం నామం పెడితే నామం నాకొంప తీసింది. (నామం చూసి, బోజనం చేసినాడను కొని అన్నానికి పోతూ పిలవలేదట)

- సామెత

**నాయకుడు**

రాబోయే నాయకుని
రానీయ డిక మానవుడు.

- బైరాగి, ఇంక కవిత లేదు

పాట్లుబడి మీఁద దొరయైనవాఁడు ధర్మ
నీతిమార్గంబు నడుపగా నేరఁగలఁడె?

- వేంకటకవి, మదనగోపాల శతకము

సంసార జీవితంలో నెగ్గలేని వారందరూ దేశనాయకులే.

- బుచ్చిబాబు, స్వతంత్ర జీవులు

జనగణమన అధినాయకు డెవరనుకున్నారు? జార్జి మహారాజు.

- మారుతీరావు, మళ్లీ మధుమాసం

ప్రజలు అభిమానంతో నిల్పే నాయకుడు యెప్పుడు జారిపోతాడో తెలుసుకోలేడు.

- కాంతారావు, వంశధార

ఎదుటివాళ్ళ చేతకానితనం మీద, తన నైచ్యం మీద బ్రతికే వ్యక్తి పేరు 20వ శతాబ్దంలో 'రాజకీయ నాయకుడు'.

- మారుతీరావు, నిజం నిద్రపోయింది

మన మందినాయకులకి శానామందికి దేని గురించీ తెలీదు. తెలుసుకోవాలన్న సంగతీ తెలీదు.

- కాళీపట్నం, కుట్ర

వ్యక్తిగతంలో ఏ ఒక్కడిలోనూ వీరధర్మం అని గాని, పిరికితనమని గాని ఏదీ వుండదు. పది

మందీ కలవంది ఏ మహత్కార్యాన్నీ ఏ ఒక్కడూ సాధింపలేడు. పదిమందీ సాధించిన కార్యాన్నే ఏఒక్కడికో అంటగట్టి వాణ్ణి బ్రహ్మాండ నాయకుడంటూ వాడివల్ల బ్రతికేవాళ్ళు స్తుతి పాఠాలు చేస్తారు. దాంతో ఆ కార్యాన్ని సాధించిన అసలు జనం సంగతి అజాపజా లేకుండా పోతుంది. పిరికితనమన్నా అలాంటిదే. కార్య సాధనకు కావలసిన జనాన్ని మద్దతు తెచ్చుకోలేక అపజయాన్ని పొందిన ప్రతివాణ్ణీ, వాడు ఏమీ చేయలేని అసమర్థ స్థితిలో ఉండగా చూసి పిరికివాడి క్రింద జమగట్టి వాడి శత్రువులు అల్లరి చేస్తారు.

- సూరి, చంఘిజ్ ఖాన్

ఎదురు తిరిగితే దొరలంతా కాయితం పులులే.

- రాజయ్య, ఎదురు తిరిగితే...

వంచన నొక శిల్పంగా
పెంచిన ఘను లెవ్వరురా?
సర్వ కళా నిష్ణాతులు
శాసకులే గురువరా!

- మల్లారెడ్డి, యక్షప్రశ్నలు

కథల్లోనే మళ్ళీ కన్పిస్తారు, పోయిన నాయకులు.

- రావిశాస్త్రి, మెరుపు మెరిసింది

చదువు కోకుండా తిరిగితే డక్కాముక్కీలు తిని, అట్లీస్ట్ ఒక నాటికి కాకపోతే ఒకనాటికైనా లీడర్ కావచ్చు.

- రామదాసు, మాస్టర్జీ

గౌరవింపంగ దగ్గ శిఖండి వీవు
నీదు మార్గాన నీయంత నేత లేడు!!

- మాచిరాజు, ఎందుకో! ఎవరిమీదనో!

నా దేశంలో నాయకుడు
ఇక్కడ
ఓట్లలో మునిగి
అక్కడ
ఢిల్లీలో తలెత్తుతాడు.

- రాజేంద్ర, గుండెచప్పుళ్లు

నారదుడు

మంచికీ చెడుకూ లడాయి పెట్టి, మధ్యలో నుంచుంటాడు అవకాశాల నారదుడు.

- కుందుర్తి, ప్రజోద్యమ

నారికేళ పాకం

ఆడవాళ్ల హృదయం నారికేళ పాకం లాంటిది.

- రాజమన్నారు, దెయ్యాల లంక

నాలుక

నరుడి నాలిక మంచీ పలుకుద్ది, సెడ్డా పలుకుద్ది.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

నరంలేని నాలుక, ఏం జారుతుందో!

- సరస్వతీదేవి, మంచివాడు

మనిషి నాలుక ఒక మాంసఖండం మాత్రమే. దాని ద్వారా మహాభాష్యాలు పూర్తిగా వ్యక్తమవుతా యనుకోవడం అవివేకం.

- రామమూర్తి, అగ్నిగర్భ

నావి

నా పేరే కవిత
నా వూరు సమత!

- రాధేయ, నగ్నసత్యం!

నాస్తి

జెనాన్ని పోలీసోడు సితగ్గొట్టి సిత్తరయింసలెట్టి సావబాది సెవులు మూసిన్నాడు దేవుళ్ళేడు.

- రావిశాస్త్రి, బంగారిగాడికథ

నాస్తికుడు

లేని భగవంతుని సృష్టించి యా భగవంతుఁడు లేఁడన్న వానిని నాస్తికుఁ డనుట వెఱ్ఱివారలు నేర్చికొనిన తెలివితేటలు.

- విశ్వనాథ, వేనరాజు

నాకు నాస్తికులంటే అభిమానం. వారి మనస్సు మంచిదిగా వుంటుంది.

- రాజమన్నారు, మనోరమ

గుండెలో లేని దేవుడు
గుడిలో ఉన్నాడని నమ్మేవాడు
అందరికంటె పెద్ద నాస్తికుడు.

- ఇరివెంటి, పూజ

నీకు కవితే దేవుడైతే
నాస్తికుడనే నింద యింకెందుకు మొయ్యాలి?

- కుందుర్తి, కవిత్వం తలుపుతట్టింది

నిక్కృష్టం

పరాయి స్త్రీ నెరుగని కొంతమంది భర్తలు చాలా విషయాల్లో నిక్కృష్టులు.

- కవనశర్మ, తూర్పు-పడమర

దృశ్యశత్రువులకు వెఱవనివాఁ డదృశ్య నిర్గుణ నిరాకారుఁడగు నొక యసంభావ్యునకు వెఱవఁడు. క్షుత్పిపాసానిద్రలు నిక్కృష్టములైన, స్త్రీలోలతయు నిక్కృష్టమే.

- కూచి, రూపలత

నిక్కం

నిండె నసుము నిండె నిండె నిక్కంబునకున్.

- తిక్కన, విరాటపర్వము

నిక్ నేమ్

నిక్ నేం ఎల్లా ప్రయాణిస్తుందో తెలుసునా? మైలకబురు, కొంపలంటు కోవడం, పరీక్ష ఫేల వడం, వ్యాజ్యం పోవడం- వీటి మోస్తరుగా వ్యాపిస్తుంది. పైగా అది పాకడంలో తామర! ఎంచేతంటే ఇందులో ఏడిచేది ఎప్పుడూ ఒకడే. గనక, దీని ప్రాపగాండా లోటు లేకుండా నిము షంలో జరుగుతుంది.

- భమిడిపాటి, బాగుబాగు

నిగూఢం

ఆలోచన, అనుభవము, మననము నిగూఢ సత్యమును బయల్పరచగలవు.

- దీక్షితులు, దసరాదిబ్బ

నిగ్గు

ఏ మనిషి మంచివాడో నిర్ణయించచ్చు చివరికి ఏ గడియారం రైటో తేల్చచ్చుగాని ఏ మెథడ్ మంచిదో చెప్పలేం.

- భమిడిపాటి, బోధనా పద్ధతులు

వైద్య మొక్కటి మంత్ర మొకటి భక్తి యొకటి
కవిత యొకటి పైసరస మొక్కటియుఁ బూర్వ
వయసులోకంటె నుత్తర వయసునందె
కడునికర మౌచు నిగ్గొచు ఘనతఁ జెందు.

- పానుగంటి, వీరమతి

నిగ్రహం

ఆత్మనిగ్రహం లేనివాడు అపజయం పొందు తాడు.

- కొడవటిగంటి, పెళ్లిచెయ్యకుండా చూడు

తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోడానికి నిగ్రహించటం ఎంత అవసరమో, నిగ్రహం చూపటం కూడా అంత అవసరమే.

- మహీధర, స్వయంవరణం

నిఘంటువు

వ్యాకరణ మొక్క త్రోవ మ
హాకవు లొక త్రోవ కోశ మఖిల మ్మొకత్రో
వై కనుపట్టెడి

- వేళ్ళపిళ్ల, కథలు- గాథలు

నిఘా

మనసు మీద శరీరం గుడ్డి నిఘా వేస్తుంది; శరీరంమీద మనసు వ్యర్థవిప్లవం సాగిస్తుంది-

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

నిజం

నిజం నిన్ను
నీడగా వేటాడుతుంది.

- అఫ్సర్, ఆకాశంలో సగం

డిసెక్ట్ చేసిన శవాల్లో
నిజాలు సజీవంగా ఉంటాయి

- వసీరా, దేశభక్తులు

బతికివున్నవాడు నిజం చెప్పడు
శవం మాట్లాడలేదు.

- నగ్నముని, కొయ్యగుర్రం

ప్రకృతిలోగాని వికృతిలోగాని దానవత్వపు అంధకారమే నిరంతరం మనుషుల్ని పాలించే నిజం.

- నగ్నముని, కొయ్యగుర్రం

రాజుల దర్జాలా - ప్రజల దరిద్రమా - ఏది నిజం?

- లక్ష్మణరావు, అతడు-ఆమె

జీవితం నిజం; అందులో బతికి చావడం నిజం, అందులో చంపి బతకడం నిజం!! అందులోని సుఖం నిజం, అందులోని దుఃఖం నిజం!!

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

ఎప్పుడూ నిజం చెబితే అబద్ధాలకోరుకింద జమకడుతుంది సమాజం.

- బుచ్చిబాబు, రాజమార్గం

(నిజం) నిజం కాకపోవడంకంటె విషాదకర మైన నిజ మేముంది?

- బుచ్చిబాబు, ఆత్మవంచన

అందుకనే పెద్దలు పూర్తి నిజం చెప్పవద్దంటారు.

- బుచ్చిబాబు, ఒకేనిద్ర-ఎన్నోకలలు

నిజం నిజంగా భాసించదు
నీవనే రిక్షాలో ఎక్కి
ముసుగేసుకుంటుంది ఘోషాసుందరి.

- కుందుర్తి, నాలోని నాదాలు

నిజం దాగదు. బయటపడి తీరుతుంది.

- కొడవటిగంటి, నిజం దాగదు

నిజం తెలిసిన వాళ్ళవల్ల ప్రమాదం ఉంది.

- కొడవటిగంటి, వెయ్యిన్నొకటి

మనం నిజాన్నీ దేవుణ్ణీ కూడా ఎరగం, గనక, నిజం దేవు డెరుగునని నమ్మితే నమ్మచ్చు

- భమిడిపాటి, బస్తీ-దుమ్ము

ఓసారి నిజం చెప్పి మొట్టికాయలు తింటే రెండో సారి నిజం చెప్పకూడదు.

- ముళ్లపూడి, బుడుగు

లాగుడు లేని సాగుడు ఉండదు.

- భమిడిపాటి, ధుమాలమ్మ ఓషాయిత్యం

నిజ విషయం ఎవరు చెప్పిన ఒకే లాగున వుంటుంది.

- నంది, మనిషి చావకూడదు

మనిషి బతుకులో తిండి ఒక్కడే ప్రధానం కాదన్నమాట ఎంత నిజమో, ఆ మనిషి బతుకు తిండి మీదనే ఆధారపడివున్నమాట కూడా అంత నిజం

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

సత్యవాక్యములు తఱచుగాఁ జెవులకు వెగటు గానే యుండును.

- కూచి, రూపలత

పూర్తి సత్యం ఎప్పుడూ భయంకరంగానే ఉంటుంది.

- మారుతీరావు, నిజం నిద్రపోయింది

కొంచెముగనొ, గొప్పగనొ నిజములేక యే మాటయుఁ బుట్టదు

- కొచ్చెర్లకోట, అపవాద తరంగిణి

ఒక్కొక్కప్పుడు నిజం కూడా పచ్చి అబద్ధమై కూచుంటుంది.

- ముద్దంశెట్టి, తప్పించుకోలేవు

నిజం చెప్పి చావటం కంటె, అబద్ధం చెప్పి బ్రతకటం మంచిది.

- కృష్ణరావు, పాపికొండలు

సూసినట్టు సెప్పితే అబద్ధం, ఉన్నట్టు సెప్పితే నిజం...

- కాంతారావు, వంశధార

సాగింది నిజం, సాగంది దబ్బర.

- గురజాడ, బిల్హణీయము

హజము రాజ్యము చేయునప్పుడు
నిజము నిద్దుర పోవుచుండును.

- ఆరుద్ర, త్వమేవాఽహమ్

తలవని తలంపుగా ఎదురు తగిలినప్పుడు నిజం అబద్ధంకన్నకూడా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

- కొడవటిగంటి, ప్రేమించిన మనిషి

లోకంలో మనుష్యులు తమ అవసరాలనుబట్టి గోరంతలు కొండంతలు చేస్తారు. కొండంతలు గోరంతలూ చేయవచ్చు. అంతమాత్రాన వాటి నిజస్వరూపం అదే అనుకొని భ్రమపడటం తెలివి తక్కువ.

- కాశీపట్నం, అభిమానాలు

ప్రతివాడూ తన నిజస్వరూపం ఎవరో వొకరి ముందు బయటపెడతాడు.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

తెలుగు సినిమా తారలు పూసుకునే రంగులూ, కట్టుకునే బట్టలూ, ఉండలూ, తీసేసి అసలు స్వరూపాన్ని ఒక్కసారి చూపారంటే, ఇంక ఎటువంటి ప్రేక్షకుడూ ఆ సినిమాల వేపు పోడు.

- చలం, మ్యూజింగ్స్

పెదవిమీద సామ్యవాద మంత్రం
హృదయంలో ధనికవాద తంత్రం

- శ్రీశ్రీ, ఉగాది స్వగతాలు

ఒకటికి రెండుసార్లు పరీక్షిస్తేగానీ ఏ విషయాన్నిస్పష్టంగా చెప్పలేము. అప్పుడు గాని నిజమైన సత్యం వెలికి రాదు.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

**నిజానిజాలు**

డబ్బు మూలుగుతుందంటారు. నిజానిజాలు డబ్బున్నవాళ్ళకి తెలియాలి.

- రావిశాస్త్రి, కలకంఠి

నిజానిజాలు చెప్పే వ్యక్తినిబట్టి వుంటాయి.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

అబద్ధం దుక్కలా వుంటుంది
నిజం బక్కగా వుంటుంది
నేటి న్యాయస్థానంలో
గెలిచేదానిపేరు అబద్ధం
ఓడిపోయేదానిపేరు నిజం.

- సూర్యప్రకాశ్, నిజం-అబద్ధం

నిన్నటి రాత్రి ఒక కల
నేటి ఉదయం ఒక వాస్తవం.

- గౌరీశంకర్, హృద్ఘోష

ఒక నిజానికి ప్రాణం తీసేశక్తి ఉన్నప్పుడు మరొక అబద్ధానికి ప్రాణంతీసే శక్తి అంతకన్నా ఎక్కువ ఉంటుంది.

- విమలారామం, కిరణ్మయి

**నిజాయితీ**

టేటస్‌లో అయితేనేంటి, డబ్బులో అయితేనేంటి,

అధికారంలో అయితేనేంటి, దేంట్లోనయినా సరే నిజాయితీగా బ్రతికి ఏ ఒక్కడూ కూడా పెద్దోడు కాజాల్డు. అది యేదవాక్కు.

- రావిశాస్త్రి, విషాదం

పదవిపోతేపోయింది లాల్చీలు వృధా అవుతా యన్నాట్ట!

- శ్రీరమణ, న్యాయుడి

నిజాయితీ లోపించడంవల్ల వ్యక్తి, ఆ వ్యక్తుల సముదాయమైన సమాజం, ఆసమాజానికి మనుగడయైన దేశం, ఏదీ బాగుపడదు.

- చిరంజీవి, వంశాంకురం

కాసులకోసం
కాదా కామందుల కోసం
లేదా ఆమందుల కోసం
పోగా ఆ మందుల కోసం
కాక
ఆ గిలికేదేదో
లేదా నువు పలికేదేదో
తాజాగా తీజాగా
సజావుగా సవాలుగా
చెప్పేసేయ్! వప్పేసేయ్!
నవకవీ! యువకవీ!
నిజాయితీగా బ్రతికేసేయ్!

- హర్షవర్ధన్, ఆటుపోటులు

కచ్చితమైన నిజాయితీ అప్పటమైన వేరుశనగ నూనె లాంటిది.

- రాజారాం, కారణభూతుడు

గర్భదరిద్రులలో కూడా నిజాయితీ, ఆత్మాభి మానమూ చూశాడు.

- కొడవటిగంటి, చదువు

## నిట్టూర్పు

చచ్చిన వాళ్ళకి అశ్రువులు, బతికున్న వాళ్ళకోసం నిట్టూర్పులు.

- కొడవటిగంటి, బెదిరిన మనుషులు

## నిత్య దరిద్రం

ఏదుము తిన్నా ఏకాదశే, పందుము తిన్నా పరగడుపే.

- పూర్ణానందం, నవ్వేమేళం

## నిదర్శన

వండా లేదు, వార్చా లేదు, ముక్కున మసెక్కి డిదే అన్నట్లు.

- సామెత

ముందు వెనకలు మన భ్రమలు; నిన్న రేపులు వెర్రి. అక్కడ, ఇక్కడే అనే స్థలాలు మన అంధ త్వానికి నిదర్శనాలు.

- బుచ్చిబాబు, నాలుగోపరిమాణం

## నిదానం

మీనిఘంటువులో నిదానం అంటే నిప్పెట్టడమా?

- బుచ్చిబాబు, ఒకేనిద్ర - ఎన్నోకలలు

## నిద్ర

అలుక యెత్తినవానికి నర్థచింత
కునకు నాతురునకుఁ గామగోచరాత్ము
నికిని వచ్చునే విను నిద్ర?

- తిక్కన, సౌప్తిక పర్వము

బలవంతుఁడు పైనెత్తిన
బలహీనుఁడు ధనముఁ గోలుపడినయతఁడు ప్రము
చ్చిల వేఁచువాఁడుఁ గామా
కులచిత్తుఁడు నిద్రలేక కుందుదు రధిపా!

- తిక్కన, ఉద్యోగపర్వము

సుఖానుభూతి సమయములోఁ బడసిన నిద్ర యనుభవించినట్లుండదు. కాలవ్యయము జరి గినట్లుండదు. ఆ సమయము గూడ ననుభవిం పఁబడినట్లే యుండును.

- విశ్వనాథ, బద్దన్న సేనాని

దుఃఖానుభూతి సమయంలో నిద్ర కేటా యింపుగా నుండును!

- విశ్వనాథ, బద్దన్న సేనాని

నిద్రలో రాజుకీ జోగికీ భేదం లేదు.

- చలం, మ్యూజింగ్స్

నిద్ర యెలా యుండవలెననఁగా సాధారణమైన చప్పుళ్ళకు కేకలకు పిలుపులకు మెలకువ రాగూడదు.

- చిలకమర్తి, బ్రహ్మదేవునికిపూజ్యత...

వ్యధిత హృదయాలకు శాంతినిచ్చే శక్తి ఒక్క నిద్రా దేవతకే ఉంది.

- విహారి & శాలివాహన, సాగర సంగీతం

కళ్ళు మూసుకున్న వాళ్లంతా నిద్రపోరు.

- పినిశెట్టి, పంజరంలో పక్షులు

ప్రాపంచిక కష్టసుఖాలను తాత్కాలికముగా మరపించి శారీరకముగానూ, మానసికము గానూ శాంతిని కలుగచేసి చైతన్యము నిచ్చేది సుషుప్తావస్థ ఒక్కటే. అదే పేదవారి యెడల కూడా నిష్పక్షపాతముగా ప్రకృతి చూపించే సర్వసమత్వము.

- సరస్వతీదేవి, గళ్ళలుంగీ

ఎవరు నిద్రపోకపోయినా తెల్లవారుతుంది.

- రంగనాయకమ్మ, పేకమేడలు

తెల్లవారినాక నిద్రపోవడం దరిద్ర చిహ్నం.

- మహీధర, ఓనమాలు

కలతలూ, కష్టాలూ లేనివాడికి యిట్టే నిద్ర వస్తుంది.

- సూర్యారావు, రాత్రించరులు

కడుపు నిండితే కళాకారుడు హాయిగా కళ్ళు మూసుకు నిద్రపోతాడు. అతనిలోని కళా నిద్రపోతుంది.

- సూర్యారావు, నీలితెరలు

పుస్తకం పట్టందే నిద్దరెట్లా వస్తుంది?

- కొడవటిగంటి, జూదం

ఎంత తెలివి తక్కువవాడైతే, అంత తొందరగా నిద్దర పట్టేస్తాదని డాక్టర్లు చెప్పారు.

- పతంజలి, అప్పన్న సర్దార్

అధికారంలో వున్నా, లేకపోయినా రాజకీయ నాయకు డనేవాడికి తగినంత నిద్దరుండాలి.

- పతంజలి, అప్పన్న సర్దార్

చస్తానని చద్దన్నం తింటే చల్లగా నిద్ర వచ్చిందట.

- సామెత

ఇక్కాఁటగాముల లోపల
నొక్కటి నీ చిత్తవృత్తి నొందెనొ యొరు సొ
మ్మెక్కటిఁ గుడువఁ దలంచితొ?
నిక్కము కతమేమి సెపుమ నిద్ర చెడుటకున్?

- తిక్కన, ఉద్యోగపర్వము

చాలా బాధలకు మందు నిద్ర. రాత్రి పరి ష్కారం.

- ఇనాక్, ఆనందబాష్పాలు

## నినాదం

నినాదాల కత్తెర బోనులో నలిగిపోతోంది మనసు, బాధపడుతుంది, కాని గమ్యం బోధపడదు.

- కుందుర్తి, ఆశ

గోడమీది నినాదాలు
స్వాప్నిక పరిభాషా నిఘంటువులు.

- శ్రీనివాస్, ఉజ్వలనినాదం

నిజాయితీ లేని నినాదం వట్టినాదం.

- భీమన్న, విశ్వశాంతి

కాలగళంలో నినదిస్తున్నది
మానవత సమానతకోసం

- జయంతి, చెణుకులు

నిషా పెంచు నినాదాలు
నిప్పచ్చర మణచలేవు
నిస్పృత్తువ తీర్చలేవు
నీరసం వదల్చలేవు.

- పురిపండా, నాన్యఃపంథా

## నింద

ఏదో చేసిపోయినవాడు చేసిపోతే, తడికేసిన వాడికి తంటావచ్చిపడిందని.

- సామెత

నింద పడ్డవారెప్పుడును జెడ్డవారలు కారు.

- తి.వేం., పాండవప్రవాసము

నిర్హేతుకముగ నింద పైబడినను సజ్జనుఁడు దానిం బాపుకొనుట కర్తవ్యము.

- చిలకమర్తి, కర్పూరమంజరి

ఎట్టి యుత్తముల కైనను సమకాలికుల వలన నిందలు తప్పవు కదా?

- పానుగంటి, సాక్షి

నిరపాయమ్మై యుత్తల కార్యసాధనానుకూలమై నది వ్యభిచార నింద.

- హనుమంతరావు, లేడీ డాక్టరు

దగ్గరకు పిలిచి దాసరీ! నీ కన్ను లొట్ట అన్నట్లు.

- సామెత

## నింద్యత

ఘనకులమునఁ బొడమిన దు
ర్జనుఁడుం డిల నింద్యుఁ డగు వమన మూర్ధ్వముఖం
బున వెడలి మంచిదగునా?

- అడిదము, చాటువు

## నిపుణుడు

నా దగ్గరికి ట్రీటుమెంట్‌కు ఒకసారి వచ్చిన వారు మరి మానరండి. ఎన్ని సంవత్సరాలైన అలాగ వస్తానేవుంటారు... మన మంచితనం వల్ల అలా

వస్తుంటారండి.

- పతంజలి, అప్పన్న సర్దార్

నేను స్కిన్.. అంటే చర్మవ్యాధుల నిపుణుడ్ని.. చర్మానికి లోపల ఏముంటుందో మనకి సరిగ్గా అయిడియా లేదు.

- పతంజలి, అప్పన్న సర్దార్

నేను బ్రెయిను స్పెషలిస్టునండి . నా దగ్గర ఏ కేసు గంటకంటే ఎక్కువ ఉండదండి..

- పతంజలి, అప్పన్న సర్దార్

నిప్పురవ్వ

ఏదైనా, ఎప్పుడైనా, ఎక్కడైనా రాజుకునేది మొదట ఒక్క నిప్పురవ్వే. అందులో సత్యమనే ప్రాణముంటే నలుదిశలా వ్యాపించి జాజ్వల్యమానంగా వెలుగొందుతుంది.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

పొగ రావడానికి నిప్పురవ్వ కొంతైనా ఉండాలి.

- నంది, మనిషిచావకూడదు

నిబ్బరం

ఓటమి తరువాత నిలుపుకునే నిబ్బరమే మరలా విజయంవైపు మరలిస్తుంది.

- రామమోహనరావు, మోడల్

నియంత

పదవీ క్షయపీడిత నియంతృత్వ రాజకీయ రాబందులు చంపితేగాని చావరు.

- చెరబండరాజు, షో

నియమం

నియమము నాగరికత. నియమమును దాఁటి పోవుట పశువృత్తి

- విశ్వనాథ, చెలియకట్ట

నిరర్థకం

ప్రజలకు చేసే సేవ, శవానికి చేసే అలంకారం రెండూ నిరర్థకాలు.

- చిరంజీవి, బోలో స్వతంత్ర భారత్‌కీ జై

శాస్త్ర మాచార్యు సన్నిధిఁ జదువఁడేని
నిద్ధబోధంబు మది సంగ్రహింపఁడేనిఁ
దెగువ మీఱి ప్రతిజ్ఞ సాధింపఁడేని
జ్ఞాతిజయ మందఁడేని తజ్జనుఁడు జనుఁడె?

- శ్రీనాధుడు, కాశీఖండము

జనని దుఃఖమ్ము మాన్పని జన్మమేల?

- కాటూరి, మాతృస్తవము

నేను యముఁ డౌటయు
నాకు యముండు రావణుం.
డింతకు దక్షిణేశుఁడను
నేనొ! దశాస్యుఁడొ! చెప్పలేను, ప్రా
ణాంతకమౌ నిరర్థకది
శాధిపతిత్వము లేల మాకిటన్?

- విశ్వనాథ, రామాయణకల్పవృక్షము

నిరసన

కొత్తసంస్థల్ని నిరసించడం మానవస్వభావం

- భమిడిపాటి, మేజువాణి

జీవితంలో అనుభవం చాలని వాళ్ళు డబ్బు గురించి నిరసనగా మాట్లాడతారు.

- సూర్యారావు, నీలితెరలు

నిరాకరణ

ధనమదాంధుల కొలువేల? తాపసులకు.

- పోతన, భాగవతము

ఇతఁడు బ్రదుకక యున్నచో బ్రతుక నేను
నాకు రాజ్యమ్మువలదు, జానకి వలదును.

- విశ్వనాథ, రామాయణకల్పవృక్షము

నిరాఘాటం

తడకలేని యింట్లో కుక్కదూరినట్లు.

- సామెత

నిరాడంబరత

గొప్ప సత్యాలు గొప్పవాళ్ళమాదిరిగానే నిరాడంబరంగా ఉంటాయి.

- సామెత

నిరాదరణ

తన్ను తాను తృణీకరించినవాడు ప్రపంచాన్ని అంగీకరించలేడు.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

నిరాశ

జనత గాఢనిద్రాలగ్నము
కవిత దీర్ఘస్వప్న నిమగ్నము
ఈ సివిలిజేషను డొల్ల
ఇక భవితవ్యము కల్ల!

- ఆరుద్ర, ఇసుక గడియారం

జీవితంలో నిరాశపడటం మౌఢ్యం! ఆ నిరాశలో, వున్న ఆశను కూడా చంపుకుంటాం.

- ధనికొండ, ప్రొఫెసర్ బింధ్యన్

మానవుని జీవితంలో ఎన్నో నిరాశానిస్పృహలు

వస్తూనేఉంటాయ్ వాటిని ధైర్యంతో ఎదుర్కొనే శక్తి ఒక్క యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం కల వాడికే ఉంది.

- బుచ్చిరెడ్డి, అసమర్థుని ఆత్మహత్య

జీవితంలో నిరాశకు తావులేదు.

- బైరాగి, నాయకునకు సానుభూతి

కాలం జరగదు
కంఠం పలకదు
కదలదు భూగోళం.

- *రెంటాల, విగతం తరణమంత్రవైతరణి*

యుగయుగాల నైరాశ్యం
మన బ్రతుక్కి యమపాశం.

- కవిరాజమూర్తి, ఏకత

## నిరుత్సాహం

దేశకాలాలకి ఆక్రమణ గమనాలు ఉండటంచేత ప్రకృతిలో నాటకపు సంగీతానికి లాగ "వన్సు మోర్" ఉండవ్!!

- *భమిడిపాటి, అన్నీతగాదాలే*

## నిరుద్యోగం

నిరుద్యోగం ఓ సామాజిక వ్యాధి. వ్యక్తిగతమైన అదృష్టదురదృష్టాలతో దానికి నిమిత్తం లేదు.

- *మహీధర, దేశంకోసం*

## నిరుపయోగం

నవలకి తక్కువ కథకి ఎక్కువ.

- శ్రీరమణ, న్యూనుడి

ప్రమాణస్వీకారంనాడే ప్రభుత్వం పడిపోయి నట్టు.

- శ్రీరమణ, న్యూనుడి

పేడ కుప్పకు దిష్టిమంత్రమా?

- సామెత

టెలిగ్రాములో వ్యాకరణ దోషాలు వెదికినట్టు.

- శ్రీరమణ, న్యూనుడి

ఆవేశం అలసటగా
చైతన్యం వేడిలేని వెలుతురుగా
కలగా, అలగా, ఒకటీయని
జలగా మారిన వేళలందు
తెలుస్తున్నది చావుబ్రతుకు
లిక్కడ లెక్కకురావని.

- బైరాగి, నూతిలో గొంతుకలు

వీడని మూర్ఖునొద్ద నెఱి
విద్యలు రూఢికి రా, వదెట్లనన్
బూడిద హోమమై చవుటc
బూడ్చిన విత్తయి వెఱ్ఱిముండతోc
గూడిన కూటమై విధవ
కొప్పునc జుట్టిన పుష్పమాలయై
గాడిదవాహమై యడవిc
గాచిన వెన్నెలయై వృథాయగున్.

- చాటువు

కారములేని కూర, యుప
కారములేని మనుష్యుc, డాది నోం
కారములేని మంత్ర, మధి
కారములేని ప్రతిజ్ఞ, వాక్చమ
త్కారములేని వేశ్య, గుణ
కారము లేనటువంటి లెక్క, సా
కారము లేనిపాట కొఱగావు.

- చాటువు

గుడ్డికన్ను మూసినా ఒకటే, తెరచినా ఒకటే.

- సామెత

పద్దెము లోభికేల? మఱి
పందికి జాఫరుగంధమేల? దు
ర్మేధకు పంచదారటుకు
లేల? నపుంసకుండైన వానికిన్
ముద్దులగుమ్మయేల? నెఱి
ముక్కఱ యేల వితంతురాలికిన్?
గద్దకు స్నానమేమిటికిc గావలె?

- చాటువు

కవితల్ సెప్పినc బాడనేర్చిన వృథా
కష్టంబె యీ భోగపుం
జవరాండ్రే కద భాగ్యశాలినులు; పుం
స్త్వంబేల? పో పోcచకా?

- శ్రీనాథుడు, చాటువు

## నిర్ణయం

"తొందరపడి హాజీసాహేబు తురకల్లో కలిసిపోయినా" డన్నట్లు నావంటి బుద్ధిమంతుడు యేపనీచెయ్యకూడదు. దాని లాభనష్టాలు బేరీజు వేసి, జమాఖర్చుచేసుకొని మరీ డిసైడ్ చెయ్యాలి.

- *గురజాడ, కన్యాశుల్కం*

మనం ఒకటి దలిస్తె పెసిడెంటుగోళ్ళు ఉంకోటి దలుస్తరండి.

- రావిశాస్త్రి, సొమ్ములు పోనాయండి

ఆలోచనలతో గింజుకుంటూ కూచుంటే యేదీ

ముడిపడదు. యేదీ విడివడదు.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

నిర్ణయులు

వెలయాలు సుతుండు నల్లుండు
నిలపతియును యాచకుండు నేవురు ధరలోఁ
గలిమియు లేమియు నెఱుఁగరు.

- గువ్వలచెన్న శతకము

నిర్దోషి

ప్రపంచంలో నిర్దోషి అంటూ వుండడు.

- రెంటాల, ఇన్‌స్పెక్టర్ జనరల్

నిర్బంధం

ఎట్టి వారికి నిర్బంధము దగదు. దుర్మానంబు దుర్దశ నాపాదించు.

- తిక్కన, ఉద్యోగపర్వము

ఒక్కళ్ళనే అంటిపెట్టుకొని "యావజ్జీవం హోష్యామి" అనుకోడానికి గతంలో ధర్మం కారణం చేసారు. ఈనాడు ప్రేమ అంటు న్నారు. వాని వెనుకనున్న నిర్బంధం ఒక్కటే...

- మహీధర, కత్తులవంతెన

ఛస్తుంటె వచన కవిత్వం అన్నాట్ట!

- శ్రీరమణ, న్యూనుడి

నీ పిక్చరు ఫెయిలైంది- నా పిక్చర్ ప్రివ్యూకి రమ్మన్నట్టు.

- శ్రీరమణ, న్యూనుడి

నిర్భయం

తనకి తాను భయపడని వ్యక్తి తను మంచి అని విశ్వసించినదాన్ని చెయ్యగలడు.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

నిర్భయుడు

కాన నవశ్యముఁ బెనఁకువఁ
కాని యుపాయమునఁ బగుఁ గడతేర్చు ధృతిం
బూని నడచు నెవ్వండు డెం
దానం జెయి వెట్టికొని యతఁడు నిద్రించున్.

- తిక్కన, ఉద్యోగపర్వము

నిర్లక్ష్యం

చౌరవఁ గొని నఱకువానికి
నరివరుఁ డొక తృణము; దాత యగు నాతనికిన్
వరహాలు చింతగింజలు..

- చాటువు

నిర్వాకం

నిన్ననంతయుఁ దాఁ గదా నిర్వహించె?

- తిక్కన, విరాటపర్వము

నిలిచేవి

కలకాలం నిలిచిపోయేవి కొన్ని కొన్ని భ్రమలూ జ్ఞాపకాలే.

- పురాణం, ఆ ఉగాది మళ్ళీవస్తుందా?

నివారణ

కొన్నిటికి కారణం - నివారణ రెండూ ఒకేచోట ఉంటాయి. కాకపోతే మనం కనుక్కోవటం కష్టం.

- బుచ్చిరెడ్డి, తప్పు

నిశ్చలత్వం

కల్లోలిత సముద్రం మధ్య ఉన్న కొండలోనే దాని నిశ్చలత్వం రుజువయేది.

- కొడవటిగంటి, చెడిపోయిన మనిషి

నిశ్చింత

ఈ లోకంలో రెండురకాలవాళ్ళే అన్నివేళలా నిశ్చింతగా వుండగలరు. పరమ మూర్ఖులు! సంపూర్ణజ్ఞానులు!

- ఆనందారామం, మరోముందడుగు

నిశ్శంక

ఏ స్త్రీ తన భర్త తనపట్ల ప్రదర్శిస్తున్న అనురాగా న్ని శంకించదు. తను దానికి అర్హురాలని నమ్ము తుంది.

- కవనశర్మ, తూర్పు-పడమర

నిశ్శబ్దం

నిశ్శబ్దం చాపకింద నీరులా ఆవరిస్తుంది
శబ్దం నిశ్శబ్దంగా ఆవులిస్తుంది.

- సుభాష్‌చంద్ర, సుప్త చైతన్యం

నిశ్శబ్దం రాత్రికి పహరా కాస్తుంది.

- పెద్దిరాజు, ఫాల్...ఫాల్..!

నిశ్శబ్దాన్ని మృత్యువుతో సంకేతించవచ్చు.

- హెచ్చార్కె, నైలు

నిషా

మనస్సును నిషాలో నిద్రపుచ్చటం పిరికితనం.

- భారతీదేవి, సుడిగుండాలు

భూలోకంలో నిషా యమలోకంలోకి వచ్చినా దిగదు.

- చిలకమర్తి, యమధర్మరాజు కచ్చేరి

నిషిద్ధం

అలిగి అత్తవారింటికి, చెడి చెల్లెలింటికి పోరాదు.

- నార్ల, కొత్తగడ్డ

ఆడవాళ్ళతో బజారుకెళ్ళడం తెలివితక్కువ, ఫ్రెండ్‌తో బార్‌కి, పెళ్ళాంతో బజారుకీ వెళ్ళ కూడదు.

- బీనాదేవి, మిసెస్ అండ్ మిస్టర్ సక్సేనా

అంగన విషయంలో ఆసన విషయంలో అత్యంత రాలు పనికిరావు.

- రామదాసు, ఆకాశరామన్న

చెడి చెల్లెలింటికీ, బ్రతికి బావగారింటికీ వెళ్ళకూడదంటారు.

- సాంబశివరావు, తేనెజాబిలి

నిరీక్షణములో విసుగుండరాదు. ఆశలో విచార ముండరాదు.

- దీక్షితులు, శబరి

ఆడవాళ్ళను ఎప్పుడూ ముఖం మీద పొగడ కూడదు.

- విమలారామం, కిరణ్మయి

అజీర్ణవ్యాధితో బాధపడుతూ
ఆకలి మీద కవిత్వం రాయకు.

- అమ్మంగి, నాలో నేను

కోతికి బెల్లం చూపరాదు. కోమటికి ధనం చూపరాదు.

- సామెత

ఇచ్చేవానికి పత్రం వద్దు. చచ్చేవానికి మందు వద్దు.

- సామెత

చెడి స్నేహితునింటికి పోవచ్చునుగాని చుట్టా లింటికి (చెల్లెలింటికి) పోరాదు.

- సామెత

నిషేధం

బలవంతుల తోడి విగ్రహంబు పరిహరించుట లగ్గు.

- నన్నయ, సభాపర్వము

అన్యకీర్తనంబు నన్యనిందయుఁ దన్నుఁ
బరఁగఁ బొగడికోలుఁ బ్రబ్బికోలు
నాపగాతనూజ! యార్యవృత్తములుగా
వనిరి వీని నాద్యు లయిన మునులు.-

- నన్నయ, సభాపర్వము

...కృచ్ఛ్రంబుల సంశయయుత కార్యం
బులు గర్హ్యములు నియతములు వర్జ్యమ్ముల్.

- నన్నయ, ఆదిపర్వము

వఱదైన చేను దున్నకు
కఱవైనను బంధుజనుల కడ కేఁగకుమీ
పరులకు మర్మము సెప్పకు
పిఱికికి దళవాయితనము పెట్టకు సుమతీ.

- బద్దెన, సుమతి శతకము

తనవారు లేనిచోటను
జన వించుక లేనిచోట జగడము చోటన్
అనుమాన మైన చోటను
మనుజునకును నిలువందగదు మహిలో సుమతీ.

- బద్దెన, సుమతి శతకము

నడపకుమీ తెరు వెక్కటిఁ
గుడువకుమీ శత్రునింటఁ గూరిమితోడన్
ముడువకుమీ పరధనముల
నుడువకుమీ యొరులమనసు నొవ్వఁగ సుమతీ.

- బద్దెన, సుమతి శతకము

రజ్జులాడరాదు రణభూమి లోపల
బుజ్జగింపరాదు బొంకువాని
నొజ్జతోడ వాదు లొనరంగ మానరా

- వేమన

తాడు తెగేవరకూ లాగకూడదు.

- సరస్వతీదేవి, తంత్రిపోలిక

చెప్పులు ఉన్నవాడితోను, అప్పులున్న వాడితోను పోరాదు.

- సామెత

ఇవాళ సంఘర్షించని వాడు
రేపటి విజయోత్సవంలో వుండడు.

- హెచ్చార్కె, ఈత

మొగోడికి నిద్దరా, బద్ధకం ఉండకూడదు.

- రావిశాస్త్రి, పాపి

నిష్కారణం

బంధువులలో కోపాలు రావడానికి కారణం వుండ దు, ఉండక్కరలేదు!!

- కాళ్లకూరి, గరల్‌వైఫ్

ఎద్దు చేనుమేసిపోతే, గాడిదకు చెవులు కోసి నట్లు.

- సామెత

కొండ నాలుకకు మందు వేయబోతే ఉన్న నాలుక ఊడిందట.

- సామెత

తప్పుచేసినవాడు తప్పించుకుపోగా తొంగి చూసినవాడు పట్టుబడ్డట్టు...

- సామెత

నిష్క్రమణ

ఈ ప్రపంచంలోకి మనిషి ప్రవేశించటం ఎంత కష్టమో నిష్క్రమించటమూ అంతే!

- దివ్యప్రభాకర్, శిరోమణి

నిష్క్రియుడు

ఆకురాలినదని ఏడుస్తూ కూర్చున్నవాడు
వసంతానికి స్వాగతం పలుకలేడు.

- కాళోజీ, దిగులు

నిష్ఠ

గట్టిగా చెడిపోయేందుకన్నా నిష్ఠంటూ ఒకటి ఉండాలి!

- రామకృష్ణశాస్త్రి, మంత్రపుష్పం

ఈ నిష్ఠ వింత తారస
మైనం దాఁకానెసూ! సదాచారి యటం
టే నచ్చిన దాఁకనె యగు
మౌనిజనవిడంబనములు మన మెఱుగనివే?

- తమ్మయ్య, వైజయంతీవిలాసము

నిష్ఠురం

అంత్యనిష్ఠూరం కంటె, ఆది నిష్ఠూరమే మంచిది!

- సామెత

నిష్ఫలం

భర్తయుపదేశము బ్రాహ్మణ వ్యవసాయమువలె నిష్ఫలము.

- పానుగంటి, రాధాకృష్ణ

ఆత్మలింగము తెలియని యెడల లింగము రుబ్బు(పా) పత్రమే.

- శివరామశాస్త్రి, నమశ్శివాయ

వచన కవిని అంత్యప్రాసలు అరువడిగినట్టు.

- శ్రీరమణ, న్యూసుడి

చెక్‌పోస్టుకి చెక్కలు అడ్డమా?

- శ్రీరమణ, న్యూసుడి

అదును తప్పిన పైరున్నా, ముసలివానికి బిడ్డలున్నా ఒకటే.

- సామెత

పెట్టేవారి చెయ్యి పెద్దదయినా, తినేవారికి తిరుగుడు రోగం.

- సామెత

కార్లు పోయే దారి వదలి టైర్లు పోయే దారి మూసినట్టు.

- శ్రీరమణ, న్యూసుడి

కళాఖండం తీసి కలెక్షన్లకు ఎదురుచూసినట్టు.

- శ్రీరమణ, న్యూసుడి

నిష్ప్రయోజకుడు

శాస్త్ర మాచార్యు సన్నిధిఁ జదువఁడేని
నిద్దబోధంబు మది సంగ్రహింపఁడేనిఁ
దెగువ మీటి ప్రతిజ్ఞ సాధింపఁడేని
జ్ఞాతిజయ మందఁడేని తజ్జనుఁడు జనుఁడె?

- శ్రీనాథుడు, కాశీఖండము

ఎన్నెన్ని గాలివానలు, యెన్నెన్ని కలరాలు, యెన్నెన్ని ప్లేగులు, యెన్నెన్ని యుద్ధాలు వచ్చి యెంతెంత జనాన్ని నాశనం చేసినా జనాభివృద్ధి నామమాత్రావశిష్ట మయిందా? అలాగే ఆయా దుర్వృత్తులున్నూ.

- వేళ్ళపిళ్ల, కథలు-గాథలు

మనుపీనుఁగుగాఁ దలంప మను టేమిటికిన్?

- దూబగుంట, పంచతంత్రము

స్వర్గానికి రోడ్డువేయు
సామాజిక పథకమ్ములు
శ్రమికజాతి బ్రతుకుబాట
చల్లనేల పల్లేరులు?

- మల్లారెడ్డి గేయాలు

పౌరుష జ్ఞానకీర్తులఁ బరఁగెనేని
వాని సంపద యొకపూఁటయైనఁ జాలు
నుదరపోషణమాత్రకై యుర్విమీఁదఁ
గాకి చిరకాల మున్న నేకార్య మగును?

- దూబగుంట, మిత్రభేదము

కుట్టని రవిక చేతిలో ఉన్నాసరే? ఏలని మొగుడు ఊరిలో ఉన్నాసరే.

- సామెత

కొజ్జా మొగుడు ఒడిలో ఉంటేనేమి? గదిలో ఉంటే నేమి?

- సామెత

టెంకాయ చెట్టుకు మడిగుడ్డ కట్టగానే దొంగకడ్డమా?

- సామెత

రాజమకుటం శిరోవేదనను పోగొట్టలేదు.
ఐశ్వర్యం ఆనందాన్ని కొనిపెట్టలేదు.

- సామెత

నిస్పృహ

మానవుని జీవితంలో ఎన్నో నిరాశా నిస్పృహలు వస్తూనే ఉంటాయ్. వాటిని ధైర్యంతో

ఎదుర్కొనే శక్తి ఒక్కయుక్తాయుక్త విచక్షణా జ్ఞానం కలవాడికే ఉంది.

- బుచ్చిరెడ్డి, అసమర్థుని ఆత్మహత్య

నిస్పృహ బలపడితే పరాజయం.
బలహీనపడితే విజయం.

- రామమోహనరావు, మోడల్

### నిస్పందేహం

మ్యావుమని కూయలేని పిల్లి యెచ్చటనైన నుండునా? కిచకిచ లాడలేని కోఁతిని మీరెచ్చటనైనఁ జూచితిరా? ఈతరాని కప్ప యేదేశమందైన నుండునా? పుట్టగానే క్యారుమనలేని బిడ్డ చచ్చిన దనుటకేమైన సందేహమా?

- పానుగంటి, సాక్షి

### నిస్వార్థం

స్వార్థ మనేది ప్రకృతి సిద్ధంగా వస్తుంది. నిస్వార్థమనేది మనం సంపాదించుకుంటే లభిస్తుంది.

- చిరంజీవి, బోలోస్వతంత్రభారత్‌కీ జై

### నీచత్వం

కక్కిన కూటికి ఆశించినట్లు.

- సామెత

### నీచాశ్రయం

పానప్రియులై స్త్రీలోలురైన వారికి, ఇచ్చకాలు తప్ప మరేమీ వినవొల్లని వారికి సింహాసనాలున్నంతకాలము వారిచుట్టూ నీచాశ్రయానికి ప్రాకులాడేవారు కోటలా కూర్చుంటారు. ఇతరులను చొరనివ్వరు. వారి హ్రస్వదృష్టి తమ తక్షణ స్వార్థప్రయోజనాల పరిమితిని దాటదు.

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

### నీచుడు

ఒక వీరుడు మరణిస్తే వేలకొలది వీరులు
పుట్టడమేమో కానీ
ఒక నీచుడు చస్తే కోట్లాదిగా నీచులు
మాత్రం పుడుతున్నారు!

- దేవీప్రియ, మహాకవి

### నీడ

తాడిచెట్టు నీడ తనకూ లేదు. ఇతరులకూ లేదు.

- సామెత

### నీతి

నీతులు పోఁతపాల వంటివి

- అజ్జాడ, సారంగధర

నీతియుక్తముగఁ బదునెనిమిది పురాణములు. భారతమున వ్రాసిన వ్యాసుఁడు పరకాంతను జూచి పండ్లిగిలింపలేదా? కడుపులో నీతి పుట్టిన వానికే గతి లేదుగాని పడఁదీసి చెవిలో నీతిని దిరిపెట్టఁబడిన వానికా?

- పానుగంటి, ముద్రిక

శిష్టాచారమైన నీతికి బాహ్యమైనచో నది మాన్యము కానేరదు.

- తి. వేం., పాండవప్రవాసము

కాలము కాదు కత్తికిది
ఘాతుకులన్ వధియించె ముందె యే
కాలమునన్ ఫలించునొ వి
కల్ప ఫలంబులు నీతిమార్గముల్?

- తి. వేం., ముద్రారాక్షసము

క్రూరకర్మములం దుద్యతులైనవారికి నశర్మ ప్రాప్తి గాకుండునే?

- నన్నయ, ఆదిపర్వము

...నీతియుతులు సమర
మధమ సాధనముగ నాడుదు రర్థసం
సిద్ధిఁబొందు తెఱఁగు సేయునెడల.

- తిక్కన, విరాటపర్వము

చేటు కాలమైనఁ జెట్టమాటలు నెఱి
గాని తెరువు వట్టు కర్జములును
దగినయట్ల తోఁచుఁ దగియెడునవి యవి
నీతులని మనంబు నిశ్చయించు.

- తిక్కన, ఉద్యోగపర్వము

కుటిలబుద్ధుల గెలువంగఁ గుటిలమతియ
యర్హమగుఁ గాని నీతిగా దార్జవంబు.

- శ్రీనాథుడు, శృంగారనైషధము

బలిమికంటె నీతిబలిమి లెస్స.

- పింగళి, కళాపూర్ణోదయము

రమణీజనములదెసఁ గడుఁ
దమకించుట నీతిగాదు.

- అనంతుడు, భోజరాజీయము

పరిపరివిధాల ఆచారాలు, వ్యవహారాలు వున్నాయిగాని నీతి వకటే, భగవంతుడొకడూ, అంతటావొక్కడే.

- గురజాడ, కన్యాశుల్కం

మొగవాడికయినా ఆడదానికయినా నీతి వుండాలి.

- గురజాడ, కన్యాశుల్కం

ఏ పాడువస్తువు నయినను సరే రహస్యముగా

నుంచుటవలన దానియందు గౌరవము హెచ్చును.

- కందుకూరి, రాజశేఖర చరిత్రము

నాకుఁ బనికిరా వనియేకదా యీ నీతులన్నిఁ టిని మీకు వదిలివేయుచున్నాను? నాకే పనికి వచ్చిన యెడల నొక్క వాక్యమైన నా కుక్షిలో నుండి పైకిరానిత్తునా?

- కందుకూరి, రాజశేఖర చరిత్రము

... వారరమణికైవడి బహురీతి రాజనీతి

- లక్ష్మణకవి, సుభాషితములు

ఆయువు మంత్ర మౌషధము
నర్థము దానము మానభంగ మ
న్యాయము నర్థనాశము గృ
హవ్యసనంబును దాపురంబుగాఁ
జేయుట నీతియుక్తమ.

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

వినఁదగు నెవ్వరు సెప్పిన
విన్నంతనె వేగపడక వివరింపఁదగున్
గని కల్ల నిజముఁ దెలిసిన
మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో సుమతీ.

- బద్దెన, సుమతి శతకము

పసువులు నోర్లేని సొమ్ములు - ఆటికి నీతుంది కాని మనకి నేదు. సదువు లేన్దాన్ని నాకూ నేదు; సదువుకున్నోడివి నీకూ నేదు.

- రావిశాస్త్రి, మాయ

ఏలఁబడువాఁడే యేలిక యగుట కర్హుఁడు. విధే యతఁ జూపఁగలిగినవాఁడే యాజ్ఞ నిచ్చుటకుఁ దగినవాఁడు. వినఁదగినవాఁడే చెప్పఁదగిన వాఁడు.

- పానుగంటి, సాక్షి

నీతి ఇతరులకు సంబంధించే ప్రవర్తన విష యంలో ఉంటుంది.

- కొడవటిగంటి, ప్రేమించినమనిషి

ఎన్నియో నీతులు పశుపక్షి కీటకములనుండి మనుజుఁడు నేర్చుకొనవలసి యున్నది - గాడిద నుండి యోరిమి, చీమనుండి దూరదృష్టి, సాలె పురుగునుండి పట్టుదల, కుక్కనుండి విశ్వా సము, గువ్వనుండి యేకపత్నీవ్రతము, ఇటు లెన్ని చెప్పవచ్చును? మనుజుఁడంత బుద్ధిహీన మైన జీవము మఱియొకటి లేదు. మనుజునకు బుద్ధి చెప్పఁజాలని జంతు వెంతనీచమైన దియుఁ బ్రపంచమున లేదు.

- పానుగంటి, సాక్షి

నీతి అంటే కోత.

- ముళ్ళపూడి, బుడుగు

మనల్ని ఎవరూ చూడటం లేదన్న ధైర్యం వున్న పుడు ఎన్నో పనులు చేస్తాం. ఎవరన్నా చూస్తే ఎల్లా వుంటుందో వూహించుకుని అవకాశం వున్నా ఆ పన్లు చెయ్యటానికి జంకుతాం. తలుపుసందు నీతి మనది.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

ఒప్పుకోవటానికి వీల్లేని నీతిని అవినీతి అంటారు.

- కొడవటిగంటి, ఐశ్వర్యం

చరిత్ర కెప్పుడూ నీతిలేదు.

- కొడవటిగంటి, దేవుడిచ్చిన వరం

వ్యయమునార్జవంబు దయయుహింసయు బొంకు నిజముఁ దియ్యఁదనము నిష్ఠురంబుఁ బలువు రిష్టజనులుఁ గలిగి యారయఁ బణ్య రమణివోలె నుండు రాజనీతి.

- దూబగుంట, పంచతంత్రము

నీతి కట్టె లాంటిది
కోర్కె మంట లాంటిది.

- తిలక్, రాజమండ్రి పాట

నీతి నేడొక ప్లేగు.

- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

పుస్తకములలో, పాఠశాలలో కాలేజీలలో చదువు కొన్న నీతులు బళ్లల్లో పనికి వచ్చేవే.

- మాడపాటి, ఎవరికి?

అందరూ కాదన్న దానిని ఒకడు చేస్తే అవినీతి. అందరూ ఒప్పుకొన్నది నీతే.

- మహీధర, కత్తుల వంతెన

ఈ కడుపు కాలనంతసేపూ అంతా నీతే.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

మొగవాడు ఆడదానికంటె స్వేచ్ఛగా నీతిని ధిక్కరిస్తున్నాడు.

- కొడవటిగంటి, పచ్చకాగితం

నీతినియమాలు, సంపాదించలేని సన్యాసులు బతకడానికి పెట్టుకున్న నికృష్టపు గోడలు.

- రాధాకృష్ణ, ఇదేమిటి

## నీతి – అవినీతి

నీతో మాట. దానికి మరో రెండచ్చరాలు

సేరుస్తే మరోమాట. రెండూ యేరేయేరే మాట లేగాని అన్నిసోట్లా దేఁవుఁడున్నట్టే ఆ రొండిం ట్లోనూ ఉన్నాడు దేవుఁడు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

## నీతిపరుడు

లంచాలు తీసుకునే స్వభావం వుండి ఏ కారణం వల్లనో తీసుకోని ఉద్యోగస్తుడికే కీర్తి honest officer అని.

- చలం, మ్యూజింగ్స్

## నీరసం

ఒల్లు నీరసంగా వుంటే బాగుండదే, కయిత్తం నీరసంగా వుంటే బాగుంటదా?

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

నీరస మనఁగా నేమి? నీవు ఆనందించు రసము నీరసము.

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

## నీరు

కన్నీరుకి పన్నీరుకి మున్నీరుకి
నీరు సమానం
అయితే గోదావరి నీరు-
ఏడ్పునీరు చావనీరు!

- తిలక్, రాజమండ్రి పాట

## నీవు

అస్తమింపని దేది నీ వస్తమింప?

- చిలకమర్తి, గయోపాఖ్యానము

నా గురించి నే చెప్పుకోగలిగితే నువ్వు దేనికీ?

- కొడవటిగంటి, ముడిసరుకు

నీవు జగతి చైతన్యంలో ఒక భాగం
జగతి, కోటికోట్ల నీవుల సంయోగం

- కుందుర్తి, తెలంగాణ

నీత్రెళ్లిన గ్రుక్కెడు ప్రాణం
రాజ్యాంగపు తొలి సోపానం;
నీ ఆస్థులు విస్మృతి పాలై
యుగసంధుల వంతెన లైనై

- కొనకళ్ల, సిపాయి

నీవు దలఁపునరాఁగఁ గన్నీరుఁ గార్తు.

- శరభాచార్యులు, కల్హారమాల

## నీవు – నేను

నీవు జీవనదాత్రివి, నేను జీవి,
నీవు లేకున్న నాలేమియే ధ్రువమ్ము

- నాయని, సౌభద్రుని ప్రణయయాత్ర

వాక్కు నేనే నీకు - బోలెడు నీవులు నాకు.

- బుచ్చిబాబు, ఉత్తమా యిల్లాలు

## నెత్తం

వాదులానితోడ వాట్లీనితోడను
బూతుతోడఁ దిండిపోతుతోడ
నటమటీనితోడ నడయరితోడను
వెలకు నెత్తమాడ వెరవుగాదు.

- నాచన సోమన, ఉత్తర హరివంశము

## నెమలి

కోకిల యెక్కడో దాక్కొని దొంగరకంగా కూయును. నెమలి బహిరంగంగా పురివిప్పి యాడును. నిర్భయ ముగా అరచును. కనుక నెమలి పిట్ట శ్రేష్ఠము.

- మాచిరాజు, తెలుగు పేరడీలు

## నేటివి

చేతన్ ఘంటముఁ బట్టు నెట్టికవియున్
జింతింపఁ డీనాఁడు నీ
భ్రాతృక్లేశము లీక్షుధార్త భరతాం
బా దీర్ఘదారిద్ర్యమున్!

- జాషువా, నా కథ

ఒక్క శ్రీశ్రీని మినహాయిస్తే నేటి కవిత్వమంతా బీడు!

- కుందుర్తి, విశ్వనాథ షష్టిపూర్తికి

వేశ్య వెలయా లనంబడె వెల గ్రహించి
కట్నముల చేత వెలమగల్ కారె వీరు?

- కాళ్ళకూరి, వరవిక్రయము

## నేను

ఏను రుజనైతి, జరనైతి, మృత్యువైతి!

- దేవులపల్లి, ఊర్వశి

...ఏ ననంత.
శోకభీకర తిమిర లోకైక పతిని!

- దేవులపల్లి, వద్దు!

నేను చిఱునవ్వు పెదవుల నిలపలేను.

- దేవులపల్లి, నేనుకూడ

తొలి వియోగిని నేనె!
తొలి ప్రేయసిని నేనె.

- దేవులపల్లి, ఊర్వశి

నేను లేని యాట రక్తిలేని పాటగదా!

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

నేను సైతం
ప్రపంచాగ్నికి
సమిధనొక్కటి ఆహుతిచ్చాను!
నేను సైతం
విశ్వవృష్టికి
అశ్రువొక్కటి ధారపోశాను!
నేను సైతం
భువన ఘోషకు
వెర్రిగొంతుక విచ్చి మ్రోశాను!
నేను సైతం
ప్రపంచాబ్జపు
తెల్లరేకై పల్లవిస్తాను!
నేను సైతం
విశ్వవీణకు
తంత్రినై మూర్ఛనలు పోతాను!
నేను సైతం
భువన భవనపు
బావుటానై పైకి లేస్తాను!

- శ్రీశ్రీ, జయభేరి

'నేను' అనేది తప్ప వేరే కొలత, వేరే ఆధారం యెక్కడా దొరకదు, ఎవరికీ కూడా.

- చలం, మ్యూజింగ్స్

గడి యెక్కా నేనే, గంతులు వేయా నేనే

- సామెత

తప్పొప్పుల పట్టికలా తయారైన బ్రతుకును
ధర్మానుగుణంగా సరిదిద్దుకుంటాను.

- అనిశెట్టి, స్వీయచరిత్ర

కష్టాల కౌగిలిలో క్రక్కదలిపోతూ
సుఖాన్ని ఊహలో చుంబిస్తున్నాను.

- అనిశెట్టి, స్వీయచరిత్ర

మానవస్వాతంత్ర్య 'మాగ్నకార్టా' పైన
రక్తాక్షరములతో వ్రాలు చేసేశాను!

- సూరి, అరుణరేఖ

నా పేరు ఆకలి
సాయుధం నా శరీరం
ఆక్రమణ నా ఉనికి
ఉద్యమం నా ఊపిరి
విప్లవం మా ఊరు.

- చెరబండరాజు, గమ్యం

నేనె కల్పించిపెట్టిన నియమములను
నేనె పాటింపకుండిన నియతి చెడును.

- త్రిపురనేని, భగవద్గీత

చచ్చెడునంతదాఁక నిర్భయముగనే ప్రపంచమున సంచరించెదను.

- త్రిపురనేని, ఖూనీ

నేరం

ఒకనాడు పురుగులా బ్రతికిన మనిషి సుడితిరిగి పెద్దాడై వెలిగిపోతూన్నంత మాత్రాన పూర్వం తన పురుగు దశని మరిచిపోతే నేరం.

- ఆదివిష్ణు, వాంటెడ్ ఫాదర్స్

దురుద్దేశంతో చెయ్యనిది నిజంగా నేరంకాదు.

- యజ్ఞన్నశాస్త్రి, న్యాయం

'చట్టం-నేరం' అనే విశేష పదాలు ఎటుగా మొగ్గినా మొగ్గేతత్వం గలవి.

- మా గోఖలే, దొంగవాళ్ళు

పది సంవత్సరముల కఠినశిక్షకంటెఁ బదిమంది సంఘమువలన నేరగానిఁ గూర్చి చేయఁబడిన యనాదరణము నేరము నాపుటలో బలవత్తరమైనది.

- పానుగంటి, సాక్షి

నేరము శిక్ష నొందినకొలఁది వృద్ధినొందుచున్నట్లున్నది.

- పానుగంటి, సాక్షి

నిజాయితీగా వుండటమే ఈ లోకంలో పెద్ద నేరమేమో!

- ఆనందారామం, మరో ముందడుగు

జయిలులో జరిగే ఒక నేరమూ రిపోర్టుగాదు. ఒకడు సాక్ష్యం చెప్పడు. పదహారు వందల మంది దుర్మార్గులుండే ఖయిదులో ఒక్క నేరం గూడ జరిగినట్టు నేరపు జాబితాలో ఉండదు.

- ఉన్నవ, మాలపల్లి

నేర్పు

నీటిలో జాడఁ బుట్టించు నేర్పు నీకు
కాక గల్గునె మూఁడు లోకములయందు

- పోతన, భాగవతము

ఎద్దుకన్న దున్న యేలాగు తక్కువ
వివర మెఱిఁగి చూడు వృత్తియందు
నేర్పులేనివాని నెఱయోధుఁ డందురా?.

- వేమన

వావిరి మాటలఁ దేలక
భావంబునఁ గీడు మేలుఁ బరికించి యసద్భా

వుని సద్భావుని నవ
నీవర! యేర్పఱప నెఱుఁగ నేరఁగవలయున్
- తిక్కన, శాంతిపర్వము

ఠంకాడ నేర్చినమ్మ బొంకాడ నేరదా?
- సామెత

ఏక వచన ప్రయోగం అంటే నౌకరీలో వుండే వారి నాలుక యెంతయినా నేర్పు చూపించగ లదు; కాని చెవులు మాత్రం ఓర్పు కనపరచలేవు.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, వడ్లగింజలు

నైజం

గుడ్డుగా వున్నప్పుడు దాని ఖరీదు అర్ధణా. అది కోడిపిల్లగా మారి, పెద్దదై మళ్ళీ గుడ్లు పెట్టే దశకు ఎదిగితే - అప్పుడు దాని ఖరీదు రూపా యిన్నర. ఎవరైన కోడిగుడ్డును ఉచితంగా యివ్వగలరేమోగాని కోడిపెట్ట నివ్వలేరు. మనస్సు ఒప్పదు. ఇది మానవ నైజం.
- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

వేము వెగ్గలము పెరుఁగఁ
గలదె మాధుర్యగుణము తిక్తంబ కాక?
- పిల్లలమర్రి, జైమిని భారతము

శ్రీగలవానిఁ బేదయుఁ
బ్రసిద్ధ పతివ్రతఁ జెడ్డ యింతియున్
జాగిని వజ్రలోభియు సు
జాతి విజాతియు ధర్మనిర్మలో
ద్యోగినిఁ బాపకర్ముఁడును
నొప్పెడువానిఁ గురూపుఁడున్ విశే
షాగమవేది మూర్ఖు, చెడ
నాడుచు నుండుట నీతి నైజముల్
- సింగన, సకలనీతి సమ్మతము

మలకలు మా ప్రచారములు
మా ముఖముల్ విషవహ్నితోయముల్
ఖలులము రోషజాతులము
గర్వుల మే మొక మంచివారమా?
నలినదళాక్ష ప్రాణులకు
నైజగుణంబులు మానవచ్చునే?
- పోతన, భాగవతము

దొరకవని తెలిసినా - జారిపోయిన వాటి కోసం వెతుక్కోవటం మానవ నైజం.
- రామచంద్రమూర్తి, శ్రీరాగం

ఈ కార్చిన కన్నీళ్లే నైజాం పిండిన సారం
ఈ కుళ్ళిన గుండెకాయ నైజా మిచ్చిన పండు!
- కోదండరామశాస్త్రి, భూస్వర్గం రావాలి

నైతికజీవనం

నైతికజీవనం కేవలం వ్యక్తిగతమైనది.
- ఆత్రేయ, చావకూడదు

నైవేద్యం

పూజారికి లేని నైవేద్యం ప్రభువులకా?
- నంది, పుణ్యస్థలి

గాలికి బోయిన పేలపిండి, భగవదర్పిత మన్నట్లు
- సామెత

నొప్పి

తీట చేతికి తీపులు మెండు
- సామెత

నోటీసు

నోటీసు ఎవరూ చదవరండి బాబూ, కాగితం దండగ.
- యజ్ఞన్నశాస్త్రి, రిహార్సలు

నోరు

కాలం సూడవోతె నోరున్నోనిదే ఊరంటుంది.
- రాజయ్య, సృష్టికర్తలు

నోరుంటే తల కాస్తుంది మరి!
- మాలతి, జీవనమాధుర్యం

ఎవరివల్ల చెడ్డావురా అంటే నోటివల్లనే చెడ్డాన న్నట్లు.
- సామెత

నౌకరు

యెజమాని లొసుగు జూసి ఒక్కో సుట్టు నౌకరోడే బాస్ యెజిమానై పోతడండి.
- రావిశాస్త్రి, బంగారిగాడికల

న్యాయం

పని కూలీ వెధవల్ది. లాభం బుగతది. ఏమైనా అంటే, ఎదురు తిరిగితే మన సాయానికి కోర్టు లున్నాయి, జెయిళ్ళున్నాయి.
- రావిశాస్త్రి, మాయ

మడిసి మాంసం అమ్ముకొని మడుసులు బత కడం నాయం కాదుకదా?
- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

తను ఇతరుల్ని అంటే, తమాషాలు. తన్ని అంటే ఇతరులు, ఈర్ష్యట. ఇదిట న్యాయం.
- భమిడిపాటి, ఇప్పుడు

అధికారదుర్వినియోగంలాంటి అంటురోగాలకు దూరంగా, కేవలం పుస్తకాల్లోని వెర్రిమొర్రి

న్యాయం కాక మంచులా స్వచ్ఛమైన న్యాయం జరగాలి ప్రతి మనిషికీ.

- విశ్వం, కోర్టు

న్యాయం రాజును విచారించదు.

- కుందుర్తి, తెలంగాణ

కొన్ని వేళల్లో తప్పిపోయినా సాధారణముగా న్యాయమే అక్కరకు వస్తుంది.

- కందుకూరి, మ్యునిసిపల్ నాటకము

న్యాయంగా పోతే అన్నీ తంటాలే వస్తవి. అందరితోనూ విరోధాలే వస్తవి.

- కందుకూరి, హాస్యసంజీవని

పక్కింట్లో దొంగలు పడ్డప్పుడు లక్షలక్షలు పోవాలి. అది న్యాయం.

- రావిశాస్త్రి, కష్టార్జితం

న్యాయమైన సొమ్ము నట్టేటిలో పాఱవేసినా పోదు.

- చెళ్ళపిళ్ళ, కథలు- గాథలు

"న్యాయ"మన్న బోనులో చిక్కుకున్న ప్రాణి బయటపడడానికి వీలులేదు.

- యజ్ఞన్నశాస్త్రి, న్యాయం

కేసుల్లోనే న్యాయం వుంటే ఈ పోలీసులం మేమెందుకు? ఇంతమంది ఈ ప్లీడర్లు అంతా ఎందుకు? ఈ కోర్టులన్నీ ఎందుకు?

- రావిశాస్త్రి, న్యాయం

నడిబజారులో నలుగురి ముందు
హత్య జరిగినా సాక్ష్యం బందు
న్యాయం గుడ్డిది మాత్రమే కాదు
కుంటి, మూగని ఘోషిస్తాన్.

- శ్రీశ్రీ, పంచరత్నాలు

నాకు విలువలేనప్పుడు నేనెందుకు?
మీ ఏడుపేదో మీరే ఏడవమంటూ
అక్కడే - కోర్టు గుమ్మానికే -
ఉరేసుకుంది - న్యాయం ఉరేసుకుంది!

- అల్లంరాజు, న్యాయం ఉరేసుకుంది

అన్‌యేయం చేయిస్సి నాలుగురోజు లూరు కుంటే అదే నాయెం అయి ఊరుకుంటుంది.

- రావిశాస్త్రి, విషాదం

అపరాధ విమర్శ కాలమున నన్నియు వెలువడి, క్రుంకిన యోడతేలి, తేలిన యోడ క్రుంకఁగలదు.

- ధర్మవరం, విషాద సారంగధరము

**న్యాయమూర్తి**

న్యాయమూర్తులుం గారూ!
మీరు... బహుమంచివారే
అధర్మ నిధనంలో యమధర్మ రాజంతటివారు.

- శివసాగర్, కుట్ర?

**న్యాయశాస్త్రం**

నిరూపించలేని నిజాలను 'లా' ఒప్పుకోదు.

- విశ్వం, ముసుగు

మన న్యాయశాస్త్రం చెడ్డవాడిని మరింత చెడ్డవాడిగా చెయ్యడానికే ఉపయోగపడుతుందమ్మాయ్

- సూర్యారావు, శ్రీమతులు-శ్రీయుతులు



**పక్కదుప్పటి**

చలం పుస్తకాలంటే నాకు అసహ్యం. ఎందుకంటే కాయితాలు పక్కదుప్ప ట్లనుకుంటాడు అతను.

- చలం, కళారాధన

**పక్షపాతం**

పక్షపాతియగు రా జతిశీఘ్రమునఁ బదభ్రష్టుం డగును.

- తి.వేం., దంభవామనము

పక్షపాతమె ప్రేమఁ గలిగించును. పక్షపాతమె యేవఁ గలిగించును.

- చిలకమర్తి, గణపతి

దేవుడికి పక్షపాతం జాస్తి!

- శ్యామలారాణి, జీవవాహిని

**పక్షి**

చాలామంది పెంపుడు పక్షులకి రెక్కలు కత్తిరించేస్తారు. కాని అవి మళ్ళీ పెరగకా మానవు. ఎగిరిపోకా మానవు.

- బీనాదేవి, కాంట్ యు డేర్ డియర్?

మనకన్న పక్షులు నయం. పిల్లలకు రెక్కలొచ్చే దాకా అన్నిరకాలా సహాయం చేస్తాయి. రెక్కలొచ్చిన పిల్లలు తమను ముసలితనంలో ఆదుకోవాలని ఆశించవు. పక్షిపిల్లలక్కూడ తమ తల్లి దండ్రుల గతేమిటా అన్న విచారం ఉండదు.

- కొడవటిగంటి, పంచరత్నాలు

ఎవరు సెప్పారని గూటిలో పక్షి కిలకిల్లాడుద్ది?

- బుచ్చిబాబు, ఉత్తమా యిల్లాలు

**పగ**

పగ గుడ్డిది. అది గురి చూసి కుట్ర చెయ్య

లేదు ఎటువంటి విచక్షణా చూడకుండా రాళ్లు విసురుతుంది. అపజయం ఎదురైన కొద్దీ దాని విసురు జాస్తీ అవుతుంది గాని తగ్గదు.

- *కొడవటిగంటి, సవతితల్లి*

ఎవ్వనితో నెప్పాటను
జివ్వకుఁ జేసాఁపవలదు, చేసాచినచో
నివ్వల నవ్వల నెవ్వరు
నవ్వకయుండంగఁ బగ సనం దీర్పనగున్.

- *శ్రీనాథుడు, కాశీఖండము*

పగబట్టడం మంచిదికాదు. అందులో పాము పగ అసలే మంచిది కాదు. పగ బట్టినా భగ వంతుడు ఆ కోరలను లాగేస్తాడు.

- *కె. యల్., కొత్తగుడి*

పాము పగైనా మొయ్యొచ్చుగాని, పావుఁలాడి పగ మొయ్యలేం.

- *కాశీపట్నం, భయం*

ఏమిగతిఁ దలంచినం బగకు
మేలిమి లేమి ధ్రువంబు

- *తిక్కన, ఉద్యోగపర్వము*

ద్వేషమనేది కులాన్ని బట్టి సంక్రమించే జాడ్యం కాదు.

- *నంది, నైమిశారణ్యం*

### పంగనామం

పట్టి పట్టి పంగనామం పెడితే, గోడచాటుకెళ్లి గోకేసుకున్నాడట.

- *సామెత*

### పచ్చిక

(కానికాలంలో ఆత్మరక్షణ చేసుకోకపోతే పాపంరా! మొండిగా తల పగులగొట్టుకుంటే జరిగేదేముంది? ) పచ్చికలు ప్రవాహానికి తలవంచటం, తరువాత మరింత పచ్చగా వ్యాపించడానికేగా?

- *సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా*

### పంచాంగం

పంచాంగం యింట్లో వుండటం ఫేషన్ కా దీరోజుల్లో. నగ్న శరీరుల బొమ్మలు షేషన్. జీవితాన్ని నడిపిస్తున్నవి కేలెండర్లు కాబోలీ రోజుల్లో.

- *పెద్దిభట్ల - కప్పగంతుల, నయనతార*

మరియొకరి చెడు తేదీ
మనకు నేడు ఉగాది
పంచాంగ మొక సోది
ఓ కూనలమ్మ.

- *ఆరుద్ర, కూనలమ్మపదాలు*

సిద్ధాంత మననేమో యెఱుఁగని వెట్టిమొగముల పేర్లతో పంచాంగములు వెలువడును.

- *చిలకమర్తి, నవ్వులగని*

కాలాన్ని కొలిచేందుకు గడియారాలెందుకు?
కేలండర్లూ, పంచాంగాలూ, కేవలం వృథాగదా?
ఆకాల ప్రజ చదివిన కష్టకావ్య సంపుటాలు
సామాన్యుల బాధలు, జీవితాల గాథలు చాలు.

- *కుందుర్తి, తెలంగాణ*

పంచాంగం పోగానే నక్షత్రాలు ఊడిపోతాయా?

- *సామెత*

### పంజరం

జీవితం ఏమిటి? వివిధ బంధాలతో పాశాలతో అల్లబడ్డ పంజరం...

- *వెంకటకృష్ణమూర్తి, పడమటి సంధ్యారాగం*

### పటుత్వం

తిరగబడటం జ్ఞానమూ, పటుత్వమూ కాదు. అజ్ఞానం, బలహీనత. నిజమైన పటుత్వం తిరగబడదు. ఇదివరకు లొంగిపోయిన బలహీనతే తిరుగుబాటులోకి రూపం మార్చింది.

- *చలం, హరిజన సమస్య*

### పట్టింపు

పిడుక్కి వారశూల ఏమిటి? సభాముఖంలో జరిగే దండల పెళ్ళికి ముహూర్తం పట్టింపు లేమిటి?

- *మహీధర, కత్తులవంతెన*

### పట్టు

ఏదైనాగాని పూనుకుంటే అయిద్దనుకో. లేకుంటే ఎన్నాళ్లయినా గిట్ల శికట్ల బడి కొట్టుకోవటమేననుకో.

- *కె. యల్., కొత్తగుడి*

### పట్టుదల

వర్షం వస్తోంది మొర్రో అంటే వందన సమర్పణ చెయ్యాలన్నట్టు.

- *శ్రీరమణ, న్యాయుడి*

పట్టుదలలు ఎంతెంత ఆలోచనగల వాళ్ళనీ ఇట్టే బోల్తా కొట్టించేస్తాయి.

- *మహీధర, ఓనమాలు*

పట్టుదలే పెట్టని అలంకారంగాగల వాడిలో కూడా ఏమూలో మానవదౌర్బల్యం ఉంటుంది.

- *కొడవటిగంటి, చెడిపోయినమనిషి*

సాధారణంగా చీకటి పట్టుదలలు వెలుగులో సడలిపోతూ ఉంటాయి.

- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

పట్టుదల అన్నది కేవలమూ వ్యక్తిపరంగా ఉన్నప్పు డది లోకానికి చెయ్యగల మహోపకార మేమీ ఉండదు.

- కొడవటిగంటి, చెడిపోయినమనిషి

మదిన్ దీంద్రల్ గల్గిన వారి కేకరణినేనిన్
విద్య రాకుండునే?
గుంద్రాడాంచినం బెండ్లి యేమిటికిం జిక్కున్?

- అల్లసాని, మనుచరిత్రము

వ్యక్తిని ముందుకు తీసుకొని పోగలిగినది పట్టుదల ఒక్కటే.

- సరస్వతీదేవి, సాహిత్యోద్యానము

ఏ కార్యమునందును కష్టపడినంగాని ఫలము గలుగదు. ఎక్కువ ఫలముల ననుభవింపగోరు వారెక్కువ కష్టము(ల)ను పడవలెను.

- కందుకూరి, స్వీయచరిత్రము

మనలో నెవ్వరైన నొక్కరు పూనుకొని పనిచేసిననే పని జరుగునుగాని సమాజమునకు విడిచిపెట్టిన యెడల నేమియు జరగదు. అందఱును గలసి సంఘీభవించి కార్యము నడుపు సద్గుణమును మనవారింకను నేర్చుకొనవలసియున్నది.

- కందుకూరి, స్వీయచరిత్రము

మహాపురుషులందఱును నిరంతర కర్మశూరుల యిన సామాన్య ధీశాలులుగాని కేవల ప్రతిభా మాత్రమాన్యులయిన వారుగారు.

- కందుకూరి, స్వీయచరిత్రము

## పట్నం

పట్నంలో అన్ని సౌకర్యాలూ ఉన్నాయన్నమాటే గాని ఏ సౌకర్యమూ లేనట్టే. అవును మరి, వెలుగుండే చోట నీడా ఉంటుంది.

- కొడవటిగంటి, బ్రతుకు భయం

పట్నాల్లో వాళ్ళకి తిరిగేటందుకు కార్లున్నాయి కాని రోడ్లు లేవు.

- బుచ్చిబాబు, గొలుసు

పట్నాలలో వారికి విందులున్నాయి. ఆకలి లేదు. పల్లెలలో వారికి ఆకలుంది, విందులు లేవు.

- బుచ్చిబాబు, గొలుసు

## పడక

నడకకు అంతం పడక.

- బైరాగి, పలాయనం

## పడిసెం

పడిశం పది రోగాల పెట్టు.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

## పంట

రాజకీయపు పొలంలో
బలహీనవర్గాల్లాంటి
బలమైన విత్తనాలు వేస్తే
పుష్టికరమైన పంటలు పండుతాయి.

- ఆశీర్వాదం, బలమైన విత్తనాలు

అమెరికాలో డాలర్లు పండును
ఇండియాలో సంతానం పండును.

- తిలక్, న్యూ సిలబస్

పండించే వరకే పంట మనది.

- నార్ల, సైపంట

పూల్ఘు పండిన కొద్దీ మాపంట పండుతుంది.

- మారేపల్లి, మీమాంసం

## పండగ

పండగే బెస్టు, పిల్లలకి డబ్బులొస్తాయి.

- ముళ్ళపూడి, బుడుగు

పండుగలకేటి పనా, పాటా! ఇనకకంటేకొస్తోళ్ళొచ్చి నట్టు ఎప్పుడుబడితప్పుడే ఎలిపోస్తుంటాయి.

- గణేశ్‌పాత్రో, లాభం

సిరిగల పండుగ, చీకటిరాత్రి వస్తుందంటారు.

- కాళీపట్నం, ఆర్తికథలు

పండుగనాడూ పాత మొగుడేనా?

- సామెత

## పండితుడు

దేశమింకా పండిత శూన్యంకాలేదు. మీమీద చాలా భారం వుంది. అబద్ధాలు మాని పరాక్రమించండి. విషయం ప్రధానం.

- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

పరేంగితావగాహియయిన బుద్ధి యొక్కటియె పండితునకు విశేషము.

- చిన్నయసూరి, మిత్రభేదము

నీతికి పోలీసోణ్ణి - ఘూనానికి సాతానోణ్ణి అడ గమన్నాడు.

- గురజాడ, కన్యాశుల్కం

**పతకం**

అదే పతకమైతే అది అమ్ముకు బతకనా అన్నట్టు

- *గురజాడ, కన్యాశుల్కం*

**పతనం**

ఆ విప్రోత్తము వజ్రపంజర నిభం
బై నిశ్చలంబైన న
ద్భావం బంగన సాహచర్య గుణసం
పర్కంబునన్ లోహమై
గ్రావంబై దృఢదారువై తరుణ వృ
క్షంబై ఫలప్రాయమై
పూవై తన్మకరందమై కరఁగెఁ బో
పో నీళ్లకుం బల్చనై!

- *తమ్మయ్య, వైజయంతీ విలాసము*

ఒకసారి పడిపోవడం ప్రారంభమయ్యాక మనిషి ఎక్కడ ఆగుతాడో చెప్పడం కష్టం.

- *నంది, నైమిశారణ్యం*

పతనం 'వైరస్' లాంటిది. అది రానంత వరకే మన ప్రతిభ. వచ్చేక మరింక ఏ మందులూ లేవు.

- *బీనాదేవి, హరిశ్చంద్రమతి*

పచ్చడము దుప్పటాయెను
విచ్చలవిడి తులసిపత్రి విడియంబాయెన్
రచ్చల నగుబాటాయెను
అచ్చన్నా! నీదు కీర్తి అట్టిట్టాయెన్.

- *చినతాతాచార్యులు, చాటువు*

**పతిత**

'పతివ్రతలు లేకపోయినా ఫరవాలేదు కాని 'పతితలు లేకపోతే మగవాడు బతకలేడు మరి.

- *బీనాదేవి, అమ్మా! ఇది అనంతం!*

**పతివ్రత**

కలిగినప్పుడెల్లఁ జెలువుని చెంగట
నడఁగి మడఁగి యుండు టరిదిగాదు
చేరి లేమియప్పు డారీతి నుండెనా
యది పతివ్రతాజనాగ్రగణ్య

- *కదిరీపతి, శుకసప్తతి*

పరిస్థితులూ, ముఖ్యంగా భర్తా అష్టకష్టాలు పెడితేనేగాని పతివ్రతగా స్త్రీ పక్వం గాదు. భర్త యోగ్యుడై, సంసారం సుఖంగా జరిగిపోయిన ఒక్క పతివ్రతా కానరాదు.

- *చలం, మ్యూజింగ్స్*

ఇంటి మొగుణికి కొర్రా బువ్వా
పరాయి మొగుణికి వర్రీ బువ్వా
నడుమన దిరిగే వోబాళమ్మకు
సద్దా రొట్టీ ముద్దాపప్పూ...
యింటి మొగుణికి నులకా మంచం
పరాయి మొగుణికి పట్టే మంచం
నడుమన దిరిగే వోబాళమ్మకు
నగిషీ చేసిన నవారు మంచం...
యింటీ మొగుడూ దండుకు పోతే
సద్దీ గట్టను గుడ్డే లేదు
పరాయి మొగుడూ దండుకు పోతే
నాగులచీరా నడిమికి జించే...

- *జానపద గేయం*

పాపట్లో వెంట్రుక మెరిస్తే పతివ్రత యైన దన్నట్లు.

- *సామెత*

మేము వేశ్యల మైనను పతివ్రతలమే సుమా!

- *చిలకమర్తి, నరకాసురవధ*

మగని తోడిద లోకంబు మానవతికి.

- *చిలకమర్తి, గయోపాఖ్యానము*

**పత్రం**

జన్మపత్రమును గురించి నేనెఱుఁగను గాని ఋణపత్రములు మూఁడు నాలుగున్నవి.

- *పానుగంటి, ప్రచండ చాణక్యము*

**పత్రి**

మాదర్చేద్ దేవుడికి గోదర్చేద్ పత్రి.

- *రాజారాం, రాణీసాహెబా రంగయ్యమ్మారావు*

**పత్రిక**

పత్రికల వ్రాఁతలు వారివారి పక్షగతాభిప్రాయాన్ని బట్టి వుంటూ వుండటం ప్రాయశఃకనపడడం చేత పూర్తిగా విశ్వసించడానికి అవకాశం లేదు.

- *వెళ్ళపిళ్ల, కధలు-గాధలు*

వెధవ పేపర్ల మాటెందుకు? నేను పేపర్లె ప్పుడూ చూడనే చూడను.

- *చిలకమర్తి, కాంచూరిజానకిరామయ్యగారి పెండ్లి*

యిప్పుడల్లా యేదో పత్రిక నిండటానికి మేటరు వ్రాయడమే కావలసింది. తారతమ్య జ్ఞానంతో అవసరం లేదు. యెవరినే మాటేనా సరే వ్రాసి పత్రికకు పంపితే "వారూ వారూ చూచుకుం

టారు మనకేమి? " అని పత్రికవారు ప్రకటిస్తారు.

- చెళ్ళపిళ్ల, కధలు-గాథలు

నిజమైనా అబద్ధమైనా మామూలు జనం నమ్మేందుకు పత్రికలు పనికొస్తాయి.

- కొడవటిగంటి, ప్రేమించిన మనిషి

అర్ధరాత్రి పనిచేసేది పత్రికలే కదా! ప్రతి పక్షాలూ, ఛోటా నాయకులు అంతా మందుగొట్టి నిద్రపోతుంటారు.

- చల్లా, టెలిఫోన్ ఆపరేటర్

చదవటం రానివాడు కూడా కొంటేనే పత్రిక. జర్నలిజం అంటే అలా అనిపించుకోవాలి.

- కొడవటిగంటి, బెదిరిన మనుషులు

స్వకీయ విలేఖరి ఎలా లిఖిస్తే అలా ప్రచురిస్తాయి పత్రికలు; పాపం వాటికేం తెలుసు.

- నంది, పుణ్యస్థలి

మొగాణ్ణి ఇంట్లో కట్టిపడేసేది భార్య, బాహ్య ప్రపంచంలో కట్టిపడేసేది న్యూస్‌పేపర్.

- బుచ్చిబాబు, ఆద్యంతాలు, మధ్య'రాధ'

## పత్రికాధిపతి

పత్రికాధిపతులు వొక్క intellectual సర్వజ్ఞులైతే, యీ రేడియో వారు విజ్ఞానానికే గాక కళకీ సారస్వతానికీ సంపూర్ణాధికారం తీసుకున్నట్టున్నారు దేశంలో.

- చలం, మ్యూజింగ్స్

## పదం

పదం పాడితేనే పాపాయి పుడతాడా?

- బుచ్చిబాబు, ఉత్తమాయిల్లాలు

అంగాలు ముడుచుకున్న కూర్మం
భావాలు దాచుకున్న పదం

- రాధాకృష్ణ శర్మ, శాంతి సూక్తం

## పదవి

కౌగిలిలో కన్నుమూసిన ప్రియురాలి పెదవి
కలకాలం కోరదగ్గ దేవేంద్ర పదవి!!

- ఆరుద్ర, ఎంచక్కని కల

పదవిలోకి రాకముందు
'మనకు మనకు' అన్నవాడు
పదవిలోకి వచ్చిన పిదప
'నాకు నాకు' అనసాగాడు.

- రాధాకృష్ణశర్మ, శాంతి సూక్తం

డబ్బు పిచ్చి కంటే పదవి పిచ్చి మరీ ప్రమాదకరమైంది.

- భారతీదేవి, మల్లిక

పాత బిరుదము కన్న
పదవియే కడు మిన్న
పదవి కైపే హెచ్చు
ఓ కూనలమ్మ

- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

నడిపించాలని, పాలించాలని పొద్దస్తమానం ఎవరి పుర్రెలో పురుగు తొలుస్తుంటుందో వారే మంత్రి పదవులకోసం తాపత్రయపడుతుంటారు.

- నార్ల, పదవీ వ్యామోహం

మన పదవిని కాపాడుకునేందుకు ప్రజల్నేం చేసినా తప్పుకాదండి.

- ఆదివిష్ణు, ఎంతెంత దూరం

కొంచెపు బుద్ధులకే అలాటి పదవుల గొప్ప. దొడ్డ బుద్ధికి అవి యెడారిలో ఎండమావులు.

- కొప్పరపు, చేసినపాపం

పదవి వుంటే డబ్బుతో ఏంపని?

- సూర్యారావు, పంజరం

## పదిలం

పలువురు నడిచిన తెరువే పదిలమైనది.

- సామెత

## పదును

కత్తిపోటులు తనువును గాయపఱచుఁ
దిట్టపోటులు జీవంబు దెగఁగఁజేయు
స్తుతుల వ్రేటులు చిత్తంబు తుఱుముసేయు
మెత్తనైన పదనునకె మిగులఁగోఁత.

- పానుగంటి, కళ్యాణ రాఘవము

రాపిడి వల్లనే మంచి పదును వస్తుంది.

- సరస్వతీదేవి, సాహిత్యోద్యానము

## పద్యకావ్యం

పద్య కావ్యంలో వున్న విశేషమే అది. చదవగానే బోధపడి పోకూడదు.

- సూర్యారావు, నీలితెరలు

## పద్యం

పద్యం తెలుగువాడి స్పెషాలిటీ. గోంగూర పచ్చడి, పెసరట్టులాగ.

- యజ్ఞన్నశాస్త్రి, మాయనొప్పులు

పదినీతులు పది బూతులు
పది శృంగారములు గల్గు పద్యములు సభం
జదివినవాఁడే యధికుఁడు.

- కవి చౌడప్ప

గుడి కూలును; నుయి పూడును;
వడి నీళ్లన్ జెఱువు తెగును. వనమును ఖిలమౌఁ;
జెడనిది పద్యం బొకటే
- గువ్వలచెన్న శతకము

పనసకాయ

పనసకాయ లభించినప్పుడు తద్దినము పెట్టవల సినదని పెద్దల వాక్యమున్నప్పుడు, తద్దినము నాఁడే పనసకాయ లభించినప్పు డింకఁ జెప్పవ లసిన దేమున్నది?
- పానుగంటి, సాక్షి

పని

పనిచేయవలసి వచ్చినప్పుడు మనస్ఫూర్తిగానే చేయాలి. లేకుంటే చేతగాదని దండంబెట్టాలి.
- కె. యల్., కొత్తగుడి

చావకుండా బతికుండాలంటే చచ్చేదాకా పని చెయ్యక తప్పదు.
- శేషగిరిరావు, వఱడు

పనివంటి వస్తువు లోకంలో లేదండి.
- గురజాడ, కన్యాశుల్కం

పనిచేసి కష్టపడరాదనే భావం ఏ మనిషిలోనూ సహజంగా కలగదు.
- కొడవటిగంటి, ఆడజన్మ

పనిచేసిన కొద్దీ తిట్లెక్కువ. పనిచేసినకొద్దీ పని కూడా ఎక్కువే.
- పాండురంగారావ్, పాతకథే

తెలివిగల నాలుక పనిచేయదోయ్ పిచ్చీ! నవ్వే మొఖం పనిచేస్తుంది.
- పిచ్చేశ్వర్రావు, గడవని నిన్న

పెళ్ళిళ్ళు కుదర్చడం వయసుమళ్లిన వాళ్ళు చేసే పని.
- మహీధర, కత్తుల వంతెన

మించి గాఢప్రతిజ్ఞ చెల్లించుకొంటిఁ
గనుక నా జుట్టు ముడివేసికొనుదు నింక.
- తి. వేం., ముద్రారాక్షసము

బ్రతుకుటకెన్ని సాధనములు లేవు; చేసికొనుట కెన్ని పనులు లేవు?
- పానుగంటి, సాక్షి

పనిచేసే వాడికి పరికరాలు కాదు ప్రధానం. దీక్షా, ఏకాగ్రతాను.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, మార్గదర్శి

జోలిమాలిన పనికిఁ బోరాదు.
- చిన్నయసూరి, మిత్రభేదము

పరాధికారము పయివేసికొన్నవాఁ డోంద్రవెట్టి మోఁదువడిన గాడిదవలె వినాశముఁబొందును.
- చిన్నయసూరి, మిత్రభేదము

జోలిమాలిన పని పయిఁబెట్టుకొన్నవాఁడు మేకను బెఱికిన కోఁతివలెఁ దప్పక ముప్పుఁ జెందును.
- చిన్నయసూరి, మిత్రభేదము

పనికిరానివి

చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్
మీసాలపైఁ దేనియల్
- పెద్దన, మనుచరిత్రము

ఓర్పులేని భార్య యున్న ఫలం బేమి
బుద్ధి లేని బిడ్డ పుట్టి యేమి
సద్గుణంబు లేని చదువది యేలరా?
- వేమన

ఎఱుక లేని దొరల నెన్నాళ్లు కొలిచిన
బ్రదుకు లేదు వట్టి భ్రాంతికాని
గొడ్డుటావు పాలు గోకిన చేఁపునా?
- వేమన

శుభముల నొందని చదువును
నభినయమును రాగరసము నందని పాటల్
అభిలాష లేని కూటమి
సభ మెచ్చని మాటలెల్లఁ జప్పన సుమతీ!
- బద్దెన, సుమతి శతకము

వాసనలేని పువ్వు బుధ
వర్గములేని పురంబు నిత్యవి
శ్వాసము లేని భార్య గుణ
వంతుఁడుగాని కుమారుఁడున్ సద
భ్యాసము లేని విద్య పరి
హాస ప్రసంగములేని వాక్యమున్
గ్రాసములేని కొల్వు కొఱగానివి
- పెమ్మయసింగధీమణి శతకము

ఎన్నికలలో పనికిరానిదల్లా ఒక్క నిజాయితీయే చంద్రం.
- వెంకటేశ్వరరావు, సమాధి కడుతున్నాం - చందాలివ్వండి

ఆడదానికి బద్ధకము, మగవాడికి పరధ్యాసా పనికిరాదు.
- పురాణం, పుస్తకాలు - పరధ్యాస

కార్తిలో పడని వర్షం, కాలంలో పుట్టని కొడుకు సమయానికి పనికిరావే.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

పనితనం

పనివాడు పందిరి వేస్తే పిచ్చుకలు వచ్చి పడదో సినవన్నట్లు.

- సామెత

చూపులకు చుంచు, పనికి పర్వతం.

- సామెత

పనిమంతుడు చక్కటి పందిరి వేస్తే కుక్కతోక తగిలి కూలిపోయిందట.

- సామెత

పనిదొంగ

దున్నబోతే దూడలలోను, మేయబోతే పోతుల లోను.

- సామెత

తిండికి తిమ్మరాజు పనికి పోతురాజు.

- సామెత

పనిమనిషి

ఒక ఇంటి చరిత్ర ఆ ఇంట్లో పనిచేసే పని మని షికి తెలిసినంత క్షుణ్ణంగా మరెవరికీ తెలి యదు.

- నాగచంద్రావతి, కాలం కరిచాక

మంచి పనిమనిషి ఎవరినన్నా ఆకర్షిస్తుంది.

- కొడవటిగంటి, ఆడజన్మ

పని మానటం

కంకణ విసర్జనల కిది కాలమగునె.

- రాయప్రోలు, జడకుచ్చులు

పన్ను

రాబడి పన్ను కట్టడం వొక బాధ - ఎగెయ్యడం మరీబాధ.

- బుచ్చిబాబు, కార్యదర్శి కల్యాణి

అసలు పన్నాడందే రాబడిపన్ను రాలుతుందా!

- బుచ్చిబాబు, ఒకేనిద్ర - ఎన్నో కలలు

పంతం

వయసు మళ్ళుతున్నాడికి పంతా లుండకూడదే.

- కాంతారావు, వంశధార

పంది

పంది పరిశుభ్రతకు చిహ్నం. అదే లేకుంటే మా బెజవాడ ఈ మాత్రం శుభ్రంగానన్నా ఉండేది కాదు.

- చలసాని, మాస్టర్ పీసు

సిద్రాజుల సేరీ ఏటు జిగిని పందిని కాపోతే అడవి పంది మీనటే?

- కృష్ణంరాజు, దివాణం సేరీవేట

పందికొక్కు

పందికొక్కును చంపితే పై జన్మానికి వృబ్బసం తగులుకుంటుందంటూ పెద్దలు చెపుతారు.

- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

పబ్లిసిటీ

పబ్లిసిటీ లేని ప్రజాసేవ
పనిలేని మంగలితనం.

- భీమన్న, మారనివాడు

పెనుగాలుల
పబ్లిసిటీ ముందు
చిరుగాలుల సింప్లిసిటీ
మట్టికొట్టుకుపోతుంది
మూర్ఖత్వం ముందు మానవత్వంలా.

- రాజేంద్ర, గుండె చప్పుళ్లు

పంపకం

పని కూలీ వెధవల్ది, లాభం బుగతది.

- రావిశాస్త్రి, మాయ

పాపాలంటూ ఏమైనా వుంటే, తీర్పులు చెప్తారు కాబట్టి, ఆ పాపాలన్నీ జడ్జీలవి. ఖర్చులన్నీ పార్టీలవి. లంచాలన్నీ సాక్షులవీ, గుమాస్తాలవీ. ఫీజులన్నీ మనవి.

- రావిశాస్త్రి, మాయ

ఆకులన్నీ ప్రజలవి, ఆపిల్ పళ్లన్నీ అధికార్లవి.

- రావిశాస్త్రి, మాయ

చీకటి
పేదోళ్ళకు!
వెల్తురు
పెద్దోళ్ళకు
జీతం పాలేరుకు
జీవితం కామందుకా?

- రాధేయ, అవునా!

పరకాయ ప్రవేశం

మనిషి తొడుగుకి ధనపిశాచి పరకాయ ప్రవేశం చేసింది.

- సదానంద, రామదాసుచెర

పరదూషణ

చతురతగల సరసత్వము పరదూషణలేక రాణింపనే రాణింపదు.

- కొచ్చెర్లకోట, అపవాద తరంగిణి

పరదేశి

పరదేశిని ప్రేమించకూడదు. పరదేశిని పెళ్లాడకూడదు. రెండింటిలో ఏది చేసినా దుఃఖం తథ్యం.

- పురాణం, ఇల్లాలి ముచ్చట్లు

పరధనం

పాల సాగరమునఁ బవ్వళించిన హరి
గొల్లపల్లె పాలు గోరనేల
నెదుటివారి ద్రవ్య మెల్ల వారికిఁ దీపి

- వేమన

పరధ్యానం

ఉయ్యాలలో బిడ్డనుంచి ఊరంతా వెతికిందట.

- సామెత

పరపతి

పేదోడికయితే పరపతిపోతే పెళ్లంపోయినట్టు.

- కాంతారావు, వంశధార

కుక్కలు మొరిగితే యేనుగు పరపతేమి పోతుంది?

- చిలకమర్తి, కాందూరి జానకిరామయ్యగారి పెండ్లి

పరపతి పోయినాక తిరుపతి చేరుకోవలసిందే గదా.

- ఆవుల, ఉలిపికట్టె

తల్లితండ్రి పోతే బతకొచ్చుకానీ, పరపతిపోతే బతకలేం.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

ఈ రోజుల్లో అర్హతలకి విలువెక్కడుంది. లేవోయ్? ఈ రోజుల్లో కావల్సింది డబ్బు. లేక పోతే పరపతి. ఈ రెంటిలో యే ఒక్కటివున్నా, కార్యాన్ని సాధించవచ్చు.

- ముద్దంశెట్టి, నిమిత్తమాత్రులు

ఒకదేశంలో ప్రజ ఎంతపేద ప్రజైనా, ఆ దేశంలో కోటీశ్వర్లు ఎంతగొప్ప కోటీశ్వర్లయినా, పరపతికాడ కొచ్చేసరికి ప్రజల్దే పరపతి.

- కాళీపట్నం, కుట్ర

పరబ్రహ్మ

అన్నం పరబ్రహ్మ స్వరూపం -- అందుకు అన్వేషణ తప్పదు. పరబ్రహ్మన్ని అన్వేషించడమే జీవితలక్ష్యమని అన్ని మతాలు అంగీకరిస్తాయి.

- చాసో, పరబ్రహ్మము

పరభూమి

దొరయైన యతఁడు మఱచియుఁ
బరభూమికిఁ బోవరాదు.

- కదిరీపతి, శుకసప్తతి

పరం

పరంలో నో ఎడ్మిషన్, కళ్లకు కటకటాలు
కనికరానికి కారాగారం, కడుపులోకి కంకర
మా గీతలు వంకర, మాచుట్టూ బానిసత్వం

- ఆరుద్ర, మాతృకాంక్ష

పరలోకం

పుట్టిన దాదిగా మృతిని
బొందిన దాఁకను జీవితంబుపై
తట్టున నేమి యున్నదియొ
దాని నెవండును జూడలేదు, తా
మట్టుల నిట్టులాడిరి, య
థార్థమొ కాదొ యెవడెఱుంగు? నీ
పట్టిన కొమ్మ కొమ్మ, పెఱ
వానికి నేటికిఁ బ్రాకులాడఁగన్?

- విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము

పరస్పరం

పుండు మానాలని వాతవేస్తే వాత పుండయిందట.

- సామెత

తాగితే కాని పనిసెయ్యలేం: పని
సేత్తే తాగాలి.

- మద్దూరి, మధుసేవ

కోణంగి నాట్యముల్ కోఁతులాడించగా
నూరబందులు తలలూఁచినట్లు
గూబ కూతలు విని గువ్వలు తలలూఁచి
పోయి కాకులయొద్దఁ బొగడినట్లు
కాలువ దరినుండి కప్ప లంకించఁగా
నెండ్రకాయలు తలలెత్తినట్లు
ఎనుబోతు బిరుదులు మనుబోతు పొగడంగ
మేలుమేలని గొఱ్ఱె మెచ్చినట్లు
ఓగుధగిడీలు తమలోన నొకరినొకరు
మెచ్చుకొనుచుందు రెటువంటి పిచ్చితనమొ!

- పుల్లకవి, చాటువు

**పరాకు**

పరాకు పడటమే ధర్మమండి, అది మహారాజు చిహ్నము

- కందుకూరి, హాస్యసంజీవని

**పరాజయం**

జయమగు నోడుదు మను ని
శ్చయ మెక్కఁడులేదు వినుము సమరమునఁ బరా
జయము మరణంబుకంటె హృ
దయపుటభేదనము సేయుఁ దథ్యం బనఘా.

- తిక్కన, ఉద్యోగపర్వము

**పరాయివాళ్లు**

ఎమ్మెల్యేలనీ, మంత్రుల్నీ పరాయివాళ్లకింద చూసేవాళ్ళు చరిత్రకి అడ్రసు లేకుండా పోతారు.

- పతంజలి, అప్పన్నసర్దార్

**పరిచయం**

అభిమానించే పాఠకులకీ, మంచి రచయితకూ, పరిచయాలు వుండకూడదు.

- నంది, నైమిశారణ్యం

**పరిణామం**

తిన్నను దినకున్నను గూడఁ బరిణామ శూల బాధ తప్పనపుడు కోడిపలావు తినక నోరు కట్టుకొనుట యెందులకు?

- పానుగంటి, చూడామణి

పండితపుత్రుడు పబ్లిషర్ అయినట్టు!

- శ్రీరమణ, న్యూనుడి

కామగంధంబులేని యేకణముగాని
యన్యభుక్తంబుగా భువి నంతరించు

- దువ్వూరి, కడపటి వీడుకోలు

మంత్రులు ముఖ్యమంత్రు లవుతున్నప్పుడు
డ్రయివర్లు పైలట్లు కావాలగదా...

- పతంజలి, అప్పన్న సర్దార్

ఎగిరిన ఎద్దే గంత మోసింది.

- సామెత

నిన్నటి రాజశ్యాలకుడు నేటి శకపురుషుడు

- జ్వాలాముఖి, శకపురుషుడు

శిలలు ద్రవించి యేడ్చినవి
జీర్ణములైనవి తుంగభద్రలో
పల గుడిగోపురంబులు స
బాష్పలులైనవి
కొండముచ్చుగుం
పులకు చరిత్రలో మునిగి
పోయిన దాంధ్రవసుంధరాధిపో
జ్జ్వలవిజయప్రతాపరభ
సం బొక స్వప్నకథావిశేషమై

- వేంకటసుబ్బారావు, హంపీక్షేత్రము

షావుకారుగా పుట్టి, సన్నాసై పోవచ్చుగాని, ముష్టెదవకి మారాజయ్యే యోగం ఉండదు.

- బీనాదేవి, కళ్ళు

ఎన్నో జన్మల పరిమాణంలో ఒక్కొక్క జన్మ కొన్ని క్షణాలే కావచ్చు ఆ కొన్నిక్షణాల వ్యవధి లోనే ఎన్నోవేల అనుబంధాల్ని పెంచుకుంటాం. వాటి తాలూకు జ్ఞాపకాల్నీ, అనుబంధాల్నీ మోసు కుంటూ జీవితం పొడుగునా మనల్ని మనం మోసం చేసుకుంటూనే వుంటాం.

- రామచంద్రమూర్తి, అనుభూతీ-అనుబంధం

భార్యను కేవలం
బెడ్‌లైట్‌గా వాడుకునే భర్తకు
ఆ భార్య రెడ్‌లైట్‌గా మారితే
వాడి జీవితం
మిడ్‌నైట్ అవుతుంది.

- రాజేంద్ర, గుండె చప్పుళ్ళు

**పరిపాకం**

వట్టి తెలుఁగు కావ్యములే చదివినచో
మనస్సునకు పరిపాకము కుదరదు.

- విశ్వనాథ, చెలియలికట్ట

**పరిపాటి**

పెళ్ళి పేరు చెప్పగానే ఆడపిల్లలు అనవసరంగా సిగ్గుపడి పారిపోవడాలు, పెళ్ళి నిశ్చయం అయిందనగానే మరింకేమి ఆలోచించక రాత్ర నక, పగలనక కలల్నీ, ఆతరవాత పిల్లల్నీ కనే యడం చాలా పరిపాటైపోయింది.

- బీనాదేవి, పెళ్ళిపార్టు

**పరిపాలన**

మరో గంటలో మంత్రివర్గ ప్రమాణ స్వీకారం వుంటాది. అందరూ ప్రమాణ స్వీకారం చేసిన తరువాత పేషీలకెళ్ళి నిద్దరపొండి... అదే పరి పాలనంటే..

- పతంజలి, అప్పన్నసర్దార్

**పరిమళం**

"పవర్"కి (అంటే అధికారానికి) ఒక విధమైన

పరిమళం వుంటుంది. సిరి సంపదలకి ఒక విధమైన సువాసన వుంటుంది. ఆ రెండూ తరచు కలుస్తాయి.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

### పరిమితి

త్యాగానికి కూడా ఒక పరిమితి వుండాలి.

- సభా, నీటిదీపాలు

ప్రామాణికబుద్ధి నిజముగా చాలామంచిదే, కాని మితమును దృష్టిలో నుంచవలెను.

- మాడపాటి, ఎవరికి?

### పరివర్తన

మంత్రాలకు చింతకాయలైనా రాల్తాయేమోగానీ మంచి కథలు మనుషుల్లో పరివర్తన తేగలుగుతాయా?

- రామచంద్రమూర్తి, ప్రియబాంధవి

### పరిశీలన

కరంబు పరికింపక యేకార్యంబునకేనిం దమకింప లగ్గు గాదు.

- చిన్నయసూరి, మిత్రభేదము

### పరిశుద్ధం

వెండిబంగారములు పరిశుద్ధ పదార్థములెకావున స్వీకరించినవారి మనస్సులు గూడ పరిశుద్ధములు చేయును.

- చిలకమర్తి, గణపతి

### పరిశోధన

ఎనటమీ చెబుదాం అంటే కళేబరాలే దొరక్కపోయె? ఇహ పరిశోధన ఎలా చస్తుంది?

- లక్ష్మణరావు, అతడు-ఆమె

### పరిశ్రాంతి

ప్రశ్నమున కుద్గమన పరిశ్రాంతి వలదు
తెలిసి యుత్తర మీ నాకు వలనులేమి

- శ్రీనాథుడు, శృంగారనైషధము

### పరిష్కర్త

పరిష్కరించవలసినవారు ప్రజలుకారు, ప్రజల్లో పరపతివున్న వాళ్ళు

- కాంతారావు, అభ్యుదయం

అన్ని సమస్యలూ వాటికవే పరిష్కారమైపోతాయి. ఒక్కలా వాటిని గురించి మనుషులు తేల్చుకోలేక పోవటం తప్ప మరేదీలేదు.

- కొడవటిగంటి, ముసలం

పరిష్కారం పైనుంచి చూస్తే తేలేదికాదు, లోతుకు వెళ్ళే వరకూ పోవాలి!

- సోమసుందర్, సమాజం నాడీపరీక్ష

### పరిస్థితి

పరిస్థితులకు మానవుడు బానిస.

- బుచ్చిరెడ్డి, రాలినమొగ్గ

కవులు పొగడువేళఁ గొంతలు రతివేళ
సుతులు ముద్దువేళ శూరవరులు
రణము సేయువేళ రాకొట్టి పిలుచుట
పాడి యిదియ మిగుల భజనకెక్కు.

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

పదియు నాలుగు భువనము ల్వెదకి చూడ
నేను దలదాచుకొనఁదగు నెలవు లేదు!

- చిలకమర్తి, గయోపాఖ్యానము

పరిస్థితుల్ని మార్చుకోవాలంటే ముందు మార్చుకోవాలనే బుద్ధి కలగాలి. అలా బుద్ధి కలగాలంటే పరిస్థితులు మారాలి.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

వాంఛాసహితమైన స్థలమునందుఁ బెలచోట
సింహమైన వాఁడుకూడ తెక్కలూడ్చిన పిట్ట.

- విశ్వనాథ, చెలియలికట్ట

అనుభవంబట్టి మారుతుండేదేకదా మనుష్య ప్రకృతి? ప్రపంచ చరిత్రే మారుతుంది. ఇతిహాసమే మారిపోతుంది. పరిస్థితులను బట్టే మానవకోటి ప్రవర్తన, వ్యక్తి ప్రవర్తన కూడాను.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

చిక్కియున్న వేళ సింహంబు నైనను
బక్క కుక్కయైన బాధ సేయు
బలిమి లేనివేళ పంతముల్ చెల్లవు.

- వేమన

తమతమ నెలవులు దప్పినఁ
దమ మిత్రులు శత్రు లౌట తథ్యము సుమతీ!

- బద్దెన, సుమతి శతకము

ఆఁకటికి తొలంగు నాచారవిధు లెల్ల
చీఁకటికి తొలంగు చిత్తశుద్ధి
వేఁకటికి తొలంగు వెనుకటి బిగువెల్ల.

- వేమన

ఆఁడుదానిఁ జూడ నర్థంబుఁ జూడంగ
బ్రహ్మకైన బుట్టు రిమ్మ తెగులు
బ్రహ్మ యాలిఁ, త్రాడు బండిరేవునఁ ద్రెంప!

- వేమన

ఆపదదందుఁ జూడు మారయ బంధుల
భయము వేళఁ జూడు బంటు గుణము
పేదవడ్డ వెనుకఁ బెండ్లము మఱిఁ జూడు
- వేమన

**పరిహారం**

పాపం చేసినప్పుడు పరిహారం కూడా ఉండాలి.
- రెంటాల, ఇన్‌స్పెక్టర్ జనరల్

కష్టాలకు నష్టాలకు పరిహారంగా హృదయటంక శాల నుంచి బాష్పబిందువుల్ని వెండి నాణాల్లా వెచ్చించాల్సి వుంది.
- రామమూర్తి, అగ్నిగర్భ

**పరీక్ష**

పరీక్ష యెంత విషమమయితే ఫలితం అంత దారుణంగానూ మహోన్నతంగానూ లభిస్తుంది.
- కాళీపట్నం, జన్మభూమి

ప్రేమని పరీక్ష చెయ్యకూడదు.
- లక్ష్మణరావు, అతడు-ఆమె

మనిషి మంచి చెడ్డలు తెలుసుకోవాలంటే అతణ్ని అధికార పీఠంలో పెట్టాల.
- సామెత

**పరుగు**

పరుగే ఒక బీజం
ప్రగతి దాని భూజం.
- సినారె, ఇంటిపేరు చైతన్యం

పట్టణాలలో సౌకర్యాలు, వేషభాషలు కాలంతో బాటు పరుగెడుతుంటై.
- విశ్వం, పడవ

**పరువు**

పరువుని ఎప్పుడూ పణం పెట్టకూడదు. ఒక సారి పోతే డబ్బులాగే పరువు తిరిగిరాదు.
- రామచంద్రం, పలుకే బంగారమా?

తాను యేసంఘంలో పుట్టి పెరుగుతున్నాడో ఆ సంఘంయొక్క ప్రయోజనాల కొరకు అవసర మైతే స్వప్రయోజనాలను త్యాగం చేసి బ్రతకగ లగటమే పరువూ, మర్యాదలనే మాటలకు అర్థమనుకుంటున్నాను.
- సూరి, చంఘీజ్‌ఖాన్

తల పరువు నోరె చెప్పును.
- గువ్వల చెన్న శతకము

**పరోపకారం**

ప్రపంచంలో ధర్మము లెవరు విన్నను పరు లకుఁ జెప్పుటకేగదా?
- కాళ్ళకూరి, చింతామణి

**పర్యవసానం**

ఇష్టంలేని పెళ్ళికూతుళ్లు కాపరాలకి వెళ్ళేక లోపల ఉన్న దుఃఖంవల్ల కొంతమంది దీనంగా కనిపిస్తారు. మరికొంతమంది కోపంగా, కసిగా కనిపిస్తారు.
- రావిశాస్త్రి, పక్కింటి అబ్బాయి

చిన్న చేపను పెద్దచేప మింగితే పెద్ద చేపను బెస్తవాడు మింగుతాడు.
- సామెత

చుట్టంగా వచ్చి దయ్యమై పట్టుకొన్నాడట.
- సామెత

**పర్సు**

విలువల్ని మనసు బేరీజు వేస్తుంది. పైకాన్ని పర్సు నిర్ణయిస్తుంది.
- మారుతీరావు, మళ్ళీ మధుమాసం

**పలకరింపు**

"బావున్నావా బాపనయ్యా' అంటే "నా పాతబాకీ ఎప్పుడిస్తావు" అన్నాట్ట వెనకటికి.
- సామెత

**పలాయనం**

జీవితపు టెంగిలిని
ఊహలనే అంగలతో దాటిపోదాం, పద!
- బైరాగి, పలాయనం

పారిపోయి దేన్నించీ తప్పించుకోలేం
- జయరాం, ఓడిపోలేదు

**పలుకు**

తప్పదు నాపలు కట్ల చూడుమీ!
- తిక్కన, విరాటపర్వము

**పలుకుబడి**

ఎవళ్ళకి రూల్సు? పలుకుబడి లేనివాళ్ళకి.
- బుచ్చిబాబు, ఆత్మవంచన

నోట్లో ఏ పలుకూ లేకపోయినా జిల్లా అంతా వీడి పలుకుబడే.
- కృష్ణంరాజు, దిగులు

డబ్బుంటే నలుగురూ ఏదో వరసా వావీ

కలుపుకుని దగ్గర చేరుతుంటారు. పలుకుబడి పెరుగుతూంటుంది. దాన్నాపడం కష్టం.

- శ్యామలారాణి, జై మంగళా

**పల్లకీ**

బాగ్గెమంతుడి పల్లకి బగుమంతుడె మోస్తాడూ.

- రావిశాస్త్రి, బంగారిగాడి కత

**పల్లం**

మెరక నీరూ పల్లానికే - పల్లం నీరూ పల్లానికే.

- పినిశెట్టి, పల్లెపడుచు

**పల్లె**

"ఇల్లు లేనమ్మ ఈనం చెడె, మగడు లేనమ్మ మానం చెడె" అనే లోకోక్తి పల్లెల్లోనే పుట్టింది.

- సభా, పిచ్చి దంపతులు

పల్లెపట్టుల మాట పలుకకోయీ కవీ!
పైపచ్చనేగాని లోపలున్నది చిచ్చు
కుచ్చితాలే కొంపలన్నీ
మచ్చరాలకు మారుపేర్లు!

- ప్రయాగ, బాటసారి

**పల్లెపడుచు**

భావ మమృతమయమొ పలుకు బంగారమో బైటంబడదు పల్లెపడతులందు

- ఏటుకూరి, క్షేత్రలక్ష్మి

**పల్లెజీవితం**

నిజంగా కంట్రీలైఫ్‌లో చాలా చమత్కారం ఉంది?

- గురజాడ, కన్యాశుల్కం

నిష్కలుషపు గ్రామ్యజీవనపుం గమ్మదనంబు బలే! గుబుల్గొనున్

- దువ్వూరి, వానాకాలపు పల్లెజీవితము

**పల్లెటూరివాళ్ళు**

ఏ మనిషిగానీ పూర్తిగా నిర్దోషి అనుకోవటం పల్లెటూరివాళ్ళకు చాతకాదు.

- కొడవటిగంటి, ఆడజన్మ

**పవిత్రత**

నేను వెధవముండనీ, మీరు సరసులున్నూ, మన కంటే మరి పవిత్రం అయినవారు యవరుంటారు?

- గురజాడ, కన్యాశుల్కం

పెళ్ళాం అనేది అయోనిజ అయితే, ప్రతి మగరాయుడూ బ్రతికిపోతాడుకద!

- రామచంద్రశాస్త్రి, ముఖచిత్రం

వాగ్భూషణమే సుభూషణము
భూషణముల్ నశియించు నన్నియున్.

- లక్ష్మణకవి, సుభాషిత రత్నావళి

చాలామంది పవిత్రులకి వారి పూర్వజన్మలో రొమాన్సు జరిగి ఉంటుందన్నా ఆగ్రహం కలుగుతుంది.

- చలం, మ్యూజింగ్స్

శవాలూ, చెత్తా చేరినా.. గంగ. పవిత్రమైనదే.

- కాంతారావు, వంశధార

**పశుత్వం**

మానవునిలో వున్న పశుత్వం, ప్రతివ్యక్తి జీవితంలోను ఒకసారి పైకి వచ్చునట్లుగానే ఒక సంఘ జీవితంలో కూడా అప్పుడప్పుడు వస్తుంది.

- బాపిరాజు, బొమ్మలరాణి

**పశువు**

మనస్సనేది లేకుండా, వావివరసలతో సంబంధం లేకుండా కోరికలు తీర్చుకునేది మనుష్యులు కాదు పశువులు.

- భారతీదేవి, సుడిగుండాలు

అనురాగానికీ, ఆప్యాయతకూ లొంగనివాడు మనిషి కాదు పశువు.

- భారతీదేవి, సుడిగుండాలు

**పశ్చాత్తాపం**

మనిషికి పశ్చాత్తాపాన్ని మించిన శిక్షలేదని మన శాస్త్రాలు చెప్తున్నాయ్.

- వీరేంద్రనాథ్, ఒకరాధ ఇద్దరు కృష్ణులు

అవకాశం దొరికినప్పుడు చెయ్యని చెడ్డపనులకి పశ్చాత్తాపపడతారుట మనుషులు.

- బుచ్చిబాబు, ఒకేనిద్ర-ఎన్నోకలలు

**పస**

పప్పే పస బాపలకును
ఉప్పే పస రుచులకెల్ల ఉవిదలకెల్లన్
కొప్పే పస.

- కవిచౌడప్ప

**పసితనం**

ఏ మనిషికైనా సాధారణంగా పసితనం ఒక వరం లాంటిది.

- రామకృష్ణ, పగలు చీకటి

**పాకులాట**

'ఎంతోమంది' ఆశకోసం జీవిస్తుంటే 'కొంత మంది' మాత్రం ఆశయాలకోసం ప్రాకులాడి ప్రయోజనం ఏముంటుంది?

- రామచంద్రమూర్తి, శ్రీరాగం

**పాట**

పాట బిడ్డ పుట్టుకలాంటిది. కన్‌సీవ్ చేయడా నికి ఒక్క క్షణం చాలు. కాని సలక్షణంగా డెలి వరీ చేయడమే కష్టం.

- వెంకటకృష్ణమూర్తి, ఎయిర్‌హోస్టెస్

త్రుళ్ళనిదీ కుళ్ళనిదీనీ
మళ్ళినదీ వెళ్ళనదీనీ
చచ్చేదీ లాభం లేనిది
ఈ జన్మకు పనికిరానిదీ
మనకెప్పుడు కలసిరానిదీ
సామానోయ్ సరదాపాటకు.

- సరదాపాట

duets లేకుండా ఇండియాలో ఫిల్ము తయారైతే, ఘోర ప్రమాదాలు కలుగుతాయని జాతకుల విశ్వాసం.

- చలం, మ్యూజింగ్స్

**పాటవం**

రెండప్పడములు నలిపి రూపుమాపుటకు ఖండన పాటవ ముండనక్కఱలేదు.

- కూచి, రూపలత

**పాటు**

జారితే పడమన్నారు; జరిగితే పడమన్నారు.

- సామెత

కారానికి కాలానికి రారాని పాట్లు.

- శ్రీరమణ, న్యూసుడి

**పాఠకుడు**

పొరుగువాడి పేపరుతోనే పొద్దు గడపడం మన మేధావులకు పరిపాటి.

- సుధాకరరెడ్డి, పత్రికాపురాణం

మనదేశంలో ఒకడి చేతులో ఒక పత్రిక ఉంటే దాన్ని అధమము, ఇరవై మందైనా చదువుతారు.

- మునిమాణిక్యం, బొమ్మలపండుగ

ఈ ప్రపంచమే మనందరికీ పాఠాలు నేర్పు తోంది. మొండివాళ్ళు నేర్చుకోవడానికి తిరస్కరి స్తారు. బుద్ధిమంతులు ఇట్టే గ్రహిస్తారు.

- సోమసుందర్, గుప్తసాలగ్రామం

**పాడుపని**

కొన్ని పాడుపనులు చేసేవాళ్ళని చూసి అందరూ అసహ్యపడతారు ఈ ఇంగ్లీషు వాళ్లు అన్ని పాడుపనులు చేశారు. వాళ్ళని ఎందుకు గొప్పగా చూడాలి?

- కొడవటిగంటి, చదువు

**పాండిత్యం**

పాండిత్యానికి, సత్యధర్మాల్లోనేగాని, బుకాయింపు ల్లోనూ, పిడివాదాల్లోను కాదు వినియోగం.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, అనుభవాలూ - జ్ఞాపకాలూనూ

మీ పాండిత్యం వేరు. మా పాండిత్యము వేరు. వకరిది వకరికి సరిపడదు.

- కందుకూరి, మహామహోపాధ్యాయ

పాండిత్య మనఁగా శబ్దార్థపరిజ్ఞానము. శాస్త్రీయ ములైన చర్చలను నెరపెడి నేర్పు. నాకది తెలి యనిది తెలియునన్న యహంకారమునకు పట్టు.

- విశ్వనాథ, దిండు కింది పోకచెక్క

పాండిత్యం ఎక్కువైతే బుద్ధికి పడిశం పడు తుంది.

- చాసో, పరబ్రహ్మము

మెట్రిక్యులేషన్ మూడేండ్లయినా తప్పకపోతే ఇంగ్లీషు వచ్చినట్లుకాదు. ఎన్నేండ్లు తప్పితే అంత విలువ.

- శివరామశాస్త్రి, సిపాయి

పనివచ్చునప్పుడు కాని పాండిత్యము వెల్లడి కాదు.

- కాళ్లకూరి, పద్మవ్యూహము

పాండిత్యము కురిపిస్తూంటే యలా నిద్రపోయి నాడయ్యా?

- గురజాడ, బిల్హణీయము

**పాత**

పాత చింతకాయ పచ్చడి, పాత యుసిరికాయ పచ్చడి పథ్యమునకు పనికి వచ్చి యెంతో యుపకారముఁజేసినట్లే పాతూళ్ళు కూడా చాలా పనికివస్తాయి.

- చిలకమర్తి, పోట్లకై తిరుగుట

క్రొత్త రుచి. ప్రాత రోత.

- చిలకమర్తి, శ్రీరామనవమి పందిరి

**పాతకం**

పాపాలన్నిటికి మూలవిరాట్టు దారిద్ర్యం దాన్ని తలతన్నిన మహాపాతకం డబ్బు ఎట్లా వాడు కోవాలో తెలియకపోవటం.

- సాంబశివరావు. నిలవనీరు

**పాతకొత్తలు**

ప్రాఁతభార్యయైనను మొదటినాఁడు క్రొత్తదియే క్రొత్తభార్యయైనను రెండవనాఁడు ప్రాఁతదియే.

- పానుగంటి. సరోజిని

ప్రాతగిలిన మాత్రాన భవ్యములు కావు.
నవ్యమైన మాత్రాన నింద్యములు కావు.

- రాయప్రోలు. రమ్యాలోకము

ప్రాతవయినంతనే త్యజింపరు. నవీన
మయిన మాత్ర వరింపరు: ప్రియముల్లై, స
హృదయ సేవ్యమానముల్లైనవెల్ల, స్వీక
రించి భావాంబర మలంకరింతు రర్థి.

- రాయప్రోలు. రమ్యాలోకము

**పాత చదువు**

నోట్సు లేకుండా ఉపన్యాసమివ్వమంటే బయట పడుతుంది పంతుళ్ల ప్రతాపం. పూర్వకాలంలా కాదు అంతా రిఫరెన్సు చదువు.

- వేంకటరాయశాస్త్రి. వ్యామోహము

**పాతివ్రత్యం**

ఇది నాది. ఇది నాకే కావాలి. దీన్ని వదలను అనే భావం ప్రేమకాదు. అది పాతివ్రత్యం.

- చలం. సత్యవంతుడు

**పాత్ర**

మనం మనుషులకి పాత్రలు నిర్ణయిస్తే కథలో నేగాని, జీవితంలో వాళ్లు ఆ పాత్రలలో నిల వరు. భర్తలు భార్యలకి పతివ్రతా పాత్రలు నిర్ణ యిస్తే వాళ్లు వేశ్యల పాత్రలని ధరిస్తామం టారు. చెప్పో, చెప్పకుండానో మంత్రిత్వమిస్తే నియంతల పాత్రలు ధరిస్తారు. ఇంకొందరం నౌకరు సామ్యవాది నంటాడు.

- చలం. వాళ్లు నలుగురూ

**పాత్రికేయులు**

జర్నలిస్టు అన్నవాడు ప్రపంచంలో ప్రతిదీ తెలు సుకోవాల్సిందే- నిషిద్ధం అంటూ లేదు.

- పార్థసారథి. సాహిత్య హింసావలోకనం

తగాదా జరిగినంతసేపు
మన పోలీసులు ఆవేపుకు పోనట్లే
జీవితం విలువలు మారిన చోటికి
పత్రికా ప్రతినిధులు పోరు.

- కుందుర్తి. మానభంగ

సి.ఐ.డి ఆఫీసర్‌ని రాజకీయ నాయకులు కొనే యగలరు. కాని ఇన్‌వెస్టిగేటివ్ జర్నలిస్టుని కొన లేరు. (ఎందుకంటే అతనికి రాజకీయ నాయ కులు ప్రలోభ పెట్టే మెటీరియలిస్టు బహుమానా లకంటే ఒక సెన్సేషనల్ ఆర్టికల్ రాసి జనంలో సంచలనం కలిగించగలిగినప్పుడు కలిగే థ్రిల్ ఆనందం ఇంకా ఎంతో గొప్పవి)

- ఆనందారామం. అర్థంలోశత్రువు

**పానం**

అమృతపానంచేత చావు లేనప్పుడు రోగాలు యెక్కడ నుంచి వస్తవి?

- కందుకూరి. కలిపురుషశనైశ్చరవిలాసము

**పాపఫలం**

ఈ లోకంలో పాపుల సంఖ్య ఎక్కువ కాబట్టి చాలా దేవాలయాలలోని హుండీలు ధనరాసు లతో నిండిపోతున్నాయి.

- చిన్నబాబు. డబ్బు

**పాపం**

కుక్కను చంపిన పాపం కోవిల కట్టించినా పోదు.

- సామెత

మనం చేసే పనులు ఇతరులని బాధిస్తే పాపం.

- వెంకటకృష్ణమూర్తి. మేఘమాల

కవిశిఖామణికి నసత్యకల్పనంబు
వలనఁ బాపము లే దదె బ్రతు కగుటను
గులట కట్టుల వ్యభిచారకలన వలనఁ
బాప ముండదు దాననే బ్రదుకుగాన.

- పానుగంటి. ప్రచండ చాణక్యము

తామరాకును తూటాకు చేయటం పాపము.

- చలం. శశిరేఖ

పాపం అని తెలిసీ కూడా పాపం చెయ్యక తప్పక పోడమే మానవ జీవితంలోని ట్రాజెడీ.

- రావిశాస్త్రి. గోవులొస్తున్నాయి జాగ్రత్త!

పులికి పాపం తెలీదు. పులికి పాపం లేదు

- రావిశాస్త్రి. గోవులొస్తున్నాయి జాగ్రత్త!

ఎన్ని పైసలున్నా ఎన్ని దేశాల్తిరిగినా పాపాన్ని

తప్పించుకోలేస్తరంట వానేరులు.

- కె. యల్., కొత్తగుడి

ఆశకి అడ్డుండాలి, పాపానికి శిచ్చుండాలి.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

ఫలాపేక్ష లేకపోతే పాప కర్మములు చేయడా నికి ప్రోత్సాహమే లేదు.

- ఉన్నవ, మాలపల్లి

వెన్ను నిచ్చువానిఁ దన్ను నమ్మినవానిఁ
జంపిరేని శిశువుఁ జంపు టంద్రు.

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

పాపము సుకృతం బయ్యెను!
శాపము వరమయ్యె జన్మ సాఫల్యముగన్.

- అనంతుడు, భోజరాజీయము

పాప విమోచనం కాంది శాప విమోచనమెలా అవుతుంది? పాపఫలమే శాపం.

- ఉన్నవ, మాలపల్లి

అంగహీను దరిద్రు విద్యావిహీను
రూపహీనునిఁ దెగడుట పాప మండ్రు.

- తిక్కన, అనుశాసనిక పర్వము

వినుముచంపుటయును జంపఁబనుచుటయును
గల్మషంబుల కెల్ల నగ్గలము లధిప.

- తిక్కన, అనుశాసనిక పర్వము

ప్రతి మనిషికీ పాపాలన్నిటిలోనూ తనలోగాని ఇతరులలోగాని సహించని పాపం ఒకటి ఉంటుంది. సాధారణంగా వారి స్థితిలో వారికి ఎక్కువగా చెయ్యా లనిపించే పాపమే అయి ఉంటుందది.

- చలం, వివాహం

**పాపం-పుణ్యం**

పాప పుణ్యములు మనము మన్నకై తెచ్చికొన్న కట్టుత్రాళ్లు.

- విశ్వనాథ, వేనరాజు

సృష్టిలో అనాదినుంచీ పాపం, పుణ్యం ఒకదాని ప్రక్క యింకొకటి ఉంటూనే ఉన్నాయి.

- గురజాడ, సంస్కర్త హృదయం

**పాపి**

తను పాపి అనే నమ్మకం లేని వాడికి అసలు దేవుడి ధ్యాసే అనవసరం!

- హనుమంతరావు, చికిత్స

**పాముకాటు**

తాచుపాము కాటు బ్రతికినా చచ్చినా నాలుగు ఝాములలో తెలుస్తుంది.

- కందుకూరి, అపూర్వ బ్రహ్మచర్యప్రహసనము

**పారతంత్ర్యం**

పరతంత్ర జనముల పాలి కష్టములు
చెప్పంగ నలవియే శివునకునైన?
పంజరంబున నున్న పక్షులరీతి
బంధించి బుట్టలోఁ బాములవాఁడు
వదలక పెట్టిన ఫణుల చందమున
గంగిరెద్దులవాఁడు కావరమణఁచి
ముకుద్రాడు పొడిచిన పోటెద్దులట్లు
బోనులో నుంచిన పులుల విధంబు
స్వాతంత్ర్యహీనతఁ బడియుండవలయు
పరికింపగా మనోవాక్కాయములను
బ్రథమంబు పట్టఁగా రానిదిగాని
వాక్కాయములు రెండు బంధింపఁబడును.

- శ్రీనాథుడు, పలనాటి వీరచరిత్ర

**పారాయణం**

ఆయన పురుషసూక్తం పారాయణ చేస్తూ ఉంటే నూతులో కప్పలు బుర్ర పైకెత్తి అరచేవి.

- గురజాడ, కొండుభట్టీయము

**పార్టీ**

కుక్కగొడుగులవంటి పార్టీ
లెక్కుడౌచూ నుండెరా
నమ్మబోకుము, నమ్మినను
నీ నాశనమె ఘటియిల్లురా!
ద్వేషముల నెలకొల్పు నయ్యవి
దోషభూయిష్ఠములురా
మోసబోకుము, మోసపడ మన
మొదటికే చేటొదవురా!

- కోటయ్య, వద్దురా! మనకొద్దురా!

నాలుగు డబ్బులు వెనకేసుకునే పార్టీయే మనది?

- లక్ష్మణరావు, అతడు-ఆమె

**పాలన**

సామ్రాజ్యాలు స్థాపించటం కష్టంకాదు. ఏల డంలో ఉంది అసలు కష్టం.

- కాశీపట్నం, శాంతి

**పాషాణం**

ఒక మనిషిని పాషాణం అనటానికి కారణాలు చాలా కావాలి.

- రంగనాయకమ్మ, పేకమేడలు

ప్రాస
కుళ్లు ముండకి అల్లం పచ్చడి అన్నట్లు.
- సామెత
ప్రాసకోసం యేడ్వానే కూసుముండా అన్నట్లు.
- సామెత

పిచ్చాసుపత్రి
మెంటల్ హాస్పిటల్ ప్రత్యేకంగా ఎక్కడుంది? ఈ లోకమంతా ఒక మెంటల్ హాస్పిటల్ కాదూ?
- ఆనందారామం, మళ్లీవచ్చిన వసంతం

పిచ్చి
ప్రతి పిచ్చీ మనిషిని బాధలనుంచి ఏదోలా రక్షిస్తుంది.
- విపినమూర్తి, ఉద్యమం
కొంతమంది పిచ్చిలో మర్డర్లు చేస్తారు. మరి కొంతమంది మర్డర్‌చేసి, ఆ రక్తాన్ని చూసి పిచ్చివాళ్ళుగా మారుతారు. కొంతమంది శిక్ష తప్పించుకోవటానికి పిచ్చివాళ్ళుగా నటిస్తారు.
- వీరేంద్రనాథ్, తులసి
నాయనా! పిచ్చి లేదన్న మాటే పిచ్చి
- చిలకమర్తి, గణపతి
నా జీవితములో ప్రజలు తెలిసికొనవలసినంత గొప్ప విశేషము లేవియు లేకపోయినను, కొందరు ముస్లిములు తమ జీవిత కాలములోనే తమ గోరీలను కట్టుకొనునట్లు నేను జీవించి యుండగానే నా జీవిత చరిత్రను సూక్ష్మముగ వ్రాసి ప్రచురించుకొనవలెనని నాకు బుద్ధి పుట్టినది. ఎవరి పిచ్చి వారికానందం.
- సూర్యనారాయణ, స్వీయచరిత్ర
పిచ్చియాసుపత్రి యనఁగా బిచ్చివారి రోగమును కుదుర్చు నాసుపత్రి యని యర్థము కాదు. పిచ్చి డాక్టర్లుగల యాసుపత్రి యని అర్థము.
- పానుగంటి, సాక్షి
పిచ్చివాడికి ప్రపంచమంతా పిచ్చిగా కనపడుతుంది.
- మొక్కపాటి, బారిష్టరు పార్వతీశం
మరీ చెడ్డ పేరు తెచ్చుకున్న పిల్లల్ని చూస్తే మర్యాదగల తల్లిదండ్రులకి యెందుకంత కోపమంటే తమ అసలు గుణాలు ఎవరికీ తెలీకుండా తమలో దాచుకున్న గుణాలు తమ పిల్లలముందే ఆ పిల్లలమూలంగానే లోకంలో బయటపడ్డాయే అనుకోవడంవల్ల.
- చలం, మ్యూజింగ్స్
పిచ్చివాళ్ళుగా మారిపోవడంలో ఒక మంచి ఉంది సుమా! వాళ్ళు భోగాల నాశించరు. విలాసాలు కావా లనరు. పంచభక్ష్య పరమాన్నాలు కోరరు. స్వస్థలాలు, స్వగృహాలు అవసరంలేదు. ఎంగిలాకులు తిని తృప్తిపడతారు. చెట్లక్రింద నిద్రపోతారు. కావాలంటే పట్టపగలు నడిరోడ్డు మీద దిగంబరంగా పడుకోగలుగుతారు. వాళ్లతో ఎవరికీ పేచీ ఉండదు. వాళ్ళు ఎవర్నీ అడగరు, ప్రశ్నించరు, ధిక్కరించరు, విమర్శించరు. అలా చేస్తే పిచ్చివాళ్లని లెక్కే చేయరు.
- నంది, పుణ్యస్థలి

పిడికెడు
తెగించి దానం చేస్తాను, తేరా పిడికెడు రాళ్లు అన్నాట్ట వెనకటి కెవడో.
- అవసరాల, పంజరం

పిన్నలు - పెద్దలు
కుంకలు జంకులేక మాటలాడెదరు. అన్నియు హుళక్కులేగాని సర్వాంతర్యామి యని పెద్దలు పలికెదరు.
- కోలాచలం, శిలాదిత్య

పిరికి
తన దేశం మీదకు పరదేశం దండెత్తి నెమ్మదిగా ఆక్రమించుకుంటున్నదని వినగానే, పిరికివాడు రెండు రకాల జండాలు తయారుచేసుకొని కూచున్నాడు. ఒకటి స్వదేశం జండా. ఒకటి దండెత్తి వచ్చిన దేశం జండా.
- గోపీచంద్, పిరికివాడు
పగవా రొత్తిన యప్పుడు
జగమెఱుఁగం దెగుటయొండె సైరణయొండెం
దగుగాక మిగుల నొగులుచు
మగవాఁడై మగువ పగిది మడియుట తగునే?
- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక
విశాల హృదయాన్ని పిరికితనం అనుకునే ఈ లోకం పిరికిది.
- వేణుగోపాలరావు, గుప్పెడువెలుగు
పైకి భీకరంగా ఉండేవాళ్లు పరమ పిరికివాళ్లు!
- రామకృష్ణశాస్త్రి, చికిలింత
చనదుగదా పిఱికి దొరల సరసం గొలువన్?
- కదిరీపతి, శుకసప్తతి

జీవిత ప్రవాహం ప్రచండవేగంతో వెళ్లిపోతూ ఉంది. అందులో ఎవరెవరి సంస్కారాన్ని బట్టి వాళ్లు తమ సుఖం కోసం పోట్లాడుకుంటు న్నారు. ఇదొక మహాసంగ్రామం. ఈ సంగ్రా మంలో పిరికివాళ్లకు అసమర్థులకు చోటులేదు.

*- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర*

కామెర్ల కంటివానికి ప్రపంచమంతా పచ్చగా గోచరించినట్లు, పిరికివాని కంటికి లోకమంతా అనుమానాస్పదంగా గోచరిస్తుంది.

*- పులికంటి, లోకం నవ్వింది*

పిరికివాడై ప్రతిక్షణం చచ్చేకంటే, సాహసంతో ఒక్కసారి చావటంమేలు!

*- ఆనందారామం, మరో ముందడుగు*

చదువుకొన్నవాళ్లకి పిరికితనం ఎక్కువౌతాదంట!

*- నంది, నైమిశారణ్యం*

పిరికివాడేదన్నా ప్రారంభించడానికి తలపెడ్తే వాడికి మొట్టమొదటగా వచ్చేవన్నీ అపాయా లకు సంబంధించిన ఊహలే.

*- బొల్లిముంత, మృత్యుంజయులు*

పరిస్థితుల ప్రభావానికి నిలిచిన వారే విజ యాన్ని సాధిస్తారు. గమ్యాన్ని చేరుకోగలుగు తారు. పిరికివాండ్లు నిముష నిముషానికి చస్తూ ఉంటారు.

*- పుల్లాభొట్ల, వక్రించిన పరిస్థితులు*

ఆత్మహత్య చేసుకునే వాళ్లు సాధారణంగా ఆత్మ పరాయణులూ, పిరికిపందలూ అయిఉంటారు.

*- కొడవటిగంటి, జీవితేచ్ఛ*

చెడ్డ అలవాట్లకి దూరంగా ఉండేవాడు లోకం దృష్టిలో అసమర్థుడు! పిరికివాడు! అందుకే చాలామంది ఏదో గొప్ప కోసం జల్సాలన్నీ అలవాటు చేసుకుంటారు.

*- రంగనాయకమ్మ, పేకమేడలు*

ముందడుగు వేయువాడు మొనగాడు. వెను కంజ వేయువాడు పిరికివాడు. అటో ఇటో తేల్చుకోగలిగేది మొనగాడే. నీళ్లు నములుతూ నిలబడేది పిరికివాడు. అసలు పిరికివానికే బోలెడన్ని ఆలోచనలు.

*- పులికంటి, ఆరికకూడు*

తొల తొలంగిన ముల్లంగి దుంపంబోలు
కత్తి యొరనుంచి నా భుజస్కంధమందు
మోచికొనిపోదు నింటికి బొయ్యిమనుచుఁ
గుక్క లరచిన భయపడ్డ నక్కవోలె!

*- తి. వేం., మృచ్ఛకటికము*

**పిలుపు**

రామాయణంలో పిడకల వేట్లాటలాగ అదే పిల వటవాఁ?

*- గురజాడ, కన్యాశుల్కం*

**పిల్లలు**

పిల్లల మనస్సు తెల్లకాగితం లాంటిది.

*- భారతీదేవి, సుడిగుండాలు*

మనిషి కోతిలోంచి పుట్టాడు. ఆ సంగతి ప్రత్యక్షం చేస్తారు కుర్రాళ్లు

*- భమిడిపాటి, బాగుబాగు*

పిల్లలు తమకి అన్నం పెట్టేవారికన్న మిఠాయి కొని పెట్టి తమతో ఆడుకునే వారిమీద యెక్కువ ప్రేమ చూపుతారు.

*- చలం, మ్యూజింగ్స్*

పిల్లలకి నా సొమ్మని నీ సొమ్మని భేదాలుం డవు. అంతా తమ స్వంతంగా వాడుకుంటారు.

*- బుచ్చిబాబు, గొలుసు*

తల్లిదండ్రులు ఎంత మంచివాళ్లయినా వాళ్లకె టువంటి సదుద్దేశాలున్నా, కొన్ని కొన్ని విషయా లలో పిల్లల జీవితం గురించి వాళ్లు నిర్ణయాలు చెయ్యలేరు.

*- కొడవటిగంటి, సత్యవతి స్వీయకథ*

పిల్లల ఉద్రేకాలను కూడా పాటించడంవల్ల జీవితం బాగుపడుతుందే గాని చెడిపోదు.

*- కొడవటిగంటి, ఆడజన్మ*

చిన్న పిల్లల విశ్వాసాలు పెద్దవాళ్ల విశ్వాసా లంత జ్ఞానయుతంగా ఉండవుగాని అంత మూఢంగా కూడా ఉండవు.

*- కొడవటిగంటి, ఆడజన్మ*

కొందరు పిల్లలకు బొమ్మలు ఎట్లా కావాలో కొందరు పెద్దలకు కూడా పిల్లలు అట్లాగే కావాలి ఆడుకోవటానికి.

*- కొడవటిగంటి, వరప్రసాదం*

పెద్దవాళ్లను అంచనాకట్టే శక్తి పిల్లలకు అపా రంగా ఉంటుంది.

*- కొడవటిగంటి, సవతితల్లి*

ఓషధులే తండ్రులుగా
రసవిషాలు తల్లులుగా
తయారవుతున్నారు శిశువులు.

*- బైరాగి, ఇంక కవిత లేదు*

పిల్లలంత మోసగాండ్రు పెద్దవారు కారు సుమా.

- పానుగంటి, సాక్షి

చిన్నపిల్లలకు రుచిలోగాని, అభిరుచిలోగాని వ్యత్యాసాలు తెలియవు. పట్టవు కూడా.

- కొడవటిగంటి, జీవితం

చిఱుతవాని కింత తఱుసంటి పలుకులు
సన్నె వృద్ధజనము లున్నచోట?

- నన్నయ, సభాపర్వము

చేరదీసిన వాళ్లని పట్టుకుని పాఁకులాడతారు పిల్లలు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, అరికాళ్లకింద మంటలు

పిల్లల్ని అమ్ముకోవడం శిష్టాచారం అంటారండీ?

- గురజాడ, కన్యాశుల్కం

## పిల్లి

బోయరు యుద్ధమునఁ బొడిచిగెలిచిన రాబర్ట్సు ప్రభువునకుఁ బిల్లి యనఁగఁ బ్రాణభయము. ఫిరంగి గుండునకు జంకని యతఁడు పిల్లి కనఁబడిన వెంటనే దానిని చంపినదాఁక ప్రాణము లఱచేతిలోఁ బెట్టుకొనియుండును. అతని కొక్కనికే ఈ భయముకాదు. మూడవ హెన్రీ అను ప్రభుడు తన కోటలోఁ బిల్లి చేర కుండ నెన్నిపాటులైనఁ బడినాడు. ఫెర్డినాండు చక్రవర్తి ప్రధానోద్యోగులలో నొకనికిఁ బిల్లి కూఁత వినఁగనే ముక్కువెంట రక్తము కాలువ లుగాఁ గట్టవలసినదే.

- పానుగంటి, సాక్షి

పిల్లిని
గదిలో పడేసి కొడితే
అది లోనున్నవారి "కళ్లు పీకేస్తే"
అది జాతిపిల్లి.
"కాళ్లు పట్టేస్తే"
అది గోడమీద పిల్లి.

- రాజేంద్ర, గుండెచప్పుళ్ళు

పిల్లికి చెలగాటం, యలక్కి ప్రాణం పోకటా!

- గురజాడ, కన్యాశుల్కం

## పిశాచం

పిశాచమంటే నాకు భయం పోలీసోళ్ళంటే నాకు భయం. మరెవళ్ళకీ లచ్చపెట్టను.

- గురజాడ, కొండుభట్టీయము

పిశాచం పీక్కుతింటూ ఉంటే సరసానికి యాళా?

- గురజాడ, కొండుభట్టీయము

ధన పిశాచములకుఁ బ్రేమతత్వ మేల?

- ఏటుకూరి, ప్రేమాలోకము

## పిసినారి

గడించినవాఁ డెవ్వఁడు కర్చుపెట్టిచచ్చినాఁడే?

- కాళ్లకూరి, వరవిక్రయము

కుండలో కూడు కుండలో నుండవలె. పిల్లవాడు తుండుముక్కవలె నుండవలె.

- చిలకమర్తి, గణపతి

## పి హెచ్.డి

పిహెచ్‌డి - అంటే ప్లాట్‌ఫారం హీరో డిజిగ్నేట్.

- ముళ్లపూడి, జనతా ఎక్స్‌ప్రెస్

## పీకులాట

పేకయాట గుండె పీకులాట.

- జొషువా, చీట్లపేక

## పీట

రామరాజు వంశం వారంటే ఎక్కడికి వెళ్ళినా పెద్దపీట మాదే. ఈనాడు వేసుకోవటానికి పీట లేదు.

- పుల్లాభొట్ల, లంచం

## పీటముళ్లు

పీటముళ్లు విడవు. విడకపోతే అవేమిటో ఆసాంతం ఆకళింపుకాదు. విడనిచోట, తెంచితే అఖాతం మేర్పడి "తన" అనే దానికి అర్థం దొర కనట్లుగా అవుతుంది.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

## పీడ

మరుపు వచ్చిన పీడ లేని పీడతో సమానం.

- కొడవటిగంటి, బకాసుర

## పుకార్లు

ఆడది ఉద్యోగం చేస్తున్నదంటేనే పొగలేని నిప్పు లాగ పుకార్లు పుడుతూ ఉంటాయి.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

తులం నిజానికి అర్ధమణుగు అబద్ధం కలిపి కళ్ళాపు జల్లింది పుకారు.

- బీనాదేవి, మావూరు

## పుట్టినరోజు

పుట్టినదినము ప్రతినరున కుత్సాహదినము గాదు. ఉత్పాతదినము. పర్వదినముకాదు.

భయంకర దినము. మంగళదినము కాదు, మరణదినము. పుట్టిన దినము గండదిన మని నిశ్చయింపవలసినది.

- పానుగంటి, సాక్షి

**పుట్టిల్లు**

పుట్టినింటిపై ప్రేమ అడుదానికి అణచికొన రానిది.

- సూరి, నారాణి

ఎట్టి సాధ్వులకును బుట్టిన యిండ్లను
బెద్దకాల మునికి తగ్గ తగదు.

- నన్నయ, ఆదిపర్వము

మగువమీఁదను బతికెంత మక్కువైన
మగని మీఁదను సతికెంత మమత యున్న
నువిదకును గాపురం బెంత యొప్పియున్నఁ
బుట్టినింటికె కడుఁగూర్చుఁ బొలఁతి యెపుడు.

- చిలకమర్తి, గయోపాఖ్యానము

గౌరవానికిగాని ఘనతకుగాని
తన పుట్టినింటిలో తాను దొరసాని!
మగనింటిలో ఉంటె మగువ యువరాణి.

- దేవులపల్లి, ఏడాది పొడుగునా

**పుట్టుక**

పుట్టి పొడసూపుచుండు టబ్బురమె కాని
యేనియతిచేతఁ బుట్టునో యెవ్వఁ డెఱుఁగు?

- వేంకటపార్వతీశ్వర కవులు, కావ్య కుసుమావళి

మానవజన్మ మెత్తగోరేవాడు మొదట పుట్టాలి. స్టార్టూ అంతే!

- కొడవటిగంటి, ప్రొడ్యూసర్ భద్రం

సంసారిణులు, సానులు తల్లికడుపున నొకలాగే పుట్టుదురు.

- పానుగంటి, రాతిస్తంభము

**పుణ్యం**

చిత్తశుద్ధి గలిగి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియుఁ గొదవ కాదు
విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత?

- వేమన

డ్యూటీకి విరుద్ధంగానైనా సరే, సంప్రదాయాలకు విరుద్ధంగానైనా సరే, స్వార్థానికి విరుద్ధంగానైనా సరే ఇంకొకరికి మేలు చెయ్యటం! అదే పుణ్యం అంటే! విధి నిర్వర్తించటం పుణ్యంకాదు. పై అధికారిని సేవించటం పుణ్యంకాదు.

- కొడవటిగంటి, కింకరుడు

మొగాడు తన స్నేహితుడి పొట్టలో కాఫీ పోసు గుంటే ఆడది సుబ్బారాయుడి పుట్టలో పాలోసు గున్నంత ఫలం.

- భమిడిపాటి, కచటతపలు

**పునరావృత్తి**

నిన్న జరిగిందే ఈ వేళ
ఈ రోజులాగే రేపు -

- రెంటాల, విగతం తరణమత్ర వైతరణి

**పునర్జన్మ**

నిన్న గ్రుంకిన భానుండు నేఁడు దోఁచె.

- చిలకమర్తి, ప్రహ్లాదచరిత్రము

పైరుపండి రాలినట్లు
ముసలియై లయించు జీవి
రాలి మరల వచ్చుననుట
రమ్యమైన యెండమావి.

- అబ్బూరి, ఊహాగానము

**పునశ్చరణ**

గాయత్రీమంత్ర మయేది, నీలాపనింద లయేది పునశ్చరణచేసినందుకు దాని ప్రభావం ఉండి తీరుతుంది.

- కొడవటిగంటి, అనుభవం

**పునాది**

అంతస్తులే కనిపిస్తాయి
అగుపించదు పునాది.

- రాధాకృష్ణశర్మ, శాంతిసూక్తం

పురాతన జగత్తుకు సమాధి
వినూతన జగత్తుకు పునాది.

- బైరాగి, పాంచజన్యం

స్వీయ చరిత్రకు సత్యసంధత పునాదీ ప్రాణమున్నూ.

- లక్ష్మణరావు, బతుకుపుస్తకం

**పురస్కారం**

పునాది రాయికిచ్చే పురస్కారం మరి దేనికీ రాదు.

- చిరంజీవి, బోలోస్వతంత్రభారత్‌కీ జై

**పురాణకథలు**

వెఱ్ఱి పురాణ గాథలు
నమ్మజెల్లునె పండితుల్?

- గురజాడ, లోకచుక్క

అగ్నికార్యము చేతిలో ఉన్నవాని కన్ని పురాణములు దగ్ధపటలన్యాయము.

- పానుగంటి, కంఠాభరణము

**పురుడు**

కొన్ని జీవితాలకు ఎప్పటికీ పురుడు వెళ్లదు.

- రామకృష్ణశాస్త్రి, ఖుదానంద్

కూతురిపురుడు కుండల్లో; కోడలిపురుడు కొండల్లో.

- సామెత

**పురుష లక్షణం**

తాన యూరకుండుట నరునకుఁ బౌరుషంబె?

- అనంతుడు, భోజరాజీయము

చిన్నతనమున వటుఁడు, సంశ్లేషమున విటుఁడు, పద్మాసనమున యోగి, పట్టె మంచమున భోగి, ఎప్పటి కప్పుడే సాగుడు, ఎక్కడి కక్కడే విరుగుడు.

- పానుగంటి, సాక్షి

పారిపోవటంగాదు, ఉండి పరిస్థితులను ఎదుర్కొనటమే పురుషలక్షణం.

- రాజారాం, కారణభూతుడు

**పురుషుడు**

కొంప గూలకుండ గోప్యమ్ము చెడకుండ
జరుపుకొన్నవాఁడె పురుషుఁడోయి!

- ఏటుకూరి, ప్రేమాలోకము

**పురోగతి**

అసాధారణ కార్యములు చేయుటవలననే
ప్రపంచము పురోగమించును.

- వరద, నాట్యగోష్ఠి

**పులి**

అడవిం, బులికిం బులి నగుచుఁ దిరిగి పులి పులి నైతిన్.

- కదిరీపతి, శుకసప్తతి

**పువ్వులు**

పువ్వులమ్మిన వూళ్ళో కట్టెలమ్మటం కష్టం.

- కాళీపట్నం, యజ్ఞం

పువ్వులు వేడుకైన, గడివోయిన వాళ్ ముడువంగ వచ్చునే?

- నాచనసోమన, ఉత్తర హరివంశము

**పుష్టి**

గొడ్డుకు తిన్నది పుష్టి, మనిషికి వున్నది పుష్టి.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

**పుష్పకం**

ఈ కాలపు పుష్పకమ్ము
ఏదో కనిపెట్టరా?
ఎలక్షన్ల జీపు తప్ప
ఏదున్నది గురువరా?

- మల్లారెడ్డి, యక్షప్రశ్నలు

**పుష్పశరుడు**

సంధి విగ్రహయానాది సంఘటనల
బంధకీజారులకు రాయబారి యగుచుఁ
బట్టణంబున నిత్యంబు పగలు రేయి
పూఁటకూటింట వర్తించుఁ బుష్పశరుఁడు

- వల్లభరాయడు, క్రీడాభిరామము

**పుస్తక జ్ఞానం**

పుస్తకాలవల్ల అబ్బే పాండిత్యం, భార్య చక్కదనం లాగున, ఇతరుల ఆనందానికేగాని, స్వంతానికి కాదు.

- బుచ్చిబాబు, అంతిమ అజ్ఞానం

**పుస్తకం**

నువ్వు చదవాలనుకున్న
కొత్తపుస్తకాల పేజీపేజీలోను
ఇరుల కటారులు దాగి ఉన్నాయి
వైరి గుడారాలు వేసి ఉన్నాయి.

- మిరియాల, వెన్నెల నన్నురమ్మంది

పుస్తకం విజ్ఞానధనం పదిలపరచిన
తాళం కప్పలేని ఇనప్పెట్టె.

- సూర్యప్రకాశ్, మస్తిష్కపు పుటల్లోంచి

పండితులకు నచ్చితే అలమరలో
ప్రజలకు నచ్చితే అంతరంగంలో
ఎవ్వరికీ నచ్చకపోతే పుస్తకం
ఎక్కడుంటుందో తెలీదు నాకు.

- రాధాకృష్ణశర్మ, శాంతిసూక్తం

పుస్తకాలు చదవటంవల్ల మన అనుభవం విస్తరిస్తుందనీ, ఫీలయే శక్తి పెరుగుతుందనీ అనుకుంటామేగానీ, ఫిక్షన్‌లో అటువంటిది చాలాకొద్ది.

- కొడవటిగంటి, అనామిక

పుస్తకాలు చదవటంవల్ల పనికిమాలిన ఫీలింగులు కూడా ఏర్పడతాయి.

- కొడవటిగంటి, అనామిక

తినే పదార్థాల ప్రభావం మనిషిమీద ఉన్నట్టే చదివే పుస్తకాల ప్రభావమూ మనిషిమీద ఉండి

తీరుతుంది.

- కొడవటిగంటి, మైరావణ రక్తబిందువులు

కథలూ, గడ్డలూ చదివేకన్నా చరిత్ర చదువుకోవటం ఫలంపాటు

- కొడవటిగంటి, అనామిక

**పూజ**

ఎప్పుడూ సమాధుల మీదే సన్నజాజులు.

- శివారెడ్డి, రక్తం సూర్యుడు

మనిషి తను ఋషి అవ్వాలా - రాక్షసుణ్ణి అవ్వాలా అన్నది తనకు తానే నిర్ణయించుకోవాలి. ఋషి అవదల్చుకున్నవాడు దేవుణ్ణి పూజించినట్టె, రాక్షసుడు దెయ్యాన్ని పూజిస్తాడు

- వీరేంద్రనాథ్, తులసి

ఈ పూజలకు కారణం భయం. మనిషిలో భయం వున్నంతవరకు ఈ పూజలు తప్పవు.

- జంగయ్య, జాతర

పుణ్యమతులకు సౌందర్య పూజనంబు
ఎపుడు నానందమిడుఁ, గామ మెత్తనీదు.

- దువ్వూరి, కడవటివీడుకోలు

**పూజారి**

కరణికంబు చేసి కష్టాలు పడుకంటె
నంబితనము మేలు నాకుఁ జూడ
కుడువఁ గూడు కద్దు; గుగ్గిళ్లు తినఁ గద్దు;
తలకుఁ జమురు గద్దు; తరుణి గద్దు.

- చాటువు

**పూజ్యుడు**

ఈ ఇరవయ్యోశతాబ్దంలో - సుఖంగా పాపం చేయగలిగిన మొనగాడు అంటూ లేడురా నాయనా- మీరందరూ పూజ్యులు!

- రామకృష్ణశాస్త్రి, మధ్యాక్కర

ఆకలిదప్పులు లేనివారు- సన్యాసులయితే తప్పు లేదు. వారు నిజంగా పూజ్యులు!

- కృష్ణరావు, పాపికొండలు

**పూటకూటిల్లు**

సంధి విగ్రహ యానాది సంఘటనల
బంధకీజారులకు రాయబారి యగుచుఁ
బట్టణంబున నిత్యంబు పగలురేయు
బూఁటకూటింట వర్తించుఁ బుష్పశరుఁడు.

- వల్లభరాయడు, క్రీడాభిరామము

**పూనకం**

పూనకా లనేవి ఆత్మవంచన, అదోరకం మానసిక రుగ్మత.

- వేణుగోపాలరావు, జోగబాల

ఈ బలహీన మనస్తత్వం వున్న మనుష్యులు తమని ఆవహించటంకోసం దేముళ్ళని కూడా ఆశ్రయిస్తూ ఉంటారు. అది పూనకం...

- వీరేంద్రనాథ్, తులసి

**పూనిక**

పూనిక పుట్టిన రోజునే
పూర్తి విజయం కూడా పుట్టింది

- కుందుర్తి, ఆశ

**పెట్టు**

పెడితే పెద్దన్నా పెట్టకపోతే ఎద్దన్నా.

- సామెత

**పెట్టుబడిదారీ**

తక్కువ పెట్టుబడితే, తక్కువశ్రమతో- ఎక్కువ లాభాన్ని సంపాయించటం పెట్టుబడిదారీ విధానంలోని గొప్పనిపుణత్వం.

- ధనికొండ, పవిత్రులు

**పెట్టుబడిదారు**

పెట్టుబడిదార్లు కూడా దయాదాక్షిణ్యంగల మనుష్యులే సుమా.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

**పెట్రోలు**

మారిచ్చుపోల్లకి మానెత్తురే మాకు పెట్రోలు.

- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

**పెడదారి**

దారి తప్పినవాడు, ఎటువెళ్ళినా పెడదారినే పడతాడు!

- సుంకర, దొరికితే పట్టుకున్నా

**పెడర్థం**

పప్పులో ఉప్పువేసేటప్పుడు చెప్పేయమంటే చెప్పు వేసి తీసి, అత్తకు నంచుకో పెట్టిందట.

- సామెత

**పెండ్లి**

ప్రేమనే మత్తుమందు సేవించేవాడికి పెళ్ళనేది వో విరుగుడు లాంటిది.

- బీనాదేవి, పెళ్ళిపార్టీ

పెళ్ళనేది ఒక వ్యాపారం తాలూకు కాంట్రాక్టు మాత్రమే. నిజానికది ఆడది మొగాడికి రాసిచ్చే ప్రామిసరీనోటు. కాని దాని కాలదోషం ఆడదాని

జీవితమే. దాని బతుకు తెల్లారితేగాని బాకీ తీరదు ఈ పెళ్ళికి విట్‌నెస్‌లు, సెక్యూరిటీలు మంత్రాలు, మంగళసూత్రాలు.

- బీనాదేవి, పెళ్ళిపార్శు

పెళ్ళనేది తెలుగు సినిమాల్లో సుఖాంతమయ్యే చివరి సీనుగాని, చాలా మంది నిజ జీవితాల్లో అది ట్రాజెడీగా అంతమయ్యే సెంట్రల్ థీమ్.

- బీనాదేవి, స్వేచ్ఛాయజ్ఞం

పెళ్లిళ్ల పేరుతో ఖర్చయే డబ్బంతా కలుపుతే భారతదేశంలో బిచ్చగాళ్లని పోషించవచ్చు

- వెంకటకృష్ణమూర్తి, మేఘమాల

'వివాహం' అన్న సంస్థ నిలబడాలంటే రెండు కావాలి - భర్త చెవిటివాడూ భార్య గుడ్డిదీ అవాలి.

- బుచ్చిబాబు, దారినపోయే దానయ్య

వివాహం అల్లిన వలలో చిక్కుకోనివాడు ప్రతిభా శాలి.

- బుచ్చిబాబు, ఆత్మవంచన

పెళ్లిసేసుకుంటేనే మొగాడు పరాయోడవుతాడు.

- బుచ్చిబాబు, ఉత్తమా యిల్లాలు

పదిమంది ముందరా పొత్తు - వొంటిగా లడాయి యిదే మన జాతోళ్ళ పెళ్ళి ముచ్చట.

- బుచ్చిబాబు, ఉత్తమా యిల్లాలు

పెళ్ళికాని పిల్లకి, పెళ్ళికాని మొగాడు పరాయో డెట్ల గవుతాడు?

- బుచ్చిబాబు, ఉత్తమా యిల్లాలు

సర్వనదులూ సముద్రంలో కలిసినట్లు ఈ చదు వులు, సంపదలూ అన్నీ వివాహంలో అంత మొందాల్సిందే.

- బుచ్చిబాబు, గొలుసు

పెళ్ళికాని మొగాళ్ళు అక్కడక్కడ వుండొచ్చుకాని ఆడాళ్ళు వుండకూడదు.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

వివాహం కోసం స్త్రీ భర్తను అంగీకరిస్తుంది. మొగాడు స్త్రీ కోసం వివాహాన్ని అంగీకరిస్తాడు.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

వివాహం నెగ్గాలంటే భార్యాభర్తలకి నటనలో కొంత తర్ఫీదు అవసరం.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

ఆడది యిష్టపడి చేసుకున్న పెళ్ళి చాలావరకు విజయవంతం అవుతుంది కదూ?

- కొడవటిగంటి, పంచకళ్యాణి

ఈ రొమాన్సులన్నీ తప్పించుకోవాలంటే ఆడ దానికి పెళ్ళే శరణ్యంలాగుంది.

- కొడవటిగంటి, పంచకళ్యాణి

అన్నిటికన్నా ఆడదానికి హెచ్చు అన్యాయం చేసి నది వివాహవ్యవస్థ.

- కొడవటిగంటి, సైరంధ్రి

వివాహవ్యవస్థ ననుసరించి వచ్చిన సామాజిక పరిణామాలన్నీ ఆడదానికి స్వేచ్ఛలేకుండానే చేశాయి.

- కొడవటిగంటి, సైరంధ్రి

పెళ్ళిచేసుకుంటే మంచి సంపాదన ఉన్న వాణ్నే చేసుకోవాలి. నిరుద్యోగుల్ని దేనికి?

- కొడవటిగంటి, సాహసం

వివాహ బంధం ఆడదాన్ని కట్టినంత బలంగా మొగవాణ్ణి కట్టటంలేదేమో!

- కొడవటిగంటి, పచ్చకాగితం

దక్షిణలేని తాంబూలంలాగ కట్నంలేని పెళ్ళే మిటి?

- కొడవటిగంటి, బెదిరిన మనుష్యులు

ఆడముండల్తోనా ఆలోచన? యీ సమ్మంధం చెయ్యకపోతే నేను బారికరావుణ్నే!

- గురజాడ, కన్యాశుల్కం

లోకం అంతా యెంత విలవో అంతకన్న యెక్కువ విలవైన రత్నంలాంటి ఆడమనిషి దొరికితే తప్పకుండా పెళ్ళాడవలసిందే.

- గురజాడ, కన్యాశుల్కం

వెధవముండని పెళ్ళాడిన కుంక పీనుగ బత కడం యలాగ?

- గురజాడ, కన్యాశుల్కం

ప్రజ్ఞకి పెళ్లాడానుకాని, కూడు పెట్టడం మా కులంలోనే లేదన్నాడుట.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, యావజ్జీవం హోష్యామి

సిరియును వంశము రూపును
సరియైన వివాహసఖ్య సంబంధంబుల్
జరుగును; సరి గాకున్నను
జరుగవు...

- పోతన, భాగవతము

నీవుసేయు పెండ్లి నిత్యంబు భద్రంబు
పిన్ననాంటి పెండ్లి పెండ్లిగాదు.

- పోతన, భాగవతము

పెళ్ళంటే ఇద్దరు వ్యక్తుల వ్యవహారం. ఇద్దరు

సాక్షులూ రిజిస్ట్రారు అవసరం.

- చాసో, ఊహాసుందరి

పురోహితుడు కుదిరాడు; ఇహ వధువు కుదరవలసి వుంది.

- గురజాడ, కొండుభట్టీయము

పిల్లవాళ్ళూ బుద్ధిహీనులూ తప్ప మరియెవరూ పెళ్ళికావలెనని కోరరు.

- కందుకూరి, విచిత్ర వివాహ ప్రహసనము

ఇతడు యింతకాలం బ్రతుకుతాడని తోస్తే నేనప్పుడు పిల్లదాన్ని యిస్తునా?

- కందుకూరి, బ్రాహ్మవివాహము

పడుచువాడికి లోకంలో అందరూ కన్యను యిస్తారు. అది వక ఫలంలోది కాదు. ముసలివాడికి పిల్లను యివ్వటమే యివ్వడము.

- కందుకూరి, బ్రాహ్మవివాహము

"చలం" చెప్పినట్లు స్త్రీ - పద్మవ్యూహం. పెళ్ళి అనే పద్మవ్యూహంలో చిక్కుకుపోయి స్త్రీ ఎంత గిలగిలా కొట్టుకున్నా సమాజం యేమాత్రం సానుభూతి చూపించదు. ఏమీ పట్టించుకోదు

- ఆనందారామం, అర్ధంలోశత్రువు

స్త్రీలకు పెళ్ళితోనే సమస్యలు ప్రారంభమవుతున్నాయి.

- ఆనందారామం, అర్ధంలోశత్రువు

నిజం చెప్పాలంటే ఖర్చులేకుండా స్త్రీ సుఖం పొందటానికి పెళ్ళి ఆ పెళ్ళి ఖర్చుకూడా అక్కర్లేకుండా ఆడదాన్ని సంపాదించే ఉపకరణం ప్రేమ.

- మహీధర, ఓనమాలు

స్త్రీ పురుషులు ఏర్పడిన నాటినుంచీ వారి మధ్య సంబంధాలున్నాయి. ఆ సంబంధాలలో నిగ్రహం, బాధ్యత ప్రవేశపెట్టడానికి పెళ్ళిని ఒక ఉపకరణం చేశారు.

- మహీధర, ఓనమాలు

ఎక్కడో పుట్టి, ఎక్కడో పెరిగి, ఏవేవో అభిప్రాయాలకు, అభిరుచులకూ అలవాటుపడ్డ రెండు జీవితాలను కలిపేది పెండ్లిపీట.

- పులికంటి, లోకంనవ్వింది

అసలు వివాహమనేది వొకరాజీ అన్నమాట.

- పూర్ణానందం, కొండమీద విడాకులు

వివాహం లాటరీలాంటి దంటారు. దొరికిన దానితో సర్దుకపోగలిగిన వాళ్ళను ఈ లాటరీ బాధించదు. ఏది దొరికినా సరిపెట్టుకోలేని వాళ్ళకుమాత్రం ఇంతకంటే విషమ పరీక్ష వేరొకటి ఉండదు.

- రాజారాం, మరీచిక

ఆడవాళ్ళకు పెళ్ళితో పెద్దరికం వచ్చేస్తుంది.

- మారుతీరావు, నిజం నిద్రపోయింది

మేరేజి అనేది పులిపిల్లల లాంటి మనుష్యుల్ని పిల్లిపిల్లల్ని చేస్తుంది.

- అనిశెట్టి, పంజరం

జత కట్టడం ప్రకృతి పని. పెళ్లి అన్నది మన పని.

- తాపీ, పెళ్లి-దాని పుట్టుపూర్వోత్తరాలు

మనస్సులు కలవని మనువు - ఆ మహాయజ్ఞంలో ఎవరో ఒకరు దగ్ధమైపోతారు. లేదా ఇద్దరూ పోవచ్చు.

- నంది, నైమిశారణ్యం

రెండవపెళ్లివాడికి పల్లకీ యెందుకు? భజంత్రీలెందుకు?

- చిలకమర్తి, కాండూరి జానకిరామయ్యగారి పెండ్లి

ఇప్పుడు పెద్దవాళ్ళను కట్టుకున్నవాళ్ళే తరచుగా సుఖపడుచు వున్నారు.

- కందుకూరి, బ్రాహ్మవివాహము

నిజమైన పెళ్ళిళ్ళకు సాక్షులే ఉండరు.

- మహీధర, స్వయంవరణం

పెండ్లికి ముందు బాగా కండ్లు తెరుచుకొని చూచి, పెండ్లి కాగానే సగం మూసుకొని చూచీ చూడనట్లుండాలి.

- సామెత

పెండ్లి పేరంటాండ్రు పెనురంకులకు నేడ్వ
బాజాభజంత్రీలు పప్పు కేడ్వ
రాజబంధువులంత రంకుముండల కేడ్వ
బాజారు వెలదులు పసపు కేడ్వ
వచ్చిపోయెడువారు వక్కలాకుల కేడ్వ
గుగ్గిళ్ళకై పెండ్లిగుఱ్ఱ మేడ్వ
పల్లకీబోయీలు భత్యాలకై యేడ్వ
బలుపురోహితుడు నేబులకు నేడ్వ
హారతిరూకల కాడుబిడ్డలు నేడ్వ
కుళ్లవాం డ్రందరు కూటి కేడ్వ
అల్లుఁ డనాథయం చత్తమామలు నేడ్వ
కట్నంబుకై గ్రామకరణ మేడ్వ

పెద్దమగండని పెండ్లికూతురు నేడ్వ
పిల్ల చిన్నదటంచు పెనిమిటేడ్వ
చాల్పుగా నిన్ని యేడ్పుల సాగె పెండ్లి
- వెంకమరాజు, చాటువు

పెండ్లికొడుకు
ఎదుట వున్నవాడే పెండ్లికొడుకు
- ఉన్నవ, నాయకురాలు

పెండ్లికొలువు
గ్రామదేవత కానాఁడె కానుకలును
గొలుపులు న్వేటపోతులు గుంభములును;
బింకముగ నైదు దినములు పెండ్లికొడుకు
తల్లికొలు వక్కకొలువును దాసికొలువు?
- కాళ్లకూరి, వర విక్రయము

పెత్తనం
అవకాశం అధికారం వున్నంత వరకు ప్రతీవ్యక్తి తనతోటి వ్యక్తిని దబాయించాలని... పెత్తనం చెలాయించాలని చూస్తారు.
- ఆనందారామం, అర్థంలో శత్రువు

కొడుకులికి యీడువచ్చినా యీ ముసిలాళ్ళు పెత్తనం విడిచిపెట్టలేరులే.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, నీలాసుందరి

పెత్తనము రక్షించుకునేవాడే పెద్దవా డనిపించు కుంటాడు. సాగిందల్లా పెత్తన మనిపించుకోదు.
- ఆళ్వారుస్వామి, ప్రజలమనిషి

దూడా బఱ్ఱే ఉండగా మధ్య గుంజ అరచినట్లుగా
- సామెత

మేలి ఖద్దరు పగటివేషాలు జూచి
బెదరఁ దెన్నడుఁ బగవాని పెత్తనంబు.
- జాషువా, మలినిట్టూర్పు

పేనుకు పెత్తనమిస్తే, తెల్లవార్లూ తల తెగకొరి కిందట.
- సామెత

పెద్ద
ఉన్నవాడు ఊరికి పెద్ద, పోయినవాడు కాటికి పెద్ద.
- సామెత

తల్లి చస్తే కడుపు పెద్ద, తల మాస్తే కొప్పు పెద్ద.
- సామెత

పెద్దరికం
పేదరికం మల్లబడితే
పెద్దరికం బతుకదురా
పనిముట్లే పగబడితే
దోపిడీలు సాగవురా
- కె.యల్., కొత్తగుడి

చిన్నవాళ్ళుకాకుండా ఎవరూ పెద్దవాళ్ళు కాలేదు.
- కాళ్లకూరి, గరల్‌వైఫ్

పెట్టనేరని రండ పెక్కునీతులఁ బెద్ద
గొడ్రాలి ముండకు గొంతు పెద్ద
డబ్బురాని వకీలు డంబంబు కడుపెద్ద
రిక్తుని మనసు కోరికలు పెద్ద
అల్పవిద్వాంసుడు నాక్షేపణకుఁ బెద్ద
మూర్ఖచిత్తుఁడు కోపమునకుఁ బెద్ద
గుడ్డిగుబ్బము తట్టగుగ్గిళ్ళు తినఁ బెద్ద
వెలయు నాఁబోతు కండలకుఁ బెద్ద
మధ్యవైష్ణవునకును నామములు పెద్ద
కాసునియ్యని విటకాని గాసి పెద్ద.
- వేంకటరాయకవి, వేణుగోపాలశతకము

... పెద్దలనువారి యీప్సితములు
పదవికై వారు పడియెడి పాటె కాని
కార్య గౌరవ మింతేని కానరాదు
- గోపాలరావు, అపూర్వ సంఘసంస్కరణము

పెద్దప్లీడరు
కష్టపడి కట్టలుమోస్తే ఎప్పటికైనా మేస్త్రీప్లీడరు వవుతావు.
- బీనాదేవి, తీర్పు

పెద్దమనిషి
నేరం రుజువు అయేవరకూ, ముద్దాయి పెద్దమనిషి క్రిందే జమ.
- రామకృష్ణశాస్త్రి, కైంకర్యమ్

పెద్దమనిసి రాచరికం యెప్పుడూ సెయ్య నేదురా!
- కాంతారావు, వంశధార

ఈడులో చిన్నయినా ప్రవర్తనలో పెద్దతనాన్ని- అంటే ముసలితనం కాదనుకో- సూచించే వాళ్ళు పెద్దమనుషులు.
- ధనికొండ, పవిత్రులు

తమ యెఱుఁగని నానావిష
యములం దున్నతపదంబు లాశించి యన
ర్థము లెన్నియొ చేయుచుఁ బె
ద్దమనుష్యుల మనెడివారు ధరణిని లేరే?
- గోపాలరావు, అపూర్వసంఘ సంస్కరణము

ప్రజాసేవ పేరుతో గుడినీ, గుడిలో లింగాన్నీ మింగే పెద్దమనుషులు ఎందరో ఉన్నారు.

- రామచంద్రమూర్తి, శ్రీరాగం

### పెద్దలమాట

వెయ్యి అబద్ధాలాడి ఒక్క యిల్లు నిలపమన్నారు పెద్దలు.

- రామకృష్ణశాస్త్రి, అనవుడు-నావుడు

### పెద్దలు

లిఖిత పూర్వకమయిన సాక్ష్యములేక పెద్దమనుష్యుల మాటలను నమ్మి పనిచేయఁబూనుట యీ దేశములో క్షేమకరము కాదు.

- కందుకూరి, స్వీయచరిత్రము

పెద్దవారికి స్త్రీపుంవిభేద మేలా?
మాననీయంబు పుణ్యకర్మంబు గాక.

- శ్రీనాథుడు, హరవిలాసము

జనానికి నచ్చజెప్పితే పెద్దలు వద్దన్నా మానరు. తమ పెద్దరికం నిలుపుకోడానికి జనులతోపాటే వారూ వస్తారు.

- ఉన్నవ, మాలపల్లి

పెద్ద లసాధ్యులు.

- బుచ్చిబాబు, మధురతరంగం

నీవూ పెద్దల్లో ఒక ప్రైనప్పు డెలాగైనా ఉండవచ్చు

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

పెద్ద ఆకలి కలవాళ్ళకు పెద్దవిస్తరే కావాలి.

- రెంటాల, ఇన్‌స్పెక్టర్ జనరల్

ఉన్నదే నలుగురికి సర్దినోడు మనిషి. ఆడు తిన కుండా ఎదరోలకి ఇచ్చినోడు పెద్ద.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

పెద్దల చరితం బల్పులకు
నెఱుగ శక్యమె యెందున్?

- నన్నయ, సభాపర్వము

పెద్దవారి యట్ల పిన్నవారు.

- తిక్కన, విరాటపర్వము

... ఒక్కరి మెచ్చి వారి
కోర్కిఁదీర్చుట పెద్దల గుణము కాదె?

- తిక్కన, ఉద్యోగపర్వము

పెద్దవాళ్ళలో అధిక సంఖ్యాకుల నిర్ణయానికి ఒప్పుదల కుదరదుకాని పిల్లల్లో నలుగురాడిన మాటప్రకారం నడుచుకోక తప్పదు.

- చాసో, బబ్బుబ్బా

పెద్దవాళ్ళ దర్శనం చేసుకోవడం ఎప్పటికైనా మంచిది.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

ఇగో ఈ పెద్దవాళ్ళేం, ఎప్పుడూ ఏమిటీ సరిగ్గా చెప్పరు. దీన్నే లోపం అంటారుట.

- ముళ్ళపూడి, బుడుగు

పెద్దవాండ్లేమన్నా తల ఊపడంతో పెద్దవాండ్లు తమని తామే మరచిపోతుంటారు.

- ఆళ్వారుస్వామి, ప్రజలమనిషి

పెద్దలు లేని ఇల్లు ఎద్దుల కొటిక.

- సామెత

### పెద్దలోపం

ఈ విశాల ప్రపంచంలో లోపమంటూ లేని మానవుడుండడు. ఐతే మిగిలిన లోపాలన్నీ ఒక ఎత్తు, తాము ఈ ప్రపంచంకోసం కాదనీ, తమకోసమే ఈ ప్రపంచమనీ భావించడం ఒక ఎత్తు.

- రాజారాం, మరీచిక

### పెద్దాసుపత్రి

జనరలాస్పత్రి కెల్తే పేషెంటుకు తోడెల్లినోడు ముందు సస్తాడు. ఆ ఎనక పేషెంటు సస్తాడు.

- బీనాదేవి, డబ్బు

### పెద్దిల్లు

పూరిగుడిసెలో నువ్వు బతికున్నావో చచ్చావో చూడ్డానికి ఎవడూ రాడు. పెద్దింటి శవమ్మీద పాల రాతి మేడకడితే మాత్రం అది చూడ్డానికి వందల సంవత్సరాలపాటు వేలమంది జనం లక్షలు ఖర్చుపెట్టుకు వెళ్ళి చూసొస్తారు.

- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

### పెనుకోరిక

ఏ కోరికా కోరుకోకుండా ఉండాలనే కోరిక మరొక పెనుకోరిక.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

### పెన్నిధి

జ్ఞానానికి పెన్నిధి! యుక్తాయుక్త విచక్షణ.

- హర్షవర్ధన్, కళ్యాణ ఘడియ

### పెన్షను

ఉద్యోగంలో ఉండగా అతడు మరణిస్తే, అతని భార్యకు ఆ జన్మాంతం పెన్షను వస్తుంది. రిటైరయిన తరువాత మరణిస్తే అది హుళక్కి.

- నిరుద్యోగి, ఋణానందలహరిలో ట్విస్టు

పెంపకం

మగవాళ్ళే పిల్లలను పెంచాలని ఏ గవర్న మెంటు అన్నా శాసించిందో సగం మంది మగ వాళ్ళు తక్షణం ఆత్మహత్యచేసుకుంటారని నాకు గట్టి నమ్మకం!

- మునిమాణిక్యం, మా పిల్లలు

పెంచడం- అంటే, మనిషి నిద్రపోనపుడు పడుకో అని కోప్పడే సెయ్యడం.

- ముళ్లపూడి, పిల్లల్ని పెంచడం

పిల్లల్ని ఒక్కొక్కప్పుడు తిట్టవలసి వస్తుంది, కొట్టవలసి వస్తుంది. ఎప్పుడూ కొట్టడం ఎంత తప్పో, ఏం చేసినా ఎప్పుడూ కొట్టకపోవడం అంతే తప్పు. అయితే వాళ్ళు తమ పిల్ల లనే భావం కడుపునిండుగా వుండాలి.

- చిరంజీవి, బోలోస్వతంత్రభారత్‌కీ జై

తను వికారము వచ్చినఁ బెంపు దప్పునే?

- తిక్కన, విరాటపర్వము

కూనని పెంచితే గండయింది. కూటి కుండలకు ముప్పయింది.

- సామెత

పెరుగుదల

పబ్లిక్ ప్రాసిక్యూటర్లు, అడిషనల్ పబ్లిక్ ప్రాసి క్యూటర్లు, అసిస్టెంట్ పబ్లిక్ ప్రాసిక్యూటర్లు, స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్లు- ఇలాగ పాపాలు పెరిగిన కొద్దీ పీపీలు కూడా పెరుగుతూ ఉంటారు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

మనిషి తెలివితేటల్తోపాటు మారణాయుధాలు కూడా పెరిగాయి.

- రావిశాస్త్రి, బెదురు

మనుషుల విజ్ఞానంతోపాటు శిక్షల పరిమితి కూడా పెరిగిపోయింది.

- ధనికొండ, పవిత్రులు

మనుష్యుల్లో జ్ఞానం పెరిగేకొద్దీ అజ్ఞానమూ అంతే పెరుగుతున్నట్టు ఉంది.

- వీరేంద్రనాథ్, తులసి

పేకమేడ

మేస్త్రీలు మేడ కట్టితే, కుక్కకాలు తగిలి కూలి పోయిందట.

- సామెత

పేకాట

డబ్బులేని పేకాట అమ్మాయిలేని పార్టీలాంటిది. ప్రియురాల్లేని ప్రేమలాంటిది.

- బీనాదేవి, మిడిల్‌క్లాస్ మొరాలిటీ

పేచీ

పెళ్ళాంమాట కాదనకపోతే పేచీ ఎందుకొ స్తుందేం?

- మహీధరరావు, దేశంకోసం

ఈ పేచీలున్నాయి చూడు! ఇవి రానే కూడదు! వచ్చాయో చెండుకు తినేస్తాయి. ఒహంతట వదలవు. చిన్న పేచీని సరిచెయ్యాలనుకుంటే పెద్ద పేచీ అయి కూచుంటుంది. చాలా కష్టం.

- కొడవటిగంటి, బ్రతుకుభయం

ఈ పట్నాలలో ప్రతి చిన్న విషయానికీ పేచీయే.

- సూర్యారావు, నాగరికాలు

పెళ్ళాంతో పేచీపడని సంసారి యెవడూ ఈ భూప్రపంచం మీద ఉండడు.

- సూర్యారావు, ఒక గంట సంసారం

పేద

ఎన్నియున్నఁ బేద కిహమా? పరమా?

- ఏటుకూరి, ప్రేమాలోకము

కూలినాలిచేసి కుడుచు పేద సుఖంబు
దక్క దిలను మకుటధారి కెపుడు
తలకుఁ దాకకున్నఁ దనకేమి తెలియదు.

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

పేద కోప మెందుఁ బెదవుల చేటుగా
కుడికి యేమి సేయనోపు?

- పింగళి, కళాపూర్ణోదయము

బీదవాండ్ల ప్రాణాలకు విలువలేదు.

- ఉన్నవ, మాలపల్లి

ఎన్నెముక లేని మని సెలా ఉండడో పేదోల్లు లేని దేశ ముండదు. ఎంతమంది పేదోల్లుంటే అంత గొప్పదేశె మవుద్ది కద్దా, ఏ దేశమైనా కూడాను.

- విశ్వం, పేదవాడికి జై

పేదలయ్యును గడు బిఱ్ఱబిగిసి యుంద్రు
పట్టి యభిమానములును, గర్వములుఁ బట్టి
యల్లువారికి నెల్ల నీయవగుణంబు
వెన్నతోఁ బెట్టినది యింత విసువనేల?

- శ్రీనాథుడు, కాశీఖండము

పేదోళ్ళ నౌకరు సంపాలా? ఆళ్లే సత్తారు.

- కొడవటిగంటి, పారిపోయిన శవం

గరీబోడు తల్లికడుపులనుంచి ఈవల పడంగనే బయం ఒడులు కోవాలె.

- పవన్‌కుమార్, నల్లవజ్రం

ద్రవ్య మెంతున్నఁ దగు చరిత్రంబు లేని
యతఁడెపో పేద యన, ధనచ్యుతుఁడు కాఁడు.

- తి.వేం., మృచ్ఛకటికము

పేదవాఁ డనఁగాఁ దనభోగములకుఁ దగినంత సంపద లేనివాఁడు.

- విశ్వనాథ, బద్దన్న సేనాని

పేదవాళ్ళు పెద్దవాళ్ళవటం ఎన్నటికీ జరగని మాట. లేనిదానికోసం చేయి చాస్తే వున్నది పోవటం ఖాయం. నాల్రోజులు పస్తులున్నా వాళ్ల ప్రాణాలు పోవడంలేదు. ఆ మాత్రందానికి వున్నది చేయిజారితే తిరిగి రాదు కదా?

- కాళీపట్నం, ఆర్తి

పేదవాండ్రు చుట్టములకుఁ జుట్టములు కారు కదా!

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

ఘనలోభియు నిరుపేదయు
గుణముల సరియగుదు రెన్న

- గువ్వలచెన్న శతకము

పేదవాండ్ర మొఱలు భగవంతునకు దేవాలయములలో మంత్రములకంటె ముందుగా వినఁబడును.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

**పేదరికం**

మేలనుభవించి మీఁద లేమిపడెనేని
వాఁడు నిజముగ జీవచ్ఛవంబ చూవె.

- తి.వేం., మృచ్ఛకటికము

పస్నులిచ్చుకోవలసి వచ్చినప్పుడును, కొడుకుగాని, తమ్ముడుగాని చనిపోయిన తర్వాత కోడలికో, మరదలికో మనువర్తి ఇచ్చుకోవలసి వచ్చినప్పుడును మనుష్యులు పేదవారగుదురు.

- చిలకమర్తి, నవ్వులగని

లేమి కంటెను లోకువ లేదు జగతి.

- తి.వేం., మృచ్ఛకటికము

దారిద్ర్యముకంటె మరణము మేలు.

- చిన్నయసూరి, మిత్రలాభము

కాలే కడుపుకు గరిటెడు గంజీ
జారే సిగ్గుకు మూరెడు పాతా
ఎల్లర కందే చల్లని రోజులు
వెలిసే విధమును వెదకండీ!

- రాయప్రోలు, వనమాల

మరణమే మేలు దారిద్ర్యభరము కంటె.

- తి.వేం., మృచ్ఛకటికము

సాధారణముగా జనులందఱును మిక్కిలి బీద స్థితి యందున్నారు. అట్టి బీదస్థితికి కారణమే మని విచారింపగా మనలో పలువురు పాటుపడకుండుటయు, తమకున్న దానిని దుర్వ్యయము చేయుటయు తప్ప వేఱు కారణము కనఁబడదు.

- కందుకూరి, దేశాభిమానము

లేమి నెవ్వఁ డుడుపున్? శ్రీకాళహస్తీశ్వరా.

- ధూర్జటి, శ్రీకాళహస్తీశ్వర శతకము

దరిద్రం అనుభవించేటప్పుడు ఎంత భయంకరంగా ఉంటుందో జ్ఞాపకం చేసుకున్నప్పుడు అంత ఆనందమయంగా ఉంటుంది.

- అనంతం, నా దరిద్రపు రోజులు

ఇతరుల భూములు వ్యవసాయముజేయు రహితులు, ఈనాముదారులకు భూమిశిస్తు నీయవలసి వచ్చినప్పుడు తప్పక పేదవా రగుచుందురు.

- చిలకమర్తి, నవ్వులగని

పేదతికము పెద్ద వింత విద్యాశాల
దానిలోన లజ్జ గానఁబడదు
ఉదర మొజ్జ యగుచు నోరంత ప్రొద్దులు
నోర్మి విద్దె నేర్పుచుండు నచట.

- జాషువా, స్వప్నకథ

**పేరడీ**

మొదటికవి కవిత్వముతో చుట్టరికము ఉన్నవాడయితే ఈ పేరడీని ఇట్టేపట్టేస్తాడు. అది లేకపోయినవాళ్ళకి ఇది స్వతంత్ర రచనగా కనిపిస్తుంది. ఇది వ్రాయటం కష్టం. కవి ఏయే నూత్నావలోకాలతో పద్యం వ్రాసేడో, ఆ నూత్నావలోకాలలోనే పేరోడిస్టు దూరి మరీ వ్రాయాలి. లేకుంటే అనుకున్న విసురుడు రాక పేరడి ఫేలవుతుంది. ఇది పేరడీ వాఙ్మయ వ్యాయామంలో కష్టమైన ఒక యోగాసనం.

- మాచిరాజు, పేరడి అంటే

**పేరు**

కాంగ్రెసో! సోషలిజమో! కాంగ్రెస్ సోషలిజం ఏమిటీ? ఉన్న అవకతవక అంతా పేర్లోనే ఉంది.

- గోపీచంద్, దేశం ఏమయ్యేట్టు?

ఆలూలేదు, చూలూలేదు, కొడుకుపేరు సోమ లింగం.

- సామెత

పేరులోన నేమి పెన్నిధి యున్నది?

- గురజాడ, కన్యాశుల్కం

విశాలాంధ్ర రానీ చెబుతాను! 'తెలుగువాడు' అనే పేరు మార్చి 'తెలివితక్కువవాడు' అని పెట్టిస్తాను.

- నరసరాజు, ఈ యిల్లు అమ్మబడును

గ్రంథంలో దిగింతర్వాత అసలు అవతారాలే దిగుతాయి. పేర్లతో ఏంపని?

- గురజాడ, కొండుభట్టీయము

పేరు ఎప్పుడూ ఎంత పొట్టిగా వుంటే అంతే మంచిది.

- కాళ్లకూరి, గరల్ వైఫ్

అర్థంకాని కొత్త ఆలోచనలకి మనం వేదాంత మనీ, అర్థమయ్యే భయంకరమైన ఆలోచనలకి విప్లవమనీ మనం ముద్దు పేర్లు పెట్టుకుంటాం.

- మారుతీరావు, మళ్ళీమధుమాసం

పేరుంటేగాని చెయ్యటానికి మంచిపని దొర కదు. మంచిపని చేసి చూపిస్తేనేగాని పేరు దొరకదు.

- కొడవటిగంటి, జీవితం

సంఘంనుంచి వ్యక్తిని వేరు చేసేది పేరే.

- నార్ల, పేరు పెన్నిధి

పేరు చేతనే గౌరవము పుడికి పుచ్చుకొనదలచు వారికి మొండిపేరు బండబూతు.

- శివరామశాస్త్రి, డిప్రెషన్-చెంబు

మా ఆంధ్రలో నౌకర్లకూ, యజమాన్లకూ పేర్లు ఒకేలాగున ఉంటాయిలెండి.

- నంది, పుణ్యస్థలి

## పేలు

పేలు పడ్డాయని తలకు కొరివి పెట్టుకోవటం బుద్ధిహీనులు చేసే పని.

- కొడవటిగంటి, మైరావణ రక్తబిందువులు

## పైకిపటారం

ఈ రామప్పంతులు కథ పైకి పటారం లోపల లొటారంలా కనిపిస్తుంది.

- గురజాడ, కన్యాశుల్కం

## పైచెయ్యి

పెద్దోళ్లకేం, కిందబడ్డా పైచెయ్యి మాదేనంటరు.

- కె.యల్., కొత్తగుడి

## పైరవి

పైన రవి
క్రింద భువి
మధ్యనున్నది పైరవి

- మాలకొండారెడ్డి, పైరవి

ఇల్లాలి పెదవికి
చప్రాసి పదవికి
ఈనాడు చేయాలి పైరవి

- మాలకొండారెడ్డి, పైరవి

## పైవర్గాలు

పై వర్గాల వాళ్ళు జైళ్ళదాకా ఎందుకొస్తారు? కటకటాల దాకా రాకుండానే తమ నేరాల నుంచి తప్పించుకోవటానికి అనేకమార్గాలు న్నాయి వాళ్ళకి.

- ఆనందారామం, మరోముందడుగు

## పొగడ్త

మనను యితరు లెవరూ పొడగకపోయినా మనమైనా పొగుడుకుందాం.

- ఉన్నవ, మాలపల్లి

మత్తుపానీయాలకంటే ఎక్కువ మత్తు కలిగిం చేది పొగడ్త.

- శాయి, నీకలల బందీని

మనిషి పొగడ్తలకి దేవుడే పొంగిపోతాట్ట.

- గంగాధరరావు, లంబాడోళ్ల రాందాసు

## పొగమబ్బు

మున్నూ, తూర్పు కనుమలు విడుచు నిట్టూర్పు లట్టి విచటి యీ పొగమబ్బులు.

- విశ్వనాథ, కొండవీటి పొగమబ్బులు

## పొగరు

పొగురు పోట్టాడమంటాది. మదం మాట్టాడ మంటాది.

- కృష్ణరావు, పాపికొండలు

## పొగాకు

ఖగపతి యమృతము తేఁగా
భుగభుగమని పొంగిపొరలి భూస్థలిఁ బడి తాఁ
బొగచెట్టయి జన్మించెను.
పొగఁ డ్రావనివాఁడు దున్నపోతై పుట్టున్.

- చాటువు

రావణయుద్ధం బందునఁ
బావనుఁడగు లక్ష్మణుండు పడి మూర్ఛిలఁగా

నావలఁ బొగ చెట్టుండినఁ
బావని సంజీవి కేల పరుగెత్తునయా?

- చాటువు

పొగఁ బ్రాగనేర్చి భీముఁడు
పగఱన్ బొగ రడఁచె నాజి బాహాశక్తిన్
బొగఁ బ్రావని దుర్యోధనుఁ
డిగిలించెను రణములోన నిహిహీయంచున్.

- చాటువు

సన్నంబై కుఱుమట్టమై గరగరై
జాపత్రితో సాటియై
గన్నేరాకువలెన్ పసందుగలదై
ఘాటున్నదై లాహిరై
కన్నుందోయికిఁ జాలవేడ్క గొలుపం
గాఁ దగ్గదై నిగ్గదై
వన్నెల్ గుల్కు పొగాకు ముచ్చట వినే
వా? శేషశైలాధిపా!

- పేరయ్యశాస్త్రి, చాటువు

పొగత్రావికి సతిమోవికి
నగణితముగ నూరబావి కమృతంబునకున్
దగ నుచ్ఛిష్టత లేదని
ఖగవాహనుతోడఁ గాలకంఠుడు పల్కెన్.

- చాటువు

**పొత్తు**

పాములతో స్వాములతో
జామాతలతోడి పొత్తు చన దెవ్వరికిన్.

- ఏటుకూరి, ప్రేమాలోకము

పొత్తు అనేది సంపదలకే,
ఆపదల కగునే!

- గురజాడ, డామన్ పిథియస్

నిచ్చనలని ఎక్కడానికీ అందానికీ పొత్తు
కుదరదు.

- వెంకటరమణారావు, కొలువు

పొలతి దావవచ్చి పురుషుఁ డాజ్యఘటంబు
కరగకేల యుండుఁ గదిసెనేని?
బ్రహ్మయైన కూఁతుఁ బట్టక మానఁడు
వడుగు కింతి పొత్తు వలదు వలదు.

- పోతన, భాగవతము

బత్తితోడ కళకు పొత్తు లేదు.

- జాషువా, ముంటాజమహలు

**పొదుపు**

మాట్లాడకుండా ఎప్పుడూ మౌనంగా గంభీరంగా
వుండే వాళ్ళందరూ తెలివైన వాళ్ళు కాదు. కానీ
తెలివైన వాళ్ళందరూ మాటల ఎకనమిస్టులే.

- వీరేంద్రనాథ్, వెన్నెల్లో ఆడపిల్ల

ఖర్చు చెయ్యటంలో వున్న పొదుపు మాటల్లో
వుండదు.

- జయరాం, సింహాద్రి స్వీట్ హోమ్

**పొందు**

పొందు చేసిచేసి పొసఁగక మతిపోయి
తిరిగివచ్చునతఁడు తిరుగఁ జెడును.

- దూబగుంట, పంచతంత్రము

**పొర**

కాదూ ఔనుల నడుమ
చేదుపొర లేదనకు.

- సినారె, మధ్యతరగతి మందహాసం

**పొరపాటు**

తేనెటీఁగలఁ బొరిఁగొనిగాని యల్ల
తేనెఁగొన వీలుగాదని మానఁదగునె?

- సుందరరామయ్య, శుద్ధాంధ్ర నిర్వచన
రుక్మిణీపరిణయము

మనిషికే వుంటాయి పొరపాట్లు, ప్రింటింగ్
ప్రెస్ అనగా ఎంత?

- అవసరాల, పంజరం

పొరపాట్ల మీద పోలీసు నిఘా వెయ్యందే
తిరుగుబాట్లు నెరవేరవు.

- కుందుర్తి, సంఘోదయ

పొరపాట్లు మనుషులకు అలవాట్లు

- కుందుర్తి, తెలంగాణ

**పొసగుదల**

ఎదిరిం దమయట్టుల కా
మది తలఁచినఁ బొసగుగాక, మాకుం గుడు మిం
డిదె మీరు వ్రక్క గొనుఁ డని
చదు రడిచిన మనసుపొందుచక్కంబడునే?

- తిక్కన, ఉద్యోగపర్వము

**పోక**

పోరు నీకేల గోపాల! పొమ్ము పొమ్ము.

- పోతన, భాగవతము

**పోజు**

పోజు కీరోజుల్లో బ్రహ్మాండమైన మార్కెట్టుంది.

- ఆదివిష్ణు, ఎంతెంత దూరం

**పోటీ**

మనస్సును శరీరము- నివి రెండు వస్తువులు.

వానికెప్పుడు ఒక దానితో నొకటి పోటీ సామా న్యముగా మనస్సు శరీరమును దిగఁద్రొక్కి తాను ముందుకు పోవుచుండును.

- విశ్వనాథ, తెఱచిరాజు

అక్కన్న మాదన్నగార్లు అందల మెక్కితే సాటికి నరసప్ప చెరువు కట్ట ఎక్కినాడుట.

- సామెత

వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు తులాభారం తూగితే కరెడ్ల కామక్క వంకాయల భారం తూగిందట

- సామెత

ఆంధ్రులకి ఒక సంఘం అంటూ వుండదు. రెండు మూడు సంఘాలు పోటాపోటీగా వుండొచ్చు

- లక్ష్మణరావు, అతడు-ఆమె

సీతాకోకచిలుకలూ
ఊసరవెల్లులూ
ముఖాలు మాడ్చుకుని వెళ్లిపోయాయి
మన రాజకీయనాయకులు మార్చే
రంగుల ధాటికి తట్టుకోలేక!

- రాజేంద్ర, గుండెచప్పుళ్లు

రేడియోలో నాదస్వరం ఇంట్లో నాథస్వరం

- శ్రీరమణ, న్యూసుడి

తనకు లేక తంటాలు పడుతుంటే
తొంటకాళ్ళపిల్ల వెంటబడ్డట్టు.

- సామెత

తాటి పట్టెకు ఎదురు దేకినట్లు.

- సామెత

ముద్దుచేసిన కుక్క మూతి కరిస్తే, చనువు చేసిన భార్య చంకకెక్కింది.

- సామెత

రాజు భార్య మేడయెక్కితే, కుమ్మరివాని కోడలు గుడిసె యెక్కిందట.

- సామెత

**పోనిది**

మనుషులు పోయినా మాటలు పోవు.

- వసుబాబు, ఆద్యంతాలూ- ఆంతర్యాలూ

**పోరాటం**

హక్కును గుర్తించినవాళ్ళే పోరాడగలరు. పోరాటం సలిపిన వాళ్ళే తమ బాధ్యతల్ను కూడా సక్రమంగా నిర్వహించగలరు.

- వనశ్రీ, నిష్క్రమణ

జీవితం చేజారిపోతోంది అని తెల్సినప్పుడు స్త్రీలు ఎదురు తిరిగి పోరాడినట్టు పురుషులు పోరాడలేరు.

- జయ, భ్రాంతి

మేకొని మీలోన మీరు పోరాడఁ
జూచెడువారికిఁ జులకన యౌను
పలువలు మిముఁజేరి పగఁజావనీక
చెప్పుచునుందురు చెనటి వాక్యములు.

- శ్రీనాధుడు, పలనాటి వీరచరిత్ర

పోరాట పటిమగల వాడికి అన్నీ లభిస్తాయి. లేని వాడికి మిగిలేది వాడి కర్మమే.

- చిరంజీవి, బోలోస్వతంత్ర భారత్‌కీ జై

క్రొత్త ప్రాత పోరాటములోఁ బ్రజలు నలిగి చచ్చిపోవుచున్నారు.

- త్రిపురనేని, ఖూనీ

**పోరానివి**

పిలువని కూటికిన్, వెతల బెట్టు ధ
రావరుఁ డేలు వీటికిన్,
జలములు లేని యేటికిని,
సారెకు బందుగు లున్న చోటికిన్,
బలువుర తోటి పోటికి, నృ
పాలుర సాటికిఁ బోవరాదయా!

- చాటువు

**పోలిక**

మతమూ, శాస్త్రమూ యెలాంటివో వ్యాపారం కూడా అలాంటిదే. దానికి ప్రేమా, ద్వేషమూ లేవు.

- ఠాకూరి, శ్రావణసంధ్య

నవాబెంత దరిద్రుడో పులి అంత సాధువు.

- సామెత

శరత్కాల వర్షం కృపణుని ఔదార్యం వంటిది.

- సామెత

మర్రిచెట్టు కింద మొక్కలు మొలవవు. అయ్య కింద ఎవ్వరూ ముందుకు రారు.

- సామెత

పడినవాడు పచ్చబొట్టులాంటిది.

- నాగచంద్రావతి, కాలం కరిచాక

ఆడపిల్లని కన్నవాళ్ళు నూతితో సమానమట. మగ బిడ్డని కన్నవాళ్ళకి తోడుకోవటమే పనిట.

- నాగచంద్రావతి, కాలం కరిచాక

సంపత్తులేని కులీనుఁడు శ్మశానములోని తులసి

మొక్క వంటివాడు.

- కాళ్లకూరి, వరవిక్రయము

ఇప్పుడు మేం వైద్యులం. బుర్రలు తీసి బుర్రలు పెడుతున్నాం- వకీళ్ళలాగు.

- లక్ష్మణరావు, అతడు- ఆమె

"పెద్ద చెరువు నీటికి, పెద్దింటి రంకుకు" పోల్చారు.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

ధనముఁ బాసిన నరు జీవితంబుకంటె
ధనము లేకున్న నరు జీవితంబు మేలు.

- తి.వేం., మృచ్ఛకటికము

ప్రభువు క్రోతియైన ప్రగ్గడ పందియౌ
సైనికుండు పక్కి సేన పసులు
నేన్గు లశ్వములును నెలుకలు పిల్లులు

- వేమన

భయానికీ మంచికీ పొందిక లేదు. పిరికి వారె వరూ కూడా మంచివారు కాజాలరు. మంచికి నిలబడలేరు.

- రావిశాస్త్రి, ఆకర్నేమాట

పుట్టలో వున్నంతసేపూ విషసర్పమని తెలిసినా, నాగేంద్రుడని నమస్కరిస్తారు. పాలు పళ్లు తెచ్చి నైవేద్యం పెడతారు. అదే పాము పుట్టవి డిచి బయటకు వస్తే కర్రతో కొట్టి చంపుతారు. రాజకీయ నాయకుడి బ్రతుకూ అంతే.

- వెంకటేశ్వరరావు, సమాధికడుతున్నాం చందాలివ్వండి

ఊతి గాదెలోని వైన రాజనాలు... పేటగాదె లోని వైన పెద్దవరి. దినుసంతయు నొకటి... ఫలమంతయు నొకటి.

- పానుగంటి, కంఠాభరణము

సీమ ఇనుపరేకు డబ్బీలోని దైన యెడల నారతి కప్పురమ్ము, చిన్న గాజు బుడ్డిలోనిదైన యెడలఁ బచ్చకప్పురము.

- పానుగంటి, కంఠాభరణము

మధ్యస్థుఁడు లేని వాదము పురోహితుఁడు లేని పెండ్లివలె అసమంజసము.

- పానుగంటి, కంఠాభరణము

నేలవదిలిన సాము, భాష వదిలిన లేఖన ముండునా?

- పానుగంటి, సాక్షి

బొగ్గు ప్రక్కనే వజ్రమున్నది. పాము విషపుఁ గోఱకు పైననే మణియున్నది. పాపము నంటియే పుణ్యమున్నది. వాని సామీప్య మెఱుఁగక యోగి భోగి యగుచున్నాడు భోగి యోగి యగుచు న్నాడు.

- పానుగంటి, సాక్షి

గంగానది పైఁబడిన పులివిస్తర్రాకైన సముద్ర మునఁ జేరుచున్నది. కాని గంగలో నున్న సుడి గుండములు భీష్ముఁడు పుట్టినప్పు డెక్కడ నుండెనో ఇప్పుడు కూడ నక్కడే యున్నవి.

- పానుగంటి, సాక్షి

మర్రిచెట్టు కింద మొక్కలు మొలవవు. అయ్య కింద ఎవరూ పైకి రారు.

- సామెత

స్థితి కనుకూలమగు వేషము, వేషమున కనుకూల మగు భాష యుండుట తగునుగాని చాకివాఁడు సవారి నెక్కి చాకిరేవునకుఁ బోవుట సందర్భముగా నుండునా? కాషాయాంబరధారి కళాశాస్త్ర ప్రశంస చేయఁదగునా? దేశ కాలస్థితుల కర్హముగ నుండు టయే యధిక యోగ్యతావధి.

- పానుగంటి, సాక్షి

నాయనా! వాణీదాసా! పోతరాజుగారిని రాజు లాదరింపలేదు. నిన్నును రాజు లాదరింపలేదని పోతరాజుగారితో సామ్యమును దెచ్చుకొనుచు న్నావా? నందీశ్వరునకుఁ గొమ్ము లున్నవి. నాకును గొమ్ము లున్నవని నత్తగుల్ల యఱచినట్లు న్నది.

- పానుగంటి, సాక్షి

శాస్త్రీయ సాహితీ సమర్థతలు సర్వంకషముగనున్న సనాతన దినములలో బిరుదముల చింత యెవ్వ రికిని లేనేలేదు. అది కలఁతకొ ట్టగుటచేతనే కాంబోలు నివి పెచ్చు పెరుగుచున్నవి. అల్పాఙ్మఁ డెప్పుడు నాడంబరమున్నకై యాశించును కదా! పంచకావ్యములలో రూపాయి కయిదణాల ప్రాంత డబ్బు పాండిత్యము సంపాదించిన పండితునకు, నడుమున కొక్కసాలువు - [illegible]కొక్క సాలువు- భుజమున కొక్క సాలువు. హృదయమున భక్తి లేశమైనఁ జేరనీయక గొంతుముడివరకుఁ జిట్టి గారెలు సేవించిన భాగవతోత్తమునకు, గోడపరదా లంత పట్టెనామములు - గాడిదెమోత యంత తులసి పేరులు.

- పానుగంటి, సాక్షి

మూర్ఖులకు మూర్ఖులతోఁ గలసినట్లు మంచి వారితో నెప్పుడును కలియదు. కప్పకు బురద

నీళ్లింపయినట్టు పన్నీరింపగునా?

- కందుకూరి, సత్యవతీ చరిత్రము

**పోలీసు**

ఎడ్డు పొట్టేలైతే ఇనసపెక్ట్రుబాబు పులి- ఆడుపు లైతే యీడు సింపం.

- బీనాదేవి, తప్పు

పోలీసువాళ్ళకీ స్నేహానికీ చుక్కెదురు.

- భుజంగరావు, నిరపవాద ప్రహసనము

ఆయన మీసాల పోలీసాఫీసరు. ఈ వూళ్ళో పరపతిని చలికాలంలో రగ్గులా కప్పుకున్న మనిషి.

- ఆదివిష్ణు, వాంటెడ్ ఫాదర్స్

పోలీసువాళ్ళు తలచుకుంటే ఒక మంచి మనిషి బ్రతుకు పదుగురినోళ్ళలో పడి నానిపోవడం ఏమంత దుస్సాధ్యమైన కార్యంకాదు. మీ మీద సవాలక్ష కేసులు బనాయించగలరు.

- ఆదివిష్ణు, వాంటెడ్ ఫాదర్స్

ఒక్కసారి పోలీసుల చేతుల్లో పడితేసరి, యమ భటు లెలా ఉంటారో అర్థమయిపోతుంది.

- ఆనందారామం, ఆడదానికి మరోపేరు

పోలీసుశాఖ తీరుతెన్నులను ఎంతైనా సంస్కరిం చవలసిన అవసరం ఉన్నది. వారు రక్షకభ టులు కావాలేగాని భక్షకభటులు కారాదు.

- చిరంజీవి, చీమమనుషులు

కనిపించని పోలీసు దెబ్బల్లా మాటలతో కొట్టాడు బడిపంతులు.

- బుచ్చిరెడ్డి, వెలుగు

**పోలీసు స్టేషన్**

తెల్లబట్టలోళ్ళు, ఖద్దరుబట్టలోళ్ళు అడుగుపెట్టందే పోలీస్‌స్టేషన్‌లో ఏ పనీ జరగదు.

- సావిత్రి, ఒడిలో చెలి మోహనరాగం

తెల్లారి లేస్తే ప్రపంచంలో వున్న లిటిగేషనంతా పోలీసు స్టేషనులోనే తెమిల్తుంది.

- పద్మనాభరెడ్డి, మాయ

**పోషణ**

ఘోషణ అనేది ఈ రోజుల్లో ఎంతేనా అవ సరం. ఘోషణవల్లే పోషణ జరగడం!

- భమిడిపాటి, తుక్కుముక్కల హక్కు చిక్కు

**పోస్టుమాస్టరు**

నేను చదవందే వొక్క వుత్తరాన్ని పైకి పోనివ్వను. జాగ్రత్తకోసం కాదు - ప్రపంచ జ్ఞానం కోసం.

- రామదాసు, ఆకాశరామన్న

**పౌరుషం**

ఆత్మసంస్తుతి పౌరుషం బగునె చెపుమ?

- తిక్కన, ఉద్యోగపర్వము

పౌరుషం మానవజాతికే ఏర్పరచబడ్డ జాడ్యం కాదు. జంతువులకీ వుంటుంది. కాని వాటికి మానసికమైన బాధ వుండదు.

- నంది, నైమిశారణ్యం

సేతకానోడికి పౌరుషం యెక్కువ.

- కాంతారావు, వంశధార

**పౌరోహిత్యం**

పోఁడిమిఁ బౌరోహిత్యం<br>
బేడుగడ మఠాధిపత్య మింపెసఁగంగా<br>
మూఁడు దినంబులు చేసిన<br>
వాఁడు సుమీ ఘోరనరకవాసుఁడు మీఁదన్.

- దూబగుంట, పంచతంత్రము

ఇంత చద్దన్నమో ఇన్ని యేన్నీళ్ళో కడుపులో పడితే రోజుకు 4,5 తద్దినాలు పెట్టిస్తాను.

- పుండరీకాక్షుడు, సంఘసమస్య

**ప్రకృతి**

మానవ ప్రకృతి మనుష్యుని ఊహకు మించి నడుస్తూ వుంటుంది.

- బాపిరాజు, గోన గన్నారెడ్డి

ప్రకృతి చాలా విచిత్రమైంది. అదెంత సాధ్య మైందో అంతే ప్రమాదమైందిగూడా. దానికి కోపం వచ్చినప్పుడు మంచి చెడ్డలు లేవు. మంచివారిని గూడా బాధిస్తుంది. దానికి సంతో షంగా వున్నప్పుడు చెడ్డవానికి గూడా చక్కని ఆనందాన్ని కలుగజేస్తుంది.

- సభా, పిచ్చిదంపతులు

ఆడదానికి ఆవేదన ఎక్కువ. ఆడవాళ్ళకు ప్రేమే ప్రాణం. కాని మగవాడికి ఎంత ప్రేమ ఉన్నా ప్రాణం మాత్రం కాదు. ఇది పురుషుడికి ఉన్న లోపం కాదు. ప్రకృతిసిద్ధం.

- సరస్వతీదేవి, ప్రణయ లేఖలు

ప్రకృతి యెంత కాలము పాడినను నొక్కటే పాట; యెంతకాల మాడినను నొక్కటే యాట.

- పానుగంటి, చూడామణి

ఆకాశపు ఎడారి
లో కాళ్ళు తెగిన
ఒంటరి ఒంటెలా
గుంది జాబిల్లి!

- శ్రీశ్రీ, ఒకరాత్రి

మానవుల గర్వం నగరాల సర్వం
ప్రకృతి ముందు శ్రీకృష్ణార్పణం.

- తిలక్, రాజమండ్రి పాటలు

ప్రగతి

తెలిసి సాగిపోతే ప్రగతి
తెలివి ఆగిపోతే మృతి.

- సినారె, మృత్యువునుంచి

ప్రచారం

వినియోగదారుడు కొనేవస్తువుపై మంచీ, చెడుల విచక్షణదాకా వార్ని పోనివ్వకుండా చేయటమే పబ్లిసిటీ ప్రధానోద్దేశం చాలా వస్తువుల వరకు.

- రామమోహనరావు, మోడల్

ప్రజలు

ప్రజలంటే బోడ్రావుడూ, గెడ్డం సన్యాసీను; అంటే మీరూ నేను అన్నమాట. మరోలా చెప్పాలంటే; జేబులో డబ్బు వేసుకువెళ్ళేవాళ్ళు ప్రజలు. అవి కొట్టేసి బాంకుల్లో దాచుకొనేవాళ్లు ఎన్వర్ ప్రయిజుగాళ్ళు.

- రావిశాస్త్రి, కుక్కపిల్ల

కాసు చేయని వెధవలంతా ప్రజ.

- ఆత్రేయ, అద్దెకొంప

ప్రజలు వివేకముతో యుక్తాయుక్తములను విచారించుకొని, మేలుకీళ్లను గ్రహింపఁజాలు స్థితియందు లేరు.

- త్రిపురనేని, ఖూనీ

ప్రజల యనురాగమునకెక్కడకు? విరాగమునకెక్కడకు? అది యొక గాలిపాటు గంగ వెఱ్ఱిపోటు.

- పానుగంటి, వీరమతి

ఒక ప్రక్క డొక్క కాలుస్తుంటేగాని ప్రజలు మాట వినరు. ప్రపంచం నడువదు.

- వేదాంతకవి, ఆకలిమంట

ప్రజాదరణ

ప్రజాదరణ పొందటంకన్న మృత్యువు వేరేలేదు కవికి.

- చలం, మ్యూజింగ్స్

ప్రజాధనం

తలవెంట్రుక వాసి మనం కూడా స్వాహా చేయకపోతే ప్రజాధనం ఎలా అనిపించుకొంటుంది చెప్పండి?

- నంది, పుణ్యస్థలి

పెజా సొమ్మంటే మా రాజుల్దిరా.

- వెంకటేశ్వరరావు, సమాధికడుతున్నాం చందాలివ్వండి

ప్రజాప్రతినిధి

ప్రజలచేత ఎన్నుకోబడి, ప్రజాసేవలో మునిగి తేలే మనిషి ప్రజల డబ్బుతోగాక మరెవడబ్బ డబ్బుతో బొజ్జనింపుకోవాలి?

- చలసాని, పుణ్యభూమి

ప్రజాభిమానం

Artists దేవుళ్ళాడేదే popularity కోసం. అతన్ని artist కాకుండా చంపే శత్రువే ఆ popularity.

- చలం, మ్యూజింగ్స్

ప్రజాస్వామ్యం

అపోజిషన్‌వాళ్లు మిగిలివున్నంతకాలం ప్రజాస్వామ్యం సాగదు.

- పతంజలి, అప్పన్న సర్దార్

గొర్రె దాటు ప్రజాస్వామ్యం
జేబుదొంగల సోషలిజం.

- బైరాగి, పాంచజన్యం

మనదేశంలో ప్రజాస్వామికం బతికేదీ చచ్చేదీ ఎన్నికల మీదకాదు ఆధారం పడింది, ప్రభుత్వం ఏర్పాటు కావటంమీద!

- కొడవటిగంటి, దిబ్బరాజ్యంలో ప్రజాస్వామికం

విషం కలిపిన పాయసం ఈ ప్రజాస్వామ్యం. డబ్బున్న భడవా వుంచుకొన్న పాయసం ఈ ప్రజాస్వామ్యం.

- కిషన్, లేవరేం....

ధనస్వామ్య జగతినుండి
జనస్వామ్య ముదయించును.

- సినారె, జాతిరత్నం

ప్రజాస్వామ్య మొక
ఖద్దరు తిరుగుడుపువ్వు.

- ప్రసేన్, మహాభారతం

ప్రజాస్వామ్యం ఒకళ్ళిస్తే పుచ్చుకునేది కాదు.

బలంలేని జాతికది వరంకాదు.

- మురళీధర్, గుండె ఆగిపోయినప్పుడు

ఎంత వెనకబడి ఉన్న ప్రాంతంలో కూడా ప్రజాస్వామికానికి విజయం సాధించుకోవచ్చు

- కొడవటిగంటి, దిబ్బరాజ్యంలో ప్రజాస్వామికం

ప్రజాస్వామ్యం కాగితాల మీద పేదవాళ్ళకి, ఆచరణలో పెద్దవాళ్ళకు ఉపయోగపడుతుంది.

- వెంకటేశ్వరరావు, సమాధికడుతున్నాం చందాలివ్వండి

ప్రజాస్వామ్యంలో పార్టీకి కావలసింది ప్రజల క్షేమం కాదయ్యా మెంబర్ల బలం.

- వెంకటేశ్వరరావు, సమాధికడుతున్నాం చందాలివ్వండి

మౌన రోదనలు విన్న
జనఘోషను విన రెవ్వరు
పట్టపగలు నడివీధిన
ప్రజాస్వామ్యం ఖూని!

- హర్షవర్ధన్, యువత

ప్రజ్ఞ

ప్రజ్ఞగలవాడు బతికున్నకాలం అంతా చచ్చినట్టుండి, చావడంతోటే బతకడం మొదలు పెడతాడు.

- భమిడిపాటి, త్యాగరాజు మాటలు

రసము సృష్టిచేయు ప్రజ్ఞావిశేషంబు
సాధనమున రాదు చదువు గాదు.

- జాషువా, ముంటాజమహలు

ప్రణయం

ప్రణయంలో ఉన్మాదం
ప్రభవించింది
సౌందర్యం చింకిపాత
సవిరించింది.

- విశ్వేశ్వరరావు, పిచ్చిపాట

ప్రతిక్రియ

ప్రతి దానికిఁ బ్రతిక్రియఁ జేయఁ బూనినచో సాధ్యమేకాదు. ఆ ప్రతిక్రియ భగవంతుని చేతిలోనున్నది.

- విశ్వనాథ, కడిమిచెట్టు

ప్రతిఘటన

ప్రతిఘటనలు అతిక్రమించగలిగితేనే జీవితానికి విజయమున్నూ.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, గులాబీ అత్తరు

ప్రతిఘటనలు తటస్థించితేనే జీవితానికి పరిణతి.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, గులాబీ అత్తరు

అచ్చమైన జీవితం
అనుకరణంలో లేదు
ప్రతిఘటనంలో ఉంది.

- సినారె, ముఖాముఖి

చీమూ నెత్తురూవున్న చైతన్యవంతులు హింసని హింసతోనే ప్రతిఘటిస్తారు.

- బైరవయ్య, రా

ప్రతిజ్ఞ

కట్టాయము-నాన్ సాపడ
మాట్టేన్ గోంగూర-పేస మాట్టేన్ తెన్గున్
విట్టుడరే నెల్లాం! ఆ
కుట్టిన్ నీకొండువంది కుడుతాకపరం.

- గునుపూడి, బీదాల శాస్త్రి

ఒకని కవిత్వమం దెనయు
నొప్పులుఁ దప్పులు నా కవిత్వమం
దొకనికిఁ దప్పుపట్టఁ బని
యుండదు కాదని తప్పు పట్టినన్
మొక మటు క్రిందుగాఁ దిగిచి
మొక్కలు వోయిన యంపకత్తితో
సిక మొదలంటగాఁ దుఱిమి
చెప్పునఁ గొట్టుదు మోముఁ దన్నుదున్.

- రామకృష్ణుడు, చాటువు

ప్రతిపక్ష నాయకుడు

ప్రతిపక్షనాయకుడు తిన్నగా, ముక్కుకు సూటిగా ఎప్పుడూ ప్రయాణం చెయ్యడు.

- సూర్యారావు, నీలితెరలు

ప్రతిపక్షం

ప్రతిపక్షం అంటే చెవిలో జోరీగలాగుండాలి - చెప్పులో రాయిలాగుండాల - కంటిలో నలుసులా గుండాలి.

- పతంజలి, అప్పన్న సర్దార్

బక్కచిక్కిన ప్రతిపక్షాలు
తెల్లబడుతున్న ఎర్రజెండాలు.

- భాస్కరరావు, పగిలిన నెత్తురు

అపొజిషన్‌లో కూర్చున్నాక అన్నీ ఆందోళన ల్లోనూ పాయింట్స్ కనిపిస్తాయి.

- విపినమూర్తి, ఉద్యమం

ప్రతిఫలం

దున్నే ఎద్దునే పొడిచేది.

- సామెత

### ప్రతిఫలాపేక్ష

ప్రతిఫలాపేక్ష లేకుండా ఎప్పుడూ ఏ పనీ జరగదు కదా.

- విశ్వం, పేదవాడికి జై

### ప్రతిబంధకం

వివాహము మనశ్శరీర స్వాతంత్ర్యములకు రెండిటికిఁగూడఁ బ్రత్యక్ష ప్రతిబంధకము

- కూచి, రూపలత

### ప్రతిబింబం

ముష్టోడు అద్దంల జూసుకుంటే ముష్టోడే అవుపిస్తాడు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

అద్దం మాట్లాడకుండా ప్రతిబింబిస్తుంది. స్త్రీ ప్రతిబింబించకుండా మాట్లాడుతుంది.

- శ్రీరమణ, సామ్యవేదం

### ప్రతిభ

ప్రతిభవెంట ప్రతిష్ఠవద్దన్నా వచ్చిపడుతుంది.

- విమలారామం, కిరణ్మయి

ప్రతిభ కొల్లగొట్టు పగవాఁడు గల్గునా?
చావలేదు తెల్గుజాతి చేవ.

- జాషువా, స్వేచ్ఛాదినము

పరుసవేది సోకిన లోహం బంగారమైనట్లు ప్రతిభ సోకిన విషయం రసమయమై పోతుంది.

- కృష్ణరావు, పాపికొండలు

శౌర్య ప్రకటనమునఁ బెద్దపులి ఝూంకార మెట్టిదో దోమ హుంకారముకూడ నట్టిదే.

- పానుగంటి, చూడామణి

ఏదో కొంత యింగ్లీషు చదివినచో నా యుద్దేశ్యములోఁ బ్రతిభ వృద్ధి పొందును.

- విశ్వనాథ, తెఱచిరాజు

వట్టి యేదర్శనం బైనఁ బ్రతిభ కలిమి
వలసినట్లు వక్కాణింప వచ్చియుండు.

- శ్రీనాథుడు, శృంగారనైషధము

### ప్రతిమాయ

మాయలు గల పగఱ మాయా ప్రకారంబులం బరిమార్చుటయ తగు.

- తిక్కన, శల్యపర్వము

### ప్రతిష్ఠ

చాలామంది కవుల మనేవారు యెంగిలి శ్లోకాల వల్లనే ప్రతిష్ఠ సంపాదిస్తారు.

- గురజాడ, బిల్హణీయము

లేఁగదూడమీఁది కాఁబోతు పోవుట లేగకుఁ బ్రతిష్ఠయే యైనను నాఁబోతున కపయశమే కాదా?

- పానుగంటి, చూడామణి

వెధవ పేపర్ల మాటెందుకు, నేను పేపర్లెప్పుడు చూడనే చూడను.

- చిలకమర్తి, కాందూరి జానకిరామయ్యగారి పెండ్లి

### ప్రతీక

రూపకంపేరు మార్చుకుని
తననిప్పుడు ప్రతీక అనాలంటుంది.

- హెచ్చార్కె, అతినవ్య వ్యక్తివాదం

### ప్రతీకారం

అత్త పేరుపెట్టి కూతుర్ని కుంపట్లోవేసినట్లు.

-సామెత

అపకారిని అలక్ష్యంచేసి ఊరుకోవడమే అసలైన ప్రతీకారం! అసలైన క్షమాభిక్ష కూడా!

- భాస్కర్, అర్ధరాత్రి ఆడపడుచులు

### ప్రత్యామ్నాయం

సాధారణ మానవులు ఎప్పుడూ ఓ నాయకుడిపైనో శాస్త్రంపైనో ఆధారపడ్తారు. ఈశ్వరుడి అధికారాన్ని తీసేస్తే దాని బదులు పార్లమెంటు అధికారానికి తలవొంచుతారు. శాస్త్రస్థానంలో ఈనాడు సైన్సు వొచ్చింది.

- చలం, మ్యూజింగ్స్

ఎద్దు తంతుందని గాడిదకాళ్ళు పట్టుకున్నట్లు.

- సామెత

తెలివికి తల లేకపోయినా, భోజనానికి పొట్ట ఉంది.

- సామెత

### ప్రత్యుత్తరం

మనం భవిష్యత్తుకు రాసే ఉత్తరం
మనకు యింకా అందని ప్రత్యుత్తరం.

- కుందుర్తి, అజ్ఞాత

### ప్రత్యేకత

మానవత్వానికి
నేనంటూ ఒక శరీరం లేదు
అందుకే అది
మనసుకు తప్ప
కంటికి అగుపడదు.

- రాజేంద్ర, గుండెచప్పుళ్లు

ప్రత్యేకం

ఒక్కొక ధర్మగ్లానికి
నొక్కుపదేశంబుఁ జేయుచుందును.

- త్రిపురనేని, భగవద్గీత

సుఖంకోసం అన్వేషణ సాగిస్తూ పాకులాడుతూ పోయేకంటే; అది మనల్ని వెదుక్కుంటూ వచ్చినప్పుడు అనుభవించటంలోనే ఎక్కువ ఆనందం వుంటుంది.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

కార్తీకం కలకాశ, వైశాఖం పులకాశ.

- సామెత

కట్టినవాడి కొకటేయిల్లు, కట్టనివాడి కన్నీ యిళ్ళే

- సామెత

ఊరంతా ఒకతోవ, ఉలిపికట్టెది ఒకతోవ.

- సామెత

జిహ్వ కొక రుచి, పుర్రె కొక గుణము.

- సామెత

ఆస్తి కలిగి తీఋవ లేని యప్పె యప్పు,
నూరుగొని వేయికై వ్రాయు నోటె నోటు,
పసిఁడి తాకట్టు పైనిచ్చు బదులె బదులు,
రోజు వడ్డీలు వచ్చిన రోజె రోజు.

- కాళ్లకూరి, వరవిక్రయము

మనుష్యులు కనుక నైతికంగా నలిగిపోతూ అందుకు బాధ్యత మరొకరిమీద పెట్టి తమ అంతరాత్మను వోదార్చుకుంటారు.

- ఆనందారామం, అర్ధంలోశత్రువు

మగవాళ్ళు చప్పున రెండు మాటలనేసి బయట పడతారు? ఆడవాళ్ళ కెన్నో బాధలు. అనిపించుకొన్న కష్టమొకటి. అంటూ ఉండగా ఎవర యినా విన్నారని తెలిసినా తరువాత కలిగే అభిమానమొకటీను.

- సరస్వతీదేవి, డోలారోహణ

ప్రథముడు

నివృత్తి మార్గమున నుండు నరులలో భాగవతోత్తముఁ డెట్లు ప్రథముఁడో, ప్రవృత్తి మార్గమునఁ దిరుగు విటులలోఁ గన్నెరికపు పెండ్లికొడు కట్లు ప్రథముడు.

- పానుగంటి, విప్రనారాయణ

ప్రదక్షిణ

ఆహాహా! గ్రహము లన్నియు సూర్యుని చుట్టెట్లు తిరుగుచున్నవో! ఒకరి చుట్టొకరు తిరుగ వలసిన ప్రారబ్ధ మేలోకమునకుఁ బోయిననుఁ దప్పదుగదా?

- పానుగంటి, సాక్షి

భూమి తన చుట్టూ తాను తిరుగుతూ
ధనవంతుడి చుట్టూ తిరుగుతోంది.

- తిలక్, న్యూసెలబస్

రావి చెట్టుకు ప్రదక్షిణం చేస్తే బిడ్డలు పుట్టుతారంటే చుట్టు చుట్టుకు పొట్ట చూసుకుందట.

- సామెత

ప్రధానం

నిజంగా చూడవలసినది శక్తి సామర్థ్యాలూ, యుక్తి ప్రయుక్తులూనే; కాని, జయాపజయాలు కావు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, వడ్లగింజలు

కర్మ ప్రధానం కాని కారణం ప్రధానం కాదు.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

పూజకన్నా బుద్ధి, మాటకన్నా మనసు ప్రధానం.

- సామెత

కవితకు మెప్పు కాంతకు కొప్పు

- సామెత

ప్రపంచగతి

ఆస్థానంలో వ్యవహారాలు నాన్చుతున్నారు గదా అని ప్రపంచ గతి నిలవదు గదా?

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

ప్రపంచజ్ఞానం

యీ రోజుల్లో పై చదువులు చదివిన వాళ్ళకు ప్రపంచజ్ఞానం బొత్తిగా తక్కువగా వుంటోంది.

- సూర్యారావు, నీలితెరలు

ప్రపంచం

ఈ ప్రపంచమే మనందరికీ పాఠాలు నేర్పుతోంది. మొండివాళ్ళు నేర్చుకోడానికి తిరస్కరిస్తారు. బుద్ధి మంతులు ఇట్టే గ్రహిస్తారు.

- సోమసుందర్, గుప్తసాలగ్రామం

ప్రపంచ మున్న దనుకొన్నవాని కున్నది. లేదనుకొన్న వానికిలేదు. నీ మనసునుబట్టియే దాని రూపము. కవి కది గీతము. గాయకుని కది రాగము. సాలి కది మగ్గము. ముచ్చి కది పటము.

- పానుగంటి, చూడామణి

సుఖము లెల్లఁ గలలు, శోకంబులును గలల్
తాననెడు తలంపు హానిఁదెచ్చె

అరయ నింద్రజాల మఖిల ప్రపంచంబు
నిత్య సత్య మాత్మ నెగడు నొకటి.

- వేంకటరాయశాస్త్రి, బొబ్బిలియుద్ధము

దబాయింపు, బుకాయింపు, బనాయింపు, బజాయింపు, ఎడ్వర్టిజ్‌మెంట్, వీటిల్లో ఉంది, ప్రపంచం, వరల్డ్.

- భమిడిపాటి, బాగుబాగు

ఏదీ కోరకుండా ఏదో పని చేసుకుపోండి. ప్రపంచం మీ కాళ్లముందు వాల్తుంది. ఏమన్నా అడిగారా, చెట్టెక్కుతుంది ప్రపంచం.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

ప్రబంధనాయిక

అసలు ప్రబంధనాయికకు పిల్లలుండరు.

- మునిమాణిక్యం, మా ఇంటావిడ

ప్రభావం

దరిద్రం స్నేహితులను పోగొట్టుతుంది. దరిద్రం పోయినమీదట వచ్చే ఐశ్వర్యం ఆ పోయిన స్నేహితు లందరినీ శత్రువులుగా మారుస్తుంది.

- కొడవటిగంటి, సద్యోగం

తుపానుమీద సినిమాతీస్తే తుడిచిపెట్టుకుపోయిందిట.

- శ్రీరమణ, న్యూనుడి

క్రొత్త కుండమీఁదఁ జేసిన సంస్కారమట్లు లేత మనస్సు మీఁదఁ బడిన భావములు మరపునకు రాక యాజీవితాంత ముండును.

- చిలకమర్తి, కర్పూరమంజరి

ప్రభుత్వం

దిగువ జాతులలో ప్రబోధం కలుగందే ధనిక ప్రభుత్వం ఉంటుంది గాని ప్రజా ప్రభుత్వము ఉండదు.

- ఉన్నవ, మాలపల్లి

ఈ ప్రభుత్వం మాటలతో వినదు. నెత్తిన మొట్టికాయ పడితేగాని వినిపించుకోదు.

- గంగాధరరావు, ఇదా మనచరిత్ర

ప్రభుత్వం జంతువుల నంటుంది బలికిన సరుకని.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

ఘనమైన డిగ్రీ సాధించాడు చదువుదొంగ
ధనం పండే పదవి చేపట్టాడు పనికి దొంగ
గద్దెనెక్కి యేల్తున్నాడు పగటిదొంగ
ఇందరు చేరింది సర్కారు
ఏం చేయాలన్నా తఖరారు.

- మాలకొండారెడ్డి, దొంగలున్నారు జాగ్రత్త

ప్రభుత్వోద్యోగం

ప్రభుత్వోద్యోగంలో ఒకసారి స్థిరపడిన తర్వాత వాడు పని చేసినా, చేయకపోయినా, ఇంటి అల్లుడిలాగా కాలుమీద కాలేసుకు కూర్చున్నా ఎవ్వరూ ఏం చేయలేరు.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

ప్రభుత్వోద్యోగి

అసలు ప్రభుత్వోద్యోగి అంటేనే నీతి నిజాయితీలకు మారుపేరు ఉద్యోగ మివ్వడానికి పూర్వమే అత డెలాంటివాడయినదీ పోలీసులు వాకబుచేస్తారు.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

ప్రభువు

సాంఘిక విషయములలో ప్రభువులు జోక్యం కలుగజేసికొని జనులను శిక్షించడం అక్రమం.

- ఉన్నవ, మాలపల్లి

ప్రమాణం

మహాత్ములు చెప్పినదానికి ప్రమాణం యెందుకు? వారు ప్రమాణాతీతులు.

- కందుకూరి, హాస్యసంజీవని

తెలిసి చేస్తే ప్రమాణంగాని చిలుక పలుకులు ప్రమాణాలౌతాయా?

- వేంకటరామశాస్త్రి, వ్యామోహము

స్వానుభవంబులె తుదకుఁ బ్రత్యక్ష ప్రమాణంబు లౌ.

- జగన్నాథం, వియోగి

ప్రమాదకారి

ఒక్కొక్కసారి దుర్మార్గునికన్నా అమాయకునివల్ల ఎక్కువ కీడు జరగడంకద్దు.

- కేశవరెడ్డి, అతడు అడవిని జయించాడు

ప్రమాదం

అలల్ని అదుపులో పెట్ట గలిగిననాడు సముద్రమే పొంగవచ్చు

- చలం, మ్యూజింగ్స్

ప్రమాదో ధీమతామపి, యంతటి వాడికైనా ఒక

ప్పుడు కాలుజారుతుందిగా!

- గురజాడ, కన్యాశుల్కం

సామీప్యం - స్పర్శ - మహా చెడ్డ ప్రమాదం క్రింద పరిణమిస్తాయి.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

ఏ ప్రమాదం వచ్చినా జంధ్యం ముడి నొక్కుకుని 'హనుమాన్ చాలీసా' చదవడటం కారణంగా అన్ని ప్రమాదాలు వాటంతటవే ఎగిరిపోయాయి.

- లక్ష్మణరావు, అతడు- ఆమె

ప్రేమ కలాపాల్లో పెళ్ళి అవనివాళ్ళ కంటె పెళ్ళి అయిపోయినవాళ్ళే ఎక్కువ డేంజరు.

- రావిశాస్త్రి, బంగారిగాడి కత

ప్రేమలో దెబ్బతింటే తేరుకోవొచ్చును గాని, డబ్బు విషయంలో కాలు జారితే మాత్రం ప్రమాదం.

- యజ్ఞన్నశాస్త్రి, విశ్వం పెళ్ళి

చదువు నేర్చిన ఆడదానితోనూ, వంటనేర్చిన మగవాడితోనూ వోపరాదు.

- కందుకూరి, హాస్యసంజీవని

మనిషి సుఖంగా జీవిస్తున్నా, ఒక్కొక్కప్పుడు ప్రమాదమే అనిపిస్తుంది.

- ముద్దంశెట్టి, తప్పించుకోలేవు

ప్రేమని గురించి ఎన్ని పిచ్చి అభిప్రాయాలున్నా ప్రమాదం లేదు. డబ్బు విషయంలో తప్పు అడుగు వేశామా, దెబ్బ తినేస్తాము.

- యజ్ఞన్నశాస్త్రి, విశ్వం పెళ్ళి

అర్ధ లౌకికము నూతన వైద్యము వలెనే ప్రాణ సంకటముకొఱకే.

- పానుగంటి, ప్రచండ చాణక్యము

అంతిపురము చుట్టఱికం
బెంతయుఁ గీ డంతకంటె నెగ్గు తదీయో
పాంతచర కుబ్జవామన
కాంతాదులతోడి పొందు కలిమి.

- తిక్కన, విరాటపర్వము

పని లేకుంటే పంట కాపింటికిపో, పండిటిగుంజకు కూడా పని చెప్పుతారు.

- సామెత

ప్రాణానికి ప్రాణం ఇచ్చేవాళ్ళున్నప్పుడు నిజం చెప్పటం కూడా ఒక ప్రమాదమే

- విమలారామం, కిరణ్మయి

తుపాను వచ్చినరోజే అత్తగారు కూడా వచ్చినట్టు.

- శ్రీరమణ, న్యూనుడి

నేరకపోయి పత్రికపెడితే
పెళ్లాం నవల రాస్తానందిట.

- శ్రీరమణ, న్యూనుడి

గ్రీటింగ్ కదా అని చెయ్యి చాస్తే ద్యూకవరు తగులుకున్నట్టు.

- శ్రీరమణ, న్యూనుడి

శ్రోత మెత్తనైతే కవి రెండునోళ్లతో విన్పిస్తాడు.

- శ్రీరమణ, న్యూనుడి

మున్నూరు శిఖలైనా కూడవచ్చునుగాని, మూడు కొప్పులు కూడరాదు.

- సామెత

ఎలుకకు పిల్లి సాక్షి.

- సామెత

ఆఫీసు జ్ఞానం లేనివాడు ఆడిట్ కొచ్చినవాళ్లను అప్పు అడిగాట్ట.

- శ్రీరమణ, న్యూనుడి

## ప్రమోషన్

సీనియారిటీని బట్టి, కులాన్ని బట్టి ప్రమోషనిచ్చే ఆచారం ఈ దేశంలోనే తగలబడింది.

- నంది, నైమిశారణ్యం

ప్రమోషన్లకి పుస్తకాల వాసన లక్కరలేదు.

- చిరంజీవి, చీమమనుషులు

## ప్రయత్నం

మించిన కార్యమునకు విచారించఁ బనిలేదు. మన ప్రయత్నలోపము లేకుండ నింకను పనిచేయవలెను.

- కొచ్చెర్లకోట, అపవాద తరంగిణి

ప్రకృతిని మనిషి చేతులూ మెదడు ఉపయోగించి సాధిస్తే లొంగుతుంది గానీ, ఊరికేనే సహజంగా మనం కోరినట్లు నడుచుకొంటుందా

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

ప్రయత్నించి నెరవేర్చుకోవటం కూడా గొప్పేనా?

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

పురుషకారముచేతఁ గార్యములు సిద్ధించును. రిత్త కోరికలచేత సిద్ధింపవు.

- చిన్నయసూరి, మిత్రలాభము

ప్రారబ్ధమని పురుష ప్రయత్నం యే వ్యవహారంలో మానేశారు?

- గురజాడ, కన్యాశుల్కం

ప్రయత్నమే మనుజుని యధీనము. ఫలము దైవాధీనము కాదా?

- పానుగంటి, సాక్షి

మన కార్యములు మన బుద్ధినిబట్టియుఁ బ్రయత్న బలమునుబట్టియు నుండును.
- పానుగంటి, సాక్షి

ప్రయాణం

వాచ్యార్థం వంటి భూతకాలం వెనక
దాక్కున్న ధ్వనివంటి వర్తమాన వాహనంమీద
పరనిర్వృతిప్రాయమైన
భవిష్యత్తుకు నా పయనం.
- కుందుర్తి, నాలోని నాదాలు

కాలరాత్రి జీవితయాత్ర .
ప్రొద్దు పొడవదు, కూచునేందికి వీలులేదు
ఒంటరిగా ఒంటరిగా మంటల్లో మాటల్లో
పయనిస్తున్నాడు నరుడు
తా నెరుగని దిక్కుకేసి
- బైరాగి, నూతిలో గొంతుకలు

కన్ను తెరిస్తే జననం
కన్ను మూస్తే మరణం
రెప్పపాటే గద ప్రయాణం?
- చంద్రసేన్, కంటి తెలివి

ప్రయాస

కంచివరకు వెళ్లి కాపీ కథ తెచ్చినట్టు.
- శ్రీరమణ, న్యూనుడి

నిర్వచనోత్తర రామాయణంలో
వచనంకోసం వెదకినట్టు.
- శ్రీరమణ, న్యూనుడి

కొండతవ్వి ఎలుకను పట్టినట్లు.
- సామెత

ప్రయోగం

యథార్థంగా శిక్షలు, జేళ్ళు, దండనీతి సమాజ విద్రోహులకై పుట్టాయి. కాని స్వార్థులు వాటిన న్నిటిని దేశభక్తులపై ప్రయోగిస్తున్నారు.
- ఆళ్వారుస్వామి, ప్రజల మనిషి

ప్రయోగశాల

మథనపడే మేధావుల
శిథిలాశలు చివురించే
రసరాజ్యం లేబొరేటరీ!
- దాశరథి, మస్తిష్కంలో లేబొరేటరీ

ప్రయోజకత్వం

వాళ్ళ జుట్టు, వీళ్ళ జుట్టు ముడివేసి వీలైతే కోర్టులోకి లాక్కుపోయి ఏదో విధంగా నాలుగు డబ్బులు సొమ్ము చేసుకోటమే ప్రయోజకత్వం.
- చిలకమర్తి, బధిర చతుష్టయము

పంచాయితీలో ఓడినవాడు
పార్లమెంటుకు గెలిచినట్టు.
- శ్రీరమణ, న్యూనుడి

గాదెనిండా బియ్యముంటే, కరువునా కాలానా నా భార్యను, పిల్లలను నేనే రక్షిస్తాను అన్నాడట.
- సామెత

ప్రయోజకుడు

సూక్ష్మములో మోక్షము సంపాదించినవాడే ప్రయోజకుడు.
- చిలకమర్తి, పరస్పర స్తోత్రసమాజం

కడుపు బరువు గాఁగఁ గొడుకులఁ గనుకంటెఁ దల్లి కొకఁడె చాలు బల్లిదుండు.
- పోతన, భాగవతము

ప్రయోజనం

చెట్టుపేరు చెప్పి, కాయ లమ్ముకొన్నట్లు.
- సామెత

అరణ్యానికి క్రూరమృగంవల్ల యేం ప్రయోజన ముందో మానవసంఘానికి తమరివల్ల అక్ష రాలా అదే ప్రయోజనం.
- వరద, నాట్యగోష్ఠి

అన్నం పెట్టితే అరిగిపోతుంది. చీరయిస్తే చిరి గిపోతుంది, వాత పెట్టితే కలకాలముంటుంది.
- సామెత

ఏ క్షణంలోనైనా ఒకడు రెండోవాణ్ణి ఏదో ఒక కోణంనుంచే చూడగలుగుతాడు. ఆ కోణం, చూసే మనిషి యొక్క తక్షణ ప్రయోజనాన్ని పట్టి వుంటుంది. ఆ ప్రయోజనాన్ని గుర్తించిన రెండో వాడు ఎప్పుడూ హెచ్చరికగానే వుంటాడు.
- మహీధర, కత్తులవంతెన

ఎవరితో ప్రయోజనముండునో వానియందు విరోధమున్నను రాజనీతివేత్తలు తమ ప్రయోజ నము తీఱువఱకు వానిని వధించరు.
- విశ్వనాథ, నందోరాజా భవిష్యతి

భగవంతుడు మడిసి జనమిచ్చింది బలవంతంగా సావటానిగ్గాదు... బతికేందుకు.. అందుకే ఈ పేనాలు నిలుపుకుందికి దొంగతనం సెయ్యి ఫర వాలేదు.... నేకపోతే రంకుతనం...
- వెంకటనరసింహారావు, సిన్

ఆత్మాభిమానముగల ప్రతిజాతికినిఁ గ్రూరదండ

నము స్వాతంత్ర్య రక్షణాసక్తినిఁ బుట్టించును.
- త్రిపురనేని, శంబుకవధ

ప్రవక్త

ఒకరి మాట పదిమందీ పాటించేటట్లయితే ప్రపంచంలో ప్రతివ్యక్తీ ఒక ప్రవక్తే.
- గంగాధరరావు, లంబాడోళ్ల రాందాసు

ప్రవర్తన

సమాజంలో మనిషి మంచి చెడ్డలు నిర్ణయించేది కేవలం ప్రవర్తనే.
- కొడవటిగంటి, పంచకళ్యాణి

ఎదిరి వారి చిత్త మెఱిఁగి వర్తించెడు
వారి కేల కీడు వచ్చు నురక?
- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

వైద్యునికిని, వంట బ్రాహ్మణునకును క్యారక్టరు బ్లాటయినచో నుదర పోషణము జరుగుటయే దుర్లభముగా నుండును. మీఁదు మిక్కిలి పాద రక్షా ప్రయోగములు గూడ తఱచుగాఁ దగులు చుండును.
- వెంకటరమణారావు, పెట్టమారి మగడు

మాస్టరు యొక్క ప్రవర్తనను బట్టి పిల్లల ప్రవర్తన యుంటుంది.
- చిలకమర్తి, నవ్వులగని

చేయంగ వలయు వానిం
జేయుట యిట్టివియె కొన్ని చేయకునికి ధ
ర్మాయత్త చిత్తుఁడై నా
నాయోగ్యస్థలము లెఱిఁగి నడవఁగ వలదే?
- తిక్కన, కర్ణపర్వము

ప్రవాసం

వన మిడిసిన కోతి ఊరిడిసిన మనిషి ఒక్కటే.
- రాజయ్య, ఎదురు తిరిగితే...

ఆలుబిడ్డల, నన్నదమ్ముల, నాప్త బంధుమిత్రుల విడుచుట యెంత కష్టమో, స్వదేశమును విడుటయు నంత కష్టమె.
- చిలకమర్తి, కర్పూర మంజరి

ప్రశంస

ప్రశంసలను భరించట మేమంత సులభమైన పనిగాదు. అలా భరించగలిగిన వాడు అయితే సర్వజ్ఞుడైనా కావాలి, లేదా అజ్ఞాని అయినా కావాలి.
- రాజారాం, ధర్మగ్లాని

ప్రశస్తం

పాత చింతకాయ పచ్చడిలాగ, పాత కవులే, పాత నాటకాలే ప్రశస్తి.
- యజ్ఞన్నశాస్త్రి, మాయనొప్పులు

ప్రశాంతి

లేదు లేదు ప్రశాంతి భువిలో!
లేదు లేదు ప్రశాంతి దివిలో!
అది నొందుచు దాసు డొక్కం
డడలు నన్నాళ్లు.
- కాశీవిశ్వనాథం, వ్రేల్పుడే

ప్రశాంతత

గ్రామీణ ప్రశాంతత మురుగునీటి నిశ్చలత్వం లాంటిది.
- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

ప్రశ్న

వెలఁదీ! యెవ్వతెవు నీపవిటపీవనిలోన్?
- దేవులపల్లి, అన్వేషణము

గవ్వర్నరుకు గడ్డం గొరుగుతానంటే, వెంట్రుకన్నరకు ఎంత? అన్నాడట.
- సామెత

చెప్పేవానికి చాదస్తమయితే, వినేవానికి వివేకం వద్దా?
- సామెత

విభూతి పట్టెలు పెట్టుకుంటే విష్ణుమూర్తి వనుకున్నానే, అంజనేయుడి వటోయ్ వెంకటేశ్వర్లూ?
- సామెత

ఆ ఇంట్లో తారాడే వితంతువు మీ భార్యా? మీ అన్న భార్యా? అని అడిగాడట.
- సామెత

ఏమీ దొరకనమ్మకు ఏగాని దొరికితే, ఎందులో బెడుదునే ఎంకటమ్మా? అన్నదట.
- సామెత

మొదటి మనువువాఁడె మూఢాత్ముఁడై యుండ
మాఱు మనువుగాని మాటయేమి?
ఆరగించు జ్వరితుఁ డనుసంశయుఁడుగాఁగ
మఱలఁ దినెడువాని మాటయేమి?
- పానుగంటి, సరోజిని

రాసి చెడ్డావా? చెడి రాశావా?
- శ్రీరమణ, న్యాయుడి

చిత్తుముందా? అచ్చుముందా?
- శ్రీరమణ, న్యాయుడి

వెయ్యని ప్రశ్నలు వేసిన ప్రశ్నలకంటె ప్రమాద కరం.

- బీనాదేవి, తీర్పు

ఎండ కన్నెఱుగవు యేడుమేడల మీద
పండుకొని కారులో పరవళ్లు పోతావు
రాచబిడ్డవు నీవు రైతుపస్తే మెరుక?

- అజ్ఞాతకవి (కృష్ణాపత్రిక), రాచబిడ్డవు నీవు

ఆకుల్ని రాలుస్తాయి చెట్లు
కొత్త చివురులు పుట్టడానికి
అసమానతల్ని వదలదేమిటి ఈ సంఘం
కొత్త వ్యవస్థ పుట్టడానికి?

- భాస్కరరావు, మారేస్థితి

చీనిచీనాంబరల్ సిలుకు రవసెల్లాలు
సరిగవల్లెల కొడలు బరువెక్కు దొరబిడ్డ
నిరుపేద రైతు వెతలారునే నీచేత?

- అజ్ఞాతకవి (కృష్ణాపత్రిక), రాచబిడ్డవు నీవు

**ప్రసంగం**

అనుభవ భవ సంస్కారం
బున కుద్బోధము ప్రసంగమున నగును గదా?

- పింగళి, ప్రభావతీ ప్రద్యుమ్నము

**ప్రసాదం**

ప్రసాదమంటే లంచమేనా?

- అప్పల్నాయ్డు, బెల్లం

పిండీ మనమే యిచ్చి, కట్టెలు మనమే యిచ్చి పిన్నమ్మా నీ ప్రసాదం అని అడుక్కు తిన్నట్లుం టుంది.

- సామెత

**ప్రసూతి**

దాగి ఉంది మృతిలోనె ప్రసూతి
కత్రను కాల్చి పుట్టే చిచ్చులా.

- సినారె, మృత్యువు నుంచి

**ప్రళయం**

అందరూ ఒకేసారి ఆలోచిస్తే
ఆదేరా బాబూ, ప్రళయం.

- కుందుర్తి, సంఘోదయ

**ప్రాజెక్టు**

సిమెంటుకు బదులు యిసుక
జొరబడటం చూడలేక
కడుపు మండి ప్రాజెక్టులు
గంగలోన దూకెనంట!

- మల్లారెడ్డి, సత్యంవధ - ధర్మంచెర

**ప్రాణభయం**

జీవిత మాధుర్యం ఎరగని వారికి ప్రాణభయం ఉండదు

- కొడవటిగంటి, గ్రహశకలం

ప్రాణభయ మెట్టి వారిఁ గీడ్పఱుప కున్నె?

- తిక్కన, భీష్మపర్వము

కొసర కాఁబోతు నాఁబోతు గ్రుమ్ములాడ
నడిమి లేఁబెయ్య గతి వచ్చె నాకు నిపుడు.

- శ్రీనాథుడు, కాశీఖండము

తిండి లేక చావటానికి ప్రజలు వెనకాడుతు న్నారు కమ్యూనిస్టులతో పోరి చావటానికి పోలీసులు వెనకాడుతున్నారు.

- కొడవటిగంటి, దిబ్బరాజుగారి ప్రతిష్ఠ

**ప్రాణం**

పరువు పోయిన మఱల రావచ్చుఁ గాని
నాశమొందిన మరలఁ బ్రాణములు రావు.

- తి.వేం., పాండవ విజయము

ఎడసందినిఁ, బయ్యదకొం గడ్డమైనఁ బ్రాణము వెడలున్.

- పోతన, భాగవతము

పని వచ్చినచోఁ బ్రాణముల నైనఁ బోనీయఁద గును. కాని దయిన సొమ్ము పోనీయ గూడదు! ప్రాణములలో నేమున్నది? గాలియేగా! పైసయట్టిదా! ప్రపంచమంతయు దానిలో నున్నది?

- కాళ్లకూరి, వరవిక్రయము

భౌతికంగా ప్రాణానికి అర్థం ఏదైనా, నైతికంగా మాత్రం దాని అర్థం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు.

- బీనాదేవి, స్వేచ్ఛా యజ్ఞం

చరిత్ర మరచిన వీరుల ప్రాణాలు
రేపు చలామణీ జరిగే నాణాలు.

- దాశరథి, పునర్నవం

**ప్రాణాంతకం**

అన్ని చోట్లా మనం అనుకున్నట్టు జరిగిపోతే, సౌఖ్యం ఎక్కువైపోయి, జబ్బు చేసి ప్రాణం తీసేస్తుంది.

- భమిడిపాటి, ఎవళ్ల గొడవ వాళ్లది

**ప్రాతినిధ్యం**

అందరికీ ప్రాతినిధ్యం వహించాలని చూసేవాళ్లు ఎవరికీ ప్రాతినిధ్యం వహించరు.

- కొడవటిగంటి, అనామిక

**ప్రాతిపదిక**

అనేక రకాల స్వార్థాల ప్రాతిపదిక మీద లోక వ్యవహారాలు జరుగుతున్నవి.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

**ప్రాథమిక హక్కు**

అమ్మడానికి వచ్చిన ప్రతి ఇల్లూ చూడటం ఆడ వాళ్ళ ప్రాథమిక హక్కు.

- నరసరాజు, ఈ యిల్లు అమ్మబడును

**ప్రాధాన్యం**

ఎందరో ఉంపుడుగత్తెలున్న రాజకీయ నాయకు లెందరో పత్రికల్లో ఫోటోలకి మాత్రం తమ భార్యల్నే పక్కన నిలబెట్టుకుంటారు.

- ఆనందారామం, అర్థంలో శత్రువు

ఒక విషయం మంచిదా చెడ్డదా అన్న తార్కిక సంశయానికి సంఘంలో అంతగా తావులేదు. ఎటొచ్చీ ఆ విషయాన్ని ప్రతిపాదించిన వ్యక్తి మృతుడై వుండాలి.

- బుచ్చిబాబు, నన్నుగురించి కథరాయవూ?

**ప్రాంతం**

నా దేశం నా రాష్ట్రం
నా పట్నం నా జిల్లా
మట్టిగడ్డ కాదుకాదు
మానవజాతి పురోగతి!

- అబ్బూరి, కవిత

ఒక ప్రాంతం ప్రజలు ప్రాంతీయ తత్వాన్ని రద్దుచేసుకుంటూ వస్తే దేశానికి చెందుతారు. ప్రపంచానికి చెందుతారు.

- బుచ్చిబాబు, ఒకేనిద్ర - ఎన్నో కలలు

**ప్రాప్తం**

నేర్పుగల అమ్మనేతితో అతిరసాలు కాలిస్తే ఓర్పుగల అమ్మ ఒళ్ళో కట్టుకొని పోయిందట.

- సామెత

పేరు పెనిమిటిది, అనుభవం మామగారిది.

- సామెత

చచ్చినవాడి పెండ్లికి వచ్చిందే వరకట్నం.

- సామెత

గతి లేనమ్మకు, మతిలేని మగడు.

- సామెత

గడించేవా డొకడు, గుడించేవా డొకడు.

- సామెత

పైకం ఒకడిది, మైకం మరొకడిది.

- శ్రీరమణ, న్యూసుడి

**ప్రాయం**

ఉవిద ప్రాయ మూఁచబియ్యపుఁ బదునే!

- సామెత

**ప్రాయశ్చిత్తం**

ఎంత ఘోరపాపమైనను ప్రాయశ్చిత్తము లేని పాపము లేదు.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

గోడల మధ్య చేసే పాపాలకి కిటికీలు ప్రాయశ్చిత్తం.

- పురాణం, రాదే చెలీ! నమ్మరాదే చెలీ!

కాని కూడు తిన్నవాళ్ళకి కిలం వదిలిస్తాం. పశ్చాత్తాప పడ్డవాళ్ళని ప్రాయశ్చిత్తం చేసి వుద్ధరిస్తాం.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, బ్రాహ్మణాగ్రహారం

ప్రాయశ్చిత్తము లేని దోషము లేదు.

- చిలకమర్తి, గణపతి

శాస్త్రంలో వున్న బండారం అంతా ప్రాయశ్చిత్తాలే కాదుటోయ్?

- సుబ్రహ్మణ్యశాస్త్రి, బ్రాహ్మణాగ్రహారం

**ప్రారబ్ధం**

కంటే ఖర్మం గాని పెంచుకుంటే ప్రారబ్ధం.

- బీనాదేవి, అందాలూ, అనుభవాలూ

**ప్రార్థన**

లోపల గొణఁగుకొనుచుఁ జేసిన ప్రార్థనలో కంటె బిగ్గరగఁ జేసికొను ప్రార్థనములోఁ బటుత్వమెక్కువ.

- పానుగంటి, మారుతీమాల

**ప్రాస**

కుళ్లు ముండకి అల్లం పచ్చడి అన్నట్లు.

- సామెత

ప్రాసకోసం ఏడ్చానే కూసుముండా అన్నట్లు.

- సామెత

**ప్రియుడు**

భర్తని భరించడం సులభం. ప్రియుడి కళ్లు కప్పడం కష్టం. ఎందుకంటే ప్రియుడికి చాలా అనుమానం, భర్తని వంచనచేసి వొచ్చిన స్త్రీ అని.

- చలం, వాళ్ల నలుగురూ

భర్తకన్న ప్రియుడే నయం. వయసు మళ్లాక భర్త అవసరం కనబడొచ్చు

- పావ, కొలవరాని దూరం

ప్రియులు ఉండొచ్చు. కాని ఏ ప్రియుడూ భర్త కాడు. ఒకవేళ అయినా తరవాత ప్రియుడుగా ఎక్కువ కాలం ఉండలేడు.

- పాప, కొలవరాని దూరం

ప్రేమించాడంటే పెళ్ళి కాదని అర్థం. పెళ్ళి చేసు కుంటానంటే వాడెపో! ప్రేమికుడు!

- హర్షవర్ధన్, వసంతగీతం

## ప్రియురాలు

భార్యలో ప్రియురాలిని చాలామంది భర్తలు చూడలేరు.

- సరస్వతీదేవి, బ్రతికిచచ్చిన వాళ్ళు

లోకంలో కొన్ని సందర్భాలలోనే గాదు అనేక సందర్భాలలో కట్టుకొన్న భార్యలకంటే పెట్టుకొన్న ప్రియురాళ్ళే ఎక్కువ భోగా లనుభ విస్తారు.

- సభా, నీటి దీపాలు

## ప్రియుల మాటలు

కథల్లో కావ్యాల్లో ప్రియుల మధ్య గొప్పగొప్ప సంభాషణ పెడతారా? అట్లా యేప్రియులూ మాట్లాడరు ప్రపంచంలో!

- చలం, ఆ రాత్రి

## ప్రీతి

భిన్నరుచు లైనవారికిఁ బ్రీతి సరియ
తగవుగా దిందులో ననేకతరగర్వ.

- శ్రీనాథుడు, శృంగార నైషధము

## ప్రూఫ్‌రీడరు

ప్రూఫ్ దిద్దుటందు పూర్ణు డాత డటంచు
వాని తెచ్చి ప్రెస్సు వద్ద బెడితె
అచటి విచటి తప్పులంచు దిద్దాడురా
దిద్దినట్టి చోటె దిగెను తప్పు!

- మాచిరాజు, ప్రూఫ్‌రీడరు

## ప్రెస్

ప్రజాతంత్రాల పేర నడిచే కుతంత్రాల్లో తెరవె నుక పాలకుల్పేతి అతి పెద్ద సాధనం ప్రెస్ అన్నాడు, ఓ పొలిటికల్ ఫిలాసఫరు.

- కాశీపట్నం, కుట్ర

## ప్రెసిడెంటు

మనం ఒకటి దలిస్తే పెసిడెంటు గోళ్ళు ఉంకోటి దలుస్తరండి.

- రావిశాస్త్రి, సొమ్ములు పోనాయండి

## ప్రేమ

ప్రేమా గీమా స్త్రీ పురుష వాంఛకు ఆధునికులు తగిలించిన పంచదార పూత మాత్రమే.

- మహీధర, స్వయంవరణం

ప్రేమ సర్వరోగ సంహారకం. ఏకమూలిక.

- మహీధర, స్వయంవరణం

పురుషుని బహిరంత స్తత్వములకుఁ గాంతాను
రాగ మిచ్చు నంతటి సాపునంతన మార్దవము
తళుకు మతేవియు నీయఁజాలవు.

- పానుగంటి, వీరమతి

ప్రేమ వృత్తికి చండాల భేదమేల
బ్రాహ్మణాగ్రహారమునందు పవలురేలు
విసరు పవనుఁడు కడజాతి వీటియందు
తాకలేక వీచునె పక్షతంత్ర జడిమ?

- రాయప్రోలు, తెనుగుతోట

ఇద్దరు స్త్రీ - పురుషుల మానసిక దాంపత్యానికి పుట్టిన బిడ్డ ప్రేమ.

- బుచ్చిరెడ్డి, తేనెకోరని తుమ్మెద

ప్రేమికుల మధ్య సదవగాహన, సహృదయత లోపిస్తే ఎప్పుడూ కీచులాడుకునే దంపతుల మధ్య బిడ్డల్లా ప్రేమ కూడా సరిగా ఎదగలేదు.

- బుచ్చిరెడ్డి, తేనెకోరని తుమ్మెద

తపసుచే వేల్మిచే ధ్యానధారచేత
లీనమై ఐక్యమీయఁ జాలినది ప్రేమ.

- రాయప్రోలు, తృణకంకణము

నాల్గుకొంపలు దూఱు శ్వానంబు పోల్కి
మన హృదయములు దూరి ప్రేమంబు మెలగు
మనము విడకుండ హత్తించు పనికి మంచి
బంక జిగురంచు ప్రేమను పలుకవచ్చు

- గునుపూడి, బిడాల శాస్త్రి

'వలపుఁ దలఁపులు పూల సంకెలలు గావె? '

- దువ్వూరి, కడపటి వీడుకోలు

పవలు రేయు గ్రంథాంతర ప్రాంతరముల
నర్థమృగముల వేఁటాడునట్టి బోయ
యంతరంగంబున రసార్ద్రమైన వలపు
తొలకరించునె?

- దువ్వూరి, కడపటి వీడుకోలు

వలపు కొలువులోఁ బడినవారికి తెలివి తేటలు చచ్చిపోవునని పెద్దలు చెప్పుదురు.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

వారకాంతలకు వలపుండ దనువార లేటి యా

వల నూళ్ళుండ వనువారి వంటివారు.

- కాళ్ళకూరి, చింతామణి

ప్రేమ కలుగక బ్రతుకు చీకటి.

- గురజాడ, పెన్నిధి

మనసులో రక్షణ ధీరత్వ భావం కలిగిన నిమిషాన పురుషుడు స్త్రీ ప్రేమని అనుభవించగలిగినట్టు ఇంకెప్పుడూ అనుభవించలేడు.

- చలం, హంపీ కన్యలు

ప్రేమ జీవితాన్ని ధ్వంసంచేస్తుంది. జీవితాన్ని ఎదుర్కోలేని వాళ్ళకు ప్రేమించే హక్కులేదు.

- పురాణం, అనవసరపు దాంపత్యం

ప్రేమే కాదు, ఏ అనుభవమైనా అనుభవించినంతసేపే ఆకర్షణ. కాని ఆ తర్వాత యాతనే అనుకోండి.

- శ్రీశ్రీ, అనంతరయాత్ర

ప్రేమ పెన్నిధి గాని,
యింటను నేర్పరీకళ,
ఒజ్జ లెవ్వరు లేరు

- గురజాడ, కాసులు

మూర్ఖుల్ని ప్రేమించు, వాళ్లని హడలగొట్టకు.

- భమిడిపాటి, అన్నీ తగాదాలే

మరులు ప్రేమని మది దలంచకు;
మరులు మరలును వయసు తోడనె.

- గురజాడ, కాసులు

మగవారి ప్రేమము నీటిపై నురుగు వంటిది. పట్టి చూడకున్నంత వఱకే పైబండారము.

- పానుగంటి, రాధాకృష్ణ

లోకం తనని ద్వేషించేటంత లోకం మీద ప్రేమ వుంటేనే కాని ఔన్నత్యం లేదు మనిషికి. అంత కన్న వున్నతమైన ప్రేమగల మనుషుల్ని లోకం గుర్తే పట్టదు.

- చలం, మ్యూజింగ్స్

ప్రజల మీది ప్రేమకన్న కమ్యునిజం మీద ఎక్కువ ప్రేమ చాలామంది నాయకులకి.

- చలం, మ్యూజింగ్స్

చాలామంది స్త్రీలకి వీలైనంతవరకే ప్రేమ.

- చలం, మ్యూజింగ్స్

భార్యకి భర్తమీద ప్రేమ శాశ్వతంగా ఉండవలెనంటే, అడపాదడపా అయిదారు దెబ్బలు పడడం మంచిదన్నాడు వాత్సాయనుడు కామ సూత్రాలలో.

- ముద్దుకృష్ణ, ఆడవాళ్ల తెలివి

ప్రేమ ప్రసక్తిలో ఆడదానికి కూడా అధికారాలూ వున్నాయి.

- ముద్దుకృష్ణ, ఆడవాళ్ల తెలివి

ప్రేమించడానికి పెట్టుబడేం కావాలి? ఫలించటమే కష్టం.

- రాధాకృష్ణ, ఇదేమిటి

ప్రేమ వున్నచోట భయం వుండదు.

- ముద్దంశెట్టి, నిమిత్తమాత్రులు

వలపెరుంగక బ్రతికి
కులికి మురిసే కంటె
వలచి విఫలమ్మొంది
విలపింప మేలురా!

- బసవరాజు, ప్రేమతత్వము

మృత్యువు జగద్విజేత కావచ్చును. కాని మరణాన్ని ప్రేమ జయిస్తుంది. ప్రేమ పేరిట జంతువులుగా మారటం కన్న ముక్తిసాధన కోసం శిలగా మారటమే మంచిది.

- బుచ్చిబాబు, తిష్యరక్షిత

ప్రేమ అనేది శరీరవాంఛకి మానవ భాష కల్పించిన మధురమైన పేరు. లేదు నాయనా స్త్రీలకది.

- బుచ్చిబాబు, ఒమర్ ఖయామ్

సకల మానవకోటిని ఏకం చేసేది కన్నీరు. దీన్నుంచే ప్రేమ జనించింది.

- బుచ్చిబాబు, ఒమర్ ఖయామ్

చదువుకున్న వాళ్ళకి ప్రేమంటే ఏమిటో తెలుసు కాని, మీలాగ ప్రేమించుకోటం చేతగాదు.

- బుచ్చిబాబు, ఉత్తమా యిల్లాలు

కావల్సినప్పుడు అందని ప్రేమకంటె తీవ్రంగా కాల్చివేసే జ్వాల మరొకటుందా?

- బుచ్చిబాబు, రాయల కరుణకృత్యం

పరిపూర్ణత చెందుతే ప్రేమ, స్వతంత్రం రెండూ నశిస్తాయి.

- బుచ్చిబాబు, స్వతంత్ర జీవులు

ఋజువు చేసుకోలేనిది ప్రేమ వొక్కటే సుమా.

- బుచ్చిబాబు, స్వతంత్ర జీవులు

ప్రేమ మూర్ఖత్వాన్ని కూడా జయించగలదు.

- బుచ్చిబాబు, అంతిమ అజ్ఞానం

తండ్రి మీదఁ జూపించు ప్రేమ వేఱు, భర్త మీద జూపించు ప్రేమ వేఱు.

- విశ్వనాథ, తెఱచి రాజు

స్త్రీ ప్రేమ లేనిచో దుర్జనురాలు, ఉన్నచో లజ్జావతి.

- విశ్వనాథ, బద్ధన్న సేనాని

తండ్రి యందలి ప్రేమ తానిచ్చిన జన్మను స్ఫురింపఁ జేయునది. స్నేహితుని యందలి ప్రేమ తాను బ్రతుకుటను స్ఫురింపఁ జేయునది

- విశ్వనాథ, తెఱచిరాజు

భ్రష్టుల మధ్య ప్రేమ యుండదు అది వట్టి యిచ్ఛ

- విశ్వనాథ, చెలియలికట్ట

బంధువుల యందలి ప్రేమ వేరు. స్నేహితుల యందలి ప్రేమ వేఱు స్నేహితుల యొక్క ప్రేమను జీవుఁ డెక్కువ. వాంఛించును. అది వాని వ్యక్తిత్వ స్ఫోరకము.

- విశ్వనాథ, తెఱచిరాజు

ప్రేమ సమస్య స్త్రీ పురుషులిద్దరిదీ అయినా, దానివల్ల పురుషుడికన్న స్త్రీ ఎక్కువ లాభం పొందుతుంది.

- కొడవటిగంటి, జీవితం

అపరిపక్వంగా నిలిచిపోయిన ప్రేమలే అమర ప్రేమలు.

- కొడవటిగంటి, పంచరత్నాలు

ఒకడి పెళ్ళాన్ని చాటుగా ప్రేమించటం సాధ్యమైనప్పుడు ఒక వితంతువును బహిరంగంగా ప్రేమించటం ఎందుకు అసాధ్యం కావాలి?

- కొడవటిగంటి, ఐశ్వర్యం

తినటానికి పుష్టిగా ఉండి తన కోరికలన్నీ అవలీలగా తీర్చుకునేటందుకు డబ్బున్న వాడికి ప్రేమ ఒక జీవితావసరంగా పరిణమిస్తుంది.

- కొడవటిగంటి, పచ్చకాగితం

ఒక మనిషి కామించగలడు కాని ప్రేమించలేడు. ప్రేమించటానికి ఇద్దరి ప్రయత్నమూ అవసరం.

- కొడవటిగంటి, కొత్త పద్ధతులు

ప్రేమించి, ప్రేమించబడని వాడికి తెలుస్తుంది ప్రేమించటం ఎంత కష్టంతో కూడుకున్న విషయమో.

- కొడవటిగంటి, ఆడవలసిన అబద్ధం

ప్రేమకు మంచు విచ్చినట్టు విచ్చిపోయే దురభ్యాసం ఉంది.

- కొడవటిగంటి, పెళ్ళి - వ్యవహారం

ప్రేమ ఎప్పుడు ఏ బలి కోరుతుందో ఎవరూ చెప్పలేరు.

- కొడవటిగంటి, పెళ్ళి - వ్యవహారం

మనం మనుషులను ప్రేమించమల్లే ఉంది, మనుషుల్లో ఏదో చూసి దాన్ని ప్రేమిస్తాం.

- కొడవటిగంటి, ప్రేమించిన మనిషి

(నాకు ప్రేమ మీద నమ్మకం లేదు) తల మీద వొక్క వెంట్రుక కూడా లేకుండా జీవించటం ఎంత సులభమో ప్రేమ లేకుండా జీవించటం అంత సులభం

- కొడవటిగంటి, కొత్త పద్ధతులు

ప్రేమ అనేది మానసిక ధర్మం.

- కొడవటిగంటి, గాలిపాట

ప్రేమ రావొచ్చు నన్నవారు పోవొచ్చునని వొప్పుకోరు.

- చలం, శశిరేఖ

జీవించే ప్రేమ ఎప్పుడూ పెరుగుతుంది. మారుతుంది. అందుకనే అశాశ్వతము, చంచలము.

- చలం, శశిరేఖ

పురుషునికి ప్రేమ ఆటగాని, స్త్రీకి ప్రేమయే జీవనము.

- చలం, శశిరేఖ

ప్రేమ అంటే పనిలేని వాళ్ళుంటారే, సోమరిపోతులు, వాళ్ళు కనిపెట్టిన ఉబుసుపోక....

- పిచ్చేశ్వరరావు, మనసులో మనిషి

కొందరు ఆత్మీయత కివ్వని ప్రేమని, ధనానికర్పిస్తారు. ఇంకొందరు వాటి రెంటికీ అందని ప్రేమని ఆదర్శాలపరం చేస్తారు.

- పిచ్చేశ్వరరావు, మనసులో మనిషి

నెమ్మి యొక యింత నామీఁద నిల్పుమనుము.

- కంకంటి, ఉత్తరరామాయణము

ప్రేమ మానవుల కంటే జంతువుల్లోనే ఎక్కువ ఉంది.

- సభా, నీటి దీపాలు

మగనిపైఁ గూర్మి యధికంబు మగువ కెపుడు.

- చిలకమర్తి, గయోపాఖ్యానము

లోకంలో తమ యెడల భక్తిగల వారిమీద ప్రేమ కలిగి యుండుట న్యాయము.

- చిలకమర్తి, గొట్టాలమ్మ తాళీదు

...ప్రేమయన్ననో
విరతి యెఱుంగ నట్టి యట
వీ రసకుల్య, సమాగమం బనం
తర పరపేడన ప్రియము.

- దువ్వూరి, కడపటి వీడుకోలు

నిజంగా డబ్బు లేకపోతే ప్రేమకూడా వుండదు.

కడుపు కాల్తొంటే ప్రేమ దగ్ధం. అయిపోతుంది.

- లక్ష్మణరావు, అతడు- ఆమె

ప్రేమంత వెర్రిభావం. దురదృష్టమూ ఇంకోటి లేదు.

- బాపిరాజు, కోనంగి

ప్రేమ అనేది ఒక రోగం. అది సోకితే జ్వరం, తల తిరగటం, మతిపోవటం మొదలయిన లక్ష ణాలన్నీ కలుగుతాయి!

- బాపిరాజు, గోనగన్నా రెడ్డి

భర్తల ప్రేమ బదలాయింపు ఎంత చౌకబేరం' భార్యల ప్రేమ బదలాయింపు ఎంత ఘోర నేరం!

- భమిడిపాటి, రెండురెళ్ల

అనుమానం లేనివాడి ప్రేమ అత్యుత్తమ ప్రేమ అనుమానంతో కూడినవాడి ప్రేమ అత్యా ధిక ప్రేమ.

- భమిడిపాటి, రెండురెళ్ల

ప్రేమ ఎంత ఉజ్వలంగా ఉంటుందో, అది భగ్న మయి నప్పుడు అంత పెళుసుగానూ కరుకుగా ఉంటుంది.

- సరస్వతీదేవి, ప్రణయలేఖలు

జాతి కుక్కలు, నాటు కుక్కల్ని ప్రేమించవచ్చు నేమోకాని అలగాజనంతో అటువంటి ప్రేమలో పడ్డం కష్టం.

- రావిశాస్త్రి, రత్తాలు- రాంబాబు

గొప్పవాళ్లని ప్రేమించటం గొప్ప న్యూసెన్సు గురూ!

- రావిశాస్త్రి, కుక్కపిల్ల కథ

కోరికని ప్రేమతో కన్‌ఫ్యూజ్ (confuse) చేసు కుంటారు ఆడవాళ్ళు.

- మారుతీరావు, నిజం నిద్రపోయింది

నిన్ను విడిచిన బ్రతుకు లేదన్న మాటకన్న మగ వాడు ఆడదాని వెంట చూపగల ప్రేమకు మరో మాట లేదు.

- మహీధర, ఓనమాలు

నిజం చెప్పాలంటే ఖర్చు లేకుండా స్త్రీ సుఖం పొందడానికి పెళ్ళి, ఆ పెళ్ళి ఖర్చు కూడా అక్క ర్లేకుండా ఆడదాన్ని సంపాదించే ఉపకరణం ప్రేమ.

- మహీధర, ఓనమాలు

ఈ ప్రేమ భిన్నలింగాల మధ్యనే వుంటుంది.

- మహీధర, ఓనమాలు

ప్రేమను ప్రేమించలేవు. అది వంచన, పూవుకు తొడిమ తావికి పూవు కావాలి! మన్ను లేక ఉసురులేదు. ప్రేమించే ప్రతి నేనుకు మరొక నీవు కావాలి!

- బైరాగి, ప్రేమ కవితలు

ప్రేమన్నది
మరణ మహాఫణి
ఫణాగ్ర దివ్యమణి

- బైరాగి, ప్రేమ- మృత్యువు

వరునికి మూలమంత్రం ప్రేమ!

- బైరాగి, శాంతిపథం

నీ ప్రేమ తిరిగి రాదు; పెరిగి రాదు
అది ఎవ్వరికీ ఏమీ కాదు.

- బైరాగి, ప్రేమ కవితలు

ప్రేమ ఓ దుఃఖం. ప్రేమ విషాదమయిన సుఖం. ప్రేమ ఓ బాధ. ప్రేమ హింసించీ ఓదార్చే పిచ్చి వెలుగు.

- వేణుగోపాలరావు, ప్రేమనక్షత్రం

ప్రేమ పొందినా దాహం తీరని ఎండమావి. ప్రేమ అందినా మధురమయిన స్వప్నంగా మిగిలేభ్రమ.

- వేణుగోపాలరావు, ప్రేమనక్షత్రం

విశ్వంలోనివి అనంతకోటి ప్రేమలు. ఏ పేరుతో ఉన్న ప్రేమకయినా వృద్ధిక్షయాలు ఉండవచ్చు కాని నిర్మలమైన స్నేహంలోని ప్రేమకు క్షీణతలేదు.

- శ్యామలారాణి, జీవవాహిని

ప్రేమ యనగా చూచుటగాదు, పలుకుటగాదు, విహ్వల చిత్తముతో వాపోవుటగాదు! ప్రేమ యనగా మంత్రముగాదు, తంత్రముగాదు. ఆత్మ నిర్వాణమునే ఆరాధించుటయే!

- ఉమామహేశ్వరరావు, ప్రేమ

జీవితంలో ప్రేమ ఒక భాగమంతే. ప్రేమే జీవి తమంతా కాదు.

- వీరేంద్రనాథ్, సంపూర్ణ ప్రేమాయణం

ప్రేమించడాని క్కావల్సింది అందం, ఆకర్షణ కాదు, గుండె నిబ్బరం. అది ఉన్న నాడు ఈ భగ్నప్రేమలూ, ఈ ఆత్మహత్యలూ ఉండవు.

- బీనాదేవి, కాంట్ యు డేర్ డియర్?

ఆడదైనా, మగాడైనా అలా జీవితాంతం కనిపిం చిన వాళ్లందర్నీ ప్రేమించుకుంటూపోతే అంతుం

దదు. ఉపయోగం అంతకంటే వుండదు.

- బీనాదేవి, పెళ్ళిపార్సు

ప్రేమకు జననమే కాని మరణం లేదు...

- రామమోహనరావు, డియర్

ప్రేమను కొందరు ఏక్సిడెంట్‌తో పోల్చేరు. ప్రమాదవశాత్తు కారు కింద పడ్డట్టే అనుకో కుండా కొందరు ప్రేమలో పడతారుట.

- ఆదివిష్ణు, సత్యంగారిల్లు

గుండెగది ఇనప్పెట్టెలో ప్రేమ అనేది అపూర్వ మయిన ఆభరణం.

- వీరేంద్రనాథ్, ఆఖరిపోరాటం

అరచేత్తో సూర్యుడిని ఆపలేరు. లారీకర్రతో ప్రేమని ఆపలేరు.

- వీరేంద్రనాథ్, ఆఖరిపోరాటం

ప్రేమను ప్రేమిస్తే తప్ప జీవితం జీవించదు.

- రామమూర్తి, అగ్నిగర్భ

ప్రేమ రేఖాచిత్రమూ కాదు ఊహాచిత్రమూ కాదు.

- శ్రీనివాస్, ప్రేమికుడు

మృత్యువు జగద్విజేత కావచ్చును. కాని మర ణాన్ని ప్రేమ జయిస్తుంది.

- శ్రీశ్రీ, సుప్తాస్థికలు

సృష్టిలోని ప్రేమ కావ్యాలన్నీ దాదాపు విషాదాం తాలే. వీటికి ఆనందం నాంది అయితే అశ్రుత ర్పణమే భరతవాక్యమేమో!

- రామమూర్తి, అగ్నిగర్భ

కవులు కళ్ళు చూసి ప్రేమించాలనీ, మిగతావాళ్లు మిగతావాటిన్చూసి లవ్ చెయ్యాలని అదేదో ఒక రూలుందిట.

- రావిశాస్త్రి, కుక్కపిల్ల

పల్లెకులలో ప్రేమ ప్రదర్శనలు పట్నంలోనే ఎక్కువ.

- రామలక్ష్మి, బ్రతకవలసిన మనిషి

ప్రత్యుత్తరం సాధించలేని ప్రేమలేఖలా
జీవితం చికాగ్గా వుంది.

- కుందుర్తి, నగరంలో వాన

నాకు వ్రాసిన ప్రేమ లేఖలు
పోస్టు చేయుట మానివేసెను.

- శ్రీశ్రీ, ఖడ్గసృష్టి

కొన్ని హృదయాలు
ఎప్పటికీ బ్రతికుంటాయి
అయితే -
అమృతాన్ని తాగి కాదు
ప్రేమను ధారపోసి.

- రాజేంద్ర, గుండెచప్పుళ్ళు

## ప్రేమికుడు

ప్రేమించలేని వాడికన్న ప్రేమించగలవాడు హెచ్చుగా పరిణతి పొందినవాడు.

- కొడవటిగంటి, అనామిక

ప్రేమించటానికి పనికివచ్చే వాళ్ళంతా పెండ్లాడ డానికి పనికిరావలసిన అవసరం లేదు.

- కొడవటిగంటి, సవతి తల్లి

ప్రేమికులు కలుసుకుని పెళ్ళితో ముగిస్తే సుఖాంతం. ఆత్మహత్యతో ముగిస్తే విషా దాంతం. ఒకరి కోసం ఒకరి త్యాగంతో ముగిస్తే తెలుగు సినిమా కథ.

- రామలక్ష్మి, బ్రతకవలసిన మనిషి

నాగరికత ఎక్కువవుతున్న కొద్దీ ప్రణయ రోగులు కూడా ఎక్కువవుతున్నారు.

- సూర్యారావు, శ్రీమతులు-శ్రీయుతులు

డబ్బూ, హోదా మరచిపోలేని మనిషి ప్రేమించ లేడు.

- ఆదివిష్ణు, చూడుచూడునీడలు

ప్రేమికులు తమను తామే వేటాడుకునే విచిత్ర కిరాతకు లనిపిస్తుంది - తమకే తెలిసీ తెలియ కుండ ఏ కాంతతమస్సుల్లో రహస్యంగా వలపుల వాగురల్ని పన్నుతారు.... ఆ ఉరులలో తామే చిక్కుకుని గిలగిలా కొట్టుకొనే దయనీయమైన సాధుజంతువులు ప్రేమికులు కదూ!

- రామమూర్తి, అగ్నిగర్భ

## ప్రేయసి

ఓటుదో నాటుదో కున్కిపాటుదోను
ప్రణయకవిరాజుగాడి కోపడతి గలదు
కాని నాకు ఆమాత్రపుం దైన లేదు.

- మాచిరాజు, పాతికపాదాల ఓబాధ

## ప్రేరేపణ

కాముడు ప్రేరేపింప వావి వరుస లెవ్వరు గణింతురు?

- ధర్మవరం, విషాదసారంగధరము

## ప్రైవేటు

సమస్య అంటే కొత్త ప్రవేటు మాష్టర్ని తేవటం.

- ముళ్ళపూడి, బుడుగు

అసలు ప్రవేటు చెప్పడం అంటే తిట్టడం అని అర్థం. కొట్టడం అని కూడా అర్థం.

- ముళ్లపూడి, బుడుగు

## ప్రోత్సాహం

మనిషి నమ్మకాలకి ప్రోత్సాహమే వూపిరి పోస్తుంది.

- లక్ష్మీ, తెల్లగులాబి

కాపీ కొట్టరా (క)దస్తూరి రంగా!

- శ్రీరమణ, న్యాయుడి

వచనం చెబుతూ అసాధారణంగా అభినయించే నటుడికైనా సరే, వన్స్‌మోర్ లభించదు.

- భమిడిపాటి, మేజువాణి వన్సుమోర్

గాలిచేతఁ దిత్తి, కరతాడనముచేతఁ
గందుకంబుఁ బెంపుఁ గాంచురీతి
పొంత నిలిచి యొరులు ప్రోత్సాహపఱిచిన
జనుల శక్తియుక్తు లినుమడించు.

- కాళ్లకూరి, పద్మవ్యూహం

## ప్లీడరు

ఈ వూళ్లో వాళ్లంతా చెట్టుక్రింద ప్లీడర్లు. పట్నంలో వాళ్లంతా చెట్టుమీద ప్లీడర్లు...

- బుచ్చిబాబు, ఆద్యంతాలు, మధ్య'రాధ'

చెట్ల క్రింద ప్లీడర్లు
గట్ల మీద ప్లీడర్లు
కల్లబొల్లి మాటలాయె
ఇల్లు వల్లు గుల్లలాయె

- గోపీచంద్, పుస్తకాలు అమ్మేవాడు

హైకోర్టు వకీళ్ళు కూడా తిరగేసి కొట్టమంటారు.

- గురజాడ, కన్యాశుల్కం

డబ్బూ, దినుసూ కూడా వొకీళ్ళ నెత్తినకొడితే, యేటికేడాదీ బతకడం యలాగు?

- గురజాడ, కన్యాశుల్కం

కోర్టువారికి అవకాశం అయే వరకు. ఉండలేని వకీళ్ళు కేసు యెందుకు దాఖలు చేయవలె?

- గురజాడ, కన్యాశుల్కం

వాదిని బాధించే నిజం వాది తరపు వకీలుకి అక్కర్లేదు. ప్రతివాదిని బాధించే నిజం ప్రతి వాది వకీలుకి అక్కర్లేదు.

- గురజాడ, కన్యాశుల్కం

ఆళ్ళేపీడర్లు! ఆటూ ఇటూ డబ్బుచ్చుకు ఓడించే వోళ్ళు.

- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

పోలీసోడికంటే డాకూ నాకొడుకు ఈ బూమ్మీద ఒవుడైనా ఉన్నాడా అంటే ఆడు పీడరు నాకొడు కన్నమాటే!

- రావిశాస్త్రి, బంగారిగాడికత

ప్లీడర్లు మైరావణులు.

- చిలకమర్తి, కనకయ్య పంతులు కంతి

పూర్వకాలములో మంచి కాషాయ వస్త్రాలు కట్టు కొన్నవాళ్ళే పూజ్యులు. ఇప్పుడు కోట్లు తొడిగి కొన్న వాళ్ళే పూజ్యులు.

- చిలకమర్తి, గణపతి

తక్కిన ప్లీడర్లలాగ మేము దగా చేసి పార్టీల సొమ్ము అపహరించము.

- చిలకమర్తి, ప్లీడరు తమాషా

లోకంలో న్యాయాన్ని ధర్మాన్ని చంపేయటానికి ఎన్నికోర్టులు, ఎన్ని నల్ల కోటులు?

- విశ్వం, ముసుగు

వేశ్యల తలదన్నేస్తున్నారు ఇప్పటి ప్లీడర్లు. నిర్దయం ఒకటి గుంజుకోవడం వేరొకలాగ సంసారాల్ని తినేస్తున్నారు.

- అప్పారావుపట్నాయక్, రేవతి

ప్లీడరీ నిజంగా అబద్ధం. అభినయం అబద్ధంగా నిజం.

- భమిడిపాటి, కాలక్షేపం

గెలియనట్టిది యైన గెల్చునటంచును
లాఁజూచి కల్పనలను ఘటించి
తప్పుఁ జెప్పుమటన్నఁ దప్పుఁ జెప్పనివారి
నోటి కబద్ధాలు నూరిపోసి
జెడ్జిగారికి నేను జెప్పు మాటలు పథ్య
ములు సుమాయని వాని మోసపుచ్చి
రేపు ఫీజిచ్చెద మాపిచ్చెద నటన్నఁ
గాదు తెమ్మని ముందుగానె కొనియు
వ్యాజ్య మొకవేళఁ బోయిన వాని సాక్షి
మీఁద నెపమిడి, గెల్చిన మీఁదఁ బెట్టు
కొని నటింతురు ప్లీడరుల్ గొంద ఱిలను
న్యాయవాదుల మంచు నన్యాయ లీల.

- తి.వేం., శతావధానసారము

## ప్లీడరు గుమాస్తా

స్వంత గొడవలకన్నా పరాయివాళ్ల గొడవలంటే ఎక్కువ సరదా ఈ వకీళ్ల గుమాస్తాలకు.

- రాజమన్నారు, బంధాలు

ప్లీడరు ఫైలు గుమాస్తాలో నున్నది.

- హనుమంతరావు, లేడీ డాక్టరు

# ఫ

ఫరవా

ఆదాయం నేకపోయినా పరవానేదు గాని. ఎవ్వ లికి పైసా అప్పుండ కూడదు

- విశ్వనాథం. మార్పు

ఫలసాయం

చిత్త చిత్తగించి. స్వాతి చల్లచేసి. విశాఖలో విస రకుండా ఉంటే అనూరాధ నాటికి అడిగినంత ఫలసాయం ఇస్తానంటుంది భూమాత.

- కాంతారావు. దగాపడిన తమ్ముడు

ఫలితం

కాకిని కొడితే గద్ద సచ్చిందట.

- వేంకటరాయశాస్త్రి. ప్రతాపరుద్రీయము

త్యాగం. జైలు. వెలి. నిరాహారం. అపనిందలు. వీటి ఫలితం మనిషికి గొప్పదనం రావటం

- చలం. మ్యూజింగ్స్

ప్రయోజనం తీరిన తరువాత గుడ్డుపై పెంకు పగలక తప్పదు.

- చలం. మ్యూజింగ్స్

కృష్ణలీలల్లో కృష్ణుణ్ణి చూసింతరువాత భాగ వతం చదవటం పాప మనిపిస్తుంది.

- చలం. మ్యూజింగ్స్

చేసిన పనికి ఫలితం కనబడకుండా ఎందుకుం టుంది?

- సరస్వతీదేవి. రాజహంసలు

ఉడకపెట్టిన కొలఁది కోడిగుడ్డు కఠినాహారమ గును. తడిపిన కొలఁది నూలు గణు పెక్కును. దట్టించినకొలఁది తుపాకిదెబ్బ తీవ్ర మగును. వలదన్నకొలఁది వనితవాంఛ పురియె క్కును.

- పానుగంటి. సాక్షి

నిప్పు ముట్టికొనిన పొక్కక మానదు. చేసిన పాపఫల మనుభవించక తప్పదు.

- హనుమంతరావు. లేడీడాక్టరు

ఇంతఁ దెచ్చికొంటి వంతసేసి!

- తిక్కన. భీష్మపర్వము

ధనమునకు దానమును దప
మున కాచారమును రాజ్యమున కాజ్ఞయు జీ
వనమునకు యశము విద్యకు
వినయంబును నీతులకు వివేకము ఫలముల్.

- గోపరాజు. సింహాసన ద్వాత్రింశిక

అల్పపుణ్యుండు తొలి తొలి యమరతాసు
ఖంబు గయికొని మఱియు దుఃఖములనొందు
భూరిపుణ్యుండు మునుమును ఘోరనిరయ
యాతనల నొంది వెండి సౌఖ్యంబు లొందు.

- తిక్కన. స్వర్గారోహణపర్వము

గురిలేనివాడు రాయి విసిరినా తగిలితే నొప్పె త్తుతుంది.

- కొడవటిగంటి. తీరని సమస్య

రాత్రి రహస్యం ప్రొద్దున బట్టబయలు.

- రాజమన్నారు. మనోరమ

తేలకపోయినపుడు ప్రేలకుండా వుండదు.

- వేదాంతకవి. కష్టకాలం

పరీక్ష యెంత విషమమయితే ఫలితం అంత దారుణంగానూ మహోన్నతంగానూ లభిస్తుంది.

- రాధాకృష్ణశాస్త్రి. జన్మభూమి

నీది పోయిందంటే మరొహాడికి దొరికిందన్న మాట.

- మారుతీరావు. కళ్ళు

మనిషికి స్వర్గంగాని. నరకంగాని ఎక్కడో వుండవు. చేసుకున్నవారికి చేసుకున్నంత అని ఫలితం ఇక్కడే అనుభవిస్తాం.

- కాళీపట్నం. మహదాశీర్వచనం

అప్పులాళ్ళు కనిపిస్తే యముళ్ళు. పోలీసులు కని పిస్తే జెయిళ్ళు. అయ్యర్లు కనిపిస్తే ఇడ్లెన్లు.

- రావిశాస్త్రి. ఆరుచిత్రాలు

సైనికుడివంతు పోరాడటం మాత్రమే. గెలుపు ఓటమి ఒక్కడివే. అవి యుద్ధం ప్రారంభించిన వాడెవడో వాడివి.

- గంగాధరరావు. ప్రార్థన

నిన్ను దీని ఫల
ముం గుడిపింపఁగ లేకయున్న నా
పేరు కిరీటి కాదితఁడు భీముఁడు
భీముఁడు కాఁడు పూజ్యుఁడున్.

- తి.వేం., పాండవ విజయము

ఇవ్వాళ సహపంక్తి భోజనాలు. రేపు సరిగంగ స్నానాలు.

- సుంకర - వాసిరెడ్డి. అపనింద

మనం చేసిన పనులవల్ల ఏ ఫలితం అయితే కలుగుతుందో ఆ ఫలితం కలగడమే మన

ఉద్దేశ్యం అనుకోవాలి.

- రావిశాస్త్రి, నిజం

పున్నెంకొద్దీ పురుషుడు, భక్తికొద్దీ ఫలితం.

- పులికంటి, తీయలేని కలువు

ఒక్కమనిషి నిద్రలేచి
లక్షమందిని లేపుతాడు
ఒక్క అణువు కడుపుపగిలి
మహాశక్తి జనిస్తుంది.

- కుందుర్తి, తెలంగాణ

చింతకాయలు అమ్మేదానికి సిరిమానం వస్తే, ఆ వంకరటింకరవి ఏమి కాయలు అన్నదట.

- సామెత

కోరి, వీగి కొడుకునుకంటే, మూగ, చెవుడు ముంచక వచ్చినదట.

- సామెత

మూడుజన్మల సంగతి చెప్పగలను. పూర్వజన్మలో ఇచ్చి పెట్టుకోలేదు. కనుక ఈ జన్మలో దేవుడు నాకీయలేదు. కనుక ముందు జన్మలో నాకేమీ ఉండదు.

- సామెత

యతి కొరకు పోతే మతి పోయింది.

- సామెత

చస్తేనేగాని బర్రెపాడి బయపడదు.

- సామెత

చేసింది పోదు, చేయంది రాదు.

- సామెత

కాళ్లకు మొక్కేవాడుపోయి కంఠాన్ని పట్టుకొనే వాడు వచ్చినట్లు.

- సామెత

తోలు కొరికేవాడుపోతే, బొమికలు నమిలేవాడు వస్తాడు.

- సామెత

చావాలని సన్యాసం తీసుకుంటే గంతబొంత గాడిద మోత అయినదట.

- సామెత

గ్రహచారం జాలక రాచాలకుబోతే జన్మనక్షత్రం జూచి నెత్తి గొరిగిరట.

- సామెత

ముద్దుచేసిన కుక్క మూతి కరిచె
చనువు చేసిన ఆలు చంకనెక్కె.

- దేవులపల్లి, ఏడాదిపొడుగునా

డాక్టరు దగ్గర డాబుసర్లు కొడితే బిల్లు బారెడు అయిందట.

- శ్రీరమణ, న్యూనుడి

ఎప్పుడూ చెడు చూడటమే అలవాటుగా పెట్టుకున్న వ్యక్తి కొన్నాళ్లకు తానే చెడై కూర్చుంటాడు.

- గోపీచంద్, ఆత్మపరిశీలన

వాదాలు ముదిరితే దావాలు.

- శ్రీరమణ, న్యూనుడి

నవలా నవలా రాసుకుంటే కాపీపొడి రాలుతుంది.

- శ్రీరమణ, న్యూనుడి

వేసింది ఒక గుటక ఆగింది ఒక గుండె.

- శ్రీరమణ, న్యూనుడి

చీరచిరిగినా లుంగీ అంత.

- శ్రీరమణ, న్యూనుడి

మంది ఎక్కువైతే మజ్జిగ పలుచన.

- సామెత

అనం గనంగా రాగము, మూల్గంగ మూల్గంగా రోగము.

- సామెత

కంకి ఎర్రనైతే కన్ను ఎర్రనౌతుంది.

- సామెత

కన్ను ఎర్రనైనా మిన్ను ఎర్రనైనా కారక మానదు.

- సామెత

## ఫలితార్థం

తుళ్ళే యెద్దే గోనె మోసేది.

- నార్ల, శకునపక్షి

## ఫిడేలు

వీణమీది తానం ఫిడేలుమీద రాదు. ఫిడేలు మీది సంగతి వీణకు రాదు. వీణ ఒదుగు ఫిడేలులోలేదు. వీణలో ధ్వని ఫిడేలులో లేదు.

- బాపిరాజు, నారాయణరావు

## ఫిరంగి (గుండు)

ఫిరంగి యెక్కడుందో తెలియదు, గుండు మాత్రం వచ్చిపడి భళ్ళుమంటుంది.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, ఆత్మబలి

## ఫీజు

రోగి చావనీ బ్రతకనీ రొక్కమెటులో
లాగ జూచును వైద్యుండు లాఘవముగ
వ్యాజ్య మోడనీ, గెల్వనీ వాటమెఱిగి
పిండుకొనజూచు ప్లీడరు ఫీజుముందె!

- కాళ్లకూరి, వరవిక్రయము

**పూలు**

అంతా వట్టి ఫూల్స్ యీ మనుష్యులు. నవ్వాల్సిన దానికేడుస్తారు. ఏడవాల్సిన దానికి నవ్వుతారు.

- *ఆత్రేయ, ప్రగతి*

**ఫెయిల్**

ఫేలైతే సమాజంపట్ల ఒక కసి ఏర్పడుతుంది. ఆ కసి, కొత్తకార్యానికి పురిగొల్పుతుంది. ఏంగ్రీ ఎంగ్‌మాన్ అవుతాడు.

- *బుచ్చిబాబు, ఒకేనిద్ర - ఎన్నోకలలు*

**ఫొటో**

ఎవరి ఫొటోలన్నా చచ్చిపోయిన తర్వాతే పేపర్లో పడతాయట.

- *కొండలరావు, కుక్కపిల్ల దొరికింది*

**ఫోను**

భార్యకూ నాకూ ఫోన్లొ దెబ్బాట వచ్చి
బడితెతో దాన్ని ఫోన్లోనె బాదినాను.

- *మాచిరాజు, అహం*

**ఫ్యాషన్**

గర్భానికీ, మతానికీ ఈ రోజుల్లో సంబంధం లేదు. ఇది ఈనాటి ఫ్యాషన్.

- *సరస్వతీదేవి, దగాపడ్డ డాక్టరమ్మ*

పంచాంగం యింట్లో వుండటం ఫేషన్‌కా దీ రోజుల్లో. నగ్నశరీరుల బొమ్మలు ఫేషన్. జీవి తాన్ని నడిపిస్తున్నది కేలెండర్లు కాబో లీ రోజుల్లో.

- *పెద్దిభట్ల, నయనతార*

భాగ్యవంతుల్లో చాలామంది సోషలిస్టులు. అదో ఫ్యాషను.

- *యజ్ఞన్నశాస్త్రి, విశ్వం పెళ్ళి*

మగని యనుగ్రహమే భాగ్యవంతురాలికిఁ గూడ భాగ్యము. పేదరాలికిఁ బెన్నిధానము.

- *చిలకమర్తి, సుధాశరచ్చంద్రము*

# బ

**బంగారం**

బంగారం కరగడంలో కొంచం కొంచం చెయ్యి తడిచేసుకోవచ్చును.

- *గురజాడ, కొండుభట్టీయము*

మనిషి కష్టం బంగారం, మనిసి మాయ బంగారం.

- *రావిశాస్త్రి, బంగారిగాడి కత*

బంగారం అంటే అది మనిషి కష్టం.

- *రావిశాస్త్రి, బంగారుబాబుకథ*

**బట్ట**

తల్లి గర్భమందుఁ దాఁ బుట్టినప్పుడు
మొదల బట్టలేదు తుదకు లేదు
నడుమఁ బట్టఁగట్ట నగుఁబాటు గాదొకో?

- *వేమన*

**బట్టతల**

అనప్పిండి విస్సన్నగారిదీ బట్టతలే, మా వారిదీ బట్టతలే.

- *చెళ్ళపిళ్ల, కథలు-గాథలు*

బట్టతల వెధవలకు కూడా అదృష్టం పట్టుతూ వుంటుంది.

- *పతంజలి, అప్పన్నసర్దార్*

**బట్టీ**

పాఠాలు బట్టీ పెట్టినవాళ్లే పరీక్షలో తప్పుతారు.

- *కుందుర్తి, న్యాయదాన*

**బడాయి**

బజారు మనిషికి బడాయి హెచ్చు!

- *హర్షవర్ధన్, అక్షరలక్షలు*

ఈ మానవుడున్నాడే, వీడు స్వప్రయోజకత్వాన్ని గురించి బడాయి మాటలైతే చెప్పుకోగలడుగానీ బాహ్య పరిస్థితులనుంచీ ప్రేరణ లేనిదే గరికపో చనైనా కదల్చలేడు.

- *రాజారాం, ధర్మగ్లాని*

బడాయికి బయట పడుకుంటే, పై పంచెకు జ్వరం తగిలిందట.

- *సామెత*

మ్రింగ మెతుకు లేదు, మీసాలకు సంపంగి నూనె.

- *సామెత*

పగలెల్లా బారెడు నేశాను, దివ్వెతేరా దిగనేస్తాన న్నట్లు.

- *సామెత*

డిక్లరేషన్ రాకముందే సర్క్యులేషన్ సంగతులు చెప్పినట్టు.

- *శ్రీరమణ, న్యూనుడి*

**బడిపంతులు**

కాస్త పెద్దలు గడించింది వుంటే పంతులు

ఉద్యోగం అంత సుఖం మరే ఉద్యోగంలో వుండదు

- కాంతారావు, బూచీ

బంట్రోతు

ఆఫీసులో పనులు చెయ్యడానికి, ఆఫీసు రికార్డులు మొయ్యడానికి ప్రభుత్వం బంట్రోతులను నియమించింది. అధికారులు మాత్రం జోళ్ళు మొయ్యడానికి, యిళ్ళు తుడవటానికి, నీళ్ళు తోడడానికి బంట్రోతుల్ని ఉపయోగించుకుంటున్నారు.

- సూర్యారావు, దేశదిమ్మరులు

బండారం

ఇంటిపేరు కస్తూరి వారు, ఇంట్లో గబ్బిలాల కంపు.

- సామెత

ఇంట్లో యీగల మోతా, బయట పల్లకీల మోత.

- సామెత

బండి

దేవుఁ డెదురు తిరిగినపుడు బస్సులు బళ్లవుతాయి.

- బీనాదేవి, తాడిమిలేని పువ్వు

బతుకు

బ్రతుకొక కాలక్షేపం!

- ఇంజనీర్ రావ్, బ్రతుకు

దేనికోసం బ్రతకటం అనే ప్రశ్న అర్థంలేని ప్రశ్న. బ్రతకటమే ఆనందం.

- గోపీచంద్, ఆశాజ్యోతి

బ్రతుకంటే ఉద్దీప్త చైతన్యం.

- సినారె, మంటలూ మానవుడూ

భయం బానిసత్వం బ్రతుకుకాదు.

- చెరబండరాజు, ఫో

బతుకు కూలిన పందిరి.

- జ్వాలాముఖి, కథ అడ్డం తిరిగింది

బ్రతుకు అతుకు బొంత
జగము యిరుల కంత

- రమణారెడ్డి, ధమ్మఘోష

నన్ను నరికేశినా నాను బతుకుతానుగాని, యెల్లి లేకపోతే నాను బతకలేను మా రాజా!

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

ఏ ఒక్కరి బ్రతుకూ
నీడలేని వెలుగు దివ్వె కాదు.
ఏ ఒక్కరి బ్రతుకూ
వెలుగులేని చీకటిముద్ద కాదు.

- రంగారావు, ముక్తకాలు

బతుకుపూలు తొడిగిన రేకుల్లో
ఒకటే రంగు- అది నలుపు.

- కుందుర్తి, తెలంగాణ

ముదిసెను దంతావళియును
ముదిసెను కేశములుఁ దనువు ముదిసెం దనకున్
ముదియనివి రెండు చిక్కెను
బ్రతికెడి తీపియును విషయపక్షస్పృహమున్.

- పోతన, భాగవతము

బ్రతకవచ్చు నొడలఁ బ్రాణంబు లుండిన
బ్రతుకు గలిగెనేని భార్యగలదు
బ్రతికి తీవు భార్య పట్టు దైవ మెఱుంగు
వగవ వలదు చైద్య! వలదు వలదు.

- పోతన, భాగవతము

ఈ కాలంలో ఆర్థికమైన ఆసరా లేకపోతే బ్రతుకు, బజారు కుక్కకంటే నికృష్టమయింది అవుతుంది.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

మీలాగే వాడు జంఝాలు వొడుక్కుంటూ బతకాలని వుందా యేవిఁషి?

- గురజాడ, కన్యాశుల్కం

డబ్బున్నా అతికారఁవున్నా ఈ నోకంల నంజిబుతుక్కంటె చుబ్బర్వైన బతుకూ చుకడ్నైన బతుకూ వింకోటినేదు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

కాలం అనే సముద్రంలో
కదుల్తున్న తెప్పలు బ్రతుకులు.

- కుందుర్తి, ఆశ

బ్రతుకే ఉలిపిరి కాగితం చందం.

- తిలక్, చిన్నారికి చిన్నమాట

బ్రతు కొక బజారు. అందులో ప్రతివ్యక్తీ విలువను పెంచుకోడానికి ప్రయత్నిస్తాడు. నిత్యం పైకో కిందకో పోతుంటాడు.

- పాప, చిట్టితల్లి

ఇచ్ఛ వుండడమే బ్రతకడం. చావడమంటే స్వేచ్ఛ లేకపోవడమే.

- రారా, ఎదురుతిరిగిన కథానాయకుడు

ఒకకంట నీరు కారితే ఇంకో కన్ను నవ్వితేనే బతుకు.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

ఆత్మ యాశాశ్మశానధూమాంకితంబు,

బ్రతుకు నాకు దుర్వేదనాభారభూతము

- దువ్వూరి, కడపటి వీడుకోలు

అనుక్షణం చావుకై నిరీక్షించే
మనం బ్రతికి చచ్చిం దెప్పుడు?

- కాళోజీ, నా గొడవ

చావునుంచి పారిపోవటమే బ్రతుకు.

- బైరాగి, పలాయనం

### బతుకు తెరువు

బతుకుతెరువు శానా సెడ్డది

- బుచ్చిరెడ్డి, నగరంలో అడవి

బ్రతుకు తెరువుకు అన్ని పనులూ సమానమే.

- కె.యల్., కొత్తగుడి

### బదలాయింపు

ఆడలేక మద్దెల ఓటి దన్నదట.

- సామెత

### బదిలీ

రాజు పాపం పురోహితుణ్ణి కొట్టుక పోతుంది.

- సామెత

బదిలీ అంటే మనుష్యభాషలో చావు.

- కొడవటిగంటి, కింకరుడు

### బదులు

ఆహితుల నెల్లవిధంబుల
విహితలంగాఁ జేయునది వివేకవిధి.

- నన్నయ, సభాపర్వము

మంత్రంలో పసలేకున్నా తుంపర్లకు లోటు లేదు.

- సామెత

### బదులుకు బదులు

గాడిద సంగీతానికి ఒంటె ఆశ్చర్యపడితే, ఒంటె అందానికి గాడిద మూర్ఛపోయిందిట.

- సామెత

### బద్ధకం

ఎదర పెద్దపని పెట్టుకుని చూద్దాంలే అనుకొనే వాడికి నిద్రవస్తుంది తప్ప పని జరగదు.

- చినరామచంద్రరావు, అమృతబిందువు

ఏ ఆఫీసులోనూ పనులేమిటో తెగ పెరిగిపోతున్నాయి. దానితో సమానాంతరంగా పనిచేసే వాళ్లలో బద్ధకం బలిసిపోతూంది.

- మహీధర, కత్తులవంతెన

### బంధం

మనసుల బంధం తెగిననాడు మనుషుల బంధం నిలవదు. ఆ స్థితిలో యింకే బంధవ్యూఁ నిలవదు.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

బాధలన్నిటికీ మూలకారణం మనిషి పెంచుకునే బంధం అతని చుట్టూ అల్లుకునే పాశం.

- వెంకటకృష్ణమూర్తి, పడమటి సంధ్యారాగం

### బంధురం

బ్రాహ్మ బుద్ధికి, భంగు వైరాగ్యమునకుఁ,
గవితకు హరీతకియుఁ, బాలు గానమునకుఁ,
గుక్కుటపుగుండె ధైర్యముకొఱకు, మఱియు
నరములకు నల్లమందు బంధురములగును.

- పానుగంటి, వీరమతి

### బంధువు

సుద్ది పగవారి పగవారు చుట్ట లగుట.

- శ్రీనాధుడు, కాశీఖండము

నా కున్న బంధువులంతా నా దగ్గిర డబ్బు లాగాలని చూసేవారేగాని, నా కష్టసుఖాలకి పనికి వచ్చేవాడు ఒక్కడయినా కనపడ్డు.

- గురజాడ, కన్యాశుల్కం

ఆపద కడ్డంబడ్డవారే బంధువులు.

- గురజాడ, కన్యాశుల్కం

మనకు దేవతలు బంధువు లుండకూడదా?

- రామకృష్ణశాస్త్రి, అసుర-సంధ్య

సుఖముపడెడు నాఁడు సుతసతీజనములఁ
జేరనిత్తుమేనిఁ జింత లడఁగుఁ;
జరమదశల వారు సన్నిధి నుండిరా
జ్ఞానచిత్త మైనఁ గలత నొందు.

- చిలకమర్తి, గయోపాఖ్యానము

తమ మరణానంతరము బంధువులు తమ నిమిత్తమెట్లు విలపింతురో చెవులార వినియెడి భాగ్య మెవ్వరి కబ్బదు!

- చిలకమర్తి, గణపతి

బంధువుల్ని తిట్టుకుని పిల్లలముందే, ఆ
బంధువు(ల) మీదే తమతో కలిసి ప్రేమ
నటించమంటారు పెద్దలు.

- చలం, నవయవ్వనం

ఆలివంక వార లాత్మబంధువు లైరి
తల్లివంక వారు తగిన పాటి
తండ్రివంక వారు దాయాదు లైరయా

- వేమన

బావమరిది కంటె మించిన బంధువు లేదు.

- సామెత

బంధువులచేత ఒక మంచిమాట అనిపించుకోవటంకంటే స్నేహితులచేత అనిపించుకోవటం తేలిక.

- కొడవటిగంటి, అనుభవం

సంపద ఉన్ననాడే బంధువుల రాక. చెరువు నిండిననాడే కప్పల చేరిక.

- సామెత

## బరువు

కవికి కళ్లజోడు బరువా?

- శ్రీరమణ, న్యూనుడి

ఎట్టులిక భరియింతు
నీ జీవితపు బరువు?

- విశ్వసుందరమ్మ, కవితా కదంబము

బ్రతికిన దినాల తలపోత బరువుచేత.

- శ్రీశ్రీ, సుప్తాస్థికలు

## బర్త్‌కంట్రోల్

బర్త్ కంట్రోల్ లేకపోతే మరికొన్నాళ్లకి ట్రెయిను ప్రయాణా లుండవు. అంగుళానికి మనిషి చొప్పున నిల్చుంటే మరిన్ని ట్రెయిన్లకీ కార్లకీ చోటెక్కడుంటుందీ?

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

## బర్రె

కర్ర ఎవనిదో బర్రె వానిది.

- సురవరం, గ్యారాకద్దూ బారా కొత్వాల్

బడితె గలవాడిదె బర్రె.

- చిరంజీవి, బోలో స్వతంత్ర భారత్‌కీ జై

## బలం

ప్రవాహం వచ్చినప్పుడు తలవంచడం మంచిది. యెదటి బలం మించివున్నప్పుడు రొమ్ము విరిచి లాభంలేదు.

- ఉన్నవ, మాలపల్లి

మొండివాడు రాజుకంటె బలవంతుడు.

- ఉన్నవ, మాలపల్లి

బలమున్నచోటఁ బౌరుషము తఱచుగా లేదు. పౌరుషమున్నచోట బలము తఱచుగా లేదు.

- పానుగంటి, సాక్షి

తనదాకా వచ్చినప్పుడే తన విశ్వాసాల బలం బయటపడుతుంది.

- మహీధర, ఓనమాలు

దేనినైనా అమలు పరిచేది బలం. సూత్రాలు, సిద్ధాంతాలూ, శాసనాలు, చట్టాలు కావు.

- చిరంజీవి, బోలోస్వతంత్ర భారత్‌కీజై

అంతశ్శౌర్యము ప్రధానము కాని యంగబలముతోఁ బనియేమున్నది? తాటికాయంత దళసరి గల కత్తి ప్రధానమా? తాంద్రబెత్తంత దళసరిగల యొర ప్రధానమా?

- పానుగంటి, సాక్షి

జనానికి సహజంగా బలం వుంటుంది. అగ్గికి గుగ్గిలం తోడయినట్టు, ఆ సహజబలానికి ఆయుధబలం కూడా జోడయితే మన పెద్దలందరికీ వల్లకాడే గతవుతుంది.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయ్ జాగ్రత్త!

మానవ జీవితంలో విశ్వాసాలకున్న బలం దేనికీలేదు.

- సరస్వతీదేవి, మెహ్తారాని

తాళిబొట్టు బలంవల్ల తలబ్రాలవరకు బ్రతికినాడు.

- సామెత

నీతిబలం నాలుకపైన.

- సామెత

ఇంట్లో బలమైనా ఉండాలి. ఒంట్లో బలమైనా ఉండాలి.

- సామెత

బలం వుంటేనే బ్రతుకు
బలం లేనివాడు పుడమి తల్లికి కడుపుచేటు.

- సదానంద, గందరగోళం

వస్తుగతం కాని కవితకి భావం బలం.

- మోహనప్రసాద్, నిరీహ

రుజువుకాని అబద్ధాలు నిజంకన్న బలమైనవి.

- కొడవటిగంటి, రసికుడు

ఒరులపాలైన తమ సొమ్ము మఱలఁ గొనుట
యార్తిఁ జెందిన చుట్టాల నరసికొనుట
నిజకులోచిత ధర్మంబు నిలిపికొనుట
బలిమిఁ డగుటకు ఫలమండ్రు.

- కంకంటి, ఉత్తర రామాయణము

## బలహీనత

మానవునిలో ఉండే బలహీనతలన్నింటిలోనూ, ఇతరుల బాధచూసి ఓర్వలేకపోవటం వంటి దురదృష్టకరమైన బలహీనత మరొకటి లేదు. ఏరకం కిరాతకుడిలోనైనా సరే, ఇది యేమూలనో ఒకమూల ఇంతోఅంతో అణగివుంటుంది.

- సూరి, చంఘీజ్‌ఖాన్

అందమైన ఆడవాళ్లకి అందమైన మనసులే

వుండేట్టు భావించడం పురుషుని మనోదౌర్బ ల్యానికి చిహ్నం.

- కళ్యాణచక్రవర్తి, మొగలిపువ్వు

మనుషుల ప్రవర్తనను బట్టి, వారి వారి వ్యక్తి త్వాలని తొందరపడి నిర్ణయించుకోవడం మాన సికంగా ఓ బలహీనతే.

- కళ్యాణచక్రవర్తి, మొగలిపువ్వు

బలహీనులు

మంచి సన్నాసులెప్పుడూ బలహీనులే(బావగారూ)

- ఆదివిష్ణు, ఎంతెంతదూరం

బలాబలాలు

సంస్కృతికన్న సంప్రదాయం బలమైనది. అర్థం కంటే నినాదం బలమైనది.

- కొడవటిగంటి, చదువు

బలి

పెద్దపులికి ఎంత ఆకలేసినా మరో పెద్ద పులిని చంపదూ, తినదూ పాము మరో పామును కాటెయ్యదు. కాని మనిషి తన ఆకలికోసం, తన బాగుకోసం మనిషినే బలిపెడుతున్నాడు.

- గంగాధరరావు, లంబాడోళ్ల రాందాసు

న్యాయం, సత్యం, సమత వీటికోసం బలిదా నాలు కావాలి

- రంగాచార్య, జనపదం

ఉరి కంబాలకు మన ఆశయాలు బలి.

- ఆరుద్ర, రొండూ రోకళ్లు

బలీయం

సాక్ష్యంలేని యథార్థం కన్నా, సాక్ష్యం చూపగల అబద్ధం చాల బలీయమయినది.

- లల్లాదేవి, యశోధర

బలుపు

పత్తిలోంచి నూలుతీసినట్టు ప్లీడర్లు సారాలోంచి ఫీజులు వడుకుతూ దుక్కబలుస్తున్నారు. గుమాస్తాలంతా తినమరిగి పోతరిస్తున్నారు.

- రావిశాస్త్రి, మోక్షం

బస్తీ

బస్తీకి బోయినోల్లు దొరలన్నయ్యొస్తరు- దయ్యాలన్నయ్యొస్తరు

- పరాశర, ప్రజారథం

బస్తీకెళ్లే వాడికి పల్లెటూళ్లో పనులు చెప్పేవాళ్లు కరువా?

- సుంకర, కోతలరాయుడు

నేనుండేది బాధల బస్తీ.

- శేషేంద్రశర్మ, మండే సూర్యుడు

బస్సు

బస్సు పుట్టి బండ్లవారి
కడుపు కొట్టిందోయ్!

- జానపదగీతం

బస్సువాళ్లు

బస్సువాళ్లెప్పుడూ వాళ్ల జుట్టును చేతిలో ఉంచు కున్నవాడికే వంగి వంగి సలాములు చేస్తారు.

- సీతారామారావు, తారాబలం

బహిరంగం

దారుణాలు బహిరంగంగా చేస్తే ఎవడికీ అను మానం వుండదు.

- బుచ్చిబాబు, దారినపోయే దానయ్య

బహిష్కరణ

తుపాకి మందుఁ గనిపెట్టిన తరువాత, అమ్ములు విండ్లు మూలఁబడినట్లే పూర్వాచార పరాయణుల చేత గొప్పయాయుధమయిన బహిష్కార మిప్పుడు మూలఁబడి తుప్పుపట్టుచున్నది.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

బహుమతి

ముష్టి ముండకు మల్లె పూవిస్తే, ముడిచి ముష్టి కింద పెట్టుకొన్నదట.

- సామెత

శిక్ష కౌషధము బహుమానముగాని శిక్ష కాదు.

- పానుగంటి, రాతి స్తంభము

తెచ్చిన బహుమతికన్నా ఇచ్చిన హృదయాన్ని చూసి పుచ్చుకోవడం సంస్కారం.

- రాధాకృష్ణ, మనస్తత్వాలు

ఆడవాళ్లకీ పువ్వులకన్న అందమైన బహుమతి ఏముంది?

- మహీధర, కత్తులవంతెన

అభ్యుదయ నాటకాలకు డబ్బురాదు. ప్రభుత్వపు రజిత పతకం మాత్రం దొరకవచ్చు

- సూర్యారావు, నీలితెరలు

బహువచనం

బహువచనం దగ్గరితనాన్నీ, ఆత్మీయతనీ స్ఫురింపజెయ్యదు.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

బాగు

మనుషులు బావుంటే వూరు బావుంటుంది.

- చలం, వివాహం

అసలు మనిషి పుట్టిపెరిగిన ఊరొదిలితేనే బాగుపడతాడు

- జంగయ్య, జాతర

బాధ

క్షణాల వ్రణాలపై
ముసురుకున్న బాధలు
అక్షరాల అర్థాలలో
ఇమడలేని గాథలు!

- అఫ్సర్, ఎండకన్నులలో. ..!

కరువులో అధికమాస మన్నట్లు.

- సామెత

మానసికబాధ సైతము మరణసమమె.

- ఏటుకూరి, ప్రేమాలోకము

బాధ లభ్యాసమున సుఖప్రాయములుగ
నరులు భావింత్రు విషక్రిమి న్యాయమునను.

- చిలకమర్తి, గయోపాఖ్యానము

బతకడవేఁ పెద్దబాద బాబు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

ఫలానాది కావాలని ఎవర్నడిగినా వాళ్లకుండే బాధలన్నీ వెళ్లబుచ్చక తప్పదు.

- రావిశాస్త్రి, జరీఅంచు తెల్లచీర

నోరు తెరచి పైకి బోరున నేడ్చినయెడల బాధతీ తీయే పోవునేమో? అట్లుకాక నోరుమూసికొని కమిలి కమిలి క్రుళ్లి క్రుళ్లి యేడ్చుటచేతనే మఱింత పుట్టి మునుగుచున్నది. సౌఖ్యము లేదు.

- పానుగంటి, సాక్షి

నలుగురు జనం మనలాగే అవస్థ పడుతుంటే మన బాధ సగం తీరుతుందన్న ఆశ.

- బుచ్చిబాబు, గొలుసు

బ్రహ్మచర్యం బాధ. సంసారం అంతకన్నా బాధ.

- చలం, మ్యూజింగ్స్

నీచున కధికారంబును
బాచకునకు నాగ్రహంబుఁ బంకజముఖికిన్
వాచాలత్వము బహు సం
కోచముఁ గడు బాధకములు.

- గువ్వలచెన్న శతకము

బాధలనేవి డబ్బునిబట్టీ, వుద్యోగహోదానిబట్టి దూరంగా పోవు.

- నంది, నైమిశారణ్యం

బాధ పడుతున్న వాళ్లకే యింకొకరి బాధలు అగుపిస్తాయ్.

- కొంతారావు, శ్రామికుడు

యజమాని బాధల్ని నౌకరోళ్లు భరించాలి.

- ముద్దుకృష్ణ, ఆడవాళ్ల తెలివి

తనకు పట్టని బాధ - ఎవరికో జరిగిన అన్యాయం.

- కాళీపట్నం, హింస

బాధకుడు

కవియొకడు, గాయకుడొకడు 'వద్దురా బాబూ!' యని బ్రతిమాలినను వినకుండ మ్రోతలు మ్రోగి ప్రాణము విసిగింతురు.

- సూరి, నారాణి

బాధ్యత

అధికారాన్ని చేపట్టదలచినవాడు బాధ్యతలను కూడా నెత్తిన వేసుకుతీరాలి.

- సూరి, చంఘీజ్ ఖాన్

ఉదయం పది గంటలకు రావాలనేది బాధ్యత. పదిగంటల తరువాత ఎప్పుడైనా ఆఫీసుకు రావటం హక్కు.

-నిరుద్యోగి, కార్యాలయబేతాళవిక్రమార్కీయము

అంటూ సొంటూ ఆసాది వానిది, రట్టూ రవ్వా గంగానమ్మది.

- సామెత

ఏ అదృష్టాలు వక్రించినా మన కర్తవ్యాన్ని విస్మరించకూడదు.

- శ్యామలారాణి, పవిత్ర

బాధ్యతలకు మానసిక సుఖానికి చుక్కెదురు.

- చిన్నబాబు, డబ్బు

బానిస

కులము గలుగువారు గోత్రంబు గలవారు
విద్యచేత విఱ్ఱవీగువారు
పసిడి గలుగువాని బానిస కొడుకులు

- వేమన

పలాయనవాదులకు భావాలు బానిసలౌతాయి.

- కొంతారావు, వంశధార

ఈ దేశమే బానిసదేశం! ఇక్కడ ఒక బానిసకూ, ఇంకో బానిసకూ చాలా కొద్ది భేదం!

- హనుమంతరావు, పవిత్రులు

జగత్తు అంతా మిథ్య అనుకుని నిర్లిప్తతే పట్టుకు పాకులాడేవాళ్లకి బానిసతనం కాకపోతే మరేం సిద్ధిస్తుంది?

- సుబ్రహ్మణ్యశాస్త్రి, మార్గదర్శి

బాంధవం

..చీవృష్టాగత బాంధవంబు నిజమా? శ్రీకాళ హస్తీశ్వరా?

- ధూర్జటి, శ్రీకాళహస్తీశ్వర శతకము

బాబా

పాపాలు - బాబాలు - గణం ఒక్కటే!

- శ్రీరమణ, న్యూసుడి

బారు

బారు మంచిదయితే బీరు మంచిదవుతుంది.

- శ్రీరమణ, న్యూసుడి

బాలలు

బాలలే విజ్ఞాన కేతువులు
నేడు రేపులమధ్య సేతువులు
చంద్రబంధుర సుధాశీతువులు
మానవత్వ వికాస హేతువులు

- శ్రీశ్రీ, బాలల వత్సరం

తొలి తొలిఁ గోరికొనన్ బాలునికిఁ దగుం బాడిమెయిన్.

- తిక్కన, ఉద్యోగపర్వము

బాల్యం

బాల్య యవ్వనాలవి బేఖాతరుగా తిరిగిన వాళ్లు ఎంతటి ఇంట బుట్టినా కౌమార వార్ధక్యాలలో కష్టపడక తప్పదు.

- కాశీపట్నం, సేనాపతి వీరన్న

బాల్యమున నున్న గుణములు వయస్సు ముదిరినను పోవు.

- చిలకమర్తి, స్వీయ చరిత్రము

మానవుడి జీవితములో మధురాతి మధురమైనది బాల్యదశ.

- పులికంటి, మరపురాని మా ఊరు

బాల్య వివాహం

కొన్ని యుద్యోగములకు బాల్య వివాహములు మంచివి.

- శివరామశాస్త్రి, వివాహబలి

బాల్య స్నేహం

చిన్నపిల్లల స్నేహాలు బీరకాయ పీచులాంటివి. అవి అతి విచిత్రంగా ఒక వీధినుండి ఇంకోవీధికి, ఒక పేటనుండి ఇంకో పేటకూ విస్తరిస్తాయి.

- కొడవటిగంటి, చదువు

బావ

ఎక్కడైనా బావగాని, వంగతోటలో బావ కాదు.

- సామెత

బాసలు

సారసనయనల యెదుటఁ జేసిన బాసలు వాసిగ నిలుచునా? అంచయానలఁ గూడు వేళ మంచన గుటికట్లు కట్టుకు నిలుచునా?

- కోలాచలం, శిలాదిత్య

బిచ్చగాడు

మతాలు, అధికారాలు, రాజ్యాలు సంసారులకు పట్టవు వాళ్లు మేకలవంటివాళ్లు. అవన్నీ బిచ్చగాళ్లకు మాకు పట్టుతవి. మేము తోడేళ్లవంటి వాళ్లం.

- విశ్వనాథ, ముగ్గురు బిచ్చగాళ్లు

ఊరికంతా పిలువని పేరంటం- బిచ్చగాడు.

- వరవరరావు, చంద్రోదయం చూడాలని

బిడ్డలు

అడ్డాలనాఁడే బిడ్డలుగాని గడ్డాలనాఁడు బిడ్డలా?

- సామెత

బిరుదు

కవిసింహము కవినాగము
కవిశార్దూలము కవికిటి కవిఖడ్గంబున్
కవివాజి మున్నుగాఁగల
కవి మృగముల నిర్వచింపఁ గవి! నాతరమా?

- రామలింగస్వామి, శుక్లపక్షము

బీచి

సాయంత్రం బీచికి వెళ్లేవారు, రానివారికన్న సాంఘిక సోపానాల్లో ఒక మెట్టు ఎత్తు. బీచ్‌లో తక్కినవారు అనుభవించే ఆనందం 'మిస్' అవుతున్నామనే ఆశతో వస్తారు.

- చలం, మ్యూజింగ్స్

బీజం

ఒక్క మనిషి నిద్రలేచి లక్షమందిని లేపుతాడు. ఒక్క అణువు కడుపు పగిలి మహాశక్తి జనిస్తుంది.

- కుందుర్తి, బీజోత్పన్న

బీద

బాకీవున్న ప్రతివాడూ బీద అరుపులు అరుస్తూనే వుంటాడు.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

*బీదరికం*

బీదరికమే మురికికి కారణం.

- చలం, హంతకుడు

*బీరం*

బేలతనంబుతో ఘనులు
పెద్దలికంబు గణించుకొందురే
యాలములోపలన్ తెలియ
నందఱ బీరములంచుఁ బల్కుచున్?

- కంకంటి, ఉత్తర రామాయణము

*బుకాయింపు*

బుకాయించగలిగితే భూము లేలవచ్చున్నారు.

- చిలకమర్తి, అపూర్వయజ్ఞము

*బుగత*

బుగత లొప్పుడూ బయ్యం బడకూడదు. బయ్యబడ్డ ట్టవుపించగూడదు.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

*బుద్ధి*

పుట్టైను బుట్టిన బుద్ధి పుడకలతోడనే కదా పోవలసినది?

- తి.వేం., పాండవ విజయము

...పుట్టని చావని, త్రోవ వెదకికొనుట దొడ్డ బుద్ధి.

- పోతన, భాగవతము

అచ్చపు బుద్ధికి లే వగమ్యముల్.

- పింగళి, ప్రభావతీ ప్రద్యుమ్నము

బుద్ధీ బుద్ధీ కలిస్తే రాపాడుతుంది.

- గురజాడ, కన్యాశుల్కం

కుఱ్ఱవాళ్ళ బుద్ధి మిల మిల పరుగెత్తుతుంది. ముసలి బుఱ్ఱలు కొంచెం పస్తాయిస్తాయి.

- గురజాడ, కొండభట్టీయము

శీఘ్ర బుద్ధేః పలాయనం.

- గురజాడ, కన్యాశుల్కం

అడుగడుక్కీ బుద్ధి దాట్లేస్తూంటుందిగాని, నేనంత వాణ్ణి కానా యేవిఁటి?

- గురజాడ, కన్యాశుల్కం

శరీరం కృశించిన కొద్దీ బుద్ధి వికసిస్తున్నది.

- ఉన్నవ, మాలపల్లి

బుద్ధిగలవారు గెలువ నోపుదురు పరుల.

- దూబగుంట, పంచతంత్రము

బుద్ధిబలంబు గలవానికిం దక్కు బలంబు లేకుండినం గొఱంత లేదు.

- చిన్నయసూరి, మిత్రభేదము

మన సుఖదుఃఖములకు మన బుద్ధులు, మనము కర్తలముగాని యదృష్టలోపములు గావు.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

బుద్ధి చిన్నతనమునఁ బొట్లపిందెవలె మిగుల వంకలు కలిగియుండును. భవభారము దిగలాగిన కొలఁది తిన్నఁబడును.

- పానుగంటి, విప్రనారాయణ

మన కార్యములు మన బుద్ధినిబట్టియుఁ బ్రయత్న బలమునుబట్టియు నుండును.

- పానుగంటి, వీరమతి

నీ బుద్ధి పెడత్రోవ పట్టినది కాని దాని నైశిత్య మప్రతిమాన మైనది కదా!

- విశ్వనాథ, వేనరాజు

ప్రపంచమునకంతకు మతిలేదని నేను గనిపెట్టి వెల్లడించుటయేమి? నాకు మతిలేదని వీరు నన్నిక్కడ బంధించుటయేమి?

- పానుగంటి, సాక్షి

నీకే వోటిపైనా బుద్ధు లెట్టగొచ్చినై?

- బుచ్చిబాబు, ఉత్తమా యిల్లాలు

ఒక యెధవకి బుద్ధి సెప్తెకాని ఇంకోయెధవకి బుద్ధిరాదు.

- రావిశాస్త్రి కథలు, దిస్మోకింగ్ టైగర్

ఎంత తెలివిగలవాడైనా పరిస్థితులకు మించిన తెలివి చూపించగూడదు. తన తెలివిని పరిస్థితులకు సమన్వయం చెయ్యగలగటమే గొప్పవాని లక్షణం.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

జీవితంలో వున్న విచిత్రమే. తెలివి ముదిరిన వాళ్ళకు బుద్ధి సరీగా వుండదు.

- రెంటాల, ఇన్‌స్పెక్టర్ జనరల్

బుఱ్ఱుంటే చాలదురా. అందులో బుద్ధుండాలి.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

పాండిత్యం ఎక్కువైతే బుద్ధికి పడిశం పడుతుంది.

- చాసో, పరబ్రహ్మము

యథార్థ మేమనఁగ మనకు స్వతంత్రబుద్ధులు తక్కువ. ఎవఁడైన నొక్కఁడు శాసించినట్లు తెలిసినఁగాని మనము ప్రపంచ వ్యాపారమునఁ బ్రవర్తింపనేలేము. శాసనవాక్యములకు, శాసకు

లకు జంట్లమై బానిసలమై నూఱులకొలఁది తరములనుండి ప్రవర్తించియుంటిమి ఎవఁడో యొక్కఁ డాజ్ఞాపించివలసినది ఆ దారిన మనము పోవలసినది ఇంతే మన బ్రతుకు. పూర్వ మంతే. ఇపుడు కూడ నంతే.

- పానుగంటి, సాక్షి

బుద్ధి అదేపనిగా వికసిస్తే చెవులు మూసుకుపోతాయ్.

- నరసరాజు, ఈయిల్లు అమ్మబడును

పెడసరపు బుద్ధి ఉన్నాక ఎన్ని గుణాలున్నా రాణించవు

- కాళీపట్నం, పలాయితుడు

మనిషి మోటా, బుద్ధి జూటా.

- కొప్పర్లకోట, పెట్టమారిమగఁడు

పెద్దతనము వచ్చె బుద్ధి పెడతలఁ బట్టెన్.

- కొక్కకూరి, చింతామణి

దొంగతనము చేసినను సరే. పట్టుబడకుండుట తెలివి.

- చిలకమర్తి, గణపతి

అదృష్టం అందలమెక్కిస్తానంటే, బుద్ధి బురదలోకి లాక్కెళ్ళిందట.

- సామెత

శక్తిగలుగు పనులు చక్కగా నెఱవేఱు
భక్తిగలుగు పూజ ఫలమునిచ్చు
యుక్తిగలుగు మాట యొప్పునురా భువి

- వేమన

ప్రతి బుద్ధిగల మనిషీ జన్మరాహిత్యం కోరాలి.

- కొడవటిగంటి, దుష్టగ్రహం

చాకి కోక లుదికి చీకాకు పడఁజేసి
మైల దీసి లెస్స మడిచినట్లు
బుద్ధి చెప్పువాఁడు గ్రుద్దిన నేమయా?

- వేమన

నెయ్యావణ్ణం తినే మహారాజులకు, నీచపు బుద్ధులు పుట్టిస్తాడు ఎందుకు బాబూ భగవంతుడు?

- రామకృష్ణశాస్త్రి, వామనచాయ

చెప్పిన బుద్ధీ, కట్టిన సద్దీ ఎంతకాలం నిలుస్తాయి?

- సామెత

ఎట్టియర్థమును దగు
ల్కొనెఁ దివియక వెలివోని
చ్చునె బుధుఁ డూహించి చేయు సుకవిత్వంబుల్?

- పింగళి, ప్రభావతీ ప్రద్యుమ్నము

బుద్ధిమంతుడు

ఎవ్వఁడు బుద్ధిమంతుఁడో వాఁడు వృద్ధుఁడు గాని యేండ్లు మీఱినవాఁడా వృద్ధుడు?

- చిన్నయసూరి, మిత్రలాభము

బుద్ధిమంతులు రానిదాని కెదురు చూడరు. పోయిన దానికి వగవరు. విపత్తు వచ్చినప్పుడు విఠాకు పడరు.

- చిన్నయసూరి, మిత్రలాభము

తగవునకుం
జని యోడిన నరుఁడు ముదిసి చచ్చిన వగవం
బనిలేదు బుద్ధిమంతులు.

- అనంతుడు, భోజరాజీయము

బుద్ధిహీనుడు

వేషధారి కాని మహాత్ముడు యుగానికి ఒకడైనా ఉండవచ్చు కానీ బుద్ధిహీనులు గాని యువకులు మచ్చుకైనా కనిపించరు.

- కొడాలి సుబ్బారావు, చేసినపాపం

బుద్ధుడు

విశ్వాసాలమీద ధ్వజమెత్తిన గౌతముడు
ఒక పాలరాతి విగ్రహమైన విశ్వాస మైనప్పుడే
శిధిలశిధిలాలై పోయాడు...
తానెదిరించిన దేవుళ్ల పేకముక్కల్లో
ఒక జోకర్‌గా చేరిపోయాడు.

- హెచ్చార్కె, రహస్యావిష్కరణం

బుర్ర

కుర్రవాళ్ళ బుద్ధి మిలమిల పరుగెత్తుతుంది.
ముసలి బుర్రలు కొంచెం పస్తాయిస్తాయి.

- గురజాడ, కొండుభట్టీయము

మనిషి జీవితానికి చలనం కలిగించే యంత్రాలు మనిషి బుర్రలోనే ఉన్నవి.

- కొడవటిగంటి, నిలవనీరు

క్లిష్టపరిస్థితులలోనే ప్రభుత్వోద్యోగి బుర్ర తీవ్రంగా పనిచేస్తుంది.

- నిరుద్యోగి, కాళ్లబేరం

బూచి

చీకటిలో
కనువిప్పిన వారికి
వెలుతురంటె బూచి

- కాళోజీ, పునరావృత్తి

బూడిద

చివరికి మిగిలిన బూడిదలో

చిన్నమెత్తు స్వర్గం దొరకదు.
- తిలక్, కాయ్‌రాజాకాయ్

**బూతు**

పరమాత్మకు తట్టని బూతు పామరుల కెందు కోయ్?
- రామకృష్ణశాస్త్రి, మధ్యాక్కర

నీతులకేమి? యొకించుక
బూతాడక దొరకు నవ్వు పుట్టదు ధరలో
నీతులు బూతులు లోక
ఖ్యాతులురా. .
- కవి చౌడప్ప శతకము

అసలేదో నకలేదో తెలియని లోకంలో బూతు శృంగారంలా చలామణీ అవుతున్నది.
- దాశరధి, జిజ్ఞాస

**బెంగ**

భయం వేరు, బెంగ వేరు. జీవితంలో క్షణం సేపు భయంపడొచ్చు కాని గంట సేపు బెంగపెట్టుకోకూడదు.
- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

**బెదిరింపు**

కడుపు కొడతానని బెదిరించటం,
బెదిరింపుల్లో కల్లా బెస్టు బెదిరింపు.
- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

నవనీతంబుల ముద్దగాదు మెసఁగన్
నాముష్టి గోపార్భకా?
- పోతన, భాగవతము

ఎప్పటికైనా మీరందఱు నాచేతిలోఁ బడువారె.
- చిలకమర్తి, గణపతి-1

పసిదాన్ని గుజ్జనగూళ్ళు నవలమంటే ఆ పేరుతో నవల రాస్తానే అమ్మా అందిట.
- శ్రీరమణ, న్యూనుడి

**బెదురు**

లోకం వుత్త పిరికిగొట్టు. భయపడేవాళ్ళని భయపెడుతుంది. భయపడని వాళ్ళని చూసి బెదురుతుంది.
- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

**బేరం**

పోసుగుడు బేరమే లొసుగులబేరం.
- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

కట్నమెంత యిచ్చినను పుచ్చుకొందురుగాని వేయి రూపాయలకు తక్కువ యీయఁగూడదు.
- చిలకమర్తి, పెండ్లి కొడుకుల ధరలు

అతివలందు వైవాహికాలందు అదేదో ఆడరాద న్నట్లు సినిమా వేళలందు రిక్షా బేరమాడరాదు.
- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

ఆహార విహారములకొ
యాహారంబునకునో విహారంబునకో
బేహారము..?
- వల్లభరాయడు, క్రీడాభిరామము

కాళ్ళదగ్గరికి వచ్చిన బేరం, కాశికి వెళ్ళినా దొరక దన్నట్లు.
- సామెత

కూలికి వచ్చి పాలికి మాట్లాడినట్లు.
- సామెత

తిరిపెపు మజ్జిగకు వచ్చి పాడిబర్రెను బేరంచేసినట్లు.
- సామెత

**బేరీజు**

గొప్పలాభము ల్వాల చేకూఱునపుడు
స్వల్ప నష్టము ల్తలఁపున నిల్పరాదు
పిడుగు లొకటిరెం డెప్పుడో పడునటంచు
వాన వలదంచుఁ గోరెడు వారు కలరె?
- చిలకమర్తి, చతుర చంద్రహాసము

**బేల**

తళియఁ బెట్టిన యశనంబు తొలఁగఁ ద్రోచి
పిదపఁ గుడిచెద ననువాఁడు బేలగాఁడె?
- అనంతుడు, భోజరాజీయము

**బైఠాయింపు**

దసరాకిదిగిన అల్లుడు దీపావళిదాకా నిలవాగినట్టు.
- శ్రీరమణ, న్యూనుడి

**బైరాగి**

బైరాగివాళ్ళకి మాకు డబ్బు మీద తనువుంటుం దటోయి? ఒకళ్ళకి యిచ్చేది కానం - పుచ్చుకొన్నదీ కానం.
- గురజాడ, కన్యాశుల్కం

**బొంకు**

ఆడి తిరిగినఁ జండాలుఁ డంద్రుగాని
కులము చండాలుఁ డైనను గొఱఁత లేదు.
బొంకకున్నఁ జండాలుఁడె పో ధరిత్రిఁ
బూజ్యుఁ డనుమాట వినవయ్య పులులరాజ?
- అనంతుడు, భోజరాజీయము

నేటి నిజం రేపు బొంకు
అన్నిట స్వార్థం మస్తు!
- దాశరథి, తిమిరంతో సమరం

**బొజ్జ**

ఏదేశ మేగినా ఎందు కాలిడిన
చూడరా నీబొజ్జ పూడు మార్గంబు
- కాళోజీ, చాటువు

**బొమ్మ-బొరుసు**

వినోదమూ, విషాదమూ ఒకే ఒక నాణానికి బొమ్మా, బొరుసూ మాత్రమే.
- రాజారాం, వగపేటికి చల్లబిందినన్

ప్రతి పురుషుడికీ నాణానికిలాగే రెండు పక్కలుంటాయి. బొమ్మబొరుసు. ఒకటి భార్యలకు తెలిసింది. రెండోది భార్యలకు తెలియదని వీళ్ళు అనుకునేది.
- శ్రీరమణ, న్యూనుడి

**బోడి**

పూబోడి అంటే ఎవర్రా బోడి? నీ అమ్మ బోడి, నీ అక్క బోడి అన్నదట!
- సామెత

**బోధన**

ప్రశ్నలకి సమాధానం రప్పించుకుంటే చెప్పినట్లే
- పిచ్చేశ్వరరావు, వింతప్రక్రియ

పుట్టిన యిండ్లు మాని పతిఁ
బొందక యిట్లనిశంబు నుందురే?
- పోతన, భాగవతము

మంచి గతమున కొంచెమేనోయి
మందగించక ముందు అడుగేయ్
వెనుకపడితే వెనకెనోయ్
- గురజాడ, దేశభక్తి

ఓడిపోయామని క్రుంగిపోవడం ఎంత అవివేకమో, గెలిచామని పొంగిపోవడం కూడ అంత అనుచితమే.
- శ్రీశ్రీ, అనంతం-ప్రారంభం-ఒకటి

స్వార్థ పరిత్యాగమని, శాంతియని, దేశక్షేమమని, త్యాగమని యెన్నియో సద్గుణములను బోధించుచున్నారు. ఎంతసేపు బోధనమే. ఆచరణమన్న మాటయైన లేదు. ఇట్టి గుణములను బోధించువారైన నాచరించుటలేదా? లేదు.
- పానుగంటి, సాక్షి

అనుభవంకలవాళ్ళు చెప్పరు, చెప్పినా తెలుసుకునే స్థితిలో వుండరు చిన్నవాళ్ళు
- చలం, వివాహం

అదృష్ట దురదృష్టాలు ఆచరణ రంగంలోకి దిగిన వ్యక్తికి గాని బోధపడవు.
- భమిడిపాటి, ఎవళ్ళగొడవ వాళ్ళది

ఏటో ఈ జలము? ! బోదపడి సవ్వదు, సవ్వడానికి ఒప్పదు, బతకనివ్వదు!
- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

**బ్యాంకు ఖాతా**

గవర్నమెంటుకి ఏ నిమిషానికేనా కళ్ళుకుట్టా వచ్చు సంస్థలపేర బ్యాంకులో ఖాతా వుంటే, అంచేత వ్యక్తులపేర వుంటేనే సురక్షితం.
- లక్ష్మణరావు, అతడు-ఆమె

**బ్రహ్మ**

విత్త మొకని కిచ్చి వితరణ భరణంపుఁ
జిత్త మొకని కిచ్చి చెఱిచినాఁడు
బ్రహ్మ యాలిత్రాడు బండరేవునఁ ద్రెంప
రెండు నొకని కీక బందు చేసె.
- చాటువు

**బ్రహ్మచర్యం**

శీతలవారి స్నానము
భూతలశయనంబు నొంటిపూ టశనంబున్
నాతిగల బ్రహ్మచర్యము
నాతరమా పూట గడప? నారయభూపా!
- చాటువు

**బ్రహ్మచారి**

బ్రహ్మచారి బ్రతుకు పగవానికైనను
వద్దు రామచంద్ర! వద్దు వద్దు.
- గునుపూడి, బిడాలశాస్త్రి

**బ్రహ్మజ్ఞానం**

అర్థం కాకపోవటమే బ్రహ్మజ్ఞానానికి గీటురాయి.
- కొడవటిగంటి, అతీత జ్ఞానం

**బ్రహ్మముడి**

మనం ముందుకు రావాలంటే ఇంగ్లీషువాడిని అనుసరించి తీరాలి. ఇంగ్లీషువాడిని ఆశ్రయించి తీరాలి. వాడికీ మనకీ పుస్తెముడే. ఈవేళ యిది బ్రహ్మముడి. రేపు ఏ విప్లవమో వచ్చి అది జారుముడి కావచ్చు.
- లక్ష్మణరావు, అతడు-ఆమె

బ్రహ్మరాత

వైదీకివాళ్ళని పుట్టించినపుడే బ్రహ్మరాసిపడే శాడు? "ముష్టెత్తుకోండ్రా" అని.

- గురజాడ, కొండుభట్టీయము

బ్రహ్మాండం

మూడడుగుల్ మేరయ త్రోవ కిచ్చు టది బ్రహ్మాండంబు నాపాలికిన్.

- పోతన, భాగవతము

బ్రాహ్మణుడు

గడ్డితిని పిల్లనమ్ముకున్నావు సరేకాని, యిలాటి ఫోర్జరీలు కూడా చేయిస్తావూ? బ్రాహ్మల్లో వున్నంత ఖంగాళీ, మాలకూడూ మరెక్కడా లేదు.

- గురజాడ, కన్యాశుల్కం

బాపనోళ్ళు నచ్చావనచ్చులు, కొంచెం సెయితడి జేస్తే సాచ్చీకం చెప్పేసి పోతారు బాబూ.

- గురజాడ, కన్యాశుల్కం

మా బ్రాహ్మల్లో యిది పరిపాటే. పెళ్ళిళ్ళలో పంపించేది ఒక జాతకవూఁ నిజం వుండదు.

- గురజాడ, కన్యాశుల్కం

పెట్టడానికీ పుచ్చుకోడానికీ నియ్యోగ ప్రభువులు, తమకి చెల్లిందిగాని, మావాళ్ల ఉద్యోగాలు మంటిగడ్డ ఉద్యోగాలండి.

- గురజాడ, కన్యాశుల్కం

వివాహం చేయించడానికి నేను వైదీకిని కాను. నాకు మంత్రాలు రావే?

- గురజాడ, కన్యాశుల్కం

వైదీకపాళ్ళం మాకా శృంగారాలు యలా అను భవ వౌఁతాయండీ?

- గురజాడ, కన్యాశుల్కం

బ్రాహ్మలలో ఉపదేశం లావూ, ఆచరణ తక్కువా.

- గురజాడ, కన్యాశుల్కం

యెంతచెడ్డా బ్రాహ్మలు గదా?

- గురజాడ, కన్యాశుల్కం

బ్రాహ్మలు యంతకైనా తగుదురు.

- గురజాడ, కన్యాశుల్కం

బ్రాహ్మలు కాగానే, దేవుడి కంట్లో బుగ్గిపొయ్యి లేరు అనుకుంటాను?

- గురజాడ, కన్యాశుల్కం

యీ రోజుల్లో బ్రాహ్మణ్యం యెక్కడుంది?

- గురజాడ, కన్యాశుల్కం

బ్రాహ్మలు యిల్లు తినేస్తారు. అంతకంటే పోలీసు వాళ్ళు నయం.

- గురజాడ, కన్యాశుల్కం

ఉపనయనము చేసెడు పక్షమున రెండు గ్రామములలో బ్రాహ్మణార్థములు చేయవచ్చును; పొత్తరలు పెట్టవచ్చును, ద్వాదశీ బ్రాహ్మణుఁడుగ నమావాస్య బ్రాహ్మణుఁడుగ నుండవచ్చును; సంభావన మునకు వెళ్ళవచ్చును.

- చిలకమర్తి, గణపతి

పెండిలిలో, సదస్యసం
భావన నాడు చూడవలె
బాపనసాముల సాము లన్నియున్.

- శ్రీరాములు, తెలుగునాడు



భక్తి

వేళకు భక్తి నిలుస్తుందో నిలవదో, చేతికఱ్ఱలు మాత్రం మరువకండి.

- గురజాడ, మీ పేరేమిటి?

పామరులకు వుండే గాఢభక్తి పండితులకు వుండదు.

- గురజాడ, మీ పేరేమిటి?

తెలుగునాట భక్తిరసం
తెప్పలుగా పారుతోంది
డ్రైయినేజీ స్కీములేక
డేంజరుగా మారుతోంది.

- మల్లారెడ్డి, భక్తిరసం

అనురాగాధిక్యమున్న హృదయమందే కాని భక్తి నిలువదు.

- పానుగంటి, విప్రనారాయణ

టెంకాయల లంచంతో
దేవునికి పిటీషన్లు
తలనీలా లిస్తామని
తిరుగులేని అగ్రిమెంట్లు

- మల్లారెడ్డి, భక్తిరసం

ఒకలాగు చూస్తే భక్తి అంతా మూఢత్వమే.

- చలం, వివాహం

భక్తికిఁ బడుచందనము చుక్కయెదురు. రక్తపు వేడి యున్న దేహములో భక్తి మొలకలెత్తదు.

- పానుగంటి, విప్రనారాయణ

ఒక స్వాములవారొక గృహస్థుని యింటికి భిక్షకు దయచేసిరంట. భిక్షానంతరమున వేదాంత గ్రంథ పారాయణము చేసికొందురేమో యని తలంచియా యింటి గృహిణి యతీశ్వరుని కడకు వచ్చి "స్వామీ! భగవద్గీతలు తెత్తునా?" యని యడిగెనంట. ఆ పే రాస్వాములవా రెన్నడును విన్నదికాక పోవుటచేతం గొంత సేపాలోచించి యదియు నేమో భక్ష్యవిశేష మని భావించి "అమ్మా! ఇప్పుడు కడుపు నిండుగా నున్నది. మరిరెండు గడియలసేపు తాళి తీసికొని రమ్మ", అని యుత్తరము చెప్పె నంట!

- కందుకూరి, స్వీయ చరిత్రము

ముండ్లలో నివసింపవచ్చును. మంటలో నుండ వచ్చును. కత్తులబోనులో గాపుర మొనర్పవ చ్చును. కాని దైవచింత లేనిచోట మాత్ర మొక్క నిముస ముండందగదు.

- పానుగంటి, సాక్షి

ఈశ్వరబలము ముందఱను సత్యబలము ముందఱను మనుష్యబలమును, ధనబలమును, గవ్వకును కొఱగావు. ఈశ్వరబల మున్న పక్ష మున పూరిపుడకయు వజ్రాయుధ మగును. ఈశ్వరబలము లేనిచో వజ్రాయుధము సహి తము పూరిపుడక యగును.

- కందుకూరి, స్వీయ చరిత్రము

అన్నిరోగాలూ కూడా వంటిని జీర్ణిస్తే బహుమం చిది. వాటివల్ల భగవద్భక్తి కూడా కుదురు తుంది.

- కందుకూరి, హాస్యసంజీవని

భారతదేశంలో నిజమైన భక్తి శ్రద్ధలు ఉన్నా లేకపోయినా "బ్రాహ్మణులు" అంటే భిక్షవే స్తారు. హత్యచెయ్యటానికి వెనుకాడుతారు.

- ఆనందారామం, ఇదాభారతం?

**భక్తులు**

మారరుగా మాయదార్లు
మత భక్తులు దగాకోర్లు

- ముకురాల, నవ్వేకత్తులు

**భగీరథయత్నం**

ప్రభుత్వ కార్యాలయాల్లో ఫైల్సు సరిగ్గా సక్ర మంగా కదలడం అంటే గంగను భూమ్మీదకు తరలించినట్లే.

- తేజోవతి, విజయ

**భద్రత**

సంస్కారములో సంప్రదాయములో నున్న భద్రత లేదు.

- విశ్వనాథ, చెలియలికట్ట

గుడి కంటే యిల్లే భద్రం ఈ రోజుల్లో.

- పులికంటి, శివపూజ

ఆడదానికి మొగుడి కవుగిట్లో కూడా సోషల్ సెక్యూరిటీ లేదు.

- పురాణం, ఇల్లాలిముచ్చట్లు

కూర్చున్నవాణ్ణి కుక్క కూడా కరవదు.

- గోపీచంద్, ఆకారాలు

**భయం**

జీవితంలో సజీవమైన మృత్యువు - భయం.

- సుప్రసన్న, ఆవేశ

చావు, మృత్యువు, యముడు, ఒక్కోసారి పదాలే మనిషిని భయపెడ్తాయి.

- రంగాచార్య, మోదుగుపూలు

మొహమాటం, పిరికితనం, సంకోచం, జంకు, బెదురు, దడ యివన్నీ భయానికి లక్షణాలు.

- సూర్యారావు, ఒకగంట సంసారం

తగునిది తగదని యెదలో
వగవక సాధులకుం బేదవారల కెగ్గుల్
మొగిం జేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబు లయిన భయంబుల్.

- నన్నయ, ఆదిపర్వము

నేను స్నానాలంటే ఝడియనుగాని నూతులో నీళ్ళు తోడడం అంటే భయపడతాను.

- కందుకూరి, హాస్యసంజీవని

యెంత సాహసం గలవాడూ కూడా ధైర్యం గల వాడికి వెనుక తీస్తాడు.

- కందుకూరి, అసహాయశూర ప్రహసనము

పూళ్ళోవాడికి కాటిభయం. పొరుగూరివాడికి నీటి భయం.

- చెళ్ళపిళ్ళ, కథలు-గాథలు

కామయ్యని చంపేస్తే కామయ్యే చస్తాడు; అతని భయం వుండి పోతుంది.

- రావిశాస్త్రి, మంచిచెడ్డల్లో ఏకథ?

యుద్ధం అంటే భయం వేస్తుంది కాని, రంగం మధ్యకి దిగిపోయేక (లేదా, ఉండిపోయేక)

మాత్రం భయం గురించి మనం మర్చిపోతాం.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

భయం అలవాటైపోయిన మీదట భయం అంటే కొన్నాళ్ళకి భయం పోతుంది.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

నీడ లొకపుడు భయంకరంగా ఉంటాయి; ఒక ప్పుడు నిజస్వరూపాలకంటె భయంకరంగా ఉంటాయి.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త

భయం వేరు, బెంగ వేరు. జీవితంలో క్షణం సేపు భయపడొచ్చు కాని గంటసేపు బెంగపెట్టు కోకూడదు.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

పెట్రోలుకి నిప్పంటించినట్టు జనానికి భయం అంటుకుందంటే భగ్గున మండి అందర్నీ చుట్టుబె డుతుంది. కాని ధైర్యం అలాకాదు. అది చాలా కాలం రాజుకొని రాజుకొని ప్రజ్వరిల్లుతుంది.

- రావిశాస్త్రి, వియత్నాంవిమల వృత్తాంతం

భయపడితే నువ్వు నిజం చెప్పనే లేవు.

- రావిశాస్త్రి, నిజం

భయం అందరికీ వుంటుంది. భయపడ్డా నిల బడ్డవాడే ధైర్యవంతుడు.

- రావిశాస్త్రి, నిజం

వెలచి యెఱుఁగని నేనిప్డు వెలవవలసె
నిండు నెలకును పండు వెన్నెలకు నకట.

- చిలకమర్తి, ప్రసన్నయాదవము

ఒకదానియొక్క మొదలు చివళ్ళు మనకుఁదెలి యనిచో దానినిఁ గూర్చి భయపడుదుము. భయ మనఁగాఁ దెలియకపోవుట. అజ్ఞానము. అజ్ఞానమునకు భయ మింకొక పేరు.

- విశ్వనాథ, తెలచిరాజు

భయంలేనివాడు బ్రతకలేడు.

- వేదాంతకవి, ఆకలిమంట

హెచ్చుధరలంటే ప్రజలకుండే భయం సహజమై నది కాదు.

- కొడవటిగంటి, న్యాయసూక్ష్మాలు

హోమియోపతి మందుల్లాగే భయంకూడా చిన్న చిన్న డోసుల్లో చాలా మేలు చేస్తుంది.

- కొడవటిగంటి, స్వర్గంలో బందీలు

దరిద్రుడు తాను సంపాదించబోయే లక్షలను దొంగలు దోస్తారని భయపడ్డట్టు.

- కొడవటిగంటి, ప్రేమించిన మనిషి

లోకం వుత్త పిరికిగొడ్డు. భయపడేవాళ్ళని భయపెడుతుంది. భయపడని వాళ్ళని చూసి బెదురుతుంది.

- వఝ్ఝల చండీదాస్, హిమజ్వాల

మనిషిని చూచి మనిషికే భయం.

- ఆత్రేయ, భయం

అసలు భయపడేవాళ్లు బ్రతకటం అనవసరం.

- ఆత్రేయ, భయం

జీవితంలో భయానికంటే మించిన భయంకర మైంది మరొకటి లేదు. భయమే దుఃఖం.

- సంజీవదేవ్, మరణమనస్తత్వం

మరణభయంబు నాకు నణు
మాత్రము లేదు; మదీయ జీవసం
భరణ భయమ్మె మిక్కుటము.

- దువ్వూరి, పాంథశాల

పాపం యెక్కడుంటే భయం అక్కడే వుంటుం దని చెప్తారు.

- ముద్దంశెట్టి, ఈ అనుభవం చాలు

మిలటరీ వాళ్ళకి శత్రువుని చూసినదానికన్నా జడ్జీని చూస్తేనే భయం.

- బీనాదేవి, మిసెస్ అండ్ మిస్టర్ సక్సేనా

(నాకు) పెద్దపులిని చూసినా భయంలేదు. కాని యీ మహిళా సంఘం సభ్యురాండ్రను చూస్తే వల్లమాలిన భయం.

- సూర్యారావు, శ్రీమతులు-శ్రీయుతులు

మానవ సమాజంలో భయం అనేది ఎలా అంటు వ్యాధిలా వ్యాపిస్తుందో అలాగే ధైర్యంకూడా.

- ఆనందారామం, అద్దంలో శత్రువు

భయం లేనిచోట బాధ్యతలు కార్యరూపం చెందవు.

- కాంతారావు, వంశధార

ఆడది మగాడి బీదరికాన్ని చూసి భయపడు తుంది. మగవాడు ఆడదాని డబ్బుని చూసి భయపడతాడు.

- మారుతీరావు, ఒకచెట్టు : రెండేపూలు

నిజం చెప్పటానికి భయమెందుకు?

- మారుతీరావు, అనంతం

హత్య చెయ్యడానికి పూనుకున్నవాడు పుస్తకం తొక్కడానికి భయపడతాడా?

- మారుతీరావు, అనంతం

స్వార్థమెంత భయంకరమైందో, ఒకో సమయంలో

త్యాగం కూడా అంతే భయాన్ని కలిగిస్తుంది.
- పినిశెట్టి, పంజరంలో పక్షులు

జీవితం చుట్టూరా
గుడ్లగూబ పెట్టిన కాపలా
భయం.
- హెచ్చార్కె, సీకటన్నలు

భరతనాట్యం

అల్లటప్పాగ కాదు యమాంతకముగ
రేడియోలో భరతనాట్య మాడినాను.
- మాచిరాజు, అహం

చీకటికోణాల చిందులా టరయ
పాకమ్మ తప్పని భరతనాట్యమ్మ!
- నాయని, భాగ్యనగరకోకిల

భరోసా

మనిషిలో సాహసానికైతేనేమి, బ్రతుకులో ఆనందానికైతేనేమి మూలం భరోసా- అది లేనినాడు మనిషి జీవచ్ఛవంగా తప్ప మనిషిగా బతకలేడు.
- కాళీపట్నం, ఇల్లు

భర్త

శాస్త్రకారులు శాసనకర్తలు
జనులకు తాళికట్టని భర్తలు.
- కాళోజీ, ద్వైతజగత్తు

చాలామంది భర్తలు మోటారుకారుల్లాంటివారే! కొత్తల్లో బాగానే ఉంటారు. క్రమేపీ తెగతాగడం, పొగవదలడం ప్రారంభమౌతుంది.
- శ్రీరమణ, హాస్యజ్యోతి

వివేకి అయిన భర్త భార్య మనస్సు చలించకుండా పట్టుకురావాలి.
- కొడవటిగంటి, రాధమ్మ కూతుళ్ళు

జనక గురులనైనఁ జంపు నర్థమునకై
ప్రాణమైన విడుచు భార్య కొఱకు!
- పోతన, భాగవతము

పడ్డ అవమానం గురించి చెప్పుకునే శక్తయినా లేదు ఆడదానికి. చెప్పుకున్నా, శక్తిగల మగాడు కనిపించనైనా కనిపించడు.
- రావిశాస్త్రి, జరీఅంచుతెల్లచీర

భార్యకేకూడా డబ్బు తెత్తుండష్టే
మొగ్గా, లేకపోతే పుట్టింటికి దష్టా!
- వేదాంతకవి, తెనుఁగుతల్లి

ఆ పెన్పసంగినవాఁడును, అల్లుఁ డద్దె
యింటి యజమానుఁడును, జీతఁమిచ్చువా డు,
కులవినోదియు, పన్నులు కూర్చువాఁడుఁ
బుస్తె కట్టని మగలె పో పూరుషులకు!
- కొల్లకూరి, వరవిక్రయము

భర్త భరింపలేని మగనాంధ్రను బావులు భరించును. వాగులు భరించును. భగవానుడైన పావకుడు భరించును.
- చిలకమర్తి, కర్పూరమంజరి

ఉల్లములు నొవ్వనాడినఁ
గల్లలు చేసినను నగినఁ గలఁచిన నైనన్
వల్లభులు సేయు కృత్యము
వల్లభలకు నెగ్గుగాదు వల్లభ మధిపా!
- పోతన, భాగవతము

భవిష్యత్తు

భవిష్య త్తెప్పుడూ వర్తమానాన్ని కాదని నిలువదు.
- కిషన్, లేవరేం...

రాబోతున్న భవిష్యత్తు
అంతుతేలని కల
వింత ఆశయాల వల.
- వెంకటరంగారెడ్డి, వర్తమానగీతం

పాదరసం వంటిది
వచ్చే భవిష్యత్తు.
- చిరంజీవి, కాలరథం

భవిష్యత్తు గురించి ఆలోచిస్తే భయంవేసినప్పుడెవరన్నా గతాన్ని తలచుకొని ధైర్యం తెచ్చుకోక తప్పదేమో. వ్యక్తులయేది, జాతి అయేది, జీవితంలో అయేది, సాహిత్యంలో అయేది.
- కొడవటిగంటి, ఐశ్వర్యం

అనాగతం వేచి ఉండదు
మనిషి సిద్ధమయ్యేవరకు.
- బైరాగి, చెప్పనిది

భాగవతుడు

భాగవతోత్తముఁ డనగఁ బణ్యస్త్రీప్రాయుఁ డన్న మాట!
- పానుగంటి, విప్రనారాయణ చరితము

భాగ్యవంతుడు

రొట్టకట్టే దేశంలో పుట్టగోచీవాడే భాగ్యవంతుడు.
- సామెత

భారతదేశం

కళాశాలలో జ్ఞానం వెలగదు

దుకాణాలలో సరుకులు దొరకవు.
గుడిలో దేవుడు గైరుహాజ రని
దిగులేలా? ఇది హిందూస్థాన్!

- శ్రీశ్రీ. పంచరత్నాలు

భారత రామాయణాలు

కర్ణుడి తల భారతం; రామాయణం యొక్క ఆయువుపట్టు ఆంజనేయులు.

- వెల్లంపిళ్ల. కథలు - గాథలు

భారతీయుడు

ఏడు గంటలకు రమ్మంటే, విధిగా ఎనిమిది తర్వాత బయలుదేరే వాళ్ళే భారతీయులు.

- కౌసల్యాదేవి. శాంతినికేతన్

నాకు ఇండియన్లను చూస్తే నవ్వు వస్తుంది. తోటి మనిషి తిండి లేక చస్తూవుంటే చూస్తూ వుంటారు. రాతిదేవుడికి పట్టీకొల్లి బంగారం పెడతారు.

- సూర్యారావు. తాంతియాతోపే

ఐహికాముష్మిక జీవిత సమన్వయమే భారతీయ జీవితం.

- బుచ్చిబాబు. గొలుసు

భారం

పెద్దదాన్ని రొమ్ముమీద కుంపట్లాగ భరిస్తూనే వున్నాం.

- గురజాడ. కన్యాశుల్కం

తల్లికి భారమా శిశువు?
తామర తూటికి పువ్వు భారమా?
విల్లొక భారమా కడిఁది
వీరున, కొంటెకు గూను భారమా?
వల్లికి భారమా? ఫలము,
బట్టెకు కొమ్ములు భారమా? నుతుల్
చెల్లును లింగధారులకు
లింగపుఁ గాయలు భారమా మహిన్?

- శ్రీరాములు. తెలుగునాడు

మనుష్యుడు సాధారణ పరిస్థితిలో భరించట మన్నది తలపునకు కూడా సాధ్యం కాదనుకొనే భారాలను ఎన్నిటినో ప్రత్యేక పరిస్థితుల్లో అవలీలగా తలపై మోసుకు తిరగగలుగుతాడు.

- కాశీపట్నం. అభిశప్తులు

భార్య

ఆడకూతురు సొమ్మెత్తికెళ్లి తాగుడుకు బోసే మొగాళ్ళతో ఏ ఆడదిమటుకు పెల్లావుఁకు మల్లే వుంటదీ?

- మా గోఖలే. మార్నాల పండగ

నిజానికి మగవాడికి భార్య రాజ్యమంత గొప్పది.

- ఆచార్య. ఎవరీ మనిషి?

చక్కగా ఏపీ పెడితే డబ్బు దాచడానికి - కావాలో శ్రీమతి.

- ఆరుద్ర. ఇంటింటి పద్యాలు

తేపు కోపపడునేమోయని మాయక్క యీ దిన మునసే మా బావను మొట్టుచుండెడిది. అందు చేతనే యాతఁ డంత యోగ్యుఁ డని శౌండుఁ డని ఖ్యాతి చెందుచున్నాడు. మగవాని మంచి ప్రవర్తన మాఁడుదాని యఱచేతిలో నున్నది.

- పానుగంటి. సాక్షి

కన్యకాదానవేళలఁ గలదు చనవు
క్షితి గృహస్థులకంటె సద్గేహినులకు.

- శ్రీనాథుడు. హరవిలాసము

పతుల యనురాగ లీల లేపగిదినైన
వెలయఁ గోరియుఁ దాఁచు టింతుల గుణంబు.

- పింగళి. కళాపూర్ణోదయము

స్త్రీలు అప్పుడప్పుడు అవసరంగాని, భార్యలు కాదు.

- బుచ్చిబాబు. ఒమర్‌ఖయామ్

మొగాణ్ణి ఇంట్లో కట్టి పడేసేది భార్య. బాహ్య ప్రపంచంలో కట్టి పడేసేది న్యూస్ పేపర్.

- బుచ్చిబాబు. ఆద్యంతాలు. మధ్య'రాధ'

దీన్ని కట్టుకోబోయ్యే వాడెవడో అదృష్టవంతుడే. పాతపడ్డాడని, మొగుణ్ణి కూడా వేలంపాడును.

- బుచ్చిబాబు. కార్యదర్శి కల్యాణి

పల్లెలయందు పడుచు భార్యలు అంక చేసియ యినను పలువురిలో నిర్భయముగా తలయెత్తు కొని తిరుగవచ్చునుగాని పట్టపగలు మగనితో మాటాడి తోడివారిలో తలవంపులు లేకుండ తిరుగుట శక్యముకాదు.

- కందుకూరి. సత్యవతీ చరిత్రము

కోపం ప్రకటించినప్పుడు తను అందంగా ఉంటానని భార్య తెలుసుకుంటే, మహాప్రభో భర్తగారి అవస్థ మజాగా వుంటుంది.

- బుచ్చిబాబు. స్వతంత్రజీవులు

కూలినాలిఁ జేసి గుల్లాము పనిచేసి
తెచ్చిపెట్ట నాలు మెచ్చుచుండు

లేమిఁ జిక్కు విభుని వేమారు దిట్టును.
- వేమన

మొగుడుగల పెళ్ళామయితే యే పని చేసినా సర్దుకుపోతుంది!
- వేంకటరమణారావు, ఓన్లీడాటర్

భార్యలో ప్రియురాలిని చాలామంది భర్తలు చూడలేరు.
- సరస్వతీదేవి, బ్రతికి చచ్చినవాళ్ళు

పెండ్లి చేసికొన్నచో పెండ్లమగును. భరింపఁబడినచో భార్యయగును.
- విశ్వనాథ, చెలియలికట్ట

మగనిపైఁ గూర్మి యధికంబు మగువ కెపుడు.
- చిలకమర్తి, గయోపాఖ్యానము

మగని తోడిద లోకంబు మానవతికి.
- చిలకమర్తి, గయోపాఖ్యానము

కూచుండి కూడొండలేదు, వంగుండి తీర్థం పెడుతుందఁట.
- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

భార్య యుండిన వనమైనఁ బట్టణంబు
పత్ని లేకున్న గృహమైన బహుళగగన
మగుచుఁ గాన్పించు నరులకు, నంతయేల?
యాలు లేకున్న విధినైన నధముఁ డంద్రు.
- కదిరీపతి, శుకసప్తతి

ఆడవాళ్ళకు ఎంత తెలివి వుండి ఏంలాభం? అది రాణింపుకి వచ్చే వీలేది? ఆ తెలివి బయటపడే అవకాశం భర్త ఇవ్వకపోతే అంతా బూడిదలో పోసిన పన్నీరు అవవలసిందే.
- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

వాడ కుఱికి తిట్టు వలదన్న మొఱపెట్టు
ముందు మగనిఁ దిట్టు ముసుఁగు పెట్టు
గడుసురాలు మగని గంపతో నమ్మురా.
- వేమన

తమ బుద్ధిబలంవల్ల, ఆత్మబలంవల్ల భర్తల సహజ గుణాన్ని మార్చి సన్మార్గానికి తిప్పగలిగిన స్త్రీలు ఒక్కళ్ళు లేరు. దుర్మార్గాని కీడ్చినవాళ్లున్నారు.
- చలం, శశిరేఖ

మొగుడు లేడనే చింతే అయితే ఏ ఆడదాన్నీ కుంగదీయదు.
- కొడవటిగంటి, తీరని సమస్య

మొగాళ్లు బాగుపడే వరకూ, ఆడది గుట్టుగానే ఉండాలి. గత్యంతరం లేదు.
- భమిడిపాటి, ఇపుడు బాగు బాగు

ఆస్తో అర్జనో ఉన్నదనే హజంతో వేలకువేలు కట్నా లడిగే దౌర్భాగ్యులు దేశంలో ఉండగా లేందీ, తన ఆర్థిక స్వాతంత్ర్యాన్ని ఆధారం చేసుకుని తనకు కావలసిన భర్తను తాను వెతుక్కునే ఆడవాళ్ళు ఎందుకుండరాదు?
- కొడవటిగంటి, పెళ్ళిచేయకుండా చూడు

పెళ్ళాం పెద్దది కావటం ఆయుఃక్షీణం.
- మహీధర, ఓనమాలు

ఇరువురు పెండ్లముల మగని కిబ్బంది మరణం.
- తి.వేం., దంభవామనము

దాసీది రోజుకు కొన్ని గంటల బానిసయితే - భార్య జీవితాంతం వరకూ, రోజులోని ప్రతి నిముషమూ బానిసే!
- ధనికొండ, పవిత్రులు

తన భర్తయె స్త్రీకి ప్రేమలో
శిశువై తోచు నొకొక్క వేళలన్.
- జరుక్‌శాస్త్రి, స్త్రీ

క్యూలో నిలబడి తెచ్చిన రాళ్ళతో
అన్నం వండిపెడుతుంది
అనసూయను తలదన్నిన మాయావిడ.
- హెచ్చార్కె, నగరం

## భార్యాభర్తలు

...పతిస్నే
హమ కామినులకు బలవం
తము పెఱనెయ్యములు వేయుఁ దళ్ళస్పృశ
ములే?
- నన్నయ, ఆదిపర్వము

భార్యాభర్తలిద్దరూ ఒకరి అభిప్రాయాలు ఒకరు మన్నించాలి.
- సూర్యారావు, ఒక గంట సంసారం

ఆలు మొగుళ్ళ దెబ్బలాటల్లోకి వెళ్ళవద్దని మన పెద్దల శాసనం. అవి అభేద్యాలు, అగమ్యగోచరాలు. మధ్యవర్తులు, కాపరం చక్క చేదావఁని చెక్కలు చేసి వెళ్ళిపోయి వస్తారు.
- గురజాడ, మెటిల్డా

భగవంతుడి సృష్టిలోకల్లా ఉత్కృష్టమైన వస్తువు విద్య నేర్చిన స్త్రీ రత్నమే. శివుఁడు పార్వతికి సగం దేహము పంచి యిచ్చాడు. యింగ్లీషువాఁడు భార్యను బెటర్ హాఫ్‌అన్నాడు. అనగా

పెళ్ళాము మొగుని కన్న దొడ్డది అన్నమాట.
- గురజాడ, దిద్దుబాటు

గడనగల మగనిఁ జూచిన
నడుగులకును మడుఁగు లిడుదు రతివలు తమలో
గడ నుడుగు మగనిఁ జూచిన
నడపీనుఁగ వచ్చెననుచు నగుదురు సుమతీ!
- బద్దెన, సుమతి శతకము

మొండి చేతుల పెండ్లానికి మోరుగాళ్ల మొగుడు.
- ఉన్నవ, మాలపల్లి

విజయానికి వేసిన రాజబాటలో భర్తని ముందుకి నెట్టుకెళ్ళే భార్యల దృశ్యాన్ని చూస్తాము.
- బుచ్చిబాబు, కార్యదర్శి కల్యాణి

భార్య మెప్పుపొందిన భర్తస్థానం
గృహంలో కాదు, పిచ్చాస్పత్రిలో.
- బుచ్చిబాబు, ఆద్యంతాలు, మధ్య'రాధ'

నువ్వు మొగుడివవుతే, నేను పెళ్ళాన్నవుతాను.
- బుచ్చిబాబు, ఉత్తమాయిల్లాలు

పవిత్రతకు భయమునకుఁ జాలదూరమే. వాలు చూపులు నక్కటక్కులు పక్క కొత్తిగిల్లుటలు తప్పించుకొని తారుటలు నెదుటబడకటు జంగుటలు మొదలగు లక్షణములు, భార్యాభర్తల పవిత్ర శృంగారమున కుండునా? 'ఇమిటేషను' దంపతులకే యింత పోఁగాలము!
- పానుగంటి, సాక్షి

ఆడదానికి యీసులేని చోట మగాడి కుంటుంది. పెళ్ళాంమీది ప్రేమ ఒలకబోసే వారికంటే లేనట్టు కనిపించే వారివల్లే కుటుంబాలు చీలుతాయి.
- కాళీపట్నం, ఆదివారం

భర్త జడ్జీ అయితే భార్యెప్పుడూ జ్యూరి.
- ఆరుద్ర, నేరము-శిక్షా

భార్యాభర్తల మధ్య జీవితం అనుక్షణం ఇచ్చి పుచ్చుకోవడాల మీద ఆధారపడి సాగుతుంది.
- మహీధర, స్వయంవరణం

భార్యాభర్తలు ఒకరు చెప్పింది ఒకరు వినని నాడు ఆ బంధమే నిరర్థకం.
- రంగనాయకమ్మ, పేకమేడలు

**భార్యావిధేయులు**

అన్నదమ్ములు దమలోనఁ జిన్న పెద్ద
వరుస లెఱిఁగి యథోచిత వర్తనముల
మెలఁగుచుండుట తమయాంధ్ర సొలపు మాట
లోలిఁ జెవిఁ బడ్డ పిమ్మట నేలజరుగు?
- అనంతుడు, భోజరాజీయము

భార్యా విధేయత కృష్ణభగవాను నంతటి వాడికే తప్పింది గాదు.
- రాజారాం, మరీచిక- కారణభూతుడు

**భావకవి**

మెరుగు కళ్ళజోళ్ళు గిరజాలు సరదాలు
భావకవికి లేని వేవి లేవు
కవితయందు తప్ప గట్టివాడన్నింట!
- దేవులపల్లి, చాటువు

**భావకవిత**

ఎదియొ అపూర్వమధుర
రక్తిస్ఫురియించుగాని అర్థమ్ముకాని
భావగీతమ్ములవి...
- దేవులపల్లి, ఊర్వశి

తెనుగు కత్తి నవకవితను
తెగనరికింది!
- విశ్వేశ్వరరావు, పిచ్చిపాట

**భావన**

ప్రాణముతోనేగాని తుడిచి వేయుటకు వీలులేని భావములు కొన్నియుండును.
- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

కళల విషయంలో ఎవరి భావన వారిదీ!
- కొడవటిగంటి, బెదిరిన మనుషులు

నిర్దేశించిన భావాలను
వాక్యాలు బట్వాడా చెయ్యవు.
- ఆరుద్ర, త్వమేవాஉహమ్

**భావం**

భావములకుఁ గ్రొత్తప్రాంతలు పట్టించి
మెఱపు విఱుపు లంది మెలఁగ రాదు
పామరుల విధాన, భావముల్ నిత్యనూ
త్నములు తెలిసికొన్న తరము కొలఁది.
- విశ్వనాథ, రామాయణకల్పవృక్షము

**భావి కవిత**

ఇంక ఆఱునూఱేండ్లకు వేరు దొరతనములో కొన్ని తావుల మీబోఁటి రసజ్ఞులే బహుళమ గుదురు. వారికై మీబోఁటి రసికులే కవనములు సేయుదురు. మీవలెనే వారుభయులు చదువు

కున్నవారికన్న తామే మేలని తలంచువారే

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

**భావిజీవితం**

మానవుడు తన జీవితాన్ని సుఖంవంతం చేసి కొనడం తన చేతులలోనే ఉన్నది. కాబట్టి ఎవరి భావిజీవితానికి వారే నిర్మాతలు.

- బుచ్చిరెడ్డి, అసమర్థుని ఆత్మహత్య

**భాష**

కాలముంబట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి, దేశభాషాలలితాంగ్గి మాఱు.

- తి.వేం., పాణిగృహీత

జనని సంస్కృతంబు సకలభాషలకును
దేశభాషలందుఁ దెనుఁగు లెస్స
జగతిఁ దల్లికంటె సౌభాగ్య సంపద
మెచ్చుటాఁడుబిడ్డ మేలుగాదె

- వల్లభరాయడు, క్రీడాభారామము

ఏ ప్రఫుల్ల పుష్పంబుల నీశ్వరునకు
పూజ సల్పితినో ఇందు పుట్టినాఁడ
కలదయేని పునర్జన్మ కలుగుఁగాక
మధురమధురంబగు తెనుగు మాతృభాష

- రాయప్రోలు, ఆంధ్రావళి

ఒక్కొక్క భాషకు ఒక్కొక్కరకమైన మర్యాదలుంటాయి. తూచాలు తప్పక తెనిగించడం పెట్టుకుంటే ఈ భాషామర్యాదలు మంటగలిసిపోతాయి.

- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

పునస్సంధానపు గదిలో మాట్లాడుకోవడానికి యిప్పటి నాగరీకానికి మాతృభాష పనికిరావడం లేదు.

- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

మాతృభాష అంటే యెవ్వళ్ళకేనా వ్యావహారిక మవుతుందిగాని గ్రాంథికం కాదు.

- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

వెనకటి కవులు కొందఱూ నేఁటికవులు కొందఱూ అచ్చ తెలుఁగు కవిత్వం చెపితే అది యెక్కువ గొప్పనుకొని రచించిన ప్రబంధాలున్నాయి కొన్ని. అవి యేదో కోయ భాషలా వుంటాయి. సహజధారల్గా వుండవు.

- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

ఈనాడు సంఘంలో రావలసిన విప్లవం ముందుగా భాషలో రావాలి. భాషను మార్చడానికి భావాలను మార్చాలి. జీవితపు పోకడలనే మార్చాలి.

- శ్రీశ్రీ, అనంతం

మనః ప్రపంచానికి బాహ్యస్వరూపం భాష. భాషా విప్లవమే భావ విప్లవం

- శ్రీశ్రీ, ఒకటీ - వదీ

భాష చాలా అసమగ్రమైన పనిముట్టు. ఏ ఊహనీ అది విస్పష్టంగా, అసందిగ్ధంగా తెలియ జెయ్యలేదు.

- శ్రీశ్రీ, మరోప్రపంచం

పరువుదూలిన నీ యనాదరణకతన
మేటి నీ భాష పొలిమేర దాటలేదు.

- జాషువా, తెలుగు వెలుగు

ఆగ్రహించిరేని ఆంగ్లంబునం దక్క
దెలుఁగు భాషలోనఁ దిట్ట రెవరు
మకరకుండలాల మహిత విద్వద్వర్యుఁ
డేని నాగరకత లేని పశువు.

- జాషువా, నాకథ

ముఖ్యమైన అశ్లీలాలు ముందుగా నేర్చుకుని మరీ మాట్టాడు, అన్యభాష!

- భమిడిపాటి, కాలక్షేపం

ఇందులో ఏదో ఉందిరోయ్ అని మూర్ఖులు భయపడేటట్టు భాష ఉన్నప్పుడే మూర్ఖులు దణ్ణంపెట్టీ ఒప్పుకునేది.

- భమిడిపాటి, తుక్కుముక్కల హక్కుచిక్కు

భాష అనేది భావం దాల్చే వేషం.

- భమిడిపాటి, వేషం తగాదా

మనుష్యుడు ఇంత భాషను పెంచుకొన్నది ఆలోచనలు కలవకుండా వుండేందుకా?

- మహీధర, దేశంకోసం

ఏ భాష కవిత్వాన్ని ఆ భాషలో వింటేనే సొగసూ, రుచీ, ఆనందమూను!

- సోమసుందర్, అంగారతల్పం

వేషమునకుఁ దగిన భాష యుండవలెను.

- కోలాచలం, శిలాదిత్య

తెలుగుకి అలవాటుపడ్డ జంతువులు అరవాన్ని, ఇంగ్లీషుని అర్థం చేసుకోలేవు.

- చలం, బుజ్జిగాడు

ఉద్రేకం జాస్తి అయినప్పుడు వాడుక భాష చాలదు.

- కొడవటిగంటి, పేడకథ

కవితా చమత్కృతులును, వర్ణనలును కలిగి యుల్లాసమును బుట్టించు కొన్ని గ్రంధములు మాత్రము పద్యరూపముగా నుండవచ్చునుగాని, జ్ఞానాభివృద్ధికయి రచియింపఁబడు శాస్త్రాది కము తప్పక వచన రూపముగనె వ్రాయఁబడ వలయును.

- కందుకూరి, విద్య

మనుష్యులు బట్ట కట్టని స్థితిలో వారి మనోగత విషయాలు వారి వాక్కు ద్వారా తెలుసుకో వచ్చు. అదే ఆధారం కూడా. కాని బట్ట కట్టి తిరిగేవారు తమ నగ్న శరీరాలను కప్పే బట్ట లులానే వాక్కును తమ మనస్సులను దాచడా నికి మాత్రమే ఉపయోగిస్తారు.

- కాళీపట్నం, రాగమయి

ఛందో బందో బస్తులన్నీ
ఛట్! ఫట్ ఫట్ మని త్రెంచి
Damn it! ఏమిట్రా ఇదంటే
Pray! it is Poetry అందాం.

- శ్రీశ్రీ, కొంటెకోణాలు

ఒక్కొక్కళ్ల మాతృభాషలో అంత విషం ఉంటుందని- నాకు అంతకుముందు ఎన్నడూ ఆపోవ లేదు.

- రామకృష్ణశాస్త్రి, లాలి

భిక్షాటన

అదితి కశ్యపులకు గుజ్జు వగుచుఁ బుట్టి
యడుగుకొనలేదె నేల మూఁ డడుగు లీవు?
నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష
భిక్షమెత్తుట యిది క్రొత్త విద్యగాదు.

- చిలకమర్తి, గయోపాఖ్యానము

భిక్షువు

భిక్షువులు నాఁడును నేఁడు జగత్ప్రబోధకుల్.

- జాషువా, వ్యత్యయము

భిన్నరుచి

లోకమంతయు భిన్నరుచికమే కదా?

- ధర్మవరపు, విషాదసారంగధరము

భూతకాలం

భూతకాలం
బంగారు పంజరం.

- శివారెడ్డి, గతంనీది భవిష్యత్తునాది

భూతం

భూతాలు ముఖద్వారంలోనుంచి ప్రవేశించవు. ముఖద్వారంలోనుంచి నిష్క్రమించవు.

- గోపీచంద్, నేనూ భూతం

భూభ్రమణం

భూమి సూర్యుడి చుట్టుకాదు బ్రదర్ తిరుగుతు న్నది, రూపాయచుట్టు.

- రామదాసు, మాస్టర్జీ

భూమి

భూమి తిరుగుట లేదన్నవాఁడు భూమిపైను న్నాఁడు. అది తిరుగునని చెప్పినవాఁ డంతక పురియందున్నాఁడు

- పానుగంటి, సాక్షి

భూమి ఏ భారమయినా మోయగలదుగాని ధనికుడి భారము మోయలేదు.

- ఉన్నవ, నాయకురాలు

ఎన్ని మార్పులు వచ్చినా
యీనాటి వంకర ధాత్రి
శబ్దించలేని తంత్రి.

- కుందుర్తి, సముద్రమదనం

భూస్వామి

భూస్వాములు పాములు
భూములు వాటి కోరలు.

- హెచ్చార్కె, గురి

భేదభావం

ప్రేమవృత్తికి చండాల భేదమేల?
బ్రాహ్మణాగ్రహారమునందు పవలురేలు
విసరు పవనుండు కడజాతి వీటియందు
తాకలేక వీచునె పక్షతంత్ర జడిమ?

- రాయప్రోలు, తెనుగుతోట

భేదం

జాతికి రాజకీయాల వడదెబ్బ-
ఆశలకు వేడి వేడి వర్షాకాలం.

- జ్వాలాముఖి, కథ అడ్డం తిరిగింది

చావఁగుట్టలేని పురికొస సాలెపురుగు. తీవ్రత లేని రాజు దిష్టిపిడత. కాంతుని తల మొట్టలేని కాంత గడ్డిబొమ్మ.

- పానుగంటి, ముద్రిక

మహారాజులు - ఉన్నవారు ఎక్కువ తాగి పడి

పోతే, మేము ఉన్నంతవరకు తాగుతాం!

- పుండరీకాక్షుడు, సంఘసమస్య

అధిగమంబు వేఱు ననుభవం బది వేఱు
విద్య కివ్వి రెండు వృత్తు లరయ.

- విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము

"ఇంట గెలిచి రచ్చ గెలవమని నానుడి. కొందరు ఇక్కడా అక్కడా కూడా గెలుస్తారు. వాళ్లనే అదృష్టవంతు లంటారు. రెండింటా ఓడి పోయిన వారిని చేతగానివా ళ్లంటారు.

- బీనాదేవి, హరిశ్చంద్రమతి

ప్రబంధ కవిత్వానికి భావ కవిత్వానికి ఎంత తేడా ఉందో నవలకూ కథకూ అంతే తేడా ఉంది. భేదం కూడా ఒక్కటే- కథకు ఆవేశం ముఖ్యావసరం.

- గోపీచంద్, కథకి 'క్లయిమాక్స్'

రాజు చేస్తే రసికత్వం, చాకలాడు చేస్తే రంకు తనం.

- సామెత

పెద్దోళ్లవి పలహారాలు, చిన్నోళ్లవి చిల్లర తిళ్లు!

- భూషణం, కొండగాలి

అత్తగొట్టిన కుండ అడుగోటికుండ, కోడలు కొట్టిన కుండ కొత్తకుండ.

- సామెత

అన్నీ ఉన్న ఆకు అణిగిమణిగి ఉంటుంది, ఏమీ లేని ఆకు ఎగిరెగిరి పడుతుంది.

- సామెత

ఆవులింతకు అన్న ఉన్నాడుగాని, తుమ్ముకు తమ్ముడు లేడు.

- సామెత

ఎదుట అన్నది మాట, ఎదాన బెట్టినది వాత.

- సామెత

ఇచ్చినవాడు దాత, ఇవ్వనివాడు పాత.

- సామెత

పడుగువేయుట క్షణము, పేకనేయుటకు మాస ములు.

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

త్రవ్వి తలకెత్తినన్నాళ్లు దాత యండ్రు
లాభముం గోరినన్నాళ్లు లోభి యండ్రు

- ఏటుకూరి, ప్రేమాలోకము

అహంభావం అనేది మనిషిని అగాధాలకు లాగే స్తుంది. అమాయకత్వం పదిమందినీ ఆకట్టు కుంటుంది.

- రామచంద్రమూర్తి, మనుగడలో మలుపులు

తనను నరికేవరకూ చెట్టు, మనిషికి ఫలాన్నీ నీడనీ ఇస్తూనే ఉంటుంది. కానీ, నీడనవ్వన్న మనిషి మాత్రం నిదానంగా జీవించక - మరో ఫలానికి ఆశపడతాడు.

- రామచంద్రమూర్తి, శ్రీరాగం

దారిద్ర్యం, ఐశ్వర్యం తరతమ భేదాలున్న కలుషాలు.

- సామెత

రాత్రిదొంగల్ని పట్టడం సులభంకాని, పగటి దొంగలు పట్టుబడరు. దొంగలిస్తున్నారో, అరువు తీసుకుంటున్నారో నిర్ణయించలేరు, స్వంతదార్లు.

- చలం, అరుణ ఆర్యుమెంటు

యెంకి ప్రియుడికోసం యేడిస్తే బూతు అయింది. రాధ శ్రీనాథుడి వీధినాటకంలో కన్న బూతుగా యేడిస్తే పవిత్రమయింది.

- చలం, మ్యూజింగ్స్

ఇతరులు తనని శంకిస్తే దూషిస్తే, తప్పు అర్థం చేసుకుంటే, బలహీనుడు కుళ్ళి ఏడుస్తాడు; బల వంతుడు తంతా నంటాడు.

- చలం, మ్యూజింగ్స్

తంతివార్త చేత్తో కొడతారు. నేత్రావధానం కళ్లతో కొడతారు. అంతే భేదం.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, అనుభవాలూ - జ్ఞాపకాలూనూ

భేదాలు పై పూతలోనే! పూత కరిగిపోతే అంతా ఒకటే సరుకు

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

రైలుపెట్టెలో ముందు యెక్కి కూర్చున్నవారు బూర్జువాలు. రైలు కదిలేటప్పుడు యెక్కి నిల బడ్డవాళ్లు సోషలిస్టులు.

- పూర్ణానందం, ఆవకాయ - అమరత్వం

ఆడది లేనిది అడివి, మగవాడు లేనిది మఠం.

- సామెత

నోరుమూస్తే మూగ, నోరు తెరిస్తే రాగ.

- సామెత

నామాలవారేగాని, నీమాలవారు గారు.

- సామెత

పుచ్చుకున్నప్పుడు పుత్రుడు పుట్టినంత సంతోషం, ఇచ్చేటప్పుడు ఇంటాయన

పోయినంత దుఃఖం.

- సామెత

ఆలిని విడిస్తే హరిదాసు, సంసారం విడిస్తే సన్యాసి.

- సామెత

చక్రవర్తి చేస్తే శృంగారం. చాకలి చేస్తే వ్యభిచారం.

- సామెత

బావమరిది బతుకుగోరును. దాయాది చావుగోరును.

- సామెత

తప్పులు వెదికేవాడు తండ్రి ఒప్పులు వెదికేవాడు ఓర్వలేనివాడు.

- సామెత

కొండంత తన తప్పు గోరంత. గోరంత ఒరు తప్పు కొండంత

- సామెత

**భేదించటం**

నీళ్ళు భేదింపని వస్తువులును దురాత్ములు
దూషింపని మహాత్ములును లేరు.

- తి.వేం., బాలరామాయణము

**భేషజం**

ఉత్తగొడ్డుకు అరుపులు మెండు

- సామెత

**భోగం**

భోగసంసక్తిc జెడు జగమ్ము
ధర్మచక్ర సంక్షుణ్ణపథమ్మునందు.

- కాటూరి, ఆగస్టు 15

లోకంలో కొన్ని సందర్భాలలోనేగాదు అనేక సందర్భాలలో కట్టుకొన్న భార్యలకంటే పెట్టుకొన్న ప్రియురాళ్ళే ఎక్కువ భోగాలను భరిస్తారు.

- సభా, పుట్టగొడుగు

బొర్రలకు, భోగాలకు దగ్గర చుట్టరికం.

- ఉన్నవ, మాలపల్లి

ఏనుcగు నెక్కినాము ధర
ణీంద్రులు మ్రొక్కcగ నిక్కినాము స
న్మానము లందినాము బహు
మానములన్ గ్రహియించినార మె
వ్వానిని లెక్కపెట్ట కని
వారణ దిగ్విజయం బొనర్చి ప్ర
జ్ఞానిధులంచుc బేరుగాని
నారము నీవలనన్ సరస్వతీ!

- తి.వేం., నానారాజ సందర్శనము

**భోగి**

"కర్మ" అని తలకొట్టుకునే భోగి రోగి కాదు.

- శ్యామలారాణి, గాలివాన

**భోగిపళ్ళు**

కాణీలూ రేగిపళ్ళూ కలిపితే భోగిపళ్ళు అంటారు.

- ముళ్లపూడి, బుడుగు

**భోజనం**

"సత్రే భోజనం, మఠే నిద్ర"

- గురజాడ, కన్యాశుల్కం

**భ్రమ**

అంతరాత్మను నమ్ముకుని అది చెప్పినట్టు చేస్తే పొరపాటు జరగదన్న భ్రమ చాలామందికి ఉంటుంది.

- కొడవటిగంటి, చదువు

అప్పొప్పుల్ అపోహల్, భ్రమల్.

- ముళ్లపూడి, కబుణాపయోనిధీ!

కడుపులో లేనిది, కౌగలించుకుంటే వస్తుందా?

- సామెత

లేనిదానికి, రానిదానికి చేతులుచాచటం మనిషిలోని ప్రధానగుణం. ఆదే దుఃఖానికి హేతువు. ఆ భ్రమని జయిస్తే యతి అవచ్చు

- వెంకటకృష్ణమూర్తి, పడమటి సంధ్యారాగం

**భ్రష్టుడు**

ఉన్నత స్థానమందు గూర్చుండcగానె
భ్రష్టు భ్రష్టే యగుంగాని శిష్టుగాcడు.

- వేంకటరాయకవి, వేణుగోపాలశతకము

# మ

**మక్కువ**

ఆడదానికి అభూత కల్పనలమీద, మగవాడికి వాస్తవికతమీద మక్కువ ఎక్కువ.

- మారుతీరావు, పోయింది నిజం నిద్ర

**మగని అనుగ్రహం**

మగని యనుగ్రహమే భాగ్యవంతురాలికిcగూడ

భాగ్యము పేదరాలికిఁ బెన్నిధానము.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

### మగబిడ్డ

మగపిల్లలంటే అమ్మకం పన్ను లేని కార్గో! దాచిన బంగారం.

- కొడవటిగంటి, పంచరత్నాలు

సంపద బలిసిన వారింటిలో ఒకేసారి ఒకేనెలలో అత్త, కోడలు, మనుమరాలు వరుసగా పురుళ్లు పోసుకుంటుంటారు. కానీ ఏ కూలివాడి పెండ్లామో తీర్థమాడిందని వింటే "కూలాడికీ మగబిడ్డే" అని విస్తుపోతారు.

- సభా, ఒకనాడు

"సేద్యగాడికి కూడానా మగబిడ్డ"

- సదానంద, రామదాసు చెర

### మగవాడు

ఒక్క సీతతో శ్రీరాముడికి ఇన్ని సమస్యలు. పదహారువేలమందితో ఏ సమస్యా లేదు శ్రీకృష్ణుడికి. అతనూ పురుషుడంటే.

- చలం, మ్యూజింగ్స్

ముద్దుమొగాడికోసం ఆయిల్ పెయింటింగ్ కనుక్కున్నారు.

- బుచ్చిబాబు, ఒకేనిద్ర-ఎన్నోకలలు

మగాళ్లల్లో రెండురకా లున్నారు. ప్రతి ఆడదాన్నీ ఆకర్షించగల మనుకునే వాళ్లూ, ఏ ఆడది గానీ తమకేసి ఎందు కాకర్షించబడేది ఊహించ లేని వాళ్ళూనూ.

- కొడవటిగంటి, వారసత్వం

ఈ మొగాళ్లంతా ఒక్కటే. పదిరోజులు ఆళ్లతో కాపరం చేస్తే ఆళ్లమొహం చూడబుద్ధి అవదు.

- గోపీచంద్, కూపస్థ మండూకం

వధూటికల యిచ్చకంబులెల్ల
విశ్వసించిన మగవాఁడు వెఱ్ఱివాడు.

- కదిరీపతి, శుకసప్తతి

స్వకార్యపరుల్ మగవార లెంచఁగన్.

- కంకంటి, ఉత్తర రామాయణము

మగవారి మాట పొసఁగదు నమ్మన్.

- పింగళి, ప్రభావతీ ప్రద్యుమ్నము

మొగవా డయినవాడు యెదట నిలిచి కొట్టాలి.

- గురజాడ, కన్యాశుల్కం

ఈ పురుషలోకానికున్న వెర్రి వర్ణించలేం. ఎంత తొందరపడతారో అంత జారిపడతారు కూడా.

- వేదాంతకవి, ఆకలిమంట

పురుషులు చదువు లేనప్పుడే పశువులు. కోతికి కొబ్బరికాయవలె వారికి చదువుగూడ వచ్చినపక్షమున, స్వభావదుష్టులయిన పురుషులు పశువుల కన్నను తక్కువ వారగుదురు.

- కందుకూరి, సత్యరాజాపూర్వదేశయాత్రలు

పున్నెం కొద్దీ పురుషుడు, భక్తి కొద్దీ ఫలితం

- పులికంటి, తీయలేని కలుపు

చిన్నపిల్లలంత పిచ్చివాళ్ళు మగవాళ్లు స్త్రీల విషయంలో.

- చలం, అరుణ ఆర్గ్యుమెంటు

స్త్రీ చూపుని భరించలేక, ఉద్యోగంలో చీట్లపేకలో, క్లబ్బుల్లో, వార్తాపత్రికల వెనక ధీరంగా దాక్కుంటాడు పురుషుడు.

- చలం, వాళ్ళు నలుగురూ

ఆఁడుదాని నెత్తిమీఁదికిఁ గిరీటము వచ్చినను బేడతట్ట వచ్చినను మగవాని ప్రయోజకత్వము చేతనే కాని మఱి దేనిచేత రాఁగలదు?

- పానుగంటి, సాక్షి

వాదంలో స్త్రీని గెల్చిన మొనగాడు యికముందు జన్మించాలని రామాయణం రచించిన మీమొల్లే అంది.

- బుచ్చిబాబు, ఆత్మవంచన

అండగా తగిన ఆడది ఉన్న తరువాత మగవాడికంత బలం కామల్లు!

- కొడవటిగంటి, పెంపుడుతల్లి

ఆడసంగతులు పైసలు చెయ్యడం, మొగాడివల్ల కాదయ్యా!

- భమిడిపాటి, బాగుబాగు

స్త్రీని పురుషుడు శంకించినంత సులభంగా నిరూపించలేరు. కాని - స్త్రీని ఏ మాట అంటే తలవంచుకుని వెనక్కు తగ్గుతుందో పురుషుడికి తెలుసు. ఆ తురుపుముక్కతోనే ఆమె జీవితంతో పేకాట మొదలు పెడతాడు.

- సరస్వతీదేవి, జీవితానికొక జోడు

మగవారు కార్యవృద్ధికి బడుగులు కాని గర్భవృద్ధికిఁ బిడుగులే కారా?

- పానుగంటి, సాక్షి

మాయాశీలులు చంచలాత్ములనుకం
పాశూన్యులాత్మైకకా
ర్యాయత్తుల్ సమయానుకూల హృదయ

వ్యాపార గోపాయనో
పాయజ్జుల్ మగవార. లాపయి మహీ
పాలు ర్మహావైభవ
శ్రీయోగాంధులు సెప్పనేల మగవా
రి స్వమ్మఁ గావచ్చునే?

- రామరాజభూషణుడు, వసుచరిత్ర

మనసు మనిషి జారిపోవటం చాలా తేలిక మగవాడు ఆముదంలాంటివాడు.

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

మగవాడు పాదరసంలాంటివాడు. ఏ క్షణాన ఏ పక్కకి పాకిపోతాడో తెలియదు.

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

ఆడదానికి అభూత కల్పనలమీద, మగవాడికి వాస్తవికతమీద మక్కువ ఎక్కువ.

- మారుతీరావు, పోయింది నిజం నిద్ర

వేడి సోకిన మంచుముద్ద ఎంతసేపో నిలవ లేదు మరుక్షణమే కరిగి నీరై ప్రవహిస్తుంది. మగవాడి మనసు కూడా అంతే.

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

ఒకరు తల్లి. ఇంకొకరు భార్య. మొగవాడిని తీర్చిదిద్దేది కేవలం వీళ్లిద్దరే చాలా భాగం. జీవితాన్నే కాదు, మనసుని, సంస్కారాన్ని కూడా.

- వెంకటకృష్ణమూర్తి, పడమటి సంధ్యారాగం

మగవాళ్లని ఎప్పుడూ గజం దూరాన ఉంచాలి. కాస్త చనువుయిస్తే చాలు నెత్తిన ఎక్కుతారు.

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

మగవాళ్లు ఎలాంటివాళ్లో తెలుసా? సుతిమెత్తని ముళ్లు. గాయం అయినదాకా ముల్లు గుచ్చుకున్నదే తెలియదు. ఆ తరవాత లబోదిబోమన్నా ఒకటే, అనకున్నా ఒకటే...

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

మగవాళ్ల బుద్ధే అంత. ఊసరవెల్లుల్లాగా రంగులు మార్చే జాతి. సమయానుకూలంగా రామావతారం ఎత్తుతారు, కృష్ణావతారం ఎత్తుతారు. గజకర్ణ, గోకర్ణ టక్కుటమారంగాళ్లు.

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

**మగతనం**

సైన్సు చదవాలంటే మెదడులో మగతన ముండాలి.

- పాప, పడవప్రయాణం

తమకుఁ దామె ప్రల్లదంబునఁ బనిలేని
కయ్యమునకుఁ జనరుగాని తగిన
దురములైన దివురుదురు తమయంతన
పిటికికండ లేని బిరుదు మగలు.

- సూరన, ప్రభావతీ ప్రద్యుమ్నము

**మంగళసూత్రం**

మనిషి గుణాలన్నీ రంగురంగుల పూసలైతే, పెళ్లనేది వాటిని గుచ్చే దారం లాంటిది. బహుశా ఆ దారమే మంగళసూత్రమేమో?

- బీనాదేవి, స్వేచ్ఛాయజ్ఞం

అతులితంబైన యల పతివ్రతకుఁగాక
శుద్ధవేశ్యకు మంగళసూత్రమేల?

- వేంకటరాయకవి, వేణుగోపాల శతకము

**మజా**

జనం పంపినమీదట పాలకసంఘంలోకి వెళ్లి వెంటనే ఆ జనాన్ని మరిచిపోవటమే ఎన్నికల్లో మజా; ఒకవేళ జ్ఞాపకం ఉంచుకున్నా, ఆ జనుల్లో మొదటి జనుడు తనేగదా అనుకోడం మరీ మజా!!

- భమిడిపాటి, పాలకసంఘాల్లో ఎన్నికలమజా

**మచ్చ**

అంటరానితనం జాతికి మచ్చ. అది నిప్పుకి లేదు.

- రావిశాస్త్రి, ఆరుచిత్రాలు

చచ్చినా మచ్చ మచ్చే

- పులికంటి, లోకం నవ్వింది

**మంచి**

మనుషుల తాలూకు మంచితనం పాలమీద మీగడలా, తేలి, తెట్టకట్టి ఉండదు. సంవత్సరాలకొద్దీ కలిసి మెలసి ఉన్నా, మనుషుల అసలు స్వరూపా లేమిటో తెలుసుకోలేం...

- భరద్వాజ, కాదంబరి

లోకంలో అందరికీ మంచి చేసేవాడు పుట్టకుండానే పోయాడట.

- సామెత

మంచివాళ్లకు ఎవరైనా అబద్ధం చెప్తే వినబడదు. నిజం వినిపిస్తుంది.

- కాంతారావు, బూచీ

మంచివాళ్లు మట్టిముద్దల్లా ఒక మూల కూర్చోరు. గొప్ప పనులుచేసి గొప్పగా చచ్చిపోతారు.

- కాంతారావు, బూచీ

అత్తయేలిన కోడలు, చిత్త పుట్టిన వరిచేను బాగౌతుంది.

- సామెత

అత్తలేని కోడలు ఉత్తమురాలు. కోడలు లేని అత్త గుణవంతురాలు.

- సామెత

మంచితనం క్షణమూ, దినమంతా మంకుతనమూను.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, యావజ్జీవం హోష్యామి

మందులకంటె మంచితనం వల్లనే రోగాలు కుదురుతాయండీ.

- రెంటాల, ఇన్‌స్పెక్టర్ జనరల్

మంచితనం మల్లె పువ్వులాంటిది.

- బుచ్చిరెడ్డి, గతిలేనమ్మకు మతిమరుపుమొగుడు

మంచితనానికేనా కోరలూ గోళ్ళూ ఉండాలిరా!

- కొడవటిగంటి, బతుకుభయం

మంచివాళ్ళకు మితం కూడా తెలియదు. తమ మంచితనం ఎటుతీసుకు వెళ్లుతుందో కూడా తెలియదు.

- సరస్వతీదేవి, రాజహంసలు

మనిషి మంచితనం పెళ్ళాంపట్ల ప్రవర్తించటంలో బయటపడుతుందిట.

- కొడవటిగంటి, ప్రేమించిన మనిషి

గణిక మంచి, గ్రామకరణంబు మంచియు
మెచ్చువారు లేరు మచ్చునకును.

- కాళ్లకూరి, చింతామణి

మంచి అంత ముఖం మొత్తే వస్తువు ప్రపంచంలో మరొకటి లేదు.

- మారుతీరావు, మళ్ళీమధుమాసం

మనకి జరిగిన లాభం బట్టేగా అవతలవాడి మంచి కొలవటం?

- రాధాకృష్ణ, దంతవేదాంతం

వెనక చచ్చిన వాళ్ళ సంగతులు తవ్వుకునే బదులు, ఎదురుగుండా ఉన్న మనిషిని చూసి నిర్ణయించుకోడం మంచిది!

- రాధాకృష్ణ, ఇదేమిటి?

మంచి మాటలు సెప్పేనోడు, మంచి దారంటే యెల్తాడని యెవురు సెప్పగలరు?

- కాంతారావు, వంశధార

కాని అహంభావం అంత సుళువుగా చచ్చేది కాదు. మంచి నశించినంత తేలికగా చెడు నశించదు

- కొడవటిగంటి, ఐశ్వర్యం

మంచిపని చెయ్యడానికి ఒకరి పర్మిషన్ దేనికి?

- బీనాదేవి, ది ఎటర్నల్ ట్రయాంగిల్

మనం మంచి వాళ్ళమైతే ప్రపంచమంతా మంచే!

- ముద్దంశెట్టి, నిమిత్తమాత్రులు

మంచిదని తోచినవి తోటి వారికి చెప్పటంలో తప్పుందనుకోను.

- కె.యల్., కొత్తగుడి

మొదల నప్రియ మయ్యును దుదిఁ గరంబు
పథ్యమగు పల్కు ప్రియులందు బలిమినైనఁ
బలుక వలయు మోమోడక.

- నన్నయ, సభాపర్వము

మంచిమాట రోగాన్ని పోగొట్టే
మందులా - చేదుగా ఉంటుంది.

- సూర్యారావు, ఎవరోపిలిచారు

నిజానికి మన అంతరాత్మల్లో ఉండే అశాంతిని వుపశమింపజేసేవాళ్ళ కన్నా మనకు మంచి వాళ్ళెవరుంటారు?

- కొడవటిగంటి, చదువు

చెడుచేసి దొరికిపోని వాళ్ళందరూ మంచివాళ్ళే

- బుచ్చిబాబు, స్వతంత్ర జీవులు

## మంచిచెడ్డలు

మంచితనానికి మలేరియాలాగ డిగ్రీలుండవు. చెడ్డతనానికి నిచ్చెనమెట్లుండవు. చెడ్డతనం అవిభాజ్యం.

- బీనాదేవి, తీర్పు

మంచి వచ్చినా చెడ్డ వచ్చినా వరాసగానే వస్తుంది.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, రక్షాబంధనం

ఒక వ్యక్తి మంచి చెడ్డలు మాటలవల్ల తెలియవు. చేష్టలవల్లనే వ్యక్తమౌతాయి.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

లోకమందలి మంచి చెడ్డలు
లోకు లెరుగుదురా?

- గురజాడ, ముత్యాలసరములు

చెడ్డవారివల్ల చెప్పుదెబ్బలు తినవచ్చుగానీ,
మంచివారివల్ల మాటకాయడం కష్టం.

- గురజాడ, కన్యాశుల్కం

"బలవా నింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి"
అని గీత చెబుతూంది. ఎవడి చెడ్డవాడు దాచు
కొని, మంచినే పైకి కనపర్చుతాడు.
- గురజాడ, కన్యాశుల్కం

మంచి కీలోకం గుడ్డిది. చెడ్డ వెతకడానికి
చారెడు కళ్ళు.
- గురజాడ, కన్యాశుల్కం

మంచి చెడ్డలు యేర్పర్చగలిగినవాడు ఎవడు?
మంచిలోను చెడ్డ ఉంటుంది. చెడ్డలోను మంచి
ఉంటుంది.
- గురజాడ, కన్యాశుల్కం

మంచి చెడ్డల్ని ఆలోచించేటప్పుడు ఎవరికివారు
దానిని తమకు వర్తింపచేసుకొని ఆలోచన
ప్రారంభిస్తే సమస్య సులువుగా పరిష్కారం
అవుతుంది.
- మహీధర, ఓనమాలు

ఏ విషయం మీదయినా మనసుకుతోచే మంచి
చెడ్డ అభిప్రాయాలు సర్వస్వతంత్రంగా ఉండవు.
- మహీధర, ఓనమాలు

మరణిస్తే మిగిలేది డబ్బుకాదు; మంచి చెడ్డలు.
- సూర్యారావు, పంజరం

ప్రకృతిలోని నిమ్నోన్నతాలలాగా మనుషుల్లో
మంచి చెడ్డలు తప్పనిసరి.
- రాజారాం, కారణభూతుడు

ఒక విషయం మంచిదా చెడ్డదా అన్న తార్కిక
సంశయానికి సంఘంలో అంతగా తావులేదు.
ఎటొచ్చీ ఆ విషయాన్ని ప్రతిపాదించిన వ్యక్తి
ముతుడై ఉండాలి.
- బుచ్చిబాబు, నన్నుగురించి కథవ్రాయవూ?

మడుసులకైతే మంచుంటది, సెడ్డుంటది. బెమ్మ
రాచ్చసులకైతే అదేటుండదు. మంచీసెడ్డా నే
కుండ దొరికినోళ్ళందర్నీ బచ్చించటవేఁ ఆళ్ళ
పని.
- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

మంచిచెడ్డ లెపుడు మనములో నుండును
గాని వస్తుచయములోన లేవు.
- పానుగంటి, కంఠాభరణము

మంచిని చెప్పువాఁడు మంచివాఁడు. చెడ్డని
చెప్పువాఁడు చెడ్డవాఁడు. ఇదియే ప్రపంచ
స్వభావము.
- పానుగంటి, సాక్షి

లోకములో నభిప్రాయభేదము లెప్పుడు
నుండును. అట్లుండుటయే దేశాభివృద్ధి కత్యం
తావశ్యకము. మన తప్పులను కప్పిపుచ్చి
మంచివారని ఇతరులకు తోచునట్లు చేయవలెన
నుట కొందరి మతము. మన తప్పులను వెల్ల
డించి వానిని తొలగించి మనవారిని నిజము
గానే మంచి వారిని చేయవలెననుట మరి
కొందరి మతము.
- కందుకూరి, దేశాభిమానము

మేలు చెప్పెనేని మేలండ్రు లోకులు
చేటు చెప్పెనేని చెడ్డ యండ్రు.
- పోతన, భాగవతము

## మఠం

మఠాలూ, యతులూ నాశనం కారు. ఒక్క
యతి ఎక్కడుంటే అక్కడే మఠం!
- ఆమంచర్ల, విశ్వాంతర

## మఠాధిపత్యం

పోఁడిమిఁ బౌరోహిత్యం
బేఁడును మాఠాధిపత్య మిం పెసఁగంగా
మూఁడు దినంబులు చేసిన
వాఁడు సుమీ ఘోరనరకవాసుఁడు మీఁదన్.
- దూబగుంట, పంచతంత్రము

## మడి

నీళ్ళు లేకపోయినాకానీ వక్కసారి బురదలో
అయినా ముంచి పిడిచి ఆరవేస్తే మడిబట్ట అవు
తుంది.
- కందుకూరి, హాస్యసంజీవని

జపతపములంచు మడియంచు స్నానమనుచు
నొఁఱలుచున్నార లెముకలు గొఱుకుచుండ
కంటఁబడవు మెతుకు లొండిగంటకైన
నెందుకది యూసులెస్, వట్టి యేభ్యరాశి.
- హనుమంతరావు, లేడీడాక్టరు

## మంట

పొరుగు పచ్చగా ఉంటే, పొయ్యిలో నీళ్లు పోసిం
దట.
- సామెత

గాలిలో మంటలు కొరివి దయ్యాలు
అడవిలో మంటలు ఆకాశ దీపాలు
వేసవిలో గుడిసె మంటలు దోసాల తంటాలు.
- పోతుకూచి, గుడిసెలు - గుండెలు

ఇయ్యాల ఇంట్ల రేపు మంట్ల.
- నరసింహం, సొపలు

మతం

సమత లేనట్టి మతమది సర్వహరము.

- వీరనాగేశ్వరరావు, పడమరగాలి

మతము లన్నవి మోక్షసామ్రాజ్యమునకు
వివిధ మార్గములన్ జూపు విధులుగాని
కటకుఁ గత్తుల చాటునఁ బెరుగుచున్న
వికటమృత్యు కరాళదంష్ట్రికలు కావు.

- మాదిరాజు, జ్యోతిర్మయ దివ్యతార

మనిషిని బాటలో నడిపించే కళ్లెమన్నమాటేమో గాని కత్తికటార్లిచ్చి ఉన్మాదప్పురెక్కించడం మాత్రం చరిత్రనిండా నిండిన ఖరాబు నిజం.

- అశోక్, పీడ కలలు

ప్రజోద్యమం పెరుగుతున్న రాష్ట్రాలకు
మతాన్ని గవర్నరుగా నియమిస్తారు.

- కుందుర్తి, తెలంగాణ

మతం మొదట్లో మహా పతివ్రత
కాలం రాజుగారి గారాబు పెద్దరాణీ.

- కుందుర్తి, తెలంగాణ

మత ప్రవక్తలకి కట్టుకొన్న మానవుడు నిండుగా జీవించి, సుఖించి, ఇహంలోనే ముక్తుడవుతాడు.

- బుచ్చిబాబు, తివ్యరక్షిత

ఆర్యమతం కంటే ఉత్తమమైన మతమైతే లేదు గాని ఆ మతంలో వుండి ఆ మత ధర్మాలు నెర వేర్చుకోవాలంటే చాలా దుస్తరం.

- వెళ్ళపిళ్ల, కథలు-గాథలు

అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగవలెనోయ్!

- గురజాడ, దేశభక్తి

మతము విభూతి పండులోఁగాని చిట్టిగారెతో గాని గోపీ చందనముతోగాని నిల్చునదికాదు. పోవునది కాదు.

- పానుగంటి, సాక్షి

లంగరులేని నావలాగ మతం మనస్సుయొక్క శరీరముయొక్క స్థితినిబట్టి చెలిస్తూ వుంటుంది.

- గురజాడ, కొండుభట్టీయము

సామాన్యులకు మతము లేదు. మహర్షులకే మతము ఉంటుంది.

- విశ్వనాథ, హాహాహూహూ

మతం లేని మానవుడు మానవుడు కాడు.

- ఆత్రేయ, అశ్వఘోషుడు

ఆదిమ మానవులకు మతమే సంస్కృతి
ఆధునిక మానవులకు సంస్కృతే మతం.

- సంజీవదేవ్, సంస్కృతిపథంలో

మతం నల్లమందు
గతం ముదిమికి విందు.

- తిలక్, న్యూ సిలబస్

తన కార్య మొరు మతంబున
నొనరింపఁగ నేర నగునె యొరుని మతంబుం
దన మతము నొకఁడుగా నో
పునె చెచ్చెర నిశ్చయింపఁ బోలునె దానిన్?

- నన్నయ, సభాపర్వము

మత మనుమాట మోసము సు
మా! యిదె మూలము ధర్మపీడకున్.

- త్రిపురనేని, భగవద్గీత

గుడిపేరు పెట్టుకొని యె
క్కడి ధనమును నపహరించి కనుకట్టుగ ము
క్కడి వేడ్క లొనర్తురు క
ట్టడి జనులు; మతోపకృతి ఘటింపఁగరాదే!

- గోపాలరావు, అపూర్వసంఘసంస్కరణము

మతావేశం

మనుష్యునకు మనోవైకల్యమును దెచ్చుటలో మతావేశము వంటిది వేరొకటి లేదు.

- చిలకమర్తి, కర్పూరమంజరి

మతావేశములోనున్న మనుజు లేదైనను జేయు దురు.

- విశ్వనాథ, వేనరాజు

మతిమరుపు

మతిమరుపుతో నీళ్ళలోబడి ఈదను మరచిపో యినాడట.

- సామెత

మతి–సుతి

మతిలేని మాటా, సుతిలేని పాటా.

- గురజాడ, కన్యాశుల్కం

మదం

పొగురు పోట్లాడ మంటాది. మదం మాట్లాడ మంటాది.

- కృష్ణరావు, పాపికొండలు

మద్యపానం

సరసులకు మద్యపానము ముఖ్యముగా నుండఁ దగినది. మద్యపానము చేసినప్పుడే

మహోదయమగును.

- కొచ్చర్లకోట, అపవాద తరంగిణి

లోలంబ రాజీయం అనే వైద్యగ్రంథంలో దుఃఖ నివారణకు మందేమిటంటూ ప్రశ్నించుకొని దానికి మద్యపానాన్ని మందుగా వ్రాశాడు గ్రంథకర్త.

- చెళ్ళపిళ్ళ, కథలు-గాథలు

మధ్య

కొసరి యాఁబోతు నాఁబోతుఁ గ్రుమ్ములాడ
నడిమి లేఁబెయ్య గతి వచ్చె నాకు నిపుడు.

- శ్రీనాథుడు, కాశీఖండము

మధ్యతరగతి

సమాజం అంటే, ప్రధానంగా మధ్యతరగతి మాత్రమే! సామాజిక నియమాల మంచిచెడ్డలు రెండూ ఎక్కువగా అనుభవించేది వాళ్లే.

- ఆనందారామం, ఉరిమే మబ్బులు

మధ్యతరగతిలో చాలామందికి, తాము అన్యాయానికి గురి అవుతున్నామని తెలుసుకోవటమూ, తమ్ము చూసి తాము జాలిపడటమూ ఒక పరమార్థం.

- కొడవటిగంటి, సవతితల్లి

మధ్యవర్తి

మధ్యవర్తులెప్పుడూ గోడమీది పిల్లివాటంగా ఉండాలి.

- కొడవటిగంటి, మధ్యవర్తి

మధ్యస్థుడు లేని వాద మసమంజసము.

- పానుగంటి, సాక్షి

మధ్యేమార్గం

ఫాసిజానికి కమ్యూనిజానికి నడుమ మధ్యే మార్గం లేనేలేదు.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

మనది

మనకున్నది వర్ణవ్యవస్థ కాని జాతీయత కాదు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, కొత్తచూపు

మనం ఎక్కడుంటే అదే మనఊరు. మనతో మనసువిప్పి ఎవరు మాట్లాడతారో వాళ్లే మన వాళ్లు.

- రామచంద్రమూర్తి, అనుభూతీ-అనుబంధం

నా కందినది నాది- నాకందనిది మనది.

- కాళోజీ, నా ఇజం

మనదేమో నంబర్ వన్ డెమోక్రసీ
టు బి ష్యూర్, ఇది స్వర్గాదపి గరీయసీ
మనకున్నది ఉక్కు చట్రపు బ్యూరోక్రసీ
మనమనసులు వదలని మసి హిపోక్రసీ.

- శ్రీశ్రీ, బాలల వత్సరం

మన సంగతి మనకొక్కరికీ తప్ప కడమ అందరికీ తెలుస్తుంది.

- భమిడిపాటి, మేష్టరీకూడా ఒక ఉద్యోగమేనా?

మనశ్శాంతి

మనస్సులోని బాధ ఇంకొకరితో చెప్పుకుంటే కొంత ఆవేదన తీరుతుంది.

- నరసింహశర్మ, మనస్సాక్షి

మనశ్శుద్ధి

వ్రాఁతలను గూఁతలను గాదు చేఁతలందు
చూపవలయును మన మనశ్శుద్ధి నెపుడు.

- గోపాలరావు, అపూర్వ సంఘసంస్కరణము

మనసు

అవయవమునఁ గురుపువేయ నది మాఁటిమాఁటికి రేగినట్లు మనసునఁ గలుగుబాధ ప్రతి స్వల్పాంశము చేతను వృద్ధియగును.

- పానుగంటి, ప్రచండ చాణక్యము

ఇల్లూ ఒళ్ళూ శుచిగా వుంటే మనసు కూడా నిర్మలంగా ఉంటుంది.

- కృష్ణంరాజు, దారితప్పినా మాట తప్పినా

మనమా! వద్దిక నాదు మాట వినుమా,
మర్యాదఁ గాపాడుమా!

- తి. వేం., శ్రవణానందము

ఇనుము విఱిగెనేని యిమ్మాఱు ముమ్మాఱు
కాచి యతుకనేర్చు కమ్మరీఁడు
మనసు విఱిగెనేని మఱి యంట నేర్చునా?

- వేమన

ఏ కాలానికి మనసు యెలా వుండునో?

- గురజాడ, కన్యాశుల్కం

ఎండిన మ్రోళ్ళైనను జిగిరించునుగాని విరిగిన మనస్సు లతుకుకొనవు.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

కడుపులో దిగమ్రింగిన పక్షమున బాధలు దుఃఖము మనస్సును దహించివేయును. తల్లి తోడుతో కష్టముఁ జెప్పుకొన్న పక్షమున కొంత

మనస్సునకుఁ దెలిపిగా నుండును.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

అంతఃకరణము మలిన మైనప్పుడు మానవుని కెదుటివారి మనస్సులు కూడ మలినము లైనట్లు గనఁబడును.

- చిలకమర్తి, కర్పూరమంజరి

మనసులోని మాటను కళ్లు చెప్పినంత స్పష్టంగా నోరు చెప్పలేదు.

- వసుబాబు, ఆద్యంతాలూ - అంతర్యాలూ

మనస్సు మర్కటం వంటిది.

- గోపాలచక్రవర్తి, మాంజనేయులు మస్తిష్కం

ఎదుటి వస్తువు ఎలా ఉన్నా మనసెలా చెబితే కళ్లలా చూస్తాయట.

- సరళాదేవి, కుంకుమరేఖలు

కాతరుఁడు మదిఁగల పాముఁగాంచునెదుట, విరహి యెదుటఁజూచును లోనవెలయు ప్రియను, మెదడులోని స్వర్గము కవియెదుటఁ గాంచు మనసు చూడు మన్నట్టులే కనులు గాంచు.

- పానుగంటి, కల్యాణరాఘవము

మనసు స్వాధీనపర్చుకోవలెనని ప్రయత్నించాడు. కట్టివేసిన కుక్క గుంజుకుంటూ మొరిగినట్లు, పరుగులు ప్రారంభించింది. కుక్కయినా కొంత సేపటికి అలుపువచ్చి వూరుకుండేది. మనసు బంధించినకొద్దీ పలుపు పొడుగవుతున్నది.

- ఉన్నవ, మాలపల్లి

మనకి మనుసిచ్చినా కస్టివేఁ, మనసుచ్చుకున్నా కస్టివేఁ!!

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

చెప్పుకొన నోరులేని నీ చిత్తమందు
నెన్ని భావాలు చుట్టలై తన్నుకొనునో?

- జాషువా, గోవు

క్షోభపడిన మనసుకుఁ జుఱుకుదన మెక్కువ.

- విశ్వనాథ, తెఱచిరాజు

మనస్సును వివేకవంతము చేసికొని కంటిని మనస్సు చెప్పినట్లు వినిపించుము.

- విశ్వనాథ, వేనరాజు

మనస్సు దానిలో అది యిమిడి ఉన్నది. అది స్వర్గమును నరకముగాఁ జేయును; నరకమును స్వర్గముగాఁ జేయును.

- విశ్వనాథ, చెలియలికట్ట

కొదమ నేత్ర మపుడు ముదిరి ప్రకృతిమీఁద మోజు దప్పి మనసు బూజుఁ బట్టె.

- జాషువా, నా కథ

మానవుడు తనలోఁ దానెంత యూహించుకొనుట కావలయునో యేకాంతముగా నొక స్నేహితునితో మనసు విప్పి మాటాడుట యంత కావలయును. లేనిచో మనస్సునకు రాఁదగినంత వికాసము రాదు.

- విశ్వనాథ, తెఱచిరాజు

మనిషి మనసు రస్తామీద
గుచ్చుకుంటున్నది కంకరే.

- కుందుర్తి, అనగా అనగా

రూపంలేని మనస్సు రూపమున్న మనిషిమీద ఎంత పెత్తనం చేస్తుంది?

- విశ్వం, కోర్టు

మనసులోంచి సరైన నిర్ణయాన్ని తీయటం, పెట్టెలోంచి సిగరెట్టు తీసినంత సులభమైతే?

- విశ్వం, కోర్టు

సరిగ్గా చెయ్యలేదని అనుకుంటేగానీ... సరైనది చెయ్యడానికి మన సుండదుకదా?

- కాంతారావు, వంశధార

నోరు మారితే మనసు మారుతాదా?

- కాంతారావు, వంశధార

ఆకర్షించుకోగల శక్తివున్న మనస్సే అన్యుల ఆకర్షణకు కూడా లోనవుతుంది.

- పినిశెట్టి, పంజరంలో పక్షులు

మాటకన్నా మనస్సు బలమైనది.

- పినిశెట్టి, పంజరంలో పక్షులు

మనిషిని చూచి, మనసుని తెలుసుకోలేమండి.

- ముద్దంశెట్టి, తప్పించుకోలేవు

మనసుమీద శరీరం గుడ్డి నిఘా వేస్తుంది, శరీరం మీద మనసు వ్యర్థ విప్లవం సాగిస్తుంది.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

బయటికి వచ్చినా, మరెక్కడికి తను పోయినా, తనతోపాటే వుండే ఈ మనస్సు బాధపెడుతూనే వుంటుంది.

- బుచ్చిరెడ్డి, ఎప్పుడొస్తుంది దీపావళి

శారీరక రోగాలకు మందులున్నాయిగాని మనస్సుకు మందులేదు. మనస్సుకు వేరొక మంచి మనస్సే మందు.

- చిరంజీవి, బోలోస్వతంత్రభారత్‌కీ జై

చిత్తుగా త్రాగినా మనస్సుకు మత్తెక్కదు.

- ముద్దంశెట్టి, జ్వలిత జ్వాల

ఎడద మేక, మెదడు నక్క
మనసూ తోడేలు కుక్క.

- కాళోజీ, నాకేమైనది?

మనసు విరిగాక అతకదు. బలవంతాన అతికించినా అతుకు అతుకే.

- సుంకర, పిచ్చివాడు

ఎంత అదుపులో ఉంచుకోవాలనుకున్నా, మన మనస్సు మన స్వాధీనం తప్పి పరుగులు పెడుతూనే ఉంటుంది. అంతే, తిరిగి తిరిగి అదుపులోకి తెచ్చుకోవటానికి ప్రయత్నిస్తూ ఉండవలసిందే.

- ఆనందారామం, మళ్ళీవచ్చిన వసంతం

ఎప్పుడూ ముఖం మీదికి నవ్వొచ్చేలా మన మనసుని కాపాడుకోవడంలోనే వుంది మన గొప్పతనం.

- ఆనందారామం, అద్దంలోశత్రువు

తల్లిగానీ, తండ్రిగానీ, భార్యగానీ, కొడుకుగాని మమకార హృదయానికి అంతా ఒకటే.

- రంగనాయకమ్మ, పేకమేడలు

మనసు తెలియనివేళ
మంచియే చెడుగాయె!

- నండూరి, ఎంకిపాటలు

మధనపడే మనసుతో రాసిన రాత
అనంత విశ్వానికి వెలుగు పంచు!

- హర్షవర్ధన్, కవీ

మనస్సుతో చూడు. మసిబొగ్గు మాణిక్య మైపోతుంది.

- చాసో, ఊహాఊర్వశి

వొంటికి సులభంగా సిల్కులు తొడగవచ్చుగాని మనస్సుకు తొడగడం సులభంకాదు.

- కొడవటిగంటి, సద్యోగం

ఎన్ని కోర్కులు తంత్రంబు లెన్నియెన్ని
యెన్ని పన్నాగములు మనసున్నవేళ
నది రవంత స్తంభింపఁగ నన్ని బందు;
అఖిల సృష్టికి కారణ మగును-మనసె.

- పానుగంటి, చూడామణి

ఇంద్రియాన్ని నిగ్రహించగలిగినవారికి కూడా మనసుని పాలించడం చాతకాదు.

- చలం, మ్యూజింగ్స్

మనసు చూడమన్నట్టులే కనులు చూచు.

- పానుగంటి, సాక్షి

పనికిమాలిన యన్నింటిలోను బనికి మాలినది మనసు. సిగ్గుమాలిన యన్నింటిలోను సిగ్గుమాలినది మనస్సు. నీతిమాలిన యన్నింటిలోను నీతి మాలినది మనస్సు. దాని కదియే సాటి.

- పానుగంటి, సాక్షి

కళా సృష్టిలో మనసుతో చేసే పని, చాలా తక్కువ రకపు బజారు పని.

- చలం, మ్యూజింగ్స్

మనస్సుందే, యినప్పెట్టిలాంటిది.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

తనువున విఱిగిన యలుఁగుల
ననువునఁ బుచ్చంగవచ్చు నతినిష్ఠురతన్
మనమున నాఁటిన మాటలు
విను మెన్ని యుపాయములను వెడలునె
యధిపా?

- తిక్కన, ఉద్యోగపర్వము

## మనస్థితి

ఎవరిని ఎక్కడ ఏది గుచ్చుకుంటుందో, గాయపరుస్తుందో చెప్పటం కష్టం. ఒకప్పుడు తిట్టినా కొట్టినా బాధపడకపోవచ్చు ఒకప్పుడు చిన్న మాటే విషం పూసిన కత్తిలా గుచ్చుకోవచ్చు. అప్పుడు లేనిదీ ఇప్పుడు వున్నదీ ఏమిటంటే చెప్పలేము. అప్పటి వారి మానసికస్థితినిబట్టి స్వీకార తిరస్కారాలనుబట్టి వుంటుందది.

- చిరంజీవి, బోలో స్వతంత్ర భారత్‌కీజై

## మనిషి

మనుష్యుడే నా సంగీతం
మానవుడే నా సందేశం!

- శ్రీశ్రీ, మహాసంకల్పం

రెండు పిట్టలు కలిసుంటాయి. రెండు పుల్లు కలుసుంటాయి. కానిద్దరు మనుషులు కలుసుండరు, డబ్బు సంవందం ఏఁవీఁ లేకపోతే.

- బీనాదేవి, డబ్బు

మందిర మెరుగని దేవుడు
మనిషిగాక యింకెవ్వడు?

- సినారె, మానవగీతం

పరిస్థితులవల్ల తయారైనవాడు మనిషి. కాని ఆ పరిస్థితులను మార్చగలిగినవాడు గూడా ఆ

మనిషే. మనిషికంటే విలువైన వస్తువేదీ ప్రపంచంలో లేదు.

- చిరంజీవి, శాంతిసమరం

జానెడు పొట్టకోసం
గుప్పెడు డబ్బుకోసం
మనిషి, తనను తాను
తగలెట్టుకోడానికైనా తయారు.

- సూర్యప్రకాశ్, మంటల్లో మనిషి

మానవుడు సగం జీవితం నేర్చుకోవటంలోను, మిగిలిన సగం తాను నేర్చుకుంది తప్పని తెలుసుకోవటంతోను గడుపుతున్నాడు.

- గోపీచంద్, మానవజీవితం

తిరుగుబాటు మనిషి బతుకు.

- కాళోజీ, నా గొడవ

మనిషి లక్షణం డబ్బు దగ్గర బయటపడుతుంది!

- అనిశెట్టి, గాలిమేడలు

జంతుసంతతికన్న స్వేచ్ఛాప్రవృత్తి
ప్రజకు లవలేశ మన్నఁ జొప్పడదుగాని
దురభిమానమ్ము స్వార్థమ్ము తుఱఁగలించు.

- ఏటుకూరి, క్షేత్రలక్ష్మి

శాస్త్ర మాచార్యసన్నిధిఁ జదుపఁడేని
నిద్ధబోధంబు మది సంగ్రహింపఁడేనిఁ
దెగువ మీఱి ప్రతిజ్ఞ సాధింపఁడేని
జ్ఞాతిజయ మందఁడేని తజ్జనుఁడు జనుఁడె?

- శ్రీనాథుడు, కాశీ ఖండము

మనుష్యులకు క్రమంగా అభివృద్ధి పొందుతూ వుండడం సహజగుణం

- కందుకూరి, నవనాగరికులు

పాము క్రూరమంద్రు ప్రాణులలోనెల్లఁ
బాముకంటె నరుఁడు పాతకుండు.

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

మనిషయినవాడు, చెయ్యరాని చెడ్డా లేదు, చెయ్యలేని మంచీ లేదు. మనిషయినవాడు, పొల్పడరాని స్వార్థమూ లేదు, సాధించలేని పరార్థమూ లేదు. మనిషయినవాడు, దిగరాని నైచ్యమూ లేదు, అందుకోలేని ఉచ్చస్థితీ లేదు. మనిషయిన వాడు, చెయ్యరాని నాశమూ లేదు, చెయ్యలేని నిర్మాణమూ లేదు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, గుఱ్ఱప్పందాలు

గొప్పవాడు కావాలనుకున్న మనిషి సకల కష్టాలూ అనుభవించాలి

- సుబ్రహ్మణ్యశాస్త్రి, ఆత్మబలి

మంచితనాన్ని చంపెయ్యడం మనిషి లక్ష్యం.

- పాప, దారితప్పిన బస్సు

దేశమంటె మట్టికాదోయ్
దేశమంటె మనుషులోయ్!

- గురజాడ, దేశభక్తి

తిండి కలిగితె కండ కలదోయ్
కండ గలవాడేను మనిషోయ్!

- గురజాడ, దేశభక్తి

మనిషి కాటుకు మందు లేదన్నారు.

- గురజాడ, కన్యాశుల్కం

నరుఁడు జరాయుజములలోఁ
దరుణీ! విను ముత్తముఁడు; శ్రుతము లేకున్నన్
సరి నతఁడు బశువుఁ గావున
వరిష్ఠమగు నట్టి వినికి వలయు నరునకున్.

- తిక్కన, అనుశాసనిక పర్వము

అంతిమ విజయం కాలానిదే అనుకుంటారు కొందరు! కాదు మానవుడిదే అని గర్జిస్తాన్నేను.

- శ్రీశ్రీ, అనంతం

దేశమునుబట్టి మనుజుఁడు కాని, మనుజుని బట్టి దేశముకాదే? మనుజునిబట్టి దుస్తుగాని, దుస్తునుబట్టి మనుజుఁడు కాఁడే.

- పానుగంటి, సాక్షి

మనుష్యుఁడంత మాయకాఁడు మఱియొకఁడు న్నాఁడా? ముందునకు వాఁడే నడచును. ఆ కాళ్ళతోనే వెనుకకును వాఁడే నడచును.

- పానుగంటి, సాక్షి

ప్రతి మనుజునకుఁ దనకు లేనిదేదియో యుండవలయునని మహాభిలాష యుండును. అది తనకు నెంత కష్టము పడినను సిద్ధింపక పోవుటచే మనస్సు చెడియుండును. ఇట్టి స్థితియే క్రమ క్రమముగ నెదిగి పురుషులకుఁ బిచ్చిక్రింద దిగును.

- పానుగంటి, సాక్షి

సృష్టిలో మనుష్య లెందఱో మనుష్య ప్రకృతులన్నియెయున్నవి.ఏ రెండును సమములుగావు.

- పానుగంటి, సాక్షి

తనకిష్టమైన పనియే పైవారు చేయవలయునని, తన కనిష్టమైన పని నెల్లరు మానవలయునని, తన యసదుపాయమే యెల్లరూనిరాకరింపవల

యునని. లోకము తన కొఱకే సృష్టింపఁబడిన దనియు మనుజునకెంత గర్వము! ఎంత మౌఢ్యము! ఎంత యహంభావము! ఎంత పర నిరసన బుద్ధి! ఎంత తలతిక్క! ఎంత కొసవెఱ్ఱి!

- పానుగంటి, సాక్షి

మనుషుల తెలివితేటలముందు దేవతల తెలివి తేటలెంత?

- కొడవటిగంటి, ఆడజన్మ

మనిషికంటె ప్రపంచం గొప్పది. మనిషికంటె మనుషులు గొప్పవారు.

- అనంతం, జనార్దనరావు జ్ఞాపకాలు

దేవుడు చేసిన పాపమంతా
మనిషిలా గడ్డకట్టింది కాబోలు!

- కుందుర్తి, నాలోని నాదాలు

లోకంలో కారుణ్యాన్ని పెంపొందించేది మనిషే తప్ప ఆ పని దేముడు చెయ్యడు, ఏ జంతువూ చెయ్యదు.

- రావిశాస్త్రి, ఋక్కులు

ప్రతి మనిషీ కూడా పుట్టగానే తను పులిలా బతకాలో, ఆవులా బతకాలో, మేకలా బతకాలో తేల్చుకోడు. జ్ఞానం వచ్చాక తేల్చుకొంటాడు.

- రావిశాస్త్రి, షోకుపిల్లి బాకీ కధలు

మానవుడు ప్రతిభా జీవి, ప్రతిభా సంపత్తిలేని జీవాలు మానవ శరీరాలతో పోరాడుతున్నా అవి మృగాలే.

- సూరి, ఛంఘీజ్ ఖాన్

పేరుతో, ప్రాంతంతో, భాషతో ముడిపడి కొట్టు కుంటుందా మనిషి గుండె? మరోచోట ఊపిరా డదా?

- బుచ్చిబాబు, ఒకేనిద్ర - ఎన్నో కలలు

ఆకలేసినప్పుడు కూడా తిండికోసం తంటాలు పడని జంతువు మానవు డొక్కడే.

- బుచ్చిబాబు, దారినపోయే దానయ్య

ఎడం ఎడంగా నాటిన మొక్కలు కూడా పెరిగి నకొద్దీ దగ్గరపడి కలుసుకుంటాయి. మనుషులు పెరిగినకొద్దీ దూర మవుతారు.

- కొడవటిగంటి, ఐశ్వర్యం

మనిషిని నమ్మితే చెప్పు దెబ్బలు. అంగుతె (వంగుతే) ఎక్కుతడు, కూకుంటే తొక్కుతడు, నిలబడితె మొక్కుతడు.

- రాజయ్య, సృష్టికర్తలు

'రూలు'కన్నా ఆమనిషి ముఖ్యంగదా?

- రాజారాం, వగపేటికి..?

ప్రకృతిలో మానవుడే
పరమాద్భుత పరాకాష్ఠ.

- ఆరుద్ర, త్వమేవాఽహమ్

మాయలేని మహిమలేని
మానవుడే మన దైవము.

- అబ్బూరి, కవిత

పశువుకి ఆశాలేదు-నిరాశాలేదు. మనిషికి రెండు వున్నాయి.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

గడియారంలో చక్రంవంటివాడు మనిషి-సమా జంలోనూ బళ్ళోనూ.

- చలం, మ్యూజింగ్స్

మనుష్యుడే అన్ని అంద వికారాలకూ, అసహ్యా లకూ కారణం. సృష్టియెంతో సుందరమయింది. స్వచ్ఛమైనది.

- చలం, హంపీకన్యలు

మనిషన్నాక ఒకమాట మీదుండాల.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

ప్రతి మనిషి, చల్లగా, తెల్లగానుండే చంద మామ. రాహువులాంటి పరిస్థితులు మెల్లగా మానవ చంద్రుణ్ణి మింగేస్తుంటాయి.

- బుచ్చిబాబు, విషవలయం

కాలంతోపాటు మారని మనిషి మసైపోతాడు.

- కాంతారావు, వంశధార

యేదో ఒక వంపు లేనిది మనిషెలా అవు తాడు? మనిషికి రోగంరాని శరీరం లేదు. చంచలంకాని మనసు లేదు.

- కాంతారావు, వంశధార

మనసు వెఱ్ఱయిపోతే మనిషి లేదు.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

ఉన్నదే నలుగురికి సర్దినోడు మనిషి.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

ఆశ ఉత్తర ధ్రువం, విధి దక్షిణధ్రువం
మనిషి రెండింటి మధ్య
బంతిలా ఎగిరిపడే ప్రహసనం.

- తిలక్, న్యూ సిలబస్

మనిషి మోటా, బుద్ధి జూటా.

- కొచ్చర్లకోట, పెట్టమారి మగఁడు

పరిస్థితులకు బలయ్యేవాడు నిన్నటి మనిషి,

ఎదురు తిరిగేవాడు రేపటి మనిషి, పరిస్థితుల్ని తన స్వార్థంకోసం వినియోగించుకొనేవాడు ఈరోజు మనిషి.

- వీరేంద్రనాథ్, రఘుపతిరాఘవరాజారాం

మానవుడు రాజరాజు, అతని నవరత్న ఖచిత సింహాసనం ఈ భూతలి.

- బైరాగి, హుసేన్‌సాగర్

మనిషిగా గొప్పవాడు కావడం మంచిదిగాని, అంతస్థులోనూ, డబ్బుతోను కాదు.

- ముద్దంశెట్టి, తప్పించుకోలేవు

మనిషి చాలా చిత్రమైనవాడు. అతడెప్పుడూ వర్తమానంలో జీవించడు. భూతకాలంలో మరుగు పడిపోయిన జ్ఞాపకాలను పెకిలించా లని చూస్తాడు; లేదా భవిష్యత్తుని గూర్చి కలలు కంటాడు. కాని అతడు వర్తమానంలో జీవించాలని ఎప్పుడూ అనుకోడు...

- సుజాత, కనువిప్పు

బలధరముల పొదుగుపిండి
జల రాసుల జతలు గూర్చి
అదుపులేక పరుగులెత్తు
నదులకు ముకుద్రాళ్ళు గుట్టి
సృష్టికి ప్రతిసృష్టి జేసే
కష్టజీవి మానవుండు.

- మల్లారెడ్డి, అంధపథం

మనిషి సుట్టూ గీతలు గీసి ఆటిల్లో మసల మంటం నా సేతకాదు.

- బుచ్చిబాబు, ఉత్తమా యిల్లాలు

## మనీష

ఈ మనిషి ఆ మనిషిని బంధిస్తాడు
ఇద్దర్నీ కలిపి బంధిస్తుంది మనీష.

- ఇస్మాయిల్, స్వేచ్ఛాగానం

## మనుమార్గం

జనులకు నొడc బాటగు విధ
మున నడచుచు లోకనింద్యముల నడుగుచు మీc
దని యొకని కలిమి కులుకక
మనుజులతోc బొందిపొసcగి మనుటొప్పు నృపా!

- తిక్కన, ఉద్యోగపర్వము

## మనోధైర్యం

మతోన్మాది అయిన టెర్రరిస్టుకి, మంచి ఆశయం అని తను నమ్మినదాన్ని ఆచరించే తీవ్రవాదికి మనోధైర్యం సమానంగానే ఉంటుంది.

- చల్లా, టెలిఫోన్ ఆపరేటర్

మనోబలం చేత యెటువంటి రోగాలనైనా మళ్లించవచ్చును.

- కందుకూరి, యోగనిద్రాప్రహసనము

మనోబలం లేకపోతే దృఢనిశ్చయం కూడా కొంతకాలానికి సడలిపోతుంది.

- సరస్వతీదేవి, మెహ్తారాని

## మనోవ్యథ

పేదతండ్రి మనోవ్యథ నేకవి వర్ణింపcజాలును?

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

## మంత్రగాడు

తన మనుగడతో మనుష్య జాతికి మంచి చేసి నవాడే నిజమైన మంత్రగాడు... "మం" అన్నది మంచికి సూచన. 'త్రి' అన్నది సర్వ లోకాల్నీ సూచిస్తుంది.

- వీరేంద్రనాథ్, తులసి

## మంత్రం

మంత్రంద్వారా వచ్చే తరంగాలద్వారానే మని షిని చంపవచ్చు

- వీరేంద్రనాథ్, తులసి

భాష అనేది భావం తెలియడానికి కాని, అది అందరికీ అర్థం అయితే దాని విలువ పోతుం దనుకున్నారేమో మన పెద్దలు. ఎవరికీ అర్థం కాని భాషలో పెట్టేరు మంత్రాలు.

- బీనాదేవి, పెళ్లిపార్ఛు

మందాగ్నికి మామగారికి మంత్ర మొక్కటే కాదా!

- పానుగంటి, ప్రచండ చాణక్యము

మనిషిని గెలియడం శక్యంగాని, మంత్రాన్ని గెలియడ మెcలాగ?

- గురజాడ, బిల్హణీయము

మంత్రాలలో గొప్ప మహత్యం ఉన్నది. వుపదే శమయినవాళ్ళు తిన్నగా పునశ్చరణ చెయ్యక పోతే ఫలం కనుపడదు. అదంతా మనలోపమే కాని మంత్రము యొక్క లోపము ఏమీ లేదు.

- కందుకూరి, హాస్యసంజీవని

శాస్త్రాలనగా మంత్రాలనగా అందరికీ తెలిస్తే పాటి తప్పిపోతవి.

- కందుకూరి, హాస్యసంజీవని

బాగుపడదలచిన ఉద్యోగి మంత్రం బాసు దేవో భవ.

- నిరుద్యోగి, కార్యాలయబేతాళ విక్రమార్కీయము

మంత్రానికి అసాధ్యం వన్నది వుండగూడదు.

- గురజాడ, కొండుభట్టీయము

### మంత్రాంగం

మనుషుల మంత్రాంగాలు నిజంగా చదరంగపు ఎత్తులేమో.

- సీతారామారావు, తారాబలం

### మంత్రి

అమాత్యుని శేష చిహ్నాలు
అత డావిష్కరించిన ఎలుక కన్నాలు!

- బైరాగి, అమాత్యుని అకాలమరణం

మినిష్టరయితే చెప్పకూడదుగానీ, చాలా రాబడి వుంటుంది.

- పతంజలి, అప్పన్నసర్దార్

చదువుచున్నావె పత్రికాచయమునందు
నాంధ్రమంత్రుల రాజకీయాల రభస?

- జాషువా, నా కథ

మాటలు చెప్పి మంత్రం వేసేవాడు మంత్రి లేక మంత్రగాడు.

- భమిడిపాటి, ఇప్పుడు

అట్లొక అమాత్యు గాణ్నైతె అమలు పెడుదు
లిప్తలో ప్రణాళికల మాలికలు వేలు
'ఆఁ' అనే ప్రతిపక్షు లాహా! యనంగ
జనులు సుఖడోలికా ఝుమంఝుమల పొంగ?

- మాచిరాజు, క్రాసు

ఆపి కావ్యాలు, చేసి పద్యాలు హోల్టు
శారదాశాప కలివిమోచనము పొంది
డింగనేట్టు నిలిచి ఒక్క ఓటింగు గెల్చి
మంత్రి నౌదును నేను అమాంతముగను.

- మాచిరాజు, క్రాసు

మంత్రులకూ, అవినీతికి
మనస్పర్ధ లేలరా?
పొలయలుకల్లో వచ్చిన
పొరపొచ్చెం గురువరా!

- మల్లారెడ్డి, యక్షప్రశ్నలు

సర్వజ్ఞులు ఎవరంటే
సణుగుతా వదేలరా?
మంత్రివర్యు లుండంగా
మరియెవ్వరు గురువరా!

- మల్లారెడ్డి, యక్షప్రశ్నలు

### మందలింపు

మందలించటంలో కూడా అందం ఉంది.

- రంగనాయకమ్మ, పేకమేడలు

ఒక బ్రాహ్మడు తన కొడుకుని "చదువుకోకపోతే గాడిదెలను కాసుకొస్తావా? " అని మందలిస్తే గాడిదెల యజమాని తన కొడుకుని "గాడిదెలను కాయవుకదా? బ్రామ్మల్లాగా యేదం చదువుకుంటావా? " అని మందలించినట్లు చెప్పుకుంటారు.

- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

### మంది

చాలామంది విశ్వసించనూ విశ్వసించరు. సందేహించనూ సందేహించరు.

- చలం, మ్యూజింగ్స్

ప్రేమించే వ్యక్తులు కాని ప్రేమించబడే వ్యక్తులు కాని ఒకరికంటే మించిన కొద్దీ ప్రేమలోని తీవ్రత పలచబడిపోతుంది!

- సంజీవదేవ్, ఒకే ఒకటి

### మందు

జలుబు మందు తింటే వారం దినా లుంటుంది. తినకపోతే ఏడు దినా లుంటుంది.

- సామెత

కొండ నాలుకకు మందువేస్తే ఉన్న నాలుక ఊడిపోయిందట.

- సామెత

గాయపర్చినవాడు గాయపడి మరణించటమొక్కటె గాయానికి మందు.

- శివారెడ్డి, నువ్వు గాయపడలేదా?

ఆకలికి మందు వైద్యంలో లేదు. రాజకీయంలో ఉంది.

- రంగాచార్య, జనపదం

అడిగిన వాడు ఒక మందు చెప్తే అడగనివాడు ఐదు మందులు చెప్తున్నాడు.

- కుందుర్తి, ఇదీ నాదేశం

రొంప మందు పుచ్చుకుంటే వారంలోనూ, పుచ్చుకోకపోతే ఏడు రోజుల్లోనూ పోతుందంటారు.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

చదువు మందుగాదు జాతి రుజకు.

- జాషువా, ఇంటిగుట్టు

మనుషులకి వేసేమందు కుక్కకేస్తే చావకేంజే స్తుంది?

- నరసరాజు, స్వర్గసీమ

మానిందే మందు. బతికిందే వూరు.

- భమిడిపాటి, దగాపడిన తమ్ముడు

**మందుగుండు**

సైన్యానికి మందుగుండు సామగ్రి యెలాగో ఆంధ్ర సంసారానికి ఆవకాయ అలాంటిది.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

మందూ, మందుగుండూ రెండూ ఉంటేనే కథ నడుస్తుంది.

- రావిశాస్త్రి, నిజం

**మమత**

మనుష్యులు దూరమైనకొద్దీ మమతలు ఎక్కువ వుతాయి కాబోలు.

- మొక్కపాటి, బారిష్టరు పార్వతీశం

మడిగట్టుకు కూర్చున్న మగవాడిమీద ఆడదానికి మమత ఉండదురా.

- రామకృష్ణశాస్త్రి, ఖుదానంద్

**మరణయోగ్యత**

చావు బ్రతుకులు రెండూ సమాన దృష్టితో చూడగలిగినవాడే ఏ పనైనా చెయ్యగలుగు తాడు. చస్తాను చస్తాను అని బెదిరించి, భయ పెట్టి, సంఘదృష్టినీ, సానుభూతినీ సంపాదించ దలచినవాడు చావలేడు.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

**మరపు**

మరచిన వెత చూపుతుంది
అరచేతిలోన స్వర్గం
మరపుల మతి తెరుస్తుంది
ఊహానూతన దుర్గం.

- బైరాగి, హామ్లెట్ స్వగతం

ఒక సుఖం రుచి కష్టాలను మరిపించగలదు. ఒక కష్టం వంద సుఖాలను మరిపిస్తుంది.

- వేణుగోపాలరావు, విజ్ఞానం-అజ్ఞానం

మరుపు అనేది ఎప్పుడొస్తుంది? ఎదుటివారి మీద లక్ష్యం లేనప్పుడు, ఎదుటివాడి మాటమీద గురిలేనప్పుడు.

- బీనాదేవి, హరిశ్చంద్రమతి

మరుపు ఎంతవాళ్లకేనా ఉంటుంది. ఏ విషయం లోనేనా ఉంటుంది.

- భమిడిపాటి, నామాటే నెగ్గింది

ఎప్పుడూ చూస్తున్న మనుష్యుల గొప్పతనం మర్చిపోతుంటాం. పైవాళ్లు జ్ఞాపకం చేస్తేనే అప్పుడు కళ్లు తెరుస్తాం.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

తలపునుంచి పారిపోవటమే మరుపు.

- బైరాగి, పలాయనం

అసలు ఎప్పుడు విషయాలప్పుడు మర్చిపోక పోతే ఈ లోకంలో బతకలేమండి.

- పతంజలి, అప్పన్న సర్దార్

తగిలిన అఘాతం- తీరని అపకారం మరిచిపో లేదెవరూ.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, అనుభవాలూ - జ్ఞాపకాలూను

హిందువు లెంత భాగ్యవంతులైన, నెంత దురా చారములలోఁబడి భ్రష్టులైనఁ దమ చట్టము లను గౌరవించుట మాత్రము మరవరు.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

పెళ్లికి మంత్రాలు ఎంత ముఖ్యమో ఎలక్షన్ ముందు వాగ్దానాలు కూడా అంతే ముఖ్యం. పెళ్లయ్యాక మంత్రాలు మరిచిపోయినట్లు ఎల క్షన్లు ముగియగానే వాగ్దానాలు మరచిపోవాలి.

- వెంకటేశ్వరరావు, సమాధికడుతున్నాం చందాలివ్వండి

మరపే మనిషి జన్మకు దేవుడిచ్చిన వరమైతే మరచిపోలేకపోవటం అతనికి దేవుడిచ్చిన శాపం అయ్యుండాలి...

- రామచంద్రమూర్తి, శ్రీరాగం

**మరబియ్యం**

మంట లొలుకఁబోయు మరధాన్య మాశించి ఉడుకుఁదిత్తు లయ్యె నొడలు లెల్ల.

- ఏటుకూరి, క్షేత్రలక్ష్మి

**మరుగు**

కన్నతల్లికైనా, కనుమరు గుండాలి.

- సామెత

గాజులన్నకు బుడుబుడుక్కులవాండ్లకుఁ దెర మరు గవసరములేదు.

- నంబూరి, దుర్గావతీ

**మరునాడు**

నిన్నటి కేటుగాడు నేటి ఖూనీకోరు. ఈవేళ బడి

కెళ్ళని పిల్లడు తర్వాత జైలుకెళ్ళక మానడు.
- బీనాదేవి, తీర్పు

## మర్యాద

ఆఁడుదాని మర్యాద స్వచ్ఛమైన యుద్ధము వంటిది
- పానుగంటి, ప్రచండచాణక్యము

లోకములో మనదైన పని కావలసినప్పుడు రెండు విధములుగా నగును. మన మర్యాద పాటించి యాతలివారు చేసిపెట్టుదురు. ఈ మర్యాద లేని వారి పనులు పరుల కాశపెట్టుట వలన జరుగుచుండును.
- విశ్వనాథ, తెలుచిరాజు

మర్యాద లేనివాళ్లని అది వొప్పుగోదు, వున్న వాళ్లు దాన్ని ఒప్పుకోరు.
- బుచ్చిబాబు, తీసినతెర

మాబోటి బీదవాళ్లపాలిటి మృత్యువు మర్యాదే బాబూ.
- బుచ్చిబాబు, తీసినతెర

కొద్దిరోజులు జరిగే మర్యాద చాలాకాలం జరగదు.
- కొడవటిగంటి, చదువు

మర్యాద చేయించుకోవటంలో చాలా ఆనందం ఉన్నది. అర్హత మాట ఏమైనప్పటికీ.
- కొడవటిగంటి, అనుభవం

అవతలివాణ్ణి నీతో సమంగా చూచుకోవటమే నిజమైన మర్యాద.
- కొడవటిగంటి, అనుభవం

పెంపుడుముండ. మర్యాద సంగతి దానికేమి తెలియును?
- కొక్కొండ, చింతామణి

రాలలో మ్రోగు వాద్యాలు
పూలలో దాగు మర్యాదలు.
- దాశరథి, పునర్నవం

మర్యాదలో మహమ్మదీయుల్ని మించినవాళ్లు లేరు. తలుచుకుంటే అమర్యాదలో కూడా!
- చలం, అరుణ ఆర్గ్యుమెంట్

అగ్ని గుండాలవారి మర్యాద గొప్ప
ప్రేమతో వారు పెట్టెడు పెట్టు గొప్ప
భానుఁ డపరాద్రి లోపలఁ బడక మున్న
నింతలోపల ప్రాణంబు లెడల కున్న!
- వీరభద్రకవి, చాటువు

మర్యాదగా మాట్లాడటం ఒక కళ.
- రామమోహనరావు, త్రినేత్రుడు

## మల్లెపూవు

మల్లెపూల తెల్లదనం, పరిమళం మనుషుల హృదయాలకు ఉంటే ఎంత బాగుండును?
- బుచ్చిరెడ్డి, తప్పు

నీ హృదయపు కథ విప్పి చెప్పటానికి
ఒంటరితనాన్ని ఒంటరి చేయటానికి
మల్లెలకు మించినది ఏదీలేదు.
- బైరాగి, మల్లెపూలు

## మసీదు

నమాజు చేయబోతే మసీదు మీద పడ్డట్టు.
- సామెత

## మహాకవి

ఎన్నెన్ని జన్మాలెత్తి
ఎంత పొంకంగా రాసినా కథకుడు
మహారచయిత అనబడడు.
- కాళోజీ, సరస్వతీపుత్రుల్లారా!

## మహాత్ముడు

నడుం వంచినవాడే నేడు
అక్షరాల మహాత్ముడు.
- తిరునగరి, పురోగమనం

లోక జీవనపు చండభాను తప
నాగ్ని ధాకలకు తాళినవాడే
మహాత్ము డనగా మహర్షి యనగా.
- రమణారెడ్డి, ధమ్మఘోష

మహాత్ములు కాబోయేవారంతా మొదట పిచ్చివా రిలానే కనబడతారు.
- చిన్నబాబు, డబ్బు

ప్రణయము లామరణాంతములు, కోపములు తక్షణ భంగురములు, త్యాగములు నిశ్శంక ములు నగుట మహాత్ములకు సహజము.
- చిన్నయసూరి, మిత్రలాభము

మద్యం, మాంసం విసర్జించినవాళ్లే మహానుభా వులైతే, దేశంలో దున్నపోతుల కంటె మహాను భావులు మరెవరూ ఉండరు.
- రావిశాస్త్రి, ఋక్కులు

అనంతకాలము మీద సముద్భవించిన మహాపు రుషుల బోధలన్నియు వ్యర్థము లైనవని చెప్ప వచ్చును.
- విశ్వనాథ, నందోరాజా భవిష్యతి

మహాపురుషులు ప్రపంచానికి రెండు విధాల వుపకరిస్తారు- కార్యాలవల్ల, బోధనవల్లా, రెండోది తమ దర్శన సాంగత్యాలవల్ల.

- చలం, మ్యూజింగ్స్

## మహాయోగం

జరగడానికి వీల్లేని మహాయోగాలు, జాతకాల్లో పట్టినప్పుడు గొప్ప మేలుకు బదులుగా గొప్ప కీడు సంభవిస్తుంది.

- గురజాడ, కన్యాశుల్కం

## మహారాజు

పోయినవాండ్లే మహారాజులు.

- ఆళ్వారుస్వామి, ప్రజలమనిషి

## మహావాక్యం

అబ్బ, తెనుగులో కాంప్లెక్స్ సెంటెన్స్ మహాకష్టం.

- బుచ్చిబాబు, ఆద్యంతాలు, మధ్య'రాధ'

## మహిమ

కట్టెలు కదిపినచో నిప్పుమండును. తాకిడి తగిలినచోఁ బాము పడగ యెత్తును. మనుజుడు క్షోభపడి తన మహిమను దాను పొందును.

- విశ్వనాథ, తెలుచిరాజు

కాని కాలాలు వచ్చినవి, యిప్పుడు దేవుళ్ల మహిమా విస్తారంగా కనపడటం లేదు.

- కందుకూరి, హాస్యసంజీవని

## మహిళాసంఘం

సంసారం అనే ఎడారిలో మహిళాసంఘం 'ఒయాసిస్సు' వంటిది.

- సూర్యారావు, శ్రీమతులు-శ్రీయుతులు

## మహోత్తమం

ఏపని అయినా ఆత్మను చంపని ఉద్యోగం మహోత్తమం.

- బాపిరాజు, కోనంగి

## మాజీ

మాజీమంత్రులు వుంటే ఎంత? చస్తే ఎంత?

- పతంజలి, అప్పన్న సర్దార్

పనీపాటూ లేని రిటైరయిన ఉద్యోగికి చచ్చే పర్యంతం హాబీ ఆఫీసుల చుట్టూ తిరగటం. పెన్షను, పి.ఎఫ్. రాబట్టుకుందామని ప్రయత్నిస్తూ శేషజీవితాన్ని గడుపుతారు. మాజీ ఉద్యోగినయినా సరే, ప్రభుత్వం సోమరిగా కూర్చోపెట్టదు.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

## మాట

మాన్పగలిగితి కత్తికోతలు,
మాన్ప వశమే, మాట కోతలు?
కత్తి చంపును, మాట వాతలు
మాన వేనాడున్.

- గురజాడ, లవణరాజుకల

పుస్తకంబులలోని మాటలు
విస్తరించుచు, ననుభవమ్ముల
తత్వ మెరుగక, శుకము లగుదురు
వొట్టి శాస్త్రజ్ఞుల్!

- గురజాడ, లవణరాజుకల

మాటలు నేర్చిన శునకాన్ని వేటకి పంపితే ఉసు కోమంటే ఉసుకోమందిట.

- గురజాడ, కన్యాశుల్కం

నే చెప్పిన మాట ఈ భూప్రపంచంలో యవడూ కొట్టివేయలేడు.

- గురజాడ, కన్యాశుల్కం

మాటలకున్న విలువ, శక్తి చేతలకు లేదు.

- బాపిరాజు, గోనగన్నారెడ్డి

కవి వాక్కు వృథా కాదంటారు.

- సభా, ప్రజాసేవకుడు కాళాస్త్రి

మనిషి మిగల్డుగానీ, మాట మిగిలిపోతుంది.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

ఏ మనిషి దగ్గర ఆ మనిషి మాట కాకపోతే, ఒక మనిషి దగ్గర మరో మనిషి మాట అంటారా?

- బుచ్చిబాబు, ఆత్మవంచన

కలిసి బతకాలంటే మాట కలుపుకోవాలి.

- సరస్వతీదేవి, అడ్డుతెరలు

నూఱు మాటలాడవచ్చును గాని యొకమాట నెరవేర్చుట దుర్లభము కదా!

- తి.వేం., పాండవోద్యోగము

మాటకి అక్షరజ్ఞానం కావాలి. బొమ్మకి కన్ను చాలు.

- భమిడిపాటి, టాకీ

ఎదిరికి హితమునుఁ బ్రియమును
మది కింపునుగాఁగ బలుకు మాటలు పెక్కై
యొదవినను లెస్స యటుగా

కిది యది యన కూరకునికి యెంతయు
నొప్పున్.
- తిక్కన, ఉద్యోగపర్వము

మాటకు వశుఁడుకాని మనుజుఁడేఁడీ? మాట కున్న శక్తి మనుజున కెక్కడిది? మాట కున్న వేగము గాలి కెక్కడిది? మాట కున్న మైకము కల్లున కెక్కడిది? మాట కున్న యాకర్షణ శక్తి భూమి కెక్కడిది?
- పానుగంటి, సాక్షి

ఒక పరుషమైన వాక్యం పూర్తివాక్యం కానక్కర లేదు. అందులోని ఒక్కమాట చాలు జీవి తాంతం వెంటాడి వేధించవచ్చు స్థలాంతరా లకు సైతం వ్యాపించే శక్తి ఈ మాటలకు వుంటుంది.
- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

చలిపిడుగులు మా వాక్కులు
జడివానలు మా సూక్తులు.
- మల్లారెడ్డి, మహర్షులు

మనుష్యులు యెటు వాలుబడితే అటు మాట్లా డుతుంటారు.
- ఉన్నవ, మాలపల్లి

మాటకు పడిచస్తాం కాని మూటకు పడిచస్తామా?
- సామెత

మాటలచేత మాన్యాలు పొందవచ్చు
- సామెత

నాగరికం లేనిమాట నాలుకపై తీట.
- సామెత

పగటిమాటలు పనికిచేటు, రాత్రి మాటలు నిద్రకు చేటు.
- సామెత

నూతిలోని సూదిని తీయవచ్చేమోగాని నోరు జారిన మాటను వెనక్కు తీసుకోలేం.
- వసుబాబు, ఆద్యంతాలూ-అంతర్యాలూ

భావవ్యక్తీకరణకు అసమర్థులైన మానవులకు మాటలు అంతిమ శరణాలయాలు.
- రామమూర్తి, అగ్నిగర్భ

మనస్సులు మాట్లాడుకోగలచోట, అంతరంగాలు నిండుగా ఉన్నవేళ మాటలకు స్థానం ఉండదు.
- కౌసల్యాదేవి, శాంతినికేతన్

మనుష్యులు బట్టకట్టని స్థితిలో, వారి మనోగత విషయాలు వారి వాక్కుద్వారా తెలుసుకోవచ్చు అదే ఆధారం కూడా. కాని బట్టకట్టి తిరిగేవారు తమ నగ్న శరీరాలను కప్పే బట్టలు లానే, వాక్కును, తమ మనస్సులను దాచడానికి మాత్రమే ఉపయోగిస్తారు.
- కాళీపట్నం, రాగమయి

కొన్ని మాటలు అర్థం కాకపోతేనే అందం.
- సులోచన, మామూలుమనిషి

మాటలు నేరకున్న నవ
మానము న్యూనము మానభంగమున్.
- చాటువు

చెలిమియుఁ బగయును దెలివియుఁ
గలఁకయు ధర్మంబుఁ బాపగతియును బెంపుం
దులువతనంబును వచ్చును
బలుకుఁబడిన కాన పోసఁగఁ బలుకఁగవలయున్.
- తిక్కన, ఉద్యోగపర్వము

కోట్లకి విలువైన మాట అన్నావు బావా?
- గురజాడ, కన్యాశుల్కం

పదుగు రాడు మాట పాటియై ధరఁ జెల్లు
ఒక్కఁ డాడు మాట యెక్క దెందు
ఊరకుండువాని కూరెల్ల నోపదు.
- వేమన

## మాతృత్వం

మాతృత్వానికి మొగుడనే ఒక లైసెన్సు వుండాలి. లేనిపక్షంలో అది ఒక శాపంలా అయిపోతుంది.
- బీనాదేవి, స్వేచ్ఛాయజ్ఞం

## మాతృప్రేమ

ప్రేమ అంత ఘాతుకమైన బలవంతం ప్రపం చంలో లేదు. అందువల్లనే తల్లిప్రేమ అంత వుక్కిరిబిక్కిరి.
- చలం, మ్యూజింగ్స్

## మాదేశం

హిమాద్రి మొదలుగ కుమారి వరకూ
హిందూస్తానం మాదేశం
సమస్త భాషా జాతి మత సరిత్
సంగమ జలనిధి మాదేశం.
- వరదాచార్యులు, మాదేశం

## మాధుర్యం

అన్యాయముగా వచ్చిన ధనము ననుభవించు టలో నున్న మాధుర్యము న్యాయముగా వచ్చిన దాని యనుభూతిలో లేదు.
- విశ్వనాథ, నందోరాజా భవిష్యతి

**మానధనుడు**

సమరమం దడ్గు దిరుగక చచ్చుటంటెఁ
బలికి బొంకక నిజమునఁ బరఁగుకంటె
మానధనులకు భద్రంబు మఱియుఁగలదె?

- పోతన, భాగవతము

బ్రతుకవచ్చుగాక బహుబంధనములైన
వచ్చుఁగాక లేమి వచ్చుఁగాక
జీవధనములైనఁ జెడుఁగాక పడుఁగాక
మాటఁ దిరుగలేరు మానధనులు.

- పోతన, భాగవతము

**మానం**

మానము గోల్పోయిన ప్రాణ మేటి, కిఁక
నెన్నా ళ్లీ ప్రజాపీడనల్?

- రాఘవశర్మ, పాంచాలి

**మానవత్వం**

మానవత్వం మాత్రం
ప్రతిరోజూ ప్రతిక్షణం పుట్టిచచ్చే
వెలుగు కిరణం.

- నగ్నముని, కొయ్యగుర్రం

**మానవుడు**

ఎందుకో మనిషి ఏమీలేని రోజుల్లో కష్టాల్లో, బాధల్లో ఇతరులతో కలిసివుంటాడు. అన్నీ వున్న రోజుల్లో సుఖాల్లో సంతోషాలతో విడిపోతాడు. ఇది మానవనైజం.

- ఇనాక్, విష్‌యు హేపీ క్రిస్మస్

మనసును సమాధానపర్చుకోవడం, పరిస్థితుల కనుగుణంగా సర్దుబాటు చేసుకోవటం, చేసుకొన్న నిర్ణయాలను సమర్థించుకోటం అనేది మానవుడు సృష్ట్యాది నుంచి అవలంబిస్తూన్న ప్రక్రియలు.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

మానవజాతి సూక్ష్మమతి,
మాధవుఁ డిచ్చటనే జనించెడున్.

- విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము

చిత్రంగా ఉంటాయి. అమ్ముడుపోతాయి. బాధకి రుద్ధమైపోతాయి. చిత్రంగా చాలా చిత్రంగా ఉంటాయి ఈ మానవకంఠాలు.

- రావిశాస్త్రి, కలకంఠి

కష్టము వచ్చేటప్పటికి మానవులంతా ఒకటేనేమో; అందులో ఆ మానవవత స్త్రీలలో మరీ యెక్కువేమో!

- మొక్కపాటి, బారిష్టరు పార్వతీశం

ఆణవ శక్తికన్న
మానవశక్తి మిన్న.

- శ్రీశ్రీ, ఖడ్గసృష్టి

నిప్పులోంచి అప్పుడప్పుడు పొగ పుడుతుంది.
నీళ్ళలోంచి విద్యు త్తను సెగ పుడుతుంది.
ఈ దానవ లోకంలో ఎన్నటికైనా
మానవులని పిలువదగిన తెగ పుడుతుంది.

- దాశరథి, రుబాయీ

**మామ**

అల్లుడు మామల తగవు తలలో పేని సందం.

- కొంతారావు, వంశధార

**మామూలు**

పెద్ద వుద్యోగులకు పెదపెద్ద మామూళ్లు
పెద్దమ్మయే వార్ని పెంచుకుందేమో!

- రైతు భజనావళి

డిప్టీ కలెక్టరుగారికీ సబుమేజిస్ట్రేటుగారికీ ఆఫీసులో వారికీ యేటా ఇచ్చే మామూళ్ళువున్నా కేసు వచ్చినప్పుడు వేరే ఇవ్వక తప్పదండి.

- కందుకూరి, హాస్యసంజీవని

బంతి భోజనా లయినాకే యేనాదాళ్ళకు యెంగిలాకులు! పండగెళ్ళిన మర్నాడే పాకీవాళ్ళ మామూళ్ళు.

- కొడవటిగంటి, ఎండమావులు

మామూలిచ్చి నోరు కట్టేసిన తర్వాత గప్‌చిప్‌గా వూరుకోవాలి.

- అనిశెట్టి, గాలిమేడలు

**మాయ**

కలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్?

-పెద్దన, మనుచరిత్ర

దేముడు చేసే అనేక మాయల్లో అతి గొప్ప మాయ ఇదే. నువ్వేది కోరుతావో అది చిక్కదు. ఏది చిక్కుతుందో అది కోరవు.

- వెంకటకృష్ణమూర్తి, పడమటి సంధ్యారాగం

బోధపడని దానికే, ఔననియుఁ, గాదనియుఁ గూడఁ జెప్పుటకు వీలులేని దానికే, వేదాంతులు 'మాయ' యని పేరు పెట్టినారు.

- పానుగంటి, సరోజిని

స్త్రీత్వంలోని 'మాయ' శరీరాన్ని తాకి శోధించిన

వాళ్లకి కాని తెలియదు.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

ఇవి మాయకే రోజులు

- చిలకమర్తి, వోట్లకై తిరుగుట

తేలు మాయ కావచ్చు కాని తేలుకుట్టు బాధ మాయకాదు.

- చలం, మ్యూజింగ్స్

తెరమీద చూపిస్తున్నదే మాయ. ఆ మాయను కూడా మాయగా చూపిస్తారు మాయ వెధ వలు.

- కాళీపట్నం, నో రూమ్

ప్రపంచమంతా మాయ అయినా, అనుభవం మాయకాదు. ఆ అనుభవం మాయ కాకపోతే అనుభవాన్ని కలిగించే అందాలు, విచారాలు మాయ కావు.

- చలం, మ్యూజింగ్స్

ఉన్నది దాచుకుంటాననే వాడికీ దేవుడి భయం లేదు. నీది లాక్కుని పంచుతాననే వాడికీ దేవుడు లేడు. అందుకని పశుబలం, యుక్తీ, తెలివీ, ఇవే ప్రాబల్యంలోకి వొచ్చాయి. ధర్మం, న్యాయం, సత్యం అనేవి ఉత్తమాయమాట లైనాయి.

- చలం, మ్యూజింగ్స్

## మారు పేరు

ఆడదానికి మరోపేరు... పాపం పిచ్చిది.

- ఆనందారామం, ఆడదానికి మరోపేరు

ఉడుకు పేరువల్ల అనేక ప్రాఫిట్స్ ఉన్నాయి. ఏడ్చేవాణ్ణి అతి త్వరగా, కానీ ఖర్చు లేకుండా ఏడిపించవచ్చు కోప్పడేవాణ్ణి ఇంకా కోప్పడేటట్టు చెయ్యచ్చు

- భమిడిపాటి, బాగుబాగు

## మారుమనువు

మారు మనువు దాన్ని కట్టుకుంటే మొదటి మొగుడు సోది మొదలెట్టింది.

- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

## మార్గం

పరిస్థితుల్ని మనం శాసించలేనప్పుడు, పరిస్థి తులు శాసించినట్లు బ్రతకాలి.

- తాళ్లూరి, శ్రావణసంధ్య

నిజమైన జ్ఞానతృష్ణే విద్యకు రాజమార్గం.

- లల్లాదేవి, శ్వేతనాగు

అఖాడాకి వొస్తేగాని పరబ్రెమ్మం పట్టుపడ్డం యెలాగు?

- గురజాడ, కన్యాశుల్కం

సత్యానికి వక్కటే మార్గం. కాని అబద్ధానికి అన్నీ మార్గాలే.

- కందుకూరి, కలిపురుషశనైశ్చర విలాసము

మంచాడదాని మనసు సంపాయిచ్చాలంటే రొండే రొండు మారగాలు. ఒకటి మంచితనం, రెండు మాటకారితనం! ఈ రొండున్న సరె మూడోది గుండెనిబ్బరం. అదుంటెగాని ఆడది లొంగదు.

- రావిశాస్త్రి, బంగారిగాడి కత

నేరం చేసి తప్పించుకుపోవడానికి అన్నీ సందులే.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

## మార్గాంతరం

పొమ్మనక్కర్లేదు, పొగబెడితే చాలు.

- గురజాడ, కన్యాశుల్కం

## మార్పు

నేటి అత్యున్నత శిఖరము
రేపు పెన్పల్లము నిఖరము
ఎందులకీ కొలమానమ్ములు?
దండుగ మన ఉపమానమ్ములు?

- ఆరుద్ర, ఇసుకగడియారం

పురాణం విన్నప్పుడు పుట్టెడు బుద్ధులు, అవతల పోతే అదవ (అపర) బుద్ధులు.

- సామెత

కళత్ర నష్టమైనప్పుడు ముసలివాడు తప్పక పడుచువా డగును.

- చిలకమర్తి, నవ్వులగని

జీవితంలాగే ఊరుకూడా రోజురోజుకీ మారు తోంది.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

దశాబ్దాల తరబడి జీవితంలో మార్పు లేకపో యినాక జనం మార్పంటే భయపడతారు.

- కొడవటిగంటి, అనామిక

ప్రత్యక్షంగా జరిగే ఏ మార్పునైనా సహించి మనసు సరిపెట్టుకోవచ్చు కాని పరోక్షంగా జరిగే మార్పులు గురించి మనసు సమాధానప రచుకోవటం చాలాకష్టం.

- కొడవటిగంటి, అట్టడుగు

జీవితంలో మనం నిజంగా పాటించేది స్థాయి కాదు. పరిణామగతి.

- కొడవటిగంటి, భార్యా రూపవతీ..

ఏ మార్పులయినా బలాత్కారంగా పరిస్థితుల ప్రోద్బలంవల్ల జరగవలసిందేను.

- కొడవటిగంటి, అనామిక

మనుషులు మార్తుంటే వూళ్ళూ మార్తాయి.

- మా గోఖలే, మార్పు

పెద్దతనం వచ్చేసరికి ఎంతవారూ పిల్లలుగా మారిపోతారు.

- పెద్దిభట్ల-కప్పగంతుల, నయనతార

ఇది వరకు రహస్యంగా జరిగేవి ఇప్పుడు ధైర్యంగా బహిరంగంగా జరుగుతున్నాయి. అదే మార్పు.

- చలం, ఆ రాత్రి

దగ్గరుంటే తప్ప, దూరంగా వెడితే మొగాళ్ళు మారిపోతారు.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

కూకున్న కూతురు కూలిపోయింది. చేసిన కోడలు సేవతేరింది.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

మనుషులు మారిపోతారు కాని తత్వాలు మారవు.

- నంది, నైమిశారణ్యం

అధికారంలోకి ఎవరొచ్చినా ఏం చేసినా సామాన్యుడి జీవితంలో మార్పు రాదేమిటి?

- చిరంజీవి, బోలోస్వతంత్ర భారత్‌కీ జై

కథలు చదివి మనిషి ఆలోచిస్తాడు. ఆలోచనలే మనుషుల్ని మారుస్తాయి. మారిన మనుషులే సమాజాన్ని మారుస్తారు.

- సీతాదేవి, తనదాకా వస్తే...?

మారక తీరని దీ లోకం
మారని దొక తీరని శోకం.

- బైరాగి, అనిలతరంగం

స్వభావ సిద్ధంగా ఒక పురుషుడు గాని, స్త్రీగాని ఒక స్త్రీతోను, పురుషుడితోను సంతుష్టి పొందరు. జీవిత మన్ని విషయములలోను మార్పు కోరుతుంది. మార్పే జీవనానికి ప్రాణము.

- చలం, శశిరేఖ

...చెఱకు వంకర బోయిన యంత మాత్రనే, పోవునె తీపి..?

- శ్రీరాములు, తెలుఁగునాఁడు

ప్రభుత్వం వచ్చిం దంటున్నదీ మార్పే
ప్రజలు రాలే దంటున్నదీ మార్పే.

- కుందుర్తి, మీ ఓటునాకే

సామాన్యుల కడుపుమంటల్ని ఆర్పేదే మార్పు
మిగిలింది సత్యమే అయినా
సాక్ష్యంలేనిది కొట్టేసే తీర్పు.

- కుందుర్తి, ప్రగతి

మార్పు అనేది సహనం ద్వారా గాని, విప్లవం ద్వారా గాని రావాలి.

- వేణుగోపాలరావు, జోగబాల

బ్రహ్మచారిగ నున్నంతకాలము చిత్తము బాయి వలె నుండెను గాని వారకాంతా సహవాసము కలిగిన తరువాత మెత్తఁబడినది సుమా!

- పానుగంటి, ప్రచండ చాణక్యము

కొందరి జీవితాల్లో అతి చిన్న సంఘటన సయితం గొప్ప మార్పును తెస్తుంది- మరికొందరి జీవితాల్లో ఓ పెద్ద సంఘటనగాని మార్పుకు నాంది పలకదు.

- రామమోహనరావు, డియర్

ఒకవూరి కవి వొకవూరి శ్రోత.

- శ్రీరమణ, న్యూనుడి

కవిత సానఁ దీరెఁ గాల మెంతో మాఱె.

- ఏటుకూరి, క్షేత్రలక్ష్మి

## మాల

మంచి చెడ్డలు మనుజులందున
ఎంచి చూడగ రెండె కులములు
మంచి యన్నది మాలయైతే
మాలనే యగుదున్.

- గురజాడ, లవణరాజుకల

మమత దప్పిన యాతఁడు మాలగాక
మాట దప్పిన యాతఁడు మాలగాక
అన్నెమును బున్నె మెఱుఁగని యట్టి మాల
మాలయే? దేవుమెడఁ బూలమాల గాక?

- వేంకట పార్వతీశ్వర కవులు,
పంచమాభినందనము

## మిగలనిది

గడియ తీరదు - గవ్వ మిగలదు.

- అప్పల్నాయుడు, పువ్వుల కొరడా

**మిగిలేది**

మనిషి చస్తే మాట మిగుల్తాది. ఎద్దు చస్తే యెముక మిగుల్తాది.

- కాంతారావు, దగాబడిన తమ్ముడు

పొట్టకు తిన్నది మిగలదు; నలుగురికీ పెట్టిందే మిగిలేది.

- నార్ల, సైపంట

**మిగులు**

మనం జీవితంలో అన్నీ సాధించగలమనే ధీమా మన అల్పజ్ఞానానికి చిహ్నం. నీవు ఎంత చదువు, ఎంత పరిశోధించు, నీ పరిశోధనలకీ, చదువులకీ అందకుండా మిగిలిపోయిం దింకా ఎంతో, ఎంతెంతో మిగిలివుంటూనే వుంది....

- మహీధర, ఓనమాలు

సారహీనపు జీవితమునకుఁ
గోరికలె మిగిలెన్!

- దేవులపల్లి, చుక్కలు

చావుదప్పి, కన్నులొట్టపోయినట్లు.

- సామెత

మనకి మిగిలినది మంత్రాలు కాదు; మంత్రాంగం! మంత్రులు.

- యజ్ఞన్నశాస్త్రి, ఓ మనిషి నూతిలో పడితే

**మింగటం**

చిన్నచేపని మింగిన పెద్ద చేపలాగ
నేడును తినేసింది రేపు. అది చాలదన్నట్టు తాను
నేడయి పోయింది.

- విశ్వం, ఎన్.జి.వో.భార్య

**మిడిసిపాటు**

పువ్వప్పుడే మిడిసిపడితే, పిందప్పుడే రాలిపో తారు.

- కాళీపట్నం, హింస

**మితం**

మితం తప్పితే అమృతమైనా విషమే.

-సామెత

**మితవాది**

మితవాదులు నేర్పే గుణపాఠం
ఏయే యెండల కాయాగొడుగులు.

- మల్లారెడ్డి, సామవేదం

**మిథ్య**

ప్రపంచం మిథ్య అని చెప్పేవారు, ప్రపంచంలో జీవిస్తున్నారు; సుఖాలు మిథ్య అనుకున్నవాళ్ళు కూడా సుఖాలలో జీవించవచ్చు

- కొడవటిగంటి, వారసత్వం

**మినహాయింపు**

ఏదేనా ఒకటి ఉండదేమో అనుకుంటూ మనం దానికోసం వెతికితే, ఆ ఒకటీ తప్ప కడంవి అన్నీ కంటికి కనపడతాయి.

- భమిడిపాటి, కాలక్షేపం

ప్రతీ నియమానికి కొన్ని మినహాయింపులు ఉంటాయి. లేకపోతే అది నియమం కాదు.

- తులసి, తిరోగామి

**మిన్న**

పదవుల పట్టాల్ని వరించి
వాగ్దానాల నూకల్ని విసిరే
నాయకులకన్నా
జీవితాన్ని కత్తుల వంతెనమీద నడిపే
ఒక ఉద్యమకారుడు మిన్న.

- హరనాథ్, వ్యత్యాసం

హిందువుల మనస్సులో సమస్త భావముల కంటె మాతృదేవత యెడల భక్తి భావము మిన్నయై వెలుగుచుండును.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

**మిరియాలు**

...ఎంత దటిగిన మిరయా
లుం జొన్నల సరిపోవే..?

- నాచన సోమన, ఉత్తర హరివంశము

**మీసం**

రొయ్యకు లేదా బారెడు మీసం.

- సామెత

నత్తులో మీసము చుట్టుకొన్నది సుమీ! యిటు మో మటు తిప్పంబోకుమీ.

- తి.వేం., శతావధానసారము

ఇయ్యంగ నిప్పింపంగల
యయ్యలకేగాని - మీస మన్యులకేలా?
రొయ్యకు లేదా బారెడు?

- కవి చౌడప్ప

వాసి మీసాలు లౌకికాగ్రేసరులకు.

- తి.వేం., శతావధానసారము

**ముక్కు సూటి**

తర్కం నడిపించే దారివెంట ముక్కుకు సూటిగా

నడిస్తే మాత్రం వెళ్ళి చేరవలసింది, బ్రహ్మంగారి మఠాన్ని. తప్పితే, పిచ్చి ఆసుపత్రిని.

- నార్ల, పిచ్చాపాటీ

**ముఖం**

హృదయానికి ముఖం అద్దం లాంటిది.

- సుంకర, కోతలరాయుడు

మొహం చూసి, గుణగణాల్ని నిర్ణయిస్తారు కదండీ మనవాళ్ళు?

- ముద్దంశెట్టి, తప్పించుకోలేవు

నీ మొహ మంత సందమా ముంటే, గుడ్డి దీప మెొకటా?

- బుచ్చిబాబు, ఉత్తమా యిల్లాలు

**ముఖస్తుతి**

నీ మహిమ నీకు సహిత మెఱుంగం దరంబు గాదు.

- సముఖం, జైమిని భారతము

ముఖస్తుతికి పొంగి వుబ్బిపోయేవాడు, వుత్తి నీచు డన్నమాట.

- కాంతారావు, అభ్యుదయం

మనిషిని నిలువునా పూడ్చగలదీ ముఖస్తుతి!

- పడాల, అల్లూరి సీతారామరాజు

**ముఖ్యం**

ప్రజలకన్నా దేశం ముఖ్యం
దేశంకన్నా లక్ష్యం ముఖ్యం.

- వీరేంద్రనాథ్, ఆఖరిపోరాటం

తప్పు బాహాటముగా నొప్పుకొనుటయే పశ్చాత్తాపమునకు ముఖ్యలక్షణము.

- పానుగంటి, ముద్రిక

సిద్ధాంతాలు ముఖ్యం కాదు. ఆచరణలో పెట్టే మనుష్యులు ముఖ్యం.

- కాంతారావు, అభ్యుదయం

**ముఖ్యమంత్రి**

అసలు చదువేం రాదా? ఇంకేం. నీకు ముఖ్యమంత్రి అయ్యేంత క్వాలిఫికేషన్ ఉంది.

- నంది, వాన వెలిసింది

ఎటుబోయి ఎటొస్తుందో? ఏ క్షణంలో ఏ గాడిద కొడుకుతో అవసరం వస్తుందో.... అందరితోనూ మంచిగా వుండటం ముఖ్యమంత్రి అవుతున్న వాడికి శాన ముఖ్యం...

- పతంజలి, అప్పన్నసర్దార్

ప్రజాస్వామ్యంలో ప్రజాప్రతినిధులు ఎవడ్ని ఎన్నుకుంటే ఆడే ముఖ్యమంత్రి గావాల. మరో దారి లేదు.

- పతంజలి, అప్పన్న సర్దార్

ఎవరికి బలం వుంటే వాడే ముఖ్యమంత్రి అవుతాడు.... వాడికి రెండోవాడు దండవేస్తాడు... అదీ న్యాయమైన రాజకీయం అంటే.

- పతంజలి, అప్పన్న సర్దార్

ముఖ్యమంత్రిగా ఉన్నా వాడి రోజులు బాగోలేక పోతే చచ్చయినా చచ్చిపోతాడు. లేదా ఏదోది క్కుమాలిన రాష్ట్రానికి గతిమాలిన గవర్నయినా అవుతాడు.

- పతంజలి, అప్పన్నసర్దార్

ఒక ముఖ్యమంత్రి పోతే పదిమంది పుట్టుకొస్తారు.

- పతంజలి, అప్పన్నసర్దార్

**ముగ్ధ**

బాలికల చిత్తము లంబుతరంగలోలముల్.

- శ్రీనాథుడు, శృంగారనైషధము

తథ్యమిథ్యావివిక్తి ముగ్ధలకుఁ గలదె?

- శ్రీనాథుడు, శృంగారనైషధము

**ముచ్చట**

సంసారితనంలో ఉండే ముచ్చట సానికే తెలియాలి.

- రామకృష్ణశాస్త్రి, రసమంజరి

ఆడవాళ్ళు నిత్య భాషణలో తమకు నచ్చే మాటలు కలకాలం చెప్పుకుంటారు.

- కొడవటిగంటి, చదువు

ముక్కువపడి ముక్కాలిపీట చేయించుకుంటే, డోరియా కోక కత్తిరించుకుపోయిందట.

- సామెత

మొండి ముక్కున ముక్కర వుంటే, మూతి తిప్పడమే ముచ్చటనుకొంటుందట.

- సామెత

**ముదరటం**

తొండ ముదిరితే ఊసరవిల్లి అవుతుంది. ఊసరవిల్లి ముదిరితే చచ్చిపోతుంది- కాని మొసలి అవదు.

- బీనాదేవి, తొడిమలేని పువ్వు

**ముదిమి**

ముసలితనమునఁ బగయంటి భోజనంబు

విధవ కూఁతురు దిక్కొట విధి లిఖించె.

- తి వేం., పాండవ విజయము

ముదిమికి ముచ్చట్లు లావు.

- గురజాడ, కన్యాశుల్కం

వృద్ధత్వంలో యితరులు చేసే ప్రతీ పనియం దున్నూ తనకు యేదో విధమైన దోషమే పొడ కడుతూ వుంటుంది. ఆకారణం చేత ఆయా పనులను నిషేధించబోతే ఆవలివాళ్ళు వినరు. పైగా తిరస్కరిస్తారు. దానిమీద మరీ కోపం హెచ్చుతుంది.

- వెళ్ళపిళ్ల, కధలు-గాధలు

యేమీ చదువుకోని వాళ్ళక్కూడా వృద్ధత్వం కొంత వివేకాన్ని కలిగిస్తూందంటారు.

- వెళ్ళపిళ్ల, కధలు-గాధలు

మగవాడు ఆలోచనలబట్టి ముసలి వాడవు తాడు. ఆడది అనుభవాన్ని బట్టి వీగిపోతుంది.

- మారుతీరావు, మళ్లీమధుమాసం

ముదిమి రెండవ బాల్య మన్నదము నిజము.

- చిలకమర్తి, ప్రసన్నయాదవము

పెద్దతనము వచ్చె బుద్ధి పెడతలఁ బట్టెన్.

- కాళ్ళకూరి, చింతామణి

## ముద్దు

వయసు భేదములేని చెయిదంబు ముద్దు
పలు మెచ్చుకోలు మాటల ముద్ద ముద్దు.

- శ్రీపతిశాస్త్రి, ముద్దు

కుక్కను ముద్దాడితే, మూతెల్ల నాకిందట.

- సామెత

కాకిపిల్ల కాకికి ముద్దు.

- సామెత

గాఢ పరిష్వంగంలో వేడివేడి ముద్దు
గబ్బుకొట్టు నరకానికి ఇవతలి సరిహద్దు.

- ఆరుద్ర, తొమ్మిదితో కుచ్చు

గ్రుద్దులాట దండడిలో ముద్దులాట సంద డియా?

- పానుగంటి, చూడామణి

చిలుక తన ముద్దేకాని ఎదటి ముద్దు కోరదు.

- నార్ల, పిచ్చాపాటీ

...కొందరికిని
మును శిశువు నేడిపింపక ముద్దు రాదు.

- కూర్మనాథకవి, సింహాద్రి నారసింహ శతకము

వట్టి ముద్దుల్లో ఏ పసాలేదు.

- వేదాంతకవి, ఆకలిమంట

ఆడదానికి పని ముద్దు. మగాడికి ఉద్యోగము ముద్దు.

- కాళ్ళకూరి, గరల్ వైఫ్

ఎంతైనా కాకిపిల్ల కాకికి ముద్దుగదూ!

- బుచ్చిరెడ్డి, రాలినమొగ్గ

అసలు కంటె వడ్డీ ముద్దు.

- సామెత

## ముని

పవనపర్ణాంబుభక్షులై నవసి యినుప
కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చు లెల్లఁ
దామరసనేత్రలిండ్ల బందాలుగారె?

- పెద్దన, మనుచరిత్ర

## ముందుచూపు

అభేద్యమైన సంబంధం ఏర్పడ్డానికి ముందే ఎదుటివాళ్ళ తలతిక్కలూ, తప్పు ధోరణులూ, అర్థం కావటం మంచిది.

- మహీధర, కత్తుల వంతెన

జీతాల సీద బ్రతికే వాళ్ళకి ముందు ఆలోచన ఉండాలి.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

దొంగండీ అంటే, ముక్కు కరుస్తాదేమో జాగ్రత్త అన్నట్లు.

- సామెత

మలబారులో చెవులు కుడతారని మాయవరం నుంచి చెవులు మూసుకొని పోయినట్లు.

- సామెత

## ముందు వెనుకలు

నాకు ముందు నిర్యాణం, తరవాత కళ్యాణం.

- భమిడిపాటి, ఎవళ్లగొడవవాళ్లది

దొరల చెంగట వెనుకముందును దలంప
కార్యుఁడు వచింపఁ దగునె యేకార్యమైన?

- కదిరీపతి, శుకస్తపతి

ముందుకు పోవడ మొక వేడుక
వెనుకబడ్డం అదో వాడుక.

- పద్మనాభాచార్య, సుఖదుఃఖాలు

పప్పు కూటికి ముందు, వెట్టి మూటకు వెనుక.

- సామెత

## ముభావం

మొదట కాళ్ళూ పట్టుకోను, తరవాత పేరూ

జుర్రుకోను.

- భమిడిపాటి, తుక్కుముక్కల హక్కుచిక్కు

ముల్కీ

కుచ్చుటోపీల్ పెట్టుకొని
పట్టు షేర్వానీల్ తొడిగి
నేనుసైతం ముల్కీనంటూ గర్వపడతాను.
తెలుగుతల్లికి స్వస్తిచెప్పి
'దేశభాష'ని ఉర్దు నేర్చి
నేనుసైతం ముల్కీనంటూ గర్వపడతాను.

- పినవీరారెడ్డి, ముల్కీ

ముష్టి

నీకున్నదాంట్లో కాస్త లేనివాడికి ముష్టివేస్తూ ఉండు. వాడు కనీసం ఊపిరితోనైనా బ్రతికి ఉండేలా చూడు. లేకుంటే వాడు నీమీదే తిరగబడి, నీవు కష్టపడి పేర్చుకుంటున్న బ్యాంకు బ్యాలెన్సుల్ని సఫా చేయగలడు!

- చలసాని, ఇండస్ట్రీ

వైదీకపాళ్ళని పుట్టించినప్పుడే బ్రహ్మారాసి పడేశాడు! "ముష్టెత్తుకొండర్రా" అని.

- గురజాడ, కొండుభట్టీయము

శుంఠ దొడ్డి సంభావనకుఁ, బండితుని
పారితోషికమునకుఁ, బ్రధానుని బహూకృతికి.
శబ్దభేదమే కాని యంతకంటె నేమున్నది?
పరమార్థమున నంతయు ముష్టియేకదా?

- పానుగంటి, కళ్యాణరాఘవము

నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష!
భిక్ష మెత్తుట యిది క్రొత్తవిద్య గాదు.

- చిలకమర్తి, గయోపాఖ్యానము

ముసలి

మనస్సుకు యౌవనము పోలేదు కాని శరీరముకు ముదిమి వచ్చింది.

- దీక్షితులు, శర్మిష్ఠ

మగడు పెద్దవా డయిపోతే, ముఖ్యంగా చిన్న భార్యకు పరాయివా డయిపోతాడు.

- శివరామశాస్త్రి, తల్లిలేనిపిల్ల

ముస్తాబు

ముస్తాబు మఱుగున ముదిలంజయును లేఁత పిందెవోలెను గానిపింపవచ్చు!

- కాళ్లకూరి, చింతామణి

మూగనోము

గొంతుదాటి పలకని శబ్దాలు
దాగున్నై ఇన్ని శతాబ్దాలు!

- దాశరధి, ఉషస్సంధ్య

మూఢనమ్మకం

మూఢనమ్మకం మనిషిని ఎంతకైనా దిగజారుస్తుంది... బలి కావడానికైనా బలి చేయడానికైనా సిద్ధపరుస్తుంది.

- బుచ్చిరెడ్డి, ఇదుగో సూర్యుడు

మూఢమి

మూఢమి అనగా మూఢులు పెట్టిన శూన్య భోజన నియమం.

- భమిడిపాటి, భోజనోపదేశం

మూఢుడు

మనలోఁ బెక్కంద్రు గొప్ప గ్రంథములనే మొట్టమొదట పఠియించి యెట్టెట్టో కష్టముపడి వల్లించి తుట్టతుదకు పండిత నామమును సహితము వహియించి లోకవృత్తంబున మూఢులయి యున్నారు.

- కందుకూరి, విద్య

మూర్ఖత్వం

తాడు చాలకపోతే నుయ్యి పూడ్చ మన్నట్లు.

- సామెత

గాలిలో దీపంపెట్టి, దేవుడా నీ మహత్వం అన్నట్లు.

- సామెత

ఊరే చేరవద్దు రౌతా అంటే, గుర్రాన్ని ఎక్కడ కట్టేది అన్నాడట.

- సామెత

సమయం కానప్పుడు చేసే మొండి ధైర్యం మూర్ఖత్వ మవుతుంది.

- ధనికొండ, పవిత్రులు

మన మెరిగినదే మనము గొప్ప యనుకొందుము. అది మనుష్య స్వభావము. ఈ లోకము మూర్ఖ మగుటకుఁ బ్రథమకారణమే యదిది.

- విశ్వనాథ, తెఱచిరాజు

తాళికట్టిన మొగుడ్ని కొంగున ముడికట్టుకోవటం చేతకాక, పరాయివాళ్లపై పడి ఏడ్వటం మూర్ఖత్వం!

- రామచంద్రమూర్తి, మనుగడలో మలుపులు

### మూర్ఖుడు

మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని
కఱటిం దెలుపంగఁ గమలగర్భుని వశమే?

- నన్నయ, ఆదిపర్వము

గ్రాస మింత లేక కడుఁ గష్టపడుచున్న
విద్య యేల నిలుచు వెడలుఁగాక
పచ్చికుండ నీళ్లు పట్టిన నిలుచునా?

- వేమన

పోఁగాలము దాపించినవారు దీప నిర్వాణ గంధము నరుంధతిని మిత్రవాక్యమును మూర్కొనరు కనరు విన రని పెద్దలు చెప్పుదురు.

- చిన్నయసూరి, మిత్రలాభము

...తెలిసియుఁ
దెలియని నరుఁ దెల్ప బ్రహ్మదేవుని వశమే?

- లక్ష్మణకవి, సుభాషితరత్నావళి

దేవుడూ మానవుడూ వీరిద్దరే యీ అనంత విశ్వంలో మూర్ఖులు. ఏ కోణం నుంచి చూచినా వీరిద్దరూ మిజరబుల్ ఫెయిల్యూర్స్.

- తిలక్, కాస్మాపాలిటన్

చూపుడు వేలుతో చంద్రుణ్ణి చూపిస్తే చంద్రుడి వంకగాక చూపుడువేలువంక చూసేవాడు మూర్ఖుడు.

- నగ్నముని, విలోమకథలు

మూర్ఖుడు ఒక్కడే మూర్ఖుడు కాడు, వాడితో వాదించే వాళ్ళంతా మూర్ఖులే!

- రంగనాయకమ్మ, పేకమేడలు

ప్రజలు మూర్ఖులైతే వాళ్ళకి అర్థం కాకుండా రాసిన నేను మూర్ఖుణ్ణే.

- చలం, మ్యూజింగ్స్

### మూలం

చెలువుల ప్రేమలకుఁ జెట్లపై బదనికలకు వలె మూలము లేదు.

- పానుగంటి, రాధాకృష్ణ

ప్రతి మహత్కార్యానికీ మూలం అతి సామాన్యంగానే ఉంటుంది.

- రాధాకృష్ణశాస్త్రి, జన్మభూమి

కాంతా కనకాలే కయ్యాలకు మూలం.

- సామెత

ఆశలపాదం నీకు నేర్పుతుంది నీ నిరాశ
ఆహ్లాదానికి అర్థంగరపుతుంది విషాదం
పూర్ణత్వపు సూత్రం విడమరుస్తుంది చీకటి.

- బైరాగి, నూతిలో గొంతుకలు

పూటకు గతిలేని స్థితినుంచి కోట్లకు అధిపతులైన ప్రతివ్యక్తి అవమానంనుంచో... నిర్లక్ష్యం నుంచో... అవసరం నుంచో పైకి లేస్తాడు.

- రామమోహనరావు, త్రినేత్రుడు

### మూలసిద్ధాంతం

మీ ఇంటికొచ్చేం, ఏఁవిస్తావ్? మా ఇంటికొచ్చేవు, ఏం తెచ్చేవు? మా సివిలు జూరిస్ ప్రూడెన్సుకీ క్రిమినల్ జూరిస్ప్రూడెన్సుకీ కూడా అదీ మూల సిద్ధాంతం.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

### మృగం

మృగంమీద depend కావచ్చు, కాని మనిషిపైన ఆధారపడలేము.

- చలం, మ్యూజింగ్స్

### మృతుడు

జీవితుల భావనలో మృతులు జీవిస్తారు.

- బైరాగి, నాయకునకు సానుభూతి

### మృత్యుంజయుడు

తమని మింగబోయే చావుని చూసి మందహాసం చెయ్యగలిగిన వాళ్ళు మనోహరంగా ఉంటారు.

- రావిశాస్త్రి, బంగారిగాడి కత

### మృత్యువు

అనంతవీధుల్లో బ్రతుకుని మరణం తరుముకపోతూనే ఉంటుంది.

- అద్దేపల్లి, ఎటర్నల్ ఎలిజీ

మృత్యువు ఊహతో వేదాంతం మొదలు
మృత్యువు భయంతో జీవితం ఆఖరు

- రంగారావు, ముక్తకాలు

మృత్యువున కేలా భీతివహింత్రు జనులు
అవల స్వచ్ఛంద సౌందర్య మబ్బుచుండ?

- రాయప్రోలు, జడకుచ్చులు

మృత్యుహృదయంబు కన్నీట మెత్తపడునె?

- బాలసరస్వతి, భక్తతుకారామ్

### మృదుత్వం

వైదీకిపాళ్ళ చెయ్యి మృదువుగా యలావుంటుంది?

- గురజాడ, కన్యాశుల్కం

### మృద్వటం

తఱి యగునంతకు రిపుఁదన

యఱకటఁ బెట్టికొనియుండునది దఱియు డుగం
జెఱుచునది ఱాతి మీఁదను
వఱలఁగ మృద్ఘటము నెత్తి వైచిన భంగిన్.

- నన్నయ, ఆదిపర్వము

మృష్టాన్నం

వీపు మీద గుద్దితే క్రింద మెతుకులు పడాలి; మెడ మీద కొడితే నోట బూరెలు రాలాలి. మళ్లీ మనిషి ఢోకా లేకుండా వుండాలి. భోజనమంటే ఏమంటావోయి సోమయ్యా?

- వేంకటరాయశాస్త్రి, బొబ్బిలియుద్ధం

మెజారిటీ

ఈ వేళ జ్ఞానంలేని వాళ్లదే మెజార్టీ.

- మహీధర, స్వయంవరణం

మెట్ట వేదాంతం

విశ్వసించవల దెప్డున్ మెట్ట వేదాంతముల్.

- జాషువా, తొలినిట్టూర్పు

మెట్టు

నిచ్చెన స్వర్గానికి వేయవచ్చు నరకానికి వేయ వచ్చు పైకిపోయే మెట్లు స్వర్గానికీ, దిగువకు పోయే మెట్లు నరకానికి దారి. తీస్తవి.

- ఉన్నవ, మాలపల్లి

ఆత్మతోఁ దెలిసినదే తెలిసినది. మనస్సుతోఁ దెలి సినదే తెలిసినది కాదు. ఆత్మతోఁ దెలిసికొనుటకు మొదట మనస్సుతోఁ దెలిసికొనుట మెట్టు.

- విశ్వనాథ, తెఱచిరాజు

మెండు

చేయలేనమ్మకు చేష్టలు మెండు, వండలేనమ్మకు వగపులుమెండు.

- సామెత

వండలేని అక్కకు వగవులు మెండు. తేలేని అన్నకు తిండి మెండు.

- సామెత

దబ్బర పాటకు తలతిప్పు మెండు.

- సామెత

మెతకదనం

మన బంగారం మంచిదవ్వాలిగాని కంసాలిని అని ఏం ప్రయోజనం అంటారు గాని. బంగా రందేముంది? కంసాలి ఎటు మలిపితే అటు మళ్లుతుంది.

- గోపీచంద్, పునస్సమాగమం

మెత్తన

నాలుగుకాళ్ళ జీవాలలో మేక మెత్తన, రెండు కాళ్ళ జీవాలలో కోమటి మెత్తన.

- సామెత

మెత్తగా మాటాలాడరా అంటే దూదీ, వెన్నపూస అన్నాడట.

- సామెత

మెదడు

దేముడు అనేవాడున్నాడు అని నమ్మితే, అతడి అద్భుత సృష్టి మెదడు. మనిషి విలువైన అవయ వాల్ని దేముడు అతిభద్రమైన చోట అమర్చేడు.

- వీరేంద్రనాథ్, తులసి

మనిషికి మెదడు వుంది ఆలోచించటానికే. ఆ మెదడు చాలామందికి జారిపోయి మోకాళ్లలో సెటిల్ అవుతుంది.

- రామమోహనరావు, త్రినేత్రుడు

మనుషులకన్న మనుషుల మెదళ్లు బుద్ధిగలవి; అవి సగం పనిచేసి విరమించవు.

- కొడవటిగంటి, గడ్డురోజులు

ప్రేమకు నిలయం, ఆలయం గుండె. మేధకు నెలవు, విచక్షణశక్తికి కొలువు మెదడు. అందుకే గుండెకు పైనే ఉంటుంది మెదడు.

- బుచ్చిరెడ్డి, తేనెకోరని తుమ్మెద

మెప్పు

ఏగతి రచియించిరేని సమ
కాలము వారలు మెచ్చరే కదా!

- చేమకూర, విజయవిలాసము

సూటిగా యేవిషయమైనా
చెప్పరాదని తెలుసుకుంటే
తప్పకుండా నీకవిత్వం
గొప్పవారల మెప్పుపొందును

- మల్లారెడ్డి, సూక్తిముక్తావళి

గతి చూపిస్తే యేమిటి మెప్పు?

- గురజాడ, కన్యాశుల్కం

కొంతమందికి చాకిరీచేసి మెప్పించడమే కాని షోకుచేసి మెప్పించడం తెలీదు.

- రావిశాస్త్రి, అధికారం

డబ్బు ఖర్చు కాకుండా ఉండేటప్పుడు మెప్పు కురిపించడం మానవులకి స్వభావం.

- భమిడిపాటి, పద్యం - రాగం

వెయ్యిమంది సామాన్యుల మెప్పుకంటే ఒక్క

జ్ఞాని మెప్పు గొప్ప.

- భమిడిపాటి, వన్నుమోర్

అందరిచేతా మెప్పులు సంపాదించుకునేవాళ్లు సర్వనాశన మైపోతారు. సర్వనాశన మైపొయ్యే వాళ్లనే ప్రపంచం మెచ్చుకుంటుంది.

- కొడవటిగంటి, కలిసిరావాలి

## మెరిట్

ఎక్కడుంది మెరిట్? గవర్నమెంటు సర్వీసు లోనే లేదు. అంత మెరిటున్న వాడెవడూ చచ్చినా గవర్నమెంటు సర్వీసుకు రాడు.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

## మెరుగు

వారకాంతకంటే జారకాంత నూరురెట్లు మెరుగు.

- వాసిరెడ్డి, సుంకర, అపనింద

రిటైర్డ్ తాసిల్దారుకన్నా సర్వీసులోవున్న కరణం మేలు.

- శ్రీరమణ, న్యూనుడి

## మెలకువ

శవం బతకడం ఎంత విచిత్రమో
మనం మేలుకోవడం అంత చిత్రమే

- దాశరథి, మేల్కొన్నమనిషిని చూడ్డానికి వెళుతున్నాను

## మేటి

రోటి పాటలే మేటి వీరులను తయారుచేసేది.

- ఉన్నవ, నాయకురాలు

## మేధ

ఒక్కొక్క జీవితానికి హృదయమే పునాది. అయితే, మరొక్కొక్క జీవితానికి మేధస్సే ప్రధానం అయి వుంటుంది.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, గులాబీ అత్తరు

ఎక్కడ మేధస్సు ప్రధానమో అక్కడ అనుభూతి తక్కువయి పోతుంది. అక్కడ సానుభూతిన్నీ పూజ్యమే.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, గులాబీఅత్తరు

## మేధావి

అందరిలో దొర, ఒంటరిగా దొంగ
నటుల్ని తిడ్తూనే నటించే కొంగ
సగం పశువు, సగం మనిషి యీ జీవి
వీడి అసలుపేరు మేధావి.

- అమ్మంగి, మేధావి

ఒక తీరని కోరిక
తపన ఉన్న మనిషి
గొప్పమేధావి అవుతాడు

- పరిమళాసోమేశ్వర్, దర్పణం

మేధావులు డిస్కస్ చేస్తున్నారు
ప్రాబ్లెమ్స్ సాల్వుకావడంలేదు

- పేర్వారం, తమసోమా జ్యోతిర్గమయ

## మేనబావ

మేనమామc కొడుకైతే మొగుడు ఆఫీస్ బాయ్‌లా మనచేతిలో వుంటాడు.

- పురాణం, బల్లకట్టు బెల్లపావకాయ

## మేనమామ

తల్లి పుట్టిల్లు మేనమామల దగ్గర దాగదు.

- చిలకమర్తి, ప్లీడరు తమాషా

## మేయటం

తల్లిచేలో మేస్తుంటే పిల్ల గట్టున మేస్తుందా?

- చిరంజీవి, బోలోస్వతంత్ర భారత్‌కీ జై

## మేలం

వేశ్యలకు మేలమే పదివేలు సుమ్ము.

- కాళ్లకూరి, చింతామణి

## మేలు

హరితోడి పగకంటెc గలదెమేలు?

- కంకంటి, ఉత్తర రామాయణము

తెలివిహీనుడై మంచిగా వుంటంకంటే సంస్కారంతో పాడవడమే మేలంటాను.

- బుచ్చిబాబు, స్వతంత్రజీవులు

గత కాలము మేలు వచ్చుకాలము కన్నన్.

- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

కీడులో మేలు మా కొనcగూడె నిందు.

- చిలకమర్తి, గయోపాఖ్యానము

ఒక్కొక్క సందర్భంలో ఎంతో బలమైన ప్రభుత్వంకన్న కాంగోలాంటి అనాగరిక దేశమే మేలు.

- మహీధర, కత్తులవంతెన

...మా గురువుగారికి కోపము వచ్చువేళ పెం
పలరెడు నంటరానితన
మడ్డము వచ్చె న దొక్కమేలుగా!

- జాషువా, నా కథ

అనృత మాడుటకంటె మానము మేలు. పరధనాపహరణముకంటెc దిరియుట మంచిది.

వివేక హీనుఁడయిన ప్రభువును సేవించుకంటె వనవాస ముత్తమము. యాచించుకొని బ్రతుకుట 'కంటె మరణము శ్రేయము.

- చిన్నయసూరి, మిత్రలాభము

కలిమిగల లోభికన్నను
విలసితమగు పేద మేలు వితరణియైనన్;
చలి చెలమ మేలు కాదా
కులనిధి యంబోధికన్న?

- గువ్వలచెన్న శతకము

సరస మెఱుఁగని వారితో జగడ మాడి
కోర్టుకెక్కుట కంటెను గొఱంత మేలు!

- కాళ్లకూరి, వరవిక్రయము

సాక్షి కాళ్లు పట్టుకోవటం కన్నా వాది కాళ్లు పట్టుకోవడం మేలు.

- సామెత

అంత్యనిష్ఠూరంకన్నా ఆదినిష్ఠూరం మేలు.

- కృష్ణంరాజు, రెండుబండ్లు పోయాయి

గబగబా అరిచేవాడి పంచ చేరవచ్చును గాని, నేలముచ్చాడి గ(క)డప తొక్కరాదు.

- సామెత

కురూపి పొత్తుకంటె సురూపి తిట్టుమేలు.

- సామెత

దుర్గంధ కుసుమాని కంటె నిర్గంధకుసుమం మేలు.

- సామెత

బంధువులకన్న నెయ్యెడఁ బరులె మేలు
తిట్టులంబోయి మెసవెడు తిండికన్న
గలఁకఁ బాఱక త్రావెడు గంజిమేలు

- ఏటుకూరి, ప్రేమాలోకము

ఆడవాళ్ళకు చెవుడుండటం
మగాడికి మంచిది

- ఆదివిష్ణు, వాంటెడ్ ఫాదర్స్

గుడ్డికన్న మెల్ల మేలు

- సామెత

ఏనుగంత తండ్రికంటె, ఏకులబుట్టంత తల్లి మేలు.

- సామెత

అవివేకితో స్నేహంకన్నా వివేకితో విరోధం మేలు.

- సామెత

ఉల్లి చేసిన మేలు తల్లి చేయదు

- సామెత

చీకటి గర్భంలో, చిక్కుకుపోయే కంటే
సూర్యగోళంలో, ఒక్క కిరణమై చావడంమేలు

- జంగా, కిరణం

సోమరి పాటల వందలకంటే
ఆకలిగీతం ఒకటి మేలయా!
అర్ధమనస్కులు వందలకంటే
అర్ధాయుష్కుడు ఒకడు మేలయా!

- రమణారెడ్డి, ధమ్మఘోష

సరస్వతీ సేవ చేయుటకు మారు భిక్షాటనము నేర్చుకొనుట మేలు. చాకలిపని నేర్చుకొనుట శ్రేయము.

- తాపీ, అవన్నియు నీకనులేనా?

చేటు వచ్చెనేని చెడనాడు దైవంబు
మేలు వచ్చెనేని మెచ్చుకొనును
గరిమ మేలు గీళ్లు కావడి కుండలు

- వేమన

కటిక దరిద్రులకి దేఁవుడుంటే యేంకావాలి. లేకుంటే యేంకావాలే? వాడున్న మేలూలేదు. వాడు లేడన్న కీడూ లేదు.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

**మేష్టారు**

సాధార్నంగా ఈ మేష్టర్లకి ఏం తెలీదు పాపం. పెద్దాళ్ళ నడిగితే కోంబడతారని భయం. అంది కని బడి అని ఓటిపెట్టి మన్ని అడుగుతారన్న మాట.

- ముళ్లపూడి, వురేయ్ కుంచెం ఆగు!

**మేళం**

సాని మా'ళం తా'పటమనేది డబ్బిచ్చి తద్దినం కనుక్కోవట మన్నమాట కదా!

- గురజాడ, కోతలరాయుడు

**మైకు**

(ఇదిగో), ఈ మైకులంటూ వచ్చినై, ఇష్టం వుండా లేకపోయినా యినాల్సిందే!

- సుంకర, కోతలరాయుడు

**మైత్రి** (చూ. స్నేహం)

**మైల**

మనసులో మాలిన్యం లేనప్పుడు, వ్యక్తికి మైల అంటదు. పవిత్రమైన భావాలన్నీ భాషావిష్కరణకోసం యత్నించేస్తూ. మనసు చాపిన చేతు

లతో మైలపడి తీరుతాయి.

- రామమూర్తి, అగ్నిగర్భ

మొక్క

మొక్కయై వంగక మ్రానై వంగదు.

- విశ్వనాథ, కడిమిచెట్టు

మొగమాటం

మొగమాటము దవ్వుగాదె మోక్షంబునకున్.

- చిలకమర్తి, గయోపాఖ్యానము

ఆహారముపట్ల వ్యవహారముపట్ల మోమోటము పనికిరాదు.

- బలిజేపల్లి, సత్యహరిశ్చంద్రీయము

మొండితనం

ఆడది అసూయనీ, మొగాడు మొండితనాన్నీ పట్టుకొని పుడతారు అమ్మకడుపులోంచి.

- బీనాదేవి, ది బెట్

మొండికెత్తి ఊరుకుంటేనేగాని చాలా రోగాలు కుదరవు.

- భమిడిపాటి, బాగుబాగు

చులుకఁ గాల్పట్టి, యీడ్చినఁ జూరువట్టి
వేలుదురుగాక తమవారి విడుతురెట్లు?

- శ్రీనాథుడు, కాశీఖండము

కుక్కతోఁక దెచ్చి గొట్టంబుఁ జేర్చిన
క్రోవి చెంత నుండు కొంత తడవు
ఎంతఁ జెప్పఁ జెడుగు పంతంబు మానునా?

- వేమన

యుక్తికి యుక్తి చెప్పగలముగాని మొండివాద మునకు జవాబు చెప్పలేము.

- చిలకమర్తి, మెట్టవేదాంతము

మొండివాడు

మొండివాడు రాజుకన్నా బలవంతుడు.

- ముద్దుకృష్ణ, ఆడవాళ్ల తెలివి

మొండివాడు ముక్కుకోస్తే నెత్తురు తాగాడుట.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, ఇల్లుపట్టిన వెధవాడబడుచు

మొదటిది

స్త్రీకయినా పురుషునకయినా, వయసు వచ్చాక తటస్థించిన మొదటి స్పర్శ జీవితాంతం వరకూ గిలిగింతలు పెడుతూనే ఉంటుంది.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, ఆత్మబలి

రహస్యము చెప్పి దాచుమనుట విరివిగా వెల్లడి చేయుటకు మొదటి సాధనము.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

మొద్దు

ఎద్దయినా ఏడాదికి నేర్చును. మొద్దు ముప్పై ఏళ్లకయినా నేర్వడు.

- సామెత

మొనగాడు

ముందడుగు వేయువాడు మొనగాడు. వెను కంజ వేయువాడు పిరికివాడు. అటోయిటో తేల్చుకోగలిగేది మొనగాడే. నీళ్ల నములుతూ నిలబడేది పిరికివాడు. అసలు పిరికివాడికే బోలెడన్ని ఆలోచనలు

- పులికంటి, ఆరిక కూడు

మొరాయింపు

మెయ్యబోతే ఎడ్లలోకి, దున్నబోతే దూడల్లోకి.

- సామెత

మోక్షం

వైష్ణవుఁ డెంత కాంచనం
బిచ్చిన నంత మోక్షమను,
నీయక యుండిన ముక్తి లేదనున్.

- శ్రీరాములు, తెలుఁగునాఁడు

శక్తిలేదని వాపోయే వానికి, ముక్తి కలుగుతుం దని స్వార్థులు శాస్త్రాలను సాగదీస్తున్నారు.

- ఆళ్వారుస్వామి, ప్రజల మనిషి

చదువులందు రాజపదవులందును పాడి
మొదలవులందు స్త్రీల పెదవులందు
నాశ లుడిగినట్టి యయ్యలు ముక్తులు;

- వేమన

ముక్తి సౌధంబునకు రక్తి మొదటిమెట్టు
హరికటాక్షమందు; మనోహరి కటాక్ష
మిందు; ఫలమందు నిందు నానంద మొకటి
రక్తి ననుభవించినఁగాని ముక్తి కలదె?

- బాలసరస్వతి, భక్తతుకారామ్

మోజు

కాకీ దుస్తుల మెరసెడు
'హాకీ'లను సతుల కాహవావనిలో న
ప్పేకాట యందున తురుఫ్
జాకీలకు బోలె మోజు జాస్తీ సుమ్మా!

- గునుపూడి, బిడాల శాస్త్రి

ఒదిగున్న పెళ్లాం కంటే ఒగ్గేసిన పెళ్లాం అంటేనే మోజు.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

పెళ్లయేవరకూ భర్తకు భార్యమీద మోజూ, ప్రేమానట. పెళ్లయిన తరువాత భార్యకు భర్త మీద మోజు ప్రేమానట!

- సరస్వతీదేవి, స్వర్ణకమలాలు

భారతీయులకి సీమ కూరలమీదా, మేకజాతికి క్రోటన్సు కొమ్మలమీదా మోజు ఎక్కువ.

- రావిశాస్త్రి, నల్లమేక

## మోడల్

అసందర్భంగా అందాల్ని పరవాల్సిన సరుకులు మోడల్స్!

- రామమోహనరావు, డియర్

విజయం వెనుక విజయాలు, పరాజయాలు వాటి అడుగున శ్రమ, బాధ, అవమానం, సంశయం, దోపిడి, కర్కశత్వం, రాక్షసత్వం, రాజకీయాలు, అసూయ, దుర్భరమైన వేదన వెరసి జీవితపు వెలుగుల చివర వేదాంతం మిగులుతుంది మోడల్స్‌కు.

- రామమోహనరావు, మోడల్

## మోతాదు

నిద్రమాత్రలు ఒకటో, రెండో వేసుకుంటే హాయిగా నిద్రపోతాం. అన్నీ ఒకేసారి మింగేస్తే చచ్చిపోతాం. విషమైనా తగిన మోతాదులో తీసుకుంటే ఏంచెయ్యదు.

- బీనాదేవి, హరిశ్చంద్రమతి

బహు జలంబుల సేతువు పగిలిపోవు
విను మరక్షిత మంత్రంబు విటిసిపోవుఁ
గొండియంబున సఖ్యంబుఁ గ్రుంగిపోవుఁ
గఠినభాషలఁ బడిపోవుఁ గాతరుండు.

- దూబగుంట, మిత్రభేదము

## మోసం

మోసమెన్నటికిని దాగనేరదు. నోరుదాచినను నొసలు బైటపెట్టును.

- భానుమూర్తి, హేమలత

తాత ఓటు మనమడు వేసినట్టు.

- శ్రీరమణ, న్యూసుడి

మొన వెడలివచ్చు టెఱుఁగక మోసపోయె.

- తి.వేం., పాండవ విజయము

ఇదంతా టోపీ వ్యవహారంలా కనబడుతుంది.

- గురజాడ, కన్యాశుల్కం

నమ్మించోట చేస్తే మోసం, నమ్మంచోట చేస్తే లౌక్యవూను.

- గురజాడ, కన్యాశుల్కం

నటనవల్ల కొద్దికాలవేఁ లోకానికి కళ్ళు కప్పవ చ్చునుగాని, నిడివి మీద బంగారాన్నీ, ఇత్తడినీ లోకం యేర్చేస్తుందండి.

- గురజాడ, కన్యాశుల్కం

ప్రపంచమంతా మోసంతోనే ఉన్నది. యెక్కఁడ చూచినా వీరిని వారూ వారిని వీరూ మోసం చేస్తూ ఉంటారు.

- కందుకూరి, మహావంచక ప్రహసనము

మనం వక్క ఘడియ ఈయన వద్ద మాట్లాడితే ఇంటికి వెళ్ళిన తరువాత తలలు మార్చినాడేమో అని అద్దం పెట్టి మనముఖాలు చూచుకోవలెను.

- కందుకూరి, హాస్యసంజీవని

మాయికులయందు బుద్ధిమంతుడు మాయావి యయి ప్రవర్తింపవలెఁగాని ఋజువుగాఁ బ్రవ ర్తింపగూడదు.

- చిన్నయసూరి, మిత్రభేదము

ప్రత్యక్షమం దిచ్చకములాడి పరోక్షమందుఁ గార్యహాని చేయు సంగాతకాఁడు పయోముఖవి షకుంభము వంటివాఁడు.

- చిన్నయసూరి, మిత్రలాభము

దృష్టముగఁ జూచి కపటంబుఁ దెలిసెనేని
పూని క్రమ్మఱ మఱి మోసపుచ్చరాదు.

- దూబగుంట, లబ్ధనాశము

పచ్చి అజ్ఞానం ఉన్నన్నేళ్ళు మోసం బతుకుతూ ఉంటుంది.

- జంగయ్య, జాతర

విషము విషముచే విరుగునట్లు, స్వప్నతిమి రము స్వప్న దీపముచే సమయునట్లు, లోక ములో మోసము, మోసముచేఁ బొలియును.

- కూచి, రూపలత

విషానికి విషం విరుగుడు. మోసగాళ్ళకు మోసమే పనిచేస్తుంది.

- పినిశెట్టి, పల్లెపడుచు

## మోహం

మసలుచున్నది బురదలో మహిషమట్లు

ముదిరిపోయిన జన్మభూమోహపటిమ.

- జాషువా, నా కథ

మోహ మంటువ్యాధి వంటిది.

- విశ్వనాథ, చెలియలికట్ట

మోహం ఫలాన్ని అపేక్షిస్తుంది. ప్రేమఫలాతీత మైంది. సాఫల్యంతో మోహం నశిస్తుంది.

- రాజమన్నారు, పరకీయ

## మౌనం

మాటలకు అలవిగాని శక్తి, ఒదుగు మౌనానికి ఉంది... మాటలు అర్థంలో ఆవగింజ పాలును పలుకుతవి. మౌనం కొండంతదాన్ని ముక్తస రిగా ఉద్ఘోషిస్తుంది...

- రామకృష్ణశాస్త్రి, ఖుదానంద్

మమత నిండిన వేళ
మూగబా సేను
మమత పండినవేళ
మూగబా సేను

- కామేశ్వరరావు, మౌనం

మౌనంలో ఎన్నిమాటలో!
ఎన్నిధ్వనులో! ఎన్ని భాషలో!

- ఇనాక్, రెండు వికసించిన పుష్పాలు

అనౌచిత్య సంభాషణకు మౌనమే మందలింపు.

- వరదాచార్యులు, వైశాలిని

# య

## యజమాని

ఒక యజమాని తన కుక్కను అర్థంచేసుకునే దానికన్న ఆ కుక్కే తన యజమానిని బాగా అర్థంచేసుకుంటుంది.

- కొడవటిగంటి, అమోఘవచనం

## యత్నం

కుండలోకి కూరైనా కొలువులోని గొప్పతనమైనా తెచ్చుకుంటే కానిరాదు.

- చిలకమర్తి, గౌరవసంపాదనము

యత్నము లేక గ్రహములు ఫలము నీయవు; స్వప్నమందుఁగాని, మనోరథమాత్రముననఁగాని, జన్మాంతరముననఁగాని, ఇచ్చును. కావున పూర్ణ యత్నము చేయవలయును.

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

## యథార్థం

చూడబోతే కవి పోజు, రాసేది పచ్చి ప్రోజు.

- శ్రీరమణ, న్యూనుడి

## యంత్రం

మడిసి జనమకన్నా పేనంలేని మరలు నయం.

- వెంకటనరసింహారావు, సిన్

## యాచన

మీరు సిగరెట్లు కాల్చకూడదు. కేన్సరొస్తుంది. చచ్చిపోతారు. ఆ సిగరెట్లు నామొహాన్నకొట్టండి. నేను కాల్చుకుంటాను.

- ఆదివిష్ణు, వాంటెడ్ ఫాదర్స్

మొక్కుబడే లేదంటే, ఒక్క దాసరికైనా పెట్టమన్నట్లు.

- సామెత

అధికారం తోడి యాచ్నావృత్తి వెగటువేస్తుంది. లోకానికి ఉపద్రవం తెస్తుంది. దైన్యంతో కూడి ఉన్న యాచ్నావృత్తి స్వభావసిద్ధమైంది. దాని వల్ల ఎవరికీ బాధలేదు.

- విశ్వనాథ, ముగ్గురుబిచ్చగాళ్ళు

## యాతన

బాధకి కారణాలు అడగటం అడిగేవాళ్ళకీ చెప్పే వాళ్ళకీ కూడా యాతనగా ఉంటుంది, ఒక్కొప్పుడు.

- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

## యాత్ర

యాత్రకు మజిలీ ఉంది.
పలాయనాని కేమి మజిలీ?

- బైరాగి, పలాయనం

## యుక్తం

ఎనయఁగ నెవ్వరెంత మన
సిచ్చి వచించిరి తాను వారితోఁ
బను వటనంత మాత్ర ప్రతి
భాషణమాడుట యుక్త మంద్రు.

- పింగళి, ప్రభావతీ ప్రద్యుమ్నము

## యుగపురుషుడు

జీవితాన్ని మీరి రాయగలవారు యుగపురుషులు.

- చలం, మ్యూజింగ్స్

## యుద్ధనీతి

కవిత్వము, సంగీతము, వైద్యము నెట్టిదో యుద్ధ

నీతియు నట్టిదే. అందఱకుఁ దెలిసినట్లుండును.
- విశ్వనాథ, బద్దన్న సేనాని

## యుద్ధం

వీణపట్టె కాని వింటి పట్టెఱుఁగని
కాంత కెఱుకపడునె? కదన బాధ?
- తి.వేం., పాండవ ప్రవాసము

తననే మరచిపోతేగాని యెవడూ యుద్ధరంగంలో వురకలేడు.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, టీపార్టీ

యుద్ధమును వ్యాజ్యమును ఒకటి. రెండును జయాపజయములు తెలియరావు.
- శివరామశాస్త్రి, నమశ్శివాయ

యుద్ధాలు మందుగా పనిచేస్తవి కాని ఆహారం కాదు మానవజాతికి.
- కొడవటిగంటి, అశోకవనం

పోర్సు దించకుండా ఒప్పుడూ సింగిలేండెడ్‌గా యుద్ధానికి దిక్కు.
- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

పురోగమనం మనిషి యుద్ధాలవల్లనే సాధించాడు. వేదాంతాన్ని యుద్ధంలోనే సృష్టించాడు.
- కాంతారావు, వంశధార

యుద్ధ నిర్వహణ ఒక కళ. విశిష్టమైన కళకు ప్రయోజనమంటూ ఏదీ వుండరాదనే విశ్వాసం వున్నవాడు, 'కళకోసమే కళ' - యుద్ధం కోసమే యుద్ధం.
- సూరి, చంఘిజ్‌ఖాన్

ఎందులకుఁ దెచ్చి పెట్టితి విట్టి రణము?
- తి.వేం., పాండవాశ్వమేధము

ముష్టిరణ మిఁకేటి ముష్టిరణము.
- తి.వేం., పాండవ విజయము

ఇఁకఁ దప్పదు యుద్ధము బంధునాశమున్.
- తి.వేం., పాండవోద్యోగము

తినఁజాలను నెత్తురుకూడు మాధవా!
- తి.వేం., పాండవోద్యోగము

జన్మభూమి జననికాదు
సామాన్య సుమా ఆయమ
వసుమతియగు నామె కొరకు
వల్లభు లెందరు పెనగిరి?
- అబ్బూరి, కవిత

## యువవృద్ధులు

ఏ సాహసానికైనా వెరచి దూరంగా ఉంటూ ఉన్నతోద్యోగాలు ఉన్నతస్థానాలు తప్ప మరి దేన్నీ దృష్టిలోనికి రానివ్వని యువవృద్ధుల మాట చెప్పు మొదట.
- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

## యోగం

యోగ రహస్యాలు పామరుల దగ్గిరా వెల్లడి చెయ్యటం?
- గురజాడ, కన్యాశుల్కం

## యోగి

యోగి యనఁగా లోకవృత్తమునందుండి యిది యంతయు మిధ్యయను నిశ్చయజ్ఞానము కల వాఁడు.
- విశ్వనాథ, తెఱచిరాజు

యోగికైనను బంధు వియోగ దుఃఖ
జనిత తాపంబు కోపంబుఁ బెంచుఁగాదె.
- తి.వేం., పాండవ విజయము

ఎవరైతే ద్వి (రెండు) అనే భావం నుంచి బయటపడతాడో అతడే నిజమైన యోగి. ప్రతీ మంత్రగాడూ యోగే. ప్రతీ ఆత్మయోగీ కోర్కెలనే క్షుద్రశక్తుల్ని ఆత్మ అనే మంత్రంతో అదుపులో పెట్టే మంత్రగాడే...
- వీరేంద్రనాథ్, తులసి

జార పురుషు మీఁద సద్భక్తి నిలుపుచుఁ
బతికి నిచ్చకముగ బరగు భంగిఁ
బరముకొఱకు యోగి పాటించు దేహంబు
- వేమన

## యోగ్యత

యీ తాలూకాలోకల్లా పెద్ద సారాదుకాణం యీ వూళ్లోనే వుంది. దాన్నిబట్టి యీవూరి యోగ్యత మీరు వూహించుకోవచ్చును.
- గురజాడ, మీ పేరేమిటి?

యోగ్యతనుబట్టి యోచించే యెడల మానవుడు దేనికీ అర్హుడుగాడు.
- ఉన్నవ, నాయకురాలు

మనిషికి ఏదిపోయినా, బ్రతికే హక్కు ఉంది గాని, హృదయం పోతే సమాజంలో వుండే యోగ్యత లేదు.
- నంది, నైమిశారణ్యం

అర్థంలేని బాధలో యోగ్యతలేదు.
- చలం, మ్యూజింగ్స్

యౌవనం

యేళ్ళలో ఏముంది? యవ్వనం మనసులో వుండాలి కాని

- లక్ష్మణరావు, అతడు-ఆమె

ముప్పయ్యోయేట ఆడదానికి కొత్త యవ్వనం వస్తుందట

- కాంతారావు, వంశధార

సుడిగాలి, ఎండుటాకునువలె, యౌవనము రజో భ్రాంతి నొందిన ప్రకృతి పురుషుని తనయిచ్ఛ వచ్చిన చోటికిఁ గొంపోవును.

- సూరి, నారాణి

# ర

రక్తం

చరిత్ర నిండా రక్తమే! ఈ రక్తమే చరిత్రని మార్చింది.

- అప్పల్నాయుడు, పువ్వుల కొరడా

రక్తంనుంచి రగులుతున్న ద్వేషం ఆరుతుంది. ప్రాణంతో పగతీరుతుంది.

- రంగాచార్య, మోదుగుపూలు

రక్తసంబంధం

చరిత్రలో సముచిత స్థానం సంపాదించినవా రంతా రక్తసంబంధానికి లొంగని అతీతులే.

- చిన్నబాబు, డబ్బు

రక్తి

ముక్తి సౌధంబునకు రక్తి మొదటి మెట్టు;
హరికటాక్షమందు; మనోహరి కటాక్ష
మిందు; ఫలమందు నిందు నానంద మొకటి!
రక్తి ననుభవించినఁ గాని ముక్తి కలదె?

- బాలసరస్వతి, భక్తతుకారామ్

రక్తి రక్తియే. భక్తి భక్తియే. దాని దారివేఱు. దీని దారివేఱు. ఒకటి పైది. రెండవది లోనిది. పైదాని వలన లోనిది చెడుట యెచ్చటనైనా నున్నదా? తాటికాయ పీచు వలన ముంజె రుచి తగ్గినదా?

- పానుగంటి, వీరమతి

రక్షకభటుడు

రక్షకభటులు వచ్చిరి. అల్లరికిఁ గారణమైన వారు దొరకక పోవుటచేత నేమియు నెఱుఁగని నలుగురు బడిపిల్లలను, నాదారి నప్పుడు చెంబుతో ముష్టికి బోవుచున్న బలిజవితంతు వును బట్టుకొని కొట్టులోఁ బెట్టిరి.

- పానుగంటి, సాక్షి

గవురనుమెంటు జీతమిచ్చుంచిన కనిష్టీబులుం డగా మనకెందుకు శరీరాయాసం?

- గురజాడ, కన్యాశుల్కం

నేరం సేసినోణ్ణి ఎలాగ్గా లోన ఏస్తారుగాని సెయ్యనోణ్ణి ఏస్తేనే పోలీసోడి పవరు తెలు స్తుం దన్నమాట.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

నువ్వు పోలీస్ ఉద్యోగంలో ఉండతగ్గవాడివి కావు. నీ కేదో కాస్త హృదయం ఉన్నట్లుంది.

- ఆత్రేయ, ఎవరు దొంగ?

పోలీసోళ్ళని తిట్టకమ్మా! పేరు రాసుకోగలరు! దేముడుకా దొల్లకోదానికి!

- కొచ్చర్లకోట, ఓన్లీడాటర్

పోర్సులో ఉండాలంటే మనిసికి తెగవా తెంపరి తనం ఉండాల.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

జెనాన్ని పోలీసోడు సితగొట్టి సిత్తరయింస లెట్టి సావబాది సెవులు మూసిన్నాడు దేవు ళ్ళేడు.

- రావిశాస్త్రి, మూడు కథల బంగారం

పోలీసోళ్ళల్లోనూ మాత్ములుంటారు!

- రావిశాస్త్రి, మూడు కథల బంగారం

దొంగ సెప్పకపోతే పోలీసోడికి ఇన్వస్టిగేసన్నేదు.

- రావిశాస్త్రి, మూడు కథల బంగారం

దేవుడూ పోలీసోడూ లేకండ రాజ్జెం సరిగనడద న్నాను.

- రావిశాస్త్రి, మూడు కథల బంగారం

దేవుడే దిగినప్పుడు డియ్యేస్పీ గోడు దిగడా? !

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

మందుమీదు ఉన్న పోలీసోడు మరియాదగా నడుసుకోవాలి.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

పుల్లూ పాంవులూ ఏనుగులూ పగోణ్ణి మరిసి పోవంట. పోలీసోడు గూడ అంతే.

- రావిశాస్త్రి, మూడుకథల బంగారం

దేవుఁడు మనసైడు ఉన్నా లేప్పోయినా పోలీ సోడు మనసైడుంటే మనకి డేంజరుండదు.

అంతా సన్నేసే!

- రావిశాస్త్రి, మూడు కథల బంగారం

మన పోలీసు వాళ్ళు గాలివాటాన్ని బట్టి నవర సాల్లోనూ యేది ఆ క్షణానికి అవసరమైతే దాన్ని ఒలికిస్తారు.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

పోలీసోడు, ఒప్పుడు ఉగ్గర నరిసిమ్మూర్తి అయ్యి పోతాడంటె ఆడి పెర్మిషన్ లేకుండ నేరం జరిగితే ఉగ్గర నర్సిమూర్తయి పోతాడు.

- రావిశాస్త్రి, మూడుకథల బంగారం

ఈ దేసంలోనేగాదు, ఏదేసంల అయిన సరె పోలీసోడంటె గొప్ప డేంజిరస్ మనిసని తెలుసుకో?

- రావిశాస్త్రి, మూడుకథల బంగారం

పోలీసోడి సేతల్లో దిక్కుమాలిన సవ్వేగాని సిన్మాయీరో సవ్వూ ఉండదు.

- రావిశాస్త్రి, మూడుకథల బంగారం

పోలీసు వాళ్ళ చేతుల్లో పడితే పులిబోనులో పడ్డట్టే. ఎక్కడికక్కడ ఏరుకు తినేస్తారు.

- సూర్యారావు, పంజరం

పోలీసు ఆఫీసర్ని. నేను సాక్ష్యాలకీ సంవన్నాలకీ తిరిగితే నా నౌఖరీ నిలుస్తుందా?

- గురజాడ, కన్యాశుల్కం

...ఒత్తికొత్తినే, తనకు పట్టని ఎవరి చావు కోసమో, వంద మంది శత్రుత్వాన్ని కొని తెచ్చుకొని వాళ్ళను కొట్టి తను దెబ్బలు తిని కసిపెరగ్గా, కావాలని రాక్షసత్వాన్ని కౌగలించుకోడం పోలీసువారి దురదృష్టం. కేవలం పొట్టకూటి కోసం ఇరుపక్షాల కోపాలకూ, నిందలకూ గురి కావడం, పాలకుల దృష్టిలోనూ, పాలితుల దృష్టిలోనూ, సమంగా చులకన కావడం వాళ్ళ దౌర్భాగ్యం.

- కాళీపట్నం, శాంతి

పైకి గాయం కనబడదుగాని పోలీసువాళ్ళ దెబ్బల్లా లోపల తహతహ పుట్టిస్తాయి.

- గురజాడ, కన్యాశుల్కం

ఇక పోలీసుల నెవరెరుగరు రాజ్యాంగం నియమించిన, సాయుధగూండాలని?

- ఛాయారాజ్, శ్రీకాకుళం

పోలేరమ్మ తల్లికీ పోలీసోడికీ అడ్డేటి?

- అప్పల్నాయ్డు, పోడు-పోరు

పిశాచమంటే నాకు భయం. పోలీసోళ్ళంటే నాకు భయం. మరెవళ్ళకీ లచ్చపెట్టను.

- గురజాడ, కొండుభట్టీయము

వేరే దొంగలు దేనికీ? ఆ పనికాస్తా పోలీసులే జేసి పెడుతుంటె?

- బొల్లిముంత, మృత్యుంజయులు

తల పగులగొట్టుకన్నా పోలీసువాడు యెట్లా ప్రవర్తిస్తాడో సూచనప్రాయంగానైనా చెప్పలేం.

- పద్మనాభరెడ్డి, కుట్ర

వెనకటికి యవరో పోలీసు, తల్లి కూరగాయలు పుచ్చుకుంటే జుల్మానా వేశాట్ట!

- గురజాడ, కన్యాశుల్కం

మనిషిని చంపేసి చచ్చిపోయింది తామేనని చెప్పుకోవడం పోలీసోళ్లకి అలవాటే.

- మహీధర, దేశం కోసం

పోలీసులున్నచోట అల్లరి లేకపోవడం జరగదు.

- మహీధర, దేశం కోసం

యమదూత లెట్టిరో యెఱుఁ
గమనెడి లోపమ్ముఁ దీర్పఁగా పోలీస్వా
రి మహిఁ బ్రభువు లేర్పఱచిరి...

- తి.వేం., శతావధానసారము

ఊరందరికాడ మనం ముష్టెత్తుకొస్తె మనకాడ ముష్టికి బయల్దేరుతారు ఈ పోలీసోళ్లు.

- కాశీవిశ్వనాధం, మార్పు

రక్షణ

అందరూ అవివాహితులే అయినప్పుడు ఇద్దరు ఆడాళ్ళ మధ్య కూచున్న మొగాడికి పూర్తిరక్షణే నండి.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

మైనారిటీవర్గాల వారిని సంరక్షించటం మన రాజ్యాంగ లక్షణం కదా. మరి మందేశంలో ధనవంతులు మైనారిటీ వర్గంవారే కదా.

- విశ్వం, పేదవాడికి జై

ఆకసమంటే ఓవరుబ్రిడ్జి
పక్కన పరచిన పథవేదికలూ
పచ్చని ఎఱ్ఱని దీపంకాంతీ
తగ్గించున మన ప్రాణాపాయం?

- మాచిరాజు, రహదార్లు

సముద్రాంతర నాయకులు పెట్టిన భిక్ష
ప్రజల నిద్రమైకం వదలకుండా కట్టిన రక్ష

- కుందుర్తి, ప్రస్తావన

అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు ందు
ష్టాంగంబు ఖండించి శే
షాంగ శ్రేణికి రక్షసేయు క్రియ.
- పోతన, భాగవతము

*రంకు*

పదివేల నోము నోచిన
వదలదె యొక బంకు వంక వన్నియ సుంకా!
- చాటువు

*రంకుమొగుడు*

మొగుడు చచ్చి ముండేడుస్తుంటే, రంకు మొగుడు కొంగట్టుకు లాగాట్ట.
- కాశీపట్నం, స్నేహం

*రంగు*

తొండ, గొంగళిపురుగు, రాజకీయ నాయకుల్లాం టివి. మంత్రి అవగానే రంగులు మార్చేస్తాయి.
- వీరేంద్రనాథ్, ఒకరాధ ఇద్దరు కృష్ణులు

*రచన*

సమర్థులయిన వారు వ్రాయపోవుట చేత సత్యము సహితము కొన్ని సమయములందు మనోహరముగా నుండకపోవచ్చును.
- కందుకూరి, సత్యవతీ చరిత్రము

శాశ్వతత్వం పొందిన ప్రపంచ కవిత్వం పద్య రూపంలోనే నిల్చిఉంది.
- భమిడిపాటి, పద్యం-రాగం

రచన గొప్పదయితే వికాసం జాతికి, తత్కర్తకు కాదు. రచన చెడ్డదయితే నష్టమూ జాతికే, అదీ కర్తకు కాదు.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, అనుభవాలూ-జ్ఞాపకాలూనూ

రచనను రచనా నైపుణ్యం పెట్టి కొలిచి విలువ కట్టాలసిందేకాని రచయిత జీవితం పెట్టికాదు. రచయిత స్వభావాన్ని కొలవాలసొస్తే రచయిత జీవితాన్ని పెట్టి కొలవాలి. రచనను పెట్టికాదు. జీవితాన్నుంచి రచన దూరంగా వుండలేక పోయినా జీవితానికంటే రచన ఎంతో ఎత్తుకు లేవగలదు; అనంత దిగంతాల్లో విహరించగలదు!
- సంజీవదేవ్, రచయిత

మంచి వాళ్ళని గురించి వ్రాయొచ్చు. చెడ్డవా ళ్ళని గురించి వ్రాయొచ్చు; కాని సాధారణమైన వాళ్లని గురించి వ్రాయడం ఎంతోకష్టం.
- బుచ్చిబాబు, నన్నుగురించి వ్రాయవూ?

గంట మూనెదన్, రవ్వలు రాల్చెదన్ గరగరల్ పచరించెద నాంధ్రవాణికిన్.
- జాషువా, ఖండకావ్యము

ఏ చండ శాసనుడికీ లేని శక్తి భాషకి ఉంది. సంఘానికి పోలీసులు ఎలాంటివారో భాషకి వ్యాకరణం అలాంటిది. ఆస్తి ఉన్న వాళ్ల నేరా లను పోలీసులు కామాపు చేస్తారు. పండితుల దోషాలను ప్రౌఢప్రయోగాలంటుంది వ్యాకరణం.
- శ్రీశ్రీ, అనంతం-ప్రారంభం-మూడు

ఎక్కడా జరగని విషయాలైతే సాహిత్యంగా రాయాలి.
- కొడవటిగంటి, గ్రహాంతరయాత్ర

కవిత్వం అనువదించటమే నిరుపయోగం. నాట కానువాదాలు ఇంకా నిరుపయోగం.
- కొడవటిగంటి, ట్యూటర్

రచన కూడా ఒక వ్యసనమే! అలవాటుపడ్డ చేతికి, చెయ్యాడుతున్నంత సేపు ఆటవిడుపు ఉండదు.
- రాధాకృష్ణ, దంతవేదాంతం

గొప్పవాడు రాసిన చెత్తలో గొప్పదనం చూడటా నికి ప్రయత్నిస్తారు. రాసిందాన్ని చూడరు.
- జయరాం, మరుగుజ్జులు

దేన్ని గురించేనా ఉపన్యసించటం తేలికగాని వ్రాస్తే చాలా వ్రాయవలసివస్తుంది.
- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

బాధలోనుంచి గాని రచనలురావు. కాని ఆ రచ నలు ప్రజలకు సుఖాన్నే అందిస్తాయి.
- పాప, ఫలశ్రుతి

అరుంధతి మగఁడెవఁడోమన మెఱుఁగకపోయిన తరువాత హెన్రీ ది ఎయితు కెందఱు భార్యలో తెలిసికొనుట మనకెందులకు? చిత్రకూట పర్వ తమున జాబాలి చేసిన నాస్తిక బోధమునకు శ్రీరామచంద్రమూర్తి యెట్లు ప్రత్యుత్తర మిచ్చి నాఁడో మనకుఁ దెలియక పోయినప్పుడు ప్లేటోసు డయలాగ్సు తలకిందుగ నప్పఁజెప్పిన నేమి వినియోగము? శ్రీ కృష్ణభగవానుఁడు ధృతరాష్ట్ర సభలో రాయబారపుఁ బలుకు లెంత సందర్భముగా నెంత సమీచీనముగా, నెంత మధురముగా, నెంత యుక్తియుక్తముగా, నెంత రాజతంత్ర జ్ఞాన సంపూర్ణతతోఁ బలికెనో యెఱుఁగని మనకు పార్లమెంటులో గ్లాడుస్టను బడ్జెటు స్పీచి వచో విధేయమై యున్ననేమి?

మన పూర్వ దేశస్థితిని గూర్చి గ్రంథములు మొదట మనకుఁ గావలయును.

- పానుగంటి, సాక్షి

లేనప్పు డుండఁ దలఁచినవాడు, చచ్చిన తరు వాత బ్రదుకఁ దలఁచినవాఁడు స్వీయచరిత్రము వ్రాసికొనక తప్పదు.

- పానుగంటి, సాక్షి

కూలికి మాత్రము గ్రంథ మెన్నఁడును వ్రాయఁ గూడదు. ఇట్టివాఁడు నక్కమోరు - నారకురుపు - నయనరోగము మొదలైన రోగములు లేక యెనుఁబది సంవత్సరములవఱకు జీవించును.

- పానుగంటి, సాక్షి

కుటుంబ గాథలకున్న శక్తి పురాణగాథలకు లేదు.

- పానుగంటి, సాక్షి

బాగుగా మాటలాడఁగలవాఁడు బాగుగా వ్రాయలేఁడు. బాగుగా వ్రాయఁగలవాఁడు బాగుగా మాటలాడలేఁడు.

- పానుగంటి, సాక్షి

గ్రంథకర్త పాచకుని వంటివాఁడు. ఉపన్యాసమి చ్చునట్టివాఁడు నట్టివాఁడే. ఒకరియందుఁ బాక్షి కము లేక, యొకరియందుఁ వైషమ్యములేక, యథార్థముగా మనుజుల జోలికియే పోక సంఘములో నున్న దురాచారములను, దురభి ప్రాయములను, దుష్టరుచులను, దుశ్చింతలను సాధ్యమైనంతవఱకుఁ దగ్గింప నెంచి యీ యుపన్యాసములను సత్యబద్ధులమై దైవముఖ మును జూచి, నిర్భయముగా, నిర్దాక్షిణ్యముగా నిచ్చుచున్నాము.

- పానుగంటి, సాక్షి

కలదుగాదె 'అనుక్తంబు' గ్రథనమందు.

- రాయప్రోలు, రమ్యాలోకము

చూపులకేగాని, మేపులకు పనికి రానిది రచనా వృత్తి.

- రాజారాం, ధర్మగ్లాని

**రచనాకాలం**

పట్టని నిద్రను పట్టుకునే ప్రయత్నంలో
ప్రతివాడు కండ్లు మూసుకునే వేళ;
నేను కవిత్వం రాసుకునే వేళ

- కుందుర్తి, తెలంగాణ

**రచయిత**

సారస్వత రంగంలో
చెదపురుగులు ఎవ్వరు?
కలం దొంగలంతా ఆ
కులం వారలే గురూ!

- మల్లారెడ్డి, యక్షప్రశ్నలు

తనకి కావలసిన ఆడది దొరికి, తనకీ ఆమెకీ తృప్తి అయ్యేట్టు అందరిమల్లే అనుభవించే వాడు కథలూ కవిత్వాలు ఎందుకురాస్తాడురా? వీళ్లందరూ sexual perverts, లేక romantic lunatics.

- చలం, వాళ్లు నలుగురూ

రచనను రచనా నైపుణ్యం పెట్టి కొలిచి విలువ కట్టవలసిందే కాని రచయిత జీవితం పెట్టి కాదు. రచయిత స్వభావాన్ని కొలవాలిస్తే రచయిత జీవితాన్ని పెట్టి కొలవాలి. రచనను పెట్టి కాదు. జీవితాన్నుంచి రచన దూరంగా వుండలేకపోయినా, జీవితానికంటే రచన ఎంతో ఎత్తుకు లేవగలదు. అనంతదిగంతాల్లో విహరిం చగలదు.

- సంజీవదేవ్, రచయిత

రచయిత గొప్పతనం మరణించటం మీద ఆధా రపడి వుంటుంది.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

ఈనాడు పాఠకుల కంటె రచయిత లెక్కువైపో యారు.

- సూర్యారావు, శ్రీమతులు-శ్రీయుతులు

చక్రవర్తుల ఇతివృత్తాలే కదా కవులకు వర్ణించత గవి?

- సుబ్రహ్మణ్యశాస్త్రి, రాజరాజు

కథలు రాసే వాడికీ, పాత్రలకూ మధ్య ఎంతో ఆత్మీయత ఉండాలి.

- కొడవటిగంటి, ముడిసరుకు

కథకుడు జర్నలిస్టుకన్న వెయ్యిరెట్లు విషపురుగు. వాడు జీవితం వేసిన ప్రతి కాటుకూ అంతకు అంతగా జీవితంపైన పగ తీర్చుకుంటాడు.

- కొడవటిగంటి, జీవితం

సమర్థులైన రచయితలు కాంట్రాస్టు కోసం విరు ద్ధతత్వాలు గల పాత్రలను ఒకేసారి వర్ణిస్తారు.

- కొడవటిగంటి, అనామిక

అసలు ఎవరికీ, ఎవరిని గురించీ ఏమీ తెలీదనే చెప్పొచ్చు, కథలూ, నాటకాలూ రాసే వాళ్ళకి వాళ్ళపాత్రలను గురించి తప్ప.

- కొడవటిగంటి, దుష్టగ్రహం

రచయితలు పాఠకులకు ఆలోచింపజేయడానికి బదులు వాళ్ల ఆలోచనలకు గిలిగింతలు పెట్టడానికీ, కన్నీళ్ల మాటునా వెర్రి కేకల వెనుకా ఆలోచన తోచకుండా చేయడానికీ కొన్ని అడ్డుదారులు తొక్కుతున్నారు.

- మహీధర, స్వయంవరణం

జీవితాన్ని వెనక్కి తిరిగి చూసుకుంటేగాని అందులోని రుచులు సరిగా తలకు పట్టవు. అందుకే కథకులు కథలన్నీ గతంలో ఉంచి రాస్తారు.

- కొడవటిగంటి, ఐశ్వర్యం

## రతీ మన్మథులు

ఒక్క ఇండియాను మినహాయిస్తే- ఏ దేశంలో చూసినా మన్మథుడు అక్షరాభ్యాసపు వయస్సున్నా రాని పసిగుడ్డు- రతీదేవికి అంగాంగ వైభవం అంతా పుష్కలమే కాని, కళ్లమాత్రం ఉండవు. అంతమాత్రాన ఆదేశాల్లో రాత్రులూ, పవళ్లూ గొడ్డు పోతున్నాయా?

- రామకృష్ణశాస్త్రి, అసుర సంధ్య

## రంధ్రాన్వేషణ

అసలు పోలీసు బుద్ధులకు రంధ్రాన్వేషణ అంటే మహారంజు.

- పులికంటి, చిరునవ్వువెల

అన్వేషించే దుర్బుద్ధి కలగాలేగాని సంఘంలో రంధ్రాలు ఎప్పుడూ కనిపిస్తూనే ఉంటై. అయితే ఆ పని రంధ్రాన్వేషణ చేసే వ్యక్తికే నష్టం అని తెలుసుకొని ఆ వృత్తికి దిగరాదు.

- గోపీచంద్, ఆత్మపరిశీలన

## రసభంగం

...రసభంగము సంగతిలోన మెత్తురే?

- నాచన సోమన, ఉత్తరహరివంశము

## రసం

కరుణ శృంగారములు రెండే
బుజురస ప్రతిపత్తి నందెడి
ఒకటి కలుషము కడుగు; మఱొక్కటి
కాల్చు కాయము శుద్ధికై

- రాయప్రోలు, శ్రీరవ్యాత్

రసములకు నెల్ల శృంగారరసము 'తల్లి'.

- రాయప్రోలు, అమలిన శృంగారము

## రసికత

రసికుఁ డగువాఁడు తనదు జాలుసికలోనఁ దులసినే యిడుకొనునొ? జాదులనె యిడునొ?

- వేంకనార్యుడు, ఆంధ్ర భాషార్ణవము

## రసికుడు

గడివోయిన పువ్వులు మఱి
ముడుచునె రసికుఁ డగువాఁడు?

- అనంతుడు, భోజరాజీయము

రసికుడంటే మాసాంప్రదాయంలో శుద్ధచవట అని అర్థం.

- రామకృష్ణశాస్త్రి, కులాసా

## రసీదు

నిజంకన్నా రూలు, జబ్బుకన్న రసీదులు ముఖ్యం.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

## రహదారి

బస్తీ రోడ్డుకేసి చూస్తే జీవితం అంటే పెద్దపోటీ పందెం అనిపిస్తుంది. ఈ పందెంలో ఎవడి బాధ వాడిది అని తెలుస్తుంది.

- భమిడిపాటి, బస్తీ-దుమ్ము

రహదారి చరిత్ర సమస్తం
సైజమ్మాలను పాడుచేయటం

- మాచిరాజు, రహదార్లు

## రహస్యం

పరమశివుని యెదుట నివేదింపరాని రహస్యము లుండునా?

- విశ్వనాథ, కడిమిచెట్టు

తనలో తాను రహస్యంగా మాట్లాడుకునే మాటలు యెవరూ వినకూడదు.

- కందుకూరి, అసహాయశూర ప్రహసనము

ఆడవారి నోటిలో నువ్వుగింజకూడా నానదంటారు.

- సభా, అపూర్వం

యెందరికి తెలిసినా రహస్యం రహస్యమే.

- పద్మనాభ రెడ్డి, మాయ

రహస్యంలో జరిగేదానికి మనం యేమీ యిలాకా పుచ్చుకోకూడదు.

- కందుకూరి, తిర్యగ్విద్వన్మహాసభ

రాసేవాడికి తెలియని రహస్యం చదివేవాడికి తెలుస్తుంది.

- సౌభాగ్య, సింహావలోకనం

ఎడ్వొకేటు దగ్గిరా డాక్టరు దగ్గిరా రహస్యం

దాచకూడదు.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

కొన్ని విషయాలు మనం మనలోనే సమాధి చేసుకోవాలి. ఎందుకంటే మనము సన్నిహితులకి చెప్పిన రహస్యం ఆ సన్నిహితుడి సన్నిహితుడివరకు వెళ్లిపోయే ప్రమాదం ఉంది.

- శ్రీరామచంద్రమూర్తి, వెన్నెలదారి

రహస్యము పెదవి దాటిన పృథివి దాటునంద్రు.

- భానుమూర్తి, హేమలత

కొండమీద గోల యేమంటే
పోలీసోళ్ల మంతనాలు అన్నట్టు

- శ్రీరమణ, న్యూనుడి

నీళ్లగది దృశ్యంలోనే నిర్మాత ఐశ్వర్యం ఉంటుంది.

- శ్రీరమణ, న్యూనుడి

## రాక

ఊరక రారు మహాత్ములు
వా రథముల యిండ్లకడకు వచ్చుట లెల్లన్
గారణము మంగళములకు
నీరాక శుభంబు మాకు నిజము మహాత్మా!

- పోతన, భాగవతము

ఆశీర్వదించిన యంతఫలము
నీవు వచ్చిన కతమున నేఁడు గలిగె.

- కదిరీపతి, శుకసప్తతి

ధనం వొచ్చాక, బీదతనపు సుఖంపోయిన వాళ్ళు అనేకులు.

- చలం, మ్యూజింగ్స్

## రాక్షసత్వం

పైకి దైవత్వం కనబడితే అడుగున దాని ప్రమాణంలో రాక్షసత్వం ఉంటుంది. పైకి రాక్షసత్వం కనబడితే కనబడకుండా అంత దేవత్వమూ ఉంటుంది.

- కొడవటిగంటి, అనుభవం

చేతిబిడ్డను నూతిలో వేసి లోతుచూడ్డానికి సిద్ధపడినట్లు.

- సామెత

మనిషిలోని అమాయకత్వాన్ని అనువుగా తీసుకొని బాధించటం మొదలు పెడితే వాళ్లను రాక్షసత్వమే ఆవరిస్తుంది.

- శ్యామలారాణి, జీవవాహిని

## రాక్షసుడు

ఈ అనారతబాధా ప్రహేళికలకు
కుమిలి ఏడ్చెడి నన్నుటు లామతించి
వట్టి మాటల నిలబెట్టి పట్టుదలకు
రాక్షసుడ వీడు? చేబదు లడుగుతాడు?

- మాచిరాజు, ఎవ్వడే వీడు?

## రాగం

రాగ మనునది కంటికలక లాగున నంటురోగము కాఁబోలు!

- పానుగంటి, చూడామణి

రాగ మిచ్చినన్ని శక్తులు యోగమైన నీయఁజాలదు

- పానుగంటి, చూడామణి

## రాచరికం

రాజరాజశ్రీ అప్పారావుకి
రాచరికంచే పొడిదగ్గొస్తే
గుమస్త పంతులు సుబ్బన కూడా
పొడి దగ్గంటూ మిరియము బెల్లము
బుగ్గనెట్టుకొని గంతులేసెనట!

- జరుక్‌శాస్త్రి, పేరడీలు

దొరల రాచరికమె మెరుగయ్యె ననిపించె
మారు పల్కువేల మంతిరన్న!

- జాషువా, ప్రశ్న

ముసలి నక్కకు రాచరికంబు దక్కునే?

- దాశరథి, రైతుదే

సింహాసనం ఎక్కితే రాజ్యం ఏలడం రావొద్దూ?

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

పలు విత్తుల ఙంకుల రాచవీటిలో
నస్తును బస్తు నాయెఁ గవి
తార్థుల కచ్చటఁ గూడుగల్గునా?

- శ్రీనాథుడు, చాటువు

## రాజకీయం

రాజకీయ మనేది మన
బ్రదుకుల కూపిరిలాంటిది

- శ్రీశ్రీ, రాక్షస ఉగాది

రాజకీయాల్లో పెద్ద పాము చిన్న పాముల్ని నిర్దాక్షిణ్యంగా మింగటంద్వారానే పైకి ఎగబాకుతుంది.

- సావిత్రి, ఒడిలో చెలి మోహనరాగం

జనాలకు వాగ్దానాలు చేయడం రాజకీయ

నాయకుని ప్రధాన కర్తవ్యం. అవి తిరిగి తీర్చక పోవడమన్నది వారి సహజ లక్షణం.

- చిన్నబాబు, డబ్బు

నక్క తోక ఊపుకుంటూ ఊళ్ళోకి వచ్చి రాజకీయాల్లో స్థిరపడిపోయింది.

- రాజేంద్ర, గుండెచప్పుళ్ళు

వీళ్లు మాయ లెరుగని వాళ్లు. మనము వీళ్లను మాటలు చెప్పి టోపీవేసి ఓట్లు సంపాదింపవ లెను. ఈ పరియాయము నాతో మీరుండి ఒడు పులన్నీ చూచి, ఇంకొక మాటు ఎలక్షనుకోసము ప్రయత్నము చెయ్యండి.

- చిలకమర్తి, ఓట్లకై తిరుగుట

పాలిటిక్సంటే ఏమిటి? ... ఇచ్చకాలూ, పోటీలూ.

- రావిశాస్త్రి, నిజం

అసలు రాజకీయమంటే... గడ్డి తినడం, తిని పించడంగదా.

- చిన్నబాబు, డబ్బు

ఒకసారి గొడవొచ్చి విడిపోయాక, అప్పటివరకూ కలిసి పనిచేసినవారిమీద బురదజల్లటాన్నే 'రాజకీయం' అంటారు.

- వీరేంద్రనాథ్, ఆఖరిపోరాటం

ఒకప్పుడు దేశంలో లిటిగేషన్ ఎంత జాస్తిగా ఉండేదో యిప్పుడు రాజకీయాలంత జాస్తిగా ఉంటున్నాయి.

- కొడవటిగంటి, అనామిక

రాజకీయాధికారం కోసం అసత్యారోపణలూ, అబద్ధపు ప్రచారాలూ చెయ్యటం మనిషి ధర్మంట.

- కొడవటిగంటి, గ్రహాంతరయాత్ర

సాహిత్యసభ అంటారు, రాజకీయాలు మాట్లాడ తారు. సన్మాన సభ అంటారు, రాజకీయాలు మాట్లాడతారు.

- కొడవటిగంటి, అనామిక

రాజకీయాల్లోకి దిక్కుండానే ఉండాలిగానీ, దిగిం తర్వాత అటు దెబ్బలకీ, ఇటు దండలకీ కూడా సిద్ధపడాలి.

- వెంకటేశ్వరరావు, సమాధికడ్తున్నాం చందాలివ్వండి

ఏదేనా, ఇంగ్లీషువాడిని చూసి మనం నేర్చుకో వాలి రాజకీయం.

- లక్ష్మణరావు, అతడు - ఆమె

ఈ రోజుల్లో సినిమాలకంటే చులకనగా రాజకీ యాలు మాట్లాడినట్లు కాదుగా ఆ రోజుల్లో!

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

రాజకీయాలపట్ల ఆసక్తి వున్నవాళ్లు, నిస్వార్థంగా జనంకోసం పనిచేయగల విద్యావంతులూ వుద్యోగాలో చేస్తుంటారు. ఏ వుద్యోగాలకీ అర్హ తలేని వాళ్ళూ, స్వార్థం తప్ప యింకే ప్రేరణ లేని వాళ్లూ మాత్రమే రాజకీయాల్లో చేరుతు న్నారు.

- కాశీపట్నం, శాంతి

రాజకీయాల్లో దిగి దెబ్బలు తినడానికీ జైళ్ళకెళ్ళ డానికీ స్కూళ్లలో చదవాలేమిటి?

- మహీధర, దేశంకోసం

వ్యాపారాలు లాభాలు ఉన్నచోట రాజతంత్రానికి సిగ్గూ అభిమానం పనికిరాదోయ్; ఎప్పటికె య్యది ప్రస్తుత మప్పటిదా కా మాటలాడి...

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

ఏ ఎండకాగొడుగు పట్టటం రాజకీయపు లక్షణం.

- విశ్వం, పేదవాడికి జై!

రాజకీయాల్లో ప్రత్యర్థుల్ని మిగల్చకూడదు.

- పతంజలి, అప్పన్నసర్దార్

రాజకీయం జేసినప్పుడు వీళ్లనీ వాళ్లనీ ఏడిపిం చాలి గాని మనం ఏడవకూడదు. ఒకవేళ ఏడి చినా పత్రికా విలేఖరుల దగ్గర అసలు ఏడవ కూడదు.

- పతంజలి, అప్పన్నసర్దార్

రాజకీయాల్లో తల్లికి మొగుడ్నాగ నేకపోతే కుదర్దు.

- పతంజలి, అప్పన్నసర్దార్

పై వాళ్ళని నమ్మకు. మీది వాళ్లని నమ్మకు. అదే రాజనీతి.

- పతంజలి, అప్పన్నసర్దార్

## రాజద్రోహి

అంతరం బెఱింగి రాజద్రోహంబు గావించిన వానిని సర్వ విధంబుల వెరార్పం జనదు. వెలా ర్చిన వాఁడు పగఱంగూడి పగ సాధింపంగోరుఁ గాని తన చేసిన దోషంబు పరికింపంబోఁడు.

- చిన్నయసూరి, మిత్రభేదము

## రాజకీయవాది

అసలైన అబద్ధాల కంతు లెరిగి
అరచేతిలో స్వర్గం చూపువాడే

ఆరితేరిన అసలు రాజకీయవేత్త.

- రాజేశం, నిజం

రాజకీయవేత్తలు కొలంబస్‌లా తయారవు తున్నారు. ఎక్కడ బయలుదేరతారో తెలియదు. ఎక్కడికి వెళ్లాలో తెలియదు. ఎటు చేరతారో తెలియదు. పైగా కొలంబస్‌లాగే.... డబ్బు కూడా వీళ్లది కాదు.

- శ్రీరమణ, వ్యాఖ్యానందం

గొరాబు ఒక బిడ్డ గణికయైనట్లు
మా రాజకీయాలు మలినంబులయ్యె
మ మ్మేలవలసిన మా ప్రజాపతులు
దొమ్మిలో దిగినాదు దుర్విధి వలన!

- రామకృష్ణశర్మ, మా గోడు

రాజకీయ నాయక జంతువులు బతికివున్నప్పుడే గాక, చచ్చి విగ్రహాలుగా మారి కూడా ప్రజల భవిష్యత్తుని విషయిస్తూనే వుంటారు. తమ సంతతిని పెంచుకుంటూనే వుంటారు.

- నగ్నముని, సిమెంటు సంతతి

అల్లుడ్ని నమ్ముకున్న రాజకీయనాయకుడుగాని, కొడుకుని నమ్ముకున్న రాజకీయ నాయకుడు గాని లోకంలో ఎప్పుడైనా బాగుపడ్డాడా?

- పతంజలి, అప్పన్నసర్దార్

మే ఇద్దరం రాజకీయనాయకులం... ఒకరు చెప్పింది వినడం మాకు అలవాటులేదు.

- పతంజలి, అప్పన్నసర్దార్

ఏమైనా డిఫికల్టీ లొచ్చినపుడు ఒక ఠస్సా వేశావంటే అది బ్రహ్మభేద్యంగా వుండాలి. పొలిటీషనంటే మరేవిఁటనుకున్నావ్?

- గురజాడ, కన్యాశుల్కం

ఒపీనియన్స్ అప్పుడప్పుడు ఛేంజి చేస్తుం టేనేగాని పొలిటీషను కానేరడు.

- గురజాడ, కన్యాశుల్కం

పొలిటీషియన్లు పిస్తోళ్లతో హత్యలు చెయ్యబ డతారుగానీ, హత్యలు చెయ్యరు.

- నంది, మనిషి చావకూడదు

విషం లేని నాగుబాము, అధికార తృష్ణలేని రాజకీయుడు ఉండరు.

- కృష్ణరావు, పాపికొండలు

రావణకాష్ఠాలముందు రాజకీయ భేతాళుడే చలికాచుకుంటాడు.

- సౌభాగ్య, సింహావలోకనం.

ఆరె వెర్రి వెధవాయ్! రాజకీయవాదికి ఆప్తులే వి(?)ట్రా?

- సూరి, చంఘిజ్‌ఖాన్

## రాజనీతి

పేదవాడి గురించి కబుర్లు చెప్పి, వాడికేదో మేలు చేస్తున్నట్టు కనిపించటం నేటి రాజనీతిజ్ఞత.

- విశ్వం, పేదవాడికి జై

అహం దెబ్బతిన్నప్పుడు కూడా మామూలుగా ఉండగలగడం గొప్ప రాజనీతిజ్ఞతకు చిహ్నం.

- వీరేంద్రనాథ్, ఆఖరిపోరాటం

## రాజానుగ్రహం

రాజానుగ్రహముఁ బొందిన వానికి సర్వసంప దలు గలుగును.

- చిన్నయసూరి, మిత్రభేదము

## రాజీ

సంసారం నడుపుకోడానికి కాస్త పొత్తూ ప్రేమా వుంటే చాలు. మొత్తంమీద రాజీమార్గాన్నే పోతుండాలి.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

పదే పదే వాయిదాలు పడితే కొంతమంది పార్టీలు ఖర్చులు భరించలేక రాజీ చేసుకుంటా రని జడ్జీ గారికీ తెలుసు.

- రావిశాస్త్రి, కోర్టుకు రాని పక్షులు

అనేక విషయాలలో సమాధానాలు పడుతూ వుంటేనే జీవితం ఎవరికైనా గడుస్తుంది.

- చాసో, లేడీ కరుణాకరం

ఎంతటి వారైనా ఏదో ఒకదశలో జీవితంతో రాజీపడవలసిందే.

- ఆనందారామం, మరో ముందడుగు

## రాజు

రాజును చూచిన కంట, మగని చూచిన మొట్టబుద్ధి పుట్టినట్లు.

- సామెత

రాజు శాసనం రక్త శాసనం
రాజు పతాకం రక్త పతాకం

- పులిపంజా, పులిపంజా

రాజులు విశ్వసనీయులుగారు. వారితోఁగూ టములు పాములతోఁ జెలగాటములు. వారి పోరాటములు కత్తులమీద సాములు. వారి నెయ్యములు పులులతోడి వియ్యములు. వారి

యాగ్రహంబులు చిరస్థాయికంబులు. వారిచ్చు సంపదలు మెరపుదీగలట్లు చంచలంబులు.

- చిలకమర్తి, కర్పూరమంజరి

రాజ్యం చేసే వాడంటే మొదట బిచ్చగాడు, తరువాత దొంగ.

- విశ్వనాథ, ముగ్గురుబిచ్చగాళ్లు

ఇప్పుడు పెజ బట్టి రాజు, కుష్టు పెజుంటే కుష్టోడే యేలతాడు! కుళ్లపెజయితే కుళ్లినోడే యేలుతాడు.

- కాంతారావు, వంశధార

పృథివీ నధిపులు నూతన ప్రియులుగారె?

- పోతన, భాగవతము

ఎవ్వరిని విశ్వసింపక యెల్లప్రొద్దు
నాత్మరక్షాపరుం డగునది విభుండు.

- నన్నయ, ఆదిపర్వము

రాజు తలచిందేను ధర్మం
రాజు చెప్పిం దెల్ల శాస్త్రం.

- గురజాడ, కన్యక

రాజులు మిక్కిలి దుర్మార్గులు. వారి వలన నెప్పుడెవరి కపకారము జరుగునో తెలియదు. ఎవఁడు తనపగ తీర్చుకొనుటకుఁ బ్రయత్నించునో తెలియదు.

- విశ్వనాథ, కడిమిచెట్టు

... నమ్మియుండగా
వలవదు బుద్ధిమంతులు న
వప్రియులైన ధరాధినాథులన్.

- నన్నయ, ఆదిపర్వము

దొంగల్నిచూస్తే నాకు భయం లేదుగాని దొరల్ని చూస్తే భయం.

- చలం, హంపీకన్యలు

దొరలంతా కూడు తిన్నాక పగలే తొంగుంటారు. రాత్రేళ ఆళ్లకి నిద్దర తక్కువ.

- వెంకటరమణారావు, కొలువు

జీతము పుచ్చుకొనుట చేత నుపాధ్యాయులు సేవకు లగుచున్నారు. వేతనమిచ్చు చుండుట చేత విద్యార్థులు ప్రభువు' లగుచున్నారు.

- కందుకూరి, హాస్యసంజీవని

రాజభటుఁడొక్క రాజునకే భటుఁడు కాని
రాజు ప్రజ కందఱకు భటుఁడు.

- పానుగంటి, సాక్షి

మానిండే మందు అన్నట్లుగా ఎక్కినవాడే ప్రభువు.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

కాసులు గలవాఁడె రాజు గదరా ,

- బద్దెన, సుమతి శతకము

రాజుకి రెండు కళ్ళూ, కాళ్ళూ సేతులూ ఉన్నయ్యా? కళ్ళు పోలీసోళ్ళు, మిల్టి కాళ్లూ సేతులూ

- రావిశాస్త్రి, మూడుకథల బంగారం

సాంఘిక విషయములలో ప్రభువులు జోక్యం కలుగజేసికొని జనులను శిక్షించడం అక్రమం.

- ఉన్నవ, మాలపల్లి

చక్రవర్తులు స్వయముగా పోరరు. సేనను తెచ్చుకొందురు.

- సూరి, నారాణి

కారే రాజులు? రాజ్యముల్ గలుగవే?
గర్వోన్నతిం బొందిరే?
వారేరీ? సిరి మూటఁగట్టుకొని
పోవంజాలిరే? భూమిపైఁ
బేరైనం గలదే?

- పోతన, భాగవతము

కులము కొఱకు విడుచుఁ గొఱగాని పుత్రుని,
గులము విడుచు నూరు నిలువు కొఱకు
భూమి కొఱకు విడుచు బోరన గ్రామంబు
ధాత్రి విడుచు నృపుఁడు తనకుఁగాను.

- దూబగుంట, మిత్రభేదము

కొంపలంటుకునే దాకా ప్రభువులు వినోదాలు కట్టి పెట్టరు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, కలంపోటు

మతి తగ్గిన కొలఁది భార్యల సంఖ్య హెచ్చగుట రాజుల కాచారమే కదా?

- పానుగంటి, ప్రచండ చాణక్యము

పెట్టక కీర్తిరాదు, వల
పింపక యింతికి నింపులేదు, తాఁ
దిట్టక వాదులేదు, కడు
ధీరత వైరుల సంగరంబులో
గొట్టక నాదులేదు, కొదు
కొక్కఁడు పుట్టక ముక్తిరాదయా
పట్టపు రాజుకైన నిది
పద్ధతి పెమ్మయ సింగధీమణీ!

- పెమ్మయ సింగధీమణి శతకము

జననాథ- రాజ సముఖం

బునసున్న నరుండు యోగ్యము నయోగ్యముఁ బ
ల్కిన నవుఁ గాదన కూరక
వినవలయును సరసమైన విరసంబైనన్!
- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

## రాజ్యం

రాజ్యములు వీరు లనుభవించదగినవి గాని విరాగు లనుభవించదగినవి గావు.
- ఉన్నవ, నాయకురాలు

ఈ రాజ్యఁవెవుడిది. పైసలున్నోడిది. ఆడికి కాప లెవుడు? పోలీసోడు. ఆడు సాలకపోతే? మిలిట్రోడు. మరింక పైసలు మనకీ ఉన్న యంటే రాజ్జింల మనకీ పాలున్నదన్నమాటే!
- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు (2)

రాజ్యంబు పాపమూలము
రాజ్యముతో నొడ లెఱుంగరాదు సుమతికిన్
రాజ్యమునఁ బూజ్యు నెఱుఁగఁడు.
- పోతన, భాగవతము

దొంగనోట్ల దొంగవోట్ల
రాజ్యం ఒక రాజ్యమా?
- శ్రీశ్రీ, దూదిపులిమీద పుట్ర

## రాజ్యాధికారం

రాజ్యాధికార నిద్రాధిదేవత వేకువను సైతము మెలంకువ నందనీయదు.
- సూరి, నా రాణి

## రాట

ఆవూ దూడా వూరుకుంటే మధ్య 'రాట' అరిచిం దట.
- సామెత

పందిరి రాటకీ పెద్దకోడలికీ రాటు ఎక్కువ.
- మహీధర, దేశంకోసం

## రాణీవాసం

రాణీవాసమున పవలే రాతిరి.
- పురిపండా, పులిపంజా

## రాత

నొసటన్ వ్రాసిన వ్రాంతకన్నఁ గలదా?
నూతేండ్లు చింతించినన్?
- చాటువు

రాసిన రాత యెవడైనా తప్పించగలడా?
- గురజాడ, కన్యాశుల్కం

## రాతకోతలు

మనం వెయ్యి మాటలు చెప్పవచ్చును గాని కాగితం మీద వక్క అక్షరం యెక్కించరాదు.
- కందుకూరి, హాస్య సంజీవని

## రాత్రి

రాత్రి మనిషికి లేని ధైర్యాన్నీ ప్రోత్సాహాన్నీయిస్తుంది.
- జయరాం, అంతరాత్మ

చాలా బాధలకు మందు నిద్ర. రాత్రి పరిష్కారం
- ఇనాక్, ఆనందబాష్పాలు

దీనదాస్యాస్పదం బగు దినముకన్న
నాసఁగొలిపించు నిశయె సౌఖ్యావహంబు
- దువ్వూరి, యువకస్వప్నము

## రాత్రింబవళ్లు

మనం నివసించే భూమి
గుండ్రంగానే ఉంది; రాత్రింబవళ్లు
ఒకేచోట ఒకేసారి ఏర్పడవు.
- కుందుర్తి, తెలంగాణ

## రానివి, పోనివి

ప్రతిష్ఠ, మర్యాద పోతే మరి రావు.
- మహీధర, ఓనమాలు

అదృష్టాలు జంటగా రావు - కష్టాలు ఒంటరిగా రావు.
- అప్పల్నాయుడు, ఆకాశకుసుమాలు

గురు శుశ్రూషల నబ్బునే, యసమశ
క్తుల్, జన్మసాఫల్యముల్?
- జాషువా, ముంటాజమహలు

పెట్టక కీర్తిరాదు, వల
పింపక ఇంతికి నింపురాదు, తాఁ
దిట్టక వాదురా, దిక నె
దిర్చిన వైరుల సంగరంబులోఁ
గొట్టక పేరు రాదు...
- పెమ్మయ సింగధీమణి శతకము

కూలి కూటికి రాదు, వేకి చేటుకు రాదు అన్నట్లు
- సామెత

పిలిచే కళ్ళు ఏనాడూ దగ్గరికి రావు
మనస్సును కోసే అందాలు ఏనాడూ
దూరంగా పోవు.
- అద్దేపల్లి, ఎటర్నల్ ఎలెజీ

## రాపిడి

రాపిడి వల్లనే మంచి పదును వస్తుంది.
- సరస్వతీదేవి, సాహిత్యోద్యానము

రాబడి పన్ను

అసలు పన్నాడందే రాబడి పన్ను రాలుతుందా!

- బుచ్చిబాబు, ఒకేనీద్ర-ఎన్నోకలలు

రాబోయే రోజు

రూపాయికి విలువలేని
రోజు రేపు వస్తుంది.

- దాశరథి, పునర్నవం

రామరాజ్యం

రామరాజ్యంలో నేస్తం!
క్షామం తప్ప క్షేమం లేదు.

- బైరాగి, పాంచజన్యం

యిప్పుడు కూడా రామరాజ్యం నెలకొల్పుతామంటున్నారు. దేశంలో టోపీలన్నీ- అది గానీ వొస్తే తను చెయ్యని తప్పుకి మనిషి శిక్ష అనుభవించాలనా?

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

రామశబ్దం

యింగిలీషు చిల్కవు, వచియింప నేర్తువె, బలా!
చిరకాలపు రామశబ్దముల్?

- జాషువా, ప్రబోధము

రామాయణం

రామ దికింగ్సు సన్ను వితు లక్ష్మణ యం డ్విత్తు సీత వెంటు త్రూ ఫేమసు దండకాసు బిగుఫీల్సు...

- భమిడిపాటి, నిజం, పాతబియ్యే! కొత్తబియ్యే!

రామాయణంలో ఉంది మోక్షానికి హైరోడ్డు.

- రాధాకృష్ణ, మనస్తత్వాలు

రామాయణం అంటే సామాన్యం గాదు, గాడిద మోతంత ఉందే అన్నాడట.

- సామెత

రాయబారం

ఐననుఁ బోయి రావలయు హస్తిన
కచ్చటి సంధి మాట.యె
ట్లైనను శత్రురాజుల
బలాబల సంపద చూడవచ్చు...

- తి.వేం., పాండవోద్యోగము

రాయబారాలు కండ్లున్న వారికే నడపటం మంచిది; అహంకారానికి కండ్లుండవు.

- కుందుర్తి, తెలంగాణ

ఉన్మాదులు సంఘటింపంగ
సమర్థులె యెందును రాయబారముల్?

- శ్రీనాథుడు, శృంగార నైషధము

రాయబారి

రాయబారి మోసుకువచ్చే మాటలకు రాయబారిని తప్పులు పట్టడం ధర్మం కాదు.

- గురజాడ, కన్యాశుల్కం

రాయలసీమ

నేటి రాయలసీమ కన్నీటి పాట.

- విద్వాన్‌విశ్వం, పెన్నేటి పాట

రాయితీ

ఎంత ఏడుకొండల వాడైనా ఐ.సి.యస్. వాడి దగ్గిర కొంతైనా రాయితీ చూపించకమానడు.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

రాళ్ళు

రాళ్ళు దేవుళ్లయి రాసులు మింగుతున్నాయి.

- చిరంజీవి, బోలో స్వతంత్ర భారత్‌కీ జై

రిపుపక్షం

రిపు పక్షము నెమ్మెయినైనఁ జెర్పఁగావలయు నిలన్.

- నన్నయ, సభాపర్వము

రిఫారం

డామిట్! ప్రాణమయినా ఇచ్చెయ్యాలిగాని రిఫారం విషయమై నదురూ బెదురూ వుండకూడదు.

- గురజాడ, కొండుభట్టీయము

రివాజు

ప్రతి మనిషికి ఖరీదు
ప్రతి మనిషి మనీషకు రసీదు
ప్రతి మనిషి మరణానికి దస్తావేజు
ఇది ఈనాటి రివాజు

- మాలకొండారెడ్డి, రూపాయి

రుగ్మత

నైతిక సంఘర్షణ ఉండవలసిన చోట లేకపోవటం ఆధ్యాత్మిక రుగ్మతను సూచిస్తుంది.

- కొడవటిగంటి, బెదిరిన మనుషులు

రుచి

పొరుగింటి పుల్లకూర రుచి

- సామెత

తిరిగివచ్చిన భర్త, తిరిగిరాని నవల బహు రుచి

- శ్రీరమణ, న్యూసుడి

దేన్నికైనా ఆడచేయి తగిలితేనే రుచి.

- బుచ్చిరెడ్డి, రైలుబండి

ఆకలితో నకనకలాడుతున్న పొట్ట రుచులను లక్ష్యపెట్టదు.

- ఆనందారామం, అద్దంలో శత్రువు

యెద్దు పుండు కాకికి రుచి.

- గురజాడ, కన్యాశుల్కం

మాయ ముత్తియంపు మహనీయ మంజిమ
యాణి ముత్తియంబు నందుఁగలదె?
వంక గీఁతలోని పొంక మొయ్యారంబు
సూటి గీతయందుఁ జూడలేము.
కులటహొయల మెఱుగు కులకాంత కెటువచ్చు?
గత్తురక్తి భజనగతికిఁ గలదె?
తులసి తీర్థమునకుఁ గలదె కాఫీరుచి
షైంటు తరుకు కావిశాటి కగునె?
సత్య మెప్పుడు మిగులఁ జప్పనై మనసెక్క
దెవఁడు వినును గాకి యెగిరెననఁగ?
మృషవకు రుచులు మెండు మేక పులిని, మ్రింగె
ననఁగ నంద రట్టె యాలకింత్రు.

- పానుగంటి, వీరమతి

ఇంకా కొన్ని ఘడియల్లో, తినబోయే వాడికి... ముందుగా రుచుల జాబితా యివ్వడం ఎందుకూ?

- రామకృష్ణశాస్త్రి, హంసధ్వని

మొవ్వ వంకాయకున్న రుచి ముదిరిన దానికుండునా?

- పానుగంటి, రాధాకృష్ణ

## ఋజువు

దేవుడు లేడని ఋజువు చెయ్యగలం కాని మహాప్రభో పెళ్ళాం చెప్పింది తప్పని ఋజువు చెయ్యలేం.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

## ఋణం

జనన మందుటే తొలి జన్మ ఋణముఁ దీర్ప
మనుట, గురుమాతృపితృదేశఋణములందు
వరయ మరణంబు ఋణశేష మనుభవింప,
ఋణము లేకున్న జన్మమే మనకు లేదు!

- బాలసరస్వతి, భక్తతుకారామ్

చీకటింట్లో చిక్కుదీసే
వెలుతురింట్లో కొప్పుగట్టే
కొప్పుదిప్పే తిప్పులాకే
అప్పులన్నీ తీరిపోయే-

- జానపదగేయం

ఓటరు ఋణం వంకదణ్ణంతో సరి.

- శ్రీరమణ, న్యూసుడి

## రుమాలు

ఓ! నీ రుమాలు బట్టే తినేసింది! జావ్.

- సురవరం, మొగలాయి కథలు

## రుషి

పంచేంద్రియాల్నేకాదు
ప్రపంచాన్నే
రాయిలా నిలిపేవాడు
రుషి.

- సినారె, రెక్కలు

## రూపం

రూపమే ప్రధానమయితే అది వరులు చూసుకోవాలి కాని అన్యులు కారు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, రాజరాజు

## రూలు

నిజంకన్న రూలు, జబ్బుకన్న రసీదులుముఖ్యం.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

ఎవళ్ళకి రూల్సు? పలుకుబడి లేనివాళ్ళకి?

- బుచ్చిబాబు, ఆత్మవంచన

రూల్సు అన్నాక వాటికి లూప్ హోల్స్ వుంటాయి.

- అప్పల్నాయుడు, బెల్లం

ఒక కారుని వేరొక కారూ
ఒక బస్సును వేరొక లారీ
చుంబించే ఆక్షణ మందున
రూల్సన్నీ దాగును యెచ్చట?

- మాచిరాజు, రహదార్లు

రూలుకన్నా మనిషి ముఖ్యం గదా.

- రాజారాం, పిచ్చి వెంకట్రావు

ప్రభుత్వ సొమ్మును స్వంత సొమ్ము వలె చూసుకోమని ఒక రూలు.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

రూల్సు బలహీనులదగ్గర అమలుజరుగుతాయి. డబ్బు అధికారం ఉన్నవాళ్ళదగ్గర అవి రబ్బరులా ఎటూలాగితే అటూ సాగుతాయి.

- ఉల్లాదేవి, యశోధర

రెండు

ఉన్నపుడు రెండు, ఎలిపోయేటప్పుడు రెండు, మనిషి యెంట ఉంటాయంట.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

ఈ లోకంల డబ్బులేని మడిసి రాండు కాళ్ళ ముగరవన్నమాట.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

రెండో పేరులో ఉంది ఆ మహత్తు; రెండో పెళ్ళిలో ఉన్నట్టు, సెకండు హాన్డు సిగరెట్టులో ఉన్నట్టూ, వన్సుమోర్‌లో ఉన్నట్టు!

- భమిడిపాటి, బాగుబాగు

రేటు

ఉర్లాం బసవరాజుగారి సంభావన రేటే సాక్ష్యాల క్యాడా గెజటార్డర్ చేశాం.

- గురజాడ, కన్యాశుల్కం

ఇప్పుడు మాత్రం అన్ని రేట్లూ హెచ్చినా సాక్ష్యాల రేట్లు మాత్రం పెద్దగా హెచ్చలేదు. పావలా ఇస్తే పచ్చి అబద్ధాలు పలకడానికి దేశంలో నూటికి యాభైమంది సిద్ధంగా ఉన్నారు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

రేడియో

అల్లటప్పాగ కాదు యమాంతకముగ
రేడియోలో భరతనాట్య మాడినాను.

- మాచిరాజు, అహం

రేడియోవాళ్లు

పత్రికాధిపతులు వొక్క intellectual సర్వజ్ఞులైతే, యీ రేడియోవారు. విజ్ఞానానికే గాక కళకీ, సారస్వతానికీ, సంపూర్ణాధికారం తీసుకున్నట్టున్నారు, దేశంలో.

- చలం, మ్యూజింగ్స్

రేపు

ఇవాళగర్భంలో రేపు దాగి వుంది.

- బుచ్చిబాబు, ఆత్మవంచన

నిన్నానేడుల కృషియే
రేపై జన్మించుతుంది.

- సోమసుందర్, సమధర్మం

రేవు

ముత్యపుచిప్ప లన్నిటికి ఒకరేవు, నత్తలన్నిటికి ఇంకొక రేవు.

- సామెత

రేషను

కలిసొచ్చేరోజు వస్తే పంచదారకార్డు గాలికి కొట్టుకొస్తుంది.

- శ్రీరమణ, న్యూసుడి

రైతు

రైతు నాగలి మోస్తున్నాడు -
క్రీస్తు శిలువ మోసినట్లు

- శేషేంద్రశర్మ, మరోదేవుడు

మట్టి పిసకనివాడు రైతేకాదు...

- పినిశెట్టి, పల్లెపడుచు

ఏమైనా రైతు రైతే. మంట్లో మానెడు. ఇంట్లో పుట్టెడు.

- నార్ల, స్త్రైపంట

సేద్య మొరులపాలు జీవమ్ము మఱిపాలు
స్వాస్థ్య మంతొయంతొ చదువుపాలు
కష్ట మోట్లపాలు కల్మి డంబముపాలు
మా చరిత్ర తుదకు మచ్చపాలు.

- ఏటుకూరి, క్షేత్రలక్ష్మి

రైలు

నువు వెళ్ళదలుచుకొన్న ఊరు
నువ్వు బతికుండగా చేర దారైలు.

- ఆరుద్ర, నీటిగడియారం

రొట్టె(ముక్క)

తనకు రొట్టా, ఒహడికి ముక్కానా?

- గురజాడ, కన్యాశుల్కం

రొష్టు

అయినా పోయేవాడి కెందుకు రొష్టు.

- గురజాడ, కన్యాశుల్కం

రోగం

నాకు దరిద్రంరాగానే అన్నిరోగాలు పోయినవి. జాడ్యాలను భాగ్యవంతులు పోషించగలరు. గాని మాబోటి బీదవాండ్లెట్లా పోషిస్తారు? "సర్వే గుణా: కాంచన మాశ్రయంతే" అన్నందుకు రోగాలు కూడా కాంచనాన్నే ఆశ్రయించుకొనే ఉంటవి.

- ఉన్నవ, మాలపల్లి

అందరికి అన్నిరోగాలు, అద్దెడు తప్పేలాకు ఏరోగమూ లేదు.

- సామెత

### రోగి

రోగి తనకి జబ్బే లేదనుకోడం అతని రోగానికి అమోఘనిదర్శనం.

- భమిడిపాటి, రెండు రెళ్ళు

పేషంటు మంచానా పడేదాకా వైద్యుడితో పనిలేదు. రోగి మంచాన పడ్డాక వైద్యుడు చెయ్యగలిగింది బహుకొద్ది.

- కొడవటిగంటి, ఐశ్వర్యం

ఇంటికో రోగిలేందే యీ డాక్టర్లు ఇంత పుణ్యపురుషులై కూర్చుంటారుట్రా?

- మా గోఖలే, మూగజీవాలు

### రోజులు

అన్యాయం కేసుకి మేస్త్రీటు ఆర్నెల్లు శిక్షావేస్తే, ఏడాది వెయ్యనందుకు దేవుడికి దండం పెట్టుకోవాలి మనం. రోజు లలా ఉన్నాయి. రోజులెలా ఉన్నాయో ఆ దేవుడుగాళ్ళకూడా అలానే ఉన్నారు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

### రోడ్లు

రోడ్లు
ఎగుడూ దిగుడూ
పెళ్లాం మొగుడూ
వీరికి ప్రణయం
మనకే ప్రళయం.

- తిలక్, రాజమండ్రి పాట

### రోత

తనపైన తనకు అసహ్యం ఉన్నమనిషే ఇతరులక్కూడా రోత పుట్టిస్తాడు.

- కొడవటిగంటి, ఐశ్వర్యం

### రోలు

ఆ మద్దెల కంటే యీరోలు వేయిరెట్లు నయం.

- బొల్లిముంత, మృత్యుంజయులు

### రోషం

కాస్త ఆకలితో వుంటేనేగాని రోషమెక్కదు.

- ఉన్నవ, నాయకురాలు

డైరెక్టుగా లక్ష తిట్లు తిట్టినదానికంటే, అతిమెత్తగా ఉడికించినప్పుడే ఎక్కువ రోషం వస్తుంది.

- ఆనందారామం, మళ్ళీవచ్చినవసంతం

కూసం విడిచిన త్రాచుకు రోసం వుంటుంది.

- వేదాంత. కవి, తెనుంగుతల్లి

### రౌడీ

రౌడీల మద్దతులేందే రాజకీయా ల్లేవుగా ఇప్పుడు.

- యజ్ఞన్నశాస్త్రి, ఓ మనిషి

### రౌతు

రవుతు మెత్తనైతే, గుర్రం మూడుకాళ్ళతో నడుస్తుంది.

- సామెత

## ల

### లక్ష

లక్షకు అప్పుడూ రెండు అక్షరాలే. ఇప్పుడూ రెండు అక్షరాలే.

- సుంకర - వాసిరెడ్డి, అపనింద

### లక్షణం

నమ్మకం కుదిరే వరకు ప్రతివ్యక్తినీ అనుమానించటం వ్యాపారస్థుల లక్షణం.

- మారుతీరావు, మళ్ళీమధుమాసం

ప్రతిజీవుఁడును దనకుఁ దెలియకుండఁ దాను సంపూర్ణుఁడ ననుకొనుచుండును. అది జీవుని లక్షణము.

- విశ్వనాథ, తెలిచిరాజు

చవటతనానికి మాట ముద్దగా పలకటం కూడా ఒక లక్షణం కాబోలు.

- ఆనందారామం, మళ్ళీవచ్చినవసంతం

తెలుఁగులో తురక లక్షణమే యుండదు.

- విశ్వనాథ, తెలిచిరాజు

పౌరుషానికి లక్షణం ప్రాణత్యాగం కాదు.

- పడాల, అల్లూరి సీతారామరాజు

మరోజాతి సంస్కృతిని పరిశీలించినంత మాత్రాన ఆ లక్షణాలు మనం అలవరచుకోనక్కర లేదు- మనలో యిమడదగినవి వుంటే తప్ప.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

...ప్రాప్త, మున కసంతృప్తి జ్ఞాని లక్షణముకాదు.

- బాలసరస్వతి, భక్తతుకారామ్

బ్రదుకుఁదెరువు చూచుకొనువారి లక్షణములు వేఱుగా నుండును.

- కూచి, రూపలత

వ్యాసం పురుష లక్షణం-సీరియల్ స్త్రీ లక్షణం.

- శ్రీరమణ, న్యూసుడి

**లక్ష్మణరేఖ**

సమాజంలో వ్యక్తులచుట్టూ వాళ్ళు గీసుకున్న గిరులు కొన్ని- వాళ్లచుట్టూ వ్యక్తులు గీసిన గిరులు మరికొన్ని.

- వివినమూర్తి, ఉద్యమం

**లక్ష్యం**

లక్ష్యము చెదిరిన కొద్దీ దుఃఖము ఎక్కువ అవుతూనే ఉంటుంది.

- దీక్షితులు, చక్రవాక మిథునము

**లంగరు**

గట్టుమీద కాలుమీద కాలేసుకూర్చున్న వాళ్లకీ నూతిలో దేవులాడుతున్న వాళ్లకీ ఎక్కడా లంగ రందదు.

- రావిశాస్త్రి, కుక్కపిల్ల

**లంచం**

పుంజం పెట్టినది బట్ట, లంచం పెట్టినది మాట.

- సామెత

తృణం లేనిదే ఫలం లేదు.

- సామెత

ప్రజలకు కూడా లంచాలు పుచ్చునే వాడు వుండటమే ఇష్టము. అలాంటి వాడు వుంటే సర్కారుకు నష్టం వచ్చినా లంచాలు యిచ్చి తాము లాభం పొందుతూ వుంటారు.

- కందుకూరి, హాస్యసంజీవని

లంచం వల్ల సాధించలేని పనులేమైనా ఉంటాయా?

- పుల్లాభొట్ల, లంచం

ఆత్మశుద్ధి మహాగ్నికి నంబుదంబు
విమలనియమ భూజమునకు వేరు విత్తు
ఆస యనియెడు బెబ్బులి కామిషంబు
లంచ మది ఘటింపని పను ల్గలుగ వెందు.

- చిలకమర్తి, చతుర చంద్రహాసము

లంచాలు యిచ్చిన వాళ్ళూ పుచ్చుకున్నవాళ్ళూ వుండగా మధ్యవాళ్ళు యేడవటం యెందు కండీ?

- కందుకూరి, హాస్యసంజీవని

మనదేశంలో లాగ ఇక్కడ 'లంచం' మరీ అంత పబ్లిక్‌గా తీసుకోవటంలేదు.

- పుల్లాభొట్ల, లంచం

లంచమనియెడి ఉప్పు
క్లార్కు తింటే తప్పు
ఘనుడు తింటే మెప్పు
ఓ కూనలమ్మా

- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

దేవుడైనా మంత్రపుష్పంతో వుంటేనేగాని వరం యివ్వడు.

- చిలకమర్తి, కనకయ్యా పంతులు కంఠి

ఉన్నతాధికారి, చిన్ని యుద్యోగియు
చేయి సాచకుండ సాయపడరు
లంచ మీయకున్న మంచ మెక్కని వారి
వ్రేళ్ళ మీద లెక్క పెట్టవచ్చు.

- జాషువా, మలినిట్టూర్పు

పెద్దలూ అధికారం కలవాళ్లూ వేలకు వేలు లంచం తీస్తే గప్‌చిప్; అది నేరం కాదు; అది బయటకురాదు; రానీయరు; వాకిట కాపలా కాసేవాడు కడుపుమాడి కాసుకు చేయి జాపితే అది నేరం. అది లంచం. దానికి శిక్ష.

- ఆత్రేయ, అద్దెకొంప

పది రూపాయిలిస్తే ఓట్లువేసే జనానికి- పది కోట్లిస్తే దేశాన్ని అమ్మేసే ప్రభుత్వమే వస్తుంది.

- గంగాధరరావు, యథాప్రజా తథారాజా

దస్తు సంగతి ఇంటి దగ్గరే, దస్తావేజులు కచే రిలో గాని.

- భమిడిపాటి, ఆవును

లంచం-ఇది ఆహార పదార్థాలకు వుప్పుయే లాటిదో వ్యవహార పదార్థాలకు అలాటిదిగా ఆనాదిగా అమల్లో వున్నట్టు కనపడుతుంది.

- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

లంచం పంచం తినడం వుద్యోగధర్మ మవునా కాదా?

- కందుకూరి, మ్యునిసిపల్ నాటకము

డబ్బు పుచ్చుకోవటం చేతగాక మేమేమో లంచాలు పుచ్చుకోమనీ బహునిష్ఠాపరులమనీ సిగ్గులేకుండా చెప్పుకుంటారు. అప్రయోజకు లంతా మడికట్టుకునే కూర్చుంటారు.

- కందుకూరి, దురాచార దూషణము

"లంచంలేని మాట పుంజంలేని బట్టాలేదు" అనే సామెత ననుసరించేవారే వుద్యోగస్థులలో నూటికి తొంభైమంది అని అందఱూ యెఱిఁగినదే.

- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

ఇందుగల దందులేదని
సందేహము లేనిదెద్ది?
లంచగొండితనమేనని
ఎంచవచ్చు గురువరా?

- మల్లారెడ్డి, యక్షప్రశ్నలు

మహామహా కోర్టులలో లంచాలు పుచ్చుకుని వుపకారం చేస్తారు.

- కందుకూరి, మ్యునిసిపల్ నాటకము

**లండన్**

మనకు విష్ణులోకం అంటే లండన్ అనుకోవాలి.

- వెల్చపిళ్ల, కథలు-గాథలు

**లబ్ధి**

పచ్చగావుంటే పదిమంది పబ్లిషర్లు.

- శ్రీరమణ, న్యూనుడి

కృతిభర్తకోసం వెదకితే కుతిభర్త దొరికినట్టు.

- శ్రీరమణ, న్యూనుడి

**లభించనివి**

ఘర్షణలో ఏనాటికి హర్షం లభింపబోదు.

- దాశరథి, నా పేరు ప్రజాకోటి

**లంపటం**

సంబంధాలన్నిటినీ త్యజించిన తాపసులు కూడ ప్రశంసకు సంతోషించటం, నిందకు బాధపడటం జరుగుతూనే వుంది.

- సంజీవదేవ్, కీర్తితృష్ణ

**లయ**

మనుషులకు చెవుడొచ్చినా, మన లయకు చేటురాదు బాబూ.

- మహీధర, శివరంజని

**లాటరీ**

లాటరీ డబ్బు మనిషికి లేని వ్యసనాలు నేర్పుతుంది. పూరిపాకలమీద నిప్పు ఎగిరినట్టే.

- ఇనాక్, లాటరీబ్రతుకులు

**లాభదాయకం**

అల్లుణ్ణి సినిమాలలో జేర్పిస్తే లాభదాయకమే గాని కూతురి కాపరం నిలుస్తుందా అన్న సందేహం.

- చిరంజీవి, బోలోస్వతంత్రభారత్‌కీ జై

**లాభం**

ఈసారి ఆసైర్మన్‌గాడి మీద దెబ్బ తీయాలని మామావంపొలాన్ని కూడ తాకట్టు పెడుతు న్నాను- వ్యవసాయం కన్నా ఈ ఎలక్షన్ల యాపారం కాస్త లాభసాటిగా ఉంటుందని.

- మారుతీరావు, సత్యంగారి ఇల్లెక్కడ

ఏ సినిమా చూసినా అందులో జంట వల పులూ, ఒంటి విరుపులూ, తొడచరుపులూ 'విశేషం'గా కనిపిస్తాయి. ప్రేక్షకులమీద ఎంత 'మత్తు' చల్లితే అంత లాభం.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

మనకి జరిగిన లాభంబట్టేగా అవతల వాడి మంచి కొలవటం.

- రాధాకృష్ణ, దంతవేదాంతం

సానుభూతి చూపటంలో కూడా లాభం కావాలి.

- మూర్తి, మర్యాదస్థులు

నాన్చితే ఉన్న లాభం తెగితే ఏముంటుంది?

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

వలలో ముత్యపు చిప్పలు పడితే లాభంగాని నత్తగుల్లలు పడితే మోత చేటు!

- గురజాడ, కన్యాశుల్కం

అగ్రహారంపోతే పోయింది కాని 'ఆక్టు' అంతా బాగా తెలిసింది.

- సామెత

కాలిన గుడిసెకు వేసిన వాసమే లాభం.

- సామెత

**లాహిరీ**

రాజకీయ నాయకులే కాదు-ప్రతి మనిషీకూడా తన చుట్టుపక్కల ప్రాపకం సంపాదించాలన్నా, కొంత లాహిరీ అవసరం.

- సరళాదేవి, కుంకుమరేఖలు

**లింగం**

పేరు గురులింగమంటే, ఉండే మూడు లింగాలు గాక ఇదెక్కడి దన్నాడట.

- సామెత

ఆత్మ లింగము తెలియని యెడల, లింగము రుబ్బు పత్రమే.

- శివరామశాస్త్రి, నమశ్శివాయ

**లిటిగేషన్**

తెల్లారి లేస్తే ప్రపంచంలో ఉన్న లిటిగేషనంతా

పోలీసుస్టేషనులోనే తెముల్తుంది.
- పద్మనాభరెడ్డి, మాయ

లెక్క

పంచపాండవులను నేనెరుగనా? మంచంకోళ్ళ లాగ ముగ్గురే అని రెండు వేళ్ళు చూపి ఒకటి విడిచినాడట.
- సామెత

ఒకారము లేనివాడు వడ్డీ గుణించినట్లు
- సామెత

ఏటిలో వేసినా ఎంచివేయాలి.
- సామెత

స్వభావానికీ బట్టతలకూ మందు లేదంటారు.
- శ్యామలారాణి, జీవవాహిని

అతఁడు లోనుగాఁగ నేవు
రేను లోనుగాఁగ నేవురుగాని నీ
కొడుకు లార్వు రనుట విడువు-మింక
- తిక్కన, ఉద్యోగపర్వము

ఒకఁడు గణియింప, గుణియించు నొక్కఁడకట!
- తి.వేం., పాండవ ప్రవాసము

రైతు తన పొలంలో చేసే పనికి లెక్క కట్టడం సాధ్యంకాదు.
- మహీధర, ఓనమాలు

గుళ్ళ గోపురాల కోసరంబై నీవు
ధారవోయుచున్న ధనముఁ జూచి
కటిక పేదవాని కడుపులో నర్తించు
కత్తు లెన్నొ లెక్కఁ గట్టఁగలవె?
- జాషువా, చదువు

రూపాయి పెట్టెడి చోటఁ బదిరూపాయలుగాఁ బెట్టెడి వ్యయములు ధనమును లెక్కకు దీసి కొని రావు.
- విశ్వనాథ, తెఱచిరాజు

మందు కొట్టినోడు మాత్మాగాంధీని కూడా లెక్క సెయ్యనట్టు హీటెక్కిపోయినోళ్లు ఇందు రుణ్ణీ సెందురుణ్ణీ కూడా లెక్క సెయ్యరు.
- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

లెక్చరు

లెక్చర్లు యంతసేపూ సిటీలోనేగాని పల్లెటూ ళ్ళలో యంత మాత్రం పనికిరావు.
- గురజాడ, కన్యాశుల్కం

పల్లెటూరి పీపిల్ లెక్చర్లకి అన్‌ఫిట్.
- గురజాడ, కన్యాశుల్కం

లేఖ

ఎచట నుండి లేఖ యేతెంచెనేనియు
నాదరంబు సేయు టనుచితంబు
సంధి విగ్రహాది సకల కార్యంబులు
తెలియుటెల్ల లేఖవలనఁ గాదె.
- దూబగుంట, పంచతంత్రము

వ్రాసేందుకు, సిసలైన చిరునామాదారుడు, తెలిపేందుకు విషయం ఏమీ లేనపుడు ఉత్తరం రాయాలనే కుతూహలాన్ని తీర్చుకొనే ప్రయత్నం సంపాదకునికి లేఖ.
- మాచిరాజు, సంపాదకునికి లేఖలు

మానవుడు చేసే నిత్యాన్వేషణ, దానికై పడే తిప్పలు, మానవుడిలో ఉండే చిన్న తనపు చిలిపి చేష్ట, దాన్ని దాచడానికై పెట్టే మీసాలు, అతనిలో ఉండే అమాయకత్వం, అది కనపడ కుండా వేశే బురఖా, అతనిలో ఆరంభ శూరత్వం, కొంచెం పాత పడగానే దాని మీద కలిగే ఉపేక్ష లాంటి తత్వాలను మా ఉత్తరాలు రుజువు చేస్తాయి.
- మాచిరాజు, సంపాదకునికి లేఖలు

లేఖకుడు

తప్పు పవరించి వ్రాయు టుత్తమము, లేక
ప్రతి సమానముగా వ్రాయు టతిముదంబు
రెండువిడిచియు వ్రాసెడు లేఖకుండు
గలుగఁ గవిసేయు భాగ్యంబు కతనఁ గాదె?
- చాటువు

లేచిపోవటం

రుక్మిణికి దేవత్వం అంటగట్టారు కనుక ఆమె చేసిన పనిని 'లేచిపోవటం' అనలేదు. అదే మనలాంటి సామాన్యులు చేస్తే 'లేచిపోవటం' కింద జమ వేస్తారు.
- ధనికొండ, పవిత్రులు

లేనివి

ఈ జనం దృష్టిలో చెడిపోయిన ఆడదానికీ, పదవి కోసం పార్టీలు మార్చే రాజకీయ నాయ కుడికీ పెద్ద తేడా లేదండి.
- వెంకటేశ్వరరావు, సమాధికడుతున్నాం-చందాలివ్వండి

ఉన్నదానికన్న లేనిదానికే ఉడుకుతారు ఊరివారు.
- ఆత్రేయ, అశ్వమేధుడు

గోచికి మించిన దరిద్రం లేదు. ఈతకు మించిన లోతులేదు.

- సామెత

ఐశ్వర్యానికి అంతంలేదు; దారిద్ర్యానికి మొదలూ లేదు.

- సామెత

చాలా మంది భ్రమలకీ వాస్తవ ప్రపంచానికీ పొత్తులేదని గ్రహించక, వాస్తవాన్ని ద్వేషిస్తారు. భ్రమలమీద మోజుపోదు...

- పాప, రామరాజ్యానికి రహదారి

మొదలూ కొసా వొక్కలాగే కనబడుతూంది.

- గురజాడ, కన్యాశుల్కం

దోష్షియైన యల్లువానిc జంపలేనప్పు డితరుల నెంత మందిని జంపిన లాభమేమి?

- కూచి, రూపలత

తనకులేని వస్తువు నాతఁడు దొంగిలించును. బ్రహ్మచారి కావున.

- పానుగంటి, ప్రచండ చాణక్యము

న్యాయవాదులలో న్యాయము, సంఘ సంస్కారులలో సంస్కారము, నేతి బీరకాయలోని నేయి వంటివి.

- హనుమంతరావు, లేడీ డాక్టరు

బాధలేని గాథ లేదు, నీడపోని వాడలేదు.

- బైరాగి, మధ్యాహ్నవేళ

సిద్ధప్పవంటి శిష్యుడులేడు, బ్రహ్మంగారి వంటి గురువులేడు, వేమన వంటి యోగిలేడు.

- సామెత

కమ్మకు వరస లేదు. కప్పకు తోకలేదు.

- సామెత

తురక ఎంత గొప్పవాడైనా ఇంటికి పేరులేదు; తలకు జుట్టు లేదు; మొలకు తాడు లేదు.

- సామెత

విటులకు సత్యములేదు. వేశ్యకు నియమము లేదు.

- కోలాచలం, శిలాదిత్య

కొన్ని బాధలకి మందులుండవు, కొన్ని విషపు కాట్లకి విరుగుళ్ళుండవు. కొన్ని చీకట్లకి వెలుగు లుండవు. కొన్ని ఏడ్పులకి ఓదార్పులుండవు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

తీపంటే ఇష్టపడని చీమ, డబ్బంటే ఇష్టపడని భామ ఈ పెపంచకంలో ఉండర్రా.

- కాశీవిశ్వనాథం, మంచుబొమ్మలు

ఈత కన్న లోతు నెంచంగc బనిలేదు
చావు కన్న గోడు జగతి లేదు
గోచిc పాcతకంటె గొంచెం బిcకనులేదు.

- వేమన

చారుcడు లేని రాజతంత్రము- సంధానకర్తలేని సాని సరసము- పౌరహితుcడులేని పెండ్లి- న్యాయవాదిలేని వ్యాజ్యెము- వైద్యుcడులేని మరణము- పొసగుడువాcడులేని పశువులసంతయు లేవు.

- పానుగంటి, సాక్షి.

తర్కానికి నిలవగలది ఏమీలేదు. చివరికి "ఏమీలేదు" అనటం కూడా.

- చలం, మ్యూజింగ్స్

ఆడవాళ్ళకు పురుష సంపర్కానికి కాలం, స్థలం కావాలి. పురుషులకు అదీలేదు ఇదీలేదు.

- బాపిరాజు, కోనంగి

తండ్రి సంపాదన తెలియని కొడుకున్నా, కొడుకు పుట్టుక తెలియని తల్లి ఉంటుందా?

- లక్ష్మణరావు, అతడు- ఆమె

పడిపోవుచున్న చెట్టు నాశ్రయించుకొని యున్నందువలనc బ్రయోజన మేమి?

- విశ్వనాథ, కడిమిచెట్టు

పెట్టబోయే పాదును కొనబోయే గేదె తినేసిందిట.

- మహీధర, దేశంకోసం

అక్షరజ్ఞానమునకు రాజవ్యవహారమునకు సంబంధము లేదు.

- పానుగంటి, వీరమతి

అరయంగా నమంత్రమౌ నక్షరము లేదు
మందుగాని వేరు మఱియు లేదు.
భువి నయోగ్యుcడైన పురుషుం డొకcడు లేcడు
కూర్పువాc డొకండె కొదువగాని.

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

ఈదబోతే ఏళ్ళు త్రాగబోతే నీళ్ళూ లేవు.

- సామెత

ఆశకు అంతులేదు. నిరాశకు చింతలేదు.

- సామెత

కథకు కాళ్ళూలేవు, ముంతకు చెవులూ లేవు.

- సామెత

అంధకారసాగరంలో
పయనించిన ఓడల గురుతు లుండవు.

వల్లకాటి వాకిట నాటిన చెట్లు పండవు.

- బైరాగి, నూతిలో గొంతులు

జీవించి లాభంలేదు
మరణించడానికి కూడా మార్గంలేదు
మరోదారి లేనేలేదు.

- ఆరుద్ర, ఓక్కా ఓచెలియా!

అగ్నితాపముఁ గాంచనట్టి మేలిమిలేదు,
విరహమెరుగని ప్రేమ విహ్వలత లేదోయి,
కష్టజీవులు లేని సృష్టియే లేదోయి.

- పైడిమర్రి, కష్టజీవి

లేమి

అన్నీ ఉంటే అలివేలి మంగ, ఏమీ లేకపోతే దాసరి మంగ.

- పూర్ణానందం, ఈడూ-జోడూ

మూఢత్వానికున్న బలం విజ్ఞానానికి లేదు;
అబద్ధానికున్న ప్రచారం నిజానికి లేదు.

- కొడవటిగంటి, దేవుడు-సైతాను

రాత్రివేళ దీపం వెలుగులో తెలుపు పక్కన పెడి తేనేగాని పసుపు రంగేదో తెలియనట్టు, ఇంట్లో ఉండే లేమి నలుగురి మధ్యకి వెళ్తేనేగాని సరిగా కనిపించదు.

- రావిశాస్త్రి, జరీ అంచు తెల్లచీర

పదియు నాలుగు భువనము ల్వెదకి చూడ
నేను తలదాఁచుకొ〰దగు నెలవు లేదు.

- చిలకమర్తి, గయోపాఖ్యానము

ఊరంతా చుట్టాలు, వుట్టికట్ట తావులేదు.

- సామెత

లైసెన్సు

భూస్వాముల కనుసైగలె వ్యాపారులకు లైసెన్సులు, వ్యాపారుల రూపాయిలె రాజ్యానికి చక్రాలు.

- ఛాయారాజ్, శ్రీకాకుళం

లొంగటం

కామినీ కాంచనాలకు లొంగని వాడెవడులెండి?

- రామదాసు, ఆకాశరామన్న

లొచ్చు

ఏ బాధయినా ఇంతేనేమో! పెద్దదాని ముందు చిన్నది లొచ్చు.

- చిరంజీవి, బోలోస్వతంత్ర భారత్‌కీ జై

లొసుగు

కిరాతకుడియేది, దేవాంతకుడయేది ప్రతివాడికి ఎక్కడో చిన్న లొసుగుంటుంది.

- శ్యామలారాణి, జై మంగళా

లోకం

నిన్నటి ముసలిలోకం కంటె
నేటి యువలోకం విశాలం.

- రాధాకృష్ణశర్మ, శాంతిసూక్తం

ప్రజల్ని మోసంచేసి ధనవంతుడైనవాణ్ణి 'మోసగాడు' అనటంలేదు లోకం. అతని మోచేతికింద నీళ్ళుతాగడానికి వెంపర్లాడుతోంది.

- చినరామచంద్రరావు, అమృతబిందువు

అన్నా! మన కీలోకం
పన్నిన పద్మవ్యూహం!

- అనిశెట్టి, భయం బ్రతుకుభయం

"లోపం చూడగలిగేదే లోకం". అందుచేత దాన్ని వదిలెయ్యాలి. అది అరిచేదేగాని కరిచేది కాదు.

- రామకృష్ణరావు, రేపటిమనుషులు

లోకం మైకై కూస్తుంది.

- శ్రీరమణ, న్యూసుడి

లోకం కబుర్లు చెబుతుంది, ఉద్ధరించదు.

- కొడవటిగంటి, సవతితల్లి

మమత, మానవత్వం అంటూ పాకులాడినవారిని పాతాళాని కణగదొక్కేయటం, నెత్తిమీద మొత్తుతున్నవాడికి మానవత్వాన్ని బోధించటం లోకానికి బాగా అలవాటు!

- శ్యామలారాణి, జీవవాహిని

లోకం దుష్టత్వాన్నెలా సహించలేదో, అతిమంచిని కూడా అలాగే సహించలేదు.

- శ్యామలారాణి, జీవవాహిని

అవకాశం వచ్చినపుడు ఎదుటివాణ్ణి అందినంత మేరకి బలిచేసుకోటమే (ప్రస్తుతం అమలో వున్న) లోకన్యాయం! అందులో లింగభేదం లేదు. వర్గభేదంలేదు.

- అర్నాద్, రిక్షాప్రయాణం

జంటిల్‌మన్‌గా బ్రతకాలంటే కావలసింది "ఎడ్యుకేషన్" కాదు అహమ్మద్ - "కామన్ సెన్సు".

- రాధాకృష్ణశాస్త్రి, జన్మభూమి

పనికిమాలిన విషయాలను గురించి ఎంత బాగా తెలిస్తే అంత లోకజ్ఞానం ఉన్నట్టు.

- కొడవటిగంటి, పట్నవాసం

పుస్తకాలు నూరిపోసి మా బుఱ్ఱలు నింపేసరికి ప్రపంచ జ్ఞానం తక్కువయిపోతుంది.

యజ్ఞన్నశాస్త్రి, విశ్వం పెళ్ళి

గోవుకి ముందర కాళ్ళకి బందాలు వేసి పాలు పిండుకుంటాం, పావుఁకి- దానింటికి పుట్టదాకా వెళ్ళి పాలుపోస్తాం.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

స్త్రీ పురుషులు లోకమనందు సామాన్యముగా కలిసి కొందరు, ప్రవాహములయందు కాష్ఠములవలె కలిసి కొందరు విడిపోదురు.

- విశ్వనాథ, దిండు కెంది పోకచెక్క

ఆడపిల్ల ఎప్పుడూ కష్టాలలోను, సుఖాలలోను భర్త దగ్గరే ఉండాలి. అది లోకధర్మం.

- సూర్యారావు, *ఒక గంట సంసారం*

ఆలువుడ్ని కొట్టి బలువుడు నాక్కుంటే, బలువుడ్ని కొట్టి బెమ్మదేవుడు నాక్కుంటన్నాడు.

- భూషణం, అడివంటుకుంది

అల్పుఁ డొనరింప నెది చౌర్య మనఁగఁ బరఁగు
నధికుఁ డొనరింప నదె శౌర్యమై రహించు
కర్తవస్థానుసరణి లక్ష్యములె కాని
మంచిచెడ్డలు గలవె ప్రపంచమందు?

- గోపాలరావు, అపూర్వ సంఘసంస్కరణము

తనవారు తలవంపు పనులు సేయ సహించు
పరులు చేసిన తప్పు పట్టిఁజూచు
తనయింటిలోఁ గానిపని కమ్ముకోఁ జూచు
పొరుగింటిపని రవ్వపఱుపఁ దలఁచు
తనపుత్రి జారవర్తన మాటుపడఁజేయు
పరుల బిడ్డల బంకుఁ బయటపెట్టు
తనదు చెల్లెలి దొంగతనము లోననడంచు
లాఁతివారైన హేళన మొనర్చు

- వేంకటకవి, మదనగోపాలశతకము

పెపంచికంలో ఉన్నవి నేయం- అన్నేయం, దరమం-అదరమం, గాదు. లాభం-నష్టం.

- బీనాదేవి, కక్క

పేరు గురువులది. స్వాహా శిష్యులది.

- పురుషోత్తమరావు, లోకం

బ్రతికుండగా, కనీసం పలకరించనివారు చచ్చిం తర్వాత చిత్రపటాలు పెట్టి పూజిస్తారు.

- పురుషోత్తమరావు, లోకం

ఇంటివాడు గొడ్డుగేదంటే పొరుగువాడు పాడి గేదె అనడు.

- సామెత

ఒదిగి ఒదిగి ఉంటున్నవాడికి కమ్చీ దెబ్బలు తప్పవు. కత్తితో ఒక్కవేటు వేసేసి తనదారి తాను చూసుకోగలిగిన వాడికి మంగళహారతులు.

- శ్యామలారాణి, జై మంగళా

చెడుకూతలను వినడానికి ఉత్సాహపడినంతగా మంచిని చెవుల పట్టించుకోదు ప్రపంచం.

- శ్యామలారాణి, జై మంగళా

మనిషి చేసిన తప్పును భరించేది లోకం!

- కుందుర్తి, పాపంలోకం

మాకు నీతోడిద, లోక మీవు లేని లోకమేల?

- పోతన, భాగవతము

ఇల్లు కాలిపోయె నింటిది చనిపోయె
పిల్లవాఁడు వెఱ్ఱి పీనుఁ గాయె
గోడ లొకనిఁ దగులుకొని లేచియే పోయె
నాకు ముష్టి చెంబె లోకమాయె.

- కాళ్ళకూరి, వరవిక్రయము

లోకవిరుద్ధముగా నుండు లాగున మంచిపని చేసినను నది యనుమానాస్పదము కాక మానదు.

- కొచ్చెర్లకోట, అపవాదతరంగిణి

లోకమంటే ఏమిటి తమ్ముడూ? మన ప్రభావం ఎవరిమీద పడుతుందో వారు. మనమీద ఎవరి ప్రభావం పడుతుందో వారు. ఇట్లే పరస్పర ప్రభావం ప్రసారమయ్యే ప్రకృతి.

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

కాలం చేసిన గారడిలో
కాకులు కోకిల లేకమయి
తిరుగాడే మాయలోకం
నిజాయితీలేని సంఘం!

- కె. యల్. కొత్తగుడి

ఈ లోకం ఒకళ్ళని బ్రతకనివ్వదు. ఎలాగో బ్రతుకుదా మనుకుంటే యాగీ చేస్తుంది. అయినపుడు దాన్ని లెక్క చెయ్యడం అనవసరం.

- నంది, నైమిశారణ్యం

లోకమంతా ఒక పెద్ద కసాయి దుకాణం.

- ఉన్నవ, నాయకురాలు

భయపడే వాళ్ళను మరింత భయపెడుతుంది లోకం.

- నంది, మనిషి చావకూడదు

మనసు ఎట్లా మారితే లోకం అట్లా మారు తుంది. మనిషికి, దూడకి, దోమకి, కోడికి, చేపకి, సముద్రం అడుగున ఆక్టోపస్ అన్నిటికీ అన్ని విధాలుగా కనపడుతుంది లోకం. మనసు ఏమంటే, అదే నంటుంది లోకం తాను.

- చలం, మ్యూజింగ్స్

ఏ లోకమైతే మనను ఉపయోగించుకోలేక పోయిందో- ఆ లోకాన్నే మనం ఉపయోగించు కునేందుకు ప్రయత్నించాలి.

- ధనికొండ, ప్రొఫెసర్ బింక్లెన్

ఈ లోకంలో సాహసించి ఎవడు ఎంత తన కోర కిందికి లాక్కుంటే అంతే వాడికి దక్కుట. నావంతు నాకు న్యాయంగా వస్తుందన్నది భ్రమ.

- కాళీపట్నం, ఇల్లు కధలు

మనుష్యులు శరీరముతోఁ దక్కువ జీవింతురు. మనస్సుతో నెక్కువ జీవింతురు. మనస్సు కనఁ బడనిది. శరీరము కనఁబడునది. లోకులు కనఁబడు దాని వెల కట్టుదురుగాని, కనఁబడని మనస్సు వెల కట్టలేదు.

- విశ్వనాథ,-బద్దన్న సేనాని

లోకము అహంకారము మీద నాధారపడియు న్నది.

- విశ్వనాథ, దిండుకింది పోకచెక్క

చచ్చేవాడు చస్తుంటే చూసేవాళ్లు మేం చాలా కష్టపడిపోతున్నాం త్యాగం చేస్తున్నామంటారు. హఁ-లోకం తీరే ఇంత.

- సరస్వతీదేవి, తలపులమలుపులు

తెలక సెయ్యటము తెలిసి అనుభవించటము.

- కోపల్లి, ఓన్లీడాటర్

ముందు ముచ్చట్లు వెనుక చప్పట్లు. లోకమును మూయఁగ మూకుఁడున్నదా?

- హనుమంతరావు, లేడీ డాక్టరు

డబ్బుంటే పరమ రొచ్చు బురద. ఆ బురద వేళ్ళతో తీసి, లోకపు నుదుట కుంకుమ రేఖ లాగా పూస్తే, నీ వెంట పెళ్ళి కూతురిలా నడిచి వొస్తుంది. కోపం వొచ్చినప్పుడు నడ్డి విరిగేలా తన్నినా, ముక్కుతూ మూలుగుతూ పడివుం టుంది. అప్పుడు నీవు వినా తాను లేనట్లు మస లుకుంటుంది లోకం.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

ఈ వెధవలోకానికి డబ్బున్న వాళ్ళంటేనే గౌరవం.

- ఆనందారామం, అర్థంలో శత్రువు

మనిషి భయపడితే మరింత జడిపిస్తుంది లోకం.

- నంది, మనిషి చావకూడదు

బట్టతలకీ మోకాలికి ముడిపెట్ట జూస్తుంది లోకం. యేదైనా అనుకోగలదు.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

ఈ లోకానికి కావలసింది మంచితనం కాదు (అన్నపూర్ణా), మన ధనం!

- అనిశెట్టి, గాలిమేడలు

లోకు లనుకొనునట్లు గోడలకు చెవులేగాక నాలుక కూడా నున్నదేమో యని సందేహింపవ లసి యున్నది.

- చిలకమర్తి, గణపతి

బంతి భోజనా లయినాకే యేనాదాళ్ళకు యెంగి లాకులు! పండగెళ్లిన మర్నాడే పాకీవాళ్ళ మామూళ్ళు.

- కొడవటిగంటి, ఎండమావులు

అనేక రకాల స్వార్థాల ప్రాతిపదికమీద లోక వ్యవహారాలు జరుగుతున్నవి.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

ఈ లోకంలో వ్యవహారాలన్నీ ఇచ్చి పుచ్చుకునే పద్ధతి మీదే జరుగుతూ వుంటాయి.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

నమ్మకం మీద లోకం నడుస్తుందిగాని ఆదు పులు, ఆజ్ఞలు పెడితే ఏమి నడుస్తుంది.?

- విశ్వనాథ, చెలియలికట్ట

పొలాన్ని మడకబెట్టి దున్నితేకాని పంట యోగ్యం కానట్లు గుండెల్లో రైళ్లు పరుగెడితేకానీ లోకం పోకడ అవగాహనకాదు.

- పులికంటి, గుండెల్లో రైళ్ళు - గూడుకోసం గువ్వలు

"లోకం మాయ" అనే ప్రతివాడూ ముందు అంగీకరించవలసింది తాను 'మాయ' అని. తాను మాయ అనుకున్నవాడు 'లోకంమాయ' అనడానికి మిగలడు.

- చలం, మ్యూజింగ్స్

వరడునకు, వేశ్యామాతకుఁ బేరేమీ? వరడును "బావా"యని, వేశ్యమాత "నత్తా"యని పిలు చుట లోకాచారమే కదా!

- పానుగంటి, ప్రచండచాణక్యము

ప్రాంతలంజ లిప్పుడు లోకమాత లైరి.
- చిలకమర్తి, ప్రసన్నయాదవము

**లోకాతీతులు**

లోకోద్ధారకములు, లోకోపకారములునైన మహా కార్యములు చేసిన వారందఱుఁ గొన్ని విషయ ములలో మిక్కిలి స్వార్థపరులుగాఁ గన్పింతురు. నిరంకుశులుగాఁ గన్పింతురు. వారు లోకాతీతులు. లోకము వారికొఱకుఁ గాదు. వారు లోకముకొఱకు.
- విశ్వనాథ, బద్దన్న సేనాని

**లోకులు**

లోకులు మాటలనేటప్పుడు నిజమూ గిజమూ ఆలోచిస్తారా! నోటికి యెట్లావస్తే అట్లా అంటారు.
- కొచ్చెర్లకోట, అపవాద తరంగిణి

ఈ లోకులు పసికూనలతో సమానులు. శ్రేయస్సుకోసం ఉగ్గుపట్టే తల్లుల్ని పసిబిడ్డలు కాళ్ళతో తన్నేటట్లు, సంస్కరించాలని సన్నాహాలు చేసే వాళ్ళని సంహరించా లనుకునేంత అజ్ఞానులు వీళ్లు.
- రామమూర్తి, అగ్నిగర్భ

లోకులు కాకులు, ఇష్టము వచ్చిన ట్లరచెదరు.
- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

**లోకువ**

పోషించబడే మనిషి పోషించే మనిషికి లోకువ.
- కొడవటిగంటి, పంచకళ్యాణి

మన బోనులో పడడానికి వాడు సరియైన జంతువు.
- భమిడిపాటి, నామాటే నెగ్గింది

గవర్నమెంటు సొమ్మంటే లంజెమానంలాంటిది. అందరికీ లోకువే.
- బీనాదేవి, డబ్బు!డబ్బు!!డబ్బు!!!

కవిత్వం వినేవాడికి చదివేవాడు లోకువ.
- కుందుర్తి, నాలోనినాదాలు

కుర్చీమీద కూర్చున్న వాడికి ఎదరనిలబడ్డ వాడెప్పుడూ లోకువ.
- రావిశాస్త్రి, అగ్గిపుల్ల

అడిగేవాడికి చెప్పేవాడు లోకువ.
- సామెత

తనకంటె అన్ని విషయాలలోనూ పై స్థాయిలో ఉంటేనే పురుషుడిని స్త్రీ ప్రేమించగలుగుతుంది. లేకపోతే లోకువగా చూస్తుంది.
- సరస్వతీదేవి , అద్దుతెరలు

ఆడదాన్ని చూస్తే భూతాలకు కూడా లోకువే.
- దీక్షితులు, రేణుక

కుప్ప పీకే దొంగ, పరిగ ఏరుకొనే వానిని బెదిరించినట్లు.
- సామెత

అడిగేవాడికి చెప్పేవాడు లోకువ. నీ పెళ్ళాం నీకు లోకువ. నువ్వు జడ్జీకి లోకువ.
- బీనాదేవి, తీర్పు

భార్య వినమ్రతను చూసి సంతోషించే భర్తలకన్నా దాన్ని లోకువగా తీసుకుని ఆమెని హింసించే వాళ్ళే మన సమాజంలో ఎక్కువ.
- సావిత్రి, ఒడిలో చెలిమోహనరాగం

పరుగెత్తే వాణ్ణి చూస్తే, తరిమేవాడికి లోకువ.
- సామెత

బీదవాడు బిచ్చపువాడికి లోకువ.
- సామెత

కడవంత గుమ్మడికాయ, కత్తిపీటకు లోకువ.
- సామెత

వెర్రివాడి గేదె ఈనితే ఊరందరూ ఉట్లుకట్టారు.
- సామెత

**లోకోపకారం**

పెళ్ళాడితే లోకోపకారానికి అవకాశం యంత మాత్రం వుండదు.
- గురజాడ, కన్యాశుల్కం

ఆయన ఉద్యోగం చెయ్యకపోవడం, పెళ్ళిమానుకోవడం, లోకం మరామత్తు చెయ్యడానికట!
- గురజాడ, కన్యాశుల్కం

లోకానికోసం బతకడం ఉత్తమం.
- గురజాడ, కన్యాశుల్కం

ఈ జన్మమంతా లోకోపకారం కింద వినియోగ పర్చుకుందామని నిశ్చయించుకుని యిదివర దాకా ఏకాకినై వుంటిని.
- గురజాడ, కన్యాశుల్కం

పెళ్ళాడి, ఆలుబిడ్డలకి, ముచ్చుకాయ ముగ్గురికి ఉపకారం చేయడంకంటే లోకోపకారం కింద యీ ప్రాణం వినియోగపర్చటం పుణ్యం కాదా?
- గురజాడ, కన్యాశుల్కం

గతిలేనివాడు లోకోద్ధరణ చేయక యేం

చేస్తాడు?

- విశ్వనాథ, ముగ్గురు బిచ్చగాళ్లు

ప్రభుత్వంలో ఉన్నవాళ్లకి తమ అధికార ప్రదర్శనకు నిరాటంకంగా ఉండే రంగం విద్యారంగమే.

- వివినమూర్తి, ఉద్యమం

**లోటు**

ఏ లోటూ లేకపోవటం కూడా ఒక లోటే.

- బుచ్చిబాబు, ఒకేనిద్ర-ఎన్నోకలలు

మన లోట్లు మరొకరికి పట్టనప్పుడు మరొకరి లోట్లతో మనకేంపని?

- కొడవటిగంటి, అనుభవం

పదేను సంచుల్తో సేరుమేనైనాను. ముప్పయి సంచులు నాయిగావంటే గుబిక్కిన బోర్లుపెసి డెంటయి కూకుంటా, రెండు బిర్జీలు శాంక్సను చేత్తినా లోటేంటి?

- హనుమంతరావు, లేడీ డాక్టరు

**లోతు**

లోతులోనే నీళ్ళుంటాయ్.

- పడాల, అల్లూరి సీతారామరాజు

**లోపం**

గొప్పవాళ్లదగ్గిరకూడా యేవోలోపాలు వుంటవి. మనం క్షుద్రాలు పాటిగా పట్టరాదు.

- కందుకూరి, బలత్కారగానమోద ప్రహసనము

ఒక్కొక్కరికి ఒక్కొక్క లోపం ఉంటుంది.

- కొడవటిగంటి, చదువు

గుట్టుగా వూరుకుంటేనే తప్పు కదిలిస్తే అందరి లోపాలు పైకి వస్తవి.

- కందుకూరి, హాస్యసంజీవని

రోసం కుంచిడు ఆలోచన సిటికిడు.

- సి. యస్. రావు, రాజనీతి

వాంఛలున్నంత బలంగా వ్యక్తీకరణ లుండటం లేదు.

- శివారెడ్డి, బలివితర్దిమీద ఉనికి

**లోపల**

మనిషిలో మనస్సనే రాక్షసుడొక్కడే లేడు. హృదయమనే దేవుడు కూడా వున్నాడు.

- కాంతారావు, అభ్యుదయం

**లోబడనివి**

మన మనసు మనకి లోబడదు. మన నాలుక మన కంతకంటే లోబడదు.

- లక్షణరావు, ఆతడు-ఆమె

**లోభి**

కష్టలోభివాని కలిమికి నాసించి
బడుగువాఁడు దిరిగి పరిణమించుఁ
దగరు వెంట నక్క దగిలిన చందము.

- వేమన

ఎవడి విద్య వాడిదే. ఒక్కొక్కడు చచ్చేలోపల చూసిచూసి అడిగిన వాడికి చెప్పలేడు.

- భమిడిపాటి, కాంతారావు ఎప్పుడూ ఇంతే

పిసినివాడి యింట బీనుఁగు వెడలినఁ
గట్టె కోలలకును గాసులిచ్చి
వెచ్చమాయె నంచు వెక్కివెక్కి మఱేడ్చు

- వేమన

గొడ్డుటావుఁ బిదుకఁ గుండఁ జేకొని పోవ
పండు లూడఁ దన్నుఁ బాల నీదు
లోభివాని నడుగ లాభంబు లేదయా.

- వేమన

లోభివాని జంప లోకంబు లోపల
మందు వేఱు వలదు మతము గలదు
పైక మడుగ నతఁడు భగ్గురుమని చచ్చు

-వేమన

ఆత్మజను గుత్త రూకల కమ్ము నాతఁ
డరణము నొసంగఁ జూచునే యల్లునకును?

- వేంకటరాయకవి, వేణుగోపాల శతకము

అన్ని యిడుమలకు లోభము కారణము.

- చిన్నయసూరి, మిత్రలాభము

లేని దాతకన్న నున్న లోభి మెఱుఁగు.

- తి.వేం., పాండవప్రవాసము

ధరను లోభివాని ధనము దాయాదుల
పాలు జారకాంత పాలు వేమ.

- వేమన

లోభి బీదకంటె బీడు.

- సామెత

గడించిన వాఁడెవ్వఁడు కర్చుపెట్టి చచ్చినాఁడే!

- కాళ్ళకూరి, వరవిక్రయము

కుండలో కూడు కుండలో నుండవలే, పిల్లవాడు తుండుముక్కవలె నుండవలె!

- చిలకమర్తి, గణపతి

తిట్టిన రోసముం బడఁడు
దీవన యిచ్చిన సంతసింపఁ డా

కట్టిడి టోభి కెంత యధి
కారము గల్గిననేమి? లేక యే
బెట్టిన నున్ననేమి; నడ
పీనుఁగుకే మణిభూషణంబులన్
బెట్టిన మెట్టినన్ సరియె
మెచ్చునొ? నొచ్చునొ?

- చాటువు

మొండి శిఖండి లోభులను
ముఖ్యజనావళి వేఁడఁబోయితే
దండ మనేది, రెన్నెలలు
తాళు మనేది, మఱింత నొక్కితే
నుండు మనేది, యీదివస
మొర్చుమనేది, సహించి చూచితే
మండిపడేది, మొండిచెయి
మాటుకొనేది వివాద పద్ధతిన్.

- చాటువు

డబ్బులేని ప్రతివాడూ పిసినారే.

- వేణుగోపాలరావు, సూర్యోదయం

### లోభిత్వం

ఖర సంవత్సరంలో మాఇంటి వంటంతయు కాకి గూళ్ళతోనే వెళ్ళిపోయింది.

- కాళ్ళకూరి, వరవిక్రయము

ఇదిగో! కరివేప చెట్టుమీద కాకి గూడు పెట్టి నది. యింతలో డొంకెనతో దానినిఁ బడద్రోసి యీపూట పొయిలోనికి సిద్ధము చేసికో. కరివే పమండ రాలినచో కడుపు చీల్చెదను సుమా!

- కాళ్ళకూరి, వరవిక్రయము

ఓలి తక్కువని గ్రుడ్డిదాన్ని పెళ్ళాడితే నెలకు ముప్పై కుండలు పోగొట్టిందట.

- సామెత

### లౌకిక సుఖం

లౌకిక సుఖాలన్నీ రాలిన పూలతేనియలే.

- రామమూర్తి, అగ్నిగర్భ

### లౌక్యం

నమ్మించోట చేస్తే మోసం, నమ్మంచోట చేస్తే లౌక్యమూఁను.

- గురజాడ, కన్యాశుల్కం

కోపం వచ్చినప్పుడు లౌక్యం మరచిపోకూడదు.

- గురజాడ, కన్యాశుల్కం

లౌక్యుల్ని పిలవడానికి వెళ్ళినప్పుడు దుస్తులు డాబుగా వుండాలి.

- గురజాడ, కన్యాశుల్కం

యంత చదువుకున్నా మీ వైదీకప్పంతుళ్ళ వారికి మా చాకచక్యా లబ్బుతాయండీ? మా లౌక్యం మాతో స్వతహాగా పుట్టినది. మీరు తెచ్చి పెట్టుకున్నది. యెరువు సరుకు యెరువు సరుకే.

- గురజాడ, కన్యాశుల్కం

లోకంలో వున్నప్పుడు లౌక్యం మరచిపోలేంకదా!

- లక్ష్మణరావు, అతడు-ఆమె

లౌక్యంమంటే మరేవిఁ టనుకున్నావు? అసాధ్యాలు సాధ్యం, సాధ్యాలు అసాధ్యం చేయడమే కదూ?

- గురజాడ, కన్యాశుల్కం

ఉద్యోగధర్మం లౌక్యవృత్తి అని, అది ఒక వృత్తి. భగవంతుడు కల్పించాడు. ఆ లౌక్యవృత్తి యెటువంటిదీ? నిజాన్ని పోలిన అబద్ధవాఁడి ద్రవ్యాకర్షణ చేసేది.

- గురజాడ, కన్యాశుల్కం

మంత్రి యగుటచేత నతఁడు లౌకికపు దొంగ.

- పానుగంటి, ప్రచండ చాణక్యము

ప్రకృతలౌక్య మరయఁ బరవంచనమె కదా!

- ఏటుకూరి, ప్రేమాలోకము



### వక్త

వక్తయగువాఁడు వట్టి బల్లల యెదుటనైనఁ గాలానుసారముగఁ గాసంత గడబిడ చేయకుం డనుండలేఁడు.

- పానుగంటి, సాక్షి

చదువఁగలఁ డొకఁ డాలింపఁ జాలు నొకఁడు.

- రాయప్రోలు, రమ్యాలోకము

### వకాలతు

అరె! వకాలతు ఎంతపని చేసిందిరా!

- సురవరం, వకీలు యెంకయ్య

### వకీలు

కోర్టుకెక్కినవారు ఒకరు ఆవుకొమ్మును, ఇంకొ కరు తోకను పట్టుకుంటే మధ్య వకీలు పొదుగు దగ్గర కూర్చుంటాడు.

- సామెత

వక్రభాష్యం

వక్రభాష్యాలు మారకపు వస్తువుల్లా బుద్ధిని తాడనం చేస్తాయి వాటి ప్రభావానికి లోనైన మనసు మొద్దుబారిపోతుంది.

- మహీధర, మరీచిక

వంక

పొట్టకు పుట్టెడు తిని, అట్లకు ఆదివారం అందిట.

- సామెత

నంగీ! నమలక మింగవే అంటే, వుడికిన చేపలు కరుస్తవి అన్నదట.

- సామెత

కొండంత రెడ్డి కొంగు పట్టుకుంటే కాదనేదెట్లా అన్నదట.

- సామెత

వంకర

వ్యభిచార దృష్టి బలంగా ఉన్న మనిషికి, నైతికాభిప్రాయాలు వంకరకాక ఏం చేస్తాయి?

- చలం, ఆరంభింపరు...

వెదవ ప్రోజు ముక్కల్తో ఇదే గొడవ. ఎంతకీ కంఠతా రావు.

- యజ్ఞన్నశాస్త్రి, రంగభూమి

వచనం

నాయకు డేకవచనం, నాయకుళ్లు బహువచనం.

- రావిశాస్త్రి, కుక్కపిల్ల

వజ్రం

వజ్రాలు మట్టిలోనే ఉద్భవిస్తాయి, మరెక్కడా కాదు. నాగరిక లోకం వాటిని సానమాత్రమే పెట్టుకొనగలదు. నీచలోకమైతే వాటిని దోచుకొని దాచుకొంటుంది. కాని ఎవ్వరూ వాటిని సృష్టించలేరు.

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

వజ్రాయుధం

ఆడదాని యేడుపు వజ్రాయుధం వంటిదని కొందరు కవులంటారు.

- ముద్దంశెట్టి, తప్పించుకోలేవు

వంచకం

(ఈ) మేడలు మిద్దెలు, ఈ ధనరాసులు... ఈ అంతస్తులు... హోదాలు... అన్నీ మనిషి తన్ను తాను గుర్తుంచుకోలేకుండా చేస్తాయి.

- పుల్లాభొట్ల, విధివిన్యాసం

వంచన

రాసేది విప్లవాల గాథ
చేసేది శల్యుడి బోధ

- కుందుర్తి, ఆశ

వంచన మ్కొక లలిత కళగా
ఎంచి పెంచు రసజ్ఞు లెవ్వరు?

- మల్లారెడ్డి, అంతర్వాణి

చద్దినాకు పెట్టమ్మా, ఆకలి గాకుండా నీకు మందిస్తా నన్నాడట.

- సామెత

చెట్టుపేరు చెప్పుకొని కాయ లమ్ముకున్నట్టు.

- సామెత

కలంపేరు చెప్పుకుని కథలు అమ్ముకున్నట్టు

- శ్రీరమణ, న్యూసుడి

దయ్యాలు వేదాలు వల్లిస్తున్నట్టు అవినీతిపరులు సైతం అవినీతిని అంతమొందించాలని అందరి కంటే బిగ్గరగా అరుస్తారు.

- చిరంజీవి, వంశాంకురం

వట్టిచేతులు

రిక్తహస్తములఁ బోవంగఁదగదు
భూమిసుర రాజ కాంతల పొంత కెందు.

- దూబగుంట, లబ్ధనాశము

వడగళ్ళు

వడగళ్ళ గట్టు వడునా
గుడిః రాళ్ళను గట్టకున్న గువ్వల చెన్నా!

- గువ్వలచెన్నశతకము

వడ్డన

కాకి కూయగా లేచి, కాటుకమాదిరి అన్నం, కాకరకాయ మిరియం చేసి, పసువు లొచ్చేవేళకు పరుగెత్తి పరుగెత్తి వడ్డించిందట.

- సామెత

వంట

పెండ్లిలో కూడా తద్దినానికి చేసినన్ని కూరలు పచ్చళ్లు చేయరు.

- పూర్ణానందం, నక్షత్రమేళం

"వృత్తుల న్నింటిలో వంటవృత్తి మొదలు"- అని మహాకవి గంగాదాసుగారి సూత్రమున్నది.

- పానుగంటి, సాక్షి

వంటకత్తియ జాణ కావలయుఁ గాక
తినెడువారికిఁ దద్రుచు ల్దెలియకున్నె?

- చిలకమర్తి, ప్రసన్నయాదవము

విరోధము చేత నెవఁడైన మరియొకని జంపఁ దలఁచుకొన్నపుడు నాభి పాషాణము మొదల యిన విషములు పెట్టనక్కఱలేదు. నీచేత నొక్కసారి యన్నము వండిపెట్టించినఁ జాలు. ఏఁబది సంవత్సరములు బ్రతుకఁదలంచిన వాఁ డాపూటఁ జచ్చును.

- చిలకమర్తి, గణపతి

### వంటబట్టడం

కంటికిం దగిలి ప్రజాళి వంటబట్టు
వంట బట్టదా గోడకే పట్టినపుడు?

- మాచిరాజు, రాజకీయ బాధితుడు

### వదంతి

వదంతులు వినకండి. అవి శత్రువుకి తోడ్పడ తాయి.

- బుచ్చిబాబు, ఆద్యంతాలు, మధ్య'రాధ'

### వదరుబోతు

మాటలు ఎప్పుడు నిలపాలో తెలియని వాడే వదరుబోతు.

- సామెత

### వదలనివి

కొట్టే మొగుడ్నియే ఆడదన్నా ఇడిసిపెడుతుంద టయ్యా?

- గోపీచంద్, కూపస్థమాండూక్యం

నల్లవాళ్ళని తెల్లవా డొకంతట వదలనట్టు, దారి ద్రాన్ని ఈగ లొదలవు.

- రావిశాస్త్రి, ఆకలి

కాశిలో బెండను వదిలినాడు గాని ముండను వదలలేదు.

- సామెత

చచ్చేదాక వైద్యుడు వదలడు. చచ్చినా పంచాంగం బ్రాహ్మడు వదలడు.

- సామెత

### వంతు

అడుచుకోను పొడుచుకోను ఆడవారి వంతు
కూచోని భోంచెయ్య మగవారి వంతు.

- జానపదగేయం

ఏడవటం ఆడవాళ్ల వొంతు. బాధపడటం మొగాడి వంతు.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

రాసి అవతల పడెయ్యడం వరకే రచయిత వంతు. సంజాయిషీ చెప్పుకోవడం విమర్శకుని వంతు.

- పార్థసారథి, సాహిత్య హింసావలోకనం

చూడటం ఒకవంతు, సంపాదించటం ఒక వంతు.

- అనిశెట్టి, గాలిమేడలు

### వన్నె

నలుపూ ఎరుపులో ఏం ఉంది? మొఖాన సిరి ఉండాలిగాని!

- సుంకర, కోతలరాయుడు

### వంశాచారం

ఆవు చేలోమేస్తుంటే, దూడ గట్టున మేస్తుందా?

- సామెత

### వయసు

వయసు కేవలం శారీరకమైనది కాదు. చాలా వరకు మానసికమైనది.

- ఆనందారామం, ఉరిమే మబ్బులు

వయసు పాలపొంగులాంటిది!... ఎవరూ గమ నించకపోతే పాలు పొంగిపొరలిపోతాయి... కాదని కొంచెం నీళ్లచుక్కలు చల్లితే చప్పున చల్ల బడిపోతాయి.

- రామచంద్రమూర్తి, శ్రీరాగం

ఆడదాని వయస్సు మగవాడినిబట్టే వస్తుంది.

- మారుతీరావు, మళ్ళీ మధుమాసం

చిన్నతనమే వైరాగ్యమునకుఁ దగిన కాలము. ఎదిగిన కొలఁది వృద్ధియగునది వైరాగ్యము కాదు. లాంపట్యము.

- పానుగంటి, చూడామణి

వ్యాజ్యానికి వెయ్యేళ్ళు. మనిషికి నూరేళ్ళు.

- కొచ్చెర్లకోట, ఓన్లీ డాటర్

ఈ వయసుంది చూసేవా? ఇది చాలామందిని చాలారకాల పిచ్చివాళ్ళుగా తయారుచేస్తుంది.

- ఆదివిష్ణు, చూడుచూడు నీడలు

విజ్ఞాన విశేషమునకు వయసుతో అంతగా పని లేదు.

- తెన్నేటిసూరి, నా రాణి

వయసు మళ్ళుతున్న సమయంలో వెన్నెలమీ

దకే చల్లగాలిమీదికి మనసుపోదు. మనసులోనే వెన్నెలా చల్లగాలీ ఉన్నప్పుడు, ఇంక బయట అది లేకపోతేనేం? ఎప్పుడైతే వీటికోసం మనిషి తహ తహపడతాడో, అప్పుడతనికి వార్ధక్యం వచ్చేసిందన్నమాటే.

- పాప, చేతికిచిక్కిన పిట్ట

స్త్రీ వయస్సు కచ్చితంగా ఇంతే అని చెప్పిన వాడు సృష్టిలో లేడు.

- బుచ్చిబాబు, ఒకేనిద్ర-ఎన్నోకలలు

వరం

దైవం వరమీయకున్నా పూజారి యిస్తాడన్నది ఊరి విధవలకి బాగా తెల్సు.

- సుధాకర్, 'గుడీ, బడీ, గడీ'

మనదేవుళ్లకు యివ్వటమే తెలుసు. యివ్వ కుండా వుండటం చేతగాదు.

- రారా, అలసినగుండెలు

మనిషి చచ్చిపోయేటప్పుడు కోరుకొనేవరాలు సాధారణంగా అత్యంత స్వల్పమైనవే.

- సభా, నీటిదీపాలు

పండు జుత్తూ, బట్టబుర్రా ఒక వయసు తర వాతే వరాలలాగ పనిచేస్తాయి.

- వెంకటరమణారావు, కొలువు

వరప్రసాది

ఓడ రాకడ రేవులో అనేకులకు అనేక విధాలుగా వరప్రసాది.

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

వరిపంట

చిత్త చిత్తగించి, స్వాతి చల్లచేసి, విశాఖ విసర కుంటే, అనూరాధలో అడిగినంత పండుతాను అన్నదట వరి.

- సామెత

వర్తకం

న్యాయంగా ప్రవర్తిస్తే వర్తకమే సాగదు. ప్రతిదా నిలోనూ కొంచెం అబద్ధం వుండవలెను.

- కందుకూరి, మ్యునిసిపల్ నాటకము

ఎప్పుడు నేదేశమును కృషి వాణిజ్యాదుల వల ననే మంచి దశకు వచ్చునుగాని సేవక వృత్తివ లన గాదు.

- కందుకూరి, కృష్యాది వ్యాపారము

వర్తకుడు

డబ్బుకు ఏ అశుద్ధమైన తినగల్గిన వారు, స్వభా వానికి సిసలైన పచ్చి వర్తకులు. అభిమానాలకు పోకుండా, వెన్నలో నుండి దారం లాగినట్లుగా తమ కార్యాలు సాధించుకొంటారు.

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

వర్తమానం

వెనకా ముందుల కలయికే వర్తమానం.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, అనుభవాలూ-జ్ఞాపకాలూనూ

గతమంతా తోలుబొమ్మలాడిన తెర
వర్తమానం నీ కన్నుల కప్పిన ఒకపొర.

- తిలక్, పాడుపోయిన ఊరు

వర్షం

వర్షాన్ని చూసి ముఖం చిట్లించకండి. అదొక్కటే కదా మనకు ఉచితంగా లభిస్తోంది.

- శ్రీరమణ, న్యూసుడి

రోహిణిలో వర్షంకురిస్తే రోళ్ళునిండిన పంట.

- కొంతారావు, దగాపడిన తమ్ముడు

తటిమి కఱచిపోవు త్రాఁచుబా మటువోలె
ఉఱిమి కురిసిపోవు నుడుకుమబ్బు

- ఏటుకూరి, క్షేత్రలక్ష్మి

వలపు

తమ రహస్య శృంగార చేష్టలు మిత్రులతోచెప్పి తేనేగాని కొందరికి తనివి తీరదు.

- గురజాడ, మీ పేరేమిటి

కలుపంటే వలపులాంటిది.

- బుచ్చిబాబు, ఉత్తమా యిల్లాలు

తేజముసూ వలపుఁ దెలుపుఁ దెఱవల
కెందున్.

- నాచనసోమన, ఉత్తరహరివంశము

వశీకరణం

వినయం లోకవశీకరణం. విద్య రాజవశీకరణం.

- సామెత

వసంతం

పంచాంగంలో
భయపడి దాకున్న వసంత రుతువును
పంచమ ప్రాణంగా లాక్కుని
గుండెల్లో దాచుకున్నాను.

- దాశరథి, వసంతాన్వేషణ

సంప్రదాయ భీరువుకీ
అస్వతంత్ర వితంతువుకీ

వసంతం లేదు.

- తిలక్, శిఖరారోహణ

**వాకిలి**

ఎన్నిగేట్లు తెరుచుకున్నా
ప్రశ్నలకి సమాధానం దొరకదని
మొదటిసారిగా తెలుసుకుంటాడు
ఆదిమ మానవుడు.

- ఇస్మాయిల్, రైలుగేటు

**వాక్పారుష్యం**

బెడిదముగ గత్తి గొడ్డటఁ
బొడవఁ దెగినప్రూనఁ జిగురువొడముఁ బలు
కులం
జెడఁ దునిసిన కార్యంబు ని
గుడనేర్చదు పిదపనెట్టు గురువంశనిధీ!

- తిక్కన, ఉద్యోగపర్వము

**వాక్ స్థానం**

నాకు వాక్‌స్థానమందు బృహస్పతి వున్నాడు.

- గురజాడ, కన్యాశుల్కం

**వాగు**

కొండమీద కాచిన దొంగసారాలా
భయంగా మందంగా
ప్రవహిస్తోంది కొండవాగు.

- కమ్మిశెట్టి, ప్రతిరోజూ నటిస్తుంది

**వాగుడు**

చచ్చినవాళ్ల కిచ్చిన వాగ్దానాన్ని తెలివైనవాడు చచ్చినవాళ్లతోనే సమాధి చేస్తాడు.

- పినిశెట్టి, పల్లెపడుచు

గీతాసారం వినిపిస్తానని సారాగీతం వినిపించాట్ట

- శ్రీరమణ, న్యూసుడి

జైదులో పక్షవాళ్లకి వాగు డెక్కువౌతుందేమో!

- వేదాంతకవి, తెనుగుతల్లి

**వాంఛ**

భోగ లాలసకు అలవాటుపడే మోడల్స్, సినిమా స్టార్స్, డబ్బును బాగా ప్రేమిస్తారు- మనుష్యులకన్నా, అదిచ్చే సుఖాలకోసం.

- రామమోహనరావు, మోడల్

క్రొత్తమగనిమీఁద, క్రొత్త యావకాయమీఁద వాంఛ మట్టు కందఱ కొక్కటిగనే యుండును కాని యా వాంఛవలనఁ గలుగు సుఖాసుఖములు భేదముగా నుండును.

- పానుగంటి, మాలతీమాల

యతికి మఱి బ్రహ్మచారికి
సతులితముగ విధవముండ కశ్వంబునకున్
సతతము మైథున చింతయ... ...

- కవిచౌడప్ప శతకము

**వాటం**

వాట మెఱిఁగి వచియించినఁ
బాటిలుగా వానిమాట పదుగురిలోనన్
వాట మెఱుంగక పల్కినఁ
గోటికి సరితూగదప్పు!...

- చాటువు

**వాడి**

ఎన్నికలలో ఎగరేసిన వాగ్దానపు కత్తులకి
మొనకన్నా పిడి దగ్గర వాడి ఎక్కువ.

- తిలక్, న్యూసిలబస్

ముందు వచ్చిన చెవులకన్నా, వెనుక వచ్చిన కొమ్ములు వాడి.

- సామెత

ఆయుధాల వాడికన్న
ఆలోచన వాడి మిన్న

- ముకురాల, నవ్వేకత్తులు

**వాతావరణం**

పిలిస్తే విషపుగాలి, రాలిస్తే కన్నీరు
ఆలిస్తే ఆక్రందన
కాలూనితె అడుగడుక్కీ విషక్రిములు.

- దాశరథి, కిరణశకలం

మనుష్యుని మనస్సు, ఆలోచనలు అతడు పెరిగిన వాతావరణాన్నే చాలా వరకు ప్రతిబింబిస్తుంటాయి.

- మహీధర, ఓనమాలు

హంతకుల్ని, దొంగల్నీ వొక్కొక్క వాతావరణంలో చూస్తే చాలా దయ, జాలి కలుగుతుంది.

- నంది, నైమిశారణ్యం

**వాదన**

నీబీడు దున్నుకునే హక్కు నీదేనని వాదన.
ఇరుల గనుల త్రవ్వి వెలుగు లేరుకునే వేదన.

- కుందుర్తి, కాలాలు

వాదం ఉంటే ప్రసాదం కూడా అక్కర్లేదు.

- మహీధర, కత్తులవంతెన

అందుచేత సుశీనరునితో వాదము లేకపోయెను.

- విశ్వనాథ, నందోరాజా భవిష్యతి

భావనా బలం లేకపోతే వాదనలలోనే మనిషి తేలిపోతాడు.

- మహీధర, ఓనమాలు

వాదనలో విసుగూ, కోపమూ -ఓటమిని తెలియజేస్తయ్!

- ధనికొండ, పవిత్రులు

వాదించడం అంటే న్యాయానికి స్తోత్రం చెయ్యడం కదా!

- కాంతారావు, వంశధార

వేగలేక ఆగలేక
తిరగబడితె "అది వాదం? "

- దాశరథి, పునర్నవం

వాదనవల్ల అభిప్రాయాలు మరింత బలపడతాయే కాని చలించవు.

- కౌసల్యాదేవి, శాంతినికేతన్

వాదముఖమునఁ దఱవంగఁ బడిన మాట
చిత్తమందును దృఢముగాఁ జేరుసుమ్ము
భూమిలో లోతుగా దింపఁ బూను కట్టి
నలల నాడించి దింపంగవలెను గాదె?

- పానుగంటి, ప్రచండ చాణక్యము

రైటర్‌తోటి లాయర్ తోటి వాదించకూడదంటారు.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

## వాద్యం

రాలలో మ్రోగు వాద్యాలు
పూలలో దాగు మద్యాలు

- దాశరథి, పునర్నవం

## వాయిదా

రేపురా, మాపురా, మొగమాపురా అన్నట్లు

- సామెత

ఈసారి కాదు. మఱియొకసారి చూడవచ్చును లెండు.

- చిలకమర్తి, గణపతి

## వారం

అతడు నెలలో నాలుగు వారాల్నీ నాలుగు పేర్లతో పిలుస్తూవుంటాడు - సూపర్ వీక్, పేపర్ వీక్, కాపర్‌వీక్, పాపర్‌వీక్.

- విహారి & శాలివాహన, బనేవా

## వారసత్వం

వారసత్వాన్ని నమ్ముకుంటే కోరికలు తీరినట్టే. చావక పోతాడా? చాప వదలక పోతాడా? అన్న ఆశకు అర్థం లేదు.

- ముద్దుకృష్ణ, ఆడవాళ్ల తెలివి

ఆకలికి నిదుర వారసుఁడు.

- విశ్వనాథ, తెఱచిరాజు

ఎడంచెయ్యి వాటం, డైబటీసు, తెల్లజుత్తు యివన్నీ వారసత్వమయ్యా! తప్పించడం మన తరంకాదు.

- బీనాదేవి, డిబెట్

## వార్త

గాలికన్నా వేగంగా ప్రయాణించేది వార్త:

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

రాచదేవిడీలందు వార్తలును జేరఁ
బ్రభువు ప్రభువుకు మధ్య నబ్దములు పట్టు.

- విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము

బావిలోని కప్పకేమి తెలుసు ఊరిలోని కబుర్లు అన్నట్లు.

- సామెత

అగ్గంటుకున్న ఇళ్లు గుప్పుమన్నట్టే ఆడదాన్నంటిపెట్టుకున్న వార్తలు కూడా గుప్పు మంటాయి.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

వార్తయందు జగము వర్ధిల్లుచున్నది.

- నన్నయ, సభాపర్వము

## వార్తా స్థలం

సంత, రచ్చపట్టు, సారా దుకాణంబు,
గణికయిల్లు, చెరువుగట్టు, వంట
పూటి యిల్లు, వెచ్చముల యంగడియు వర్త
మానములకు మంచి తానకములు.

- కాళ్లకూరి, చింతామణి

## వార్ధక్యం

వృద్ధాప్య మనేది సూర్యోదయం లాంటిది. దాన్ని ఎవరూ ఆపలేరు. మృత్యువు అనేది సూర్యుడు అస్తమించటం లాంటిది.

- లల్లాదేవి, నాగభైరవి

## వావివరసలు

జాణతనము గల్గి సవరతనము గల్గి
తెలివి గల్గి మోరతీరు గల్గి
చేయలంతి తనకుఁ జేకూడినప్పుడు
వావి వలదు...

- వల్లభరాయడు, క్రీడాభిరామము

దొంగతనమునకు ద్రోహమునకును వావి వర్తన లతోఁ బనిలేదు గదా!

- భానుమూర్తి, హేమలత

## వాస్తవం

ఏ మనిషిని గురించి వాస్తవంగా చిత్రించాలన్నా కొంత కల్పన కావాలి.

- కొడవటిగంటి, ఎండమావులు

ఈ దేశ భక్తులూ ప్రాణ త్యాగులూ వీళ్లందరి వల్లా లోకానికి గొప్ప వుపయోగం ఉండవచ్చు కాని వాళ్ల జీవితాలు మాత్రం వుత్త వంకర. వాళ్లకీ వాళ్లని నమ్మిన దగ్గర వాళ్లకీ వుత్త క్షోభ.

- చలం, మ్యూజింగ్స్

పారిపోయిన పెళ్లాలు మరియాదలకి లొంగర్సార్!

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

రాజ్యము గీజ్యమున్ సతతమే?
కాయం బనాపాయమే?

- పోతన, భాగవతము

ఎవ్వరేమనుకున్న
ఏటిసిగ్గని బిర్ర
బిగిసి ఊహారాజ్య
పీఠమ్ము వదలవో
వలపు కైతలరేడ!
వలదు మూర్ఖత్వమ్ము
వాస్తవిక జీవితపు
వైవిధ్యమును జూడ
దిగిరమ్ము! దిగిరమ్ము!
దివి వీడి భువిపైకి

- మల్లారెడ్డి, పిలుపు

పేరు పల్లకీ మీద, కాలు నేలమీద

- సామెత

ప్రజలు నన్ను అనుసరిస్తున్నారంటే కాదు వెంబడిస్తున్నారు అన్నారట.

- శ్రీరమణ, న్యూనుడి

చిత్తం శివునిమీదా, భక్తి చెప్పులమీదా.

- సామెత

వాస్తవమే ఊహలకును
ఊయెలయై మిన్నాపును.

- రమణారెడ్డి, కలలో వెన్నెల

## వికాసం

వెలమొదట్లో కాస్తంత వికాసముంది.
చివరి రోజుల్లో బోలెడంత విచారముంది.

- మధుర్, రంగులరాట్నం

పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది, ఆడది మటుకు వయసు వచ్చిన కొద్దీ రెచ్చిపోతుంది!

- రామకృష్ణశాస్త్రి, మధ్యాక్కర

## విగ్రహం

మతోన్మాదము పెంచు దేవునికి
మారుగ నిల్చిన రాతి బొమ్మలం
దూదరవోవ పాడుబ్రదు
కొక్క నిమేషము సైప నాయెదన్.

- వేదుల, కాంక్ష

తమకు బలం బెక్కిన తటి
సముచితమగు విగ్రహంబు, శత్రుల కుత్సా
హము మీఱినపుడు గర్త
వ్యము సంధి యనంగ విందు మార్యులచేతన్.

- తిక్కన, శల్యపర్వము

## విఘ్నం

ఆలస్యంబును గామినీజనరతి
వ్యాసక్తియున్ జన్మభూ
లోలత్వంబును రోగమున్ ఘనభయో
ల్లోభంబు సంతోషమున్
బోలంగా నివి యాఱు నెప్పుడు జగ
త్పూజ్య ప్రతాపోదయ
శ్రీలం జెందఁగ విఘ్నకారణములై
చెల్లున్ ధరామండలిన్.

- దూబగుంట, పంచతంత్రము

## విచక్షణ

కష్టాల్లో వున్న వాళ్ళకు ఎవరు చేయి అందించినా అది అమృతహస్తంలాగానే కనబడుతుంది. ఆ హస్తంలో నిజంగా అమృతమే వుందో, హాలాహలమే వుందో విచక్షణాజ్ఞానంతో తెల్సుకోవాలి.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

## విచారణ

ఇక్కడ ఓంప్రథమంలో ఉరితీసెయ్యడమునూ తరువాత నిమ్మళంగా విచారణ ప్రారంభించడమున్నూ!

- భమిడిపాటి, నామాటేనెగ్గింది

ఇంటరగిసన్ జెయ్యటం అంటే అచ్చపచ్చి తెలుగుల ఏటిసెప్పుకోవాలంటె సావబాదటం అని

అరదం సెప్పుకోవాల.

- రావిశాస్త్రి, బంగారిగాడికత

### విచారం

మృతినొందినవాని కొఱకు విచారించుట పగిలి పోయిన కుండకొఱకు వగచుట.

- చిలకమర్తి, కర్పూరమంజరి

నెల మొదట్లో కాస్తంత వికాసముంది
చివరిరోజుల్లో బోలెడంత విచారముంది.

- మధుర్, రంగులరాట్నం

విచారము గోర్కికిఁ గాని వావియే?

- తిక్కన, విరాటపర్వము

శిరశ్ఛేదసమయంలో కుండలాలను గూర్చి విచారించినట్టు.

- వెళ్ళపిళ్ల, కథలు-గాథలు

అధిష్ఠానవర్గం అన్నందుకు కాదు - అపోజిషన్ వాళ్లు విన్నందుకు.

- శ్రీరమణ, న్యూసుడి

### విచిత్రం

మనిషికి ఎంత శోకంలోనైనా ఏదో విచిత్రం అంటే చూడాలనిపిస్తుంది.

- సభా, నీటి దీపాలు

వేశ్యావాటికలో రుద్రాక్ష దామము లమ్మ వచ్చితివా?

- పానుగంటి, ప్రచండచాణక్యము

### విజయం

పోరఁగ జయమైన దానిఁ బోఁద్రోచెదమే?

- తిక్కన, భీష్మపర్వము

ప్రపంచమంతా ఒక్కటై. ఒక్క మనిషి ఒక్కడూ ఒకటే అయి కాసుగున్నప్పుడు, తప్పకుండా ప్రపంచం నెగ్గుతుంది.

- భమిడిపాటి, బాగుబాగు

విజయుఁడైనవాఁడు విల్లంది నంతనే
కుజను లెల్లవారు కూలిరిగద
భజనచేయునతఁడు విజయము గాంచఁడా?

- వేమన

### విజ్ఞత

ఏదన్నా పాడుపని చేసేప్పుడు ముందు తప్పించుకునే మార్గాన్ని వెతుక్కోవటం విజ్ఞుల లక్షణం.

- ధనికొండ, పవిత్రులు

### విజ్ఞానం

యూనివర్సిటీ చుట్టూ బ్రహ్మజెముళ్లు!
విజ్ఞానం చూట్టూ నాగజెముళ్ళు!

- తులసి, వలయం

విజ్ఞానం ఉంటే జుట్టు నెరుస్తుంది.

- ముళ్ళపూడి, సీతాకళ్యాణం

కుర్చీల్లో మన పక్కని కూర్చొనే పెద్ద మనుష్యుల చచ్చు సంభాషణకన్నా నేలని కూర్చొనే మామ్మోలు మనుషుల మాటల్లో నువ్వూ నేనూ నేర్చుకోదగ్గ విజ్ఞానం చాలా ఉంది.

- చాసో, బబ్బుల్నా

కనులు రెండును బోయెనుగాని లేదు
గ్రుడ్డితనము విజ్ఞానచక్షువునకింక

- చిలకమర్తి, పోతరాజు

విజ్ఞానానికి విలువకట్టని సమాజానికి వృద్ధి లేదు. వికాసము చెందదు.

- ఆళ్వారుస్వామి, ప్రజలమనిషి

### విడదగినవి

తొక్కిన కదలని సైకిలు
పక్కింటి మిటారి మీది పగలిటి భ్రమయున్
ఎక్కకె పారెడి గుర్రము
గ్రక్కున విడవంగ వలయు గదరా సుమతీ.

- మాచిరాజు, చాటువు

### విడాకులు

చట్టమర్యాదలకు లొంగఁ జాలనట్టి
మగఁడు గొఱగాని యెల్లాఁపి మాఱుమనుము
మన విడాకుల చట్టమ్ము మాఱుపేర
సాగుచుండును బలుగాకి సంబరముల

- ఏటుకూరి, క్షేత్రలక్ష్మి

### వితంతువు

విడో అనే వస్తువ యక్కడుందయ్యా? వెళ్ళిరించే వెధవల నోళ్ళలో ఉంది.

- గురజాడ, కన్యాశుల్కం

బ్రహ్మచారి యొక్క రియల్ డ్యూటీ-అంటే విధింపబడిన పని-యేమనగా విధవలను పెండ్లాటమే.

- గురజాడ, కన్యాశుల్కం

వెధవముండకి పాతివ్రత్యం అన్నమాట ఈనాటికి విన్నాను.

- గురజాడ, కన్యాశుల్కం

తలచెడ్డం అంటే, విడో అన్నమాట.

- గురజాడ, కన్యాశుల్కం

మనదేశంలో మెయిడెన్స్ వుండరోయి. యంతసేపూ లవ్ మేకింగ్ విడోజ్కి. చెయ్యాలి గాని మరి సాధనాంతరం లేదు.

- గురజాడ, కన్యాశుల్కం

వెధవలు పెళ్ళాడడం పాపం కాదూ?

- గురజాడ, కన్యాశుల్కం

విడో విత్ గిల్ట్ లెటర్స్!

- గురజాడ, కన్యాశుల్కం

ప్రపంచమందుండే వస్తువులన్నిటిలోకి ముఖ్యమైనవి విధవలు.

- గురజాడ, కన్యాశుల్కం

వెధవలు పెండ్లాడ వలసినదని పరాశరస్మృతిలో స్పష్టంగా నున్నది. వేదంలో కూడా నున్నది.

- గురజాడ, కన్యాశుల్కం

శాస్త్రాలన్నీ వొప్పుకోవటమే కాకుండా మీదుమిక్కిలి వెధవలు పెళ్ళాడకుండా వుండిపోతే దోషమని కూడా చెపుతూ ఉన్నాయి. ఇందు విషయమై శంకరాచార్యులవారు పత్రిక్కూడా యిచ్చియున్నారు.

- గురజాడ, కన్యాశుల్కం

అల్లుణ్ణి హతవాఁరిస్తే, కూతురు డబ్బిల్ వెధవౌతుంది.

- గురజాడ, కన్యాశుల్కం

నవాబు గారిది బోడితలయే. నాదియు బోడి తలయేనని వితంతువు విఱ్ఱవీఁగినట్లున్నది.

- పానుగంటి, సాక్షి

ఆర్యావర్తమున కెల్ల రెండే యద్భుతములగు నభిజ్ఞానములు. మొదటిది దేవాలయములు. రెండవది వితంతువులు. భారతీయుల కెల్ల నీరెండే పవిత్ర వస్తువులు.

-పానుగంటి, సాక్షి

తలలు బోడులైన దలపులు బోడులాయని పలికిన వేమన యోగినిఁ జెడదిట్టుచు వీధులవెంట బయలుదేఱిన యీ వైఖరిగల వితంతువు నేమనఁదగును?

- పానుగంటి, సాక్షి

వియోగ దుఃఖంతో కుమిలిపోయే ఆడదానికి వితంతు యోగం కల్పించిన కుళ్ళు సమాజం ఎంత అన్యాయం అక్రమం తలపెట్టింది ఆడదానికి?

- పురాణం, ఇల్లాలి ముచ్చట్లు

ఈ దేశంలో వెధవ ముండలమీదే అందరికీ జాలి. నాయకులూ, వినాయకులూ వాళ్ళని గురించే ఉపన్యాసా లిస్తారు. గవర్నమెంటు వాళ్ళు వాళ్ళకి ఊరికే చదువులు చెపుతారు. మొగుడు చాటు ముండల గతి చూసేవాళ్ళే వరూ లేరు....

- పాప, పాలపొంగు

వారకాంతల యిండ్ల వాసంబుఁ జేయుచు
మగువ కేడ్పెడువాఁడు మడ్డివిధవ,
అన్నదమ్ములతోడ నాలికై ద్వేషించి
కడఁగి తిట్టెడువాఁడు బడుగువిధవ,
కట్నమిచ్చెదనని కాలము దీయక.
గోళ్లు గిల్లెడువాఁడు కొంటెవిధవ,
చదువుఁ జెప్పిన కూలి జరుపుచు నీయక
మిటకరించెడువాఁడు మేటివిధవ

- చాటువు

పోఁకలు నమలుచు నాకులు చేఁబూని
సున్న మడుగువాఁడు శుద్ధవిధవ,
ఇద్దఱు నొకచోట నేకాంత మాడంగ
వద్దఁజేరెడువాఁడు వట్టి విధవ,
ఆలితోఁ గలహించి ఆకలి లేదని
పస్తుపండెడువాఁడు పందవిధవ,
దారిద్ర్యముననుండి తన పూర్వసంపద
లూరక తలఁచువాఁ డుత్త విధవ

- చాటువు

విధవైన మేలు; మగనికి
తిథివెట్టును, కథలు వినును, తీర్థము లేగున్
అధము లద్దాని కన్నను
వెధవలురా...

- చాటువు

పెండ్లాడకుండా వున్న వెధవ పిల్లలు దేవుని ఆజ్ఞను అతిక్రమించిన పాపమును చేస్తున్నారు.

- గురజాడ, కన్యాశుల్కం

**విత్తనం**

కాలంలో విత్తనాలు కలలోనైనా చల్లాలి.

- సామెత

**విదేశీ నిపుణుడు**

మనదేశంలోనే వుంటూ మనదేశపు విషయా

లలో శ్రద్ధ చూపించకుండా ఎప్పుడూ విదేశీ వ్యవహారాల గురించి పరిశోధనలు జరిపేవాణ్ణి విదేశీ నిపుణు డంటారు.

- సూర్యారావు, దేశదిమ్మరులు

**విద్య**

తిత్తి మన్నింపఁబడదాకో? దేవదారు
కట్టకును లేదె మిక్కిలి గౌరవంబు?
గుబ్బిపున్ వెండ్రుకల కెంత గొప్పలేదు?
విద్యగల వస్తువుల కెందు వెలితి గలదె?

- తి.వేం, కలగూరగంప

విద్యల తారతమ్య మవివేకు
లెఱుంగరు వ్రాతు రేదియో!

- తి.వేం, కలగూరగంప

చండామార్కుల విద్య చేతులుకావు, కాళ్ళు!

- సామెత

మన కొచ్చిన విద్య పొట్టనింపేదిగా మాత్రమే కాక జనాలకు పనికిరావాలి. దీనజన సేవ దేవికి మహాప్రీతి.

- శ్యామలారాణి, పవిత్ర

పొట్టకూటికి నేర్చు విద్యలు
పుట్టకీట్లు కదల్చునా?

- గురజాడ, లోకచుక్క

ప్రతివిద్యా జీవితకాలంలో ఎప్పుడో ఒకప్పుడు వుపయోగపడి తీర్తుంది.

- కౌసల్యాదేవి, శ్రీనివాసకళ్యాణం

**విద్యార్థి**

ఈ కాలంలో రొట్నీ, పిట్నీ, సుట్టా, బీడీ, చిగిరెట్నీ పోల్చలేని ఇస్టూడెంటు కుర్రోళ్లుండ్రు.

- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

**విద్యాలయం**

విద్యాలయాలు రాజకీయ నాయకుల
ఎత్తుగడలకు రడీమేడ్ కేంద్రాలు

- నాగరాజారావు, నాదేశం

మస్తిష్కం నిండా అజ్ఞానం దట్టించి
విద్యాలయంలో తివ్ర వేశాడు వానరుడు!

- జానకీజాని, కన్నీళ్ళ కడవ

**విద్యావతి**

డిగ్రీలు గల పిల్ల శీలం లేనిదానితో సమానం.

- కొడవటిగంటి, పంచకళ్యాణి

**విద్వాంసుడు**

యెవరో తప్ప విద్వాంసులలో చాలామంది ఐశ్వర్యవంతులను ఆశ్రయిస్తూనే వుంటారు.

- వెళ్ళపిళ్ల, కథలు-గాథలు

**విధి**

పిడుగు ఒకే స్థలంలో రెండుమారులు పడదు. కాని విధి ఎక్కుపెట్టే బాణాలు పదేపదే ఒకే లక్ష్యాన్ని సరిచూచి గుచ్చుకుంటవి.

- లలిత, మాయనిమచ్చ

దేవతల కమృతము మనుష్యులకు తరవాణి బ్రహ్మదేవుడు విధించినాఁడు.

- చిలకమర్తి, గణపతి

మానవ జీవితాన్ని పాలించేది విధేగాని విజ్ఞానం కాదు.

- సామెత

చండతరుండైన విధి, లంచగొండి గాదు.

- జాషువా, ముంటాజమహలు

ప్రియురాలే పెళ్లాం అయితే ప్రేమకూడా డ్యూటీ అయిపోతుంది. పెళ్లాం ప్రియురాలు అవదుకాబట్టీ ఆ రెండో ప్రశ్నలేదు.

- బీనాదేవి, హరిశ్చంద్రమతి

**విధికృతం**

నోరుమాలిన సతికి నీతిమాలిన పతి తప్పఁడు.

- పానుగంటి, ముద్రిక

**విధ్యుక్తధర్మం**

ఇరుగు పొరుగులను ప్రేమించడం మధ్య ఇంట్లో కాపురం ఉన్నవారి విధ్యుక్తధర్మం.

- ముళ్లపూడి, వరలక్ష్మీవ్రతం

**విధ్వంసం**

గుడ్డెద్దు జొన్న చేలో పడ్డట్టు

- సామెత

**వినరానిది**

చెవిలో చెప్పిన మాటగాని, అరిచి చెప్పిన మాట గాని వినదగినవి కావు.

- సామెత

**వినాయకుడు**

పదవీ వ్యామోహంలో
ప్రజ్వలించు దాహంతో
ఊహాలోకమ్ములోని
ఊర్ధ్వశిఖై పరితపించు

భావకవుల దలదన్నే
భావుకు డీవినాయకుడు
- మల్లారెడ్డి, మహాప్రసాదం

## వినేవారు

వినేవారుంటే ఎన్నయినా అంటారు.
- కె.ఎల్., కొడిగట్టిన దీపాలు

## వినోదం

మహారణ్యాలలో వినోదాలూ, నగరంలో వేటా.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, రాజరాజు

## విన్నపం

నలుగురు కూచుని నవ్వేవేళల
నాపే రొకతరి తలవండి.
- గురజాడ, పూర్ణమ్మ

విజ్ఞప్తులు చెవులున్న వారికే చేయటం మంచిది; మదానికి చెవు లుండవు.
- కుందుర్తి, తెలంగాణ

## విన్నవీ, కన్నవీ

విబుధ జనుల వలన విన్నంత కన్నంత
తెలియవచ్చినంత తేటపఱతు.
- పోతన, భాగవతము

## విపర్యయం

శ్రీవారు వేషభాషలలో తెల్లదొరలు; మనసులో మాంధాతలు.
- శివరామశాస్త్రి, శకునము

వలయువాని కేడాది యొక నిముసము.
అక్కఱలేని వానికి నిముస మొక యేడాది.
- శివరామశాస్త్రి, వివాహబలి

## విప్లవకారులు

బయటనున్న విప్లవకారులలో
విభేదాలు విభేదాలు
లోపలనున్న విప్లవకారులలో
తగాదాలు తగాదాలు
- ఛాయారాజ్, శ్రీకాకుళం

## విప్లవం

విప్లవాలు సుదీర్ఘ సాయుధ ప్రయాణాలు.
- జ్వాలాముఖి, నక్షత్రాల వంతెన

విప్లవ మంటే డబ్బులు కలవాళ్లూ లేని వాళ్లూ ఒకరి గొంతులు ఒకరు కోసుకోవటం.
- కొడవటిగంటి, పిరికిదయ్యం

విప్లవానికి దొడ్డిగుమ్మం లేదు.
అన్నా అది పాలకులు, రాజశ్యాలకులు
తెరిచేది కాదు.
- బైరాగి, జనం గెలుస్తారు

నిన్నటి తమస్సులోనుండి
రేపటి ఉషస్సు కోసం
నేడు చేసే తపస్సే విప్లవం
- గౌరీశంకర్, విప్లవం

విప్లవం జపం చేస్తే రాదు. విప్లవం రక్తంలోంచి పుడుతుంది. రక్తంలోంచి పెరుగుతుంది. విప్లవం సాయుధం. నిరాయుధం అయిన విప్లవం ఏనాడూ రాలేదు. రాదు.
- రంగాచార్య, జనపదం

చరిత్ర ప్రసవిస్తున్నది
విప్లవం ఈ యుగశిశువు
- యాత్రిక్, ఆహ్వానం

## విభిన్నత్వం

మనభారతదేశం గొప్పతనమంతా విభిన్నత్వం లోనే వుంది.
- లక్ష్మణరావు, అతడు-ఆమె

## విభూతి

ఇసుమంత బూడిద నొసటం బూసినను
మసలక కొండంత మరు లెత్తె నపుడు
- పాల్కురికి, బసవపురాణము

ఆవగింజంత బూది మై నలందుకొన్న
వెలంది! గుమ్మడికాయంత వెఱ్ఱి పుట్టు.
- శ్రీనాథుడు, హరవిలాసము

## విమర్శ

విమర్శ వలెనే పేరుతో వ్రాసే వ్రాంతలు కేవల మున్నూ వ్యక్తి ద్వేషంతో బయలుదేఱవి కావటం చేత ప్రాజ్ఞులు వాటియందు విశ్వాసం వుంచరు.
- వెళ్ళపిళ్ల, కథలు-గాథలు

ఒకరు చేసిన పనిని విమర్శించే అధికారము ఇంకొకరికి ఉన్నంత వరకు ప్రతిచిన్న పొర బాటూ, సామాన్య విషయమూ కొండంతగా కనబడుతుంది.
- సరస్వతీదేవి, డోలారోహణం

చదివినతోడనే పక్షపాత బుద్ధి ఏర్పడుతుంది. కాబట్టి విఖ్యాత విమర్శకులు, గ్రంథం చదవకుం డానే విమర్శిస్తారు.
- బుచ్చిబాబు, అంతిమజ్ఞానం

ఎద్దియేని సవిమర్శంబుగం బరికింపక కాని యున్న తెఱం గెఱుంగంబడదు గదా!

- చిన్నయసూరి, మిత్రభేదము

ఉపేక్షకంటె నుత్తమ విమర్శనము వేఱొకటి లేదు.

- పానుగంటి, సాక్షి

మాటాడుటకు తడుముకొను శురలు గ్రంథవి మర్శనముల కారంభించెదరు.

- చిలకమర్తి, నవ్వులగని

విమర్శించడం తప్పుకాదు. తెలుగువాళ్లకి తెలీ నిదే ఇది.

- చలం, మ్యూజింగ్స్

విమర్శ ప్రక్రియలో సృజనశక్తిని చంపే గుణం, చంపుకునే గుణం వుంది. సృజనశక్తి చచ్చిన మనిషి మనిషి కాదు. రాక్షసుడు.

- గోపీచంద్, ఆత్మపరిశీలన

అసలు విమర్శ అంటే ఏమిటి? పొంగేలా పొగ డటం లేదా చచ్చేలా తిట్టటం!

- చలసాని, కందూతి

## విముక్తి

ఆడవాళ్లని భర్తల హోదాతో గుర్తించడం మానే సేదాకా ఆడవాళ్ళకు విముక్తి లేదు.

- ఓల్గా, మానవి

## విరసం

సరసంలో నఖక్షతాలు అవుతాయి. విరసంలో రక్కులు, బరుకులు, గిచ్చులు అవుతాయి.

- మహీధర, దేశంకోసం

## విరహం

ప్రావృట్కాల ప్రవాసంబును మరణంబును రమణీరమణులకు నొక్క సమంబ.

- వల్లభరాయడు, క్రీడాభిరామము

## విరుగుడు

మనకు ఏ వాతావరణంలో ఒక మనోవికారం కలుగుతుందో ఆ వికారంతోపాటు ఆ వాతావ రణం కూడా పోతే తృప్తి కలగదు. ఆ వాతావ రణంలోనే ఆ వికారానికి విరుగుడు కలగాలి.

- కొడవటిగంటి, గంధర్వలోకయాత్ర

రష్యా తత్వానికి పొరుగుడు గాంధీతత్వం. గాంధీ తత్వానికి విరుగుడు రష్యాతత్వం.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

జమిందారీ యుగవు భూస్వామ్య విధానానికి విరుగుడుగా దున్నేవారికే భూమి అన్నారుట.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

పువ్వు అందం ఎండాకు తినేస్తుంది.

- బీనాదేవి, మిసెస్ అండ్ మిస్టర్ సక్సేనా

దుర్జనాగ్రహంబు తూలుమాటలఁగాని
శాంతవచనములను జక్కఁబడదు;
భగ్గుమనెడు నూనెపైఁ జల్లుదురె నీరు?
దోసిళుల కొలంది దుమ్మెగాని.

- వసురాయకవి, చాటుప్రబంధము

## విలయం

విలయమే వికాసానికి తోడ్పడుతుంది.

- ఉన్నవ, నాయకురాలు

## విలాపం

అనాదిగా, బాధతో మానవుడు భాష లేని నోటితో సృష్టికర్తకు చేసుకునే విన్నపం - విలాపం.

- బీనాదేవి, కుంకుమ ఖరీదు పదివేలు

## విలువ

చీకటనేదే లేకపోతే, వెలుతురుకున్న విలువ తెలియదు.

- భారతీదేవి, సుడిగుండాలు

ఏడ్పులు ధర్మాసుపత్రి వారికి న్యూసెన్సు! మను షులంటే వీరి దృష్టిలో కేవలం కేసులు! చుట్టల పెట్టెలాగానో చెప్పులజోడులాగానో కనిపిస్తాయి వీళ్లకళ్ళకు!

- చిరంజీవి, చీమమనుషులు

సుఖం విలువ దుఃఖం అనుభవించినప్పుడే తెలుస్తుంది.

- శ్రీరామచంద్రమూర్తి, వెన్నెలదారి

ఆడదానికి రీసేల్ వాల్యూ కూడా వుంది. అవ సరం ఉన్నన్నాళ్ళూ వాడుకోవచ్చు లేదా తాకట్టు పెట్టుకోవచ్చు

- బీనాదేవి, స్వేచ్ఛాయజ్ఞం

వ్యక్తి విలువగానీ, వస్తువు విలువగానీ చేయిజా రిన పిదపనే గ్రాహ్యమవుతుంది.

- కౌసల్యాదేవి, హైందవి

ఖజానాలోనుంచి బయటికి రాని డబ్బు, చేతులు మారని డబ్బు, మట్టితో సమానం.

- కొడవటిగంటి, నిలవనీరు

కొండమీద ఉండే కోతికున్న విలువ కొండ దిగి వచ్చిన కోతి కుండదేమో.

- కొడవటిగంటి, పెళ్లిచెయ్యకుండా చూడు

చెడు చేయనిదే మంచి విలువ తెలీదంటారు.

- ఆదివిష్ణు, ఎంతెంతదూరం

ప్రపంచంలో డబ్బుకి వున్న విలువ మరిదేనికీ లేదు. డబ్బు లేని మనిషిగా పుట్టడం కంటే కుళ్ల కాలువలో పురుగుగా పుట్టడం మంచిది.

- బీనాదేవి, ఎమేటరాఫ్ నో ఇంపార్టెన్స్

కొక్కోకముమీద రామకోటిపత్ర ముంచినయెడలం గళాశాస్త్రమునకే కాంతి కాని తారక నామమున కేమయిన బాగున్నదా? సాలగ్రామము రూపాయల గోతములోబడిన యెడల రూపాయల సంచి విలువయే హెచ్చినది కాని సాలగ్రామపు విలువ తగ్గలేదే?

- పానుగంటి, సాక్షి

మనుషుల ఆలోచనలు వాళ్ల ఖరీదునిబట్టి వుంటాయి.

- బీనాదేవి, ది ఎటర్నల్ ట్రయాంగిల్

ఆర్థికంగా అంతస్తు పెరగకపోతే, సంఘంలో విలువే ఉండదు.

- ముద్దంశెట్టి, ఈ అనుభవం చాలు

ఉచితంగా వుదారంగా జరిగే దానికి దేనికీ విలువలేదు.

- చలం, మ్యూజింగ్స్

ఓటు విలువ యిచ్చే వాడికంటే పుచ్చుకునేవాడికి బాగా తెలుసు.

- పులికంటి, గూడుకోసం గువ్వలు

తనకు ఏ విలువా లేని స్థితిలో మనిషి బ్రతక్కపోతేనేం?

- రంగనాయకమ్మ, పేకమేడలు

ఏదైనా కష్టంతో కాని సుఖం విలువ తెలియదు.

- ఆనందారామం, మళ్లీ వచ్చిన వసంతం.

నిత్య పరిచయము సామాన్యత్వము పదార్థములకు పట్టినా వాటి విలువకు లోటు ఉండదు.

- దీక్షితులు, దసరాదిబ్బ

పసుపు తాడునీ మల్లె పువ్వునీ - అణా పైసలతో విలువ కడతామా!

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

మనిషికి వన్నె తెచ్చేది ప్రవర్తనేగాని వొడ్డూ, పొడుగూ కాదు. అలాగే రూపాయికిన్నీ వన్నె తెచ్చేది విలువేగాని దాని పనివాడితనం కాదు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, మార్గదర్శి

చాలా విలువలు లోకం మీదకన్న, మనసుల్లోనే వాటి వాస్తవికతని ప్రతిష్ఠించుకున్నాయి.

- చలం, మ్యూజింగ్స్

ఒకదాని పూర్తి విలువ
అది లేనప్పుడే తెలుస్తుంది.

- కుందుర్తి, బహిష్కార

విలువల్ని మనసే కల్పిస్తుంది. మనకి కావాలని కోర్కి పుట్టిందాకా ఎంత విలువైన పదార్థమైతేనేం? మనకేం గొప్ప?

- చలం, అరుణ ఆర్గ్యుమెంటు

డబ్బుకు విలువేముందండీ, ఆఫ్టరాల్, మాటకు విలువివ్వాలి.

- ముద్దంశెట్టి, నాగరికులు

ఈ దేశంలో మనుషులకంటే మట్టిక్కూడా విలువ ఎక్కువే.

- గంగాధరరావు, యథాప్రజా తథా రాజా

అడగ్గానే యిస్తే వస్తువు విలువ తగ్గిపోతుంది

- గురజాడ, కన్యాశుల్కం

వ్యక్తి అయినా, వస్తువైనా, దేశకాల పరిస్థితులనుబట్టి విలువలు మారుతుంటాయి.

- బుచ్చిరెడ్డి, విషవలయం

జీవించి వున్నప్పటికంటే మరణించిన తరువాత కొందరికి విలువ పెరిగే మాట సత్యం.

- సంజీవదేవ్, రాహుల్ సాంకృత్యాయన్

ఒక మనిషికి విలువ కట్టినప్పుడైనా ఒగ్గూ మొగ్గూ ఉండాలని మరచిపోకూడదు.

- కాంతారావు, వంశధార

మనవల్ల మనవాళ్లు ఎంత బాధపడుతున్నారో కన్నులకు కట్టజేస్తే అప్పుడు మన దుర్దశకూ, మనకూ మరీ విలువ హెచ్చుతుంది.

- రామకృష్ణశాస్త్రి, మీమాంస

ఉత్తరం వ్రాసిన వ్యక్తి తన దృష్టిలో విలువగలవాడైతే శ్రద్ధగా జవాబివ్వటం జరుగుతుంది. విలువలేని పక్షాన అశ్రద్ధ చేయటం జరుగుతుంది. ఈ సత్యం ఒక్క ఉత్తరాల రంగంలో మాత్రమే ఏమిటి, జీవితంలోని ప్రతిరంగానికీ వర్తిస్తుంది.

- సంజీవదేవ్, ఉత్తరాలు

ఏమన్నా నేటికన్న
రేపటి విలువే తక్కువ
అందువల్ల కానోపును
అల్ప సంఖ్యపై మక్కువ!

- అబ్బూరి, శ్రుతి

విలువల్ని మనసు బేరీజు వేస్తుంది. పైకాన్ని పర్సు నిర్ణయిస్తుంది.

- మారుతీరావు, మళ్లీమధుమాసం

మనిషి తన విలువను ఎదుటివాళ్లలోనే చూసుకోగలడు.

- మహీధర, స్వయంవరణం

లోకంలో తల్లిమాటకంటే, విలువైనది ప్రియురాలి మాట!

- ఆనందారామం, ఇదా భారతం?

## విలేఖరి

తగాదా జరిగినంతసేపు
మన పోలీసులు ఆవేపుకు పోనట్లే
జీవితం విలువలు మారిన చోటికి
పత్రికా ప్రతినిధులు పోరు

- కుందుర్తి, తెలంగాణ

## వివాహం

వివాహం చేసుకున్న స్త్రీ పురుషులు భార్యాభర్తలవుతారు. ప్రేయసీప్రియులు కాలేరు.

- వాసిరెడ్డి, నింగినుండి నేలకు

## వివేకభ్రష్టులు

పెక్కు భంగులు వివేక భ్రష్ట సంపాతముల్.

- లక్ష్మణకవి, సుభాషితరత్నావళి

## వివేకం

పడుచుతనమందు వివేకముతో వర్తించి ముపలితనమునకై సుఖము మూటగట్టి దాచికొనుము.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

బతకగలవానిదే లోకము. పైసలుగలవానిదే నాకమని తెలియుటే వివేకము.

- వరదాచార్యులు, వైశాలిని

## విశేషం

అవసరమైన పనికొఱకు కనవసరమైన ప్రశ్న. ఇది యొక శృంగారాలాప విశేషము.

- పానుగంటి, సరోజిని

## విశ్రాంతి

జననమరణమ్ములకును విశ్రాంతి లేదు.

- తి.వేం., బుద్ధచరిత్రము

శరీర ధర్మం అలసట తెలియని అశాంతి కాదు. అలసట నెరగని విశ్రాంతి.

- పిచ్చేశ్వరరావు, ఎదురీత

## విశ్వం

విశ్వం న్యాయదర్పణంలో ప్రతిబింబాన్ని చూడలేక మూర్ఛపోయింది!

- భూషణం, పునరావృత్తి

## విశ్వసనీయుడు

పకపక నవ్వేవాడు, గబగబ అరిచేవాడు కపటమెరుగరు.

- సామెత

## విశ్వాసం

జనం తాము నమ్మాలనుకున్న వాటినే నమ్ముతారు.

- ఆనందారామం, అర్ధరాత్రి సూర్యోదయం

విశ్వాసమున్నవారు విశేష కార్యములు చేయగలరు.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

లోకంలో వున్న ప్రతీతి యందు వున్నంత మూఢవిశ్వాసం మాత్రం, పరిశీలించి చేసిన సిద్ధాంతమందు లోకానికి కలగదు.

- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

ప్రతి ఒక్కరికీ తన జ్ఞానంమీద అనంత విశ్వాసం వుంటుంది.

- మహీధర, దేశంకోసం

అల్పుని విశ్వాసం అల్పమైంది. అధికుని విశ్వాసం అధికమైంది.

- విశ్వనాథ, హాహా హూహూ

చతుష్పాత్తులకు గల విశ్వాసం ద్విపాత్తులకు లేనేలేదు. నరులలోఁ బదవి యెక్కువయైన కొలఁది ప్రభునియందు భక్తి తక్కువయున్నట్లు గనపడుచున్నది.

- పానుగంటి, సాక్షి

ప్రభుని యెడల విశ్వాసమనునది పెద్ద యుద్యోగులలోకంటె భటవృత్తిలో వారికే హెచ్చుగానుండునుగాబోలు. తత్త్వములోఁ దెలివి తక్కువయైన కొలఁది విశ్వాస మెక్కువ కదా!

- పానుగంటి, సాక్షి

మనిషికి కలిగే ప్రతి విశ్వాసానికి వెనుక కొంత చరిత్ర వుంటుంది. ఆ చరిత్రను అర్థంచేసుకొనే పద్ధతిపై ఆ విశ్వాసం ఆధారపడి ఉంటుంది. అర్థంచేసుకొనే పద్ధతి మారితే విశ్వాసాలు కూడా మారుతుంటాయి.

- ఆళ్వారుస్వామి, ప్రజల మనిషి

విషప్పురుగు

ఈ లోకంలో ఈ యుగంలో మనిషికంటే విష పురుగు మరో లోకంలో ఉండొచ్చునేమో కాని మనదేశంలో మట్టుకు ఎంత వెతికినా దొరక లేదు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

విషం

భావ కాలుష్యాన్ని మించిన విషం మరొకటి లేదు.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

తలనుండు విషము ఫణికిని
వెలయంగాఁ దోఁకనుండు వృశ్చికమునకుం
దల తోఁక యనక యుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ.

- బద్దెన, సుమతీశతకము

వలపె విషమైనఁ దుచ్ఛ జీవనము విషము.

- దేవులపల్లి, ఆఋనిదివ్వె

అన్నిటికంటే మనిషి గుండెలో విషం ఎక్కువ! అడివి మృగాల కంటే క్రూరమైన జంతువు మనిషి!

- అనిశెట్టి, గాలిమేడలు

విషానికి విషం విరుగుడు. మోసగాళ్లకు మోసమే పనిచేస్తుంది.

- పినిశెట్టి, పల్లెపడుచు

తెలుఁగు మాలీ తవుడు దిని చచ్చువానికి
విషము పెట్టువాఁడు వెర్రివాఁడు.

- నాచనసోమన, ఉత్తర హరివంశము

పాముకు విషం పండ్లలో, జ్ఞాతికి విషం కండ్లలో.

- సామెత

విషయగ్రహణశక్తి

విద్యా విహీనులని ఎవరిని అంటుంటామో వాండ్లలో విషయ గ్రహణశక్తి ఎక్కువగా ఉంటుంది.

- ఆళ్వారుస్వామి, ప్రజల మనిషి

విషయ సేకరణ

తక్కువగా మాట్లాడి ఎక్కువగా వింటే, తద్వారా విషయ సేకరణ జరుగవచ్చు.

- పులికంటి, ఖా(ఖీ)మాకలాపం

విషాదగీతం

జన్మంతా ఏడుపే అయినపుడు విడిగా విషాదగీతిక లెందుకు?

- మునిమాణిక్యం, మృత్యురథము

విషాదం

విషాదము, అపక్వ హృదయ లక్షణము.

- సూరి, నా రాణి

విసుగు

ఇతరుల ప్రణయగాథలు వినడంకంటే విసుగు పుట్టించేది మరొకటి లేదు.

- బుచ్చిబాబు, ఒమర్ ఖయామ్

పండుగనాడు కూడా పాత సీరియలేనా? అన్నదట.

- శ్రీరమణ, న్యూసుడి

విస్కీ

దేవతలకు అమృతం, వీరులకు విస్కీ.

- రావిశాస్త్రి, నిజం

విస్పష్టం

ఎంచబోతే మంచమెల్లా కంతలే.

- సామెత

విహితం

కారుకింది మెకానిక్కు కారుకిందే బతకాలి.

- శ్రీరమణ, న్యూసుడి

వీణ

వీణమీది తానం ఫిడేలు మీద కాదు. ఫిడేలు మీది సంగతి వీణకు రాదు. వీణ ఒదుగు ఫిడేలులో లేదు. వీణలో ధ్వని ఫిడేలులో లేదు.

- బాపిరాజు, నారాయణరావు

వీధి దీపాలు

ఆంధ్రరాష్ట్రంలో వీధి దీపాలకు భలే మూడ్స్ వుంటాయి. మంచి మూడ్‌వస్తే సూర్యుడితో పోటీ పడుతూ పగలు పదిదాటాక కూడా వెలుగుతాయి. లేకపోతే రాత్రిళ్ళు కూడా అసలు వెలగవు.

- ఆనందారామం, అద్దంలో శత్రువు

వీరత్వం

మడమఁ ద్రిప్పని యాంధ్రవీరుఁడను నేను.

- జాషువా, ఆంధ్రుఁడను

వీరలక్షణం

వింటిని నేఁటి కీవీరదేవులకు
నాలుకపై బొంకు నాళ్లలో జంకు

చాటుచాటున రంకు సమరానఁ గొంకు

- ఏటుకూరి, మగువ మాంచాల

వీరుడు

చీకటిలో నుండి వెలుగు చేరినవాడే వీరుడు.

- సినారె, జలపాతం

ఒక వీరుడు మరణిస్తే
వేలకొలది ప్రభవింతురు!
ఒక నెత్తుటి బొట్టులోనె
ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు!

- సోమసుందర్, బానిసలదండయాత్ర

ఆశయాల అరమైలు పరుగు పందెంలో
వ్యవధిని తగ్గించినవాడే వీరుడు.

- కుందుర్తి, తెలంగాణ

వీలు

ఎవడికి వీలుగా వున్నది వాడి కది క్రమం. ఎవ డికి వీలు తప్పింది వాడికది అక్రమం.

- సూరి, చంఘీజ్ ఖాన్

పండితుడు కానివాడు కవి కావడానికి వీల్లేదు.

- ఆత్రేయ, అశ్వఘోషుడు

వృత్తి

యెవరి వృత్తి యెవరు మానుతారు? లంచం పంచం తినడం వుద్యోగధర్మ మవునా కాదా?

- కందుకూరి, హాస్య సంజీవని

జీవనార్థంగా లోకులు ఆచరించే అన్ని వృత్తు లలో నున్నూ అంతో యింతో హేయత్వం వుండే తీరింది.

- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

వృత్తులు పారంపర్యం జేయటంవల్ల కొన్ని సంఘాలకు అన్యాయం గలిగింది. కొన్ని వృత్తులు నశించటములో ఈ అన్యాయం మరింత యెక్కువయింది.

- ఉన్నవ, మాలపల్లి

సేవావృత్తిచే వచ్చు పాయసముకంటె స్వచ్ఛంద వృత్తిచే లభించు గంజి మేలు.

- చిన్నయసూరి, మిత్రభేదము

ఈ భూమ్మీద చాలామంది తమ వృత్తులమీద ప్రేమ, ఏవగింపూ రెండూ లేకుండానే బతుకు తారు.

- వేణుగోపాలరావు, జోగబాల

వృథా

కాలాన్ని కొలిచేందుకు గడియారా లెందుకు? కేలండర్లు, పంచాంగాలూ కేవలం వృథా.

- కుందుర్తి, ప్రస్తావన

ప్రాణము బెడఁబాయునట్టి రాజ్యం బేలా?

- గోపరాజు, సింహాసన ద్వాత్రింశిక

అనుభవము లేని విభవము
లనుభావ్యము కాని యాలు నార్యానుమతిన్
గనని స్వభావము ధర్మము
గొనని సిరియు వ్యర్థమెన్న...

- గువ్వలచెన్న శతకము

తెలివిగలవాళ్ల మధ్య జీవించటం బాధాకరంగా ఉంటుంది. ఎందుకంటే మన తెలివి తేటలు అక్కడ వృథా!... ఎక్కి చావవు!

- ధనికొండ, పవిత్రులు

గజపతికిచ్చిన లంచం గోడకు రాసిన సున్నం.

- ముళ్లపూడి, జనతా ఎక్స్‌ప్రెస్

కుమ్మరి వీధిలో కుండలమ్మినట్లు.

- సామెత

ఈనగాచి నక్కలపాలు చేసినట్లు.

- సామెత

కలలోకి సినిమా వచ్చినట్లు.

- శ్రీరమణ, న్యూసుడి

కొత్తచింతపండు గోనెల్ల చీకు
గొడ్రాలి వస్త్రాలు పెట్టెల్ల చీకు

- జానపదగేయం

ప్రాక్టీసు పూర్తయిన డాక్టర్లు
పనికిరాని స్టేజి యాక్టర్లు!

- విశ్వశ్రీ, కలలు-కల్లలు

వృద్ధి

గ్రామజీవితం ప్రశాంతమంటారుగానీ అందులో పోటీల కెప్పుడూ తీవ్రమైన అవకాశా లుండనే ఉన్నాయి. పోటీ లేనిదే వృద్ధి లేదు.

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

మహమ్మదుగారు కత్తిమొనను మతవృద్ధి చేసినట్లు, కబ్బాపొన్నున మీరు సతివృద్ధి చేయు చున్నారు.

- పానుగంటి, ముద్రిక

వెక్కిరింత

కాకిరాయా! ఎందుకు పుట్టినావే అంటే, చక్కని

వాండ్లను ఎక్కిరించటానికే అన్నదట.

- సామెత

వెగటు

సత్యవాక్యములు తలచుగాఁ జెవులకు వెగటు గానే యుండును.

- కూచి, రూపలత

వెధవ

ఒకవేళ మనం ఏదైనా వెధవపని చేసినా, మరొకరు వచ్చి నువ్వట్టి వెధవ్వి అంటే బాధప డకూడదు. ఎంచేతనంటే నువ్వేలాగా వెధవ్వే కాబట్టి...

- బీనాదేవి, హరిశ్చంద్రమతి

పోకలు నములుచు నాకులు చేకొని
సున్న మద్దినవాఁడు శుద్ధ వెధవ
ఇద్దఱు నొకచోట నేకాంతమాడంగ
వద్దఁ జేరినవాఁడు వట్టి వెధవ
ఆలితోఁ గలహించి యాకలి కాదని
పస్తున్నవాఁ డొక్క పంజి వెధవ
వారకాంతల యిండ్ల వాసంబు చేయుచు
మగువ కేడ్పెడువాఁడు మడ్డి వెధవ
చదువు చెప్పిన జీత మదనులో నీయక
మిటకరించెడివాఁడు మేటి(లి)వెధవ
త్రోవఁబోయెడి స్త్రీలతో మొగం బిగిలించి
ముచ్చటాడెడువాఁడు ముష్టి వెధవ
కట్న మిచ్చెద నని కాలమం దీయక
గోళ్ళు గిల్లెడివాఁడు కొంటె వెధవ
ఇంటి యంకెఱుఁగక యిరుగుపొరుగు యింకు
వెంటాడు వాడొక్క యంటు వెధవ
దారిద్ర్యముల నుండి తన పూర్వ సంపద
లూరక తల్చువాఁ డుత్త వెధవ.

- చాటువు

వెధవలకి మతం కట్టా'రట'.

- గురజాడ, కన్యాశుల్కం

మొగాడు వెధవేమిటి? అది కేవలం స్త్రీ లింగం.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

వెధ్వల్ అన్నది లాటిన్ మాటండి. ఆ మాట కర్థం కచేరీలు.

- గురజాడ, కన్యాశుల్కం

మనవాళ్ళు వట్టి వెధవాయలోయ్!

- గురజాడ, కన్యాశుల్కం

వెనకచూపు

రాజకీయాల్లోకి వచ్చి వెనక్కి పోయినవాళ్ళు సాధారణంగా తమ బలహీనతల్ని కప్పుకునేటం దుకు పూర్వాచారాల మీద విశేష శ్రద్ధ చూపి స్తారు.

- మహీధర, స్వయంవరణం

వెనక్కు రానివి

పెదవి దాటిన మాట, విల్లు విడిచిన అమ్ము ఏం చేస్తే వెనక్కు వస్తాయి?

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

వెన్నెల

వెన్నెలలు నిద్రవోయెడు వేళలయ్యె.

- రాయప్రోలు, తెనుగుతోట

చీకటి శవంపై
రగులుతున్న చితిలా వెన్నెల.
నిస్సిగ్గుగా పరుచుకున్న నిశీధిని
కప్పిన కఫన్‌లా వెన్నెల.

- అఫ్సర్, తీక్షనేత్రం

వెరపు

ఎఱిఁగి వెఱచికాదె యేనూళ్ళ లైనను
దమకుఁ జాలు ననియె ధర్మసుతుఁడు.

- తిక్కన, ఉద్యోగపర్వము

ఏల వెఱవవు పలువ! నీకేది దిక్కు?

- పోతన, భాగవతము

వెర్రి

ఆవగింజంత బూది మై నలఁదికొనిన
వెలఁది! గుమ్మడి కాయంత వెఱ్ఱిపుట్టు.

- శ్రీనాథుడు, హరవిలాసము

వెర్రివాళ్ళకి ఇతర్లు వెర్రివాళ్ళుగా కనబడతారు.

- రాజమన్నారు, మనోరమ

పిడికిలితో యుద్ధం చేయాలనుకోవడం వెర్రి తనం.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

పెద్దలమని తలత్రిప్పుకొని తిరుగువారి కంద ఱకు వేపకాయ యంతో వెలఁగకాయ యంతో వెఱ్ఱియున్నది కాని లేకపోలేదు.

- పానుగంటి, చూడామణి

వెర్రి కుదిరింది, రోకలి తలకి చుట్టమన్నాట్ట!

- గురజాడ, కన్యాశుల్కం

మామిడిపండుకు జీడివలె మహాబుద్ధిమంతున

కొక వెట్టి యుండక తప్పదు.

- పానుగంటి, ప్రచండ చాణక్యము

వేరు తవ్వి వేడినీళ్ళు పోసినట్లు.

- సామెత

## వెల

మనఃక్షోభకు ఎవరు వెల గట్టగలరు?

- పుల్లాభొట్ల, విధివిన్యాసం

## వెలమగలు

వేశ్య వెలయా లనంబడె వెల గ్రహించి
కట్నముల చేత వెలమగల్ కారె వీరు?

- కాళ్లకూరి, వరవిక్రయము

## వెలమలు

వెలమలు కత్తికింద నలిగిన వారుగాని కాడి కింద నలిగినవారుగారు.

- ఉన్నవ, నాయకురాలు

వెలమవారి పొందు వేయేళ్ళు చేసినఁ
గాసు వీసమైనఁ గానరాదు
మెచ్చెనేని మంచి ముచ్చట చెప్పును
నలిగెనేని ప్రాణహానిఁ జేయు.

- పట్టాభిరామశాస్త్రి, చాటువు

## వెలుగు

వెలుగు చీకటిని ఎక్కువ చెయ్యడానికే తోడ్పడు తోంది.

- వెంకటరమణారావు, కొండచిలువ

చీకటిలో ఉండే వెలుగు... వెలుతురులో లేదని యీ మానవులకు యేం తెలుసును?

- రామకృష్ణశాస్త్రి, ఇది మదరాసు

పరిసరాల్లో వెలుతురుంటేనే, మనసుకి కూడా వెలుతు రుంటుందట.

- ముద్దంశెట్టి, తప్పించుకోలేవు

దీపశిఖ చుట్టూ ముసరిన
దారి తెలియని గ్రుడ్డి వెలుగులు,
దీపశిఖను స్పృశించలేవు సరికదా
చీకట్లకు దారైనా చూపలేవు.

- రంగారావు, ముక్తకాలు

గుండె గాయంతో జ్వలించినపుడె
వత్తి కాలుతూ ఉన్నంత సేపే
వెలుగు చూపగలదు ప్రపంచానికి

- రంగారావు, ముక్తకాలు

ఒక దీపం వెలిగించగానే నలువైపులా వున్న చీకటి దానంతటదే అంతర్ధానమౌతుంది. నిజం చెప్పటంవల్ల అసత్యం కూడా అలాగే అంతర్ధానమై పోతుంది.

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

## వేకువ

రాత్రిని రంపం పెట్టి కోసినపుడు
రాలిన పొట్టు లాంటి వేకువ.

- తిలక్, వేకువ

## వేగం

కారు మీద పరుగెత్తేవాడు
కనుక్కోలేడు కాలం స్పీడు.

- కుందుర్తి, ప్రతిఘటన

మనకాలంలో అన్ని యంత్రాలలాగే
చరిత్రకూ వేగం ఎక్కువ.

- కుందుర్తి, ప్రజోద్యమం

అన్ని వేగాల్లోనూ మనోవేగం ఎక్కువంటారు. కాని మనో వేగంకంటె ఎక్కువ ప్రేమవేగం.

- బీనాదేవి, ఇదికథకాదు

## వేట

మహారణ్యాలలో వినోదాలూ, నగరంలో వేటా.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, రాజబాబు

## వేటకాడు

నిజమైన వేటకాఁడు జంతువులను గొట్టఁడు!

- కాళ్లకూరి, భాగ్యరేఖ

వేటగాళ్లకి బద్ధకా లుండకూడదు.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త-ఋక్కులు

## వేడి

వేడి తగ్గించుకుంటే వేడి అదే చల్లారిపోతుంది.

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

భూమధ్యరేఖ దగ్గరకన్నా ఆడదాని భ్రూమధ్య రేఖ దగ్గర వేడి ఎక్కువ.

- తిలక్, న్యూ సిలబస్

## వేడుక

రానివాణ్ని పిలువ వేడుక.

- సామెత

పక్క యింటి పోరు పండుగంత వేడుక.

- సామెత

## వేదకాలం

విశ్వనాథవారు వెనక్కి నడవగా నడవగా
వేదకాలం యింకా వెనక్కి వెనక్కి పోయిందట.

- తిలక్, న్యూసిలబస్

వేదన

వేదనలేని జీవితం, సంవేదనలేని జీవితం సచేతనంగా జీవించలేదు.

- సంజీవదేవ్, రూపారూపాలు

వేదం

చెప్పుల కాళ్ళు, ముండితపు
శీర్షము, శూన్యలలాటమున్, మఱిన్
గొప్ప బడాయి వేషములుఁ,
గుప్పులపోగలుఁ గోట్లుఁ, గంరమం
దొప్పెడి పట్టముల్ గలుగు
నొజ్జలు శిష్యులు నీకులేరు, మా
యప్ప! చిరాయువై బ్రతుకు
మమ్మరొ! వేదమ! నీకు మ్రొక్కెదన్

- తి.వేం., కలగూరగంప

ప్రార్థన మీద ఎవ డెక్కడికి వెళ్ళినా వాడిమాట వేదమే. పిలవకుండా వెళ్ళినప్పుడు గెంటకుండా పొమ్మనడమే కష్టం.

- భమిడిపాటి, మేష్టరీకూడా ఒక ఉద్యోగమేనా?

యీ రెయిళ్ళూ గియిళ్ళూ యావత్తూ మన వేదంలో ఉన్నాయిష.

- గురజాడ, కన్యాశుల్కం

వేదాంతం

ఉన్నది ఊడిపోతేగాని వేదాంతం రాదు.

- కొంతారావు, దగాపడిన తమ్ముడు

మనిషి నేలమీద బోర్లాపడినప్పుడే వేదాంతం మాట్లాడతాడు.

- నంది, మనిషి చావకూడదు

ఏదో వేదాంతం లేకపోతే ఈ ప్రపంచంలో ఎట్లా నెగ్గుకు రాగలం?

- కొడవటిగంటి, నిజం దాగదు

అనుభవం ఎక్కువవుతున్న కొద్దీ వేదాంతం ముదురుతుంది.

- లింగమూర్తి, తిరిగివచ్చిన మనిషి

వేదాంతి

...శాంతి అంటే
సమరానికి తల్లి అని నేటికైనా
తెలుసుకొన్న వాడే మేటి వేదాంతి.

- ముకురాల, శాంతి

వాస్తవిక పరిస్థితులలో యుద్ధం చేసే బదులు పిరికి సిద్ధాంతాలను సృష్టించేవాళ్ళను వేదాంతులుగా లోకం గుర్తించటం కద్దు.

- కొంతారావు, వంశధార

వేశ్య

సానిదానికి మాత్రం నీతి వుండొద్దా?

- గురజాడ, కన్యాశుల్కం

రాయవరంలో ముప్ఫయి నలభై యిళ్ళ వేశ్యలున్నారు. అంచేతనే ఆ వూరి బెల్లాని కంత మాధుర్యం.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, రక్షాబంధనం

వేశ్యకు వలపు గలిగితే యెలా వుంటుందో?

- సుబ్రహ్మణ్యశాస్త్రి, రక్షాబంధనం

వేశ్యలు విద్యలు నేర్చి ఇతర వృత్తులవల్ల సత్కాలక్షేపము చెయ్యరాదా?

- గురజాడ, కన్యాశుల్కం

వెలయాం డ్రెక్కడ? వారి వేడబము లా వేదాంతసూక్తంబులే?

- పోతన, భాగవతము

వేశ్యలు లేకపోయినచో శృంగార రసము చెడిపోవును.

- చిలకమర్తి, మహజరు

విటుల పాలిటి యమదూత వేశ్యమాత.

- చిలకమర్తి, బ్రహ్మదేవుని యజ్ఞానము

సాగుతోంటే చాపకింద కాఱు కుంపట్లు, యెనిమిది నెగళ్ళు.

- విశ్వనాథ, చెలియలికట్ట

వైద్యులకును జ్యోతిష్కులకును వేశ్యలకును బర మనోరంజనమే వృత్తి కావునఁ బ్రతిదినగండమని చెప్పుదురు.

- తి.వేం., పాండవ జననము

నిదురఁ బోగొట్టుఁ, గ్రమముగా నెత్తికెక్కుఁ,
గలుషత ఘటించుఁ గుండయుఁ గల్లయుఁ దన
చేతి కొనఁ గూర్చునదిగానఁ జెప్ప నగునె
వేశ్యకును నస్యమునకును భేదములను?

- తి.వేం., శ్రవణానందము

ఎంత వలపున్న నెంత వలంతి యైన
జననిఁ గికురింపలేదు వేశ్యావధూటి.

- తి.వేం., శ్రవణానందము

జగడమునకుఁ బోదు జారిణి యెప్పుడు
మాయఁ జేసి పురుష మమతఁ బెట్టు

కాని మాటలాడు గయ్యాళి సతతము

- వేమన

బలవంతపుఁ గాపులు వెట్టి కామినీ
జనముల నేలువారు నెఱ
జాణలయా శరభాంక లింగమా!

- చాటువు

సానిదానికి మంచితో పని వుండదు.

- గురజాడ, కన్యాశుల్కం

వేశ్య కాగానే దయాదాక్షిణ్యాలు వుండవో?

- గురజాడ, కన్యాశుల్కం

సానిది యెక్కడైనా పెళ్ళి చేసుకోమంటుం దయ్యా?

- గురజాడ, కన్యాశుల్కం

ఆడది తప్పిన తరువాత అంతేఁవిటి, యింతే విఁటి; తెగించిన దానికి సగుడు మోకాలు బంటి- అందులో సాంది ఖాయిదాగా వుండాల నుకోవడం మీది బుద్ధి తక్కువ.

- గురజాడ, కన్యాశుల్కం

సృష్టులన్నిటిలోని కాఁడుదాని సృష్టియే సృష్టి. అందులో వేశ్యా సృష్టి యెంతటిదో చెప్పఁద రమా? దానికేమి ప్రాఁతయేమి? పటిమ తగ్గుటయేమి?

- పానుగంటి, వీరమతి

ప్లీడరీ వృత్తి బోగం వృత్తి వొక్క మోస్తరుది. వేశ్య విటునివద్ద యెన్ని టక్కులు కనపరుస్తుందో ప్లీడరు కూడా డబ్బు లాగడానికి పార్టీలవద్ద అన్ని టక్కులు కనపరచవలెను. ఇది వుద్యోగధర్మం.

- కందుకూరి, వేశ్యాప్రియప్రహసనము

కల్లలు నిజములు ధర్మము
మొల్లంబునుప్రియము మోహమును నలుకయును
య్యుల్లసము నయము సరిగాఁ
జెల్లును వెలయాండ్రయందు క్షితిపతులందున్.

- గోపరాజు, సింహాసన ద్వాత్రింశిక

ఫలానా పంతులుగారు ఫలానా సాన్నుంచుకొని బాగుపడ్డారంటేనే నాకు ప్రతిష్ఠ. మా ఇంటి సాంప్రదాయం ఇది పంతులుగారూ! అంతేగాని లోకంగా సాన్ల మచ్చని వూహించకండి.

- గురజాడ, కన్యాశుల్కం

వేశ్యజాతి చెడ్డ కావచ్చును. గాని తాము శలవిచ్చినట్లు చెడ్డలో మంచి వుండకూడదా? మంచి యెక్కడనున్నా గ్రాహ్యం కాదా అండి?

- గురజాడ, కన్యాశుల్కం

సానివాళ్ళకి కర్ణ పిశాచి వుంటుంది కాబోలు!

- గురజాడ, కన్యాశుల్కం

అంగడివాడికి మిరాయి మీది ఆశా, సానిదానికి వలపూ, మనస్సులోనే మణగాలి.

- గురజాడ, కన్యాశుల్కం

పెండ్లా మొప్పుల కుప్పయైనను బేడకుప్పయే. సాని కొంకి నక్కయైనను జక్కని చుక్కయే. ఇది శృంగార రహస్యము.

- పానుగంటి, కంఠాభరణము

కొట్టులోని రహస్యాలు కోమటయ్యకు దెలిసినట్టు, వేపారి పంతులుకు వేశ్యల యట్టుపుట్టాన వాళ్ళన్నియు బట్టబయలు.

- పానుగంటి, కంఠాభరణము

వేశ్యవీధినిఁ బడిన కవిశిఖామణి చక్రవర్తికంటె స్వతంత్రుఁడు. భిక్షుకునికంటె దీనుఁడు - పై విటులను గఱచుటలో వెఱ్ఱికుక్కకంటె నున్మత్తుఁడు. వేశ్యచేఁ దిట్లు తినుటలో వేదాంతికంటెను శాంతిమంతుడు.

- పానుగంటి, చూడామణి

పంచదారకంటెఁ బరిపక్వమైనట్టి
తీయ ద్రాక్షకంటెఁ దేనెకంటె
నిన్నిమాట లేల యివి మూఁడు గలిపిన
ముద్దకంటె వేశ్య ముద్దు తీపి

- పానుగంటి, కంఠాభరణము

భక్తి హృదయమున గలవాఁడు పదునార్గురు వేశ్యల నుంచుకొనినవాడైనను బరమ పదమే చేరఁగలడు. విప్రనారాయణుని సంగతి యెఱిగియుండియు మీకీ వెఱ్ఱి యేల? నీకు నేనుంచుకొనిన వేశ్యయే కనఁబడినది కాని నాహృదయ మందలి భక్తి నీకుఁ గనఁబడదే! నేనుఁజేయుచున్న సత్కార్యములను నీవు చూడవే!

- పానుగంటి, సాక్షి

నా మట్టునకు నాకు సానియే పై చేయియని నమ్మకము. వారికేమి, నిక్షేపములాగున నుందురు. వారి యింటికి ముడుపులు, కానుకలు, కోకలు, ఱవికలు, నగలు, నాణెములు పట్టుకొని వెళ్ళి వారికి సమర్పింతురుగదా! వారి వ్యాపారము వంటి సుఖమైన వ్యాపారము మరి

యొకటి లేదు. రవ్వరట్టు లేదుగదా? పెట్టుబడి లేదుగదా? ఆదాయపుఁ బన్ను లేదుగదా? అరువు బేరాలు లేవు గదా?

- పానుగంటి, కంఠాభరణము

ఒక్కనిఁ బిల్వనంపి, మఱి
యొక్కనిచేతఁ బసిండి పట్టి, వే
ఱొక్కని యింటికేగుచు, మ
ఱొక్కని నానుడు చక్కి, నొక్కచోఁ
బొక్కి, కలంచి చూడ, భ్రమఁ
బాంది విటుల్ తెలియంగ లేరుగా
కెక్కడి సత్య మేడ వల
పెక్కడి నేమము వారకాంతకున్?

- తమ్మయ్య, వైజయంతీ విలాసం

పణ్యస్త్రీ కొక్క బానిస, పుణ్యస్త్రీ కొక్క పూర్వ సువాసిని.

- పానుగంటి, విప్రనారాయణ

మనిషిని ముస్తాబుచేసి యదట నిలబడితే యిది పునిస్త్రీ.

- గురజాడ, కన్యాశుల్కం

విభుని నూతన సంగమవేళఁ గరము
వక్రములు రోపడంతుల వర్తనములు.

- పింగళి, ప్రభావతీ ప్రద్యుమ్నము

మగవాళ్లలో పతనమైనవాళ్లు లేకుండా యీ పతిత స్త్రీలు ఎక్కడి నుంచి వచ్చారని?

- సూర్యారావు, శ్రీమతులు, శ్రీయుతులు

### వేశ్యమాత

తనకు నేమి త్రవ్వి తలకెత్తి రమరు లీ
యుర్వి మనుజు లేమి యొసఁగ రైరి?
నింగి వారసతుల నిర్మాతృకలఁ జేసి
పుడమి మాతృ భూతముల సృజించె?

- తమ్మయ్య, వైజయంతీ విలాసము

విటు రవము చెవిఁబడఁగానె వేశ్యమాత
ప్రాకుకొనుచు విటుకడకు వచ్చు దీప
దీప్తి దనకంటఁ బడఁగానె దీపదారు
ఖండమును జేరు రోఁకలిబండవలెను!

- పానుగంటి, ప్రచండ చాణక్యము

### వేషధారణ

జట విప్పి జులపాలు సవరింపు మిరువంక
బలు కిటికీదారు పాగఁజుట్టు
బొట్టు నెన్నుదుటిపై బొత్తిగాఁ దుడుచుకో
పోఁగు లూడ్చుము చెవు ల్బ్వాడవిడువు
వడిని నంగీయిజా ర్దొడుగు దట్టీఁ జుట్టు
కైజారు దోపు డాల్కత్తిఁ బట్టు
బీబి నాంచారును బిలిపింపు వేగమే
తుద కభ్యసింపుమా తురక భాష
శక్తి లేకున్న నిట్టి వేషంబు పూను...

- కూర్మనాథకవి, సింహాద్రినరసింహశతకము

### వేషం

వేషంలో కొంత డాబూ దర్పం కావాలి, లేకపోతే మన మొహం చూసేవాడెవడు?

- నార్ల, ఇంటిగుట్టు

దొంగకుఁ జీకటివలె వేశ్యకు వేషమే యంగరక్షకము.

- కాళ్లకూరి, మధుసేవ

మన మేదైనా వేషం వేశాఁవంటే, ఒకడు చూస్తున్నాడని అనుకున్నప్పుడూ, ఒకడు చూస్తూ వుండలే దనుకున్నప్పుడూ కూడా, వొక్క మోస్తరుగా వేషం నడిపిస్తే సేఫ్‌సైడ్.

- గురజాడ, కన్యాశుల్కం

నటకుఁ డయినవాఁ డేవేషమైన వేయవలసినదే.

- విశ్వనాథ, తెఱచిరాజు

అభిప్రాయం వెల్లడి అవుతున్నప్పుడు, మాట అనేది ఒక క్లోక్, అనగా వట్టి వేషమండి.

- భమిడిపాటి, బాగుబాగు

ఎందరో వేషంలో అధునాతనంగా వుంటారు. జీవితపు చాలా రంగాల్లో సనాతనంగా వుంటారు.

- సంజీవదేవ్, సుదూరస్మృతి

### వేసవికాలం

గాలి నవ్వుతోంది. నిప్పు మండుతోంది. ఆ చుట్టు పక్క లెక్కడా నీళ్లు లేవు.

- విశ్వం, ఊరంటుకుంది

### వేళ

నిద్రకీ, చావుకీ వేళేమిటయ్యా?

- మహీధర, కత్తులవంతెన

### వైకుంఠం

అగడ్తలోపడ్డ పిల్లికి అదే వైకుంఠం.

- రాజమన్నారు, మనోరమ

### వైద్యం

దయగల కటికవాడంటే ఎంత అర్థం ఉంటుందో,

న్యాయమైన అలోపతీవైద్యమన్నా అంతే!

- కొడవటిగంటి, గడ్డురోజులు

ప్రణయ రోగులకు చికిత్స లేడీస్ బూట్.

- సూర్యారావు, శ్రీమతులు-శ్రీయుతులు

ప్రభువులకి వైద్యం చేయడం చాలా కష్టం.

- చెళ్ళపిళ్ళ, కథలు-గాథలు

తెలీనివాళ్లకు తెలీకపోగా, తెలుసు ననుకునే వాళ్లకు వైద్యం ఒక పాషను.

- కొడవటిగంటి, ఐశ్వర్యం

ఇంగ్లీషు వైద్యం వల్ల నెప్పి పూర్తిగానే పోతుంది గాని, నిలకడగా పోతుంది.

- భమిడిపాటి, ఇప్పుడు

వైద్యవృత్తికన్నా సుఖమైన వృత్తి మరొకటి లేదు, ఈ లోకంలో.

- ముద్దుకృష్ణ, ఆడవాళ్ల తెలివి

మన తత్వాలమీద నల్లవైద్యమే బాగా నడుస్తుంది.

- కందుకూరి, హాస్యసంజీవని

కుదురని జబ్బుకు లక్ష మందులు.

- వరద, నాట్యగోష్ఠి

వైద్యుడు

వృత్తి దృష్ట్యా వైద్యులు ధీమంతులై ఉండాలి.

- శ్యామలారాణి, పవిత్ర

తెగులు మాన్పు వెజ్జ జగము నొజ్జ

- అజ్జాడ, వేల్పుమాట

ఒక రిద్దర్ని చంపితేగాని వైద్యుడు గాడు.

- సామెత

విధవకు ముసుగెట్టిదో వైద్యులకు బిరుదట్టిది.

- పానుగంటి, కంఠాభరణము

యెవడు గానేనా పుట్టవచ్చునుగాని, వైద్యుడుగా పుట్టడంలో చాలా చిక్కు. మందు పనిచేసిందా, అలాంటప్పుడు వైద్యుడుగా పుట్టడమే మంచిదని పిస్తుంది. లేదా జవాబు చెప్పడం చాలా కష్టం.

- చెళ్ళపిళ్ళ, కథలు-గాథలు

అందరూ మెడిసిన్ చదువుతారు కాని కొందరే నికరమయిన డాక్టర్లుగా తేల్తారు.

- సరస్వతీదేవి, రాజహంసలు

డాక్టర్లు కూడా మనుష్యులే కాబట్టి, ఆదర్శంగా బ్రతకాలా, ఐశ్వర్యంలో బతకాలా? మంచిగానా, చెడ్డగానా? అని బ్రతుకు డైలమాలో పడవచ్చును.

- బీనాదేవి, డబ్బు! డబ్బు!! డబ్బు!!!

డాక్టర్ల స్నేహం చాలామంది చాలా కారణాల వల్ల చేస్తారు. కొంతమంది స్టేటస్‌కోసం చేస్తారు. కొంతమంది ఉచిత వైద్యంకోసం చేస్తారు. మరి కొంత మంది సేంపిల్ మందులకోసం చేస్తారు.

- బీనాదేవి, ఎ మేటర్ ఆఫ్ నో ఇంపార్టెన్స్

ఇంటికో రోగి లేందే యీ డాక్టర్లు ఇంత పుణ్య పురుషులై కూర్చుంటారుట్రా?

- మా గోఖలే, మూగ జీవాలు

జబ్బు నయమయ్యాక రోగిదగ్గర వైద్యుడు కూర్చుంటే మళ్లీ జబ్బు రావచ్చు

- కాంతారావు, అభ్యుదయం

రోగ నిదాన మెరుగని యొక్క వైద్యుని వైద్యము పది జర్మనీ యుద్ధముల పెట్టు. వాని చేతిలోనివి మాత్రలు కావు. నాయనలారా! బాంబులు. వాని యొద్ద కంపొండరే కైజరంత వాఁడైనప్పుడు వాఁడెంతవాఁడో చెప్పవలయునా?

- పానుగంటి, సాక్షి

నాడి చూడమని పరిహాసమునకైె యొక్కసారి మీ చేతిని వైద్యుని చేతిలో నెప్పుడు పెట్టితిరో యాక్షణమందే మీ యారోగ్యదశకు నాశ్వాసాంత మైనదని నమ్మవలయును.

- పానుగంటి, సాక్షి

"ఏమాత్రమైనఁ గదలకుండ సంపూర్ణ విశ్రాంతితో నుండవలయు"నని యొక వైద్యుడు నొక్కి చెప్పెను. "అంత ప్రారబ్ధము పరమపదించిన దాక రాదయ్యా" అని నేనంటిని.

- పానుగంటి, సాక్షి

వీడు డాక్టరైనప్పటినుంచి నాదుంపతెగుతోంది. ప్లీడరయినా బాగుండేది. కాసేపు వాగి ఊరుకొనేవాడు.

- రామదాసు, పునర్జన్మ

నీడ చూసి బెదిరే రోగిని- నాడి చూసినట్టు నటిస్తూ హడలేయడం- మావెజ్జుడు చద్దన్నంతో పెట్టిన విద్దె.

- రామకృష్ణశాస్త్రి, కన్నడ

మనుషుల్ని మాడ్చుకు తింటానికి యీ డాక్టర్లొకళ్లు! అన్ని అవయవాలూ బాగానే ఉన్నాయంటారు. మరి రోగ మెందుకు వచ్చిందో చెప్పరు.

- నరసరాజు, స్వర్గసీమ

నాడి తెలిసినోడే మందులోడు.

- కాంతారావు, దగాపడిన తమ్ముడు

ఉద్యోగి దృష్టిలో డాక్టర్లు మూడు రకాలు. మొదటి రకం... జబ్బును పోగొట్టేవారు. రెండవ రకం జబ్బునిచ్చేవారు. మూడవ రకం డబ్బునిప్పించేవారు.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళవిక్రమార్కీయము

## వైపరీత్యం

అయినది ఆకులలోను, కానిది కంచాలలోను.

- సామెత

చంపి ధార్మికుండు, సతిఁ బొంది మరి బ్రహ్మ
చారి, బొంకి సత్యశాలి, యార
గించి సదుపవాసి, కోపించి శూరుఁడు,
చింది ధనియు, నగు విచిత్ర సరణి

- శ్రీకృష్ణదేవరాయలు, ఆముక్తమాల్యద

## వైఫల్యం

గుణాద్భుతంబైన పదార్థంబు వర్ణింపకునికి
యసహ్య శల్యంబైన వాగ్జన్మ వైఫల్యంబు.

- శ్రీనాథుడు, శృంగార నైషధము

## వైభవం

పడుకోవడం పాడుగోడల్లో, కలవరింతలు మిద్దె టింద్లలో.

- సామెత

మాడుపొట్టతోడ తాను గాడిదచాకిరి చేయగ
తోకవూపి మూతినాకు తుచ్ఛులకే వైభవాలు.

- కాళోజీ, ఖర

## వైరం

జీవించే ప్రతి జీవికీ రెండు పరస్పర వ్యతిరేక మైన మనో గుణా లుంటాయి. ఒక మనోగుణా నికి జీవిత పరిస్థితులతో మైత్రి, రెండవ గుణా నికి జీవిత పరిస్థితులతో వైరం. రెండూ ముఖ్య మైనవే.

- వెంకటసుబ్రహ్మణ్యం, పారిస్

## వైరాగ్యం

వైరాగ్యమును బొందవలయునన్నచో దానిని మనస్సు చేతనే సాధించవలయును. కాని శరీర నిగ్రహముచేత సాధించలేరు.

- విశ్వనాథ, తెలిచిరాజు

## వైరుధ్యం

గొప్ప శిఖరాలు వున్న మనిషిలోనే గొప్ప వెలితి లోయలు కనబడేవి.

- చలం, మ్యూజింగ్స్

ఆదర్శవాదుల మాటలు ఆకాశాన్ని దాటి పైకి వెడితే ప్రత్యక్షవాదులకి అసలు నోరే పెగల్దు.

- భమిడిపాటి, వేషరాగాల మేజువాణి

సభను ఉగ్రూతలూగించేవారు ఇవతలికొచ్చి ఒంటరిగాడికి సమాధానం చెప్పలేరు.

- కొడవటిగంటి, పీడకథ

ఐహిక వ్యాధి కుదిరిన నరుఁడు మంచము నుండి దిగును. అప్రాపంచిక వ్యాధియైన భక్తి రోగము నశించినవాఁడు మంచమెక్కును.

- పానుగంటి, విప్రనారాయణ

టోపీలోంచి రూపాయల వర్షం కురిపించిన మనిషి మనం పడేసే కాసు లేరుకుంటాడు.

- చలం, మ్యూజింగ్స్

ఉద్దేశాలకీ, వాటి పర్యవసానాలకీ లోకంలో కొంత వైరుధ్యం ఉండబట్టే, లోకం అంత మిస్టీరియస్‌గా కనపడుతుంది.

- చలం, పాపఫలాలు

ధన సంపాదనమునకును ధర్మ మార్గానుసరణ మునకును పరస్పర వైరుధ్యము.

- సూరి, నా రాణి

కొడుకు బాగుండాల, కోడలు ముండమొయ్యాల.

- సామెత

పుదుచ్చేరిలో వీధులు సక్రమమేగాని బుద్ధులు వక్రం.

- సామెత

## వైష్ణవ మాయ

నియోగి ప్రపంచంలో వైష్ణవమాయ

- లక్ష్మణరావు, అతడు-ఆమె

## వైష్ణవాలయం

వైష్ణవాలయ మున్నచోట మగలకు, మాల కాకులకు లోటేమి?

- పానుగంటి, విప్రనారాయణ

## వైష్ణవుడు

మధ్య వైష్ణవుడు నామాలకు పెద్ద.

- సామెత

## వ్యక్తి

వ్యక్తి మార్పు

వ్యవస్థకే మార్పు
వ్యక్తి శక్తి
వ్యవస్థకే సంఘటితశక్తి

- రాధేయ, మార్పు-తీర్పు

వ్యక్తిత్వం

నిజమైన వ్యక్తిత్వం
భజనలో లేదు.
సృజనలో ఉంది.

- సినారె, ముఖాముఖి

కొన్నాళ్లపాటు- కొంతదూరంపాటు అఖండ గౌతమీ, వశిష్ఠగోదావరీ చీలిపోయి- దేనిదారిని అది ప్రవహించాలి.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

మనిషి వ్యక్తిత్వం కాపాడుకోవటంకన్న ఎక్కువ ఏమీలేదు.

- రంగనాయకమ్మ, పేకమేడలు

సాధారణంగా ఆవేశాలకు, ఆవేదనలకు లోన యిన వాళ్ళు వ్యక్తిత్వాన్నే మరచిపోతారు.

- పినిశెట్టి, పంజరంలో పక్షులు

మనిషి వ్యక్తిత్వం చేతల్లోనే వ్యక్త మవుతుంది.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

ఎవరి వ్యక్తిత్వాలు వారు నిలుపుకుంటూ మేకుల్లా నిలబడితే సంసార మెట్లా సాగు తుంది? ఇద్దరూ చెరికొంతా వదులుకుంటేగాని మూడో వాళ్లకు భవిష్యత్తు ఉండదు. ఏ ఎద్దు కాఎద్దు కాడి మెడ మీద పెట్టుకుని కూడా వ్యక్తి స్వాతంత్ర్యం అంటూ నిలబడితే సేద్యము జరు గుతుందా?

- సరస్వతీదేవి, కొండంత మబ్బు

పెళ్ళితోబాటే స్త్రీ తన వ్యక్తిత్వాన్ని వదులుకోవ లసి ఉంటుంది. (అని తెలుసుకోవడానికి చాలా కాలం పట్టలేదు)

- జయప్రద, పిన్ని

మగవాడి పొగడ్తలకు స్త్రీ పొంగిపోయి, వ్యక్తి త్వపు విలువనే కోల్పోతుంది.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

వ్యతిక్రమం

మతిc దలcపc బూజ్యపూజా
వ్యతిక్రమము సర్వకార్యహరమగుc గాదే?

- శ్రీనాథుడు, హరవిలాసము

వ్యత్యాసం

చిత్రాంగితో మాట్లాడిం తరవాత రత్నాంగిని చూస్తే డోక్రూ!

- భమిడిపాటి, కచటతపలు

రైటరొకటి తలిస్తే ఎడిట రింకొకటి తలచినట్టు.

- శ్రీరమణ, న్యూసుడి

వ్యభిచారం

వ్యభిచారం తప్పే అనుకుంటే అది ఇద్దరు కలసి చేసే తప్పు! అలాంటప్పుడు ఆడదానికే ఎందుకు శిక్ష వేస్తారు?

- భాస్కర్, అర్ధరాత్రి ఆడపడుచులు

వ్యభిచారం దురాచారం కాదు. అది ఓ కులా నికీ, ఓ దేశానికీ మాత్రమే వర్తించని మనిషి లోని పైశాచిక ప్రవృత్తి గూడు కట్టుకపోయిన బలహీనత.

- వేణుగోపాలరావు, జోగబాల

వనితలు గామార్తి వశతc బొంది
వంశహానిc దలంపరు వరుస కలుక
రాత్మజులc జూడ రగ్రజు ననుజుc గొనరు
పురుష శతకంబు సంగమంబునను దృప్తి సనరు.

- తిక్కన, అనుశాసనికపర్వము

కల దొక రహస్యగోపన
మలఘుమతీ వినుము పురుష నస్యుం గనినం
బొలcతులకు నేమిసెప్పుదుc
గలుగుc బదనుతోడి కళలు గామగృహమునన్.

- తిక్కన, అనుశాసనిక పర్వము

కుదుచుట కట్టుట పూయుట
తొడుగుటయును వివిధధనతతులు గూడుట యె
క్కుడు వేడ్క సేయcజాలవు
పడతికిc బరపురుషుc గవయc బాయుట పోలెన్.

- తిక్కన, అనుశాసనిక పర్వము

వ్యర్థత

దుర్వృత్తికిన్ దిక్కై, నీయసమానకౌశలము
వ్యర్థీభూతమైపోయెడిన్.

- జాషువా, సాలీడు

వ్యర్థం

నీదు గుణసన్నిపాతంబు నెంచిచూడ
సన్నిహితగుణంబులే చాల గలవు
విషమరోగికి నిడు మందు విధమ యగుచు
అరయ నీయందు హితవులు వ్యర్థ మయ్యె

- గుమ్మపూడి, బిడాల శాస్త్రి

సరసత్వము సన్మానముఁ
బొరయనిచోఁ బ్రియము నెఱపఁ బూనుట ధరలోఁ
దెరువాటుకాండ్రకడ ము
ష్కరుండై తన కలిమి చూపఁ గడఁగుట చుమ్మీ
- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

స్వారిచేయని గుఱ్ఱంబుఁ జదువనట్టి
పుస్తకంబును సేవింపఁ బోని మందు
నారగింపని వంటక మనుభవింప
నట్టి ధనమును వ్యర్థంబు లనుట వినరె?
- కాళ్ళకూరి, వరవిక్రయము

అనంతకాలము మీఁద సముద్భవించిన మహా పురుషుల బోధలన్నియు వ్యర్థములైనవని చెప్ప వచ్చును.
- విశ్వనాథ, నందోరాజా భవిష్యతి

## వ్యవస్థ

మన కండ్లముందు కనిపించే వ్యవస్థ
యిది చరిత్రకు పట్టిన అవస్థ
- కుందుర్తి, తెలంగాణ

## వ్యవహారం

భాగ్యవంతులు బీదలను దోచుకుంటే దానిపేరు వ్యవహారం. బీదలు తమహక్కును తీసుకుంటే చౌర్యం.
- ఉన్నవ, మాలపల్లి

వ్యవహారం బడుసునం బాఁతిన కంబంబు. తుదకు నేవంకకు నొఱఁగునో యెఱుంగంబడదు.
- చిన్నయసూరి, మిత్రభేదము

ఓడిపోతవన్న వ్యవహారాలు అనేకం గెలిచినవి. గెలుస్తవన్నవి కొన్ని పూరికినే పోయినవి. వ్యవహారమంటే జూద మనుకోవలసిందే. వ్యవహారం పోతుందని నిశ్చయం జేసుకునే దిగాలె.
- ఉన్నవ, మాలపల్లి

## వ్యసనం

మనిషికి ఈ నిత్యజీవితంలో కష్టాలు కొంతసేపు మరచిపోవాలంటే యేదో ఒక వ్యసనం వుండాలి.
- కాంతారావు, బూచీ

మమకారం ఒక వ్యసనం
నిరీక్ష ఒక వ్యసనం
ప్రేమ ఒక వ్యసనం
నిట్టూర్పు మరో వ్యసనం.
- వనమాలి, జీవించడమే ఒక వ్యసనం

వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు
ప్రల్లదనమును దండంబుఁ బరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ము సేఁత
యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల.
- తిక్కన, ఉద్యోగపర్వము

కవిత్వం కూడు బెడుతుందా చెప్పు? అదీ ఒక వ్యసనం.
- రామదాసు, మాస్టర్జీ

మనిషి అన్న తరువాత ఏదేనా ఒక వ్యసనం అంటూ ఉండాలి.
- లక్ష్మణరావు, అతడు-ఆమె

ఏవి చేసినా మితిమీరనంతవరకూ సరదాలు, మీరితే వ్యసనాలు.
- రంగనాయకమ్మ, పేకమేడలు

మార్నింగు కాగానె మంచము లీవింగు
మొగము వాషింగు చక్కగ సిటింగు
కార్కు రిమూవింగు గ్లాసులు ఫిల్లింగు
గడగడ డ్రింకింగు గ్రంబులింగు
భార్యతో ఫైటింగు బయటికి మార్చింగు
క్లబ్బును రీచింగు గాంబులింగు
విత్తము లూసింగు చిత్తము రేసింగు
వెంటనే డ్రింకింగు వేవరింగు
మరల మరల రిపీటింగు మట్టరింగు
బసకు స్టార్టింగు జేబులు ఫ్లండరింగు
దారి పొడువున డాన్సింగు థండరింగు
సారె సారెకు రోలింగు స్లంబరింగు
- కాళ్లకూరి, మధుసేవ

## వ్యాకరణం

వ్యాకరణ మొక్కత్రోవ మ
హాకవు లొకత్రోవ కోశ మఖిల మ్మొకత్రోవై
కనుపట్టెడి.
- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

మా రచనలో వ్యాకరణం మాత్రమే లేదు.
మీ రచనంతా వ్యాకరణం; మరేమీ కాదు.
- కాళోజీ, సరస్వతీభక్తుల్లారా!

## వ్యాజ్యం

మా తాతగారు గేదెకొఱకు వ్యాజ్యెము తెచ్చిరి. ఆయన పోయినారు. ఆయన కూతురు మా తల్లిగారు పోయినారు. నేనిప్పు డా గేదె వ్యాజ్యెములో వాదిని. గేదె చచ్చినది. దాని దూడ చచ్చినది. ప్రతివాదులలోని మూఁడవ తరము

వాడు ఋణబాధ పడలేక మొన్నటి పుష్కరది నములలో గోదావరిలోఁ బడి చచ్చినాఁడు. కాని వెన్షుక ప్లీడ ర్లున్నారు. సంధికొఱకు మేమెన్ని విధముల నేడ్చినను వారు కుదురనీయలేదు. పోయినసొమ్ము పోగా వారు మమ్ము తిట్టిన తిట్లకు హద్దులేదు. ధనమూ పోయినది. గౌర వమా పోయినది. గెలిచినను గెలువకున్నను మిగిలియున్న దేడుపు తప్ప మఱేదియు లేదు.

- పానుగంటి, సాక్షి

యుద్ధమును వ్యాజ్యమును ఒకటి. ఈ రెంటను జయాపజయములు తెలియరావు.

- శివరామశాస్త్రి, నమశ్శివాయ

వ్యాపకం

మొగోళ్ళకి అన్నీ యేపకాలే. ఏయేపకం లేన ప్పుడు ఆళ్లకి ఆడదాని యేపకం గావాల. మరి ఆడోళ్ళకు? అన్ని యేపకాలూ ఆడోళ్ళకి మొగో ళ్ళతోనేగాని యేరే యేపకా లుండవు. అదే ఆడోళ్ళ దరిద్దరం.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

వ్యాపారం

మదుపులేని బిజినే సేటంటే జోబీలు కొట్టడ మేనన్నారం డంతాను.

- రావిశాస్త్రి, మోక్షం

అడుగుపెట్టీ పెట్టడంతో అధిక లాభాలు వచ్చిన వ్యాపారం వర్ధయేత్.

- నరసరాజు, ఈ యిల్లు అమ్మబడును

చిల్లర మహాలక్ష్మికాని, పెద్ద పెద్ద బేరాలుకావు. పెద్దకాతాలు వచ్చు వరకు నోరుదెఱచుకొని కూరుచుండిన యెడల వట్టి దండుగ.... దుకా ణము లోనికి వచ్చిన బేరమెప్పుడుఁ జెడనాడు కోవద్దు. ఎంతసేపు మెత్తని మాటయేగాని రట్టు మాత్రము వద్దు. చూడు. విసుగుదల మాత్రము పనికిరాదు. తెలిసినదా? ఇది వర్తక రహస్యము.

- పానుగంటి, కంఠాభరణము

యాపారంలో డబ్బులు పిల్లల్ని పెడ్తయి.

- మా గోఖలే, దేముడిచ్చిన సొమ్ము

ప్రజల బలహీనతమీద దెబ్బ కొట్టడం చేతనయితే ఏ బిజినెస్ అయినా రాణిస్తుంది.

- రామచంద్రమూర్తి, దైవజ్ఞశిఖామణి నగరానికిరాక

సూక్ష్మంగా ఆలోచిస్తే అసలు జీవితమే వ్యాపారం! ప్రతి వ్యక్తీ తన చుట్టూ వున్న ప్రతి ఇతరవ్యక్తితోనూ, కూతుళ్ళనీ కొడుకులనీ, స్నేహి తులనీ, బంధువులనీ, భేదం లేకుండానే వ్యాపారం చేస్తున్నాడు.

- ధనికొండ, పవిత్రులు

అవును, వడ్డీ వ్యాపారాల్లో మునిగి తేలేవాళ్ళు వయస్సుతో పెరగరు.

- పాప, ఫలశ్రుతి

బాగుపడ్డా సరే, దివాలా తీసినా సరేగాని చేస్తే బిజినెస్ చెయ్యాలి.

- భమిడిపాటి, బాగుబాగు

చచ్చిన జంతువుల తోళ్ళతో వ్యాపారం చేసే వాళ్ళు కొందఱు. బ్రతికిన తోళ్ళతో వ్యాపారం చేసేవారు కొందఱు.

- చిలకమర్తి, వరదక్షిణ

మనిషివల్ల వర్తకం పాడవుతుంది, గాని వర్తకం వల్ల మనిషీ యెన్నడూ పాడయిపోడు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, మార్గదర్శి

తయారుచేసే వారొకరూ వినియోగించుకునే వారొకరూను. ఉభయవర్గాలకూ లంకె పెట్ట డమే వర్తకం.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, మార్గదర్శి

వర్తకం మీద, మనిషీ, వొక కన్నుంచి మసులు కుంటే అది, మనిషిని రెండు కళ్ళా చల్లని చూపు చూస్తుంది.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, మార్గదర్శి

పేరులో కూడా వ్యాపార రహస్యంలోని కొంత భాగం ఇమిడి ఉంది.

- ధనికొండ, ప్రొఫెసర్ బింధ్వాన్

"ఇద్దరు వ్యాపారస్తులు ఒక టేబులు ముందు ఎదురెదురుగా కూర్చున్నారనుకో, మనలాగే! వాళ్ళిద్దరిలో ఎవరు ఎవరిని ముందుగా, హెచ్చుగా మోసం చెయ్యగల రనేది ఒక్క క్షణంలో తేల్చుకొనే స్థలమే మార్కెట్ ప్లేస్!" అన్నాడు వాడపల్లి.

- అనంతం, సినీమాసరదాలు

పెద్దవాడు పెద్ద దొంగతనం చేస్తే అది వ్యాపారం అవుతుంది.

- సులోచన, శిక్ష

### వ్యాపారి

చట్టంలో లొసుగులు వ్యాపారికే ఎరుక!

- ఛాయారాజ్, శ్రీకాకుళం

### వ్యాప్తి

ప్రజల జిహ్వాలందు దుష్కృతి కున్న వ్యాప్తి సత్కృతికి లేదు.

- పానుగంటి, చూడామణి

### వ్యామోహం

గుర్రం మీద రౌతుకుండే ప్రేమ- ఏనుగుమీద మావటీకుండే ఆపేక్ష- స్వంతంగా నడుపుకునే వాడికి తనకారుమీద వుండే వ్యామోహం పెళ్ళాం పిల్లలమీద కూడా వుండదేమో.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

వ్యామోహం అనేది అందని వస్తువుమీద వుంటుంది.

- గోపీచంద్, జనాభా

నాటకాల పిచ్చి వుంది చూశారూ- ఇది ఆడపిల్ల ప్రేమలాంటిది. దూరంగా వున్నంతసేపూ కవ్వి స్తుంది. అడుగు లోపలికి పెట్టామా- రంగస్థలా నికి తాళికట్టేవరకూ వదిలిపెట్టదు.

- వీరేంద్రనాథ్, ఆఖరి పోరాటం

### వ్రణం

రుణమే వ్రణ మన్నట్లు.

- సామెత



### శకునం

కుక్క చెవిఁ జెటకాయించిన శకునము. గాడిద కూసిన శకునము. గుఱ్ఱము సకిలించిన శకు నము.

- పానుగంటి, సాక్షి

రెండు దుశ్శకునము లొక సుశకునముతో సమానం.

- కొవ్వలి? కాళ్ళకూరి, చింతామణి

అందరికీ శకునం చెప్పే బల్లి, తాను పోయి కుడితిలో పడ్డట్టు.

- సామెత

### శక్తి

వంచనలేని మనస్సులో పరిస్థితుల నెదుర్కొనే శక్తి దానంతటదే పుట్టుకువస్తుంది.

- విమలారామం, కిరణ్మయి

కట్నంకొద్దీ పురుషుడు - ఓపికకొద్దీ బిడ్డలు.

- శ్రీరమణ, న్యూనుడి

కష్టాల నెదుర్కొనే శక్తి కన్నీరు చిందే కళ్ళల్లో దాగి వుంటుంది.

- విమలారామం, కిరణ్మయి

ఈ ప్రపంచానికి తప్పులను ఇముడ్చుకొని, జీర్ణిం చుకొని బ్రతికే శక్తి వుంటుంది.

- గోపీచంద్, ఆపద్బాంధవ్యం కూష్మాండాక్యం

శరీరాలకి హృదయానుభూతులను ఆవిష్క రించే శక్తి వుంది.

- వివినమూర్తి, ఉద్యమం

హలముతో భూతలికి అన్నమిచ్చినది శక్తి
కలముతో భూతలికి కన్నువిచ్చినది శక్తి.

- ఏల్చూరు, ఆహుతి

వ్యష్టి సమిష్టితో కలిస్తే శక్తి;
చీలిపోతే లేదు నరునికి విముక్తి.

- విజయలక్ష్మి, మహాప్రస్థానపర్వం

ఈతవంటి సాధనము పరుగువంటి సాధనము- సర్వావయవశక్తి సంపాదనమునకు మూఁడవది కానిపింపదు. కరచరణాదులకేకాక అంతరకోశ ములకుఁగూడ సమర్థమైన శక్తి సమకూర్చును.

- పానుగంటి, సాక్షి

మలేరియా, క్షయ, దారిద్రం, కుష్ఠు కల్పించిన శక్తులే మానవజాతికి యీ విధానాన్నీ, వివాహ సంస్కారాన్నీ కటాక్షించినాయి.

- చలం, మ్యూజింగ్స్

నన్ను క్షమించే గొప్పతనం మీకుంది. కానీ దాన్ని భరించే శక్తి నాకు లేదు.

- మారుతీరావు, కళ్ళు

హక్కులను తెలుసుకునే శక్తి ఉన్నంతమాత్రాన వాటికోసం పోరాడే శక్తి ఉన్నట్టు కాదు.

- కొడవటిగంటి, సవతితల్లి

శక్తిసంపన్నుండు దన్ను మాఱుకొనువాని యందు దన బలంబు వెలయించుఁగాని ప్రముక్కడుల లెక్కింపఁడు.

- చిన్నయసూరి, మిత్ర భేదము

### శత్రుత్వం

పగవారి యింటఁ గుడిచిన

నగుఁ దమ కనుమాన మమృత మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగ
దగ దొడళుల కెప్పు డెవ్విధము వాటిలునో!

- తిక్కన, ఉద్యోగపర్వము

**శత్రువు**

మనిషికి మనిషే పగవాడు
గతమే అతనికి ఉరిత్రాడు.

- శ్రీశ్రీ, పంచరత్నాలు

అరాతులు సాధుల మెత్తురే?

- తిక్కన, ఉద్యోగపర్వము

సుద్ది పగవారి పగవారు చుట్ట లగుట.

- శ్రీనాథుడు, కాశీఖండము

రిపు ప్రాంతము చేరెడువార లాప్తులే?

- పింగళి, ప్రభావతీప్రద్యుమ్నము

బాహ్యశత్రులఁ బరిహరింపంగవచ్చు
నంతరారుల నిర్జింప నలవిగాదు.

- శ్రీనాథుడు, కాశీఖండము

కంటికి నిద్రవచ్చునె? సు
ఖంబగునే రతికేళి? జిహ్వకున్
వంటక మించునే? ఇతర
వైభవముల్ పదివేలు మానసం
బంటునె? మానుషంబుగల
యట్టి మనుష్యున కెట్టి వానికిన్
గంటకుఁ డైన శాత్రవుఁడొ
కండు దనంతటివాఁడు కల్గినన్.

- శ్రీనాథుడు, కాశీఖండము

...వీఁ
డకటా యవసానవైరియై చనుదెంచెన్!

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

శత్రత్వమే సృష్టిరహస్యము. కాని సామరస్యము కాదు. మనుజుఁ డన్నిజంతువులను జంపుచున్నాఁడు. వీనికంటె సర్వనాశకుఁడు ప్రపంచమున లేడు. దయ్యములే యుండినయెడల సృష్టిక్రమానుసారముగ నవి మనుజులనుఁ బీకుకొని తినకతప్పదు.

- పానుగంటి, సాక్షి

నీవాంధ్రుడవు. నీ దురదృష్ట మక్కడ నున్నది. అయిదువేల సంవత్సరములు కడచిన తరువాత నాంధ్రులలో నొక మహా గ్రంథకర్త యుదయించును. వాడు నిన్ను త్రవ్వి బయటకు దీయును. నీ యథార్థ స్వరూపమును నిరూపించును. అతడు నీకు నిజమైన శత్రువు.

- విశ్వనాథ, దిండుకింద పోకచెక్క

చంపఁ దగినయట్టి శత్రువు తనచేతఁ
జిక్కెనేని కీడు సేయరాదు
పొసఁగ మేలుచేసి పొమ్మనుటే చాలు.

- వేమన

ప్రతి నియమవ్రతుడికీ కొందరు శత్రువులు అనుకోకుండానే ఏర్పడుతారు.

- కొడవటిగంటి, చెడిపోయిన మనిషి

నా అనుకొనే మనిషి లేకుంటే ఇల్లేమిటి, బ్రతుకే ఓ శత్రువు.

- మహీధర, కత్తుల వంతెన

ఎంతటివాడికైనా గిట్టని వెధవలు ఉంటారు.

- రామదాసు, ఆకాశరామన్న

శత్రువు లేని మనిషి లేడు.

- దివ్య ప్రభాకర్, శిరోమణి

దొంగకి అందరూ శత్రువులే

- మారుతీరావు, అనంతం

శత్రుఁడు చదవని పుత్రుఁడు
శత్రుఁడు ఋణకారియైన జనకుఁడు మిగులన్
శత్రువు రూపసియగు సతి
శత్రువు దుశ్చరితయైన జనని తలంపన్

- జక్కన, విక్రమార్క చరిత్రము

పగవాణ్ణి పంచాంగం అడిగితే మధ్యాహ్నానికి మరణ మన్నాడట.

- సామెత

పూను స్పర్ధలు విద్యలందే
వైరములు వాణిజ్యమందే
వ్యర్థ కలహం పెంచబోకోయ్
కత్తి వైరం కాల్చవోయ్!

- గురజాడ, దేశభక్తి

**శని**

రాగల శని రామేశ్వరం వెళ్ళినా తప్పదు.

- సామెత

యేల్నాటి శనిరాగానే కాశీకి బయల్దేరిపోవలసింది.

- గురజాడ, కన్యాశుల్కం

శనిగ్రహ పీడ వదిలించుకొనుటకై దేశమందలి యెల్లవారు మందపల్లి బోవుచుండఁగా మందపల్లిలోనే యున్న పాపయ్యకు శనిగ్రహపీడ వదలక పోయెను.

- చిలకమర్తి, గణపతి

ఆహా! గ్రహరా జనఁగ శనియే. అతని దెబ్బ వంటిది మఱియేది? అన్ని గ్రహము లొక యెత్తు. శనిగ్రహ మొక యెత్తు. మేరువును పేడకుప్పను జేయుటలో, పేడ కుప్పను మేరువును జేయుటలో, చీమను సింహము చేయుటలో, సింహమును జీమ చేయుటలో, ముష్టి పందను మూర్ధాభిషిక్తుని మూర్ధాభిషిక్తుని ముష్టిపందను జేయుటలో- ఖడ్గము లేకుండ ఖండించుటలో, మంట లేకుండ మాడ్చుటలోఁ, బ్రాణముపోకుండఁ జంపుటలో, సృష్టినిఁ దల క్రిందు చేయుటలో శనైశ్చరుని కున్న శక్తి యసాధారణము- అప్రతిహతము- అనిర్వ్యాజము.

- పానుగంటి, సాక్షి

శనిమహర్దశ ప్రవేశముఁగాంచ సర్కారు
పత్రముల్ గొని నష్టపడినవాఁడ.

- రెంటాల సుబ్బారావు, చాటువు

అంగట్లో అన్నీ ఉన్నాయి. అల్లుని నోట్లో శని ఉంది.

- సామెత

శపథం

చచ్చిన భీమునిచేతనే చావవలయును. కడతేర్చిన వానినే కడతేర్పవలయును.

- తి.వేం., పాండవ విజయము

శబ్దం

శబ్ద సంబంధమైన రహస్య మొకటి చెప్పెద వినుము. కఠినశబ్ద మేదైననుసరే సంస్కృత మని నిశ్చయింపవలసినది. ఒక్కటే సూత్రము. దీనికి తిరుగు మాత్రము లేదు.

- పానుగంటి, కంఠాభరణము

గొంతు దాటి పలకని శబ్దాలు
దాగున్నై ఇన్ని శతాబ్దాలు!

- దాశరథి, పునర్నవం

శరణ్యం

జీవితాంతం కాబోతున్న దన్నప్పుడు వేదాంతమే శరణ్యం.

- వినిశెట్టి, పంజరంలో పక్షులు

శరీరం

మనసు మీద శరీరం గుడ్డి నిషా వేస్తుంది. శరీరం మీద మనసు వ్యర్థ విషవం సాగిస్తుంది.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

పుట్టినప్పుడే
సంక్రమించిన
పట కుటీరం
నా తనువు.

- శ్రీకాంతశర్మ, పటకుటీరం

శల్య పరీక్ష

ఆడవాళ్లని మగవాళ్లు చూడటానికి కారణాలు న్నాయిగాని, ఆడవాళ్లలని ఆడవాళ్లు శల్యపరీక్షగా చూడటం దేనికి? అసలు చూసేదే ఆడవాళ్లు.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

శవం

శవం సంజాయిషీ కోరదు.

- నగ్నముని, కొయ్యగుర్రం

కాశ్మీర సరస్సులలో పడవల్లాగు
కాల ప్రవాహంలో కలరా శవాలు కొన్ని

- నారాయణబాబు, మౌనశంఖం

శాడిస్టు

ఎదుటివాడి వ్యవహారం గురించయితే ఈ భూమ్మీద నూటికి తొంభైమంది శాడిస్టులే.

- వేణుగోపాలరావు, జోగబాల

శాంతం

శాంతం భోషాణం పెట్టె అనుకొని నోరు మూసుకొని వూరుకొన్నాను.

- గురజాడ, కన్యాశుల్కం

శాంతి

శాంతి ఇవ్వవలసింది, పుచ్చుకోవలసింది కాదు.

- బోయి భీమన్న, విశ్వశాంతి

స్వేచ్ఛలోనే ఏదో శాంతి, బాధలున్నాసరే, బానిసత్వంలోనే ఏదో అశాంతి, బాధ లేకపోయినా సరే.

- చలం, మ్యూజింగ్స్

వుత్త సరదాలేని సుఖంలో బతకడమే చాతనైతే ఎన్నడో శాంతిలో స్థిరపడిపోయి వుండును మానవ జీవితం.

- చలం, మ్యూజింగ్స్

ఆకలిదప్పులు తీరాలి. కామ వాంఛలు తీరాలి. తోటి మానవునితోపాటు తనకు న్యాయం జరుగుతోందనే ఆత్మతృప్తి ఏర్పడాలి. నలుగురితో పాటు తనకూ సుఖశాంతు లున్నాయనే పరితృప్తితో దుఃఖోపశమనం కలగాలి. అంతవర

దాకా ఈ భూగోళంమీద శాంతి సిద్ధించుతుంద నుకోవటం పిచ్చివాడి కలవరింపు.

- సూరి, చంఘీజ్ ఖాన్

భక్తప్రహ్లాదుఁడే మున్ను వసుధపైన
నారసింహాకృతిని శాంతి కోరినాఁడు

- వేదాంతకవి, ఆకలిమంట

డబ్బుతో 'శాంతి'ని కొనుక్కోలేంకదా!

- ముద్దంశెట్టి, తప్పించుకోలేవు

శాంతి నికేతనంలో వుండే శాంతి చిత్త శాంతి, ఉద్యమాలలోని శాంతి రాజకీయ శాంతి.

- సూర్యారావు, నీలితెరలు

శాంతి క్రాంతివలన వస్తుంది.
నవయుగ సంక్రాంతివలన వస్తుంది.

- బైరాగి, వియత్‌నామ్

శాపం

పోయెడు భూత మీచెట్టుకొమ్మను విఱుచుకొని పోవుగాక!

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

జీవిత మనేది భగవంతుడు ప్రసాదించే ఓ అమూల్యమైన వరమయితే, ఆ జీవితంలో అంధత్వం, మూగతనం అనేవి తీరని శాపాలు.

- రామచంద్రమూర్తి, మనుగడలో మలుపులు

శాశ్వతం

ఈ గవర్నమెంట్‌లో డ్రైవర్లు శాశ్వతంగానీ కార్లూ, మంత్రులూ మూడేసి రోజుల ముచ్చటే కదా గురూ....

- పతంజలి, అప్పన్న సర్దార్

అన్నం పెడితే అరిగిపోతుంది. చీర యిస్తే చిరిగి పోతుంది. కర్ర కాల్చి వాత పెడితే కల కాలముంటుంది అన్నట్లు.

- సామెత

కరువునాటి కష్టా లుండవుగాని, కష్టాలనాటి మాట లుంటాయి.

- సామెత

శాసనసభ

కలి కాలపు మయసభగా
ఖ్యాతిగన్న దేదిరా?
'శాసనసభ' అంటే నను
క్షమియించుడు గురువరా?

- మల్లారెడ్డి, యక్షప్రశ్నలు

శాసనసభలు ఈ దేశంలో అతి గొప్ప బాతా ఖానీ క్లబ్బులు!

- చిన్నబాబు, డబ్బు

శాస్త్రం

రహస్యంగా వుంచుతే శాస్త్రంకాని అందరికీ తెలిస్తే శాస్త్రం యేమిషీ?

- కందుకూరి, హాస్యసంజీవని

శాస్త్రా లనగా మంత్రా లనగా అందరికీ తెలిస్తే పాటి తప్పిపోతవి.

- కందుకూరి, హాస్యసంజీవని

తగిన ప్రవేశమున్నచో శాస్త్రము లెన్నఁడును నసత్యములు కావు.

- తి.వేం., పాండవ జననం

బహుధా విప్రతిపత్తిదీవిషయముల్
పాడైన శాస్త్రార్థముల్.

- శ్రీనాథుడు, కాశీఖండము

శాస్త్రమర్మము లెప్పుడును సర్వజనులకును వెల్ల డిచేయగూడదు. అందులో ముఖ్యముగా మూడు శాస్త్రములు పరమగుహ్యములు - అందుచేతనే మా దేశమునందుగూడా చదువె ఱుగని వారు సహితము జ్యోతిశ్శాస్త్రములోను, మంత్రశాస్త్రములోను, మహావిద్వాంసులయి జన సమ్మానము పొంది కోటీశ్వరులగుచున్నారు.

- కందుకూరి, సత్యరాజా పూర్వదేశయాత్రలు

న్యాయశాస్త్ర మరయ నన్యాయ మొనరించు
ధర్మశాస్త్ర మొసఁగు దుర్మతంబు
జ్యోతిషంబు జనుల నీతులు దప్పించు

- వేమన

వట్టి శాస్త్రంలో యెంతప్రవేశమున్నా అది ధనా ర్జనకు సాధనం కాదుగదా!

- వెళ్ళపిళ్ళ, కథలు-గాథలు

ధర్మశాస్త్రమునకు పిల్లవాడు పెద్దవాడు అనే భేదంలేదు. శాస్త్రములకు జాలియుండదు.

- చిలకమర్తి, కనకకశునక ప్రహసనము

శాస్త్రంలో వున్న బండారం అంతా ప్రాయశ్చిత్తాలే కాదుటోయ్?

- సుబ్రహ్మణ్యశాస్త్రి, బ్రాహ్మణాగ్రహారం

శాస్త్రీయ సంగీతం

సంగీతంబు వెలార్చి రాలు గరగిం
చం జాలు నవ్వారి ధా
త్రిం గన్నారము, గాలిపాటలును టు

గ్రీలున్ మరింకేమియో
రంగద్వైఖరి పాడు పాటకులె యా
రాధ్యుల్ భువిన్; 'క్లాసికల్'
సంగీతంబును పాడువారలను మె
చ్చన్నేర్తురా? కాకమా!

- గునుపూడి, బిడాలశాస్త్రి

*శిక్ష*

సంస్కారవంతుడికి జనం జాలి, ఎగతాళి చూపులకన్నా మించిన శిక్షలేదు.

- చిన్నబాబు, డబ్బు

అవతలవాడు మనల్ని తిట్టి దిగజారిపోతే మనం నోరెత్తకుండా హుందాగా వ్యవహరించడమే వారికి పెద్ద శిక్ష.

- రామమోహనరావు, త్రినేత్రుడు

మరణానికి మరణమే శిక్ష.

- రమణారెడ్డి, సత్యం-శివం-సుందరం

ముక్కు సోణంబు దాఁకను జెక్కు టొకటి
బోసినోరుగఁ బండ్లూడఁ బొడుచు టొకటి
గూబలంటంగఁ జెవిదోయిఁ గోయుటొకటి
లంజెతల్లి యొనర్చు కల్లలకు శిక్ష.

- వల్లభరాయడు, క్రీడాభిరామము

తప్పులేకయ శిక్షింపఁ దగవు గాదు.

- శ్రీనాథుడు, కాశీఖండము

ఒక్కొక్క వ్యక్తిని మాత్రం బాధించే పాపాలకు వెంటనే సాధారణంగా శిక్ష కనబడుతుంది గాని, ధర్మాన్ని నిరోధించే లోకకంటక కార్యాలకు శిక్ష వెంటనే కనబడదు.

- ఉన్నవ, మాలపల్లి

సాంఘిక విషయములలో ప్రభువులు జోక్యం కలుగజేసికొని జనులను శిక్షించడం అక్రమం.

- ఉన్నవ, మాలపల్లి

భార్య గురుస్వరూపయై పనికిమాలిన భర్తను శిక్షింపవలయును.

- పానుగంటి, రాతిస్తంభము

ఒక దుష్టుఁడు వేయి ఘోరకార్యములు చేయును. వానిలో నొక్కటియే నెపమై వానిని భగవంతుఁడు శిక్షించును. భగవంతుడు తన శిక్షయుఁ, దన యనుగ్రహమును లోకము నందలి వ్యక్తులద్వారా చూపించును.

- విశ్వనాథ, కడిమిచెట్టు

నిద్రపోతున్న వాడికి నల్లులు
మేలుకున్నవాడికి పిల్లలు
ఈ రెండూ మనిషికి దేవుడు వేసిన శిక్షలు.

- కుందుర్తి, ఎక్కడచూసినా

ఎంతమందిని చంపినా ఒక్కటే శిక్ష.

- పినిశెట్టి, పల్లెపడుచు

శిక్షపడ్డానికి వాదనతో సంబంధంలేదని అందరికీ తెలుసు.

- పాప, రామరాజ్యానికి రహదారి

ధనికుల వారసులకు రక్ష
పేదల ఆకలి కొక శిక్ష!

- హర్షవర్ధన్, ఘోష

విశ్వాసఘాతకుడికీ, పసిపిల్లల గొంతుకోసేవాడికీ శిక్ష ఏమిటో? (చెప్పండి తమరు)

- మారుతీరావు, అనంతం

శిక్షకి ప్రయోజనం కసితీర్చుకోడం కాదు.

- యజ్ఞన్నశాస్త్రి, న్యాయం

ఎవరి పాపం వాళ్ళనే శిక్షిస్తుంది.

- సూర్యారావు, ఎవరో పిలిచారు

శిక్ష అంటే చిన్నపిల్లల్ని బళ్ళో పెట్టెయ్యడం అన్నమాట.

- ముళ్ళపూడి, బుడుగు

బురదలో జారిపడిన కాలికి విరిగిందే శిక్ష!

- కుందుర్తి, తెలంగాణ

పశ్చాత్తాపం మరే కఠినశిక్షకూ తీసిపోదు.

- రామచంద్రమూర్తి, మనుగడలో మలుపులు

*శిక్షాపరిమితి*

తెలిసి చేసిన పాపానికి శిక్షాపరిమితి లేదు.

- నరసింహశర్మ, మనస్సాక్షి

*శిక్షాస్మృతి*

ఇండియన్ పీనల్ కోడు- అయిపీసీ అంటారు. దాన్నే భారతీయ శిక్షాస్మృతి అంటారు.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

*శిక్షార్హం*

స్వతంత్రదేశంలో జమిందారుకి వ్యతిరేకంగా రాయడం, అది ఫైల్లోకి వెళ్ళడం శిక్షార్హం- కఠిన శిక్షార్హమనే భావించాలి.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

*శిఖరాగ్రజాతి*

నిమ్నజాతైనా సరే అగ్రవర్ణం అయినా సరే పోలీసుజాతికి చెందిపోయేక ఆది శిఖరాగ్ర

జాతి కింద మారిపోతుంది.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

### శివపూజ

అనవలసింది అనడం, అందింది చేయటమే శివపూజ.

- పులికంటి, శివపూజ

### శివాజ్ఞ

మనము లోఁగితి మేని లోఁగునె శివాజ్ఞ?
యుడుము నడికిన నడుకునే బడియ పెట్టు?

- శ్రీనాథుడు, కాశీఖండము

### శిష్టుడు

సృష్టికిఁ గిరీట మనుకొన్న శిష్టుఁ డేలొ
క్రుళ్లు బ్రదుకును తొలగించుకోడు తెలిసి!

- భీమన్న, కొబ్బరితుంట

దుష్టులు ఉంటేనేగాని, శిష్టులు బైటపడే అవకాశం వుండదు.

- ధనికొండ, బుద్ధొచ్చింది

### శిష్యుడు

గురుదక్షిణక్రింద గురువుకు పంగనామాలు దిద్దటం, శిష్యత్వానికి పరమావధిగా గురుపీఠాన్ని మింగజూడటం ఇవే ఈ యుగ లక్షణాలు.

- చలసాని, పుణ్యభూమి

### శిస్తు

దేశమంతటా పండించుకున్నందుకు శిస్తులు గడతారు. యీ రాజ్యములో మాత్రం శిస్తులు కట్టేందుకు పండించాలి.

- బొల్లిముంత, మృత్యుంజయులు

షర్టు జేబులో నిప్పువంటిదీ
జమీను రయితుల శిస్తు.

- రైతు భజనావళి

### శీలం

లోకమునందు శీలము ద్విధాభూతము. ఈ రెంటిని రెండుగా చూచుట లోకము నేర్చుకొనవలయును. ఒకటి స్త్రీ సంబంధమైన శీలము. రెండవది తదితర సర్వవిషయములకు సంబంధించినది.

- విశ్వనాథ, తెలిచిరాజు

ధాన్యం కొలవడానికి కుంచం ఒక్కటే వున్నట్లు, నీతిని కొలవడానికి శీలం ఒక్కటే వుంది.

- కాంతారావు, వంశధార

స్త్రీకి శీలం ముఖ్యం- అది పాడైపోతే బ్రతుకు వృథా.

- పుల్లాభొట్ల, బడ్డీకొట్టు భద్రమ్మ

శీలం అనేది కలవాడు సృష్టించిన పదం. ఆడదాన్ని పట్టి పరదాల్లో బంధించి ఉంచడానికి ఏర్పడిన పడికట్టు.

- రంగాచార్య, జనపదం

### శుభ్రత

శుభ్రత- ఆరోగ్యం- అందానికి రెండుకళ్ళు.

- బుచ్చిరెడ్డి, తేనెకోరని తుమ్మెద

### శుశ్రూష

గురువుగారు సానినిఁ గూడినప్పుడు శిష్యుఁడు జావళిఁ బాడినఁ దప్పా?

- పానుగంటి, ముద్రిక

### శూన్యం

సర్వసంగ పరిత్యాగు లగు సన్యాసులకు
జపతపాదులయందు శ్రద్ధ శూన్యము!

- బాలసరస్వతి, భక్తతుకారామ్

జీవితమే ఒక శూన్యం- కడుపే జీవితం- కడుపే నిత్యశూన్యం- చివరకు ఈ శూన్యం శూన్యంలో కలిసిపోతుంది.

- కాంతారావు, పెళ్ళి

పుత్రమిత్ర విరహితుని గృహమును, మూర్ఖుని చిత్తమును శూన్యములు. దారిద్ర్యము సర్వశూన్యము.

- చిన్నయసూరి, మిత్రలాభము

శూన్యం అంటే సున్నా కనిపెట్టిం దెవరండీ? మనం.

- యజ్ఞన్నశాస్త్రి, ఓమనిషి నూతిలోపడితే

సిగిరెట్టుకు పునర్జన్మ లేదు.

- భమిడిపాటి, చుట్టా, బీడీ, సిగరెట్

### శూరుడు

మాటలతోఁ బనియేమున్నది? ఆలాపశూరుఁడు శూరుఁడు కాఁడు. ఆచరణశూరుఁడు శూరుఁడు.

- పానుగంటి, సాక్షి

### శృంగారం

శృంగారం వన్నె చెడిన దగ్గిరనుంచీ, బంగారం గదా తేటు తేవాలి?

- గురజాడ, కన్యాశుల్కం

శేషం

మా నీతికి శేషించినది నీది, నీ చేతికి శేషించి నది మాది.

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

సామ్రాజ్య శిథిలావశేషాలలా కవిరాజులు, కవి సామ్రాట్టులూ యింకా నిలిచివున్నారు.

- సూర్యారావు, నీలితెరలు

శైవాచారం

శివనిందా విషయం బగు
నవమానము సెప్పునట్టి యప్పుస్తకముల్
అవిచారంబునఁ గాల్పఁగ
నవుఁ, జెప్పెడువానిఁ జంపనగు నీశానా!

- మల్లికార్జునపండితారాధ్యుడు, శివతత్వసారము

శోభ

చిత్రకారుడు చిత్రించిన శరీరంలోకంటె, చిత్ర కారుడిలో ఉన్న కవి ఉద్దేశించిన మనస్సౌంద ర్యంలో ఎక్కువ శోభ కనిపిస్తుంది.

- వెంకటసుబ్రహ్మణ్యం, పారిస్

శౌర్యం

శౌర్యప్రస్తావన వచ్చినపుడు, కొబ్బరిచెట్టు మీద నుంచి పుచ్చెపడడం యెలాంటిదో మనిషి మెడ మీద నుంచి తలకాయ పడడమూ అలాంటిదే.

- సుబ్రహ్మణ్యశాస్త్రి

రాచవేనుగు తోడులేకుండా వెళ్లదు
సమయమిదె వచ్చుచున్నది శౌర్యమునకు.

- తి.వేం., పాండవోద్యోగము

జయంబులు శౌర్యసాధ్యముల్

- పింగళి, కళాపూర్ణోదయము

శ్మశానం

ఇట నస్పృశ్యత సంచరించుటకుఁ దా
వేలేదు విశ్వంభరా
నటనంబుల్ గబళించి గర్భమున వి
న్యస్తంబుఁ గావించి యు
త్కటపుం బెబ్బులి తోడ మేఁక నొక ప్ర
క్కం జేర్చి జోకొట్టి యూ
అటుఁ గల్పించు నభేదభావ మను ధ
ర్మం బిందుఁ గారాడెడిన్.

- జాషువా, శ్మశానవాటిక

ఈ శ్మశాన భూమిఖండ మీకాలిన నీలినేల
కాలము కన్నీళ్లు కార్చి క్షాళించిన బూదిప్రోవు
జీవన బాధా వీధులు చేరిన విశ్రామశాల
నీరవ నిబిడాంధకార నిర్వాణమ్మునకు తావు.

- అబ్బూరి, ఈ శ్మశానభూమి ఖండము

శ్రద్ధ

నేను పుస్తకము తల్లకిందులుగా కూడ చదవగ లను. చదువునందు శ్రద్ధవుంటే యేలా చది వినా చదువవచ్చును.

- కందుకూరి, పునర్మరణ ప్రహసనము

డాక్టర్లకు ఒక్కొక్క పేషెంటుమీద అమితమైన శ్రద్ధ కలుగుతుంది. బహుశః జబ్బునుబట్టి కావచ్చు.

- సరస్వతీదేవి, కథవెనక దాగిననిజం

శ్రమ

అదృష్టవంతులము కావలెనని చేయు ప్రయత్న మొకటి తప్ప వేఱు ప్రయత్నము లేనివా రెప్పుడును భాగ్యవంతులు కారు. భాగ్యదేవత మాఱుపని లేక తన కొఱకే కాచుకొని యున్న వారి యొద్ద నుండి పాఱిపోయి, యింటఁ గూరు చుండి యొడలు వంచి పనిచేయువారినే చేరును.

- కందుకూరి, రాజశేఖరచరిత్రము

ఉపయోగము లేనప్పు డేల శ్రమపడవలెను?

- పానుగంటి, రాతిస్తంభము

కష్టపడి పనిచేయువారు తాము తెచ్చుకున్నది అన్న వస్త్రాదులకు చాలక బాధపడుచుందురు! పాటుపడని సోమరిపోతులు పూర్వు లార్జించిన మాన్యముల ననుభవించుచు విలువ బట్టలను పంచ భక్ష్య పరమాన్నములను గలిగి సుఖించు చుందురు.

- కందుకూరి, రాజశేఖరచరిత్రము

తక్కువ శ్రమముతో మహాకార్యములు కావల యునని ప్రతి మనుజునకు సహజముగ నుండును.

- పానుగంటి, సాక్షి

అర్ధరాత్రి ఆకలిగా లేకపోతే వర్క్ రెట్లా అవుతావు?

- చలం, హంతకుడు

చెమటోడ్చటంలో ఆసక్తిగలవాడు భారం తగ్గించే పద్ధతులను తప్పక ఆక్షేపిస్తాడు.

- కొడవటిగంటి, దైవాధీనపు జీవితం

శ్రాద్ధం

వీడి శ్రాద్ధం చెట్టుకింద బెట్టా.

- గురజాడ, కన్యాశుల్కం

శ్రీ

శ్రీ అనగా లక్ష్మి సరే
శ్రీ అంటే విషం కూడ.

- శ్రీశ్రీ, సామాన్యుని వాస్తవికత

ఓ యింకొక్కటి శ్రీ దిగుల్ గలదు అ
చ్చొత్తించు శ్రీ ప్రెస్సులో
శ్రీయచ్చుల్ సరిపోయి ఏడ్చినవిటోయ్
శ్రీ విశ్వనాథేశ్వరా!

- మాచిరాజు, చాటువు

శ్రీరంగ నీతులు

చేసేవి మాఘస్నానాలు, దూరేవి దొమ్మరి కొంపలా!

- సామెత

శ్రీరాముడు

తమ్ముణ్ణీ, భార్యనూ కష్టాలు పెట్టి మొత్తానికి మంచిపేరు సంపాదించుకున్నాడు శ్రీరాముడు.

- జయప్రద, జిజ్ఞాస

శ్రేష్ఠం

వ్యవహారములో నెప్పుడు 'కరతలామలక న్యాయ'ము శ్రేష్ఠము.

- బాలసరస్వతి, భక్తతుకారామ్

శ్రేష్ఠములు మూఁడు వేంకట కృష్ణభూప!
నాగములలోన నైరావణం బనంగ
యోగములలోన లంబికాయోగ మనఁగ
రాగములలోన మేఘమల్లా రనంగ.

- తి.వేం., నానారాజసందర్శనము

కాలను పాతకొయ్య, తాగను పాతకల్లు, నమ్మను పాతస్నేహితుడు, చదువను పాతపుస్తకాలు శ్రేష్ఠములు.

- సామెత

శ్రోత

తలఁ గదుపువాఁడు లేనట్టి తాన మట్లు
వెనుకహంగు లేనట్టి యభినయమట్లు
రణిత నిస్సాణరవ శూన్యరణము వలెను
కథ నడువ దూఁ కొనెడువాఁడుఁ గలుగకున్న.

- పానుగంటి, కళ్యాణ రాఘవము

# ష

షికారు

భార్యాభర్తలకు, అయినవారికీ కానివారికీ షికారు కారుచవుక, ఒంటికి మంచిది.

- పురాణం, ఇల్లాలిముచ్చట్లు

# స

సకారణం

ముంజేయి యాడిన మోచేయి యాడు.

- సామెత

సఖ్యత

నీకై... కురువృద్ధున్ గూల్పవలసె గురువృద్ధులతోన్.

- తి.వేం., పాండవోద్యోగము

సగటు మనిషి

గళంనిండా బాధల దందశూకాలు
తలపై ఒకవంక వంకరసమస్యల చంద్రవంక
మరోవంక సంకులాల అలల గంగశోకాలు
సగటు మనిషి సాక్షాత్తూ పరమశివుడు!

- గోపాలచక్రవర్తి, శంభుడు-సగటు మనిషి

మామూలు మనుషులందరూ నిత్యం అవిరైవృథాగా హరించుకపోతున్న కన్నీటి కలశాలు.

- రామమూర్తి, అగ్నిగర్భ

సగటు రచయిత

సగటు రచకునికి తెలిసిన మొత్తం పదాల సంఖ్య నూట ఏభై అని మొన్న ఎవరో గణాంక శాఖవారు లెక్కవేశారు.

- గోపాలచక్రవర్తి, క్షణమాత్ర త్యాగయ్య

సంకటం

కవికి ఆరాటం - శ్రోతకు ప్రాణ సంకటం

- శ్రీరమణ, న్యూసుడి

సంకరం

సంకరుల నెంతమంది సజ్జనులు కలరో
పూజ్యు లున్నారొ యెఱుఁగవే పుత్ర! నీవు
అంటుమామిడిపండ్లు రుచ్యములు గావె?

- త్రిపురనేని, భగవద్గీత

కలికాలంలో మనుష్యులే కాదు - దేవుళ్లుకూడా సంకరం అవుతారు.

- గురజాడ, మీ పేరేమిటి?

## సంకల్పం

సాహసి సంకల్పమే వజ్రహాసంగా రూపొందుతుంది.

- రమణారెడ్డి, రానున్నది

## సంకెళ్లు

ఊపిరులే సంకెల లంకెలు
చెర గడువును కొలిచే అంకెలు.

- బైరాగి, అనిలతరంగం

## సంక్షోభం

సుడిగాలిలో కొట్టుకుపోయే పులివిస్తరాకుకు సంక్షోభం తప్ప సంఘర్షణ ఏముంటుందీ?

- కొడవటిగంటి, బెదిరినమనుషులు

## సంగమం

ఒకేచోట పుట్టిన నదులన్నీ తప్పకుండా ఒక నాడు ఒకేచోట సంగమిస్తాయి.

- కోదండరామారావు, భద్రత

## సంగీతం

సంగీతంలో శక్తి కావలసిన వాళ్లకి శక్తీ, రక్తి కోసం పాకులాడే వాళ్లకి రక్తీ, భక్తి పారవశ్యంలో ఉన్నవాళ్లకు భక్తీ, ముక్తికై తపించే వాళ్లకు ముక్తీ దొరుకుతాయి!

- భాస్కర్, అర్ధరాత్రి ఆడపడుచులు

సంగీతంగాని కవిత్వంగాని జీవితానికి స్వాతంత్ర్యాన్ని కలిగించటంలో అందెవేసినవేగాని, వీట్ల వెంట దారిద్ర్యం దీపానికి నీడలాగు ఆశ్రయించటం అనుభూతం.

- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

సంగీతానికి, సాహిత్యానికి అద్భుతమైన ఒక శక్తి ఉంది. రెంటికీ పులిగోళ్ళున్నాయి. ఆ గోళ్ళతో గుండెను గీకి వేదనల నెత్తురును తోడుతాయి. నెత్తురుతోపాటు అలౌకికమైన అమృతాన్ని గూడా వెలికి తీస్తాయి.

- గంగాధరం, తివాచీ

ఆరణ్యంలో చక్కగా పాడుకోవచ్చును. దుష్టమృగాలు కూడా పాడుతూవుంటే ఏమీ చెయ్యవట.

- రాజమన్నారు, ఏమిమగవాళ్లు!

అతిహేయమైన, మహానీచమైన ఈ ప్రపంచంలో దివ్యత్వంతో కూడినది ఒకటే ఉంది, సంగీతం. అది కల్లబొల్లి న్యాయాలకూ, ధర్మాలకూ, నీతులకూ, ప్రేమలకు, బోధలకూ అతీతమైనది.

- కొడవటిగంటి, దుష్టగ్రహం

వాతావరణంలో సంగీతం ఉంటే వాసాలు కూడా పాడతాయి. అందులో గగనం లేదు.

- చాసో, వాయులీనం

నిత్యజీవితంలో ఆనందానికి, ఆరోగ్యానికి సంగీతం అవసరమే. తాను పాడలేకపోయినా అర్థం చేసుకోగలిగితే ఉత్తమ సంగీతం మంచిని చేస్తుంది.

- చాసో, వాయులీనం

కూచిపూడిలో కుక్క మొరిగినా సంగీతమే.

- సామెత

## సంగీతం మేష్టరు

సంగీతపు మేష్టర్లున్నారే, వాళ్ళలో ఎక్కడో కాని పెద్దమనుష్యు లుండరు!

- వేంకటరావు, ఓన్లీడాటర్

## సంఘ చైతన్యం

జాతి గౌరవానికి, సంఘ చైతన్యానికి గడ్డీ కఱవాలి. అగచాట్లూ పడాలి. వాళ్ళకోసం, ధర్మశాస్త్రాలు కదలి రావాలి.

- వేదాంతకవి, తెనుగుతల్లి

## సంఘటన

కాలం ఒక పెద్ద పందిరైతే
సంఘటనలు చిరుమొగ్గలు
వికసించబోతున్న ఫలితాలు పూలు.

- కుందుర్తి, తెలంగాణ

## సంఘం

అది సంఘ నైజం బాబీ, పిరికివాడిమీద స్వారీ చేస్తుంది. ధైర్యవంతుడికి సవారి అవుతుంది.

- సి. యస్. రావు, పారిజాతం

వెధవ సంఘం, దివాలాఖోరుల సిండికేటు.

- కాళోజీ, దిగులు

బురదలో పడి
ఆత్మహత్య చేసుకోలేక
పురుడు పేరు చెప్పి
మూలుగుతూన్నది సంఘం

- పురిపండా, ఇన్క్విలాబ్

ప్రపంచంలోని సంఘాలన్నీ డబ్బు కలవాళ్ళ కోసమే.

- ఆత్రేయ, చావకూడదు

ఈ సంఘం దొంగలకి జెయిళ్ళ నిస్తుందేకాని వారి మీద ఆధారపడి బతికే అమాయకులకి అన్నం దొరికే మార్గం చూపించదు.

- రావిశాస్త్రి, బంగారిగాడి కత

సొసైటీ లేకపోతే షోకు లేదు.

- మద్దూరి, మధు సెన

ఈ సంఘం పాడయిపోయిన దేవాలయం లాంటిది. మనమందరమూ అందులో స్తంభాలం. ఎప్పుడూ కలుసుగోము.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

తలతు నేనిది సంఘసంస్కర
ణ ప్రయాణ పతాకగాన్.

- గురజాడ, ముత్యాల సరములు

మంచి దార్లంట వెళ్ళడానికి వాళ్ళకి సంఘం వేసే ముళ్ళకంచెలు అడ్డుంటాయి. చెట్టుకి చేర డానికి వాళ్ళకి విచ్చలవిడి వీధులే మిగిలిఉం టాయి.

- రావిశాస్త్రి, బంగారిగాడి కత

సంఘం కోరేది మానవుడి ఆనందం, క్షేమం కావు. అది కోరేది నమ్రతా, విలువలు.

- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

సంఘం వుంది చూశావు బ్రదర్! అది చితికిన వాణ్ణే చితగ్గొడుతుంది.

- రామదాసు, మాస్టర్జీ

సంఘంలో మగవాడి స్థానం వేరు. ఆడదాని స్థితి వేరు.

- మహీధర, ఓనమాలు

సంఘం ఏర్పడేవరకూ పాకులాడటం, అక్క ణ్ణించి మరి పీకులాడ్డమూనూ!

- భమిడిపాటి, అవును

కాలం చేసిన గారడిలో
కాకులు కోకిల లేకమయి
తిరుగాడే మాయలోకం
నిజాయితీలేని సంఘం!

- కె.యల్., కొత్తగుడి

ఇది సంఘము. చేస్తే ఎందుకు చేశావంటుంది. చేయకపోతే ఎందుకు చేయలేదంటుంది మరి.

- సరస్వతీదేవి, ఆదర్శాలూ-అనుభవాలూ

మన సంఘం వొక త్రికోణం: మాష్టారూ, ప్లీడరూ, డాక్టరూ దాని మూడు భుజాలు.

- బుచ్చిబాబు, ఆత్మవంచన

సంఘానికి విచక్షణ లేదు. వివేకం లేదు... ఇంతెందుకు సంఘానికి హృదయమే లేదు.

- రాజమన్నారు, మనోరమ

సంఘం అంటే ఏమిటి? భయపడేవాళ్ళను మరీ భయపెట్టే బూచి.

- సూర్యారావు, పంజరం

ఉన్నతిని ఈ సంఘ మెప్పుడును నిరసింపుచునే యుండును. ముందొక పవిత్రవ్యక్తి యీ పాడు సంఘము కొరకు ఆత్మార్పణ మొనర్చినగాని యీ సంఘమునకు బుద్ధిరాదు.

- సూరి, నా రాణి

మనిషీ... సహజంగా మంచివాడే... కానీ, ఈ సంఘంలో పడి చెడిపోతున్నాడు!

- సూర్యారావు, గాలిమేడలు

సంఘద్రోహులు పోతారు, సంఘం ఉంటుంది.

- కొడవటిగంటి, మైరావణ రక్తబిందువులు

ప్రతివాడి మాటా విని అటూ ఇటూ కదిలితే, బజారులో అమ్మే ప్రతి మందూ కొని తాగే రోగి స్థితి పడుతుంది. సంఘానికి. అందుకనే యెవ రెంత లాలించనీ, తిట్టనీ, దెబ్బలు తినే దున్న పోతు వలె సంఘం స్థిరంగా నుంచుని ఆలోచి స్తుంది. కదులుతుంది యెప్పటికో.

- చలం, మ్యూజింగ్స్

సంఘం అంటే ఏమనుకున్నావు? అది చేనుకి కంచె. చేలో మంచె. అది ఒక పత్తేదారు. తనలో వుండే ప్రతివ్యక్తి సంగతీ కనిపెడుతూ ఉంటుంది. తన మాట ప్రకారం ప్రవర్తించినవా ళ్ళను సుఖపెడుతుంది. తనమాట విననివా ళ్ళని హింసిస్తుంది.

- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

సంఘ మరణం

సవతి బాధలున్నప్పుడు షంఘ కుటుంబమంత చావు మఱియొకటి లేదు.

- పానుగంటి, వీరమతి

సంఘర్షణ

ప్రతి నేరానికీ కారణభూతంగా జీవితపు సంఘ ర్షణ ఒకటి వుండి తీరిపోతుంది.

- యజ్ఞన్నశాస్త్రి, న్యాయం

సంఘ సంస్కారి

సంఘసంస్కారముఁ జేయఁదలచిన వాఁడెవఁ

డును తన యింటిలోఁ జేయఁడు. లోకములోఁ జేయవలయుననియే చెప్పుదురు.

- విశ్వనాథ, చెలియలికట్ట

సంఘీభావం

ప్రజలలో సంఘీభావం రావాలంటే గడ్డు సమయం రావాలి.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

మనదేశములో ప్రత్యేకముగా నొక్కరొక్కరు చేయుటయేకాని, సంఘీభవించి లోకోపకారము లయిన పుణ్యకార్యములను చేసెడి యుత్తమ మార్గము నింకను మనవారు గ్రహింపలేదు.

- కందుకూరి, దానములు

సజీవ చరిత్ర

ఏ శవాన్నైనా కిరసనాయిలు పోసి అగ్గిపుల్ల గీసి తగలేసేటమే. ఆ అగ్గిపుల్ల గీయడానికి, మంత్రసాని పురుడు పోయడానికి మధ్య కలదే మానవజాతి సజీవ చరిత్ర.

- పురాణం, ఇల్లాలి ముచ్చట్లు

సత్పురుషుడు

ఇతరులు చేసిన తప్పులు మరచిపోవడం సత్పురుషుల లక్షణం.

- ఉన్నవ, మాలపల్లి

సత్పురుషుల దర్శనం సద్యోఫలం కలది.

- గురజాడ, కన్యాశుల్కం

సజ్జనుడు

సజ్జనుల గోష్ఠి యిహపర సాధకంబు.

- పింగళి, కళాపూర్ణోదయము

తనరు దినపూర్వ పరభాగ జనితమైన
ఛాయ పోలికఁ గుజన సజ్జనుల మైత్రి.

- లక్ష్మణకవి, సుభాషిత రత్నావళి

ప్రియము పలికెడువారిన పెద్ద మెత్తు,
రప్రియంబును బథ్యంబు నైన పలుకు
వినఁగ నొల్లరు.

- నన్నయ, సభాపర్వము

మనమున వేరమిఁ దలఁపమి
యును సక్షమచిత్తుఁ డగుటయును గుణములు కై
కొని దోషంబులు విడుచుట
యును నుత్తముఁడయిన పురుషు నుత్తమగుణ
ముల్.

- నన్నయ, సభాపర్వము

చెల్లియుండియు సైరణ సేయునతఁడు
బేదవడియును నర్థికిఁ బ్రియము తోడఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండుఁ బుణ్య
పురుషు లని చెప్పి రార్యులు గురువరేణ్య.

- తిక్కన, ఉద్యోగపర్వము

తను లోకము గొనియాడఁగ
వినియుబ్బఁడు సజ్జనుండు వెండియుఁ గడు మే
లొనరించుఁ గీ డొకించుక
యును దన దెసఁ దోఁపనీక యుడుపుచు వచ్చున్.

- తిక్కన, ఉద్యోగపర్వము

పురుషుండు రెండు దెఱఁగుల
ధర నుత్తముఁ డనఁగఁబరఁగుఁ దా నెయ్యెడలం
బరుషములు పలుక కునికిన్
దురితనంబులు వొరయు పనులు దొఱఁగుటక
తనన్.

- తిక్కన, ఉద్యోగపర్వము

తమ విద్య నెవ్వ రేమా
త్రము గనఁ జాలుదురు వారిదండను తన్మా
త్రమ ప్రకటింతురు బుధు లు
త్తముల మహిమ నీరుకొలఁది తామర సుమ్మీ.

- పింగళి, కళాపూర్ణోదయము

సత్పురుషచిత్తము నొచ్చిన రిత్త వోవునే.

- పింగళి, ప్రభావతీ ప్రద్యుమ్నము

నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు.

- లక్ష్మణకవి, సుభాషిత రత్నావళి

సజ్జనులుగారె పరహితాచరణ మతులు.

- లక్ష్మణకవి, సుభాషిత రత్నావళి

సాధు సంగంబు సకలార్థ సాధనంబు.

- లక్ష్మణకవి, సుభాషిత రత్నావళి

అనిష్టము ల్గని యు
పాయబలంబునఁ ద్రోచుఁగాక స
జ్జనుఁ డధముండువోలెఁ గను
సన్నను జావ నుపక్రమించునే?

- అనంతుడు, భోజరాజీయము

నాడి యట్టుల చేయు వారలుం
బనివడి మున్ను గొన్నటులు
పైకొని యప్పులు దీర్చువారలుం
బొనరిన మేలు గీడులకుఁ
బొంగక క్రుంగక యుండువారలున్
మనుజులలోన నుత్తము ల
మర్త్యులు మెత్తురు తచ్చరిత్రముల్.

- అనంతుడు, భోజరాజీయము

సంచారం

అయ్యవారేమో దేశసంచారం; అమ్మవారేమో గ్రామసంచారం.

- చిలకమర్తి, పలుగురాముడు

సడి

సడి కంటెఁ జావు మేలను
నాడువు పురాతనము.

- అనంతుడు, భోజరాజీయము

సత్కారం

ఘనులకేగద నేడు సత్కార సభలు.

- మాలకొండారెడ్డి, మడివేలు

సత్తువ

చాప చిరిగినా చదరంతని, నీ ప్రాణానికి యిప్పటి సత్తువే ఉడ్డోలంలా కనబడుతుంది.

- గురజాడ, కన్యాశుల్కం

సత్ప్రవర్తన

తగిన వేసంబు తనుఁ దాన పొగడుకొనమి
నొచ్చియును గీడు వలకమి యిచ్చి వగవ
కునికి తనకెంత నడవక యున్నఁ బథముఁ
దప్పకుండుట నడవడి కొప్పు సేయు.

- తిక్కన, ఉద్యోగపర్వము

సత్యం

మానవాళి కాంక్షించి సలిపే ఘోరరణం
మహోన్నత సత్య శిఖరారోహణం

- అనిశెట్టి, స్వీయచరిత్ర

సత్యమెంతయో హానికరము, భీతావహము

- వరద, నాట్యగోష్ఠి

బైట పడటానికి ఎంతో బాధ పడుతుంది సత్యం.

- బుచ్చిబాబు, రాయల కరుణకృత్యం

సత్యానికి సంఘంలో తావు లేదు.

- బుచ్చిబాబు, ఆత్మవంచన

సత్యం ఏకంగా హృదయాన్నే బలి కోరుతుంది.

- బుచ్చిబాబు, ఒమర్ ఖయామ్

సత్యంబు నహింసయు నను
సత్యుత్తమ ధర్మయుగళమందు నహింసన్
సత్యముఁ గాచుట ధర్మ మ
సత్యమున నహింసఁ గావఁజను నండ్రు బుధుల్.

- తిక్కన, కర్ణపర్వము

నడవడియను మున్నీటం
గడవం బెట్టంగ నోడ కరణిం దగి తా
నొడఁగూడు ననిన సత్యముఁ
గడిచిన గుణ మింక నొండు గలదే యరయన్?

- తిక్కన, ఉద్యోగపర్వము

శివ సుందరాలకి సత్యం బేస్ లాంటిది.

- తిలక్, కొనకళ్ళకు అక్షరాంజలి

కల్పించిన మాట కలవారి నోట కఠోర సత్యం.

- పులికంటి, లోకం నవ్వింది

మనసు లేంది సత్యం లేదు. మనసు స్వభావమే కల్పన. ఇంక సత్యం ఎట్టా దొరుకుతుంది మానవుడికి?

- చలం, మ్యూజింగ్స్

విటులకు సత్యము లేదు. వేశ్యకు నియమము లేదు.

- చలం, శిలాదిత్య

లోకములో సత్య బలమును ధర్మబలమునే బలములుగాని యవిలేని యధికార బలమును, విత్త బలమును బలములు కావు.

- కందుకూరి, స్వీయచరిత్రము

సత్యానికి వక్కటే మార్గం కాని అబద్ధానికి అన్నీ మార్గాలే.

- కందుకూరి, ప్రహసనములు

మొహం ఎదుట సత్యం మాట్టాడగలిగిన మొగతనం నాగరికతలో కనపడదు.

- భమిడిపాటి, బాగుబాగు

సాక్ష్యంతోనే సంబంధంకాని, సత్యంతో సంబంధం లేదు.

- రావిశాస్త్రి, మాయ

ఎప్పటికన్నా సత్యానికే జయం.

- మారుతీరావు, అనంతం

సత్యం సహజంగానే భయంకరంగా వుంటుంది!

- అనిశెట్టి, గాలిమేడలు

ప్రపంచ వ్యవహారములందు సత్య మసత్యముతోఁ గొంతయైనఁ గలిసియుండవలయును. వట్టి సత్యము దక్కనేరదు. వర్తకుల ప్రకటన దర్పములు, భేషజతంత్ర వీరాలాపములు, గ్రంథకర్తల గ్రంథములం గూర్చిన స్తుతివాక్యాడంబరములు మొదలగునవి యిందులకు నిదర్శనములు.

- పానుగంటి, సాక్షి

సంభూత మొకటే నిజం!

సంభావ్యం ఒక యోచన.

- బైరాగి, చెప్పనిది

సర్వ మసత్యం, ఒకటే సత్యం
ఎల్లబాటలూ వల్లకాటికే,
ఓటమి తథ్యం, ఓటమి సత్యం
అన్ని పాటులూ భంగపాటుకే.

- బైరాగి, ఒకే సత్యం

సత్యమును పరీక్షింపవా రీలోకములో నెన్ని కష్టములనయినను పడవలెను.

- కందుకూరి, సత్యరాజాపూర్వదేశయాత్రలు

సమర్థులయినవారు వ్రాయకపోవుటచేత సత్యము సహితము కొన్ని సమయములందు మనోహరముగా నుండకపోవచ్చును.

- కందుకూరి, సత్యవతీ చరిత్రము

## సత్యమార్గం

సత్యమార్గమున నడుచు వారిని జనాభిప్రాయము పూర్వాచారము నిలుపఁజాలవు.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

## సత్యసంధుడు

నిజం చెప్పేది పసిబిడ్డలూ, తప్పతాగినవాళ్ళూ

- సామెత

## సత్రకాయ

పానంమీదికి వచ్చివుండప్పుడు దేన్నైనా, హింకో సత్రకాయ వుండాలి.

- వేదాంతకవి, తెనుగుతల్లి

## సద్బ్రాహ్మణుడు

సద్బుద్ధి కలవాడే సద్బ్రాహ్మణుడు.

- రావిశాస్త్రి, పిపీలికం

## సంతానం

కొడుకు ఒక్కడు చాలు కుల ముద్ధరించా
కూతు రొక్కతె చాలు గోత్రాలు పాడా

- జానపదగేయం

ఆడదానికోర్కెల బలమో యేమో
చక్రవడ్డీలా పిల్లలు పుట్టుకొస్తూనే వున్నారు.

- వరవరరావు, ఆపరేషన్!

మంచివాళ్ళో, చెడ్డవాళ్ళో తన సంతానం అంటూ వుండాలి. ఆ సంతానాశ భగ్నం అవుతున్నా మనుష్యుడు నిర్వికారంగా పునఃకల్పన చేస్తూనే వున్నాడు.

- మహీధర, ఓనమాలు

సంతాన ప్రాప్తే మన దాంపత్య ధర్మం.

- బుచ్చిబాబు, గొలుసు

ఆరుగురు సంతానం గలవాడు, పిల్లల్ని నిర్ణీతం చేసుకోండని ప్రచారం చేస్తే ఎవడు వింటాడు?

- బుచ్చిబాబు, గొలుసు

ప్రతివాడికీ మంచి సంతానం కలగాలనే కుతూహలం వుంటుంది. ఫలితం మాత్రం దైవాధీనం.

- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

## సంతృప్తి

సంతృప్తిని మించిన సంపద లేదు.

- బుచ్చిరెడ్డి, మల్లెదీపం

## సంతోషం

పంజరం అందంగా ఉంటే పక్షికి సంతోషమా?

- సామెత

సంతోషం సగం బలం.

- సామెత

సంతోషానికి సాకు లేదు. ఆలోచనకి అంతులేదు.

- సామెత

## సంతోషకరం

దొరల చేత పని చేయించుకుంటూ వాళ్ళ దగ్గర నుంచి సలాము లందుకుంటోంటే మహా సంతోషంగా ఉంది.

- మొక్కపాటి, బారిస్టరు పార్వతీశం

అధికార్లకి ఇతరుల సమక్షంలో తమ సబార్డినేట్సు మీద ఎగరటం వారికి చాలా సంతోషకరమైన కార్యక్రమాల్లో ముఖ్యమైనది.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

## సందడి

పెండ్లి సందట్లో పుస్తెకట్టడం మరిచాడు.

- సామెత

## సందర్భానుసారం

చావునకేమి యెప్పుడైనఁ జావవలసినదే. రవంత సందర్భానుసారముగఁ జచ్చిన బాగుండెడిది.

- కాళ్ళకూరి, వరవిక్రయము

## సందిగ్ధం

చేద్దామా వద్దా అనుకుంటున్న దొంగ పనికి ఏమాత్రం అవాంతరం వచ్చినా, మనుసు తేలిక పడుతుంది.

- పాప, రామరాజ్యానికి రహదారి

చదవమంటే శ్రోతకు కోపం - వద్దంటే కవికి కోపం.

- శ్రీరమణ, న్యూనుడి

చిత్తం సీరియల్ మీద, చూపు కవరు పేజీమీద.

- శ్రీరమణ, న్యూనుడి

జాబితా ఖరారు అయాక జారే దెవరో, దూరే దెవరో?

- శ్రీరమణ, న్యూనుడి

చంపితే జీవహింస
వదిలేస్తే జనహింస

- సూర్యప్రకాశ్, జీవహింస

## సందేహం

అల్లుణ్ణి సినిమాలలో జేర్పిస్తే లాభదాయకమే గాని కూతురి కాపరం నిలుస్తుందా అన్న సందేహం.

- చిరంజీవి, బోలోస్వతంత్రభారత్‌కీ జై

ఎవరి కిచ్చెదొ రాజ్యమ్ము నెఱుఁగ జెపుమ.

- తి.వేం., పాండవాశ్వమేధము

అంతా మంచివాళ్ళుగా మారిపోతే నాపనేం గాను?

- దివ్యప్రభాకర్, శిరోమణి

సంశయగ్రస్తు లెన్నండును వీరవ్రతంబు నిర్వ హింపఁజాలరు.

- తి.వేం., బాలరామాయణము

## సంధి

సమబలుతోడఁ జేయఁదగు
సంధి, బలాఢ్యునితోడ సంధియున్
సమరముఁ గాదు, హీను నెడ
సంధికి నియ్యకొనంగఁ జెల్లదు.

- కంకంటి, ఉత్తరరామాయణము

తమకు బలం బెక్కిన తఱి
సముచిత మగు విగ్రహంబు, శత్రుల కుత్సా
హము మీఱినపుడు గర్త
వ్యము సంధి యనంగ విందు మార్యులచేతన్

- తిక్కన, శల్యపర్వము

## సంధికాలం

భావప్రపంచంలో నుంచి భౌతిక ప్రపంచంలోకి మారేటప్పటి సంధికాలమే మనుష్య జీవితంలో మిక్కిలి రసవత్తరమైన భాగం. సర్వ జంతుసామాన్యమైన ఈ మార్పు మానవుని తన మానవత్వంనుండి దేవత్వంవంక ఒక మెట్టెక్కిస్తుంది.

- ఉన్నవ, మాలపల్లి

## సంధ్య

అసురసంధ్య రాత్రి వంతెనమీంచి నడిచి
చీకటి కన్నీటి నదిని తరించి
ఉషస్సంధ్య అవుతుంది.

- హెచ్చార్కె, కంట్రోల్ ది కంప్యూటర్

## సన్నాహం

కరెంటు తీగలపై పిచ్చుకల సమావేశం
ఒకటే పిచపిచలు - అంతులేని తీర్మానాలు
కాకులనుండి రక్షణ సన్నాహాలు.

- సంజీవరావు, ఉదయంకోసం

## సన్నిహితుడు

మన సారథి మన సచివుఁడు
మనవియ్యము, మనసఖుండు, మనబాంధవుడున్
మనవిభుఁడు, గురువు, దేవర
మనలను దిగనాడి చనియె మనుజాధీశా!

- పోతన, భాగవతము

బ్రాహ్మణుడూ, హరిజనుడూ- ఈ మాటలకి అర్థం లేదనేవాడికన్న హరిజనుల్ని, బ్రాహ్మణుల్నీ ద్వేషించేవాడే సన్నిహితుడు.

- చలం, మ్యూజింగ్స్

## సన్మానం

ఇంక వీడు ఎందుకూ వుపయోగపడడు. ఎవడికీ పోటీ రాడు. మూలపడ్డ చచ్చుదద్దమ్మ అని నిర్ణయించుకున్న తర్వాతే సంఘం సన్మానానికి ఒడిగడుతుంది.

- బుచ్చిబాబు, షష్టిపూర్తి

సన్మానం జరక్కపోతే వచ్చిన నష్టంలేదు. దాని వల్ల వచ్చే అధికకీర్తి లేదు. కలంలో బలం ఉండి వ్రాస్తే మంచిది.

- పుల్లాభొట్ల, కథఅడ్డంతిరిగింది

సన్మానాలు నిబద్ధం. సంఘసేవ అబద్ధం.

- శ్రీరమణ, న్యూనుడి

## సన్యాసం

సన్యాసం కూడా ఆత్మహత్యేనన్నారు పెద్దలు.

- ముళ్ళపూడి, ఋణానందలహరి

ఇప్పుడు సన్యాసంపుచ్చుకొందామన్నా ఇచ్చేవాళ్ళెవరున్నారు?

- మహీధర, కత్తులవంతెన

సంసారం బాగాలేదని సన్న్యాసం పుచ్చుకుంటే బూడిద, బుర్రకాయ గాడిద బరువైనాయట.

- సామెత

### సన్న్యాసి

సన్న్యాసులకు ఆకలేమిటి? దప్పిక ఏమిటి? శరీరము నిలవదేమోయని నాలుగు కబళములు తింటాము.

- *చిలకమర్తి, దంభసన్న్యాసి*

జడలు గట్టనేల? సన్న్యాసి కానేల?
నొడలు విబుచుకొనెడి యోగమేల?
ముక్తికాంతc బట్టి ముద్దాడనేకదా?

- వేమన

సన్న్యాసి అయినవాడు మేస్టరీ పదవికి రంగున సరిపోతాడు, అడక్కపోటం అటుంచి ఇచ్చినా పుచ్చుగోకుండాను.

- *భమిడిపాటి, మేస్టరీకూడా ఒక ఉద్యోగమేనా?*

మత విషయకంగా లోకాన్ని పాలించేది సన్న్యాసులు.

- *విశ్వనాథ, ముగ్గురుబిచ్చగాళ్ళు*

ఎవర్నీ హింసించకుండా వుండేవాళ్ళు సన్న్యాసులు.

- *వేదాంతకవి, ఆకలిమంట*

కాషాయాంబరధారి సైతము వృథా
కాపట్యమున్ బూనెడిన్.

- *కొడాలి, గాంధీ మహాత్ముడు*

### సబబు

మనిషికి మనసే సబబు.

- *గురజాడ, కొండుభట్టీయము*

### సభాపతి

పౌరోహితుడు లేకుండ పెండ్లి నడుప వచ్చును. పోసగువాడు లేకుండ సంత సాగింపవచ్చును. భోక్త లేకుండ తద్దినము కడతేర్చవచ్చును. కాని వార్షికోత్సవము మాత్ర మగ్రాసనాధిపతి లేకుండc దెప్పదాటించుటకు వీలులేకపోవును.

- *పానుగంటి, సాక్షి*

### సమఉజ్జీ

రాబందుల రాజ్యంలోపల
ఆంబోతులే అమాత్యులు కదా మరి!

- *ఆరుద్ర, రొండేరోకళ్ళు*

మామగారు నిష్ఠాగరిష్ఠుడు - అల్లుడు నిషాగరిష్ఠుడు.

- *శ్రీరమణ, న్యూనుడి*

### సమత

సర్వభూతములందును సమత మేలు,
కరుణ చేపట్టవలయుcగాc గాదుహింస.

- *శ్రీనాధుడు, కాశీఖండము*

సమశీల శ్రుతయుతులకు
సమధనవంతులకు సమసుచారిత్రులకుం
దమలో సఖ్యమును వివా
హమునకుc గా కగునె రెండు నసమానులకున్

- నన్నయ, ఆదిపర్వము

సమత లేని రిత్త చదువేల? పదివేల
మతము లేల? నూరు వ్రతము లేల?

- జాషువా, నాకథ

కాలేజీ చదువులు, యూనివర్సిటీ పరీక్షలు, హాస్టళ్ళలో జీవనం, హోటళ్ళలో భోజనం ఇవన్నీ దేశంలోని వివిధకులాలవారి సంస్కార భేదాల్ని చదును చేసేస్తున్నాయి.

- మహీధర, కత్తులవంతెన

గులకరాయి తక్కువలేదు. కొండ యెక్కువ లేదు. మసి బొగ్గుకంటె మాణిక్యము హెచ్చు కాదు. పరమాణువుకంటె భానుc డధికుcడు కాcడు. పురుగుకంటె నరుc డుత్కృష్టుcడు కాcడు. సృష్టిలోని యన్ని వస్తువులు నాకొక్కటే.

- పానుగంటి, సాక్షి

"వియ్యమునకు, కయ్యమునకు, నెయ్యమునకు సమత వలయు"నని యూరక వెర్రివెంగళపై వ్రాశాడా! ఏ జమిందారు పుత్రికతోనో చీవాట్లు తిని మరీ వ్రాసుంటాడు.

- బాలసరస్వతి, భక్తతుకారామ్

### సమంజసం

చింతకు చిగురు - అంచుకు తొగరు
గొల్లకు తగరు - పిల్లకు పొగరు

- వేంకటరావు, బొమ్మ చిలుకలు

### సమదృష్టి

అందరి స్త్రీలనూ ఒకే రకంగా చూడగలిగిన వాడు భార్యను సుఖపెట్టలేడు.

- గోపీచంద్, ఆత్మగతం

పతాకం జనతాది - పాలసీ కాంగ్రెస్‌ది.

- శ్రీరమణ, న్యూనుడి

మహాభారతాన్ని గానివ్వూ, మందుల కేటలాగును గానివ్వూ, సమదృష్టితో చూడగల్గిన చిల్లరకొట్టు

వర్తకులు దాన్ని చించి పొట్లాలు కడతారు.
- రాజారాం, ధర్మగ్లాని

సమయం

కడుపునిండిన సమయమున విపరీత భావన లేమియు నుండవు.
- విశ్వనాథ, బద్దన్న సేనాని

గూట్లో దీపం, నోట్లో ముద్ద.
- సామెత

సమర్థత

ఎటులైనను గప్పను బట్టినది పాము - కాంతు నేలినది కాంత.
- పానుగంటి, ముద్రిక

లీల గుడి మ్రింగువానికి లింగ మెంత?
- చిలకమర్తి, గయోపాఖ్యానము

తనలో ఉన్న గొప్పతనాన్ని సంగం యావత్తూ గుర్తించాలనే తాపత్రయం నరజాతిలో దాహంలా పనిచేస్తూ ఉంటుంది. అలా గుర్తిం చబడుతున్నట్టు తోచినప్పుడు మానవుడు యెలాంటి తారాపథాన్నికైనా లేచి యెలాంటి ఘనకార్యాలు సంఘటించటాన్నికైనా పూనుకుం టాడు. ప్రాణానికి తెగించి సమర్థించుతాడు. అలా కాకుండా తన సమర్థతను యెవడూ గుర్తించలేదని తోచినప్పుడు, జీవితంలో నిరాశ పుట్టుకొచ్చి దమ్మిడీకి కొరగాకుండాపోతాడు.
- సూరి, చంఘీజ్ ఖాన్

సమర్థన

కాపీ నవలకు అవార్డు ఇచ్చారేమంటే, ఉత్తమ అనువాదంలే పొమ్మనట్టు.
- శ్రీరమణ, న్యూసుడి

తాగినా, తందనాలాడినా, దొంగతనం చేసినా, ఖూనీలు జరిపినా ఎవడు చేసే పనిని వాడు సమర్థించుకుంటూనే ఉంటాడు.
- రంగనాయకమ్మ, పేకమేడలు

ప్రతి బూతునూ, అవినీతిని, హత్యల్ని, కిరాతక చర్యల్ని, హింసనూ, మంచిని చెడుగానూ, చెడును మంచిగానూ, సమర్థించి నమ్మేందుకు మన భాషకి చచ్చేన్ని మాటలూ, వాటిని పంపి ణీచేసేందుకు తల వెంట్రుకలన్నీ పత్రికలూ, వేదిక లెక్కి, గొంతులు చించుకునేందుకు సరిప డినన్ని ముఠాలు మనకు కొల్లలుగా వున్నయ్!
- మా గోఖలే, కూనేశ్వరుడికిచ్చిన అదృష్టం

వయస్సు వచ్చిన తరువాత సంభోగం లేకుండా వుంటే అనేక రోగాలు పుడతవని అనేకమంది డాక్టర్లు చెప్పినారు. నేనిప్పుడు దేహం కాపాడు కోవటం నిమిత్తమే వేశ్యను వుంచుకున్నాను గాని మరివకటి కాదు.
- కందుకూరి, హాస్యసంజీవని

సమర్థుడు

అతిసమర్థుల కిల నసాధ్యంబు లేదు
పోల నుద్యోగికిని దూరభూమి లేదు
విద్యగల వాని కెందును వింతలేదు
వఱలఁ బ్రియవాదికిని శాత్రవంబు లేదు.
- దూబగుంట, పంచతంత్రము

ఉద్యోగికి దూర భూమియు విద్వాంసునకుఁ బరదేశమును బ్రియవాదికి శత్రువును లేని యట్లు బుద్ధిమంతున కసాధ్య మొకటి లేదు.
- చిన్నయసూరి, మిత్రభేదము

రాజతంత్ర మేం జేసినా దీన్ని న్యాయ సమ్మ తంగా సమర్థించగల పండితు లెప్పుడూ కాలికి సిద్ధంగానే ఉంటారు.
- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

సమర్థులయిన వారు వ్రాయకపోవుటచేత సత్యము సహితము కొన్ని సమయములందు మనోహరముగా నుండక పోవచ్చును.
- కందుకూరి, సత్యవతీ చరిత్రము

సమస్య

సమస్యను పరిష్కరించలేకున్నా మనమంతా సమస్యలో భాగమే!
- నిఖిల్, తిరిగి లక్షలాదిమందితో

సమస్యలు సంస్కారాన్ని అణగద్రొక్కుతాయి.
- సులోచన, మామూలు మనిషి

ఒకడయితే సమస్యకు ఒక సమాధానం చెబు తాడు. పదిమంది అయేటప్పటికి, పది సమాధా నాలు చెప్పే సదుద్దేశంతో పది సమస్యలు తీసుకు వస్తారు.
- మాచిరాజు, తెలుగు పేరడీలు

ఒక సమస్యని పరిష్కరిస్తే ఆ సమస్యా పరి ష్కారంలోనుంచే మరొక సమస్య పుట్టుకొస్తుం దని పెద్దలు చెబుతున్నారు.
- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

సమస్యల వలన చైతన్యం వస్తుంది, సమస్యల

పరిష్కారంతో సమాజం ముందుకు పోతుంది.

- కాంతారావు, వంశధార

సమాజం

నేటి సొసైటి విశాఖపట్నం ల్యూనటిక్ ఎసైలంలా తయారయింది.

- విజయలక్ష్మి, మహాప్రస్థానపర్వం

కుళ్ళిన సమాజపు దుర్గంధం
కొట్టుకపోయే నీటి చందం!

- దాశరథి, ఉషస్సంధ్య

సంఘం ఒక చెట్టు లాంటిది! అందులో ప్రతి మనిషీ ఒక రెమ్మ. ఒక రెమ్మ విషయం మరో కొమ్మకి అవసరం లేదని అన్నా వినిపించుకోదు. ఎదురుగా కన్పిస్తున్న దాన్ని గురించి పట్టించుకోవద్దన్నా మానదు.

- సులోచనారాణి, సంసారరథం

మట్టి కుండలు మాత్రమే చెయ్య గలిగిన సమాజం కంటే అందమైన శిల్పాలు చెయ్యగలిగిన సమాజం మరింత పరిణతి పొందినది.

- కొడవటిగంటి, అనామిక

సమాజం క్రూరమైనది. గౌరవముగా బ్రతుకు స్త్రీలను హింసిస్తుంది. నీచముగా బ్రతుకు స్త్రీలను పూజిస్తుంది.

- సురవరం, ఖిస్మత్

పాము-తను పగపట్టిన వ్యక్తిని మాత్రమే చంపుతుంది- కాని సమాజం తరతరాల వాళ్లనూ అధఃపతితులుగా చేసేందుకు ప్రయత్నిస్తుంది.

- ధనికొండ, పవిత్రులు

సమాజంలో నాకు స్థానంలేదు. అందుకని అది ప్రతిపాదించిన నీతి నేనామోదించను.

- బుచ్చిబాబు, రాయల కరుణకృత్యం

మానవుల అవస్థలను తెలుసుకోవాలంటే వారితో లీనమైపోవాలి.

- గురజాడ, సంస్కర్త హృదయం

సంస్కరణంటే యిదే! ఒకరిని లేవనెత్తబోయి మనమే కిందబడ్డం.

- గురజాడ, సంస్కర్త హృదయం

ఈ లోకంలో మనుష్యుడి భావాలకీ, ఆదర్శాలకీ స్థలంలేదు. ఎక్కువ దయ గలిగిన వాళ్ళు, సత్యవంతులూ మాడి నశించిపోతారు.

- చలం, హంపీకన్యలు

పరమార్థం సామాజిక సామూహిక సద్వర్తన

- శ్రీశ్రీ, సదసత్సంశయం

స్త్రీని, భర్త, ఆమె తరుపు బంధువులు ఏమయినా చేసుకోవచ్చుననే సిద్ధాంతం జీర్ణించుకున్న సమాజం ఇది.

- ఆనందారామం, అద్దంలో శత్రువు

సమాజానికి మనసు, ఆలోచన వగైరా వుండవు. పైపైన చూసేకళ్ళు, పైకి వినిపించే మాటలు, వినే చెవులు మాత్రమే ఉంటాయి. దాన్ని తప్పుపట్టి ప్రయోజనం లేదు.

- ఆనందారామం, అద్దంలో శత్రువు

సమాధానం

కొంపదీస్తివి రామన్నా! అంటే అందుకు సందేహమా అన్నట్లు.

- సామెత

ముసలమ్మా! బుర్ర వణికిస్తావేమి అంటే, వూరకుండి నేనేమి చేస్తానన్నదట.

- సామెత

జాబురాసి పెట్టమంటే, కాళ్ళు నొప్పులంటే, వాటితో పనేమంటే నేను రాసింది నేనే చదవాలన్నాడట.

- సామెత

తిన్న ఇంటి వాసాలు ఎంచుతా వేమిరా? అంటే పొరుగింటి సంగతి నాకేమి తెలుసు అన్నాడట.

- సామెత

గంతకట్టేదా? బసవన్నా అంటే ఉహుం అని, గుగ్గిళ్ళు తింటావా? అంటే ఆహా అన్నదట.

- సామెత

దండవయ్యా బాపనయ్యా! అంటే మా తండ్రి నాటి పాతబాకీ ఇచ్చి పొమ్మన్నాడట.

- సామెత

పచ్చి కంకులోయి దాసరీ! అంటే రాలినవరకే రామార్పణం అన్నాడట.

- సామెత

నంగీ! నమలక మింగవే అంటే ఉడికిన చేపలు కరుస్తవి అన్నదట.

- సామెత

యజ్ఞానికి ముందేమిటంటే తలక్షవరం అన్నట్లు.

- సామెత

కోటిపల్లి గుళ్ళు ఎవరు కట్టించారో తెలియదు

గాని, అంతర్వేది గుళ్ళు నేను కట్టించలేదు అన్నాడట.

- సామెత

కుర్రవాడి గుణగుణాలు తెలుసునుగాని, చెవుల కమ్మల సంగతి మాత్రం తెలీదు అన్నట్లు.

- సామెత

## సమానత్వం

నిశ్చలంగా పనిలేకుండా సుఖంగా కూచోడం రెండు రకాల వాళ్ళకే చాతనవుతుంది - పశులకూ - ఋషులకూ.

- చలం, మ్యూజింగ్స్

సిద్ధులకూ, సిగ్గు విడిచిన వాళ్ళకూ పవిత్రత అపవిత్రతా అంటూ లేదు!

- ఆమంచర్ల, విశ్వాంతర

తెలివతక్కువ పనులు అందరం చేస్తాం.

- కొడవటిగంటి, జీవితేచ్ఛ

స్త్రీ పురుష సమానత్వమనేది చొక్కాలూ పేంట్లూ తొడుక్కుంటే రాదు. క్రాపింగులు పెట్టుకున్నంత మాత్రాన ఏర్పడదు.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

## సమానం

నీకు కొమ్ములుంటే నాకు కోరలున్నాయి.

- రావిశాస్త్రి, ఋక్కులు

రాజకీయం సిగ్గెరుగదు - కవిత్వం పొద్దెరుగదు.

- శ్రీరమణ, న్యూసుడి

ఏసిన వత్తికీ పోసిన చమురుకూ సరిపోయినదన్నట్లు.

- సామెత

డబ్బు రుచి తెలిసిన మనిషి, మనిషి రక్తం రుచి తెలిసిన పులి ఒక్కటే!

- చిన్నబాబు, డబ్బు

దోసకాయలు తిన్న కడుపు దొంగలుపడ్డ ఇల్లు ఒకటే.

- సామెత

లంక మేతకు, ఏటి ఈతకు సరి.

- సామెత

చుట్టుడు చాప, విసురుడు తలుపు, పెడసరపు పెండ్లాము.

- సామెత

ఏరు విడిచిన మొసలి- నీరు విడిచిన చేప.

- సామెత

పాలేరువానికి పశువు పోయినా, మారుదల్లికి బిడ్డ పోయినా దిగులులేదు.

- సామెత

పాము కరచును, అరవ చెరచును.

- సామెత

తెలివిలేని పట్టుదల, పొయ్యిలో ఇమడని నిప్పు, కళ్ళెంలేని గుర్రం.

- సామెత

సొంతానికి ఏనుగు, ఉమ్మడికి పీనుగు.

- సామెత

గంగాస్నానం, తుంగా పానం.

- సామెత

సుఖమెరుగని బ్రతుకు సున్నమేయని విడెం.

- సామెత

వడ్డించే వాళ్ళు మన వారయితే కడపటి పంక్తిన కూర్చున్నా ఒకటే.

- సామెత

వేపారివానికి చేసిన మేలు - పీనుగకు చేసిన శృంగారం.

- సామెత

వసుధపై నూకలున్న సంపన్నుం డెంతా
బడుగు పేదయు మృత్యుదేవతకు నంత!

- జాషువా, స్వప్నంకథ

ఆస్తి, ఐశ్వర్యము అందరికీ సమానం అయితే కుక్కలే అక్కరలేదు.

- బాపిరాజు, కోనంగి

పోలీసు బిడ్డా షావుకారు బిడ్డా సమానులే

- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

ఒక పోలీసువాడు వెయ్యి దేవుళ్ళతో సమానం.

- రావిశాస్త్రి, అధికారి

విలువగల వస్త్రధారణ విషయమున విధవలును, సన్యాసులును సమానులే!

- బాలసరస్వతి, భక్తతుకారం

గంగ ఈతకు, గరిక మేతకు సరి.

- సామెత

పెద్దపులి చాటుకు చేరిన ఎలుకను నమిలే గండుపిల్లి నల్లితో సమానం.

- సామెత

కొండముచ్చు పెండ్లికి కోతి పేరంటాలు.

- సామెత

తగ్గ తాళం - కొయ్యమేళం!

- సామెత

లోకంబు కాముకుండుఁ
గవియు నున్మత్తుఁ డొకరాశిగా గణించు.
- దీపాల, కవి - సృష్టికర్త

తాడిచెట్టునీడ, తగులుకొన్న ముండ సమానమ న్నట్లు.
- సామెత

కలుపు తీయని మడి, దేవుడు లేని గుడి.
- సామెత

కలిమి లేములు కావడికుండలు.
- సామెత

ఎంత విట్టుకి అంత నవ్వు.
- శ్రీరమణ, న్యూనుడి

## సమానుడు

త్రాగినవాఁడు, ఉద్ధతుల
దావునఁ గీడ్పడువాఁడు, లేమికిన్
లోఁగినవాఁడు, పొల్తి వల
లోఁబడి యూగినవాఁడు, భీతిచే
గ్రాఁగినవాఁడు, తెల్వి వెను
కంబడి సూటిగ నున్న దున్నటుల్
వాగినవాఁడు, జాగ్రదుప
వాసమువాఁడు సమాను లందరున్.
- కృత్తివెంటి, పిచ్చివాడు

చెలిమియు సంభాషణమును
బలిమి వివాదంబుఁ ద్రోపుఁబాడియుందమయం
తలవారితోన తగు నది
కులహీనులతోడనైనఁ గొఱగా దధిపా!
- తిక్కన, ఉద్యోగపర్వము

పిచ్చివాడూ, కవీ, ప్రేమికుడూ, ముగ్గురూ దట్ట మైన భావనాటవిలో దారి తప్పిన వాళ్ళు
- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

ఆకటావికటపు రాజుకు అవివేకి ప్రధాని, చాద స్తపు పరివారం.
- సామెత

తప్పుచేసిన వానికి, అప్పుచేసిన వానికి ముఖం చెల్లదు.
- సామెత

## సమితి

సమితి అంటే గురూగారూ! సర్వం మిగల కుండా తినేయడం.
- భూషణం, ఊరిమీద కథ

## సమిధ

ఆదర్శాల యాగంలో
అంతరాంతరాల హవిస్సులో
ప్రతి మనిషీ ఒక సమిధ
- విజయకుమార్, సంపూర్ణాసంపూర్ణం

## సముద్రం

నువ్వంటే బావకి సముద్రం అంత వలపు.
- బుచ్చిబాబు, ఉత్తమాయిల్లాలు

తొక్కిసలాడుకుంటున్న క్రిక్కిరిసిన జన సము హంలో ఎవ్వడూ తన కదలికకు బాధ్యుడు కానట్లే అనేక ప్రకృతిశక్తుల్లో నేనూ ఒకణ్ణి. ఏంచేయగలను? అంటాడు కడలి రాజు.
- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

## సంపద

బలహీనుడు సంపద సృష్టిస్తాడు
బలవంతుడు సంపద మింగి దరిద్రం పంచు తాడు
- నగ్నముని, కొయ్యగుర్రం

సంపద లబ్బెనేని
లేబరమ కాదె బిడ్డలు లేని బ్రతుకు?
- నాచనసోమన, ఉత్తరహరివంశము

కడులచ్చి గలిగెనేనియుఁ
గుడుతురు గట్టుదురుగాక కొడుకుల నగుచున్
బడుగుల వాడలపైఁ బడ
విడుతురె?
- పోతన, భాగవతము

సంపద్దినములు పరోక్షములు, కష్టదినములు ప్రత్యక్షములు. భాగ్యదేవత పెట్టుకున్న ముద్దు గాలి కెగిరి పోవునుగాని, కొట్టిన లెంపకాయ, కాటివఱకు నిల్చును.
- పానుగంటి, సాక్షి

బంగారము హెచ్చగు కొలఁది సింగారము హెచ్చ గుచున్నది. సంపద లెదిగిన కొలఁది సాత్వికము తగ్గుచున్నది. సౌఖ్యవాంఛ హెచ్చగుచున్నది.
- పానుగంటి, సాక్షి

లేనివాఁడు లేదని యేడుపు. ఉన్నవాఁ డంతకంటె నెక్కువ లేకపోయెనేయని మఱింత ఏడుపు.
- పానుగంటి, సాక్షి

గుణసంపత్తియు ధనసంపత్తియు, నొక్కచోట నుండుట యరుదుగదా! మఱచినీళ్ళ చెఱువులో

నీళ్ళు మిగులునా?

- తి.వేం., మృచ్ఛకటికము

బల్లిదుల దోషములు పొరపాటు లగును
దుర్బలుల పొరపాటులు దోషము లగు
చేవగలవాని పంతమె చెల్లుగాని
బలవిహీనుని మాటలు పాటియగునె?

- చిలకమర్తి, గయోపాఖ్యానము

మనసొమ్ము చెడ తిని కొవ్వున్నాడు.

- గురజాడ, కన్యాశుల్కం

రూపాయల గాలి సోకినప్పుడు వానిముందఱ బంధుత్వమును, మిత్రత్వమును సమస్తమును తృణకణములవలె నెగిరిపోవలసినవేగదా!

- కందుకూరి, స్వీయచరిత్రము

మాటలాడువారు ధనవంతులైనచో, వ్యర్థవచనము సహితము స్తుతియోగ్యము కాకపోదు.

- కందుకూరి, రాజశేఖర చరిత్రము

డబ్బుతే! డబ్బుతే!
డబ్బుతే! అని పలుకు
విడువకను పల్కేటి
వడినడక రైలుతో-

- బంగారమ్మ, ఆకొండ

నడిమంత్రపు సిరి నరంమీద పుండూ.

- చిలకమర్తి, అపూర్వ స్వయంవరము

సంపదలు గల్గు తఱి మహాజనుల హృదయ
మభినవోత్పలకోమలం బగుచు వెలయు
నాపదలు వొందునపుడు మహామహీధ
రాశ్మ సంఘాత కర్కశం బై తనర్చు

- లక్ష్మణకవి, సుభాషిత రత్నావళి

ఎక్కువ డబ్బున్న రా జేనుఁగెక్కును. కొంచెము డబ్బున్నవాడు గుఱ్ఱమెక్కును. గవ్వైన లేని వాఁడు గాడిద నెక్కును.

- చిలకమర్తి, గణపతి

ఉత్తముఁ డుద్యోగ ఫలా
యత్తుఁడు భాగ్యాభిలాషి, యధముఁడు రెంటం
జిత్తంబు గొల్పు, మధ్యముఁ
డుత్తముకడ నుండ లక్ష్మి యొడఁబడు నెపుడున్.

- గోపరాజు, సింహాసన ద్వాత్రింశిక

పైసాలేకపోతే పనెలా జరుగుతుంది?

- గురజాడ, కన్యాశుల్కం

ధన జాతకానికి డబ్బులా వొస్తూ వుంటుంది.

- గురజాడ, కన్యాశుల్కం

ధనము గలుగువేళ జనులెల్లఁ దమవారు
ధనము లేనివాని మనికి చావు.

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

...లక్ష్మీవిలాసిని మాయానటనల్ సుఖంబుల
గునే శ్రీకాళహస్తీశ్వరా?

- ధూర్జటి, శ్రీకాళహస్తీశ్వర శతకము

నిజముగా మనుజున కాపదయే మహాబలము. సంపత్తు వట్టి పిటికిది.

- పానుగంటి, వీరమతి

సిరి దా వచ్చిన వచ్చును
సలలితముగ నారికేళ సలిలము భంగిన్
సిరి దాఁ బోయినఁ బోవును
కరి మ్రింగిన వెలఁగ పండు కరణిని సుమతీ.

- బద్దెన, సుమతి శతకము

ఎప్పుడు సంపద గలిగిన
నప్పుడు బంధువులు వత్తు రదియెట్లన్నం
దెప్పలుగఁ జెఱువు నిండినఁ
గప్పలు పదివేలు చేరుఁ గదరా సుమతీ.

- బద్దెన, సుమతి శతకము

కలహ మగుట లక్ష్మిగావించుఁ బ్రాణహా
నియును జేయు నింత నిక్కువంబు
పలువు రొకని కోడి పొఱుట బల్లిదు
లనదచేతఁ జెడుటయును ఘటించు.

- తిక్కన, ఉద్యోగపర్వము

ఆపదల కోర్చి సంపద లనుభవింపు.

- తిక్కన, విరాటపర్వము

## సంపన్నుఁడు

సంపన్నుం డొరుఁ గాన లేఁడు తనువున్ సంసారమున్ నమ్మి హింసింపం జూచు.

- పోతన, భాగవతము

సత్సంపన్నాంధున కంజవంబు వినుమా దారిద్ర్య మూహింపఁగన్.

- పోతన, భాగవతము

## సంపాదకుడు

పత్రికా సంపాదకుడి బ్రతుకు-పగవాడి కన్నా వద్దు.

- రామకృష్ణశాస్త్రి, జీవఫలం

ప్రపంచంలోని దిగులులేని బిచ్చగాళ్ళలో పత్రికా సంపాదకుడు ఒకడు.

- సుధాకరరెడ్డి, పత్రికాపురాణం

సంపాదన

వరహాలెన్ని గణించిన
పరమార్థజ్ఞానివోలెఁ బావనుఁ డగునా?
ధర వన్నె లెన్ని గల్గిన
గురిగింజకు నేమిగొప్ప?

- చాటువు

డబ్బుకూ, సౌఖ్యానికీ లెక్కచెయ్యనట్లు కనిపించాలి, పైకి లోపలమాత్రం క్షణక్షణం వాటికోసమే ఆలోచించాలి! లేకపోతే ఒక్క కానీ గూడా సంపాదించలేం!

- అనిశెట్టి, గాలిమేడలు

తగవులుంటేగాని ప్లీడరు సంపాదించడు. రోగులుంటేగాని డాక్టరు సంపాదించడు.

- సీతారామారావు, తారాబలం

ప్రతివాఁడు సంపాదించిన దంతయు నిలువచేసిన పక్షమున జ్యేష్ఠాదేవికి నిలువనీడ యుండునా?

- చిలకమర్తి, గణపతి

కొందరు పెద్దలు సంపాదించి పెట్టిన భూముల మీఁద జీవించువారు. అటువంటి వారందఱు మనోవృత్తి ముండలు.

- చిలకమర్తి, గణపతి

ఏలాగో యొకలాగున సంపాదించుట ప్రయోజకత్వము.

- చిలకమర్తి, గణపతి

ఇంక్రిమెంటే మోక్షం.

- ఆరుద్ర, త్వమేవాऽహమ్

ప్రపంచంలో బలం సంపాయించడానికి కసరత్తు చేస్తారు. మనం కసరత్తు చెయ్యటానికి బలం సంపాదించాల్సివస్తోంది.

- పిచ్చేశ్వరరావు, కథలు

తల్లి బిడ్డలకును దగవు పుట్టించెడు
ధనము సుఖముఁ గూర్చదని వచింత్రు
కాని గడన లేక గడచుట యెట్లురా?

- వేమన

ఎక్కడ నుండియొ కూడును
నిక్కములై తోఁచుఁ నొక్క నిముసంబునఁ దా
మెక్కడికో విరిసి పోవును
డక్కవు సంపదలు మేఘడంబరము క్రియన్.

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

పాండవుల సంపాదన దుర్యోధనులవారి పిండా కూళ్ళకు సరి.

- సామెత

మేడలు, మిద్దెలు కట్టాలంటే కద్దరుటోపీ ఎట్టుకుని, పెజాసేవ పెజాసేవ అంటూ తిరగాల. ముష్టోడిగా బతకాలంటే గుడ్డోడిగా మారాల.

- విశ్వనాథం, మార్పు

సంప్రదాయం

సంప్రదాయాన్ని ఎగరగొట్టి పారవేయటం సులభం కాని - దాన్ని కాలదన్ని బాగుపడ్డ వాళ్ళు చాలా తక్కువమంది కనిపిస్తారు.

- సరస్వతీదేవి, రాజహంసలు

ఇంటిలో స్త్రీ యెట్టిదో దేశములో వైశ్యుఁడట్టి వాఁడు. సంప్రదాయ రక్షకులు వీరిద్దఱును.

- విశ్వనాథ, నందోరాజాభవిష్యతి

మన ఓల్డు కష్టమ్సు అన్నిటిని యేదో వక ప్రయోజనం ఆలోచించే మనవాళ్ళు యేర్పరిచారు.

- గురజాడ, కన్యాశుల్కం

మన ఖద్దరు సాంప్రదాయానికి యంత్రాలు పనికిరావు.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

సంప్రదాయము పూర్వులైనవారు కొంద ఱేర్పఱిచినది. సంస్కారము క్రొత్తవారు కొందఱు చేసినది.

- విశ్వనాథ, చెలియలికట్ట

దానంతో పాటు దక్షిణ యివ్వటం ఆచారం. అట్లాగే కన్యతో పాటు కానుక అడగటం కూడా ఈ దేశ సంప్రదాయమే.

- నాగచంద్రావతి, కాలం కరిచాక

అంత కడివెడు పాలపై ఒ
క్కింత మీగడ పేరినట్లుగ,
మనకు మిగులును గతములోపలి
మంచి - అదియే సంప్రదాయము.

- సినారె, సమదర్శనం

సంబంధం

కవిత్వానికీ (కవిత్వమంటే రాతలన్నీ) కవికీ, దీపానికీ, కాంతికీ వున్న సంబంధం అనుకుంటాను. అన్ని తేజస్సులూ, వికారాలూ, మాలిన్యాలూ, దీపంలో వున్నవన్నీ కాంతిలో కనబడతాయి- నిర్మల దృష్టి కలవాళ్ళకి.

- చలం, మ్యూజింగ్స్

ఒక చెట్టునకు నొక తీగెకు నున్నంత

సంబంధము రెండుచెట్ల కుండదు.

- విశ్వనాథ, చెలియలికట్ట

ప్రతి సంబంధము లేక చలనము లేదు. చెడ్డ లేక మంచి లేదు. కష్టము లేక సుఖము లేదు.

- పానుగంటి, రాధాకృష్ణ

కవిత్వానికీ పిచ్చికీ చాలా దగ్గర సంబంధం వుంది.

- సూర్యారావు, నీలితెరలు

మంచి విమర్శలుంటేనేగాని మంచి రచనలు ఉత్పత్తికావు.

- సరస్వతీదేవి, సాహిత్యోద్యానము

అహంకారమునకు సాగుబాటునకును శక్తి సామర్థ్యములకును సంబంధములేదు.

- విశ్వనాథ, నందోరాజాభవిష్యతి

సంబంధ మీనాటిది కాదు. వస్తువులవలెనే సంబంధ మనాది. కాని వస్తువు లీశ్వర కల్పిత ములు. సంబంధములు మాత్రము కల్పించు కొనినవి.

- పానుగంటి, కంఠాభరణము

డిగ్రీలకీ, సంస్కారానికీ సంబంధం లేదు.

- రంగనాయకమ్మ, పేకమేడలు

తెలుగు సినిమాకి, ఉరితాడుకీ అవినాభావ సంబంధం ఉంటుంది.

- మారుతీరావు, మళ్ళీమధుమాసం

కాసులు చేరటం చేరకపోవటం బట్టి కుటుంబ సభ్యుల సంబంధాలు కూడా మారుతుంటాయి.

- రావిశాస్త్రి, బంగారిగాడి కత

సంభాషణ

ఆఫీసరువద్ద సంభాషణ వున్నప్పుడు బంట్రో తున్నూ, బంట్రోతువద్ద సంభాషణ వున్నప్పుడు ఆఫీసర్లున్నూ ఇతర పనుల్లో వుండాలి.

- కె. యల్., కొడిగట్టిన దీపాలు

సమ్మె

ప్రజల సమ్మెకి ప్రళయాలేవీ రావులెండి.

- వేదాంతకవి, ఆకలిమంట

హర్తాళ్ళు అలజడులు ఆత్మ విధ్వంసములు. సంక్షేమ రాజ్యమున సమ్మెలే శత్రువులు.

- మల్లారెడ్డి, అమాత్య సుభాషితమ్

సమ్మోహనాస్త్రం

ఒకడు చెప్పిందల్లా మహాబాగుం దండవే. సమ్మోహనాస్త్ర మంటే అదేకదా!

- గురజాడ, కన్యాశుల్కం

సంయోజనం

కూడు వండని ఆడది, మంచం అల్లని మగ వాడూ ఉండరు.

- సామెత

ఆడుదాని కాయువుప ట్టెక్క డున్నది? శరీర సౌందర్యములో లేదు. వాక్చమత్కృతిలో లేదు. నగలలోలేదు. నాణెములలో లేదు. మేడలలో లేదు. మిద్దెలలో లేదు. కీర్తిలో లేదు. సంతాన ములో లేదు. స్వాధీనభర్తృకతలో నున్నది.

- పానుగంటి, సరోజిని

ఆడుం గాన్పును గంట కన్న సతి గొడ్రాలౌటయే మేలు నూతేడుల్ పెంచిన గూంతురేమి సతమా?

- కాకుమాని మూర్తి, పాంచాలీ పరిణయము

ఆడబ్రతుకు ఆడివీ, అధ్వాన్నమూనూ.

- పురాణం, వెలిసిపోయిన పెళ్ళిఫోటో

మన ఆడవాళ్ళకు జీవితాన్ని అనుభవించడం బొత్తిగా చేతకాదు. మనం కిటికీలోంచి చూసే దాని కంటే ప్రపంచంలో ఎక్కువ వెలుగే వున్న దన్న విషయాన్ని వాళ్ళు గ్రహించరు. అభిప్రా యాలూ అనుభవాలూ, వంట ఇంటినీ పడగ్గ దినీ దాటిపోవు.

- ఠాకూర్, శ్రావణసంధ్య

సంవేదన

వేదన లేని జీవితం, సంవేదన లేని జీవితం సచేతనంగా జీవించలేదు.

- సంజీవదేవ్, రూపారూపాలు

సంశయం

లోతులు తరచినప్పుడే సంశయాలు. వొడ్డున కూర్చున్నవాడికి - యేదైనా వుంది - అనుకుంటే వుంది; లేదు అనుకుంటే లేదు.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

సంసారం

సరసం తెలియని మొగుడితో సంసారం అటు కులు నోట్లో పోసుకుని అప్పడం విరిచి తిన్నట్లుంటుంది.

- పురాణం, ఇల్లాలిముచ్చట్లు

సంసారమునందుఁ గోర్కి కొనసాఁగిన వారలు లేరు తమ్ముఁడా!

- తి. వేం., పాండవాశ్వమేధము

నలసారము సంసార మ
ఖిలదుఃఖావహము భయనికేతన మతిచం
చలము పరాధీనం బిం
దుల జీవనమేల నమ్ముదురు తత్త్వవిదుల్?

- నన్నయ, ఆదిపర్వము

మతిఁ దలఁపఁగ సంసారం
బతిచంచల మెండమావు లట్టుల సంప
త్ప్రతతుఁ లతిక్షణికంబులు
గతకాలము మేలు వచ్చు కాలముకంటెన్.

- నన్నయ, ఆదిపర్వము

సంసారమయినా సుఖమయినా గుట్టుగా వున్నంతసేపే.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, ఆత్మబలి

నాలుగు గోడల సందున మొగుడు పెళ్ళాం పిల్లల మధ్య జరిగే నాటకం, చూస్తున్నా అర్థం కాదు.

- కొడవటిగంటి, రంపపుకోత

దిక్కుమాలిన సంసారాన్ని పోషించడానికి ఒకడు మేకల గొంతుకలు కోస్తే, యింకొకడు మనుష్యుల గొంతుకలు కోస్తున్నాడు, లేదా కోయిస్తున్నాడు. వాడికీ తృప్తి కనపడదు. వీడికీ కనపడదు.

- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

సముద్రానికైనా అంతూపొంతూ వుంటుందేమో గాని సంసారానికి వుండదు.

- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

మగఁ డెఱుఁగవలయుఁ గాదేన్
మగువ యెఱుఁగవలయుఁ గాక మనుగడతెఱఁ గ
మ్మగువయు మగఁడును వెలిగా
జగమున సంసార మెట్లు జరుగును జెపుఁడీ?

- అనంతుడు, భోజరాజీయము

సంసార విషవృక్షమునకు రెండు ఫలము లమృత తుల్యములు. కావ్యామృత రసపానమొకటి, సజ్జన సంగతి యొకటి.

- చిన్నయసూరి, మిత్రలాభము

సంసారం ఇద్దరి శరీరాలతో, మనస్సులకీ సంబంధించిన జీవితం.

- లక్ష్మణరావు, అతడు - ఆమె

నేను అనేక సంసారాలు చూచా. వొక్క జోడయినా వాడీవంకా లేకుండా సరిపోయినదాన్ని నేచూడలేదు. లక్షకొకరుంటే అది లెక్కలోది కాదు. బ్రహ్మదేవుడట్లా చేయవలెనని చేస్తున్నాడో లేక చేతగాక చెడగొడుతున్నాడో నాకు తెలియదు. యెక్కడనైనా కాస్త వంక కనబడక మానదు.

- ఉన్నవ, మాలపల్లి

సంసారంలో పడ్డ స్త్రీ, శ్లేష్మంలో పడ్డ ఈగ లాంటిది. ఇక విముక్తి లేదు.

- కౌసల్యాదేవి, కల్పవృక్షం

## సంస్కరణ

సంస్కరణలంటే జనాన్ని మోసం చేయడమే.

- చిరంజీవి, బోలోస్వతంత్రభారత్‌కీ జై

సంస్కరణలంటే- ఒకరిని లేవనెత్తబోయి మనం కింద పడటం కాదు.

- సుంకర, పీటలమీద పెళ్లి

## సంస్కారం

ఒకరిని మెప్పించాలని ప్రయత్నించకుండా తన పని తను నిర్వర్తించటమే సంస్కారం.

- కాంతారావు, బూచీ

తల్లిదండ్రులు ఉత్తమ సంస్కారులయితే బిడ్డలు కూడ వారినే అనుసరిస్తారు.

- శ్యామలారాణి, జీవవాహిని

సంస్కారములేని చదువు
సౌరభమ్ములేని పూవు.

- సినారె, సమదర్శనం

సంస్కారం చదువుతో రాదమ్మా.

- జయప్రద, పిన్ని

బోధనలు జీవిత పద్ధతిని సంస్కరించచూస్తాయి. నిజమైన కళ ఆత్మనే సంస్కరిస్తుంది.

- చలం, మ్యూజింగ్స్

తెచ్చిన బహుమతికన్నా ఇచ్చిన హృదయాన్ని చూసి పుచ్చుకోడం సంస్కారం.

- రాధాకృష్ణ, మనస్తత్వాలు

సంప్రదాయము పూర్వులైన వారు కొందఱేర్పఱచినది. సంస్కారము క్రొత్తవారు కొందఱు చేసినది.

- విశ్వనాథ, చెలియలికట్ట

సహజశ్రీ గలవానికయినను సంస్కారము వలన మిగుల శోభవచ్చును.

- తి.వేం., పాండవవిజయము

సంస్కారవంతు డెవడూ చదవకుండా ఉండడు.

- కృష్ణారావు, పాపికొండలు

ఆస్తిపాస్తుల్ని నిలబెట్టుకోవటంకన్నా కూడా

సంస్కారాన్ని నిలబెట్టుకోవటం చాలా కష్టం.
- కొడవటిగంటి, తల్లిలేనిపిల్ల

సంస్కారమంటే ఆనందాన్ని సాధించి అనుభవించే శక్తి.
- కొడవటిగంటి, తల్లిలేనిపిల్ల

పారిశ్రామికంగా వెనుకబడి ఉండటం సంస్కారంలో వెనకబడి ఉండటం కాదా?
- కొడవటిగంటి, అనామిక

సంస్కృతం

సంస్కృత శ్లోకములు తెలుగు పద్యములు quote చేయలేదని మీరు నన్నధిక్షేపింతురేల? "విష్ణు ర్యోనిం కల్పయతే" అని శ్రుతిలో నుండుట చేతనే భార్యకు గర్భదానము చేయవలసి వచ్చినదని చెప్పువాఁడెవఁడైన నున్నాఁడా?
- పానుగంటి, సాక్షి

యీ రోజుల్లో నీ సంస్కృతం చదువెవడిక్కావాలి?
- గురజాడ, కన్యాశుల్కం

సంస్కృతాంధ్రాలు

జనని సంస్కృతంబు సకల భాషలకును
దేశ భాషలందుఁ దెనుఁగు లెస్స
జగతిఁ దల్లికంటె సౌభాగ్య సంపద
మెచ్చుటాఁడుబిడ్డ మేలుగాదె?
- వల్లభరాయడు, క్రీడాభిరామము

సంస్కృతి

ఆదిమ మానవులకు మతమే సంస్కృతి. ఆధునిక మానవులకు సంస్కృతే మతం.
- సంజీవదేవ్, సంస్కృతిపథంలో

ఏదేశ సంస్కృతి అయినా
ఏనాడూ కాదొక స్థిర బిందువు
నైకనదీనదాలు అదృశ్యంగా కలిసిన
అంతస్సింధువు.
- తిలక్, మన సంస్కృతి

వరల్డ్‌కి అగ్రికల్చరెట్లా అవసరమో, జీవితానికట్లా కల్చెరు కూడా చాలా అవసరం.
- వేదాంతకవి, ఆకలిమంట

ఈ క్రాపులు మీ తాతలనాఁడు ముత్తాతలనాఁడు నెఱుఁగుదురా? అవేమి అందమా - చందమా? మూతి గొరుగుడేమి? తల పెరుగుడేమి? మీరీ క్రాపుల నిర్మూలన మొనర్చినఁ గాని మీకు స్వదేశీయ మొగమే యమరదు. ప్రథమమందుఁ దలలోనే స్వదేశపుటాకృతి లేనప్పుడు దేహమందు తాటిపాక తెరచాప గుడ్డ యున్ననైన నేమి?
- పానుగంటి, సాక్షి

అంటరానితనము చెప్పరానితనము నను నీరెండు మాటలు నొక్క భారతదేశ సారస్వతమునందే యున్నవి. ప్రబలమైన మన యజ్ఞానమున కివి ప్రచండనిదర్శనములై యున్నవి. భారతీయుల మనస్సులలోనున్న రెండు కన్నులలోను నివియే రెండు పూవులై యున్నవి.
- పానుగంటి, సాక్షి

సంస్థ

సంస్థలన్నీ కాగితాలమీద నడిచిపోతున్నాయి.
- గంగాధరరావు, యథాప్రజా-తథారాజా

సరదా

ఏవి చేసినా మితి మీరనంత వరకూ సరదాలు, మితిమీరితే వ్యసనాలు.
- రంగనాయకమ్మ, పేకమేడలు

మగవాళ్ల జీవితాలతో ఆటలాడడం ఆడవాళ్లకు సరదా.
- భారతీదేవి, సుడిగుండాలు

సరసం

గుడ్డి మామగారూ! నమస్కారమంటే, రంధికి మూలమా రంకుకోడలా అన్నాడట.
- సామెత

పేరంటానికి వచ్చి, పెండ్లికొడుకు వరస యేమన్నట్టు.
- సామెత

సరసంలో నఖక్షతాలు అవుతాయి; విరసంలో రక్కులు, బరుకులు, గిచ్చులు అవుతాయి.
- మహీధర, దేశంకోసం

సరసం తెలియని మొగుడితో సంసారం అటుకులు నోట్లో పోసుకుని అప్పడం విరిచి తిన్నట్లుంది.
- పురాణం, హోమ్ స్వీట్‌హోమ్

పిశాచం పీక్కు తింటూవుంటే సరసానికి యాళా?
- గురజాడ, కొండుభట్టీయము

సంసారంలేని వాళ్లకు సరసా లెక్కువట.
- సూర్యారావు, ఇల్లుకూలింది

సరి

అంతా సరి యింతా సరి
యంతకునకు మద్యపాయి కపహాసునకున్

అంతా సరి యింతా సరి
చింతింపక యిచ్చు దానచింతామణికిన్.

- చాటువు

లంక మేతకు, గోదావరి యీతకు సరి.

- సామెత

గాజులబేరం భోజనానికి సరి.

- సామెత

దాసరి తప్పు దండంతో సరి.

-సామెత

గంగిగోవు పాలు గరిటెఁ డైనను జాలుఁ
గడవెఁ డైన నేమి ఖరము పాలు?
భక్తి గలుగు కూడు పట్టె డైనను చాలు.

- వేమన

**సర్టిఫికెట్టు**

చేతగాని శతవధాని-చేతినిండ
సర్టిఫిక్కెట్ల కట్టలే; సహజశక్తి
గలుగువారల కవియేల; కాల్పనే; స్వ
తఃప్రకాశుఁడు గోరునే తనకు దివ్వె?

- తి.వేం., పాణిగృహీత

**సర్దుబాటు**

జరిగితే అంతా సరిపోతుంది.

- రాజమన్నారు, బంధాలు

తేనె అంతా ఒకచోట, తెట్టె అంతా ఇంకొక చోట.

- సామెత

**సర్వజనామోదం**

చవకగా వుండి అందరికీ అందుబాటులో వుండ బట్టే - హార్మోనియం సర్వజనామోదంగా వుంది.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

**సర్వాంతర్యామి**

అరవ లేని దేశం కాకి లేని ఊరూ లేవు.

- సామెత

**సర్వెంటు**

సర్వెంట్లు సంతోష సమయాల్లో హెచ్చు తగ్గులు మర్చిపోతారు.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

**సలహా**

అందరూ అన్నీ చెప్తారోయ్! చెప్పడానికేం? మాటకి టాక్సు ఉంది కనుకనా?

- ముద్దంశెట్టి, కరిగిన శిల

హిమాలయం శిగ గోశిరి గాని, ఆ పుస్తకం ముణిచి నామాట విను.

- గురజాడ, కన్యాశుల్కం

అటునుంచి నరుక్కు రమ్మన్నారు.

- గురజాడ, కన్యాశుల్కం

**సలాం**

ఒకరిచేత సలాం చేయించుకోవాలన్న కోరిక లేక పోతే అస లెవ్వరికీ గులాం కానవసరంలేని స్వతంత్ర జీవనం గడపవచ్చు

- వసుంధర, తపోభంగం

**సవతి**

స్వర్గానికి పోయినా సవతి పోరు తప్పింది కాదు.

- సామెత

ఫెమినైన్సు ఫూల్చున్నాడు, "పడుపడు అన్న నా సవితేగాని పఢ్ఢ నా సవితే లే" దంది టెవర్తోను.

- గురజాడ, కన్యాశుల్కం

**సవతి తల్లి**

బాబుకు పెళ్లి అయిందని సంతోషిస్తే సవతి తల్లి రావడానికి విచారించవలసే వస్తుంది.

- వెళ్ళపిళ్ల, కథలు-గాథలు

**సవర**

సవరోడు సత్తే గోసి గుడ్డతో సత్తాడుగానీ అప్పు తోటి సవ్వడు.

- అప్పల్నాయుడు, బుగతోడు-గూడుబండి

**సవాలు**

మూరెడింట్లో బారెడు కర్రా, ఎట్లా కొడ్తావు కొట్టర మొగడా అన్నట్లు.

- సామెత

వీరగంధము తెచ్చినారము
వీరుఁ డెవ్వఁడొ తెల్పుఁడీ
పూసిపోదుము మెడను వైతుము
పూలదండలు భక్తితో

- త్రిపురనేని, ఎదురుకోలు

**సస్పెండు**

సస్పెండు చేయడంలోని సారాంశం - "నాయనా నువ్వా ఇంటి వద్దనే కూర్చో, మేము సగం జీతం ఇస్తాం. నువ్వా దొంగవో, దొరవో తేలేవరకు నువ్వు ఆఫీసుకు రానక్కరలేదు". కూర్చోపెట్టి పోషించడమన్నమాట.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

సస్పెన్సు

సస్పెన్సేమిటో అందరూ పుస్తకం మూసేస్తారు.

- వెంకటరమణారావు, కొలువు

సహగమనం

బలవంతుఁడు బలహీనుఁడుఁ
బొలియుదు రిది తప్పు? నల్లపూసలు ముత్యాల్
తొలఁగుఁ గద మగఁడు పోయిన
వెలఁదులకున్?

- అడిదము, చాటువు

కుర్చీతో వచ్చిన ఖుషీ కుర్చీతోనే పోయినట్టు.

- శ్రీరమణ, న్యూసుడి

సహజత్వం

అబద్ధాలూ కోతలూ చేతనవాలిగాని అవి నేర్చుకుంటే వచ్చేవికావు. నేర్చుకున్నవి అవసరానికి పనికిరాకుండా పోతాయి.

- కనక్‌ప్రవాసి, సినిమా

సహజం

రచయిత్రికి బెట్టు - పత్రికకి గుట్టు.

- శ్రీరమణ, న్యూసుడి

పీల్చుకొద్దీ పొగ.

- శ్రీరమణ, న్యూసుడి

కొత్తనీరు వచ్చి, పాతనీరు కొట్టుకుపోయినట్లు.

- సామెత

ప్రతిభా ప్రాగల్భ్యాలు ఎంత వెనకబడ్డ జాతికీ ఉంటాయి.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, అనుభవాలూ జ్ఞాపకాలూనూ

సహజీవనం

కలరవములు కలవరములు
కలగాపులగ మ్మిచ్చట.

- రామచంద్రశాస్త్రి, మా విశాఖ

సహనం

సహన మెక్కడ ఉన్నదో ని
శ్చల పరాక్రమ మున్న దక్కడ.

- సినారె, భూమిక

మగవాడు జూదరి అయితే అది సహించగలిగే శక్తి ఏ ఆడదానికీ ఉండకూడదు.

- రంగనాయకమ్మ, పేకమేడలు

సహనముంటే పశ్చాత్తాపానికి చోటులేదు.

- సామెత

సహభోజనం

అన్యోన్య వివాహములకంటే భోజన, ప్రతిభోజనములే సమభావము గల్గించడమున కెక్కువ తోడ్పడుతవి.

- ఉన్నవ, నాయకురాలు

ఆరువిల్లి నాయురాలి దుర్మంత్రంబు
కోడిపోరు, చాపకూటి కుడుపు
ప్రథమకారణములు పలనాటి యేకాంగ
వీరపురుష సంప్రహారమునకు

- వల్లభరాయడు, క్రీడాభిరామము

సహవాసం

అవినీతితో ఎక్కువ సంబంధం సహవాసం (స్నేహం కాదు) అవినీతి అరికట్టవలసినవాళ్ళకే ఎక్కువ ఏర్పడుతుంది.

- రావిశాస్త్రి, మూడు కథల బంగారం

సహాయం

కుసివెళ్ళి గొడ్డలిలో దూరితే అడవంతా తెగనరికినట్లు.

- సామెత

వర్తమానంలో చిక్కుకుపోయి, గతాన్ని విస్మరించి భవిష్యత్తులో విశ్వాసం కోల్పోయేవాడికి సంఘం బాసట అవుతుంది.

- కొడవటిగంటి, గద్దురోజులు

కృత మెఱుఁగుట పుణ్యము స
మ్మతి దానికి సమము సేఁత మధ్యము మతి త
త్కృమున కగ్గలముగ స
త్కృతి సేయుట యుత్తమంబు కృతబుద్ధులకున్.

- నన్నయ, ఆదిపర్వము

స్వప్రయోజనాలంటూ లేకుండా, ఎవ్వరూ ఎవ్వరికీ ఎప్పుడూ సహాయపడరు.

- సూరి, చంఘీజ్‌ఖాన్

ఇతరుల సాహాయ్యముతో మనుష్యుఁ డొకపని చేయుచున్నచో నాసాహాయ్యము లేనప్పుడు తమ కాపని సాధ్యముకా దనిపించును. ఆ సాహాయ్యము లేదన్న దిగు లెక్కువై శ్రద్ధ తక్కువై యాపని చేతకానట్లే జరుగును.

- విశ్వనాథ, తెలుచిరాజు

సహృదయత

సహృదయతే జీవితాంతం నిలిచేది. ఆనందమయం చేసేది.

- బుచ్చిరెడ్డి, అసమర్థుని ఆత్మహత్య

**సాకు**

ఎగరబోయి బోర్లాపడి యీ వూరు అచ్చిరాలే దన్నాడట.

- సామెత

**సాక్షి**

కోర్టులో సాక్ష్యమీయ వచ్చువారందరు తాము సత్యహరిశ్చంద్రునికి సన్నిహిత బంధువుల మనియే చెప్పుకొందురు.

- *బంగారయ్య, రాజ్యలక్ష్మి*

అనుమానం ధ్రువపడడానికి సాక్షులు అవసరం లేదు.

- *సభా, కొత్తకథ*

**సాక్ష్యం**

దొంగ సాక్ష్యాలున్నాయని మనుషులు గోలపెడు తూనే ఉన్నారు. అయినా సాక్ష్యానికి విలువ ఉంటున్నది.

- *కొడవటిగంటి, న్యాయసూక్ష్మాలు*

పేద నిజానికి సాక్ష్యం దొరకదు. కాని ధనిక నిజానికి; సాక్షులు కోకొల్లలు.

- *చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై*

యవిడెన్సు యాక్టులో అంజనాలూ, పిశాచాలూ, సాక్ష్యానికి పనికి వస్తాయటయ్యా?

- *గురజాడ, కన్యాశుల్కం*

నిజవాఁడేవాడు సాక్ష్యానికి రాడు, సాక్ష్యాని కొచ్చి నవాడు నిజవాఁళ్ళేడు.

- *గురజాడ, కన్యాశుల్కం*

సాక్ష్యంతోనే సంబంధంకాని, సత్యంతో సంబం ధంలేదు.

- *రావిశాస్త్రి, మాయ*

కళ్ళతో చూసాను గనక యీగోడ మీదయినట్టు జిహ్లెత్తిగ పాడిచి సాక్ష్యం కూడా పలగ్గలను.

- *గురజాడ, కన్యాశుల్కం*

దుకాణ వేసుకు బతికేవాళ్ళకి సాక్షికాలెందుకు బాయి?

- *గురజాడ, కన్యాశుల్కం*

అబద్ధపు సాక్ష్యాల తయారీలో యెక్కడో ఒక చోట యేదో ఒక లోపం రాకతప్పదు.

- *ఆనందారామం, అద్దంలో శత్రువు*

బాధని గుర్తించడానికి కన్నీళ్ళనే సాక్ష్యంగా తీసు కోనక్కరలేదు.

- *కళ్యాణచక్రవర్తి, మొగలిపువ్వు*

తప్పుచేదాం అనుకున్న వాడెప్పుడూ సాక్ష్యాన్ని రుజువులనే పకడ్‌బందీగా ఉంచుకుంటాడు. న్యాయంగా పోయేవాడు మనసునే నమ్ముకుం టాడు. కోర్టుకి కావల్సింది మంచిమనస్సు కాదు... మంచి సాక్ష్యం.

- *వెంకటరమణారావు, కొలువు*

దాసికిఁ దార్పుడుకాఁడు సాక్ష్యమా?

- *పానుగంటి, ప్రచండ చాణక్యము*

సంతలో కొట్టినందుకు సాక్షులెవరు?

- సామెత

లంచగొండి విధవలిచ్చు
సాక్ష్యం ఒక సాక్ష్యమా?

- *శ్రీశ్రీ, దూదిపులి మీద పుత్ర*

చెరిగిపోని వాళ్ల శిలాశాసనం మీద
నక్షత్రాలు సాక్షి సంతకం చేశాయి.

- *శ్రీశ్రీ, భూమ్యాకాశాలు*

**సాగతీత**

తీయగా తీయగా రాగం. మూలగ్గా మూలగ్గా రోగం.

- సామెత

**సాగనివి**

బ్రాహ్మణ వ్యవసాయం- బ్రహ్మచారి సంసారం.

- *లక్ష్మణరావు, అతడు-ఆమె*

**సాంక్రామికం**

దుఃఖం, సంతోషం కూడా సాంక్రామికాలు.

- *మహీధర, ఓనమాలు*

**సాంఘిక సంస్కరణ**

లోకం తప్పు తోవలో వెళ్ళుతుంటే ఆ తోవ లోంచి మళ్ళించి మంచితోవలో పెట్టడమనేది సోషల్ రిఫారమ్.

- *గురజాడ, కన్యాశుల్కం*

**సాదాతనం**

ఈరోజుల్లో మగవాళ్ళయినా, ఆడవాళ్ళయినా ఎంత సింపుల్‌గా వుంటే అంత బాగుంటారు. గొప్పగా, డాబుగా, దర్జాగా వుండటానికి ఎంత ప్రయత్నిస్తే మనుష్యులు అంత అసహ్యంగా వుంటారు.

- *పురాణం, తారుమారు పెళ్లి*

**సాధన**

టాయి టాయిఁ గూర్చి రాయఁగా రాయఁగా

నున్ననైన యట్టు అన్ని పనులు
పాడు చేసినంతఁ బరిపాటి యగునయా
- వేమన

సాధనంబు లేక సమకూడ దేదియు
బోధ లేని విద్య పొంద దెపుడు
పాదుకొల్పి మదిని భావించి చూడరా
- వేమన

అనఁగ ననఁగ రాగ మతిరమ్యమై యుండు
పెనఁగ బెనఁగ సతికిఁ బ్రేమ పుట్టు
తినఁగ దినఁగ వేము తియ్యనై యుండురా
- వేమన

లెక్కకు రానీయఁడు కార్యసాధకుఁడు
దుఃఖంబున్ సుఖంబున్ మదిన్.
- లక్ష్మణకవి, సుభాషిత రత్నావళి

తీయగా తీయగా రాగమూ, రాయగా రాయగా నవల.
- శ్రీరమణ, న్యూనుడి

### సాధన భేదం

ధనమును విద్యయు వంశం
బును దుర్మతులకు మదంబుఁ బొనరించును, స
జ్జను లైనవారి కడఁకువ
యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా?
- నన్నయ, ఉద్యోగపర్వము

### సాధింపు

మగవానిని సాధించుటకు భార్యకంటెఁ దగినదె వ్వతె? ప్రక్కలోఁ బోటు పిడుగు పాటుకంటె గట్టిది.
- పానుగంటి, ముద్రిక

పతుల యత్నంబు లొనఁగూడు, సతులుగూడ
విఱుపు మాటల వారిని వేఁపకున్నఁ
బాదులను మొక్క మొలచిన దాదిఁ బురుగె
తొలఁచుచుండిన నదియెంత దూరమెదుగు?
- బలిజేపల్లి, సత్యహరిశ్చంద్రీయము

తొక్కి, దున్ని, మలినం చేసి భూమిని ఎంత సాధించారో, నీచపరిచి ఉపయోగించుకొని స్త్రీనీ అంతే సాధించగలరు.
- చలం, మ్యూజింగ్స్

### సాధువు

సాదు రేఁగెనేని
న్వీను తలపోలమునన కాని నిలువదు సుమ్మీ.
- తిక్కన, ఉద్యోగపర్వము

### సాధ్యం

మంచి పనయితే ఒక్కమాటలో నచ్చజెప్పవచ్చు
- ధనికొండ, పవిత్రులు

ముదిత ల్నేర్వఁగరాని విద్యగలదే
ముద్దార నేర్పించినన్?
- చిలకమర్తి, ప్రసన్న యాదవము

సహస్ర నామార్చన భగవంతుడి అస్తిత్వాన్నీ, ఆరాధన స్త్రీపురుషులలో దైవత్వాన్నీ సృష్టించగలుగుతే మరి సాధ్యంకానిదేముంది?
- మహీధర, ఓనమాలు

### సాధ్యాసాధ్యాలు

తన తరంబుం బగఱ తరంబు నెఱింగి కరంబు జయంబు నిశ్చయించుకొని మార్కొనవలయు.
- చిన్నయసూరి, మిత్రభేదము

### సానుభూతి

మనిషికీ మనిషికీ ఉండే తేడాలు వారి అన్యోన్యతను బాధించకుండా చెయ్యగలిగినది సానుభూతి.
- కొడవటిగంటి, ఇంతలో ఉంది

మనుషుల బుద్ధికి సానుభూతి నిదర్శనం.
- బుచ్చిబాబు, చివరకు మిగిలేది

చేతులార బాపుజీఁ జంపుకొన్నాము
సానుభూతి సభలు జరిపినాము.
- జాషువా, ఆత్మస్తుతి

### సాన్నిధ్యం

పూజ చేసినంతసేపే దేముడి దగ్గర ఉంటాం. ఆ తరవాత బైటకి వచ్చేస్తాం.
- రావిశాస్త్రి, మూడుకథల బంగారం

### సాపాటు

బ్రాహ్మడికల్లా సాపాటు వక్కటే పెద్దపాటు ఏర్పాటుచేసి బ్రహ్మోపదేశాడు.
- గురజాడ, కొండుభట్టీయము

### సాఫల్యం

తెలివిలేని శ్రమకాని, శ్రమలేని తెలివికాని, అంతగా ఉపయోగపడవు. తెలివీ, శ్రమా రెండూ కలిసినప్పుడే ఏ పనిలోనైనా సఫలత జనించేది.
- సంజీవదేవ్, రూపారూపాలు

### సామర్థ్యం

లెక్చర్లిచ్చే పండితుణ్ణి. నా కది పేలపిండి కాదూ?
- గురజాడ, కన్యాశుల్కం

**సామాజికం**

తండ్రి కొడుకుల సంబంధం సామాజికం.

- *కొడవటిగంటి, వారసత్వం*

**సాము**

సాముఁజేసి జెట్టి సాహసి యైయుండు
సాముఁజేయకున్న సరణిఁ గనఁడు
సాముఁ జేయువాఁడు చావకయుండునా?

- వేమన

**సామెత**

తెలుగులో అన్ని పనులనూ సమర్థించే సామెత లున్నాయి.

- *వసుంధర, తపోభంగం*

**సాంబారు**

పారెడు గంగ సర్వవిధ
ప్రాంతములందున పారదమ్మ! సాం
బారు సమస్త దేశముల
పారు, నఘౌఘ వినాశకంబు, గం
గారుచిరంబు, ఆ అరవ
గాయకులన్ వసవోలె త్రాపెడున్.

- *గునుపూడి, బిడాలశాస్త్రి*

**సామ్యవాదం**

సామ్యవాద బృందగీతానికి స్వరకల్పన
యువతరం నరాలమీద సాగుతోంది.

- చెరబండరాజు, ముట్టడి

**సామ్యవాది**

తనతో తెలివిగా మాట్లాడాలని భార్యకి చదువు చెపితే, అంత తెలివిగా యితర పురుషులతో మాట్లాడి చదివి భర్త ఎంత నీచుడో భార్య గ్రహించినట్టు అధికారధిక్కారాన్ని కాంగ్రెస్ ప్రజలకు నేర్పితే వాళ్ళు కాంగ్రెస్ ధిక్కారకులైన సామ్యవాదు లైనారు.

- చలం, మ్యూజింగ్స్

**సారం**

నానా 'యిజాల' కడుగున చూడ
'నాయిజం'దే అగుపడును జాడ.

- కాళోజీ, నా ఇజం

**సారా**

బ్రాహ్మల్లో కూడా మహాత్ములుంటారు. కన్నుకోగల జ్ఞానికి గంగానది అంతా సారాయి కాదా?

- *గురజాడ, కన్యాశుల్కం*

మేము పుణికి మంత్రించి, గంగ భరాయించిన కొద్దీ ఆ గంగ సారా అయిపోయింది.

- *గురజాడ, కన్యాశుల్కం*

**సార్థకత**

తనపేరు తల్లిపేరును
తనుఁ గాంచిన తండ్రిపేరు దైవముపేరున్
తనయున్న యూరిపేరును
వినుకలిగా బ్రదుకవలయు-

- *నారాయణకవి, చాటువు*

నవలే అయోమయం - నవలపేరు అంధకారం

- *శ్రీరమణ, న్యూనుడి*

**సాహసం**

పిరికి వాడై ప్రతిక్షణం చచ్చేకంటే, సాహసంతో ఒక్కసారి చావటంమేలు!

- *ఆనందారామం, మరోముందడుగు*

మనో దార్ఢ్యమనేది స్త్రీ పురుషులిద్దరికీ వొకటే. ఒక్కోసారి స్త్రీలే ఎక్కువ సాహసించగలరు.

- *నంది, నైమిశారణ్యం*

**సాహిత్యం**

సంగీతానికి, సాహిత్యానికి అద్భుతమైన ఒక శక్తి ఉంది. రెంటికీ పులిగోళ్ళున్నాయి. ఆ గోళ్ళతో గుండెను గీకి వేదనల నెత్తురును తోడుతాయి. నెత్తురుతోపాటు అలౌకికమైన అమృతాన్ని గూడా వెలికి తీస్తాయి.

- *గంగాధరం, తివాచీ*

సాహిత్యం లేకపోతే జీవితమే లేదు. సాహిత్యాన్ని ప్రభుత్వం ఖాతరు చెయ్యదు. కాని ప్రజల్లో మటుకి వాళ్ళకి తెలీకుండానే ఓ మానసిక విప్లవం వస్తుంది. ఈ మార్పు చాలా నెమ్మదిగా జరుగుతుంది.

- *నంది, నైమిశారణ్యం*

కాల ధర్మానుగతమై జగత్ప్రవృత్తి
మాఱునపుడు వాఙ్మయమును మాఱు నిజము

- *రాయప్రోలు, రమ్యాలోకము*

జరిగేదే కథలుగా రాయటంలో అర్థమేముందీ? ఎక్కడా జరగని విషయాలైతేనే సాహిత్యంగా రాయాలి.

- *కొడవటిగంటి, గ్రహాంతరయాత్ర*

సాహిత్య మనగా సాహిత్యమేనని మా దృఢాభిప్రాయం.

- చలసాని, పుణ్యభూమి

సాహెబు

సాహెబుకు సవారాజ్యం అబ్బినా బీబీకి కుట్టు కాడలే.

- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

సాహేబునకు ఖురాను దెలియనప్పుడు వీళ్లకుఁ దెలియునా?

- పానుగంటి, సాక్షి

ఉంటే అమీరు సాహేబు, లేకుంటే ఫకీరు సాహేబు, చస్తే పీరు సాహేబు.

- సామెత

గుర్రమెక్కటం చేతకాకపోతే సాయిబులు పెళ్ళి చేసుకోరు.

- కొడవటిగంటి, తాతయ్య

సి.ఆర్.

ఉద్యోగి సంవత్సరపు పనికి వెలకట్టి, ఆ వెలను అరతావు కాగితంలో ఇరికిస్తారు. ఆ అరరావు కాగితమే సి. ఆర్.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

సి.ఆర్. ఇష్టాఇష్టాలను బట్టి ఇవ్వబడిన కాగిత పువరం లేదా శాపం.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళ విక్రమార్కీయము

సిగరెట్టు

సిగరెట్ ఆడదాన్లాంటిది. అనుభవించేక కలి గేది అసంతృప్తే.

- బీనాదేవి, ది స్మోకింగ్ డాగ్

సిగరెట్టులు తెల్లగా ఉంటాయి. అగరొత్తులు నల్లగా ఉంటాయి. అగరొత్తులు గోడమీద గుచ్చి కాలుస్తారు. ఇవేమో నోట్లో గుచ్చి కాలుస్తారు.

- ముళ్లపూడి, బుడుగు

ఒక నవలగాని, ఒక కథగాని చదివితే అది సిగ రెట్టు తాగేవాడు రాసిందో, తాగనివాళ్ళు రాసిందో ముట్టుకుంటే తెలిసిపోతుంది.

- పురాణం, పొగత్రాగరాదు

జీవితంలో మంచి టెన్షన్ వచ్చినప్పుడు ఒక సిగ రెట్టు పీలిస్తే కాస్త హాయిగా ఉంటుంది.

- పురాణం, పొగత్రాగరాదు

సిగ్గు

కన్నెలకు సిగ్గరితనం అలంకారమని కన్యా శుల్కంలో వ్రాసి పెట్టనందువల్ల... నాకు అందులో నమ్మకం లేదు.

- రామకృష్ణశాస్త్రి, లావి

సిగ్గు లేకపోతే ఆడవాళ్ళ అందానికి ముసుగు లేదు. ఆ ముసుగు లేకపోతే మగవాళ్ళ ఆరా టమూ లేదు.

- కాంతారావు, మంచి ముహూర్తం

ఒక మనిషిని పెళ్ళాడుదామంటే ఆ మనిషి దగ్గర సిగ్గుపడనక్కర్లేదు.

- మహీధర, దేశంకోసం

మన జీవితమంతా మన్ని గురించి ఇతరులేమ నుకుంటారో అన్న సిగ్గుతో గడుపుకుంటాం.

- యజ్ఞన్నశాస్త్రి, విశ్వం పెళ్ళి

సిగ్గు విడువకున్న శివసౌఖ్యమే లేదు.
తగ్గి మొగ్గకున్న సిగ్గు విడదు
సిగ్గు లేనివాఁడె చిరకాల జీవిరా

- వేమన

ఆడదానికి సిగ్గే సింగారం అన్నారు.

- సూర్యారావు, శ్రీమతులు-శ్రీయుతులు

నీటిపంపుల దగ్గర బిగదీసిన పైటకొంగుకు సిగ్గు వురిపోసుకుంటుంది.

- సౌభాగ్య, సింహావలోకనం

ఈ రోజుల్లో పెళ్ళి కూతుళ్ళు చదువుకున్నవారు గావున సిగ్గుపడటం అరుదు. సిగ్గు మొగాళ్ళల్లో చూసి తృప్తిపడాలి మరి.

- బుచ్చిబాబు, గొలుసు.

దొరసాన్లు సిగ్గుపడరు!

- కొడవటిగంటి, బెదిరిన మనుషులు

రేగుపుచ్చకాయ రేయెల్లఁ దన్నిన
మఱగ దంతకంతఁ బెరుగుఁగాని
ఒరులు ఛీయటన్న నోగు సిగ్గెఱుఁగునా?

- వేమన

సిగ్గు బాధను తీసివెయ్యలేదు.

- ధనికొండ, పవిత్రులు

సిగ్గు విడిచిన పక్షమున స్త్రీ పురుషులెట్టి సాహ సకార్యములైనఁ జేయవచ్చును.

- చిలకమర్తి, అపూర్వ దాంపత్యము

ఆడవాళ్ల కిదోజబ్బు - అసలు వయసు చెప్పు కుంటే నామోషీ, సిగ్గు- అంత పెందరాళే బుద్ధి లేక పుట్టి యిప్పుడు సిగ్గుపడితే యేం లాభం?

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

కవులూ, లీడర్లూ సిగ్గు లజ్జ లొగ్గెయ్యాల!

- రావిశాస్త్రి, రొట్టెముక్క

మగవాళ్ళకు సిగ్గు ఉంటుందా?

- బాపిరాజు, కోనంగి

పేదోడి కర్ళుమీద బతికేసే పెదబాబులం, మనకి సిగ్గెందుకు, లజ్జెందుకు? !

- రావిశాస్త్రి, రొట్టెముక్క

సిగ్గుని ఆభరణంగా వేసుకుంటే నిన్ను లోకం ఖాతరు చెయ్యదు. సిగ్గుని ఆయుధంగా వాడు కోవాలి..

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

## సిగ్గుచేటు

కొడుకు కత్తిసాము కోడలు మెడపాము
చెప్పుకొన్న కొంలంది సిగ్గుచేటు

- ఏటుకూరి, క్షేత్రలక్ష్మి

## సిజర్సు

శ్రవణావతంసమై చే
దివిటీయే నీడుగెల్పుం దెల్పును ధ్వజమై
భువి నీదు యశోఘృణియై
మివులన్ వెలిగింపుమోయి మేటి సిజర్సున్

- కాటూరి, పన్నీటిజల్లు

## సిద్ధాంత భేదం

కొందరు శరీర ధార్ద్యం ఉన్నంత కాలం ప్రోనాచి, శరీరం చెడ్డ తర్వాత యాంటీ నాచి. కొందరు బతికి ఉన్నంతకాలం ప్రోనాచి, చచ్చిపోయిన తర వాత యాంటీ నాచి. కొందరు అదృష్టవంతులు చచ్చిన తరవాత కూడా ప్రోనాచే.

- గురజాడ, కన్యాశుల్కం

## సిద్ధుడు

సుకంలో దుక్కాన్నీ, దుక్కంలో సుకాన్నీ చూడ గలిగినవోడే సిద్దుడు.

- చిరంజీవి, బీళ్లు తిరగబడుతున్నాయి.

సిద్ధులూ, పిశాచాలూ మాలాంటి మాంత్రికునికి కనబడతారు. వాడి లాంటి మూఢ భక్తులకు కనబడతారు. పాపం పుణ్యం యరగని పసిపిల్ల లకి కనపడతారు. ఇతరులకు కనపడరు.

- గురజాడ, కన్యాశుల్కం

## సినిక్

సినిక్ ఎవరో తెలుసునా? మన తలలకీ, అబద్ధపు నమ్మకాలకీ, గాయం అయే నిజం మాట్లాడేవాడు.

- చలం, అర్ధరాత్రి

## సినిమా

ఎక్కడెక్కడ ఏ కవి దేన్ని అందంగా అనుభవిం చాడో దానినంతా వెతికి ఈడ్చి బైటికిలాగి, ధ్వంసపరిచి మళ్ళీ తేలుచుకోకుండా చేస్తున్నారు సినిమావారు.

- చలం, మ్యూజింగ్స్

చాలామంది ఆర్టిస్టులని సినిమా ఉపయోగించు కుని నీచుల్ని చేసి వొదులుతోంది.

- చలం, మ్యూజింగ్స్

కళ్యాణ మొచ్చినా, కక్కొచ్చినా ఆగదన్నారు. సినిమా చాన్సు అసలాగదు.

- కొడవటిగంటి, నడమంత్రపుసిరి

దిగితేగాని లోతు తెలీదు; తింటేగాని రుచి తెలీ దంటారే? అది సినిమా గురించి అన్నమాటే.

- కొడవటిగంటి, నడమంత్రపుసిరి

పత్రికలలో బాగా రాయకపోతే, పిక్చరు దెబ్బతి నదు. బాగా రాస్తే డబ్బు ఎక్కువ వచ్చేదీలేదు.

- కొడవటిగంటి, వారసత్వం

ముందర బాగా మాట్లాడ్డం నేర్చుకోవాలి. ఏట వుద్ది అనకూడదు. ఏమవుతుంది అనాలి. అలా అంటేనే సినిమాలో ఛాన్సు.

- ముళ్లపూడి, సెరిబ్రల్ సినీమియా

సినిమా నాగరికతే తిరుపతి దేవుడుకన్నా ఇంకా సనాతనమైనది.

- కొడవటిగంటి, ఎండమావులు

ఉబలాటంతోపాటు, ఖరీదైన గుడ్డలు కూడా ఉంటే సినిమా కథా రచన దగ్గర్నించి, ఫిలిం ప్రింట్లు తియ్యడం వరకూ అన్నీ తెలిసినట్టేనట.

- ముళ్లపూడి, సెరిబ్రల్ సినీమియా

తోలుబొమ్మల వికృతి సినీమాలు. భాగోత కలా పానికి వికృతి కంపెనీ నాటకాలు.

- చెళ్ళపిళ్ల, కథలు - గాథలు

తెలుగు సినిమాలకన్నా ఇంగిలీషు సినిమాలు బాగుంటాయి. అందులో ఆడవాళ్ళు మహ ధయిర్యంగా ఉంటారు. మన తెలుగు తారలల్లే అస్తమానమూ ఏడవరు.

- కొడవటిగంటి, బెదిరిన మనుషులు

తెలివైన వాడెవ్వడూ సినిమాకి పెట్టుబడి పెట్ట డోయ్. పెట్టుబడి లేకుండా పలుకుబడితో తీసి నదే సినిమా.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

ఈ కరువు రోజుల్లో బియ్యానికి పెట్టిన రేష నింగు సినిమాలకు కూడా పెడితే కొంత బీదల పిల్లలకు కూడా అర్ధాకలిగానేనా దొరకేదేమో?

- వెళ్ళపిళ్ళ, కథలు - గాథలు

గీడంత మాయ గువ్వను సూపి దేగను పడే సుడు. గీ సినిమా మందికి కలురిమ్మ తీరనే అయిపాయె.

- పవన్‌కుమార్, నల్లవజ్రం

యెనీమా వల్ల కడుపు తేలికపడ్డేట్టే సినిమావల్ల ఇల్లు తేలికపడుతుంది.

- వెళ్ళపిళ్ళ, కథలు - గాథలు

వొంటెద్దు బళ్లు తుట్టతుదకు మోటార్లుగా మారి నట్లే నాగరికత హెచ్చిన కొలదిని ఆ తోలు బొమ్మలు ఈ విధంగా అంటే "సినీమాల"గా మారిపోయి లోకానికి ఉపకారమో, అపకారమో చేస్తున్నాయి.

- వెళ్ళపిళ్ళ, కథలు - గాథలు

సినిమా కళకు ప్రయోజనం
ఆనందం అయితే
అది కళాఖండం కానక్కర్లేదు-
కళను ఖండఖండాలుగా చేసి
కాసుల వర్షం కురిస్తేచాలు.

- విజయకుమార్, కవితార్ణవ

వెర్రీవెర్రీ నీ పేరేమంటే తెలుగు సినిమా అందిట.

- శ్రీరమణ, న్యూనుడి

సినీకథ

చెరిగిపోయిన కలలనన్నిటిని
ఏర్చి - కూర్చి - నూతనంగా నిర్మిస్తే
సరికొత్త సినిమా కథ కావొచ్చు

- వేణుగోపాల్, శీర్షిక

సినీ రచయిత

వెధవ డైలాగుల కేం భాగ్యం? బిగువుగా ఉన్నాయంటే కుట్లు ఊడదీసి మళ్ళీ కుట్టేస్తాం. సినిమా రచయితలం సాహిత్యదర్జీలం కదా.

- తావీ, చమత్కారం

సినీమాయ

మన హీరోయిన్ల దురదృష్టమో, హీరోల శక్తిసా మర్థ్యమోగాని ఒకే ఒక్క కాటుకి కడుపువచ్చే స్తుంది.

- అర్నాద్, దేవుడే దిగివస్తే

సినిమాల్లో అయితే "నిన్ను" నైనిటాల్లోను, "నేను" అన్నమాట ఊటీలోను అని, "ప్రేమిస్తున్నాను" అన్న మాటకి పబ్లిక్ గార్డెన్సు వచ్చేస్తారు.

- బీనాదేవి, హరిశ్చంద్రమతి

సిన్సియారిటీ

సిన్సియారిటీ, కవితా సుందరికి
సీమంతం లాంటిది.

- తిలక్, కొనకళ్ళకు అక్షరాంజలి

సిరి

సిరి అందుకోనంత కాలమేగాని, అందుకొంటే ఆ తల్లి అనంతమైన ఆకారాలతో అవతరిస్తుంది.

- కరుణకుమార, బిళ్లలమొలత్రాడు

కొత్తగా సిరివస్తే అర్ధరాత్రి గొడుగు పట్టమన్నా డుట!

- సామెత

సిలిండరు

కలిసొచ్చే కాలానికి నడిచొచ్చే గ్యాస్ సిలిండర్లు.

- శ్రీరమణ, న్యూనుడి

సివిలిజేషన్

పాశ్చాత్యులు సైతం ఆకర్షించగల స్త్రీ తానుగా పిలిస్తే వెళ్లనివాడు ఛీ, ఛీ శుద్ధ బ్రూటోరోయ్. మనకింకా ఎప్పుడబ్బుతుందో సివిలిజేషన్ మరి!

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

సీత

ప్రతి ఆడది ఒక సీత. ప్రతి సీత చుట్టూ ఒక గీత. కట్టుకొయ్యకి కట్టిన పశువులా ఆ గీత లోపలే ఉండాలి.

- బీనాదేవి, స్వేచ్ఛాయిజం

సీతాఫలం

తినేది తక్కువా తీసిపారవేసేది ఎక్కువైన
సీతాఫలం పండులా ఉంది నా దేశం

- కుందుర్తి, ఇదీ నాదేశం

సుకవి

రాజు జీవించె రాతి విగ్రహములందు
సుకవి జీవించె ప్రజల నాలుకలయందు.

- జాషువా, వ్యత్యయము

సుకుమారత

నలినబిస సూత్రమును బురంధ్రుల తలంపు
సమము త్రెయ్యును లవచాపలమున నైన.

- శ్రీనాథుడు, శృంగార నైషధము

ఒళ్లువంగనమ్మ కాలు మట్టెలకు కంది పోయి నట్లు.

- సామెత

**సుఖజీవి**

ఊరోళ్ల పసుపూ ఊరోళ్ల కుంకం ఊరేగుదేవరా అన్జెప్పినట్టు ఊరిమీద బతికేసే వోళ్లంతా అలా కలకల్లాడతానే ఉంటార్రా!

- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

**సుఖం**

మనిషికి స్వేచ్ఛ కావాలి. ఇతరుల సహకారమూ, కావాలి. ఈ రెంటికీ వైషమ్యం కలగకుండా జీవిస్తేనే మనిషికి సుఖం ఉంది.

- కొడవటిగంటి, అనుభవం

సుఖాలు అనుభవించగలవాళ్ళ జీవితాలలో నిజమైన ఆనందంపాలు తక్కువ.

- కొడవటిగంటి, ఎండమావులు

అబద్ధాన్ని ఆశ్రయించిన సుఖం
నిజాన్ని నిరూపించే నరకం
కన్న వెయ్యిరెట్లు నయం

- తిలక్, స్వేచ్ఛావిహారం

వినోదమునందు స్వార్థరహితమైన యొక సుఖమున్నది. ఆనంద మున్నది.

- విశ్వనాథ, నందోరాజాభవిష్యతి

అందిచ్చిన సుఖం సుఖంకాదు. సుఖం యెవరికివారే ఆర్జించుకోవాలి.

- కాంతారావు, వంశధార

ఎంత కలిసుండా, పేసీల్లేకండ బోతే ఏ నాటికైనా సుకం ఉంటది.

- మా గోఖలే, యుద్ధం

మనస్సును గలంచునట్టి విషయములు వమనమువలె బైకి వచ్చెనేని మానసిక సుఖముండదు.

- చిలకమర్తి, కర్పూర మంజరి

స్త్రీని అనుభవించి యెంచాలి. సుఖాలు అనుభవ వేద్యాలుగాని వర్ణింప వీలైనవి కావు.

- గురజాడ, కొండుభట్టీయము

కష్టపడి సంపాదించే డబ్బులో దొరికే తృప్తి, సుఖం అన్యాయంగా ఆర్జించటంలో దొరకదు.

- రామచంద్రమూర్తి, దైవజ్ఞశిఖామణి

నగరానికి రాకా?

లోకాన్ని ఎప్పుడు లక్ష్యం చేయమో అప్పుడే సుఖం!

- రాజమన్నారు, విముక్తి

పసరమైన మరగదె సుఖముల్?

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

బ్రతికియున్న వారి కెవ్వరికిని సుఖములేదు.

- పానుగంటి సాక్షి

సౌఖ్యవజ్జీవు లిద్దటే జగతియందు
మొండి యొకఁడు, వేదాంతి యొకండు సుమ్మి.

- పానుగంటి, సాక్షి

ధనమెక్కువ వ్యయమైనఁగాని సుఖము చేకూరదను నొక పిచ్చి మీకు పిశాచమువలెఁ బట్టియున్నది. పైనుండి వచ్చిన వస్తువుగాని ప్రయోజనకారి కాదని మీకు దురభిప్రాంపమున్నది.

- పానుగంటి, సాక్షి

ఆడపిల్ల తను ప్రేమించే మగాడి దగ్గరకంటే తనను ప్రేమించే మగాడి దగ్గరే ఎక్కువ సుఖపడుతుంది.

- భారతీదేవి, మల్లిక

మగనితో పెళ్ళికి వెడితే ఆడవానికి సుఖముండనట్లే, భార్యతో తీర్థానికి వెడితే మగవానికి సుఖముండదు.

- పాలంకి, జోస్యం నిజమైంది

భయంలేని చావు, బాధలేని మరణం చాలా సుఖం.

- సులోచనారాణి, ఆహుతి

**సుగుణం**

సుగుణాలకి అంధత్వము ఇచ్చేది విమర్శకాదు.

- చలం, మ్యూజింగ్స్

**సుడిగాలి**

సుడిగాలి, ఎండుటాకును వలె, యౌవనము, రజో భ్రాంతి నొందిన ప్రకృతి పురుషుని తన ఇచ్ఛవచ్చిన చోటికి గొంపోవును.

- సూరి, నా రాణి

**సుతుడు**

గుణాన్వితుండుగాని సుతుఁడు ప్రసూతుండగు నఁట యకాలసురతక్రియలన్.

- పింగళి, కళాపూర్ణోదయము

**సుద్ది**

ఆ సుద్దుల్ హృదయైక సాక్షికము;
లేమన్నన్ వృథాయిత్తఱిన్.

- పింగళి, కళాపూర్ణోదయము

సున్న
ఆఢ్యుఁడున్న యప్పు డందఱుఁ బూజ్యులే
లెక్కమీద సున్న లెక్కినట్లు
అతఁడు పోవు వెనుక నంద అపూజ్యులే
లెక్క లేక సున్న లేగినట్లు.
- సంకీర్ణ పద్యములు

సులభం.
ఆశువుగారాసిన నవలను అట్టలు చూసి రివ్యూ చేసినట్టు.
- శ్రీరమణ, న్యూనుడి

దిలాసా కుదిరితే బ్రతుకుబాట సుళువు.
- కాళోజీ, దిగులు

తల్లి చెవులు తెంపిన వానికి. పినతల్లి చెవులు బీర పువ్వులు.
- సామెత

గుడిమింగే వానికి తలుపులు అప్పడాలు.
- సామెత

చాతయినవాళ్ళు చేస్తుంటే ఏ పని అయినా సులువుగా ఉన్నట్టుంటుంది.
- కొడవటిగంటి, ప్రేమించిన మనిషి

ప్రేమించడం ఆలోచించడం కన్నా చాలా సులువు.
- పద్మనాభ రెడ్డి, అంతర్వేదన

ఆడవాళ్ళను తృప్తిపరచలేకపోవచ్చుగాని, డిస ప్పాయింట్ చేయడం చాలా సుళువు.
- మారుతీరావు, నిజం నిద్రపోయింది

అంతరాత్మకి అబద్ధపు సాకులు చెప్పి దాన్ని సముదాయించేసుకోడం అన్ని పనుల్లోకీ సుళువై నపని.
- రావిశాస్త్రి, బంగారిగాడి కత

సూక్తి
చీమలు మెల్లగ నడుచును
దోమలు సంగీత మధురధోరణి నుండున్
సామజయానలె శోభా
సీమ లటన్నారు ఋషులు శ్రేయోగురువుల్
- శ్రీశ్రీ, హితోపదేశం

ఆకులు చెట్టుల కుండును
ఆకులు చక్రాల కుండు నాహార్యముగా
ఏకులు వడికిన నూలగు
మేకలలో వన్నె లెన్నొ మేదిని సఖుడా!
- శ్రీశ్రీ, హితోపదేశం

సూచన
వర్షానికీ వరదకీ సూచన్లు ఉన్నాయి. చాప క్రింద ప్రవహించే నీటి ప్రమాదం మునిగే వరకూ తెలీదు.
- వీరేంద్రనాథ్, ఆఖరిపోరాటం

సూత్రం
డిప్లమసిలో ప్రథమ సూత్రం సానుభూతి చూపడం.
- నంది, మనిషి చావకూడదు.

మనకు తెలియని పన్లు ఏం చేయదల్చుకున్నా ఏదో ఒక సూత్రాన్ని నమ్మి ముందుకు జరగాలి.
- మా గోఖలే, దొంగవాళ్ళు

సూర్యుడు
మేడలకు గిండు లుండును
ఓడలు నీళులను నడచి యూళులు గడుచుచున్.
వేడి వెలుంగుల సూర్యుడు
రాడు నిశల్ పగలె అతని రాజ్యమురా సఖా.
- శ్రీశ్రీ, హితోపదేశం

సృష్టి
ప్రేమ నలయించు సృష్టి దైవికముగాదు.
- రాయప్రోలు, తృణకంకణము

మనిషి దైవ సృష్టి, శత్రుమిత్రులు మనుష్యుల సృష్టి.
- గురజాడ, బిల్హణీయము

సృష్టించడంకన్నా ఆనందకరమైన విషయం ప్రపంచంలో లేదు.
- చలం, మ్యూజింగ్స్

అక్షరాక్షర అనుకరణ చేస్తే అది కాపీ అంటారు. మధ్యలో సొంత కవిత్వం కూడా పెడితే అనుకరణలేక అనుసరణ అంటారు. అనుకరణ సృష్టి సహజం.
- పార్థసారధి, సాహిత్యహింసావలోకనం

సెక్సు
పట్నంలో మగవాళ్ళంత కాకపోయినా ఆడవాళ్ళ మొహాలలో కూడా సెక్స్ ఆకలి కనిపిస్తూనే వుంటుంది.
- కొడవటిగంటి, కురూపి

టాక్సు లేనిది సెక్సు
ఓ కూనలమ్మా
- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

సెంటిమెంట్
దేశభక్తిగానీ, దైవభక్తిగానీ, మనుషుల్లో యేమి

అర్థంలేని సెన్టిమెంట్ల మీదనేగాని నిలవదు.

- చలం, మ్యూజింగ్స్

మనలో మందు లేకపోతే కలంలో సిరావున్నా ప్రయోజనం లేదు. అది నీ సెంటిమెంట్.

- ఆదివిష్ణు, ఎంతెంత దూరం

## సెలవు

వేసరి నట్టులయ్యె
మేనితోడి పొత్తింకిట మాను టొప్పు

- తిక్కన, భీష్మపర్వము

ఆదివారం స్కూలుకి సెలవుంది కాని జెల్లకి లేదు.

- రావిశాస్త్రి, లక్ష్మి

హాయిగా ఉండాలంటే సెలవుల్లో ప్రాణాలు
ఏ ఇంటాయనా పెట్టుకోరాదు ప్రయాణాలు.

- ఆరుద్ర, ఇంటింటిపజ్యాలు

ఇచ్చిన వెంటనే వాడుకోలేనిదే లీవు.

- ఆరుద్ర, ఇంటింటి పజ్యాలు

సెలవురోజున ఆకలి ఎక్కువ, ఆలిపోరు ఎక్కువ, పిల్లల మీద చికాకు ఎక్కువ. మనుషులు దూరంగా వున్నప్పుడే మనసులు దగ్గరగా వుంటాయి.

- సదానంద, రామదాసుచెర

అరే సావడాన్కి శెలవూ యెందుకూ భాయ్?

- వేంకటరాయశాస్త్రి, ప్రతాపరుద్రీయము

## సేద్యం

దూడల దుక్కి పడుచుల సేద్యం.

- రాజారాం, మరీచిక

సేద్యం చేసేవాడికి సెలవెక్కడుంది?

- సభా, మిథునలగ్నం

## సేవ

శబరి వణికే చేతులూ, జటాయువు విరిగిన రెక్కలు 'సేవ'లో ఉండే ఆనందాన్ని తెలుపుతాయి.

- వీరేంద్రనాథ్, ఆఖరిపోరాటం

చూచి రమ్మంటే కాల్చి వచ్చినట్లు.

- సామెత

సేవావృత్తి మానమును వలె యాచనావృత్తి సమస్త గౌరవమును హరించును.

- చిన్నయసూరి, మిత్రలాభము

నీ సేవా ధర్మమున కేమి? చెడు జగ మెల్లన్.

- తి.వేం., పాండవోద్యోగము

పాటెఱుఁగని దొరను సేవించుటకంటె మిన్నకుంట మేలు.

- చిన్నయసూరి, మిత్రభేదము

## సేవకుడు

ఎత్తఱికైనను బతి దన
చిత్తగతిం దగవు మీఱి చెప్పిన పని మా
ఱుత్తర మీయక చేసిన
నుత్తమసేవకుఁడు వాఁడె యుర్వీరమణా!

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

ఏఱువలె నిరంతరమునుఁ బాఱుచుండు
గాలివోలె నెల్లప్పుడుఁ గదలుచుండు
ధరణి రీతి రేల్పవలనుఁ దిరుగుచుండు
క్షణము విశ్రాంతి నెఱుఁగఁడు గద భటుండు.

- చిలకమర్తి, చతురచంద్రహాసము

పనిచినఁ బోనివాఁ డొకఁడు,
పంచినఁ దా నొరుఁ బంచు నొక్కరుం,
డను విదిగా దటంచు నెదు
రాడు నొకం, డొకఁ డొంటిఁ బోవరా
దను, నొకఁ డప్డు రోగినను,
నాపని గాదను నొక్కరుండు, పొ
మ్మనఁగఁ జలించు నొక్కడు, జ
నాధిప యేడ్వురుఁ గష్టసేవకుల్!

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

అదే పోతగాడు, ఎదురు మాటల వాడు, కంబం చాటుగాడు సేవకులైనట్లు.

- సామెత

## సేవాపద్ధతి

దొరగారు ఏం చెప్పినా వినయంతో "చిత్తం, చిత్తం" అని అంగీకరించాలి. ఆ తరవాత పని పూర్తికాకపోయినా మరేం ఫర్వాలేదు.

- సూర్యారావు, శ్రీమతులు - శ్రీయుతులు

## సైకిక్ ఎఫెక్ట్

సైకిక్ ఎఫెక్ట్ అనేది ఎంత పనన్నా చేయిస్తుంది.

- ధనికొండ, ప్రొఫెసర్ బింద్లైన్

## సైకిల్

నీరుం గోరదు గడ్డి నడ్గ దొక కొ
న్నే నుల్వలన్ వేడ దే
వారే నెక్కిన గ్రిందఁద్రోయ దొకడున్
బజ్జన్ భటుం డుంట చే
కూరంగా వల దెందు బైస్కిలునకుం

గోపం బొకింతేని లే
దొరా! వాజికి సాటియైన యిది వి
శ్వామిత్ర సృష్టం బొకో!
- తి.వేం., శతావధానసారము

సైన్సు

ఇంకా సైన్సుకు నవ్వేదో ఏడుపేదో తెలియలేదు.
- ఆత్రేయ, ప్రగతి

చావటాన్ని బ్రతకటాన్ని ఎంత నాజూకుగా చేసింది సైన్స్!
- ఆత్రేయ, ప్రగతి

సొంతం

నిరాశ నాకున్న ధనం
నిస్పృహ నా ప్రేమవనం.
- రామనర్సయ్య, అసిధార

కార్మికుడికి కావలసిన పనిసాధనాలు తన స్వంతానివి కానపుడు అతడెందుకూ పనికి రాడు.
- లక్ష్మణరావు, అతడు - ఆమె

తనవారికెంత గల్గినఁ
దన భాగ్యమె తనకుఁగాక తథ్యము సుమతీ.
- బద్దెన, సుమతి శతకము

చులుకఁ గాల్వట్టి యీడ్చినఁ జూరువట్టి
వేలుదురుగాక తమవారి విడుతు రెట్లు?
- శ్రీనాథుడు, కాశీఖండము

సొమ్ము

అందానికి పెట్టిన సొమ్ము ఆపదకు అడ్డం వస్తుంది.
- సామెత

సోడాబుడ్డీ

గుండు గొంతుకలోన కొట్లాడుతాది
గుటకేయ నీదురా కాసింత కూడ.
- మాచిరాజు, సోడాబుడ్డీ

సోదరమానవులు

సోదరమానవు లంటే, మనం ఇంకా సోదరులు మాత్రం మానవు లనుకునే స్టేజీలో ఉన్నాం.
- రావిశాస్త్రి కుక్కపిల్ల

సోది

సూదికిగాను సోదికిపోతే పాతరంకులు బయట పడ్డాయట.
- సామెత

సోమరితనం

అసలు భారతీయ సంస్కృతికి పునాది మాత్రం సోమరితనం. పోనీ తీరుబడి.
- చలం, మ్యూజింగ్స్

సోమరిపోతు

ఈ రోజుల్లో బలంగల మనిషి ఏడ్రా! ఎక్కడ చూచినా సోమరిపోతు సంఘాలు.
- మాగోఖలే, మాగోఖలే కథలు

సోషలిస్టు

భాగ్యవంతుల్లో చాలామంది
సోషలిస్టులు, అదో ఫ్యాషను.
- యజ్ఞన్నశాస్త్రి, విశ్వంపెళ్లి

సోషలిజం

సోషలిజమే ఒక పెద్దకల. ఆ కల నిజం చేసు కోవాలంటే... మనం చాలా పెద్ద పెద్ద కలలు కనగలగాలి.
- మహీధర, దేశంకోసం

పెద్దోళ్ల కలా ఆడపాదడపా సురకలు తగిలించ డాన్నే సోషలిజం అంటారు సద్దుంకున్నోళ్లు మన పోలీసోళ్ళు దేసేనికే ప్రెతమ సోషలిస్టులు.
- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

సోషలిజం వస్తే ప్లీడర్ల పని వుండదన్నారు.
- మహీధర, ఓనమాలు

మరి పెద్ద దిక్కు లేనప్పుడు ఇంట్లో అంతా శోష లిజమే కదా.
- పురాణం, మా మావగారి శోషలిజం

రేపో గుమాస్తా పని దొరికిందంటే
సోషలిజం సొమ్మసిలి పడుకుంటుంది.
- బుచ్చిబాబు, దారినపోయేదానయ్య

రానున్నది యేది నిజం?
అది వొకటే, సోషలిజం
- దాశరథి, రానున్నది

సౌకర్యం

దడుపు మనిషికి దమ్మారిన టపాకాయతోడై నట్టు.
- శ్రీరమణ, న్యూసుడి

సౌందర్యం

సంసార్లకి సౌందర్యంతో యేం పని?
- గురజాడ, కన్యాశుల్కం

సౌందర్యమనేది హృదయంలో వుంది.
- చలం, మ్యూజింగ్స్

యధార్థమైన సౌందర్యము వయసు హెచ్చిన కొలఁది హెచ్చును. ప్రాంత బంగారమునకు వన్నె తగ్గునా?

- పానుగంటి, వీరమతి

సత్యం శివం సుందరం అన్నారోయ్, సౌందర్యోపాసన చాతకాని దేశమై పోయిందోయ్ మనదేశము.

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

భగవంతు డొసగిన సహజ సౌందర్యం ముందు ఎన్నివేల ఆభరణాలైనా సూర్యుని ముందు దివిటీలే.

- సభా, నీటిదీపాలు

మానిసి సౌందర్యము కన్నులలోఁ జేతులలో మొగములో నుండదు. అతని యాత్మలో నుండును.

- విశ్వనాథ, వేనరాజు

ఉదయా లెన్నో నశిస్తాయి;
ఉదయ సమయ సౌందర్యం చావదు.

- దాశరథి, పునర్నవం

సౌందర్యము దేశమును బట్టి, కాలమును బట్టి మాఱుచుండును.

- విశ్వనాథ, చెలియలికట్ట

కొన్ని సౌందర్యములు చూచి యానందించుటకు మాత్రమే పనికి వచ్చును. తాతలనాఁటి దివ్వె యని తలకు కొఱవి పెట్టుకొనము.

- విశ్వనాథ, చెలియలికట్ట

శీలం లేని సౌందర్యం - తావిలేని పూవు వంటిది.

- సామెత

## స్తిమితం

మనసు స్తిమితం లేకపోతే మరుపు ఎక్కువవుతుందంటారు.

- సూర్యారావు, ఇల్లు కూలింది

## స్త్రీ

ఈ లోకంలో ఆడదై పుట్టడంకంటే అడవిలో మ్రానై పుట్టడం మేలు.

- సామెత

అసూయకు పర్యాయపదం - స్త్రీ

- విహారి & శాలివాహన, సాగర సంగీతం

తెలివిగల స్త్రీలు అవసరాల ముందు ఆదర్శాలను చూడరు.

- తాళ్ళూరి, శ్రావణసంధ్య

అల లున్నది ఆటుపోట్లకే. అతివ లున్నది అగచాట్లకే.

- కురుమద్దాలి, డాక్టర్ తనూజ

ఆడవాళ్లు పైకి కోపంగా ఉంటే, లోన అభిమానంగా ఉన్నారన్నమాట.

- కాంతారావు, బూచీ

ఆడవాళ్ళకు హృదయం ఉంటుంది, గుండె ఉండదు.

- వసుబాబు, ఆద్యంతాలూ - ఆంతర్యాలూ

పడఁతి లేనియట్టి పండువు దండువు
చాన లేనియట్టి శయ్య కొయ్య
పొలఁతి లేనియట్టి భోగంబు రోగంబు
భామ లేనియట్టి గీము పాము.

- విష్ణుభట్ల, దుర్మార్గ చరిత్ర

నెలంతల్ ముచ్చట కూసు లాడెదరు, సందేహమ్ము వోకార్చుపట్టునఁ బల్లెత్తరు.

- ఏటుకూరి, క్షేత్రలక్ష్మి

స్త్రీ నిజమ్ముగ సృష్టికి జీవగఱ్ఱ.

- ఏటుకూరి, క్షేత్రలక్ష్మి

నే చూసిన స్త్రీలు వివాహం జరిగిన రోజునే జన్మించిన వాళ్లు. భర్తని పొడిగిస్తే, స్త్రీ ఔతుంది; యింకా పొడిగిస్తే భర్త సంతానంగా మారతాడు.

- బుచ్చిబాబు, నన్నుగురించి కథ వ్రాయవూ?

ఈ ఆడ వాళ్ళకిదో జబ్బు! ఎదుటివాడి పెళ్ళాం యోగక్షేమాలు భోగట్టా చేస్తారు.

- శ్రీశ్రీ, 1+1=1

చిరకాలానుగతాచారసంరక్షణము స్త్రీయందే నిలిచియున్నది.

- పానుగంటి, సాక్షి

స్త్రీ ఒక ప్రాణం వున్న పనిముట్టు.

- పురాణం, ఇల్లాలిముచ్చట్లు

సాపాటు పుష్టికి సంబాళింపునకుఁ జాల భేదమున్నదిలే. "మోటారు కారును" ముందునకుఁ బోకుండ నాపవచ్చును గాని కాలి దురద యాలిని గడద్రొక్కకుండ నాపలేము. వక్షమునఁ బదునాఱుబండ్ల బరువును జెదరనీకుండ బట్టవచ్చును. కాని ప్రక్కను జలచిత్తపుఁ బలుగాకిని బెసఁగనీకుండఁ బట్టలేము. ఇనుప గొలుసు విరువవచ్చును. కాని మగువల పులుసును విఱుఁగఁగొట్టలేము. ఆడుదాని

యోగ్యత మగవాని యాహారశక్తిలో లేదు. వెన్నుపాము బింకములో లేదు.

- పానుగంటి, సాక్షి

ఆడువారికేమున్నది? మగవారిపై నిష్టమున్నc గొండంత నేర మిండుపగింజంత! అన్యథాయై నచో నిండుపగింజంత తప్పు హిమాలయపర్వతమంత.

- పానుగంటి, సాక్షి

ఒకనికి కుమారితను మరియొకనికి సఖి
నింక నొకనికి తల్లిని ఇందులోన
నెవ్వరితనొ భావింపుము హృదయమందు
వావి వరుసలు వాసనావశము లేవి?

- రాయప్రోలు, జడకుచ్చులు

స్త్రీ గూడుపన్ని కూచున్న సాలీడు. పురుషుడు ఎరపడగానే కబళించేస్తుంది.

- యఱ్ఱన్నశాస్త్రి, విశ్వంపెళ్లి

ఆడవాళ్లు విమర్శ మూలంగా ఆధిక్యత సంపాదించుకోవా లనుకుంటారు.

- జయరాం, సింహాద్రి స్వీట్‌హోమ్

యెంత చదువుకున్నా, యెన్ని పరీక్షలు గట్టెక్కినా, తాము చదివింది వంటపట్టించుకొని యే విషయమైనా ఒరిజినల్‌గా మాట్లాడగల స్త్రీలు చాలా తక్కువ.

- చలం, మ్యూజింగ్స్

సమస్త శాశ్వత ఘనకార్యాలకూ, ప్రయత్నాలకూ, వాఙ్మయాలకూ వెనకవున్నది స్త్రీశక్తి.

- చలం, మ్యూజింగ్స్

స్త్రీ ఏ పరిస్థితుల్లోనైనా ఆరాధ్యదేవత. తుచ్ఛ శారీరకమైన దృష్టితో స్త్రీని కొలిచి విలువ కట్టాం కాబట్టే మనమిలా అధోగతిలో ఉన్నాము.

- సుబ్రహ్మణ్యశర్మ, బంకోలా

సృష్టి ప్రోద్బలంవల్ల పురుషుడిమీది ఆకర్షణ, మనసు ధిక్కారంవల్ల అతనిమీద అసహ్యం. ఆమెలో జరిగే యీ విరోధాలవల్ల చాలా విక్షతంగా తయారౌతోంది స్త్రీ నాగరికత పొందినకొద్దీ.

- చలం, మ్యూజింగ్స్

కాంతా మూలములైన యుద్ధములే కదా ప్రపంచములోc బెద్దపెద్ద రామాయణములును, భారతములు నైనవి?

- కూచి, రూపలత

పురుషుల మేలిమి పొలంతు లెఱుcగ,
రది గాక నిర్లజ్జలై కుత్సితుల భజియింతురు, కదిసిన యంతcజేసి
వర్జనీయులు లేరు వారలకెవ్వరు.

- తిక్కన, ఆనుశాసనిక పర్వము

కాంతల బుద్ధి యింతయని
కాంచ నశక్యము ధాతకైన న
త్యంత వయో విలాసములు
దాలిచి యెంతటి వానినైనc గా
ఱింతురు బంటుగాc గొలిపి ఱేcడుగ వానినిc
జేసి రాజ్య మేలింతురు గోరిరేని యవ
లీలలు వారికి మించి తేల్చుటల్.

- కోలాచలం, శిలాదిత్య

పెరటc జెట్టుc బెట్టి పరికింప కుండిన
వెలుcగు దాcటి తీcగ వెడలcబాఱు
నాcడుదాని గుణము నటువలె నుండురా

- వేమన

గాయాలు స్త్రీ హస్తంతో చప్పున మానుతాయి.

- ఆమంచర్ల, విశ్వాంతర

స్నేహితుల్ని మరచిపోవడం కోరికల్ని జ్ఞాపకం ఉంచుకోవడం ఆడవాళ్ల జన్మహక్కు.

- మారుతీరావు, నిజం నిద్రపోయింది

సకల విషయంబులును బోధ సలుపు గ్రంథములు; మనోవ్యాధి మాన్పెడు మూలికలు; విచారవారాశి దాcటింపcజాలు నౌక
లంగనలు; దైవమిడు వారికట్టిశక్తి.

- కాళ్లకూరి, పద్మవ్యూహము

స్త్రీ హృదయం మహా సముద్రం. దాన్ని కదిలిస్తే మంచి రత్నాలతోపాటు, గులకరాళ్లు బయటపడతాయి.

- మారుతీరావు, నిజం నిద్రపోయింది

తమలో లేనివాటిని యితరులలో చూసి బాధపడతారు. ఈ లక్షణం ఆడవాళ్ల సొత్తేమో.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

ఒక్కొకతఱిం బువుబోండ్లు కటారికత్తియల్.

- పింగళి, కళాపూర్ణోదయము

ఆడవాళ్ళు ఏ మాట చెప్పినా చక్కగా అతికినట్టుగా చెప్పగలరు.

- సరస్వతీదేవి, రాజహంసలు

ఎట్లాగయినా సలహా లివ్వటానికి ఆడవాళ్ళదే పైచెయ్యి!

- సరస్వతీదేవి, రాజహంసలు

క్షణ భంగురములు కాంతల తాల్ముల్.

- పింగళి, కళాపూర్ణోదయము

కలకంఠి కంట కన్నీ
రొలికిన సిరి యింట నుండ నొల్లదు సుమతీ.

- బద్దెన, సుమతి శతకము

ఆడదాని బుద్ధి సూక్ష్మం.

- గురజాడ, కన్యాశుల్కం

ప్రకృతిని గుర్తిస్తేనే కాని సృష్టిలేనట్లు, స్త్రీని గుర్తిస్తే కాని సృష్టిలేదు. ప్రకృతికి ఎంత హృదయముందో వారికీ అంతే.

- బుచ్చిబాబు, ఒమర్‌ఖయామ్

ఆడది సాటి ఆడవాళ్ళని నమ్మదు. తన మొగుడితో చనువుగా ఉంటే ఆడవాళ్లని అసలే నమ్మదు. మొగుణ్ణి ఎప్పుడూ నమ్మదనుకో.

- పాప, హెడ్‌మాస్టారు

ఆడవాళ్లకి దేవుడు నోరివ్వలేదా?

- గురజాడ, కన్యాశుల్కం

ఆడదాన్ని నోరుబెట్టుకు బతకమని దేవుడు చేశాడు.

- గురజాడ, కన్యాశుల్కం

నాజూకైన మనస్సుగల స్త్రీని మల్లెపూవులాగ వాడుకోవాలండి.

- గురజాడ, కన్యాశుల్కం

స్త్రీ తప్ప రహస్యం సృష్టిలో ఇంకెవ్వరూ దాచలేరు. స్త్రీ తప్ప మరెవ్వరూ బైటపెట్టనూ లేరు.

- బుచ్చిబాబు, గొలుసు

ఎంత అయిష్టం నటిస్తుందో అంత సులభసాధ్యం స్త్రీ

- బుచ్చిబాబు, స్వతంత్రజీవులు

స్త్రీలకు ధనవంతుడే గొప్పవాడని గుడ్డి నమ్మకం.

- బుచ్చిబాబు, ఒమర్‌ఖయామ్

స్త్రీలు శరీరాలు లేని ఆత్మలు.

- బుచ్చిబాబు, స్వతంత్రజీవులు

క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్.

- పెద్దన, మనుచరిత్ర

ఆడదాన్తో ఉన్న తంటాయే అది, ఇయాళున్నట్టు రేపుండదు.

- రావిశాస్త్రి, రొట్టెముక్క

ఆడదేటంటే తను తిరగదు, మన్ని తిరగనియ్యదు.

- రావిశాస్త్రి, బంగారిగాడి కత

మడిసిని పాడుసేసినా ఆడదే, ముందుకు గుంజినా ఆడదే. మడిసిని మడిసిగా ఆడదేసెయ్యాల.

- సరస్వతీదేవి, స్వర్ణకమలాలు

మనం గట్టిపడితే అడది మెత్త పడుతుంది.

- రామదాసు, మాస్టర్జీ

చంచలాక్షులు చపలప్రచార లెందు.

- రామకృష్ణుడు, పాండురంగమాహాత్మ్యము

పిలిచినప్పుడు రాదు
వెడలగొట్టిన పోదు
వనిత తీయని చేదు
ఓ కూనలమ్మా.

- ఆరుద్ర, కూనలమ్మ పదాలు

వొంట్లోవేడి, వొంటిమీద పొంగూ వున్నంత కాలంవే ఆడదానికి.

- లక్ష్మణరావు, అతడు - ఆమె

ఆడవాళ్ళం మేం పాపిష్టులం కాం. మేం పాపాలు భరించేవాళ్ళం.

- లక్ష్మణరావు, అతడు - ఆమె

కాము గెలువవచ్చుఁ గాలారి గావచ్చు
మృత్యు జయము గలిగి మెఱయవచ్చు
నాఁడువారి చూపుటంపఱ గెలువంగ
వశముగాదు త్రిపురవైరి కైన.

- పోతన, భాగవతము

అధముఁడైనవాని యాలి కావుటకంటె
నధికునింట దాసి యగుటమేలు
హీనుఁ బొంది యోని హింసింపఁగా నేల
యువతిజనుల కూరకుంట లెస్స.

- పోతన, భాగవతము

కష్టములు వచ్చినప్పు డాఁడువాండ్రే సహాయము చేయవలయును.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

దేనికయినా ఆడది సాహసిస్తుంది కాని, తాను చేసిన పనిలో లోపం ఉందంటే మాత్రం ఊరుకోదు.

- మారుతీరావు, నిజం నిద్రపోయింది

బాధ్యతలన్నీ స్త్రీవి, హక్కులన్నీ పురుషుడివి.

- బుచ్చిబాబు, స్వతంత్రజీవులు

హబ్బబ్బ ఈ ఆడాళ్ళు ఉత్తప్పుడు మంచివాళ్ళే గాని, రైల్లో బలే చెడ్డవాళ్ళులే.

- ముళ్ళపూడి, బుడుగు

ఆడవాళ్ళ ఆదరం తెలిసేది భోజనం దగ్గరే.
- విచ్చేశ్వరరావు, మనసులో మనిషి

ఆడాళ్ళా! అమ్మో! వేదవ్యాసు డాడదై ఉంటే భారతమంతా అయిదు పేజీల్లో రాసును.
- కొడవటిగంటి, బ్రతుకుభయం

ఆడవాళ్లకు గతాన్ని నెమరు వేసుకోవటంలో ఉన్న ఆనందం యింతా అంతా కాదు.
- కొడవటిగంటి, ఐశ్వర్యం

రక్షణ అవసరమైన ఆడది మంచితనంగల మగ వాడిలో మంచితనాన్ని రేకెత్తిస్తుంది.
- కొడవటిగంటి, వారసత్వం

ఒక పురుషుడి ప్రాణం తన కోసం కొట్టుకుపో తుంటే, ఆ సంగతి వాడు చెప్పకపోయినా ఆడది గ్రహిస్తుంది.
- కొడవటిగంటి, వారసత్వం

ఆడదాని అందం క్షణభంగురం.
- కొడవటిగంటి, రాధమ్మ కూతురు

ఆడదాని బుద్ధి కోతిలాంటిది.
- కొడవటిగంటి, రాధమ్మ కూతురు

ఆడవాళ్ళంతా కలిసి తిరగబడితే మగవాళ్ళగతి ఏంకాను?
- కొడవటిగంటి, గ్రహాంతరయాత్ర

ఆడవాళ్ళు ఎంతసేపూ కూరల్ని గురించీ, చీరెల్ని గురించీ, నగల్ని గురించీ మాట్లాడతారు తప్ప ఇంకోటి మాట్లాడరు.
- కొడవటిగంటి, చదువు

ఆడదయి పుట్టాక అణకువ నేర్చుకోకపోతే యెలాగ?
- సుబ్రహ్మణ్యశాస్త్రి, రక్షాబంధనం

చెడిపోవటమనేదాన్ని, తనకే అన్వయించుకుం టుంది తప్ప తన నుంచి సుఖం కొనుక్కోవా లని వచ్చే మగాడికి అంటగట్టదు స్త్రీ. ఇదెక్కడి రూలో మరి.
- రామచంద్రమూర్తి, ఊబి

ఆడవాళ్ళ మాటవింటే ప్రాణాలు కొరికేస్తారు.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, రక్షాబంధనం

ఒక ఆడది కోరేవాణ్ణే మరో ఆడదీ కోరుతుంది.
- సుబ్రహ్మణ్యశాస్త్రి, నీలాసుందరి

బలహీనులైన స్త్రీలు తరతరాలనించి నేర్చుకున్న trick మోహించినందుకూ మోహించనందుకూ కూడా మొగవాణ్ణి నిందించడం.
- చలం, మ్యూజింగ్స్

చాలా మంది ఆడవాళ్ళకి వీపుకి కళ్ళుంటాయి.
- చలం, మ్యూజింగ్స్

ఆడుది అబలకాదు. ఆడుది సత్యము. ఆడుది తెగింపు.
- సూరి, నా రాణి

అబల యను పదము స్త్రీ జాతికి నామముగాఁ జేసి శాస్త్రకారులు వారి నెంతయు ఘోరముఁ జేసి వైచిరి.
- సూరి, నా రాణి

ఆడవాళ్ళని తగిలించుకోవటం తేలికే. వొదిలిం చుకోవటం బ్రహ్మప్రళయం.
- గోపీచంద్, అసమర్థుని జీవయాత్ర

కప్పురంపుఁ గుదుటఁ గస్తూరి యెరువుతో
నుల్లి నాటి చందనోదకములఁ
బెంపిరేని దాని కంపు మాయని భంగి
నెంతయైన నిలువ దింతి మనము.
- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

భామినులు ధనంబు లేని పతి మెచ్చరు
లేమియె కీడు గావునన్.
- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

ఆడవాండ్లు పుట్టింటికి వస్తే మగవాండ్ల మీద గౌరవం పోతుంది.
- ఉన్నవ, మాలపల్లి

చదువు నేర్చిన ఆడదానితోను వంటనేర్చిన మగ వాడితోనూ యెవ్వరూ వోపలేరు.
- కందుకూరి, వేశ్యాప్రియప్రహసనము

మన సమాజంలో ఆడది డబ్బిచ్చి కొనుక్కునే భోగవస్తువు కావడం కన్నా హేయమైన విషయం ఇంకోటి ఉండబోదు. తతిమ్మా కార ణాలన్నీ అటుండగా ఈ ఒక్క కారణం మాత్రమే చాలు, మన సమాజాన్ని గర్హించడా నికి, ఖండించడానికీ.
- అనంతం, ఏమిటి? ఎందుకు? ఒకటి

తరుణు లెంతటి ధీరుల ధైర్య మెల్లఁ
జూరఁగొందురు కన్నెత్తి చూచిరేని.
- వేంకటరాయకవి, మదనగోపాల శతకము

వెఱ్ఱివాని కైన వేషధారికి నైనఁ
రోగి కైనఁ బరమ యోగి కైన
స్త్రీలఁ జూచినపుడు చిత్తము రంజిల్లు
- వేమన

పనస తొనలకన్న పంచదారలకన్న
జుంటి తేనెకన్న జున్నుకన్న
చెఱకు రసము కన్న చెలుల మాటలు తీపి
- వేమన

తొయ్యలులకన్న రమ్యవస్తువులు లేవు
వారలే కష్టముల కెల్లఁ గారణములు.
- లక్ష్మణకవి, సుభాషితరత్నావళి

కైక పుట్టి చెఱిచెఁగా రాము పట్టంబు
సీత పుట్టి లంకఁ జెఱిచెఁ గాదె
కౌరవులను జెఱిచెఁ గద ద్రౌపదియుఁగూడ
- వేమన

ఆడుదాని బొంకు గోడపెట్టిన యట్టు
పురుషవరుని బొంకు పూరి తడక
స్త్రీల నేర్పు మగలఁ జీకాకు పఱచురా
- వేమన

చక్కనైనవాని మక్కువఁ గన్నంత
తక్కువగనుఁ జూచు తనదు విభుని
ఆఁడు బుద్ధికంటె నపరబుద్ధి యిఁకేది?
- వేమన

ఉపలములకంటెఁ గఠినంబు లొక్కవేళఁ
గుసుమములకంటె నొకవేళఁ గోమలములు
గాన లజ్జాభయంబులు గలవొ లేవొ?
పువ్వుఁబోడుల హృదయంబు లెవ్వఁ డెఱుఁగు?
- శ్రీనాథుడు, శృంగారనైషధము

వనిత తనంతఁ దా వలచి
వచ్చినఁ జుల్కనగాదె యేరికిన్?
- పెద్దన, మనుచరిత్రము

కలంచునే సతుల మాయల్ ధీర చిత్తంబులన్?
- పెద్దన, మనుచరిత్రము

స్త్రీలు, రాజ్యాలు మనుష్యుల మనస్సులను పాడు చేస్తవి.
- బాపిరాజు, గోనగన్నారెడ్డి

ఎప్పటికైనా ఆడవాళ్ళబాధలకు పురుషులే కారకులు.
- బాపిరాజు, నారాయణరావు

క్షణ భంగురములు కాంతల తాల్ముల్.
- పింగళి, కళాపూర్ణోదయము

పురుషుడిలో ఉత్సాహాన్ని రగిలించి, ఆత్మవిశ్వాసం పెంపొందింప చేసేదే స్త్రీ శక్తి.
- ఆనందారామం, ఇదా భారతం?

బాల్యమునఁ దండ్రి యౌవనప్రాప్తి మగఁడు
వార్ధకంబునఁ దనయుఁడు వామనయన
నరసి నడపనకా కెందు నంగనలకు
వలసి నట్టులు సేయఁగ వచ్చునెట్లు?
- తిక్కన, ఆనుశాసనిక పర్వము

నాతుల మాటల్
వడగండ్ల గుండ్లు, జలనిధి
కడళ్ళ నిలకడలు, భిన్నఘటతోయంబుల్
- అనంతుడు, భోజరాజీయము

రానివాళ్ళకి అబ్బేది వాటర్ కలర్ పైంటింగ్. కేవలం స్త్రీల కోసం కల్పించబడ్డ లలితకళ.
- బుచ్చిబాబు, ఒకేనిద్ర -ఎన్నోకలలు

పరువయిన ఆడది నీ యింటి కెందుకొస్తుంది?
- గురజాడ, కన్యాశుల్కం

భామలకుఁ జేయు సత్యంబు పాడిగాదు.
- శ్రీనాథుడు, హరవిలాసము

కాంతలకు హావభావాదు లెట్టివో, కవుల కాయా రచనావిశేషాలున్నూ (లీలావతీనాం సహజా విలాసాః భర్తృహరి, చూ) అట్టివే. విలాసమే లేని స్త్రీలున్నూ వుంటారు. రచనా విశేషాలు దొరకని కవులూ వుంటారు. ఇంతే కాదు, ఆయా రహస్యాలు కనిపెట్టడం చేతగాని వ్యాఖ్యాతలున్నూ వుంటారు.
- వేళ్ళపిళ్ల, కథలు - గాథలు

స్త్రీ అంత నిర్లిప్తంగా అనుసరించ గల్గది భర్తనే.
- మహీధర, స్వయంవరణం

ప్రపంచంలో దేనిలోనైనా భాగం ఇవ్వగలిగినది, భర్తలో భాగం ఇవ్వలేనిది స్త్రీ.
- బుచ్చిరెడ్డి, తడిక

స్త్రీల యంతఃకరణము జల్లెడ వంటిది.
- పానుగంటి, ప్రచండచాణక్యము

కుసుమ సౌరభములు గుది్రగువ్వవచ్చు
నిసుక బొమ్మల నీట నీదింపవచ్చు
వడి వడగండ్లతో గుడి కట్టవచ్చుఁ
గాని యింతుల మనోగతిఁ గానరాదు.
- గౌరన, నవనాథచరిత్రము

ఆఁడుదాని యంతరంగ వైఖరి యభిమాన ప్రకృతినెంత సహవాస మొనర్చిననైన మగవాఁడు తెలిసికోఁజాలఁడు.
- పానుగంటి, వీరమతి

విద్యలన్నిటిలో నాఁడుదాని హృదయము చదువఁ గలిగిన విద్యయే విద్య. ఆఁడుదాని

హృదయమంత గ్రంథము ప్రపంచమున లేదు.

- పానుగంటి, చూడామణి

ఆఁడుది తిరుగఁబడిన తరువాత నెంత మేధావంతుఁడైన "మెమె, మె" యనవలసినదే కదా!

- పానుగంటి, ప్రచండ చాణక్యము

కూడు వండని ఆడది, మంచం అల్లని మగవాడూ ఉండరు.

- సామెత

ఆఁడుదాని కాయువుప ట్టెక్కడున్నది? శరీర సౌందర్యములో లేదు. వాక్సమత్కృతిలో లేదు. నగలలో లేదు. నాణెములలో లేదు. మేడలలో లేదు. మిద్దెలలో లేదు. కీర్తిలో లేదు. సంతానములో లేదు. స్వాధీనభర్తృకతలో నున్నది.

- పానుగంటి, సరోజిని

ఆడుం గాన్పును గంట కన్న, సతి గొడ్రాలౌటయే మేలు, నూఱేడుల్ పెంచిన గూఁతురేమి సతమా?

- కాకుమాని మూర్తి, పాంచాలీ పరిణయము

ఆడబ్రతుకు అడివీ, అధ్వాన్నమూనూ

- పురాణం, వెలిసిపోయిన పెళ్ళి ఫోటో

మన ఆడవాళ్ళకు జీవితాన్ని అనుభవించడం బొత్తిగా చేతకాదు. మనం కిటికీల్లోంచి చూసే దానికంటే ప్రపంచంలో ఎక్కువ వెలుగే వున్నదన్న విషయాన్ని వాళ్ళు గ్రహించరు. అభిప్రాయాలూ అనుభవాలూ, వంట ఇంటినీ పడగ్గదినీ దాటిపోవు.

- ఠాకూర్, శ్రావణసంధ్య

అతడు రాక్షసుం డటంచు సౌమిత్రి వ
చించె, సుంత వినదు చెలువ తాను,
ననుభవించెఁ దాను, ననుభవించితి మేము,
నాఁడు దింతసేయు ననుచుఁ గలదె?

- విశ్వనాథ, రామాయణ కల్పవృక్షము

## స్త్రీ పురుషులు

సంకోచానికీ, సాహసానికీ కూడా స్త్రీముందు పురుషుడెందుకు?

- చలం, హంపీ కన్యలు

నా కాఁడుదాని సంస్కృతము విన్నను మగవాని కాకలీగీతము విన్నను నవ్వుటాలగా నుండును. ఆఁడుది సంస్కృత భాషఁ జదివినప్పుడు ముక్కుత్రాడు పోసిన యాఁబెయ్యవలె సూ సూ సూ యనును. మగవాఁడు సంగీతము పాడినచో వృద్ధ పురోహితుడు మెడనిండ నెండిన పూవుదండలు దాల్చి వేదమంత్రములు చదివినట్లుండును.

- తి.వేం., మృచ్ఛకటికము

సంసారం స్త్రీకి పంజర మయిందంటారుగాని శృంగార పురుషుడికి పంజర మయినంత కాదు. ఎవరికో తప్ప

- చలం, వాళ్ళు నలుగురూ

ప్రపంచమున జరుగు శుభాశుభ కార్యములన్నింటిలోనూ రూపాయకుఁ బదునాల్గణాల వంతు వఱకు భార్యా బలాత్కారమున చేయఁబడినవే. శుభములు జరిగినప్పుడు మన ప్రయోజకత్వముగనే మురిసి పాఱిపోవును. అశుభములు తటస్థించినప్పుడుమాత్ర మాఁడుదాని నోరు బైటపడును.

- పానుగంటి, సాక్షి

వాగ్ధారాళత పురుషులకంటే స్త్రీలకు మిగుల హెచ్చుగా నుండును. ఆఁడుదాని ధోరణి ముందు మగవాని ధోరణి దిగదుడుపునకన్నఁ బనికిరాదు.

- పానుగంటి, సాక్షి

మగవా రెప్పుడు మాటల బండారమే. ఆఁడుది నోరు చేసుకోవలెను. పట్టుమని పనిలోనికి దిగవలెను. అపుడు మహాకార్యములు జరుగవలయును.

- పానుగంటి, సాక్షి

ఆడుఁది యున్నచోటునే యన్ని సౌరభములు! మగవాఁడున్న చోట నేమున్నది? పొడుము వాసన, చుట్టకంపు, సిగరెట్టు గొట్టుకంటె నేమున్నది? ఆహాహా! పురంధ్రీమణుల చేతను బువ్వములచేతనే కదా భూమి కలంకారము.

- పానుగంటి, సాక్షి

మగతత్త్వము నాఁడుతత్త్వము నొక్క మందడినే యంటియున్న వయినను దానికిని దీనికి నత్యంత భేదమున్నది. ఒకటి కఠినము, రెండవది మార్దవము. ఒకటి హేతుబద్ధము, రెండవది రసప్లుతము. ఒకటి చంచలము, రెండవది స్థిరము. ఒకటి బలీయము, రెండవది దుర్బలము. ఒకటి మలీమసము, రెండవది పరిశుద్ధము.

- పానుగంటి, సాక్షి

స్త్రీ ఎంతసేపటికీ తన ఆనందాన్ని దూరంగా దాచుకుని, ప్రేమ వుందికదా అని సంతోషి

స్తుంది. పురుషుడు మీద వురకాలనుకుంటాడు.

- చలం, వివాహం

బుర్ర గోక్కుంటేగాని మొగరాజులకు ఆలోచన తట్టదు. మూతి బిడాయించుకుంటేగాని ఆడ వాళ్లకి ఆలోచన సాగదు.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, షట్కర్మయుక్తా

మగవాడి బరువు భారాలు ఆడదీ, ఆడదాని కష్టసుఖాలు మగవాడూ కని పెట్టకపోతే యింకేమి లాభము?

- సుబ్రహ్మణ్యశాస్త్రి, రక్షాబంధనము

మగవాళ్ల నగ్నసత్యానికి సాక్షులు ఆడవాళ్ళు.

- కొడవటిగంటి, ఆడజన్మ

స్త్రీ తన సమస్తమును తన హస్తములో నుంచిన కృతజ్ఞత చూపు పురుషులు మిక్కిలి యరుదు.

- చలం, శశిరేఖ

## స్త్రీవాంఛ

పొట్టవానికి మితిలేని పొలతివాంఛ
యనుట నిశ్చయము.

- పానుగంటి, సాక్షి

## స్త్రీ విద్య

విద్యా విహీనులు పశువులని యెల్లవారును చెప్పుచున్నారు గదా? మనము స్త్రీలకు విద్య చెప్పింపక వారిని పశువులవలె నుంచి వారితో సహవాసము చేయుచుండెడు పక్షమున మనుష్యులు పశువులతో సహవాసము చేసెడునట్లే కదా యగును?

- కందుకూరి, దానములు

ఒక యింట నూఱు జుట్లిముడునుగాని రెండు కొప్పు లిమడవన్న సామెత యందఱు నెఱిగినదే కదా! ఇద్ద ఱాఁడువా రొక్కచోట చేరినచోఁ బని లేని పాటగా నేదో యొక విషయమున శుష్క కలహములు పొడచూపక మానవు. ఇప్పటి మన దేశపు స్త్రీలలోఁ గానబడుచున్న యీ కలహప్రియత్వమునకుఁ బ్రధాన కారణము స్వప్రయోజనపరత్వము చేత దూరాలోచన మట్టుపడినవారు తమ తరుణీమణులను విద్యాగంధ విహీనురాండ్రనుగాఁ జేయుటవలన వారి నాశ్రయించియున్న మౌఢ్యభూతావేశదోషమే కాని సహజ కోమలమైన స్త్రీ స్వభావము కాదు.

- కందుకూరి, స్వీయచరిత్రము

ఆడవాళ్ళు ఎంత చదువుకున్నా చాలామంది అప్పలమ్మల స్థాయిని మించి ఎదగలేరు.

- ఆనందారామం, మళ్ళీవచ్చిన వసంతం

మనుజుఁడు చదువుకోకున్నను, ఏ కూలిపనిఁ జేసికొనియైనను బొట్ట పోసికొనవచ్చును. జీవనాధారమునకు వృత్తు లెన్నియైన నేర్పడియున్నవి. అందునకుఁ జదువే యక్కఱలేదు. కాబట్టి చదువుకొనుట జ్ఞానమును, బుద్ధియును గుదురుటకొఱకుగాని కేవలమును పొట్ట కొఱకు గాదు. ఆ హేతువు చేతనే నారులకును విద్యయావశ్యకమగును.

- కందుకూరి, స్త్రీవిద్య

## స్థానం

నీళ్ళలోని మీను నిగిడి దూరము పాఱు
బయల మూరెడైనఁ బారలేదు.
స్థానబలిమికాని తన బల్మికాదయా.

- వేమన

చెఱకుతోఁటలోనఁ జెత్తకు ప్పుండినఁ
గొంచెమైన దాని గుణము చెడదు.
యెఱుకఁ గలుగుచోట నెడ్డెవాఁ డున్నట్లు.

- వేమన

పాల నీడిగింటఁ గ్రోలుచు నుండిన
మనుజు లెల్లఁ జూచి మద్య మండ్రు
నిలువఁ దగని చోట నిలువ నిందలు వచ్చు

- వేమన

నీళ్ళలోన మొసలి నిగిడి యేనుఁగుఁ బట్టు
బయట కుక్కచేత భంగపడును.
స్థానబలిమి కాని తన బల్మి కాదయా

- వేమన

ఝషము నీరు వెడలఁ జచ్చుటే సిద్ధము
నీట నుండె నేని నిక్కి పడును
అండ తొలఁగునెడల నందఱు పని యట్లె

- వేమన

గజములు, సింహములు, సత్పురుషులును, స్థానము విడిచి విచ్చలవిడి సంచరింతురు. కాకములు, మృగములు, కాపురుషులును స్థానము మానఁజాలక వినాశముఁ బొందుదురు.

- చిన్నయసూరి, మిత్రలాభము

దంతములు, కేశములు, నఖములు, నరులును,

స్థానభ్రంశమును బొందిరేని రాణింపరు.

- చిన్నయసూరి, మిత్రలాభము

స్థానాంతరము విచారించుకోక పూర్వస్థానము మానరాదు.

- చిన్నయసూరి, మిత్రలాభము

స్థాయి

కుర్చీల్లో మనపక్కని కూర్చొనే పెద్దమనుష్యుల చచ్చు సంభాషణకన్నా నేలని కూర్చొనే మామ్మూలు మనుషుల మాటల్లో నువ్వూ, నేనూ నేర్చుకోదగ్గ విజ్ఞానం ఛాలా ఉంది.

- చాసో, బబ్బాబ్బా

స్థావరం

నీతిహీను నొద్ద నిర్భాగ్యు లుందురు.

- సామెత

స్థితి

క్షేత్రము, బీజము - రెండూ ప్రధానమైనవేగాని - అత్యంత ప్రధానమైనది స్థితి.

- చిరంజీవి, వంశాంకురం

స్థిరత్వం

చీమలపుట్ట గొప్ప సాంఘిక సామరస్యాన్ని సంపాదించింది యుగాల కిందటే. కాని యుగా లనించి చీమ లట్లానే ఉన్నాయి.

- చలం, మ్యూజింగ్స్

స్థూలకాయం

ముందు చూస్తే పిన్నిగారూ వెనక చూస్తే బుడుగూను.

- ముళ్ళపూడి, బుడుగు

మహాదేవునివలె ముందు దీని నీయింటం బ్రవేశ పెట్టి తరువాతనే ఇంటికి ద్వార బంధములు తలుపు లెత్తించినారా యేమి?

- తి.వేం., మృచ్ఛకటికము

స్నానం

కుక్కుటేశ్వరములో స్నానము చేయగా రొంప పట్టినది. గోదావరి స్నానములకు పోవగా మొసలి యీడ్చుకుపోవలయునా?

- పానుగంటి, కంఠాభరణము

స్నేహం

ముదిరిన కొద్దీ కుక్కమూతి పిందెలు వేసే దేమిటంటే స్నేహితమని తటపటాయించకుండా జవాబు చెప్పవచ్చు

- రాజారాం, గ్రూప్ ఫోటో

అంతరంగ స్నేహానికి హృదయనైర్మల్యమే ప్రధానం కాని పరిధికాదు కాబోలు.

- సంజీవదేవ్, బుచ్చిబాబుతో స్నేహం

ఉన్నతస్థితి సంపద మున్నగునవి చిన్ననాటి సహజమైత్రినిఁ దుదముట్టింపక యుండునేని ప్రపంచము సౌఖ్యభూయిష్ఠమై భాగ్యవంతమై యుండును కదా.

- చిలకమర్తి, సుధాశరచ్చంద్రము

లుబ్ధునితో స్నేహము సొమ్ము పెట్టువఱకే! వైష్ణ వునితో స్నేహము వంటయింటి వఱకే!

- పానుగంటి, రాధాకృష్ణ

దొరతో సావాసం మానేయగల్గుకాని దున్నపోతుల్తో స్నేహం చెయ్యడం మాత్రం నాతరం కాదు.

- రావిశాస్త్రి, గోవులొస్తున్నాయి జాగ్రత్త!

పుట్టుకవల్ల ఏర్పడేది తల్లిదండ్రులతో సంబంధం. సంస్కారంవల్ల వచ్చేది స్నేహం. పుట్టుకకన్నా సంస్కారమే గొప్పది. కనక రక్త సంబంధంకన్నా స్నేహబంధమే గొప్పది.

- వివినమూర్తి, ఉద్యమం

జీవించే ప్రతి జీవికీ రెండు పరస్పర వ్యతిరేక మైన మనోగుణా లుంటాయి. ఒక మనోగుణా నికి జీవిత పరిస్థితులతో మైత్రి; రెండవ గుణా నికి జీవిత పరిస్థితులతో వైరం. రెండూ ముఖ్య మైనవే!

- వెంకటసుబ్రహ్మణ్యం, పారిస్

మైత్రి యౌచిత్యమును బాటించనీయదు.

- విశ్వనాథ, బద్దన్న సేనాని

స్త్రీపురుషుల స్నేహానికి లోకమిచ్చిన పర్యాయ పదం 'కళంకం'.

- శ్యామలారాణి, జీవవాహిని

తన్నెరిగిన ప్రతివానికి
పెన్నిధాన మది స్నేహము.

- సినారె, దివ్యమానవుడు

చెడి స్నేహితులింటికి వెళ్లమన్నారు.

- శ్యామలారాణి, జీవవాహిని

స్నేహకాలంకన్న, స్నేహంలోని తీవ్రతయే ప్రధానం.

- కేశవరెడ్డి, అతడు అడవిని జయించాడు

స్నేహ మది యెల్లరుఁ గూడిచరించుటేకదా?

- విశ్వనాథ, రామాయణకల్పవృక్షము

స్నేహమొక అనుబంధం ఒక విశ్వాసం
అనుక్షణం తృప్తితో పీల్చే ఉచ్ఛ్వాసం.

- వేణుగోపాల్, స్నేహం

## స్నేహితుడు

ప్రియమున కన్న హితమును గోరువాఁడే స్నేహితుడు.

- వరదాచార్యులు, వైశాలిని

ప్రపంచములో నెట్టివారికి నన్నియవస్థల యందును స్నేహితులు దొఱకుచునే యుందురు.

- కొచ్చెర్లకోట, అపవాద తరంగిణి

ఆత్మలాభ పరాయణు లగుచు నరులు
ప్రాణమిత్రులవలెనె గన్పట్టుచుందు
రవసరము దీఱ నందరు నడగుచుంద్రుః
నిజహితుఁడు లేఁ డవనిలో నిశ్చితంబు.

- చిలకమర్తి, గయోపాఖ్యానము

ఐశ్వర్య మున్నప్పు డందరు మిత్రులె; ధనహీను నకు నాపత్కాలమున మిత్రులైన వారే మిత్రులు. అన్నియుఁ జుట్టములు.

- చిలకమర్తి, కర్పూరమంజరి

మిత్రుల హృదయములు రహస్య రత్నములు దాచదగిన యినుప పెట్టెలు.

- చిలకమర్తి, కర్పూరమంజరి

రహస్యాలు, చీకటి తప్పులూ పంచుకునే వాడే స్నేహితుడు.

- బుచ్చిబాబు, ఒకేనిద్ర - ఎన్నో కలలు

స్నేహితులే అప్పులకంటె ఎక్కువగా తోడ్పడ తారు.

- సరస్వతీదేవి, ఈ చీకటి వీడదేమి?

మిత్రులుగా నుండి తన వలన నుపకారము పొందిన వారే యమిత్రులయి తన కపకారము చేసినారని మనస్సునకు దృఢముగాఁ దోచినప్పు డాకస్మికముగా గలిగిన యాగ్రహవ్యగ్రత వలన తొంటి స్నేహవిశేషము ద్వేషముగా పరిణమించి యొక కొననుండి యింకొక కొనకుఁ బోవుట యనివార్యమైన మానుష స్వభావమే కదా!

- కందుకూరి, స్వీయచరిత్రము

తన వృద్ధియు మిత్రుని వ
ర్ధనమును దత్సఖసమృద్ధి ప్రబలుటయును శ
త్రుని దెస నిన్నియుఁ జెడుటయు
నను షడ్విధములను దన్ను నతిశుభమొందున్.

- తిక్కన, శల్యపర్వము

మనలో అజ్ఞాతంగా ఉన్న అజ్ఞానమూ, అవకత వకలూ, అస్తవ్యస్తాలు, డాబులూ, దర్పాలూ, ఎదుటి వాడిలో ప్రదర్శితమయితే మనకు నవ్వేనా వస్తుంది, లేక కోపమేనా వస్తుంది.

- మొక్కపాటి, బారిష్టర్ పార్వతీశం

తన మిత్రులయందున్నూ తనయందున్నూ ఉన్న వ్యవహార దక్షతకు లౌక్యమనిన్నీ అద్భుత మైన చాకచక్య మనిన్నీ పేర్లు పెట్టుకొని, అదే లక్షణము తన శత్రువుయందున్నట్లయితే నున్నూ, దానిని దౌర్జన్యములో లెక్క పెట్టుట మానవులయందున్న మహాలోపము.

- పాప, కరణం కనకయ్య వీలునామా

## స్పర్శ

హృదయానికి కళ్ళు లేవు; స్పర్శ మాత్రమే వుంది. మేధకి కళ్ళున్నాయి గానీ స్పర్శలేదు.

- వడ్డెర చండీదాస్, హిమజ్వాల

## స్పష్టం

ఒక పగ్గమును రెండు యూపములకు నేలాగు నఁ గట్టగూడదో యారీతి నొకస్త్రీకి నిరువురు పతులు కూడదని స్పష్టము.

- కోలాచలం, శిలాదిత్య

## స్మరణ

మనని ఎక్కువగా తలుచుకునేవారు మనని ద్వేషించే వార్లై వుంటారు.

- చలం, మ్యూజింగ్స్

ఎలాంటి నాస్తిక వాడైనా జీవితంలో ఒక్కసా రైనా దేవుని తలంచకపోడు.

- కాంతారావు, మంచిముహూర్తం

## స్వతంత్రం

దేశం స్వతంత్రమయినా ఇంకా "మనం" కాలేదు.

- గంగాధరరావు, పెండింగు ఫైలు

పుట్టింట్లో ఎంత సుఖపడ్డా స్వతంత్రం వుండదు.

- లక్ష్మణరావు, అతడు-ఆమె

ఈ దేశములో నెప్పుడును రాజ్యాంగ విషయమున జనుల కేవిధమయిన స్వాతంత్ర్యములును లేవు. అందుచేత జనులు పరిపాలనవిషయమునఁ దమకు గొప్ప స్వాతంత్ర్యములుండునన్న యంశమును గూడ గుర్తెఱుఁగరు.

- కందుకూరి, దేశీయ మహాసభ

స్వభావం

ఎదగొడ్డుకు బెదురుండదు.

- సామెత

తాజెడ్డ నవల పత్రికంతా చెరచినట్టు.

- శ్రీరమణ, న్యూసుడి

ఒక మంచి సహాయం చేసినవాళ్ళనే ఇంకోటి అడుగబుద్ధవుతుంది.

- కొడవటిగంటి, చెడిపోయిన మనిషి

ఏనుగున కెంత సేపు తిండి, పాముప కెంత సేపు నిద్ర, పిచ్చుక కెంతసేపు కలయిక, శశమున కెంతసేపు భయము.

- పానుగంటి, సాక్షి

ఏమన్నా చెయ్యమంటే నేను చెయ్యలేనుగాని, ఏం చెయ్యవద్దంటే అది మానాను!

- భమిడిపాటి, కచటతపలు

నువ్విస్తే దోసిలిపడతాం, నువ్వడిగితే మొండి చెయ్యి చూపిస్తాం.

- రావిశాస్త్రి, రత్తాలు-రాంబాబు

వేష భాష లెంఁ గాషాయవస్త్రముల్
బోడినెత్తు లొప్పఁ బొరయుచుండ్రు
తలలు బోడులైనఁ దలఁపులు బోడులా?

- వేమన

నక్క ఒకచోట ఊలవేసి, ఇంకొకచోట గౌరీకళ్యాణం పాడుతుందా?

- సామెత

మేడిపండుఁ జూడ మేలిమై యుండును
పొట్ట విచ్చి చూడఁ బురుగు లుండు
పిరికివాని మదిని బింక మీలాగురా.

- వేమన

భూమి పేరువల్ల పుణ్యస్థలము లాయె
వెలయ రాళ్ళవల్ల వేల్పు లాయె
నీళ్ళ పేరువల్ల నిఖిల తీర్థము లాయె

- వేమన

నక్కలు బొక్కలు వెదకును
నక్కరతో నూఱబంది యగడిత వెదకున్
గుక్కలు చెప్పులు వెదకును
తక్కువ నా లంజకొడుకు తప్పే వెదకున్

- చాటువు

నిజమైన బంగారు నిప్పుకు వెరువదు.

- సామెత

తేనెబోసి పెంచినా వేపకు చేదుపోదు.

- సామెత

చేసేవి నాయకాలు, అడిగేవి తిరిపాలు, పెట్టకుంటే కోపాలు.

- సామెత

స్వయంశక్తి

కొన్ని కొన్ని జబ్బులు మనమే కుదుర్చుకోవచ్చు డాక్టర్ల ప్రమేయం లేకుండా.

- సరస్వతీదేవి, ఈ చీకటి వీడదేమి

స్వయంసేవ

స్వసహాయమె సుశ్రేయము
స్వసహాయమె దైన్యహరము, సంపత్కరమున్
స్వసహాయమె మానవులకు
వ్యసనహరము-

- వెంకటశర్మ & ముట్నూరి, భారతమాత

స్వరూపం

బాహ్యస్వరూపం చూసి గుణగణాల్ని చెప్పలేం.

- ముద్దంశెట్టి, అంతామోసం

స్వర్గం

సస్యలక్ష్మీ కలిత
జగతియే స్వర్గమ్ము

- సినారె, స్వప్నభంగం

లోకహితము గాని ఏకాంగి పోరునఁ
జచ్చువాని కేమి స్వర్గ మౌనె?

- గోపరాజు, సింహాసనద్వాత్రింశిక

నిరుపేదల నరకమే ధనవంతుల స్వర్గం.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

స్వర్గం మోక్షం ఎంత మంచివైనా ఎవరో దిక్కుమాలిన వాళ్లకూ అభాగ్యులకూ తప్ప ఎవరికీ స్వర్గస్థులం కావాలని ఉండదు.

- పురాణం, ఇల్లాలి ముచ్చట్లు

ఇండ్లో యున్నవి కాని పెండ్లిండ్లు లేవు
ఆంధ్రో యున్నారు గాని యిల్లాంధ్రు లేరు
బాగు! శివశివా! ఇది వట్టి భోగభూమి

- త్రిపురనేని, సూతపురాణము

స్వలాభం

గడ్డం కాలి ఒకడు ఏడుస్తూ వుంటే, చుట్టకు నిప్పు ఇమ్మని ఒకడు వెంబడించినట్లు.

- సామెత

స్వశక్తి

మన కన్నును మనం పొడుచుకున్నంత ఘోరంగా ఇతరులు ఎవ్వరూ పొడవలేదు.

- ధనికొండ, పవిత్రులు

స్వస్థలం

నటులది దోరసముద్రము
విటులది యోర్గల్లు కవిది వినుకొండ మహా
పుటభేదన మీత్రితయము
నిటఁ గూర్చెను బ్రహ్మ రసికులెల్లను మెచ్చన్

- వల్లభరాయడు, క్రీడాభిరామము

స్వాతంత్ర్యం

ధైర్యం లేంది స్వాతంత్ర్యం వుండదు. ఒకవిధంగా చూస్తే ధైర్యమే స్వాతంత్ర్యం.

- సంజీవదేవ్, అశుతోష్ ముఖర్జీ

ఓ దేవుడా! నా మనస్సు ఇండిపెండెంటుగా సృజించావా; యిండిపెండెంటుగా అయితే నా యిష్టవొచ్చిన పనల్లా నేను చేశాను. నువ్వెవరు అడగటానికి? ఇలాంటి చిక్కులు పెట్టావంటే హెవెన్‌లో చిన్ననేషనల్ కాంగ్రెస్ వొకటి లేవదీస్తాను. లేక నన్ను డిపెండెంటుగా చేశావూ? అట్లాగయితే, నువ్వే నాచేత పాపం చేయించావు గనక నీకే ఆ శిక్ష కావలసింది.

- గురజాడ, కన్యాశుల్కం

స్వరాజ్యలక్ష్మి కాపరానికెళ్ళి పదిహేడు సంవత్సరాలయినా నేటికీ భూ సంస్కరణల శిశువును కనదు; మాసకమ్మో ఏంపాడో!

- విజయలక్ష్మి, మహాప్రస్థానపర్వం

తానిచ్చినది భారత స్వరాజ్యము కాని పుచ్చుకొన్నది మొక్కవోని స్వారాజ్యము

- మధునాపంతుల, మనగాంధీ

బొంబాయి రేవులో నుండి పొగ యోడలోనికిఁ జేరిన యెలుక పాసుపోర్టు అక్కఱలేకుండ ఏ అమెరికా దేశమునకో యింగ్లాండునకో పోవుచున్నదే! ఎలుక కున్న జన్మ స్వాతంత్ర్యమైన హిందువునకు లేదే!

- పానుగంటి, సాక్షి

స్వాతంత్ర్యం అనేదాన్ని ప్రేమలాగ ఎవరి మట్టుకువారు ప్రతినిత్యమూ గెలుచుకోవాలి...

- బుచ్చిబాబు, స్వతంత్ర జీవులు

అస లెవళ్ళకీ హక్కులే లేవు- అందుకే మిగిలేది బాధ్యతలే- అదే స్వరాజ్యం అంటే.

- బుచ్చిబాబు, ఆద్యంతాలు, మధ్యరాధ

స్వాతంత్ర్యం కూడా ఒక ఆకలే.

- బుచ్చిబాబు, చివరికి మిగిలేది

చూడు నిర్బంధం అనగానే బెడిసి కొడతాడు మానవుడు. స్వతంత్రు డనగానే అనేక అవధులు కల్పించుకుంటాడు.

- బుచ్చిబాబు, మధుర తరంగం

ఆర్థిక స్వాతంత్ర్యంలేని వారికి ఆత్మ స్వాతంత్ర్యం ఎక్కడనుంచి వొస్తుందో.

- బుచ్చిబాబు, స్వతంత్రజీవులు

స్వతంత్రించి చెడిపోతానంటే నిన్నెవ్వరూ ఆపలేరు.

- బుచ్చిబాబు, స్వతంత్రజీవులు

జనన మరణవేళ స్వాతంత్ర్యమూ లేదు
తేను లేదు మున్ను పోను లేదు
నడుమఁ గర్త ననుట నగుఁబాటు గాదఁటే

- వేమన

దేనికైనా స్వతంత్రమే మహాబలం

- వేదాంత కవి, తెనుఁగుతల్లి

పాత కతలూ, పాత వెతలూ
పారిచనె, స్వేచ్ఛాపతాకము
నెత్తరా, ఎత్తవేం, యెత్తు
ఏడు ద్వీపాలన్!

- బాపిరాజు, పాతమాట

స్వాతివాన

స్వాతివాన ముత్యపు చిప్పకు గాని నత్తగుల్లకేలా?

- సామెత

స్వానుభవం

స్వానుభవంలేంది కష్టాలంటే ఏంతెలుస్తుంది?

- లక్ష్మణరావు, అతడు-ఆమె

స్వారీ

ముందు గాడిదెమీఁద స్వారీ నేర్చుకొన్న పక్ష మున గుఱ్ఱపు స్వారీ సులభ మగును.

- చిలకమర్తి, గణపతి

స్వార్థత్యాగం

నాకెప్పుడూ పరచింతే. నాకు కావలసినది ఇంకోడి సంగతే కాని నాది కాదు అదే నా స్వార్థత్యాగం.

- భమిడిపాటి, ఎప్పుడూ ఇంతే

స్వార్థభక్తి

ఎలుగెత్తి దేవుణ్ణి పిలుస్తుంటారు
అయినా మొర వినలేదని గునుస్తుంటారు
తీస్తారు ప్రాణాలు, చేస్తారు దానాలు
పథ్యం చేయరు; ఔషధం సేవిస్తుంటారు.

- దాశరథి, రూబాయీ

స్వార్థం

ఆవుమీద వాత్సల్యంతో కాదు గడ్డివేసేది. అదిచ్చే పాలమీద మమకారంతో.

- ఆదివిష్ణు, ప్రాప్తం

"ఆడది మెచ్చిందే అందం" అన్నారు ఆడవాళ్ళు. "ఔను" అని బేషరతుగా ఒప్పేసుకున్నారు మొగాళ్ళు. (తమని మెచ్చేది ఆడవాళ్ళే కనుక)

- బీనాదేవి, హరిశ్చంద్రమతి

వ్యక్తుల స్వార్థపరత్వంతో నిండిన ఏ సమిష్టి వ్యవస్థలోను సుఖశాంతు లుండవు.

- సులోచనారాణి, మీనా

స్వార్థం లేకుండా మనిషి బతకడు.

- వేణుగోపాలరావు, జోగబాల

మనిషికంటే భగవంతుడికే స్వార్థం ఎక్కువ. అన్నీ ఇస్తే మనిషి తనను మరిచిపోతాడని భగవంతుడికి భయం.

- భారతీదేవి, సుడిగుండాలు

స్వార్థము ఐహిక జీవితానికి మూలం. స్పర్ధే జీవిత విజయానికి కీలకం.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, మార్గదర్శి

ఒకరి స్వార్థం... పర్యవసానం మరొకరి సర్వ నాశనం.

- నంది, పుణ్యస్థలి

తమ ప్రాణములమీఁదికి వచ్చుచున్నప్పుడు లోకములో నెల్లవారును తామావఱకు ప్రాణాధి కులుగాఁ జూచుకొనువారి యాపద లయినను మఱచిపోయి తమ యాపదను తప్పించుకొను టకే ప్రయత్నింతురు.

- కందుకూరి, రాజశేఖరచరిత్రము

జ్ఞానానికి స్వార్థమే మొదటి మెట్టు.

- బుచ్చిబాబు, ఒమర్‌ఖయామ్

స్వార్థమనే మర్రిచెట్టు నీడన ఏ పవిత్రాశ యమూ మొలకెత్తదు.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

అసలు బ్రతుకే స్వార్థం. కీర్తిగ్రా మాత్రం స్వార్థం కాదూ? అది మరొక్కరూపం అంతే.

- ఆచార్య, ఎవరీ మనిషి

స్వార్థం వచ్చేటప్పటికల్లా మనిషి సంఘాన్ని ఎంతలెక్కలేకుండా తన్నిపారేస్తాడు?

- నంది, నైమిశారణ్యం

స్వార్థ మనేది ప్రకృతి సిద్ధంగా వస్తుంది. నిస్వార్థమనేది మనం సంపాదించుకుంటే లభి స్తుంది.

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

స్వార్థ త్యాగం చేయించే ప్రేమకూడా స్వార్థంలో అంకురించి తీరవలసిందే!

- కొడవటిగంటి, నీకేంకావాలి

మన మొహాలు సంస్థలు నడిపేవి కావు. ఎవడి స్వార్థం వాడు చూసుకుంటాడు. దానికోసం యితరులను బలిచేస్తాడు.

- కొడవటిగంటి, నడమంత్రపు సిరి

న్యాయాన్యాయాలు చూసుకోడానికి దేవు డున్నా డులే. మన బాగోగులు మనం చూసుకుంటే చాలు.

- రారా, మారేలోకం

లోకం అంతా యేమి స్వప్రయోజనపరులూ!

- గురజాడ, కన్యాశుల్కం

స్వేచ్ఛ

చేసేపనిలో స్వేచ్ఛ ఉంటేనే చేసిన పనిలో నాణ్యత వుంటుంది.

- బీనాదేవి, స్వేచ్ఛాయజ్ఞం

నీతిని ఇంట్లో కట్టేసి అధికార్లు
ఆఫీసుకు రావచ్చు
అభిమానాన్ని నెట్టేసి నాయకులు
కారుల్లో ఊరేగచ్చు
ఖర్చులు దుబారాను లేపుకొచ్చి
ఖజానాలో కాపురం చెయ్యొచ్చు
దినపత్రికల రైళ్లమీద
ఊరూరికి పుకార్లు షికార్లు చెయ్యొచ్చు

- కుందుర్తి, రెండులోకాలు

ప్రజల్ని స్వేచ్ఛగా వదిలిపెడితే ప్రభుత్వాలు సాగవు.

- వేదాంతకవి, ఆకలిమంట

గెలుచుకొన్న పిదప నిలుపుకొన్నదే స్వేచ్ఛ.

- నార్ల, స్వేచ్ఛ

జగము నిండ స్వేచ్ఛాగానఝురుల నింతు

- దేవులపల్లి, స్వేచ్ఛాగానము

స్వేచ్ఛ మంత్రుల సొమ్ము
ఓ కూనలమ్మా

- ఆరుద్ర, ఇంటింటిపజ్యాలు

ఆడవాళ్ళకి బైటెక్కడా స్వేచ్ఛ వుండదమ్మా! వుంటే మనస్సులోనే వుండాలి.

- పినిశెట్టి, పంజరంలో పక్షులు

దాచుకునే శ్రమకన్న పోగొట్టుకోడం నయం అనే సూత్రం ఆచరణలో పెడితేనేగాని స్వేచ్ఛ లేదు.

- చలం, మ్యూజింగ్స్

నాలుగు రాళ్ళు సంపాదించగలగటమే స్వేచ్ఛ.

- కొడవటిగంటి, పంచకళ్యాణి

ప్రేమించడానికీ, ద్వేషించడానికీ కూడ మనిషి క్కొంత మానసికమైన స్వేచ్ఛ వుండాలి.

- కొడవటిగంటి, వారసత్వం

స్వేచ్ఛ వుంటే సంఘంలో వెలేస్తారు.

- బుచ్చిబాబు, గొలుసు

ఎడతెగని స్వేచ్ఛ కూడా ఒకవిధమైన బాని సత్వం.

- బుచ్చిబాబు, ఒమర్‌ఖయామ్

అరాచకంవల్ల మనకు లభించే స్వేచ్ఛ, చావు స్వేచ్ఛ.

- కొడవటిగంటి, పట్నవాసం

## హ

హక్కు

గృహంలో సర్వహక్కులూ స్త్రీలవే.

- బుచ్చిబాబు, ఆద్యంతాలు, మధ్య'రాధ'

ఏ వస్తువుమీదైనా హక్కు ఇచ్చేవాడికే లేకపోతే పుచ్చుకునేవాడికి ఎక్కణ్నుంచి వస్తుంది? Sale of goods act కర్తకే హక్కులేని ప్రమాణం భూమ్మీద ఏ కోర్టులోనూ చెల్లదు.

- రాధాకృష్ణ, దంతవేదాంతం

అందరు ప్రజలకు ఓటునందు హక్కున్నట్లే అందరు పురుషులకు స్త్రీ సుఖమునందు హక్కున్నది.

- విశ్వనాథ, చెలియలికట్ట

స్త్రీల విషయంలో- అనుభవం- కొన్ని హక్కుల్ని- ఆజన్మాంతపు హక్కుల్ని యిస్తుంది పురుషుడికి.

- చలం, అరుణ ఆర్గ్యుమెంటు

దస్తావేజులో లేకపోయినంత మాత్రంచేత హక్కు వాళ్లది కాదనడానికి వీలులేదు.

- కందుకూరి, హాస్యసంజీవని

ఉదయం పది గంటలకు రావాలనేది బాధ్యత. పది గంటల తరువాత ఎప్పుడైనా ఆఫీసుకు రావటం హక్కు.

- నిరుద్యోగి, కార్యాలయ బేతాళవిక్రమార్కీయము

లోకంలో వున్న దౌర్భాగ్యులందరికి ఏడవడానికి తప్ప మరో హక్కంటూ లేదు.

- రావిశాస్త్రి, నిజం

మనకి మిగిలినవి హక్కులు- బాధ్యతలన్నీ

ప్రభుత్వానివి.

- బుచ్చిబాబు, స్వతంత్రజీవులు

హక్కులు ఒక డివ్వట మేమిటి?
శ్వాసించడం ఎవడు నేర్పా డేమిటి?

- లోచన్, సహనం గాడిద లక్షణం

**హడావిడి**

ఇంట్లో పెండ్లలయితే, వూళ్ళో కుక్కలకు హడావుడి.

- సామెత

**హత్య**

చీమనైనను తెలిసి హింసింపలేని
సత్యగుణు లైన మనిషిని చంపగలరు!

- భీమన్న, జన్మాంతర వైరమ్

హత్య చేయాలనుకోవడానికి, హత్య చేయడానికి చాలా తేడా ఉంది.

- బుచ్చిరెడ్డి, తప్పు

హత్యలు, ఆత్మహత్యలు, పోలీసులు సొమ్ము నొల్లు కావడానికి అవకాశాలు!

- యజ్ఞన్నశాస్త్రి, ఓమనిషి నూతిలోపడితే.

**హద్దు**

కడలే దాశాలతకును
గడc జూడcగc గానరాదు.

- పోతన, భాగవతము

తన హద్దు లెరిగి మెలగటం బుద్ధిమంతుని లక్షణం.

- కృష్ణరావు, పాపికొండలు

నీటికి ఒడ్డులాంటిది మనిషికి హద్దు.

- యజ్ఞన్నశాస్త్రి, హద్దులు-సరిహద్దులు

నిజానికి ఎల్లలున్నాయి. దాటకూడదు
సత్యానికి సరిహద్దు లున్నాయి.

- యజ్ఞన్నశాస్త్రి, సత్యానికి సరిహద్దులు

**హనుమంతుడు**

రామభక్తుడైన హనుమంతుడు
కృష్ణుని ఆనవాలు పట్టడు.

- కాళోజీ, చాదస్తం

**హంతకుడు**

రహదారుల మధ్యదారిలో
అగుపించే హంతకు లెవ్వరు?
ప్రక్కన పెట్టిన రోలర్ కాదోయ్
దానిని గుద్దిన బండ్లెన్నీ?

- మాచిరాజు, రహదార్లు

హంతకులు కూడా ఎంత అమాయకంగా ప్రపంచానికి కనిపిస్తారు?

- నంది, నైమిశారణ్యం

**హరిజనులు**

గాలి నీరువోలెc గల పదార్థములందు
భాగకర్త లఖిలపంచజనులు
స్వార్థపరులు దీని సమ్మతింపరుగాని
కాలమూర్తి ప్రాలుమాలcడన్న!

- ఏటుకూరి, క్షేత్రలక్ష్మి

సర్కారు బ్రాహ్మలంటే హరిజనులోయ్!

- చిరంజీవి, బోలో స్వతంత్రభారత్‌కీ జై

యథార్థముగా నస్పృశ్యులు మనమా? పంచములా? వారికి మన విద్య లేదు. అందుచేత మనకన్న యింద్రజాల మహేంద్రజాలములు వారెఱుగరు. వారికి మనకున్న నాగరికత లేదు. అందుచేత మనకున్న కానికూళ్ళు, తప్పు తిరుగుడులు వారికి లేవు. అందుచేత మనమే యస్పృశ్యులము.

- పానుగంటి, సాక్షి

**హరిశ్చంద్రుడు**

నోరు కల్లల పుట్ట. పేరు హరిశ్చంద్రుడు.

- సామెత

**హస్తం**

ఫాలలోచన! వరద! మత్పాణితలము
నేను నెవ్వని తలమీఁద నిడిన వాఁడు
మస్తకము నూఱు వ్రయ్యలై మడియ నీవె

- పోతన, భాగవతము

**హాని**

నిజం చెపితే అబద్ధమంత హానిచేస్తోంది.

- చలం, మ్యూజింగ్స్

**హాయి**

ఆస్తంతా క్షవరమయితే వొక సుగుణమేమిటంటే ఆలోచించే అవసరం వుండదు. బుర్ర ఖాళీగా హాయిగా వుంటుంది.

- బుచ్చిబాబు, గొలుసు

లేమి లేనిచోటా సమానత్వం ఉన్నచోటా మాన
వులు హాయిగా ఉంటారు.

- రావిశాస్త్రి, బంగారుబాబు కథ

హాస్యం

అమృతమూర్తి, మందీయ ఒప్పాడ చాలు
మినిటులూ, లిప్తలూ సెకన్లమీద చంపు

- మాచిరాజు, తడాఖా

నాటకంలో యంత హాస్యమైనా చెల్లుతుంది. నటనలోకి హాస్యంతెస్తే యేవిఁ మూడుతుందో!

- గురజాడ, కన్యాశుల్కం

సాధారణంగా హాస్యం నవ్వు పుట్టించలేనపుడు జుగుప్స కలిగించే ప్రమాదం ఉన్నది.

- కొడవటిగంటి, అనామిక

జనానికి గానమేనా ఉండాలి, హాస్యమేనా ఉండాలి. సార్వత్రికమైనవి మరి అట్టే లేవు.

- భమిడిపాటి, అన్నీ తగాదాలే

హాస్యం అందరికీ పడదు.

- నంది, నైమిశారణ్యం

దుఃఖం అనే చెరువుగట్టు తెగిపోతే, ఆ నీరు వెళ్ళిపోయే తూము హాస్యభావం.

- బాపిరాజు, కోనంగి

సగము చచ్చి సంగీతము, నంతయుఁ జచ్చి హాస్యము.

- తి.వేం., ప్రభావతీ ప్రద్యుమ్నము

ఆఁడువారైనచో వందలకొలఁది వచ్చినను జంపుటకు శూరుఁడనే.

- తి.వేం., మృచ్ఛకటికము

నీకే నగలిచ్చెదను. తీసికొనుము. ఇవి అలంకార సమయమున మాత్రము నావి. ఇతర సమయ ముల నీవి.

- తి.వేం., మృచ్ఛకటికము

నేనెన్నఁడేని గెల్తు
నేని పోఁగొట్టుకొనుదాఁక నిద్రపోను.

- తి.వేం., వ్యసన విజయము

వాదనను వ్యర్థము చేయుటకు హాస్యముకంటె నధికమైన యాయుధము లేదు.

- విశ్వనాథ, నందోరాజా భవిష్యతి

నడువనేర్చె మా కారు వెనక్కు గూడ
కాని నడచేప్పు డొక మూడు గాన్లె తిరుగు

- మాచిరాజు, మా వాహనం

హాస్యాన్ని నికృష్టంగా చూస్తారుగాని, నీతిని బోధించడానికి నవరసాలలో దాన్ని పోలిన రసం లేనే లేదంటాను నన్నడిగితే.

- చెళ్ళపిళ్ల, కథలు-గాథలు

పూర్వకవులు బూతులో, తిట్లో ఉంటేనేగాని హాస్యముకా దనుకున్నారేమోనని తోస్తుంది.

- మొక్కపాటి, బారిష్టరు పార్వతీశం

అల్లటప్పాగ కాదు యమాంతకముగ
రేడియోలో భరతనాట్య మాడినాను

- మాచిరాజు, అహం

నా అమూల్య గానమ్ము వినాలి అంటే
మూగ సినిమాలొ వినుడు గుండాగిపోవ!

- మాచిరాజు, అహం

భార్యకూ నాకు ఫోన్లో దెబ్లాట వచ్చి
బడితెతో దాన్ని ఫోన్లోనె బాదినాను.

- మాచిరాజు, అహం

ఇంట యేర్కన్న సుస్తి యొక్కింత జేయ
అసలు ఇంటి కింజక్షన్ నీయాలి యనును
అంత ఓ ఘడియన్నర కాగృహమ్ము
అమర కైలాసగిరి క్రింద అప్పడమ్ము

- మాచిరాజు, తడాఖా

హాస్యాస్పదం

బ్రతికి వున్న సమాజం చచ్చిపోయిన వాళ్లకోసం పని చెయ్యటంకన్న హాస్యాస్పదం లేదు.

- ధనికొండ, పవిత్రులు

హితం

పలుకు మృదువు గాఁగ బాగోగులను దెల్పు
వారి హితము విననివారు లేరు
ఆగ్రహించి పలుకు నాతఁ డాడెడుమాట
లెంత హితముగాని యెవరు వినరు.

- నంబూరి, శ్రీదుర్గావతీ...

ఆరోగ్యంబు గోరువాఁడు చికిత్సకు వలన నౌష ధంబుంబోలె శ్రేయంబు కాంక్షించు. నాయ కుండు భృత్యునివలన హితం బవశ్యంబు

గ్రహింపవలయు.

- చిన్నయసూరి, మిత్రభేదము

అసాధువులకు హితంబు గావించువాడుం బోలె సాధువుల కహితంబు గావించువాఁ డవశ్యం బుం గీడు పొందును.

- చిన్నయసూరి, మిత్రభేదము

లోకంబునందుఁ బ్రియవాదులు పెక్కండ్రు గలరు. హితమాడువాఁడు దుర్లభుండు. హిత వాది కంటె హితశ్రోత కడు దుర్లభుండు.

- చిన్నయసూరి, మిత్రభేదము

దప్పిఁ గొన్నట్టి వారి కా దప్పి దీఱ
సలిలపూరంబు హితమొ? యాజ్యంబు హితమొ?

- శ్రీనాథుడు, శృంగారనైషధము

**హజం**

డబ్బును పట్టే హజం.

- నార్ల, సైపంట

**హిందువు**

ఎలా పోతుందండీ పిచ్చి నమ్మకం హిందువుగా పుట్టింతర్వాత?

- వేంకటరాయశాస్త్రి, వ్యామోహం

ఈ కపటనాటకు లుత్సవసమయముల యందు తమ వాకిట మద్దెళ్ళతోను తాళములతోను మహా ధ్వనితో భక్తులు దేవునిముందు హరినా మస్మరణ చేయుచున్నను పట్టపగ లావంక తొంగిచూడ నొల్లక బోగముదాని పాటగాని 'బోగము' దన్న మాటగాని చెవిన బడినతోడనే వీధులవెంట మేళముల ముందేగుటకు మహాభ క్తితో నర్ధరాత్రముల యందు సహితము బయులు వెడలుదురు. ఇట్టి వీరు హిందూ మతోద్ధారకులయిన నాయకు లఁట!

- కందుకూరి, విద్యాధికుల ధర్మములు

**హింస**

ప్రతిప్రాణీ తను వాంఛించిన దాన్ని హింసి స్తుంది.

- బుచ్చిబాబు, తిష్యరక్షిత

ఐశ్వర్యం కోసం హంస. ఒకడికంటే ఇంకొకడు ఎక్కువ డబ్బు సంపాదించాలంటే హింస తప్పదు.

- రామమోహనరావు, మోడల్

హింసతోనే సృష్టి పూస్తది
హింసతోనే మార్పు వస్తది.

- శ్రీశ్రీ, ఓ మహాత్మా! ఓ మహర్షీ!

హింస పిరికితనానికి చిహ్నం. పలాయనానికి మరొక రూపం.

- రంగాచార్య, మోదుగుపూలు

**హింసాహింసలు**

వీరుడై అహింస విలువ చెప్పిననాడె
జనము మెచ్చె దాని గుణము హెచ్చు
భీరమతి అహింసతీరు నపుంసక
బ్రహ్మచర్య వ్రతము భంగి లొచ్చు

- ముకురాల, నవ్వేకత్తులు

**హిస్టరీ మాస్టరు**

హిస్టరీ మాస్టరు కదండీ, ఎప్పుడూ పాత చరిత్ర స్మరిస్తూ ప్రస్తుతం గమనించడు కాబోలు.

- రామదాసు, ఆకాశరామన్న

**హీనత**

కథహీనమైనా నటహీనం కాకూడదు.

- శ్రీరమణ, న్యూనుడి

**హీనుడు**

తన బలము నెదిరి బలమును
గనుఁగొనక హితోపదేశకర్తల పలుకుల్
వినక కుజనుండు సాహస
మునఁజెడు బలుగాడ్పుఁదొడరు బూరుగులీలన్

- కంకంటి, ఉత్తరరామాయణము

**హృదయం**

కవిత్వాలు హృదయంఉన్నవాళ్ళకే
చదవటం మంచిది
గర్వానికి గుండె లేదు!

- కుందుర్తి, తెలంగాణ

ఒక్కొక్క జీవితానికి హృదయమే పునాది అయితే, మరొక్కొక్క జీవితానికి మేధస్సే ప్రధానం అయి వుంటుంది.

- సుబ్రహ్మణ్యశాస్త్రి, గులాబీ అత్తరు

ముండ్ల మధ్య గులాబులు పూస్తాయి. అంత గంభీరమైన వ్యక్తిత్వం వెనుక వెన్నపూసలాంటి హృదయముంది.

- కృష్ణారెడ్డి, తీయలేని కలుపు

ఖాళీగా ఉన్న హృదయాలన్నీ విశాలంగానే ఉంటాయేమో?

- కొడవటిగంటి, బెదిరిన మనుషులు

హృదయం ఒక సుడిగుండం- అస్పష్ట వేదనలు వెలిగ్రక్కే. విషభుజంగం- అజ్ఞాత శత్రువులు దాగిన కీకారణ్యం.

- రారా, అలసిన గుండెలు

మానవ హృదయం సామాన్యంగా- తనకన్న అన్ని విధాలా అధికంగా ఉండే వ్యక్తినే ప్రేమి స్తుంది.

- ధనికొండ, ప్రొఫెసర్ బింట్లెన్

జీవితాన్ని అనుభవించాలంటే జీవించి ఉండటం ఒక్కటే ముఖ్యం కాదు. ఈ శరీరాన్ని నడిపించే హృదయం పాడుకాకూడదు.

- రంగనాయకమ్మ, పేకమేడలు

పరమాణువుకన్న యెడద
నిజం సుమా బహుస్వల్పం!
బ్రహ్మాండంకన్న హృదయ
మనవరతం మహత్తరం.

- సోమసుందర్, క్షుభితపదయాత్ర

చచ్చినా చంపినా- దాని వెనుక గాయపడ్డ హృదయం తప్పక వుండి తీరుతుంది.

- రామలక్ష్మి, బ్రతకవలసిన మనిషి

## హెచ్చరిక

మరచిపోవద్దోయి! మరచిపోవద్దు!
మనజాతి యగచాట్లు మరచిపోవద్దు!

- త్రిపురనేని, మరచిపోవద్దోయి! మరచిపోవద్దు!

అభిరుచులు ఉండవచ్చు కాని, వాటికి తగిన ఆదరణ వచ్చే వరకు తొందరపడకూడదు.

- శ్యామలారాణి, జీవవాహిని

తాతతాతలనాటి కతలూ
తవ్వి పోస్తానోయ్!

- విశ్వనాథ, కోకిలమ్మ పెళ్లి

పిక్చర్ తీసిచూడు, ప్రింట్లు వేసిచూడు.

- శ్రీరమణ, న్యూనుడి

తనకలమే తన శత్రువు

- శ్రీరమణ, న్యూనుడి

గెలిస్తే గద్దె ఎక్కుతా - ఓడితే కోర్టుకెక్కుతా అన్నాట్ట -

- శ్రీరమణ, న్యూనుడి

దోచుకు బతికేవాడు ఊరేల్తూ ఉంటే ఏదీ ఎత్తుకు పోకూడదనే హెచ్చరికలన్నీ మిగతా వాళ్ళకే ఉంటాయి మరి.

- రావిశాస్త్రి, రత్తాలు - రాంబాబు

## హేయం

అతి పరిశుద్ధులు లజ్జా
న్వితులు మహోదారు లధికనిర్మలు లాత్మ
స్తుతి పరనిందలు దోషము
లతిహేయము లని తలంతు రాత్మల నెపుడున్.

- పోతన, భాగవతము

## హేళన

హేళన వేదన కలిగిస్తుంది.

- రావిశాస్త్రి, బంగారు బాబు

## హోటలు

చదువుకున్న వాళ్ళు హోటల్లోపడి మెయ్యకపోతే ఆధునిక సంస్కారం అబ్బదు.

- నంది, నైమిశారణ్యం

## హోదా

అధికారమూ, హోదా, రాజు సభకు ధరించే కిరీటమూ, బట్టలూ వంటివి. వాటిని ధరించిన మనిషి కొండముచ్చయినా కామధేనువులా కనిపిస్తాడు. వాటిని తీసీగానే, కామధేనువయినా కొండముచ్చులా కనిపిస్తాడు.

- వెంకటరమణారావు, కొలువు కథ

## హోంమంత్రి

హోంమంత్రి కాదల్చుకున్నవాడు పొట్టిగా బీడీలాగ వుంటే కుదర్దు... నాటుచుట్టలాగ బండగా, నల్లగా పొడవుగా, మీ సన్యాసిలా ఎనుబోతులాగ వుండాలి.

- పతంజలి, అప్పన్న సర్దార్

## హోరు

ఎడతెగని కడలి హోరు
వీడని చావు బ్రతుకు పోరు.

- బైరాగి, వీడుకోలు



# అనుబంధం

## సంకలనంలోని మరవరాని మాటల రచయితల పేర్లు

అజంతా (పెనుమర్తి విశ్వనాథశాస్త్రి)
అజ్ఞాద (ఆదిభట్ల) నారాయణదాసు
అజ్ఞాతకవి
అడిదము సూరకవి
అద్దేపల్లి రామమోహనరావు
అనంతం
అనంతుడు
అనిశెట్టి సుబ్బారావు
అప్పల్నాయుడు
అప్పారావు పట్నాయక్, మానాపురం
అఫ్సర్
అబ్బూరి రామకృష్ణరావు
అమ్మంగి వేణుగోపాల్
అరిపిరాల విశ్వం
అర్నాద్
అల్లంరాజు
అవసరాల సూర్యారావు
అశోక్
ఆచంట రంగారావు
ఆచార్య కె.వి.
ఆంజనేయశాస్త్రి, పి.ఎస్.ఆర్ః
ఆత్రేయ (కిళాంబి వేంకట నరసింహాచార్యులు)
ఆదివిష్ణు
ఆనందారామం
ఆమంచర్ల గోపాలరావు
ఆరుద్ర (భాగవతుల సదాశివశంకరశాస్త్రి)
ఆవుల శ్రీనివాసరావు
ఆశాలత, తోటకూర
ఆశీర్వాదం, యు.
ఆళ్వారుస్వామి, వట్టికోట (ధర్మరాజు)
ఇంజనీర్‌రావు
ఇనాక్, కొలకలూరి
ఇరివెంటి కృష్ణమూర్తి
ఇస్మాయిల్
ఉన్నవ లక్ష్మీనారాయణ
ఉమర్ ఆలీషా
ఉమామహేశ్వరరావు, శిష్ట్లా, (ఉమ, మహేశ్వర్, వినాయకపండితుడు, విజయమహేశ్వరం)
ఊటుకూరి రంగారావు
ఎక్స్‌రే (పుల్లుట్ల చలపతిరావు)
ఎమ్వీయల్ (మద్దాలి వేంకటలక్ష్మీ నరసింహారావు)
ఏటుకూరి వేంకట నరసయ్య
ఏల్చూరు సుబ్రహ్మణ్యం
ఓల్గా (లలితకుమారి)
కంకంటి పాపరాజు
కటికి కామన్న మంత్రి
కదిరీపతి, పాలవేకరి
కనకప్రవాసి (చామర్తి కనకయ్య)
కందుకూరి వీరేశలింగం
కప్పగంతుల మల్లికార్జునరావు
కరుణకుమార (కందుకూరి అనంతం)
కరుణశ్రీ (జంధ్యాల పాపయ్యశాస్త్రి)
కవనశర్మ (కె.వి.ఎస్.శర్మ)
కవిచౌడప్ప
కవిరాజమూర్తి
కళ్యాణ చక్రవర్తి
కాకుమాని మూర్తికవి
కాంతారావు, బలివాడ
కాటూరి వేంకటేశ్వరరావు
కాదంబరి
కామేశ్వరరావు, కె.వి.
కామేశ్వరి, డి.
కాశీవిశ్వనాథం, ఎన్.
కాళీపట్నం రామారావు (కారా)
కాళోజీ నారాయణరావు
కాళ్ళకూరి నారాయణరావు
కిషన్
కుక్కుటేశ్వరరావు, గాడేపల్లి
కుందుర్తి ఆంజనేయులు
కుమార ధూర్జటి
కురుమద్దాలి విజయలక్ష్మి
కూచి నరసింహము
కూర్మనాథకవి, గోగులపాటి

కృత్తివెంటి వేంకట సుబ్బారావు
కృష్ణంరాజు, పూసపాటి
కృష్ణరావు, జి.వి.
కృష్ణారెడ్డి
కె.ఎల్.నరసింహారావు (భవదీయుడు)
కేశవరెడ్డి
కొచ్చెర్లకోట రామచంద్ర వెంకట కృష్ణారావు
కొడవటిగంటి కుటుంబరావు
కొడాలి ఆంజనేయులు
కొడాలి సుబ్బారావు
కొండలరావు, రావి
కొనకళ్ళ వేంకటరత్నం
కొప్పరపు సుబ్బారావు
కోటయ్య, యడ్లపల్లి
కోదండరామారావు, నెల్లుట్ల
కోపల్లి వేంకటరావు
కోలాచలం శ్రీనివాసరావు
కౌసల్యాదేవి, అరెకపూడి (కోడూరి)
గంగాధరం, నూతలపాటి
గంగాధరరావు, కొర్రపాటి
గంగినేని వెంకటేశ్వరరావు
గంగిశెట్టి నరసింహారావు
గణపతిశాస్త్రి, పిలకా
గణేశ్ పాత్రో
గరిమెళ్ళ సత్యనారాయణ
గిరీశం
గునుపూడి సుబ్బారావు
గురజాడ వేంకట అప్పారావు
గువ్వల చెన్న
గోపరాజు, కొరవి
గోపాలచక్రవర్తి (నడిమింటి వేణుగోపాల శాస్త్రి)
గోపాలరావు, కాళ్ళకూరి
గోపి, ఎన్.
గోపీచంద్, త్రిపురనేని
గోవిందరాజు సీతాదేవి
గౌరన
గౌరీశంకర్, టి.
చండీదాస్
చంద్రమౌళి, చొప్పకట్ల
చంద్రసేన్
చలం (గుడిపాటి వేంకటచలం)
చలసాని ప్రసాదరావు
చల్లా సుబ్రహ్మణ్యం
చాసో (చాగంటి సోమయాజులు)
చిన తాతాచార్యులు, తిరుమలబుక్కపట్టణము
చినరామచంద్రరావు, దంతుర్తి
చిన్నబాబు, కె.
చిన్నయసూరి, పరవస్తు
చిరంజీవి, కె.
చిలకమర్తి వేంకట లక్ష్మీనరసింహము
చెరబండరాజు (బద్దం భాస్కరరెడ్డి)
చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి
చేమకూర వేంకటకవి
ఛాయారాజ్
జక్కన
జగదీశ్వర్, చిమనగుంట
జగన్నాథం, వజ్ఝుల
జగ్గకవి, కూచిమంచి
జంగయ్య, బోయ
జంగా
జమ్ములమడక
జయ
జయంతి
జయప్రద, పెళ్ళకూరు
జయరాం, సొదుం
జరుక్‌శాస్త్రి (జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి)
జానకీ జాని
జాషువా, గుఱ్ఱం
జ్వాలాముఖి (ఎ.వి.రాఘవాచారి)
తమ్మయ్య, సారంగు
తాపీధర్మారావు
తాళ్ళూరి నాగేశ్వరరావు
తిక్కన
తిమ్మకవి, కూచిమంచి
తిలక్ (దేవరకొండ బాలగంగాధర తిలక్)
తి.వేం.(తిరుపతి వేంకటకవులు)
తుమ్మల సీతారామమూర్తి చౌదరి
తులసి, చాగంటి
తేజోవతి
త్రిపురనేని రామస్వామి చౌదరి
దాశరథి కృష్ణమాచార్యులు
దాసు వామనరావు

దివ్యప్రభాకర్
దీక్షితులు చింతా (మారుతి)
దీపాల పిచ్చయ్యశాస్త్రి
దుగ్గన, దగ్గుపల్లి
దుర్గయ్య, పల్లా
దుర్భాక రాజశేఖర శతావధాని
దువ్వూరి రామిరెడ్డి
దూబగుంట నారాయణకవి
దేవీప్రియ
దేవులపల్లి కృష్ణశాస్త్రి
ధనికొండ హనుమంతరావు
ధర్మవరం రామకృష్ణమాచార్యులు
ధూర్జటి
నగ్నముని (మానేపల్లి హృషీకేశవరావు)
నండూరి సుబ్బారావు
నంది, ఎన్.ఆర్.
నన్నయ
నంబూరి తిరునారాయణస్వామి
నరసరాజు, డి.వి.
నరసింహం, వుప్పల
నరసింహశర్మ, గరిమెళ్ళ
నరసింహారెడ్డి
నవీన్ (మల్లయ్య)
నాగచంద్రావతి, వలివేటి
నాగరాజారావు, కాకుటూరు
నాగేంద్రరావు, పింగళి
నాచన సోమన
నాయని సుబ్బారావు (సౌభద్రుడు)
నారాయణకవి, గుండభట్టు
నారాయణబాబు, శ్రీరంగం
నారాయణరెడ్డి, సుంకిరెడ్డి
నారాయణాచార్యులు, పుట్టపర్తి
నార్ల వేంకటేశ్వరరావు
నిఖిలేశ్వర్ (యాదవరెడ్డి, కె.,నిఖిల్)
నిజం (శ్రీరామమూర్తి)
నిరుద్యోగి
నిర్మలప్రభావతి, పవని
పట్టాభిరామశాస్త్రి, రావిపాటి
పఠాభి (తిక్కవరపు పట్టాభిరామిరెడ్డి)
పడాల
పతంజలి, కె.ఎన్.వై.
పద్మనాభరెడ్డి, కుప్పిరెడ్డి
పద్మనాభాచార్య, కరమల
పరాశర
పరిగి రాధాకృష్ణ
పరిమళా సోమేశ్వర్
పవన్‌కుమార్, ఎస్.ఆర్.
పాండురంగారావు, వాకాటి
పానుగంటి లక్ష్మీనరసింహారావు
పాప (పాలగుమ్మి పద్మరాజు)
పార్థసారథి, నండూరి
పాలంకి వెంకటరామచంద్రమూర్తి
పాల్కురికి సోమన
పింగళి సూరన
పిచ్చయ్యశాస్త్రి, చల్లా
పిచ్చేశ్వరరావు, అట్లూరి
పినవీరారెడ్డి, బచ్చు
పినిశెట్టి శ్రీరామమూర్తి
పిల్లలమర్రి పినవీరభద్రుడు
పుండరీకాక్షుడు, దామరాజు
పురాణం (సీత, సుబ్రహ్మణ్యశర్మ)
పురిపండా అప్పలస్వామి
పురుషోత్తమకవి, కాసుల
పురుషోత్తమరావు, అయ్యదేవర
పులికంటి కృష్ణారెడ్డి
పుల్లకవి
పుల్లాభట్ల వెంకటేశ్వర్లు
పూర్ణానందం, పుచ్చా
పెద్దన, అల్లసాని
పెద్దన సోమయాజి, కాణాద
పెద్దిభొట్ల సుబ్బరామయ్య
పెద్దిరాజు, జంపన
పెమ్మయ సింగధీమణి
పేరయ్యశాస్త్రి, భారతుల
పేర్వారం జగన్నాథం
పైడిమర్రి వేంకటసుబ్బారావు
పైడిరాజు, అంట్యాకుల
పొట్లపల్లి సీతారామరావు
పోతన, బమ్మెర
పోతుకూచి సాంబశివరావు
ప్రయాగ కోదండరామశాస్త్రి
ప్రసాద్, పి.యస్.ఐ.

రామచంద్రమూర్తి, జీడిగుంట
రామచంద్రశాస్త్రి, మల్లాది
రామదాసు, బెల్లంకొండ
రామనరసయ్య, పీ.వి.
రామమూర్తి, కలువగుంట
రామమోహనరావు, సూర్యదేవర
రామరాజభూషణుడు
రామలక్ష్మి, కె.
రామలింగస్వామి, అనంతపంతుల
రాయప్రోలు సుబ్బారావు (సుభాషి)
రారా (రాచమల్లు రామచంద్రారెడ్డి)
రావిశాస్త్రి (రాచకొండ విశ్వనాథశాస్త్రి)
రెంటాల గోపాలకృష్ణ
రెంటాల సుబ్బారావు
లక్ష్మణకవి, ఏనుగు
లక్ష్మణరావు, వుప్పల
లక్ష్మి, 'మీరా'
లక్ష్మీనరసింహశాస్త్రి, ఇసుకపల్లి
లత (తెన్నేటి హేమలతాదేవి)
లలిత, జి.
లల్లాదేవి (బి.నరసింహాచారి)
లింగమూర్తి, సింగరాజు
లోచన్
వక్కలంక సీతారామరావు
వడ్డెర చండీదాస్ (సి.యస్.రావు)
వనమాలి
వనశ్రీ (వాసిరెడ్డి నారాయణరావు)
వరద (అబ్బూరి వరదరాజేశ్వరరావు)
వరదాచార్యులు, వానమామలై
వరవరరావు, పెండ్యాల
వల్లభరాయుడు, వినుకొండ
వసంతరావు రామకృష్ణారావు
వసీరా
వసుంధర
వసుబాబు
వసురాయకవి (వడ్డాది సుబ్బారాయుడు)
వామనరావు, బచ్చు
వాసిరెడ్డి భాస్కరరావు
వాసు
విజయకుమార్, టి.కె.
విజయలక్ష్మి, సి.
విద్వాన్ విశ్వం (రూపనకుడి విశ్వరూపశాస్త్రి)
విమలారామం (తటపర్తి విమల,
రామచంద్రరావు)
వి.వి.న. మూర్తి
వివేకానంద, ఎస్.
విశ్వనాథ సత్యనారాయణ
విశ్వనాథం, కాశీ
విశ్వం, కొంపెల్ల
విశ్వశ్రీ
విశ్వసుందరమ్మ, తల్లాప్రగడ
విశ్వేశ్వరరావు, మల్లవరపు (హ్రీంహ్రీం)
విష్ణుప్రియ, ఒ.
విష్ణుభట్ల సుబ్రహ్మణ్యేశ్వరకవి
విహారి – శాలివాహన
వీరనాగేశ్వరరావు, కర్ణ
వీరభద్రకవి
వీరేంద్రనాథ్, యండమూరి
వీర్రాజు, శీలా
వెంకటకృష్ణమూర్తి, మల్లాది
వెంకటకృష్ణారావు, అంగర
వెంకటనరసింహారావు, తాతినేని
వెంకటరంగారెడ్డి, ఎస్.
వెంకటరమణ, గంటి
వెంకటరమణారావు, మంథా
వెంకటసుబ్రహ్మణ్యం, బుర్రా
వెంకటేశ్వరరావు, పరుచూరి
వెంకటేశ్వర్లు
వెంకమరాజు, తురగా
వెంకటకవి, వంకాయలపాటి
వేంకటపార్వతీశ్వరకవులు (బాలాంత్రపు
వేంకటరావు, వోలేటి పార్వతీశం)
వేంకట రమణారావు, కోపల్లి
వేంకట రామశాస్త్రి
వేంకటరామకవి, పోలిపెద్ది
వేంకటరాయశాస్త్రి, వేదం
వేంకటరావు, కవికొండల
వేంకటలక్ష్మీనరసింహారావు, వింజమూరి
వేంకటశర్మ, మంగిపూడి
వేంకట సుబ్బారావు, కొడాలి
వేంకట నార్యుడు, కోట
వేటూరి ప్రభాకరశాస్త్రి

వేణుగోపాల్, చక్రవర్తి
వేణుగోపాలరావు, కొమ్మూరి
వేదాంతకవి
వేదుల సత్యనారాయణశాస్త్రి
వేమన
శంకరరాజు, ముంగర
శరభాచార్యులు, పులివర్తి
శశాంక, వోలేటి
శాయి, యర్రంశెట్టి
శివప్రసాద్, వి.
శివరామకృష్ణశాస్త్రి
శివరామశాస్త్రి, వేలూరి
శివసాగర్ (కె.జి.సత్యమూర్తి)
శివారెడ్డి, కె.
శేషగిరిరాయకవి, చామర్తి
శేషగిరిరావు, అల్లం
శేషేంద్రశర్మ, గుంటూరు
శ్యామలారాణి, ఎ.
శ్రీకాంతశర్మ, ఇంద్రగంటి
శ్రీకృష్ణదేవరాయలు
శ్రీనాథుడు
శ్రీనివాస్, త్రిపురనేని
శ్రీనివాసరావు, మాచర్ల
శ్రీనివాసాచార్య, తిరుమల
శ్రీపతిశాస్త్రి, శొంఠి
శ్రీరమణ
శ్రీరామచంద్రమూర్తి, గంటి
శ్రీరామమూర్తి, శ్రీపాద
శ్రీరాములు, దాసు
శ్రీశ్రీ (శ్రీరంగం శ్రీనివాసరావు)
శ్రీహరి, గుంటూరు
సంజీవదేవ్
సంజీవరావు
సత్యనారాయణమూర్తి, చక్కా
సదానంద, కలువకొలను
సదాశివం
సంధ్యాదేవి, ఆర్.
సన్యాసి, వనకాడ
సభా, కె. (కనక సభాపతిపిళ్ళై)
సముఖం వేంకటకృష్ణప్పనాయకుడు
సరళాదేవి, పి.
సరస్వతీదేవి, ఇల్లిందల
సామెత
సాంబశివరావు, కొడాలి
సావిత్రి, అదూరి
సింగన, మడికి
సినారె (సింగిరెడ్డి సత్యనారాయణరెడ్డి)
సి.ఎస్.రావు
సీతాదేవి, వాసిరెడ్డి
సీతారాం
సీతారామారావు, వడ్లమూడి
సుకాంచన
సుంకర సత్యనారాయణ
సుజాత, తిరువీథుల
సుదర్శన్
సుధాకర్
సుధాకరరెడ్డి, తిరుమూరు
సుందరరామయ్య, వైఖరి
సుప్రసన్న (కోవెల సుప్రసన్నాచార్యులు)
సుబ్బారావు పాణిగ్రాహి
సుబ్రహ్మణ్యశర్మ, సాధు
సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీపాద
సుభాష్‌చంద్ర
సుమతి, వి.
సుమనశ్రీ
సురవరం ప్రతాపరెడ్డ
సులోచన, మాదిరెడ్డి
సులోచనారాణి, యద్దనపూడి
సూరి, తెన్నేటి (విషనాగు, సీరపాణి)
సూర్యనారాయణ, వల్లూరి
సూర్యప్రకాశ్, ఎ.
సూర్యారావు, అంగర
సోమనాథకవి, రేకపల్లి
సోమరాజు, రంథి
సోమసుందర్, ఆవంత్స
సౌభాగ్య (విజయకుమార్)
స్వర్ణరాజ హనుమంతరావు
హనుమంతరావు, కాళ్ళకూరి
హనుమయ్య చౌదరి, జంగా
హర్షవర్ధన్, చందు
హితశ్రీ (ఎం.వి.ఎస్. ప్రసాదరావు)
హెచ్చార్కె (హనుమంతరెడ్డి, కె)